# కృతిపతి ఛాయా పటము



DR. V. S. KRISHNA, B.A. (Oxon), Ph.D. (Vienna)

# కృతికర్త చ్ఛాయా పటము



కళాప్రపూర్ణ పజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి

# అకారాది క్రమోదాహృత గ్రంథ సంకేతముల పట్టిక

| సంకేతములు. | గ్రంథ నామములు. | భాష. |
|---|---|---|
| అథర్వ. | అథర్వణకారికావళి. తెల్గు వ్యాకరణము. | సంస్కృత |
| అప్పక. | అప్పకవీయము. తెల్గు లక్షణ గ్రంథము. | తెలుఁగు |
| అహో. | అహోబలపండితీయము. తెల్గు వ్యాకరణ కవిశి. | సంస్కృత |
| ఆం. భా. అ. | ఆంధ్రభాషానుశాసనము, తెలుఁగు వ్యాకరణము. | తెలుఁగు |
| ఆం. చిం. | ఆంధ్రశబ్దచింతామణి. తెలుఁగు వ్యాకరణము. | సంస్కృత |
| ఆం. భా. చ. | ఆంధ్రభాషా చరిత్రము. భాషాతత్త్వ శాస్త్రము. | తెలుఁగు |
| ఆం. భా. వి. | ఆంధ్రభాషా వికాసము. భాషాశాస్త్రము. | తెలుఁగు |
| ఋగ్వే. ప్రా. | ఋగ్వేద ప్రాతిశాఖ్యము. వేదవ్యాకరణము. | సంస్కృత |
| కన్న. | కన్నడ భాష. | — |
| కర్ణా. | కర్ణాటభాష. | — |
| కర్ణా. భూ. | కర్ణాటభాషా భూషణము. కర్ణాటక వ్యాకరణము. | సంస్కృత |
| కర్ణా. శబ్దా. | కర్ణాటక శబ్దానుశాసనము. కర్ణాట వ్యాకరణము. | సంస్కృత |
| కవికల్ప. | కవికల్పద్రుమము. సంస్కృత ధాతుపాఠము. | సంస్కృత |
| కవిశి. | కవిశిరోభూషణము అహోబల పండితీయము. తెల్గు వ్యాకరణము. | సంస్కృత |
| కాల్డు. | కాల్డ్వెల్లుగారి కంపేరిటివ్ ద్రావిడ వ్యాకరణము. | ఇంగ్లీషు |
| కావ్యాద. | కావ్యాదర్శము. ఆచార్యదండి. అలంకార శాస్త్రము. | సంస్కృత |
| కావ్యాలం. | కావ్యాలంకార చూడామణి తెలుఁగు లక్షణ గ్రంథము. | తెలుఁగు |
| కేర. పీఠి. | కేరళపాణినీయ పీఠిక. మలయాళ వ్యాకరణ విషయము. | సంస్కృత |
| చండ. | చండ ప్రాకృత లక్షణము. ప్రాకృత వ్యాకరణము. | సంస్కృత |
| చిం. వి. పరి. | చింతామణి విషయ పరిశోధనము. వ్యాకరణ విమర్శ గ్రంథము. | తెలుఁగు |
| తమిళ. | తమిళభాష. | — |
| తెల్గు. | తెలుఁగుభాష. | — |
| తైత్తి. ప్రా. | తైత్తిరీయ ప్రాతిశాఖ్యము. వేదవ్యాకరణము. | సంస్కృత |
| తొల్కా. | తొల్కాప్పియము. తమిళ వ్యాకరణము. | తమిళ |
| త్రివిక్ర. | త్రివిక్రమ శబ్దానుశాసనము. ప్రాకృత వ్యాకరణము. | సంస్కృత |
| త్రిలింగ. | త్రిలింగ లక్షణశేషము. తెలుఁగు వ్యాకరణము. | తెలుఁగు . |
| దుర్గా. | దుర్గాదాస కృతసుబోధాఖ్య ముగ్ధబోధవ్యాఖ్య. సంస్కృత వ్యాకరణము. | సంస్కృత |
| నన్నూ. | నన్నూలు. తమిళ వ్యాకరణము. | తమిళ |
| పాణి. శి. | పాణినిశిక్ష. వేదవ్యాకరణము. | సంస్కృత |

| సంకేతములు. | గ్రంథ నామములు. | భాష. |
|---|---|---|
| ప్రా. ప్రకా. | ప్రాకృత ప్రకాశము. ప్రాకృత వ్యాకరణము. | సంస్కృత |
| ప్రౌఢ. | ప్రౌఢ వ్యాకరణము. త్రిలింగ లక్షణశేషమను తెల్గు వ్యాకరణము. | తెలుఁగు |
| బాలవ్యా. | బాలవ్యాకరణము. తెలుఁగు వ్యాకరణము. | తెలుఁగు |
| బాలమ. | బాల మనోరమ. సిద్ధాంత కౌముదీ వ్యాఖ్య. సంస్కృత వ్యాకరణము. | సంస్కృత |
| భాషామం. | భాషామంజరీ వృత్తి. కర్ణాట వ్యాకరణము | సంస్కృత |
| మంజరీ. మక. | మంజరీ మకరంద వ్యాఖ్య. కర్ణాటక శబ్దానుశాసన వ్యాఖ్య. కర్ణాట వ్యాకరణము. | సంస్కృత |
| ముగ్ధ. | ముగ్ధబోధ వ్యాకరణము. సంస్కృత వ్యాకరణము. | సంస్కృత |
| లీలా. | లీలాతిలకము. మలయాళ వ్యాకరణము. | సంస్కృత |
| వికృ. | వికృతి వివేకము. అథర్వణకారికావళి. తెల్గు వ్యాకరణము | సంస్కృత |
| వే.ణీ. | వేణీ సంహారము. నాటకము. | సంస్కృత |
| వే. పంచ. | వేదాంత పంచదశి. అద్వైత వేదాంత గ్రంథము. | సంస్కృత |
| వై. పా. | ఆంధ్ర వైయాకరణ పారిజాతము. తెల్గు వ్యాకరణము. | తెలుఁగు |
| వ్యా. సం. | ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము. తెలుఁగు వ్యాకరణము. | తెలుఁగు |
| శబ్దమ. | శబ్దమణి దర్పణము. కర్ణాట వ్యాకరణము. | కర్ణాట |
| శ. ర. | శబ్దరత్నాకరము. తెల్గు నిఘంటువు. | తెలుఁగు |
| శబ్దస్తో. | శబ్దస్తోమమహానిధి. సంస్కృత నిఘంటువు. | సంస్కృత |
| శబ్దాద. | శబ్దాదర్శము. హాసగన్నడ వ్యాకరణము. | హాసగన్నడ |
| శబ్దా. చిం. | శబ్దార్థ చింతామణి. సంస్కృత నిఘంటువు. | సంస్కృత |
| శాసన పద్య | శాసన పద్యమంజరి. ఆంధ్ర ప్రాచీన శాసనములు. | తెలుఁగు |
| షడ్భా. | షడ్భాషాచంద్రిక. ప్రాకృత వ్యాకరణము. | సంస్కృత |
| సంధి గ్రం. | సంధి గ్రంథము. తెల్గు వ్యాకరణము. భాషాశాస్త్రము. | తెలుఁగు |
| సి. కౌ. | సిద్ధాంత కౌముది. సంస్కృత వ్యాకరణము. | సంస్కృత |
| సూ. రా. ని. | శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. తెల్గు నిఘంటువు. | తెలుఁగు |
| స్టడీ. ద్రవి | స్టడీస్-ఇన్-ద్రవిడియన్ ఫిలాలజీ. ద్రావిడ భాషా ప్రసంగములు. భాషా శాస్త్రము. | ఇంగ్లీషు |
| హిం. స్వ. | హిందీ స్వబోధిని. హిందీ వ్యాకరణము. | తెలుఁగు |

# వి ష య సూ చి క

## (రెండవ సంపుటము)

## IV సంఖ్యావాచక ప్రకరణము

## క్రియా ప్రకరణము

విషయ సంఖ్య | పుట.

విషయ సంఖ్య. పుట.

విషయ సంఖ్య. పుట

విషయ సంఖ్య. | పుట.

విషయ సంఖ్య పుట

vatives) క్రియార్థ స్ఫూర్తిని గోల్పోవు. ఉదా:—నడక్కుదల్ = నడక్కై = (నడచుట). చెయ్గై = చేయుట. అగుదల్ = అగల్ = ఆదల్ = (అగుట) కుఱైదల్ = (తగ్గుట) కుఱైత్తల్ = (తగ్గించుట). ఈ దకారము భూతార్థకముకాదు. వీనికి సరియగు ప్రత్యయములు తెల్గున 'ట - డమ్ - ఉ' అనునవి. మంగోలియను భాష - చిదహు = (సమర్థుఁడగుట); దీనినుండి 'చిదల్' = (సామర్థ్యము) అనునది యేర్పడును. విమర్శము:—అప్రసిద్ధమగు 'అ' ప్రత్యయమె భావార్థక మని దొరగారు వివరించుటచేత సుప్రసిద్ధ భావార్థకములగు 'దల్ - అల్ - ట - డము' మున్నగు వానిని భావార్థికములనక క్రియార్థ స్ఫూర్తిగల కృదంతములనుచు నప్రసిద్ధ సంజ్ఞాకల్పనము చేసికొన వలసెను. 'దల్' ప్రాచీనము కాదు. 'తల్' అను పరుషాదిస్థితి ప్రాచీనము. ఈవఱకు విమర్శితములగు కొన్ని దొరగారి సిద్ధాంతములు ... ... ... 973

౧౩౯ I. ధాతుజ విశేష్యములు:—(Verbal derivative nouns). ఇట్టి వేర్ప డుటలోని పద్ధతులు కొన్ని యిటఁ జూపఁబడును. I. ధాతురూపమె ప్రాతిపదికమగుట. ఉదా:—తమి - ధా - కట్టు = (ముడివేయు). ప్రాతి - కట్టు = (ముడి). II ధాతువు తుది సరళము పరుషమై ద్విత్వము నందుట. తమి - ధా - పాడు ప్రాతి-పాట్టు = (పాట). తెల్గున - 'పాట' అనియే యేర్పడును. III. ఏకాచ్క ధాతు స్వరము దీర్ఘమగుట. ఉదా - తమి - ధా - మిన్ = (ప్రకాశించు) ప్రాతి - మీన్ = నక్షత్రము. IV. క్రియాంగమునకు 'మై' ప్రత్య యము చేరుట. ఉదా:—తమి - ధా - పొఱు = (ఓర్చు - మోయు). ప్రాతి - పొఱుమై = (ఓర్పు). ఈ మై ప్రత్యయము తద్ధితమును గలదు. ఉదా:—పెరుమై = (పెద్దతనము). V. 'అమ్' ప్రత్యయము ధాతువునకుఁ జేర్చుటచేత నామమేర్పడును. అట్టియెడలఁ దుది సరళ మునకు ద్విత్వపారుష్యములు గల్గును. ఉదా:—తూఙ్గ్ = తూగ్ = తూక్ = తూక్కమ్ = (నిద్ర). (తూఙ్గు = నిద్రించు) VI. క్రియాంగ ములపైని 'గ - ద - బ' అనువానిని వేర్వేఱు స్వరములతో వేర్వేఱు పరిణామములతోఁ జేర్చుట. ఉదా:—I. గకార పరిణామములు:— చెయ్గై = (కృతము). కాఙ్గై = (వేఁడిమి). పడుక్కై = (పడుక). తెల్గు - ఏలిక. ఉనికి. కన్న - కె - గె - మె. II. దకార పరిణ తులు:—తమి - కెడు = (చెడఁగొట్టు). ప్రా - కెడుది = (నాశనము). తమి - ఉణర్ = (పొందు) ప్రా - ఉణర్తి = (అనుభవము). తమి - ధా - పుగల్ = (పొగడు). పుగర్చి = (పొగడ్త). మల - పుగర్చ్చి. కన్న - హొగళ్ = పొగడు. ప్రా - హొగళ్తె. కన్న - కాయ్ = (పండు). ప్రా - కాయ్ + త = (కాపు). తెల్గు - ధా. అలయు - ప్రా - అలసత. తె - ధా తిను. ప్రా - తిణ్డి. తె - ధా. నడుచు - ప్రా-నడితి = (నడత). III. బకార పరిణతులు:—తమి-ధా. కేళ్ = (విను) ప్రా - కేళ్వి = (వినికి). తమి - ధా. మఱై = (దాచు) మఱైవు = (దాపఱికము). తమి - వే + య్ = (నీడగా నుండు).

## VII. ప్రకరణము శబ్ద సామ్యము

(Glossarial affinities)

రెండవ వాల్యుము విషయసూచి సమాప్తము.

## రెండవ వాల్యములోని ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 569 | 11 | మున్ | మున్ |
| | పట్టిక క్రింద | | |
| 579 | 3 | యున్నది. | యున్నది. ('లేదు'. సంబరాహా యణమున నున్నది. శ్రీ రెడ్డిగారు) |
| 629 | 31 | ఎన్! (రెండవది) | (దీనిని తీసివేయవలెను) |
| 653 | 5 | లేనేలేదు. అర్వాచీనము | (లేనేలేదు అర్వాచీనము) |
| | పట్టిక క్రింద | | |
| 668 | 4 | లాటిన్ | లాటిన్ |
| 682 | 21 | 'కశు' (కచ?) | 'కశు' (శ=చ?) |
| 726 | 24 | తిమిబ గ్రాంథిక భాషలోఁ గలవు. | 'తమిబ గ్రాంథిక భాషలోఁ గలవు' |
| 729 | 19 | నూ-రాని | నూ-రా-ని |
| 815 | 14 | (తిన్నవలేమి) | (తిన్నవ్వలేము) |
| ,, | 28 | (మామాబుగా నుండువాఁడు-శత్రువు) | (మాబుగానుండువాఁడు-శత్రువు) |
| 859 | 1 | వారి యశాస్త్రీయ | వారి యశాస్త్రీయ |
| 872 | 1 | కొట్యాడు | కొట్ట్యాఁడు |
| 925 | 17 | యర్వాచీనము). తమిబ | యర్వాచీనము) తమిబ |
| 1001 | 10 | క్రియాజన్యా మహాద్వి | క్రియాజ న్యామహాద్వి |
| 1004 | 16 | రూపము. | రూపము" |
| 1017 | 29 | కోశముల పరిశీలన | కోశము లపరిశీలన |
| 1020 | 28 | పటణ | పట్టణ |

# ద్రావిడ భాషా పరిశీలనము

## IV ప్రకరణము — సంఖ్యా వాచకములు

౯౩. I విష:—"పూరణార్థ కేతర సంఖ్యావాచకములు-విశేషణములు విశేష్యములు నని రెండు విధముల రూపములతో వెలయుచున్నవి. ఉదా:— విశేషణ-తమి-కన్న-ఇరు-ఒరు-ఒర్. తెల్గు-ఇరు-ఒక. విశేష్య:—తమి-ఒన్ఱు. ఇరణ్డు. కన్న-ఒందు-ఎరడు. తెల్గు-ఒకటి, రెండు. ఈ విశేష్యము లమహదర్థక సంఖ్యావాచకములు. ఒకటవ-రెండవ (తెల్గు) మున్నగునవియు, 'ఒందనెయ-ఎరడనెయ' (కన్న) మొదలగునవియుఁ బూరణార్థకములు. ఇవి సంఖ్యావాచక విశేష్యములనుండి యేర్పడినవి. అట్టి విశేష్యములకు మూల రూపములు సంఖ్యావాచక విశేషణ రూపములు.

సంఖ్యావాచక విశేష్యము విశేషణముగా సయితము వాడఁబడుట ద్రావిడ భాషా సంప్రదాయము. తమి-"ఇరు పెయర్=ఇరువర్ పెయర్ (ఇరుగురు మనుష్యులు)". అనుచో వ్యావహారిక తమిళమున 'ఇరణ్డుపెయఁర్ (పేర్?)'=(రెండు మనుష్యులు) అనియు వాడుదురు. (ఇరువర్ మానిదర్. గ్రాంథి?) అఱవమునందలి 'ఒన్ఱు' అనునదియుఁ దెల్గులోని 'ఒకటి' అనునదియు విశేషణములుగా వాడఁబడవు. కన్నడమున 'ఒందు'=(ఒకటి) అనునది విశేషణ ముగా సైతము వాడఁబడును. ఉదా:—కన్న-ఒందుకై=(ఒకచేయి). వ్యావ హారిక తమిళమున 'నాల్ ఎరుదు=నాఙ్గు ఎరుదు'=(నాల్గు ఎద్దులు) అనుటకు మాఱుగా 'ఎరుదు నాఙ్గు' అని వాడుటయుఁ గలదు. దీనికి 'ఎద్దులయొక్క నాల్గు' అని శబ్ద సిద్ధమగు నర్థము. ఈ యుదాహరణమె ద్రావిడ సంఖ్యావాచకము లమహద్విశేష్యములగు ననుటకు నిదర్శనమగుచున్నది" (కాల్డు. ౩౨౧ పుట).

"సంఖ్యావాచకములలో విశేషణ రూపములె ప్రాచీనతర మూల రూపము లనఁదగును. వాని కమహత్ప్రత్యయములను జేర్చుటచేతఁగాని, వానిలోని హ్రస్వాచ్చును దీర్ఘము చేయుటచేతఁగాని సంఖ్యావాచక విశేష్య రూపము లేర్పడును. 'పదినొన్ఱు. ఇరుపంతు' మున్నగు సంఖ్యావాచక సమాస పదములలో వాని విశేషణముల శుద్ధరూపములు నిల్చియున్నవి గాన వానిని బట్టి సంఖ్యావాచకముల మూల రూపముల నూహింపవచ్చును.

తమి-ఇరువర్=(ఇరువురు) మున్నగునవి 'ఇరణ్డు' మున్నగు విశేష్యముల నుండి నిష్పన్నములు కాలేదు. ఇంక నవి 'ఇరు' మున్నగు విశేషణ రూపము లకు మహదర్థకమగు 'అర్' ప్రత్యయపు యోగమున నిష్పన్నములయినవి;

ఉదా:—తమి-ఇరువర్ =(ఇరుగురు=ఇద్దఱు) మూవర్ =(మూవురు=ముగ్గురు). (వ్యావహారిక భాషలో 'ఇరువర్ - మూవర్' అనరు 'రెండుపేర్ -మూఁడుపేర్' అందురు') ఇట్లె 'ఒరువన్ =(ఒకఁడు) ఒరుత్తి=(ఒకతె)'. వ్యావహారిక భాషలో నిట్లు మొదటి మూఁడు సంఖ్యావాచకముల రూపములు మాత్రమె యున్నను గ్రాంథిక భాషలో నన్నిటికిని నిట్టి రూపములు గలవు" (కాల్డు. ౩౨౨ పుట).

విమర్శనము:— తెల్గులోని 'ఒకటి' అనునది యర్వాచీన రూపము. నన్నయ దీని నిట్లు ప్రథమాంతముగా వాడలేదు. ఇంక నంతకుముం దీరూపము లేదని వేఱ చెప్పనేల? ఒకఁడు మున్నగు రీతినే నన్నయ మహ దమహత్తులు రెంటను వాడెను. తిక్కనాదు లీ విశేష్య ప్రథమా రూపమును వాడిరి. చ. అంబుజ నాభునిఁ బ్రీతుఁజేయు కం। బైను హితమైన కృత్య మొకటింగలదే...(ఉద్యో. ౩ ఆ. ౧౫౪ ప). విశేష్యములను విశేషణములుగా వివక్షించి ప్రయోగించు సంప్రదాయము నామవాచకము లందువలెనె (చూడు ౯౧ II విష.) సంఖ్యా వాచకములందును గలదు. తమి-'ఎరుదు నాఌ్గు' అను దానికి దొరగారు చెప్పినట్లు 'ఎద్దులయొక్క నాలుగు' అని యర్థము చేయరాదు, ఈ వాక్యము నందును వ్యావహారిక తమిఌ రూపమగు 'నాఌ్గు' అనునది విశేషణముగా వివక్షింపఁబడిన విశేష్య రూపమె యనుటలో విరోధములేదు. విధేయ విశేషణములట్లె సమాపక క్రియాస్థానమున నిల్చుటె సంప్రదాయము. కావున 'ఎద్దులు నాల్గు' అని పై వాక్యమున కర్థము చేయవలెను. అమహద్విషయ మున నేకవచన రూపమునకె బహుత్వార్థమును జెప్పుట ద్రావిడ భాషా సంప్ర దాయము. 'ఒక్కొరుఁడు-ఒక్కరుఁడు-ఒక్కొరువుఁడు-ఒకొరువుఁడు' మున్నగు వాని నరసినపుడు తెలుఁగు నందును 'ఒరు' అను ద్రావిడ రూపము 'ఒక్క-ఒక' మున్నగు నర్వాచీన శబ్దములతో మేళితమై వాడుక కెక్కెనని తోచకమానదు. అందలి 'ఒక్క' శబ్దము కేవలార్థకము కానోపును. 'ఒక్క-ఒక' శబ్దములు "సంస్కృ-'ఏక'-ప్రాకృత-'ఎక్క'" శబ్దములనుండి యేర్పడియుండును. 'ఒక్కొ రుఁడు' మున్నగు వానిలోని 'రు' వర్ణము లోపింపఁగా 'ఒక్కొఁడు' మున్నగు రూపము లేర్పడె ననఁ దగును. "దైవగేఽఖౌ (౧-౪-౯-౨)=దైవాది ష్వనాదే ర్యథాదర్శనం వ్యంజనస్య ద్విత్వం వా స్యాత్......దైవాదిః:—దైవ వ్యాహృత వ్యాకులనీడ నిహిత మాత్రుక కుతూహల స్థూల ఏక తూష్ణీక మూక సేవాస్మదీయ హుత స్త్యాన స్థాణు ఇత్యాది" (షడ్భా. ౩౪ పు.) 'ఏకో ఎక్కో' (షడ్భా. ౨౨ పు).

సీ. వాతాపి యను దైత్య వరు మ్రింగి యఱిగించుకొనఁడె భూదేవుఁ డొక్కొరుఁడు గినిసి (భార. ఆర. ౫ ఆ. ౨౦).

గీ. తరుణి యేపురకంబె నొక్కరుఁడు భర్త। యగుట లగ్గు......
(భార. సభా. ౨ ఆ. ౨౪౬ ప).

క. ఇక్ష్వాకు వంశంబున నీ । వొక్కొఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం । బొక్కటి సేకొని......(భార. ఆది. ౪ ఆ. ౨౨౧ ప).

క. పాండవులవలని కీడ్లో । క్కొండును లేదధిప నీదు కొడుకులు (భార. స్త్రీ. ౧ ఆ. ౮౩ ప).

క. ఇటఁ బాండవ కౌరవు లొ । క్కొట నందఱు గురు ననుజ్ఞఁ గొని మృగయాలం । పటులై.....(భార. ఆది. ౫ ఆ. ౨౩౩ ప). నన్నయ 'ఒకటి' అని ప్రథమాంతముగఁ బ్రయోగింపఁడు, 'ఒక్కఁడు-ఒక్కొఁడు' అనియే మహా దమహత్తులు రెంటను బ్రయోగించును. 'ఒక్కొఁడు' అనుదాని యాప విభక్తికపు సప్తమి 'ఒక్కొటన్' అని యేర్పడును.

౯3. II విష:—"ఏకత్వార్థక ద్రావిడ విశేష్య, విశేషణ రూపముల పట్టిక.

విశేష్యరూపములు

| తెల్గు | తమిళు | తుళు | కన్నడ | కొడగు | కుఇ | బెహిస్తను | తోద | గోండి | కోత | ఒరాఒన్ | రాజ మహాల్ | బ్రహుయి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఒండు<br>ఒకటి | ఒన్రు. ఒన్రు (ద్ర) ఒన్రు. (డ్ర) 'ఒణ్ణు' గ్రామ్యాఅవము. ఒన్రొన్రు.? ఒరుత్తన్ = (ఒకఁడు) ఒరుత్తి = (ఒకతె). | ఒన్ను (న్ను?) | ఒన్దు ఒందు | ఒందు | | | ఒన్జి | ఊండీ | ఒడ్ | ఊౕన్టా | ఒర్త్ | అసిత్. (ఇందలి సకారము రాజమహాలులో రేఫమగును. ఓర్త్. బ్రహుయి. ముసిల్ = కన్న. మూరు (మూఱు?) |

విశేషణరూపములు

| తెల్గు | తమిళు | తుళు | కన్నడ | కొడగు | కుఇ | బెహిస్తను | తోద | గోండి | కోత | ఒరాఒన్ | రాజ మహాల్ | బ్రహుయి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఒక<br>ఒక్క | ఒర్ = ఓర్ = ఒరు. ఒరువన్ (మహద్వాచి) ఒరువళ్ (?) (మహతీ వాచి) | (ఒరి?) | ఒర్బన్ = ఒబ్బను (మహత్తు) ఒబ్బళ్ = ఒర్బళ్ (మహతి) | | ర | ర = ర్ర | ఒర్ | | | | | |

గ్రాంథికావవమున ‘ఓర్’ అనియు వ్యావహారికావవమున ‘ఒరు’ అనియు వాడఁబడును. ‘ఒరు’ అనుదానిలోని తుది ‘ఉ’ కారము లోపించుటచేత నాద్యచ్చు దీర్ఘమైనది. విశేష్య విశేషణరూపములలో విశేషణ రూపమె ప్రాచీనతరము. అదియె మూలరూపము” (కాల్డు. 3౨౨ పుట).

విమర్శము:—తొల్కాప్పియమున ‘ఒరు - ఒర్ - ఓర్’ అను మూఁడు రూపములును గన్పట్టుచున్నవి. కాన ‘ఒరు-ఒర్’ అనునవి వ్యావహారిక మాత్రములని దొరగారు వచించుట సరికాదు.

“ముదల్ నిలై......” (తొల్కా. ౪౭౯ సూ.) = హలంత శబ్దములు పరమగునపుడు ‘ఒన్ఱు’ శబ్దముచోట ‘ఒరు’ శబ్దము నిల్చును. ఉదా:—ఒన్ఱు+ కల్ = ఒరుకల్ = (ఒక ఱాయి). ఒన్ఱు = మణి = ఒరుమణి = (ఒక కాంస్య ఘంట. దీనికిఁ గాలవాచిత్వము గౌణము). ఈ సూత్రమునందలి ‘ఒన్ఱు’ శబ్దము ‘ఇరణ్డు’ మున్నగువానికిని నుపలక్షణము. అనఁగా హల్ పరకత్వమున ‘ఇరణ్డు’ ప్రభృతులకు ‘ఇరు’ మున్నగునవియును బాక్షికముగా నాదేశము లగునని వ్యాఖ్య చేయనగును. ఉదా:—తమి-ఇరణ్డుకల్ = ఇరుకల్ = (రెండు ఱాళ్ళు). ......ఇళై-మూన్ఱుకల్ = ముక్కల్ = (మూఁడు ఱాళ్ళు).

“అదనిలై ఉయిర్క్కుమ్......” (తొల్కా. ౪౮౦ సూ.) = ఒన్ఱు శబ్దమున కజాదిశబ్దము, యకారాది శబ్దమును బరములగునపుడు ‘ఓర్’ అను రూపము నిల్చును. ఒన్ఱు + అలై = ఓరలై = (ఒక తరంగము.) ఒన్ఱు + యాళ్ = ఓర్ యాళ్ = (ఒక వీణ).

“ఆయిరక్కి-శవి......” (తొల్కా. ౪౬౫ సూ.) = ‘ఒన్ఱు-ఇరణ్డు’ అను శబ్దములకు ‘ఆయిరమ్’ శబ్దము పరమగునపుడు ‘ఒరు-ఇరు’ అను వాని ‘ఉ’ కారము లోపించును. ఉదా:—ఒన్ఱు + ఆయిరమ్ = ఒరు + ఆయిరమ్ = ఒరాయిరమ్ = (ఒక సహస్రము). ఇరణ్డు + ఆయిరమ్ = ఇరాయిరమ్ = ఇరు + ఆయిరమ్ = (రెండు వేలు).

“ముదల్ నిలై......” (తొల్కా. ౪౬౬ సూ.) ‘ఒర్-ఇర్’ శబ్దముల హ్రస్వము, పై స్థలములందు దీర్ఘమైనను గావచ్చును. ఉదా:—ఓరాయిరమ్ = (ఒక వేయి). ఈరాయిరమ్ = (రెండు వేలు).

పయిరీతినున్న తొల్కాప్పియ ప్రక్రియను బరిశీలించునపుడు ‘ఒన్ఱు-ఇరణ్డు-మూన్ఱు’ మున్నగునవియు విశేషణములె యైయున్నవని తోఁచక మానదు. ఎల్లయెడలను నిళై ‘ఒన్ఱు’ మున్నగువాని నుండియె ‘ఒరు’ మున్నగు విశేషణ రూపములు తొల్కాప్పియమున సాధింపఁబడెను. కాని ‘ఒన్ఱుకల్’ = (ఒక ఱాయి)-‘ఇరణ్డాయిరమ్ = (రెండు వేలు)’ అనురీతిగల రూపములు వ్యాఖ్యాతృ

సాధితములగుట నవి తొల్కాప్పియ సమ్మతము లనుటకుఁ దగిన యాధారము లగపడవు. ఇంకఁ బయిరీతిగల ప్రక్రియయె యాధార మనుకొనవలసి యున్నది. మఱియు విశేష్యములు విశేషణములుగా వివక్షింపఁబడు సంప్రదాయము సర్వ సమ్మతమె కాన 'ఒన్రుకల్' మున్నగుచోటులందలి 'ఒన్రు' ప్రభృతులు విశేష్యములె యయ్యు విశేషణములుగా వివక్షితము లయ్యె ననుటలో విప్రతిపత్తి లేదు గదా.

"ముదల్నిలై......" అనెడి మీఁద నుదాహరింపఁబడిన ౪౭౯ తొల్కాప్పియ సూత్రపు వివృతి యీ సందర్భమునఁ బరిశీలింపఁదగినది.

కర్ణాటశబ్దానుశాసనమునందును నిట్లె-"ఒందు=ఒరు; ఎరడు=ఇరు; మూఱు=మూ; ఆఱు = అఱు" మున్నగునవి పర్యాయ రూపములనియె సూత్రింపఁబడెను.

'ఒరొందోః' (కర్ణాట శబ్దా. ౩౫౪ సూ.) వ్యఞ్జన ఇతి నివృత్తమ్. 'ఒందు' ఇత్యస్య 'ఒరు' ఇత్యాదేశో భవతి. సచ శిద్వ ద్భవతి. ఉత్తరపదే పరే. న ద్వన్ద్వ సమాసే. మెవరితు నిత్యమ్. (ఇట్లొకట నిత్యమనుటచేతఁ దక్కిన యెడల నీ విధి పాక్షికమని విశదమగుచున్నది.) ప్రయోగః:—ఒర్తలె=ఒందు తలె=(ఒక తల). ఇట్లె మూఱుప్రభృతులకును సూత్రములు గలవు.

'ఎరడో రిర్' (కర్ణాట శబ్దా. ౩౫౯ సూ.)=ఎరడు ఇత్యస్య 'ఇర్' ఇత్యాదేశో భవతి, సచ శిద్వ ద్భవతి, ఉత్తరపదే పరే. న ద్వన్ద్వ సమాసే. మె వరితు నిత్యమ్. ప్రయోగః:—ఇర్తలె=ఎరట్తలె=(రెండు తలలు).

"'ఆఱోః' (కార్ణాట శబ్దా. ౩౫౫ సూ.)=ఆఱు ఇత్యస్య హ్రస్వాదేశో భవతి. వ్యఞ్జనాదా ఉత్తరపదే పరే న ద్వన్ద్వ సమాసే మెవరితు నిత్యమ్...... ప్రయోగః:—అఱుగావుదం=ఆఱుగావుదం=(ఆఱు క్రోసులు). 'ఆం. భా. వి.' కర్తగారు 'ఒకటి' విశేషణ రూపము నయితము కావచ్చునని యీ క్రింది రీతిని వ్రాసిరి 'ఒక్కటి ఒక్క-ఒక' అనునవి విశేషణ మాత్రములు. ఒక్కటియను నది యమహాత్తులలో విశేష్యముగాను విశేషణముగానుగూడ వాడనగును. ఒక్క నూటిని. ఒక కేలఁ బట్టె. 'ఒకటి-ఒక్కంటి-ఒకంటి' అనునవి యమహాద్విశేషణములు-అదొక్కటి-ఒకటి రెండు పూటలు......" (ఆం. భా. వి. ౪౪౭ పుట). ఇట విశేష్యములు విశేషణములుగా వివక్షితములై వాడఁబడె ననుట లెస్స. "తమిళమందలి 'ఒన్రు' అనునదియుఁ దెలుఁగులోని 'ఒకటి' అను నదియు విశేషణములుగా వాడఁబడవు" (కాల్డు. ౩౨౧ పుట. చూడు. ౯౩ I విష). అను డా. కాల్డువెల్లుగారి వ్రాఁత చొప్పున 'ఒకటి-ఒన్రు' అనునవి

విశేష్యములె యనియు విశేషణములనుగా వివక్షించి వాడవచ్చుననియుఁ జెప్పుటయె యుక్తము.

డా. కాల్డువెల్లుగారు వ్రాసినట్లు విశేషణముల పయిని దచ్ఛబ్ద సంబంధి లింగ బోధక ప్రత్యయము నిల్చుటచేత నవి విశేష్యములవంటివై విభక్త్యుల నెనయును. చిన్నవాఁడు-చిన్నది. చిన్నవానిన్-చిన్నదానిన్ (చూడు కాల్డు. ౩౨౨ పుట) (చూడు ౮౧ I, ౮౩ I విప). 'ఒన్రు-ఇరణ్టు' మున్నగు తమిళ శబ్దముల తుది వర్ణమువలెనె 'ఒకటి' అను తెలుఁగు శబ్దము తుది వర్ణమగు 'టి' అనునదియు నమహత్తచ్ఛబ్ద సంబంధియె యనఁదగును. 'ఒకటి' శబ్దము తుదిదగు 'టి' అనునది 'అది' శబ్దాంత్యమగు 'ది=తి=టి' అను వర్ణమె యనఁదగును. ఇట్లె ద్రావిడ సంఖ్యావాచక విశేష్యములు తఱుచుగ 'తు=దు' 'తి=ది=టి' మున్నగు నమహత్తచ్ఛబ్దాంత్యవర్ణ రూప ప్రత్యయములతోఁ గూడినవె యని (నాలుగు. తప్ప) యెఱుంగనగును.

హాలసగన్నడమునందలి 'ఒర్బను=(ఒకఁడు) ఒర్బళు=(ఒకతె)' అను రూపములందలి బకార ఘటిత రూపములను జూచి కావలయును బ్రాచీన కన్నడమందు 'ఒర్బన్-ఒర్బళ్' అను బకార ఘటితములగువానిని దొరగా రుదాహరించిరి. కాని ప్రాచీన కర్ణాటమున వాని సాధురూపములు 'ఒర్వం-ఒర్వళ్' అను వకార ఘటితములె. శబ్దమణి దర్పణమున వానిలోని వకారమున బకార శ్రుతి గలదనుటను నరయఁగా నప్పటికె హాలసగన్నడ రూపము లంకురింపసాగిన వనఁదగును.

'సంఖ్యాయాం నః' (కర్ణా. భూ. ౭౭ సూ.)=పుం స్త్రీ సంఖ్యావాచకములకుఁ బరమగు విభక్తుల మొదట ద్విత్వబహుత్వములందు వకారాగమ మగును. ఉదా:—ఒర్వర్=(ఒకరు). ఇర్వర్=(ఇరువురు). మూవర్= (మూవురు). మొ. ఇట్లు నాగవర్మ బకారశ్రుతిని వచింపలేదు. శబ్దమణి దర్పణమునకుఁ దర్వాతి వాఁడె యయ్యుఁ గర్ణాట శబ్దాను శాసనకర్త యట్టి శబ్ద మణి దర్పణోక్త 'బ' శ్రుతి నంగీకరించి వివరింపలేదు. ఇతఁడు పెక్కు-చోట్లఁ గేశవుని (శబ్దమణి దర్పణకర్త కేశిరాజును) బ్రమాణీకరించినవాఁడె.

'ఒందోః పుం స్యోర్వ్వళ్' (కర్ణాట శబ్దా. ౧౮౦ సూ.)=ఒందు ఇత్యేతస్య 'ఒర్వ్వళ్' ఇత్యాదేశో నిత్యం భవతి. ఏకత్వే పుంలిఙ్గవిషయే. శకార స్సర్వాదేశార్థః. ప్రయోగః:—ఒర్వ్వం=(ఒకఁడు).

'ళుశ్చ స్త్రియామ్' (కర్ణాట శబ్దా. ౧౮౧ సూ.)='ఒందు' ఇత్యేతస్య 'ఒవ్వాళ్' ఇత్యాదేశో భవతి, ళుగాగమశ్చ, ఏకత్వే స్త్రీలిఙ్గవిషయే...... ప్రయోగః ఒవ్వాళ్=(ఒకతె).

"పవణొళె మా సంఖ్యెయొళం। వ్యవహారికుం వత్వమల్లి బశ్రుతియుంసం। భవికుమ్......" (శబ్దమణి ౯౯ ప).

౯౩. III విష:—"సంఖ్యావాచక విశేషణమునుండి విశేష్యరూపముల నిష్పత్తి:—స్థూలదృష్టిని జూచునపుడు 'ఒన్ఱు' అను దానిలోని నకారము మూల రూపములోనిదిగాఁ దోఁచును. కాని నిజముగా 'ఒరు' శబ్దమె మూలరూపము.

| తమి | మల | కన్నడ కూర్గు | తుళు | గోండి | ఒరాఁవ్ | కొాయ్‌బల్ భాష శమాయెది కుటుంబము | గ్రీకు | లాటిన్ | గాథిక్ | టుంగు సియన్ భాష | [illegible] |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఒన్ఱు ఒన్డ్రు | ఒన్న్ (ఒన్ను?) | ఒన్దు | ఒన్జి | ఉండీ | ఉన్‌తా | యునెమ్ | ఏవ్ హెన్ | యూనస్ ఒయ్‌నస్ ప్రా. ఉన్ దెవిగిన్‌తి = (ఏకో నవింశతి) | ఎయ్న్స్. — ఇంగ్లీ (one) (వన్) | ఉమ్ | ఎము |

'ఒరు=ఒన్ఱు' అను విశేషణ విశేష్యములకు సమీప సంబంధముగల దనుట యుక్తము. కాని 'ఒన్ఱు' అను దానినుండి 'ఒరు' అనునది నిష్పన్న మయ్యెననుట ద్రావిడ సంప్రదాయమును బట్టి కేవల మసంభవము. ఇంక 'ఒరు' అనుదానినుండియే 'ఒన్ఱు' అనునది యేర్పడెనని చూపఁబడుచున్నది. లాటిను భాషలోని 'యూనస్' అను దానితో దీనికి సంబంధము గలదను నభిప్రాయము గ్రాహ్యము కాదు" (కాల్డు. ౩౨౩ పుట).

"కన్నడ మందలి మూరు (ఱు?) శబ్దము తమిళమున 'మూన్ఱు—మూన్డ్రు—మూందు (?)=మూణు' అనియు మలయాళమున 'మూన్న్ (న్ను?)' అనియు నేర్పడును. తమిళమందలి వర్తమానార్థకమగు 'కిఱు' అనునది గ్రాంథిక భాషలో 'కిన్ఱు=కిన్డ్రు' అని యేర్పడును. మలయాళమున వర్తమాన రూపములలో 'కున్ను-ఉన్ను' అని వెలయుచున్నవి. వయి యుదాహరణముల చొప్పునఁ దమిళమందలి 'ఒరు' శబ్దమునం దనునాసికాగమము రాఁగా (తమిం) 'ఒన్ఱు=ఒన్డ్రు' అను రూపములును మలయాళము 'ఒన్న్ (న్ను?)' అను రూపమును నేర్పడె ననఁదగును. 'ఒరు' శబ్దమునకు మూలరూపము మొదట 'ఱ' కార ఘటితమె యని యెన్నఁగును. అందనునాసికాగమము గల్గఁగా 'ఒన్ఱు' అని యేర్పడును. ఈ విషయమును 'ఒట్ఱై' అను విశేషణ రూపమె స్థిరపఱుపఁ

జాలియున్నది. రేఫ అకారముల మార్పు వింతకాదు. 'కరు=కఱు=(నలుపు)' అను ద్వివిధ రూపములును నొక్క శబ్దమునకే కలవు. వాని వ్యుత్పత్తిలో నీ షద్భేద మున్నను శబ్ద నిష్పత్తిలో భేదము లేదు" (కాల్డు. 3_౨3, 3_౨౪ పుటలు).

"'ఒన్టు=ఒన్ద్రు=ఒన్దు–ఒన్న్ (న్ను?)' అను వానిలోని నకారము సహజమె నైయున్నయెడల 'ఒన్' అను నకార ఘటిత రూపమె విశేషణము కావలసి వచ్చును. అట్టి ప్రయోగములు లేవు. 'ఒరు' అనునదె విశేషణ రూపముగఁ బ్రయుక్తమగుచున్నది. ఇట్లు రేఫఘటితము మూల రూపమగునపుడె 'ఒట్ర్రై' అను విశేషణ రూపము సమూలము కాఁగలదు" (కాల్డు. 3_౨౪ పుట).

"అకారమె యుచ్చారణ వశమున 'న్ద్రు' అని యేర్పడుననుటకు మఱికొన్ని యుదాహరణములు:—కన్న–కరు=(దూడ) తమి–కన్టు. దీనిని 'కన్ద్రు' అని యుచ్చరింతురు. ఇది వ్యావహారికాఱవమున 'కణ్ణు' అనియు, మలయాళమున 'కన్న్ (న్ను?)' అనియు నుండును. అట్లయినను దీని మూల రూపము 'కర్' అనునదే నైయున్నది. తమిళ భాషలోని దీని ప్రాచీన విశేషణ రూపము ద్విరుక్త అకార ఘటితమె నైయున్నది. ఉదా:—కన్ద్రు=కత్రు (కట్రు). కత్రా (కత్రు+ఆ?)=(కట్రా)=(దూడతోఁ గూడిన యావు). ఇది యీ క్రింది రూపమును బోలియున్నది. ఆణ్డు=(సంవత్సరము). దీని విశేషణ రూపము 'ఆట్టై' అనునది. దీనిని బట్టి 'ఆణ్డు' అనుదాని మూలరూపము 'ఆడు' అని తెలియుచున్నది. (ఇది యనునాసికాగమమునుచే 'ఆణ్డు' అని యయ్యెనని భావము కాఁబోలును?) తమి–కుఱు–గు=(చిన్నదగుట). కున్ద్రు=(కున్టు?)=(చిన్న కొండ.) క్రియానామవాచకము లెల్ల 'కుఱు' అనుదానినుండియె యేర్పడుటంబట్టి యిదియే ప్రాచీన రూపమని యెన్నఁదగును. ఉదా:—కుఱై=(కొఱంత). కుత్రమ్=(కుట్రమ్)=(కాపట్యము.) (అపరాధము?) కురిల్=(చిన్నజాబు.) కుఱి (గుఱి=లక్ష్యము).

డా. గుండర్టుగారు 'ఒన్' అనుదానికి 'తు=దు' అను సమహాత్ప్రత్యయము చేర్పఁగా 'ఒన్దు' అని యేర్పడుననియు 'ఒ'=(ఒకటగు, ఏకీభవించు) అను ధాతువునకు 'న్'=(అన్=అమ్) అనునది చేరుటచేత 'ఒన్' అను రూపమేర్పడుననియు నందలి 'న' కారము అకారముగా 'ఒట్టు' అని యేర్పడి 'ఒన్ద్రు' అని యగుననియుఁ దలంచిరి. 'మూన్+దు=మూణ్డు=మూన్ద్రు. ఇర్+దు=ఇరదు=ఇరణ్డు' అనునవియు నిట్టివే యనిరి (చూడు ౨౭ VII విష).

తుది నకారము రేఫముగాను ఱకారముగాను మాఱుట వింతకాదు. ఉదా:— మలయా - ఉళన్ = ఉళర్ = (పుట్టుట. మూలార్థము - ఉండుట) తమి - పిన్ = (పిదప). రూపాంతరము - పిఱ - పిఱగు = (తర్వాత). గుండర్టుగారు చెప్పిన యీ నిష్పత్తి పద్ధతి సుసాధముగనే యున్నను భిన్నభాషలలోని భిన్న సందర్భములందుఁ గల సంఖ్యావాచక రూపములను సరిపోల్చి చూచినపుడు నేను జెప్పిన నిష్పత్తి క్రమమె యుక్తమై యుండునని నా యభిప్రాయము." (కాల్డు. ౩౨౪-౩౨౫ పుటలు).

"తమిళమున 'ఒన్ద్ర' (ఒన్రు?) = (కలుపుట) అను క్రియా రూపమును గలదు. దీని ప్రేరణ రూపము 'ఒట్రు = ఒత్రు' అనునది. ఒన్ద్రి (ఒన్రి?) = ఒంటి). అనునది దీని విశేషణ రూపము." (కాల్డు. ౩౨౫ పుట).

విమర్శము:—కన్నడములోనిది 'మూరు' కాదు. మూఱు. తమిళ రూపమగు 'మూన్రు' అనునది ప్రాచీనతరమై యుండ (తెల్గు-మూండు = మూఁడు) 'మూఱు' అనునది మూలరూపమనుటయు 'కిఱు' అనునది 'కిన్రు' అనుదానికి మూలరూపమనుటయు నిచటి స్వవాద సంరక్షణమునకై దొరగారు వ్రాసిన సాహసవాక్యములని యెఱుంగ నగును. డా. గుండర్టుగారి యూహయె సత్యపద్ధతి నించుకంత యనుసరించి యున్నది. కాల్డువెల్లుగారు స్థూలదృష్టికి 'ఒన్' మూలరూపముగఁ దోఁచునని వ్రాసిరి కాని సూక్ష్మదృష్టి నరసినను డా. గుండర్టుగారు తలంచినట్లు 'ఒన్' అనునదే మూలరూపమనుట యుక్తముగా నున్నది. అదే పెక్కు భాషల 'న' కార స్థితికి సరిపడి యుండును. డా. కాల్డు వెల్లుగారద్దాని నంగీకరింపమి కట్టి 'ఒన్' శబ్దమునకుఁ బ్రయోగము లేకుండుట కారణముగ వచించిరి. కాని 'ఒరు' అనుదానికన్నఁ బ్రాచీనతర మనఁదగు 'ఒన్' అనురూపము 'ఒన్రు' అను తొల్కాప్పియ ప్రసిద్ధ శబ్దమందే కాక 'ఒన్ పంతు' = (తొమ్మిది) మున్నగు శబ్దములందును వెలయుచున్నది. 'ఒన్ + తు' అని యిట్లుగ నమహత్ప్రత్యయ యోగమున 'ఒన్రు' అనురూపము సిద్ధించెననుట మిక్కిలి విశ్వసనీయముగ నున్నది. 'ఒన్రు' అనుదాని యుచ్చారణమున 'ఒన్ద్ర' అను దకార శ్రుతి యున్నట్లు నేఁడు తోఁచునే కాని యందు దకారమున్న దనుట నిర్మూలము. (చూడు ౧౭ XVI. ౧౮ IX విమ). 'ఒన్రు' అనుదాని వికృతియె 'ఒన్న' అను మలయాళరూపము. (చూడు ౧౫ II విమ). 'ఒరు-ఒర్-ఓర్' అనునవి మూఁడును దొల్కాప్పియ ప్రసిద్ధరూపములె. 'ఒర్' శబ్దము 'ఒన్' అనుదాని వికృతియో? రూపాంతరమో? కావలయును. నకారము రేఫమగుట విరుద్ధము కాదుగదా. 'ఇరు = ఇనుమడి' (భార. అర. ౩ ఆ. ౩౪౫ ప). ఎనిమిది

శబ్దమందలి పూర్వావయవము 'ఇరు=ఇను' శబ్దసంబంధియె (శ్రీ రెడ్డిగా రిందు లకు సమ్మతింప లేదు) యని విమర్శకుల యాశయము. ఎట్లు సిద్ధించినను 'ఒరు' శబ్దము తొల్కాప్పియము నాఁటికె విశేషణముగఁ బ్రసిద్ధమై యున్నది. ఇట్టి సంప్రదాయసిద్ధమును బహు భాషా సామాన్య నకారస్థితి కలితమును నగు మార్గమును విడిచికొని నిరర్థక నిర్హేతు కానునాసికాగమమును గల్పించుటయు, నట్టి తమిళ సంప్రదాయ విరుద్ధమగు (చూడు తొల్కా. ౨౨ మొ. ౩౦ సూ.) 'న్ద్ర' అను హల్సంయోగము నంగీకరించి ప్రాచీన తమిళమునఁ గేవల దుర్లభ మగు 'రళ' ల మార్పు నంగీకరించి 'ఒరు=ఒళు=ఒన్తు=ఒన్ద్రు' అను రీతిగల నిష్పత్తిక్రమమును జూపుటయుఁ గేవలము ప్రాచీన తమిళ సంప్రదాయ విరుద్ధ మార్గము లనుటకు సందేహము లేదు. మఱియు 'ఒరు+తు' అనువాని సంధిలో 'ఒన్తు' అని యేర్పడు ననుటయుఁ బ్రాచీన తమిళ సంప్రదాయ విరుద్ధమె. (చూడు ఇరణ్డు-మూన్ఱు-ఐన్దు మొ). 'ఒన్+తు=ఒన్తు' అని యేర్పడుట తమిళ సంప్రదాయ సిద్ధము. దొరగారు తలంచు ననునాసికాగమము—నిరర్థకముగను నిర్హేతుకముగను గల్గు ననుట—సరికాదని యీవఱకు నిరూపింపఁ బడెను. (చూడు ౨౮ I మొ. ౨౮ IX విష. ౨౮ IV విష). 'ఒన్ట్రై' అను తమిళ విశేషణ శబ్దము తొల్కాప్పియాదులలో లేదు. రూపము కావచ్చును. ర ళ ల మార్పు, 'ఒర్త్' మున్నగు రాజమహాల్ రూపములు, మున్నగునవి 'ఒర్' శబ్దమునకుఁ దర్వాతివే యనుట నిర్బాధము.

డా. గుండర్టుగారు 'ఒన్' అనురూపము నంగీకరించియు 'ఒన్+తు=ఒన్తు' అనురూపమును సాధించుకొని దాని యుచ్చారణమున నేఁడు వినఁబడు 'ఒన్ద్రు' అను నర్వాచీనరూపమును సంపాదించికొనక 'ఒన్' అనుదానిలోని 'న' కారముతో 'ఱ' కారమును జేర్చి 'ఒఱ్ఱు' అను లేనిపోని రూపము నంగీకరించి దానిలో వర్ణవిపర్యయమును ర ళ ల మార్పును గల్పించి 'ఒద్రు' అను నప్రసిద్ధ రూపమును సంపాదించి యందు నిర్హేతుక నిరర్థకానునాసికాగమము చేసి 'ఒన్ద్రు' అను రూపమును దమిళ సంప్రదాయ విరుద్ధముగ నేల సాధింప దొరకొనిరో? తెలియకున్నది. అట్టి వక్రమార్గము సులభసాధ్యమె యని కాల్డు వెల్లుగారెట్లు వచించిరో? తెలియరాదు.

(౨) ౯౩. IV విష:—"తెల్గున నేకత్వవాచకములు 'ఒండు-ఒకటి' అను రెండు రూపములు గలవు. 'ఒండు' అనునది యితర ద్రావిడభాషలలోని 'తమి-ఒన్ద్రు? (ఒన్తు?) కన్న-ఒన్దు, మల-ఒన్న్ (న్ను?)' అనువానిని సంబంధించుచున్నది.

తెల్గులోని 'ఒండు' అనుదానినుండి 'ఒంటి' అను విశేషణ మేర్పడుచున్నది. ఇది తమిళమందలి "ఒంద్రి (ఒన్ఱిః)=వ్యావహారిక రూపము-ఒణ్డి" అనుదానిని సంబంధించి యున్నది. తెల్గు-ఒంటిగాఁడు=తమి-ఒంద్రిక్కారన్-(ఒణ్డిక్కారన్.)"

"ఏ భాషలోనైనను నేకార్థ బోధక శబ్దద్వయముండుట వింతకాదు. ఉదా:—సంస్కృ-ఏక-ప్రథమ; లాటిను భాషలో ద్విత్వ బోధకములు మూఁడు గలవు. ఉదా:—ద్వో-అంబొ-సెకెండస్. తెల్గు-I ఒండు. II ఒకటి=ఒక వస్తువు. పుంవాచకము-ఒకఁడు. స్త్రీ-ఒకతె. 'ఒక-ఒక్క' అనునవి విశేషణములు. ఒక శబ్దముపైని 'టి' అను నొప విభక్తిక (అది=ది=టి) ప్రత్యయము నిల్వఁగా 'ఒకటి' అనునది యేర్పడెను."

" 'ఒక' శబ్దము 'ఏక' అను సంస్కృత శబ్దమునుండి పుట్టినదని కొందఱి యాశయము. అట్టి యాశయ మసంభవముకాదు గాని-బంగాళీ 'ఒక్'. పెరిషి యనుభాష 'యక్' అనువానివలెనె యీ తెనుఁగు 'ఒక' శబ్దము సాక్షాదేక శబ్దజన్యమనుట యసంభవము. తెల్గున 'ఏకము' అను సంస్కృత సమశబ్దము గలదు. అది యట్లుండుటచేత దానినుండి 'ఒక' అను వికృతి గల్గుట సుసంభవముకాదు. మఱియు సంస్కృతముతో సంబంధములేని సిథియను ప్రభృతులగు పెక్కు భాషలలో దీనిని సంబంధించు శబ్దములు గలవు. కాన నిది సంస్కృతజన్యమనుట సరికాదు.

సిథియను భాషలలోని 'ఒక' శబ్దపు పోలికగల శబ్దముల పట్టిక.

| | |
|---|---|
| ఓటియాగ్భాష-ఒగ్-ఒద్దిగ్. | చెరెమిస్ భాష-ఇక్-ఇక్త. |
| శమోయిద్ భాష. ఒకర్-ఒక్కర్-ఊకుర్. | హిమాలయ ప్రాంత భాషలు:— |
| వోగుల్ భాష-అక్-అక్వ. | మిరి భాష-అకొ. |
| మాగియార్ భాష-ఎగి. | నాగ భాష-అఖత్. |
| లాపిష్ భాష-అక్త. | కుకి భాష-కత్క. |
| ఫిన్నిష్ భాష-యిష్టొ. | |

ఇట్టి యితర భాషల సామ్యమును బట్టియు ద్రావిడ భాషలలోని 'ఒర్' శబ్దపు సామ్యమును బట్టియు 'ఒక' శబ్దము సంస్కృతైక శబ్దభవమని గ్రహింప నక్కఱలేదు. 'ఒక-ఏక' శబ్దముల సామ్యము బలముగాఁ గన్పట్టు నన్నచో సంస్కృత ద్రావిడ సిథియను భాషలకు వేఱొక మూలభాష యుండెడిదనియు నట్టి మూల భాషనుండి యీ మూఁడు తెగల భాషలకును నయ్యది వచ్చెననియుఁ జెప్పవలసియున్నది".

"సంఖ్యా వాచకములలోని రేఫప్రాధాన్యము.

<u>ఒకటి</u>

| | |
|---|---|
| బెహిస్తను ఫలకములలోని సిథియను భాష } కిర్ | కకేషియను భాషలు. (సిథియను కుటుంబము) |
| ఇందలి విశేషణ రూపములు—ఇర్ర-ర | |
| ద్రావిడ భాషలలోని 'కు' భాష—ర | లాజియన్ భాష—అర్ |
| టర్కిష్ భాష—బిర్ | మిన్గ్రేలియను భాష—అర్తి |
| పరిషియను భాష—బార్ | జార్జియను భాష—ఎర్తి |
| సంస్కృత భాష. ఇదికాల వాచకము (వార=వాసర?) } వార్ | ద్రావిడ భాషలు—ఒర్-ఇర్ |

పయిరీతిని సంఖ్యావాచకములలో రేఫమునకును బ్రాధాన్య మధికము గనే చూపట్టుచున్నది" (కాల్డు. ౩౧౬, ౩౧౭ పుటలు).

"పయినుదాహరించిన 'ఒర్-ఒక' అను ద్రావిడ శబ్దములకుఁగల పరస్పర సంబంధమును బూర్తిగా నిరూపింప శక్యముగాకున్నను వీనికిఁ బరస్పర సంబంధము గలదనుటకు మాత్రము సందేహము లేదు. తమిళమున "ఏకీభవించు" అను నర్థముగల 'ఒ' ధాతువుగలదనియు 'ఒన్-ఒర్' అనునవి దానినుండి యేర్పడిన రూపములె యనియు డాక్టరు గుండర్టుగారు తలంచుచున్నారు. తమిళ మలయాళములలో 'సంపూర్ణము-సాకల్యము' అను నర్థముగల 'ఒక్క' అనునది 'ఒ' ధాతుజన్యమె యనియు నిది తెల్గులోని 'ఒక్క' శబ్దముతో సంబంధించుచున్నదనియు గుండర్టుగారి యాశయము. 'ఒ' ధాతువునకుఁ దమిళమున నేకీభావ మను నర్థము గలదని నిశ్చయింపఁజాలము. దీని సామాన్యార్థము 'తగి యుండు-పోలియుండు' అని చెప్పనగును. ఉదా:—ఒక్కుమ్=(పోలునది). పరిశీలింపఁగా 'ఒన్-ఒర్' అనునవి 'ఒ' ధాతువునుండి పుట్టలేదనియు 'ఒర్' అను నామమునుండియె 'ఒ' ధాతు వేర్పడియుండుననియుఁ దోఁచుచున్నది. సాధారణముగా నెల్లభాషలందును నేకార్థక శబ్దము స్వతంత్ర నామమె కాని ధాతు జన్యము కాదు. 'ఒ' ధాతుజన్య భావార్థక రూపమగు 'ఒక్క' అను తమిళ శబ్దము సాకల్యార్థక మగునే కాని యేకత్వార్థకము కాదు. ఇట్టి స్థితిలోఁ దెలుఁగునందలి 'ఒక్క' శబ్దమును దమిళమందలి 'ఒక్క' శబ్దమును నెట్లు భిన్నములగుటనని సందేహింపవలసి యున్నది. ఇట్టి చిక్కులున్నను నీ రెండును బరస్పర సంబంధము గలవని చెప్పకతీరదు. తెలుఁగున 'ఒండు' అను నేకత్వ బోధక శబ్దముండుటచేత నీ 'ఒక' శబ్దము దానికన్నఁ గొంత వేఱయిన యర్థము గలది కావలసెను. కన్నడమున 'ఒ' ధాతు వొక్కొకప్పుడు 'ఒందు=(ఒకటి)'

అను సర్థమున వాడఁబడును. ఉదా:—ఒక్కణ్ణను=ఒకట కన్నుగలవాఁడు. "C. ఒకణ్ణ. Wokkanna=one eyed......." (ఆంగ్ల కన్నడ కోశము). కాని యిందలి పూర్వావయవము 'ఒక్' కాదు; 'ఒర్' అను రేఫఘటితమె యని సమర్థింపనగును. "తమి-ఒరువన్=కన్న-ఒరుబన్=ఒర్బన్=ఒబ్బను" అను చోటను వలెనె 'ఒక్కణ్ణను' అనుచోట సైతము "ఒర్+కణ్ణన్=ఒర్కణ్ణన్=ఒకణ్ణన్" అనురీతిని రూప నిష్పత్తి నెన్ననగును 'ఒకణ్ణను' అను సమాసము లోని పూర్వావయవము 'ఒక్' అనునది కాదు". (కాల్డు. ౩౨౭ పుట).

విమర్శను:—ఎల్ల సంఘములవారును మధ్యాసియానుండియే వచ్చి రనుట సర్వచరిత్రకారసమ్మతమగుట చేతను, నాకాలపువారి భాషలను నిర్ణ యించుటకుఁ దగిన యాధారములు లేకుండుటచేతను (చూడు ౭ విష) సంస్కృతభాష సామ్యములు సిథియను భాషలలో లేవని నిర్ణయింపరాదు. పయిని వ్రాసిన యేక శబ్దార్థకములను బరిశీలించునపు డవి పరస్పర సంబంధము గలవని తోఁచక మానదు. సంస్కృతైక శబ్దమె మూలమగుఁ గాక! లేదా కాల్డువెల్లుగారు చెప్పినట్లుగ నేకశబ్దమువంటి భాషాంతర శబ్దమె మూలమగుఁ గాక! ఘుణాక్షరన్యాయమున రూపసామ్య మున్నంత మాత్రమున సాకల్యార్థక మగు 'ఒక్క' శబ్దమును సంఖ్యావాచియగు 'ఒక్క' శబ్దమును నభిన్నము లననేల? తిరుక్కుఱళు ప్రయోగమున సైతము 'ఒక్కల్' శబ్దము బంధువులను సర్థమున ('అందఱును జేరు'-శ్రీ రెడ్డిగారు) నున్నదే కాని యేకత్వార్థమున లేదుగదా (చూడు ౧౭ IX విష). డా. కాల్డువెల్లుగారిచట సంస్కృత సిథియను ద్రావిడభాషలు మూఁడిటికిని మూలమగు వేఱొక భాషనుండి 'ఒక' శబ్దము వచ్చెననిరి. వేఱొకచోట (చూడు ౧౦౫ I విష) సంస్కృతమె 'ఫిన్నో ఉగ్రియను' భాషనుండి యెరవు తెచ్చుకొన్నదని వ్రాసిరి.

'ఒక్కణ్ణన్' అను కన్నడ శబ్దవిషయమునందలి దొరగారి వ్రాఁతను జూచి కావలయు నాంధ్రభాషా వికాసకర్తగారు 'ఒర్+క=ఒర్క=ఒక్క' అను రీతిని భేదమును జూపిరి. (ఆం. భా. వి. ౭౭౯, ౭౫౦ పుటలు) 'ఒర్+క' అనుటకు 'క' కారమెట్లు వచ్చును? మఱియుఁ దెలుఁగున 'ఒర్' శబ్ద మేకత్వార్థ కము లేదు. అమహద్వాచకములు తెల్గున 'ఒండు-ఒకటి' అనునవె కదా. ఇంక 'ఒర్+క' అను వ్యుత్పత్తి తెల్గున నెట్లు సంభవించును?

'ఎక్కటి' అను తెల్గుశబ్ద మేకశబ్దభవమని యంగీకరింపక తీరదుగదా. ఇంక 'ఒక్క' శబ్ద మట్టిది కాదనుట యెట్లు విశ్వసనీయమగును? బెంగాలీ భాష లోని 'ఒక్' అనునది యేకశబ్దభవ మనుచు ద్రావిడభాషలలోని 'ఒక' శబ్ద మట్టిది

కాదనుటయుక్తమా? 'ఎక్కటి-ఒక్కటి' అనువానికిని నించుక యర్థభేదము గలదు. 'ఎక్కటి=ఒంటి'. (ఎక్కటి కయ్యము-ఎక్కటియతి=ఏకతరయతి-మొ). క. ఇక్ష్వాకు వంశంబున నీ। వొక్కరుఁడవయున్న వాఁడ వుర్వీరాజ్యం। బెక్కటి నేకొని తేజము। దిక్కుల వెలిఁగింపు సంతతియుఁ బడయు మొగిన్ (భార. ఆది. ౮ ఆ. ౨౨౧ ప).

౫౩. V విష:—"ద్రావిడ భాషలలోని యుపపదములు=(Indefinite articles):—ద్రావిడ శబ్దములగు 'ఒరు-ఒక' అనునవి యింగ్లీషు మున్నగు వానిలోవలెనె యనిర్దిష్టవస్తుకములగు నుపపదములుగ వాడఁబడుచున్నవి. టర్కీ భాషలలో నేకార్థకమగు 'బిర్' అనునది యిట్లెవాడఁబడును. ఆధునికములగు నైరోపాభాషలందును నుత్తరహిందూస్థాన వ్యావహారిక భాషలందును నిట్టి వాడుకలు గలవు. కాని ద్రావిడ భాషలం దింగ్లీషులోవలె నవి సామాన్యముగ వాడఁబడక యేకత్వ విశేషమును వక్త వివక్షించునపుడె యవి వాడఁబడును. (ఆతఁడొక మంత్రము నామె కుపదేశించెను). ఇట్టి ద్రావిడ భాషా సంప్రదాయమును గ్రహింపక కొందఱు యూరపియను లింగ్లీషులో వలెనె వీనిని వాడుదురు" (ఆతఁడొక మనుష్యుఁడై యున్నాఁడు). (కాల్డు. ౩౨౮, ౩౨౯ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారును యూరపియనులె యగుటచేత నిట్టి వాడుకలు వినుటయు నిరసించుటయు నావశ్యక మయ్యెను. ఇట్టి వాడుకలు ద్రావిడ జనుల భాషలో నెంత మాత్రము చూపట్టవు.

"రెండు:—౫౮. I విష:—'రెండు అనునది ద్విత్వమును బోధించు నమహాచ్ఛబ్దము. దీనికిఁ గన్నడ భాషలోని 'ఎరడు' అనునది మూల రూపము. దీనిలో నుచ్చారణార్థకమగు ననునాసికాగమము నిల్వఁగా 'ఇరణ్డు' (తమి)='రెండు' (తెల్గు) మున్నగు శబ్దము లేర్పడును.

ద్విత్వవాచక ద్రావిడ శబ్దముల పట్టిక.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రాచీన కన్నడ | — ఇరడు | తుళు | — రడ్డ్ | తమిళు | — ఇరువర్ |
| కన్నడ | — ఎరడు | కూర్గు | — దణ్డు | తుళు | — ఇర్వర్ |
| తమిళు | — ఇరణ్డు | గోండు | — రెండ్ | ప్రాచీన కన్నడ | — ఇర్వర్ |
| తెలుఁగు | — రెండు | | రను | హొసగన్నడము | — ఇబ్బరు |
| ప్రాచీనమలయాళము | — ఇరణ్ణ | సినాయ్ గోండు | — రండ్ | తెనుఁగు | — ఇద్దఱు |
| అర్వాచీన మలయాళము | — రెండు | తుద భాష | — ఎడ్డ్ | తమిళు | — ఇరునూఱు |
| | | సింగాలీ | — ఇరుణ్డత | తెల్గు - కన్నడ | — ఇన్నూఱు |
| | | | | తమిళు | — ఇరుపత్తు |
| | | | | కన్నడ | — ఇప్పత్తు |
| | | | | తెలుఁగు | — ఇరువై |

'కన్న-ఎరడు-తమి-ఇరణ్డు-తెనుఁగు-రెండు' అను వాని మార్పు, తమి-'ఇరా'=(రాత్రి) అనునది తెనుఁగున 'రే' అని మాఱిన మార్పువంటిది. పయి నుదాహరించిన ద్విత్వవాచకములను బరిశీలింపఁగా ద్రావిడ శబ్దములలో 'ఇరు' అనునది మూలరూపమనియు దానిపై నపుంసక ప్రత్యయమగు 'తు=దు=డు' అనునది నిల్వఁగా (కిర=(చిర)=పురాతనమైనది. కిరడు=ప్రాచీన వస్తువు) 'ఎరడు' అనియు నుచ్చారణార్థకానునాసికాగమముచే 'ఇరణ్డు' అనియు నేర్పడును. తమిళమునఁ బదాదిరేఫోచ్చారణము దుష్కరమగుటచేత నది 'ఇ' కార పూర్వకమగు నను పద్ధతి చొప్పున (చూడు ౬౪ విష) 'ఇరణ్డు' శబ్దము మొదట 'ఇ' కారము చేరె నను నభిప్రాయము పరిశీలింపఁదగి యున్నది. తెల్గు మలయాళములలోని రెండు మున్నగు వాని మొదట 'ఇ' వర్ణము లేకుండుట యీ యభిప్రాయమున కనుకూలముగ నున్నది. కాని ద్రావిడ భాష లన్నిటిలోను 'ఇరు' శబ్దము చూపట్టుచుండుటచేత 'ఇ' వర్ణము మూలధాతువు లోనిదే యని నిశ్చయింప నగును" (కాల్డు. 3౨౯, 330 పుటలు).

"విశేష్యమగు 'ఇరణ్డు' అనునది విశేషణమగునపుడు 'ఇరట్టు' అని యగును. (౯౧ III విష). తమిళమందును 'ఇరడు' అను నిరనునాసికము మూలరూపమనియు నుచ్చారణార్థ కానునాసికాగమముచే 'ఇరణ్డు' అని యేర్పడెననియు నెన్న నగును. ఇట్లే తెనుఁగునందును 'డు' అనుదానికిఁ బూర్వమున ననునాసికాగమము గల్గుచుండును. వ్రాఁతలో లేకున్నను నుచ్చారణమున వెలయుచుండును. తమిళమందును అణ్డు=అక్కడ. ఈణ్డు=ఇక్కడ. యాణ్డు=ఎక్కడ మున్నగు రూపములలో 'డు' వర్ణమునకుఁ బూర్వమున నుచ్చారణార్థ కానునాసికాగమము గల్గును. అది ప్రాచీన రూపములలోఁ జూపట్టదు. కావున నవి 'ఆడు-ఈడు-యాడు' అను రూపములనుండి యేర్పడిన వనఁదగును. ఇట్లే 'ఇరణ్డు' అనుదాని మూలరూపము 'ఇరడు' అనునదె. మలయాళమందలి 'ఒన్న' శబ్దము 'ఒండు' (ఒన్టు?) శబ్దమునుండి యేర్పడినది. గోండు మున్నగు వానిలో 'ఇ' కారలోపముచే 'రను' మున్నగు శబ్దము లేర్పడి నవి. 'ఒరా ఒన్' భాషలోని 'ఎనోతన్' అనునది ద్రావిడ శబ్దము. అందలి 'ఒతన్' అనునది మొదటి మూఁడు సంఖ్యావాచకముల తుదను జేర్పఁబడు ప్రత్యయము. కాఁగా మిగిలిన 'ఎన్' అనునది ద్రావిడభాషలలోని 'ఎర్=ఇర్' అనుదానికి సరిపడును." (కాల్డు. 330 పుట).

విమర్శము:—'ఇరు' అనునది తొల్కాప్పియ వ్యాఖ్యాతృ సాధితము. (చూడు ౯3 II విష.) (౪౭౯ తొల్కా. సూ.) కాల్డువెల్లుగా రుచ్చారణార్థ

కానునాసికాగమము నంగీకరించువారగుటచేత 'ఎరడు' అను నర్వాచీన లుప్తాను నాసిక రూపమును మూలరూపముగా నంగీకరించినవారైరి. ఆ పక్షమున 'ఇర్' అనునది మూల రూపమనుట తప్పిపోవునుగదా యను నుద్దేశముతోఁ గావలయుఁ బ్రాచీన కర్ణాటమున నశ్రుతచరమగు 'ఇరడు' అనునది ప్రాచీన కర్ణాట రూపమని వ్రాసినవారైరి. ప్రాచీన కర్ణాట వ్యాకరణములందు 'ఎరడు' అనునదె చెప్పఁబడియున్నది. "'ఎరడో౯ ఇర్' (కర్ణాట శబ్దా. ౩౫౯ సూ.)= ఎరడు ఇత్యస్య ఇర్ ఇత్యాదేశో భవతి సచ శిద్వ ద్భవతి. ఉత్తరపదేవరే. నద్వంద్వ సమాసే-మెవరితు నిత్యమ్."

"క॥ దొరెకొళ్వ దఖిలవైయూ।
కరణిరి నొండెంబు దర్కొరెంబాదేశం।
ఎరడర్కె మిరాదేశం।
దొరకొళ్గు మదల్ల దందుకారాభావం॥"

(శబ్దమణి దర్పణము. ౧౪౭ ప).

తమిళాదులలోని 'ఇరువర్' మున్నగువానికి సరియగు 'ఇరువురు' అను రూపము తెలుఁగున నుండఁగా దాని నుదాహరింపక దొరగారు ఇద్దఱు అను దాని నుదాహరించుటకుఁ గారణమేమో? తెలియకున్నది. 'ఇద్దఱు' అనునది మాత్రమె తెనుఁగునఁ గలదని తలంచిరేమో? ఉచ్చారణాసమర్థతచేఁ బదాది రేఫమునకు ముందుగ 'ఇ' కారాదులను నిల్పు నవస్థ తమిళమందు మాత్రమె గలదు. ఆంధ్రకర్ణాటాదులలో లేదుగదా. తమిళమునుబట్టి శంకింపనేల? తెల్గులోని 'రెండు' మున్నగుచోటులందు 'తమి–ఇరా–తెల్గు–రే' అను రీతిగల వర్ణవ్యత్యయ వికృతి కల్గెనని తామె యుదాహరించియు దొరగారు తెల్గు మున్నగువానిలో ఇకారము (ఇరు లోనిది) లేకుండుట దాని యుచ్చారణార్థకత్వ మున కనుకూలమని వ్రాయుట యుక్తమా? 'ఇరణ్డు-అణ్డు-ఈణ్డు-యాణ్డు' అను చోటులందలి యనునాసిక ముచ్చారణార్థకము కాదనియు నయ్యది శబ్దావయవ మనియు నీవఱకు విపుల విమర్శ పూర్వకముగా విశదీకరింపఁబడెను. (చూడు ౨౮ VII విష.) కన్నడములోని 'ఎరడు' శబ్దములోనిదానివంటి 'డు' వర్ణములకెల్లఁ దెల్గున ననునాసిక పూర్వకత్వ ముండుననుట భ్రాంతిమూలకము. మహద్ విభక్తి 'డు' వర్ణకము మాత్రమె బిందుపూర్వకమగుట తెనుఁగు సంప్ర దాయము. అట్టి బిందువుచ్చారణార్థకము కాదు. అది తెల్గున శబ్దావయవము. అర్ధానుస్వారము నుద్దేశించి కాఁబోలును దొరగారు వ్రాఁతయందు లేకున్నను

నుచ్చరింపఁబడునని వ్రాసిరి. అర్ధానుస్వార లేఖనము తెనుఁగున నేఁటికిని విడువఁబడ లేదు.

౯౮. II విష:—"ఇరణ్డు మున్నగు శబ్దములలోని 'ఇర్' అనునది ద్రావిడ శబ్దము. అన్యదేశ్యము కాదు. అది 'ఈర్' (అంపముతోఁ గోయు) 'ఇరుళ్'= (చీఁకటి) 'ఇరా'=(రాత్రి) అనువాని మూల రూపముతో సంబంధించున దనెడి గుండర్టుగారితో నే నేకీభవింపఁ జాలను. 'ఈర్' ధాతువునకు 'అంపముతోఁ గోయుట' అనియే కాక 'చీల్చుట–విభజించుట' అనియు నర్థము గలదు. ఇట్టి 'ఈర్' ధాతువుతో 'ఇర్' = (రెండు) అనునది సంబంధించు ననఁదగును. ఏకాచ్కములగు హలంత ధాతువులు హ్రస్వపూర్వకములై యగును గాన 'ఈర్'=విభజించు అను ధాతువు సైతము మొదట 'ఇర్' అనురూపముతోనె యుండి యుండును. దీనికి 'ఉండు' అను నర్థమును గలదు.

కిట్టెలు దొరగారు రెండు శబ్దము 'చీల్చు' అను నర్థముగల 'ఈర్' అను ధాతువు నుండియు 'ఒకటి' శబ్దము 'చీల్పఁబడకుండు' అను నర్థముగల 'ఒర్' ధాతువునుండియు నేర్పడెనని యభిప్రాయపడిరి. (చూడు ఇండియను ఆంటిక్వెరి. ౧౯23 సం॥ జనవరి). (ద్విత్వము విభాగయోగ్యమనియు నేకత్వము విభాగ యోగ్యము కాదనియు వీరియాశయము.) 'ఒరు' అను నామమె మూలరూప మనియు దానినుండియే ధాతు వేర్పడెననియు నా యభిప్రాయము. ద్విత్వ వాచకములలో నేది మూలరూపమో నిశ్చయింపరాకున్నది. కాని వ్యాపార బోధకమగు ధాతురూపముకన్న వస్తువాచకమగు నామమె ప్రాచీనతరమని యెన్నఁదగును.

కకేషియను భాషలు తప్పఁ దక్షిన సిథియను కుటుంబభాషలలోఁ గాని యిండో యూరపియను భాషలలోఁగాని 'ఇర్' అనుదాని పోలికగల శబ్ద ములు కన్పట్టలేదు. బ్రహూయి భాషలో ద్వి త్రి సంఖ్యావాచక ద్రావిడ శబ్ద ములతో సన్నిహిత సంబంధముగల శబ్దములు చూపట్టును. అట్లగుటచేత నయ్యది ద్రావిడ కుటుంబములోనిదన్న తలంపు బలపడుచున్నది. బ్రహూ- ఇరట్=(రెండు). అసిట్=(ఒకటి). ముసిట్=(మూఁడు). 'అసిట్–ముసిట్' అనువానిలోని సకారము రేఫమునకు సరియని యీవలకు వాని సంబంధ విషయమున వ్రాయఁబడెను (చూడు ౯౩ III విష). వీనిలోని 'అట్–ఇట్' అనునవి ధాతువుపై నిల్చు ప్రత్యయము లనఁదగును. కాఁగా 'ఇర్' అనునది ద్రావిడ ద్విత్వవాచితో సరిపడుచున్నది.

సిథియను గ్రూపులోని కకేషియను భాషలలోని కొన్ని శబ్దములు 'ఇర్' అను ద్రావిడ శబ్దమును సంబంధించుచున్నవి. అవి యిటఁ జూపఁబడు చున్నవి. ఇవెల్ల ద్విత్వవాచకములు.

| జియార్జియను భాష | శ్వానియన్ భాష | లాజియన్ భాష | మింగ్రేలియన్ భాష | ఆర్మీనియన్ భాష | చీనా భాష |
|---|---|---|---|---|---|
| ఒరి | ఎరు<br>ఎయ్యర్ | జుర్ | షిరి | ఎర్ గొత్ | ఆర్ |

శమాయిద్ కుటుంబభాషలలోని 'సిత్-సెద్-సి రే-సిరి' అనుద్విత్వ వాచకములలోని సకారము మఱికొన్ని భాషలలో 'శ' కారముగా మాఱును గాని రేఫముగా మాఱుననుటకు వీలులేదు. కాన నివి 'ఇర్' అను ద్రావిడ శబ్దమును సంబంధించున వనుట సంభావ్యము కాదు" (కాల్డు. ౩౩౧-౩౩౨ పుటలు).

విమర్శము:—"ఆం. భా. చ." కర్తగారు రెండు శబ్దము సంస్కృత ద్వంద్వ శబ్దభవమేమో యని యూహించిరి. 'ద్వంద్వ' శబ్దము 'దొందొ-దొండు-దొంద' అనురీతిని మాఱుటలో వింతలేదు. దొందడి మున్నగు తద్భవములు దెలుఁగున బ్రసిద్ధములయి యున్నవి. ఇంక 'ద' కారము రేఫమగు విషయ మున "సంస్కృ-ద్వాదశ = ప్రాకృత-బారస = బారహ = బారా. సంస్కృ-త్రయోదశ-ప్రా-తేరహ-తేరస" మున్నగు ప్రాకృత వికృతులను జూపిరి. తెలుఁగు వాడుకలలో "రెండు=రొండు=దొందు. రమ్ము=రా=దా" మున్నగు మార్పులను జూపిరి. ఇట్లు 'రెండు' శబ్దము ప్రాచీనతమ మనియు దీనినుండి 'ఇరణ్డు' అను తమిళశబ్ద ముదయింప నోపుననియు వచించిరి. (ఆం. భా. చ. ౧౧౯౬ పుట). తెల్గు రకారము దకారముగ మాఱిన యుదాహృతులు సంస్కృతభాషలోని ద్వంద్వశబ్ద దకారము రేఫమగునని యెట్లు సమర్థించు ననుకొనిరో తెలియకున్నది. మఱియుఁ బదాది రేఫమున కికార పూర్వకత్వము లేని యితర ప్రాచీన ద్రావిడభాషలలోని 'ఇర్' శబ్దము ద్విత్వవాచియై యుండుట వీరివాదమునకు భంజకమగుచున్నది. ప్రాచీన కన్నడమున 'ఎరడు' శబ్దమును బ్రాచీనాంధ్రమందె 'ఇరువురు-ఈరేడు = (పదునాల్గు)' మున్నగు శబ్దములును సుప్రసిద్ధములు గదా. ఇట్టివాని సమర్థనమునకై యీ పక్షమున రెండు శబ్దమునుండి 'ఇరు' శబ్దమును సంపాదింపవలసిన యవస్థ సంభ వించును గాన వీరి యీ మార్గ మపమార్గమె యనుటకు సందేహములేదు.

౯౫. I విష:—"మూఁడు:—త్రిత్వవాచ కామహా దేకవచన ద్రావిడ శబ్దముల పట్టిక:—

| కన్నడ | తెలుఁగు | తమిళ | కూర్గు | మల | తుళు | గోందు | తుద | ఒరా ఒన్ |
|---|---|---|---|---|---|---|---|---|
| మూరు | మూడు | మూన్ఱు<br>మూన్ద్రు<br>మూణు | మూన్దు | మూన్న్ | మూజి<br>(జ=ఱ) | మూన్ద్ | మూద్ | మనోతన్ |

తెలుఁగు-ముగ్గురు-ముప్పై-మున్నూరు-తమి-ముప్పత్తు-(ముప్పది) కన్న-మూవత్తు-(ముప్పది) మున్నగు శబ్దములను బట్టి 'మూ-ము' అనునవి త్రిత్వ సంఖ్యావాచక విశేషణ రూపములు. వీని కెల్ల 'మూరు' అను కన్నడ శబ్దము మూలరూపము. 'ఒరు' అను దానినుండి 'ఒన్ఱు'=ఒన్ద్రు అనునది యేర్పడినట్లె 'మూరు' అనుదానినుండి 'మూన్ద్రు' అనునది యేర్పడును. మూన్ద్రు శబ్దమునుండియే 'మూరు' శబ్ద మేర్పడెనను గుండర్టుగారి యాశయమును నే నంగీకరింపఁజాలను.

తమిళ రేఫము తెల్గున డకారమగునని ధ్వని ప్రకరణమున వ్రాసితిని. (లేదు. తుద తమిళము లచట వ్రాయఁబడెను. చూడు ౨౧ VI విష). 'మూరు=మూడు' అనునవి సజాతీయములు. సకార రేఫములు పెక్కు-భాషలలో మాఱుట గలదు గాన—"బ్రహుయి-ముసిట్=ముస్=కన్న-మూరు, తుళు-మూజి" అనునవి సన్నిహిత సంబంధము గలవి.

మూరు శబ్దపు మొదటి రూపము 'ముర్' అనునది. 'ఆఱు-ఏఱు' శబ్దములందువలెనె మూరు శబ్దమందలి రేఫము ధాతు సంబంధి. ప్రత్యయ సంబంధి కాదు. 'ఇన్నూఱు' శబ్దమందలి 'ఇర్' అను దానివలెనె మున్నూఱు శబ్దమందలి 'ముర్' అనునదె పూర్వావయవము. 'ముర్' అను దానిలోని రేఫము సరళముగాఁ (అచ్చుతో?) బలుకునపుడు 'ము' అనునది దీర్ఘమగును" (కాల్డు. 33౨, 333 పుటలు).

విమర్శము:—దొరగారికి వ్యావహారిక భాషలె యధికముగ నభ్యస్తము లగుటచేతఁ బెక్కు-చోటులందు వీరికి 'ర ఱ' లభేదము గోచరింపదు. ఎల్ల యెడ లను 'మూరు' అని రేఫ ఘటితముగనే వ్రాయుచుందురు. వీరి యనుయాయు లగు వికాస కారాదులును 'మూరు' అను దానిని రేఫ ఘటితముగనే తలంతురు. ఇది హళొసగన్నడ రూపము. దీని పఴగన్నడ రూపము 'మూఱు' అను

ఱకార ఘటితము. దొరగారు నిరర్థక నిర్ణేతృ కానునాసికాగమము నంగీక రింతురు గాన కన్నడ 'మూఱు' (ఱు) శబ్దము మూలరూపమనియు దాని నుండి 'మూన్ద్రు' (నిజమైన తమిళ రూపము 'మూన్ఱు' అనునది) అను తమిళ శబ్ద మేర్పడుననియు వ్రాయవలసినవారైరి. తొల్కాప్పియమునఁ జేర్కొనఁ బడినది 'మూన్ఱు' శబ్దము. అందలి యనునాసికము లోపించుటచేత 'మూఱు' అను కన్నడ శబ్ద మేర్పడెను. 'మూన్ఱు' అను తమిళ శబ్దములోని 'ఱ' కారము ప్రాచీనకాలమున 'ట-త' మధ్యస్థోచ్చారణము గలది గానఁ దెల్గున 'మూండు' అను రూప మేర్పడెను. (చూడు ౧౮ IX విష.) (౧౭ XIII విష). తమి ళాపభ్రంశమగు మలయాళ రూపము 'మూన్న్' అనునది. (చూడు ౧౫ II విష). దొరగారెల్ల యెడలను 'మూన్న్' అను రీతిని 'ఱ' త్వరహిత నకార ద్విత్వమునె చూపుచుండుటకుఁ గారణమేమో? తెలియకున్నది. 'మూన్ఱు' అను తమిళ రూపము కొన్ని యెడల 'మూన్డ్రు' అనియుఁ, గొన్ని యెడల 'మూన్ద్రు' అనియు నేఁటివాడుకలో వినఁబడును. ఱకారము 'ట-త' మధ్యస్థో చ్చారము గలది గదా. దొరగారెల్ల యెడలను 'మూన్ఱు' అనుచోట 'మూన్ద్రు' అనియె వ్రాయుచుందురు. (చూడు ౧౭ XIII, ౧౭ VI విష, ౧౮ IX విష. ౯౩ III విష).

ఇట్లు 'మూన్ఱు' అనుదానిలోని ప్రాచీన ఱకారము తెల్గున 'డ' కార ముగ నేర్పడెనని గ్రహింపక తమిళ రేఫము తెల్గున డకారమగునని ధ్వనిప్రకరణ మున వ్రాసితిననుచుఁ (ధ్వనిప్రకరణమున నట్లు వ్రాయలేదు చూడు ౨౧ VI విష. తమిళ డకారము తుద భాషలో రేఫమగునని వ్రాసిరి) గర్ణాటమందలి 'మూఱు' శబ్దమునుండి తెలుఁగు నిర్బంధుక మూఁడు శబ్దమేర్పడెనని యసంగత ముగా వ్రాయుట మిక్కిలి పొరపాటు.

సంఖ్యావాచక విశేషణ రూపముమీఁద 'తు' అను నమహత్ప్రత్య యము నిల్చుటచేత సంఖ్యావాచక విశేష్యరూపమేర్పడునని యీ వఱకు వ్రాసిరి. (౯౩ I విష.) ముందును వ్రాయుదురు. దొరగారిట్లు వ్రాసియు నిట మూఱు శబ్దము రేఫఘటితమనియు నట్టి రేఫము ప్రత్యయ సంబంధి కాదనియు ధాతురూపములోనిదే యనియు వ్రాయుట పూర్వోత్తర సందర్భ శూన్యముగ నున్నది.

'తమి-మూన్ఱు= తెల్గు-మూండు' అను శబ్దమునకు మూలరూపము 'మూన్' అనెడి ధాతువనుట (చూడు ౯౩ II విష.) యుక్తము. (చూడు

తొల్కా. ౪౭౯-సూ.) 'మూరు' అని రేఫఘటితమనియు నట్టి కన్నడ శబ్దమె మూల రూపమనియు భ్రమించి దొరగారయ్యది 'మూర్=ముర్' ధాతువు నుండి యేర్పడెననుచు 'ఇర్+నూఱు=ఇన్నూఱు' అనుదానివలెనె 'మూర్+నూఱు=మున్నూఱు' అనునది నిష్పన్నమయ్యెనని యుదాహరించుట కేవలము భ్రాంతి మూలకము. 'మూన్+నూఱు=మున్నూఱు' అని యేర్పడెననియు '(తమి) మూన్రు, (తెల్గు) మూఁడు' శబ్దము 'మూన్' ధాతుమూలకమనియు గ్రహింపనగును. 'మున్నూఱు=ముప్పంతు' మున్నగు చోటులం దాచ్ఛిక ద్విత్వ పరకత్వమున దీర్ఘము హ్రస్వమగుట సహజమనియు 'మూన్' అనునదియె ద్రావిడ త్రిత్వవాచక మూలరూపమనియు నెఱుంగనగును. భాషాచరిత్రకర్త గారు 'మూన్' అనునదె మూలరూపమని వ్రాసిరి. (చూడు ఆం. భా. చ. ౧౧౮౭ పుట). 'ఆం. భా. వి.' కర్తగారు కాల్డువెల్లుగారినె యనుసరించుచు 'మూ-ము' అనునవి విశేషణములనియు మూలరూపములనియు వ్రాసిరి. (ఆం. భా. వి. ౪౪౫, ౪౫౧ పుటలు).

౯౫. II విమ:—"ఈ 'ముర్' అనుదానికి సిథియను భాషలలోఁ గాని యిండోయూరపియను భాషలలోఁ గాని పోలిక కన్పట్టదు. ఒక్క బ్రహుయి భాషలో మాత్రమె దీని పోలిక గలదు. (చూడు ౯౪ II విమ). 'త్రి' అను సంస్కృత శబ్దము 'తౄ' ప్లవన తరణయోః" అను ధాతువునుండి పుట్టినదను నట్లె యీ 'ముర్' శబ్దమును "మీఱు=అతిశయించు=అతిక్రమించు-(ద్విత్వము నతిక్రమించు)" అను ధాతువునుండి యేర్పడెననుట సాహసము కాదు. "తెల్గు-మాఱు-తమి-ముఱు=(ముఱుగు=తిరుగు)" అను ధాతువులును దీనికి సన్నిహితములె. తమి-'ముఱు' ధాతుజమగు 'ముఱయ్=వరుస-వంతు' అను రూపమును గలదు.

అమహత్ప్రత్యయమగు 'దు' అనునది 'ఒన్ద్రు-ఇరణ్డు-మూన్ద్రు-ఐన్దు.' అను రూపములలో వెలయుచున్నది. 'డు-దు' లు పరస్పర సంబంధము గలవి. అనునాసికము చేరునపుడు 'ణ్డు' అని యేర్పడును. 'ఒన్ద్రు' అనునది 'ఒర్దు' అను ప్రాచీన రూపమును 'ఇరణ్డు' అనునది 'ఇర్దు' అను ప్రాచీనరూపమును, 'మూన్ద్రు' అనునది 'మూర్దు' అను ప్రాచీనరూపమును సూచించుచున్నవి" (కాల్డు. 333 పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు 'ముర్' అనునది 'మూన్రు-మూండు' మున్నగు వానికెల్ల మూలరూపమని తలంచిరి గాన నది 'మీఱు-మాఱు-ముఱు' అను ధాతువులలో దేనినుండియైన నేర్పడియుండునని యూహించిరి. వీరేల

యూహింపకుండిరో తెలియదు గాని "తెల్గు-మూరు=అతిశయించు. తమి-మూరి= Greatness=గొప్పతనము" (ద్రవిడియన్ కాగ్నెట్స్) అను శబ్దము పై వానికన్న సన్నిహితముగ నుండును. 'ముర్' అనునది త్రిత్వవాచకములకు మూలపదమనుట సరికాదనియు 'మూన్' అనునది మూలశబ్దమనియు నా యభిప్రాయము నంగీకరించు పక్షమున "మూఁగు=గుమిగూడు. మూంక=మూఁక=సమూహము" అనువానికి మూలరూపమనఁదగు 'మూన్' అనునది త్రిత్వవాచి 'మూన్డు-మూండు'-అను శబ్దమునకు ధాతువు కానోపునని తలంప నగును. ఇట్టి వ్యుత్పత్తు లిదమిత్థమ్మని నిర్ణయించునవి కాఁజాలవు. బుద్ధిమంతు లింకను నుచితములగు వ్యుత్పత్తులను గల్పించుట కవకాశము వెలయుచునే యుండును.

సంస్కృతమందును 'ఏక-ద్వి-త్రి' ప్రభృతుల వ్యుత్పత్తు లిట్లె యసంతుష్టి గనే యున్నవి. శబ్దరూప నిరూపణమున నివి సరిపడియుండునే కాని యర్థము సంతుష్టికరముగా నుండనేరదు.

"ఏక-త్రి-(ఇణ్+కన్)......" ("ఇణ్-గతౌ" అను ధాతువునుండి యేకత్వవాచి యేర్పడెను). "ద్వి-త్రి...(ద్వృ+డి)..." ("ద్వృ-సంవరణే" అను ధాతువునుండి 'ద్వి' శబ్దమేర్పడెను) "త్రి-త్రి......(తౄ+డ్రి)" (తౄ-ప్లవన తరణయోః" అను ధాతువునుండి 'త్రి' శబ్ద మేర్పడెను) (శబ్దస్తో).

డా. కాల్డువెల్లుగారు నిరర్థక నిర్హేతు కానునాసికాగమము నంగీకరించు వారు గాన ననునాసికాగమము రాకముందటి రూపములనుచు 'ఒర్దు-ఇర్దు-మూద్దు' అనువాని నంగీకరించిరి. ఇట్టివి తమిళ ప్రాచీన వాఙ్మయమందెందును లేవు. కాన నివి నిర్మూలములు. నిరాధారములు.

ఁ౯. I విష:—"నాలుగు:—చతుస్సంఖ్యార్థక ద్రావిడ శబ్దముల పట్టిక.

| కన్నడ | కూర్గు | తెల్గు | తుళు | మలయా | తమిఌ | తుద | గోందు | ఒరా ఒన్ |
|---|---|---|---|---|---|---|---|---|
| నాల్కు | నాలు | నాలుగు | నాల్ | నాల్ ఇూ(నా?)ఙ్గు | నాలు నాఙు్కు | నాజ్కు | నాలు | నాక్ ఓతన్ |

దీని విశేషణ రూపములు 'నాల్-నల్' అనునవి. తమి-నాఌ్పదు. కన్న - నాల్వత్తు. మలయా - నాల్పదు. తెల్గు - నలుభై. తమి - నాన్నూఱు. కన్న-నాల్నూఱు. తెల్గు-నన్నూఱు.

వీనినిబట్టి 'నాల్' అనునదే (తెనుఁగు-నల్) ప్రాచీన రూపమనియు, దాని పయిని 'కు=గు' అనునది నిల్చుటచేత సంఖ్యావాచక విశేష్యరూప మేర్పడె

ననియు విశదమగుచున్నది. 'గు' అనునది ద్రావిడ సాధారణ ప్రత్యయము. ఉదా:—నల్ + గు = నజ్గు(న్గు?) = (మంచితనము). సంఖ్యావాచకములలో 'గు' ప్రత్యయము చేరినది చతుస్సంఖ్యార్థక మొక్కటి మాత్రమె. తెలుఁగు - నలుగురు = నలువురు. ఆఱుగురు = ఆఱువురు. తమి-'అఱువర్' మున్నగు మహద్వాచకములందలి గకారమునకును దీనికిని సంబంధములేదు. కాన నీ 'గు' అనునది వ్యాకరణ సిద్ధముకాదనియు నుచ్చారణార్థకమె యనియు నెఱుంగ నగును. ప్రాచీన తమిఱమున నాల్గులోని ల కారము న కారమగుట సంధి కార్య సంప్రదాయమై యున్నది. ఉదా:—ఫాల్గున = పజ్గుని. తుద భాషలో సైతము 'నాజ్క' అని యుండుటచేత నీ సంప్రదాయము మిక్కిలి ప్రాచీన కాలపుదె యని తోఁచుచున్నది. ఆధునిక తమిఱమున నిట్టి సంప్రదాయము లేదు గాని యా 'ల' కారము ఱ కారముగా మాఱుచున్నది" (కాల్డు. 33౪ పుట).

విమర్శము:—తమిఱమున 'ల' కారము 'న' కారముగా మాఱిన మాఱు నగును గాని 'నాల్కు' అను రూపము తొల్కాప్పియమున లేదు. 'నాన్కు' అనియె యందుఁ జతుస్సంఖ్యార్థక శబ్దము పేర్కొనఁబడినది. న కారమునకు జ కారాదేశము ప్రాచీన తమిఱమున నసంభవముగాన 'నాజ్కు' అను రూపము ప్రాచీన తమిఱమున లేదు. అందలి 'న' కారము ప్రాచీన తమిఱమందె 'ఱ' కారమగును.

"నాన్కన్ ఒత్తే......" (తొల్కా. ౪౪3 సూ.) = నాన్కు శబ్దమందలి న కారమునకు 'పత్తు' శబ్దపరకత్వమున ఱ కారాదేశమగును. ఉదా:— నాన్కు + పత్తు = నాఱ్పంతు = (నలువది).

ఏవో కొన్ని చోటులందు 'న' కారము ల కారముగ మాఱునని విధులును దొల్కాప్పియమునఁ గలవు.

"నాన్కన్ ఒత్తే......" (తొల్కా. ౪౯౦ సూ.) = ఆయిర శబ్దము పరమగునపుడు నాన్కు శబ్ద న కారము ల కారమగును. ఉదా:—నాన్కు + ఆయిరమ్ = నాలాయిరమ్ = (నాలుగు వేలు). తొల్కాప్పియమునకుఁ దర్వాతి ప్రాచీన తమిఱ వాఙ్మయమున 'నాల్కు' అను రూపము ప్రయుక్తమై యున్నది. ఇట్టి స్థితిలో 'నాలు-నాజ్కు' తమిఱ రూపములని వ్రాయుట సరికాదు. ఇట్లిందుఁ దొల్కాప్పియ కాలమునకే 'క' కారము శబ్దావయవముగాఁ జేరి యుండఁగా నది యుచ్చారణార్థము చేరినదనుట యుక్తమా? న కారము 'జ' కారమయ్యెడి సంధి సంప్రదాయము తమిఱమున లేదుగాన 'నాజ్కు = నాజ్గు' మున్నగు రూపములు ప్రాచీన తమిఱమున లేవు. డా. కాల్డువెల్లుగారుదా

హరించిన 'నాఱ్పదు' అనునది ప్రాచీన శబ్దముకాదు. 'పదు' శబ్దము ప్రాచీన తమిళమున లేదు. 'నాఱ్పంతు' అనునది ప్రాచీన తమిళ శబ్దము. నన్నూలు కర్త యీ యర్వాచీన 'పదు' శబ్దము నంగీకరించెను. (నన్నూలు. ౧౯౫ సూ). 'నాన్‌నూఱు' అని తమిళమున నుండ నేరదు. 'నానూఱు' అను లుప్త న కారక రూపము సాధువయి యున్నది.

"ఒన్రు ముదల్ ఒన్‌పాన్......" (తొల్కా. ౪౩౭ సూ.)=ఒకటి మొదలుగఁ దొమ్మిదివఱకుఁ గల సంఖ్యావాచకములకు 'పత్తు' శబ్దము పరమగు నపుడు, దానిలోని త కారము లోపించి యచట 'ఃః' ఆయ్‌తము నిల్చును. స్వీయ వ్యంజనముతోఁ బొట్టి 'ఉ' కారము లోపించును. మీద నుదాహరించిన ౪౪౩ సూత్రము చొప్పున నాన్కు శబ్ద న కారము ఱ కారము కాఁగా 'నాన్కు+పత్తు' అనునది 'నాఱ్పంతు' అని యేర్పడును (చూడు ౯౩ II విష. తొల్కా ౪౭౫ సూ. వివృతి).

"నాన్కుమ్ ఐన్దుమ్......" (తొల్కా. ౪౬౩ సూ.)=నూఱు శబ్దము పరమగునపుడు 'నాన్కు-ఐన్దు' శబ్దముల యనునాసికములకు మార్పులు కల్గవు. ఉదా:—నాన్కు+నూఱు=నానూఱు=(నాలుగు వందలు). "నెడి యదన్ మున్నర్......" (తొల్కా. ౧౬౧ సూ.) అను సూత్రము చొప్పున 'నాన్కు' లోని న కారము లోపించును. కాన 'నాన్‌నూఱు' అను రూపము నిల్వ నేరదు.

'ఆం. భా. వి.' కోసమున 'నాంగు అంజు' అని తమిళ రూపములు చూపఁ బడెను. తమిళమున 'సున్న' లేనేలేదు. కాల్డువెల్లుగారి నాఙ్కు అఞ్జు అనునవి యిట్లు మార్పఁబడియుండును.

౯౬. II విష:—" 'తమి-నల్-'నన్గు'=(గొప్పతనము. చక్కఁదనము). మలయా-నన్న=(చక్కఁదనము) కన్న-నల్=(మంచిది). నలి=(సంతోషము) ధాతువగునపుడు నల్=(ప్రేమించు). తమి-నల్-నణ్బు=(ప్రేమించు). తెల్గు-నలువు=(చక్కఁదనము). గ్రాంథిక తమి-నల్=(ఉదారమైన. సమృద్ధమైన).' అను రీతులనున్న 'నల్' శబ్దమునకు 'చాలా' అను నర్థము నంగీకరించినచో నీ చతుస్సంఖ్యార్థక శబ్దమునకు మూలార్థము కుదురుపడును. కిట్టెలు దొర గారు దీనికి 'సమత్వ' మర్థమనిరి. కాని యట్టి యర్థము ద్రావిడ భాషలం దెందును గానరాదు. అట్టి యర్థమున్నచో నీ వ్యుత్పత్తి మిక్కిలి యర్హమై యుండును.

ఇండో యూరపియను భాషలందుఁగాని బ్రహూయి భాషయందుఁగాని దీనిని బోలు శబ్దము కానరాదు. ఉగ్రియను ఫిన్నిషు భాషలందు మాత్రము దీని పోలికగల శబ్దములు గలవు.

| ద్రావిడ భాషలు | చెరెమిస్ భాష | మొర్డ్వివ్ భాష | ఓస్ట్రియకు భాష | వొగుల్ భాష | ఫిన్నిష్ భాష | లాపిష్ భాష | మగ్యరు భాష |
|---|---|---|---|---|---|---|---|
| నల్ - నాల్ | నిల్ | నిలె, నిలెన్ | నిల్ - నెల్ - నెడ్లె-నెద-నియెద | నిలె | నెల్ జా | నియెల్ జ్ - నెల్జె, నెల్లా | 'నేజి నెయిడ్జ్' |

(కాల్డు. 33౫ పుట).

విమర్శము:—పై వ్యుత్పత్తులు బొత్తిగా సరిపడి యుండలేదు. విజ్ఞాలింకను బరిశీలింపవలసి యున్నది. నిల్ మొదలగు పిన్నో ఉగ్రియను భాషల సంబంధము బలముగా నున్నది (చూడు ౧౦౫ I విష).

౯౭. I విష:—"ఐదు—పంచ సంఖ్యార్థక ద్రావిడ శబ్దముల పట్టిక:— (కాల్డువెల్లుగారు వారి సిద్ధాంతము చొప్పున నంతటను 'eidu=ఎయ్దు' అనియే వ్రాసిరి కాని యది సరికామింజేసి 'ఐదు' అని నేను వ్రాసితిని (చూడు) ౧౮ II విష).

| కన్నడ | తెల్గు | తమిళ | కూర్గు | మలయా | తుళు | తుద | గోందు |
|---|---|---|---|---|---|---|---|
| అయ్దు ఐదు | ఐదు | ఐన్దు - అఞ్జు (వ్యావహా) | అన్జి | అఞ్జు | ఐన్ | ఉత్ ఘ్ ఊజ్ | సెఘన్ సైయన్ (ఐయన్) |

'ఒరాఒన్' భాష మున్నగు నితర ద్రావిడ భాషలలోని పంచ సంఖ్యార్థక శబ్దములకు ద్రావిడ శబ్దముల పోలికలేదు. తెనుఁగు సమాసములలో 'ఐదు' అనుదానికి బదులుగా 'ఏను' అనునది నిల్చును. ఉదా:—పదిహేను ఇందలి హ కారము 'పదహాఱు-పదిహేడు' అనువాని యందువలెనె సంహితా వ్యవధాయక వర్ణము. తమిళమందలి 'ఐన్దు' అనునది తెనుఁగులోని 'ఐదు-ఏను' అను చోటి పరిణామ క్రమమును సూచించుచున్నది." (కాల్డు. 33౫ పుట).

"పంచ సంఖ్యార్థక ద్రావిడ విశేషణము పెక్కు ద్రావిడభాషలలోఁ 'ఐ' అను రూపముతోనె యున్నది. తెల్గు-తుద-భాషలలో 'ఏ' అను రూపముతో నున్నది. తమిళమందును నొకొక్కప్పుడు కన్నడమందును సమాసములలో

'ఐ' అనునది సానునాసికమగుచు 'ఐన్ ఐమ్' అను రూపముల నందుచుండును. ఉదా:—కన్న - ఐవత్తు=(ఏఁబది). తమి - ఐమ్బదు. తెల్గు - ఏభై. తుళు - ఐవ. కన్న - ఐన్నూఱు=(ఐదువందలు). తమి - ఐఞ్ఞూఱు. తెల్గు - ఏన్నూరు. తుళు - ఏనూదు. తమిళమందు ఐవర్=(ఐదుగురు) అనుచోట ననునాసికాగమము లేని శుద్ధమగు విశేషణరూపము కన్పట్టుచున్నది. ఐ శబ్దస్థలమందేకాక యేకాక్షరక శబ్దములు విశేషణములుగా వాడఁబడునపుడును ననునాసికాగమ మగును. ఉదా:—తమి - ఐ+న్+తిణై = ఐన్దిణై = పంచావస్థలు. ఐ+మ్+పులన్ = ఐమ్బులన్=పంచేంద్రియములు. కై+న్+నొ (నొ?) డి=కైన్నొడి=వ్రేలు మీటుట. కై+మ్+పెన్ (ణ్?)=కైమ్బెన్(ణ్?)=విధవ. 'ఐ-ఏ' వీనిలో నేది మూలరూపమో నిర్ణయింపరాకున్నది. వివిధ ద్రావిడభాషలలో నున్న 'ఐ' అనునదె మూలరూప మనఁదగును." (కాల్డు. ౩౩౯ పుట).

విమర్శము:—తెలుఁగున సమాసములలోనె 'ఏను' శబ్దము నిల్చుననుట సరికాదు. వ్యస్తసమస్తస్థలములు రెంటను 'ఏను' శబ్దము నిల్చును. మ. ఇవి యేనునన్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండు......(భార. ఆది. ౧-౨ ప). పదిహేను మున్నగువానిలోని హకారము సంహితా వ్యవధాయక వర్ణమనుట సరికాదని యీవఱకు వివరింపఁబడెను. (చూడు ౩-౨ IX విష). మఱియుఁ దెల్గున 'ఐదు-ఏను' శబ్దములెకాక 'అయిదు' శబ్దము సైతము గలదని దొరగారు వ్రాయవలసినది. కన్నడమందువలెఁగాక తెలుఁగునందు 'అయిదు' శబ్దము 'ఐదు' శబ్దముకన్న భిన్నరూపమని చెప్పవలయును. రెండును ద్రిమాత్రికములె యైనను 'ఐదు' శబ్దము ద్వ్యచ్కము. అయిదు శబ్దము త్ర్యచ్కము. కన్నడమున 'అయ్దు=ఐదు' అను రెండును ద్వ్యచ్కములె. త్రిమాత్రికములె. ఐకారమున కిట్టి ద్వివిధ స్వభావములును గలవని తొల్కాప్పియరు గారు సూత్రించి యున్నారు.

"అకరత్తిమ్బర్......" (తొల్కా. ౫౬ సూ.)=అకారమునకు వెనుక యకారము నిల్చునపు డది 'ఐ' కారమగును. ఈ రీతి కన్నడము నందలి స్థితికి సరియైయున్నది. ఉదా:—అయ్దు=ఐదు.

"అకర ఇకరమ్......" (తొల్కా. ౫౪ సూ.)=అకారమును 'ఇ' కారమునుగూడి 'ఐ' కారమగును. ఇది తెల్గునందలి స్థితికి సరిపడియున్నది. ఉదా:—అఇదు=అయిదు=ఐదు. ఈ విషయమునె వాగనుశాసనుఁడు సూత్రించెను. "ఆయి రవు ర్వక్రతమా"=అయి 'ఐ' గాను 'అవు' 'ఔ' గాను బరిణమించును. చూడు వ్యా. సం. ౩౪౩ విష).

కన్నడ సమాసములలో 'ఐదు' శబ్దపు 'దు' వర్ణలోపముమాత్రమె కల్గునుగాని యనునాసికాగమ మెన్నఁడును రానేరదు. కన్నడమున 'ఐనూ్నఱు' అను ద్విరుక్త నకారఘటితరూప ముండనేరదు. 'ఐనూఱు' అని మాత్రమె యుండును, 'అయ్‌నూఱు' అనియు వ్రాయవచ్చును.

"ద్విగౌ సంఖ్యావాచినా ముపాన్త్య వ్యఞ్జనాదే ర్లోపః. (కర్ణా. భూ. ౧౫౨ సూ.)=ద్విగు సమాసమున సంఖ్యావాచకముల యుపాన్త్యవ్యంజనము మొదల్కొన్న యవయవము లోపించును. ఉదా:—అద్ద్యు=ఐదు+సరం=అయ్‌సరం=ఐసరం=(పంచస్వరములు). తమిటమున 'ఐమ్బదు' అను రూపము తొల్కాప్పియ సమ్మతముకాదు. 'ఐమ్పంతు' అని యుండవలెను. పదు శబ్దము ప్రాచీన తమిటమున లేదు. తొల్కాప్పియము ४३౭ సూత్రము చొప్పున (చూడు ౯౭ I విష.) 'పత్తు' శబ్దము 'పంతు' అను రూపమునందును.

"ఐన్దన్ ఒఱ్ఱే......" (తొల్కా. ४४४ సూ.)=ఐన్దు శబ్దమునకు 'పత్తు' శబ్దము పరమగునపుడు సమాసమున 'ఐన్దు' శబ్ద నకారము మకారమగును. ४३౭ సూ. చొప్పున 'పత్తు' అనునది 'పంతు' అను రీతి నాయ్‌తయుక్తమగును. దువర్ణము లోపించును. ఉదా:—ఐన్దు + పత్తు = ఐమ్పంతు = (ఏఁబది). (చూడు ౯౩ II విష. తొల్కా. ४७౯ సూ).

పయిరీతినే 'ఐన్దు+నూఱు=ఐఞ్ఞూఱు' అని యేర్పడునను వ్రాఁతయు సరికాదు. తొల్కాప్పియము చొప్పున 'ఐనూఱు' అని యగును. (చూడు ౯౭ I విష.) 'ఐనూ్నఱు' అనియు నుండనగునని వ్యాఖ్యాత వ్రాసెను.

చరిత్రకందని కాలమున వీడిన ద్రావిడభాషల సంబంధమును బరిశీలించు నీ శాస్త్రమునఁ దొల్కాప్పియ కాలముననైనను లేని యాధునిక రూపములను దొరగారేల యుదాహరించుచుందురో? తెలియకున్నది.

'ఐదు - ఏను' అను వానిలో నేది మూలరూపమో నిర్ణయింపరాదని కాల్డువెల్లుగారు వ్రాసిరి. కాని 'ఐన్దు=(ఐదు)' శబ్దమె ప్రాచీనమని నిర్ణయింపనగును. వ్యవహారవశమున 'ఐ' కార మేకారమగుట స్వాభావికము. ఏకార మెచ్చటను నైకారము కానేరదు. తమిట ద్వితీయా ప్రత్యయమగు 'ఐ' అనునది తమిటాపభ్రంశమగు మలయాళమున ఎ అను రూపమునఁ బరిణమించినది కాదా? ప్రాకృతభాషలం దెల్లయెడలను 'ఐ-ఔ' లు లోపించి వానిచోట వరుసగ 'ఏ-ఓ' లే నిల్చును.

"ఐత ఏత్. (౧ పరి. ३౫ సూ.)=ఆదే రైకారస్య ఏకారో భవతి. ఉదా:—శైలః=సేలో......" మొ.

"ఐచ ఏజ్. (౧-౨-౧౧౧) = ఐచః = ఐకారౌకారయోః; ఏజ్ = ఏకారౌకారౌ యథాసంఖ్యం భవతః. ఏ-శైలః = సేలో, త్రైలోక్యమ్ = తెల్లోకమ్, ఐరావణః = ఏరావణో,"......(త్రివిక్రమదేవ ప్రాకృత శబ్దానుశాసనమ్).

ఐదుశబ్దమును నన్నయ ప్రయోగించెనని నిర్ణయింపఁజాలు ప్రయోగము లభింపలేదు. "క. పదిదినములైదు ప్రొద్దులు।......" అనునది గలదు గాని కొందఱది ప్రక్షిప్త మందురు. తిక్కనాదు లైదు శబ్దమును ధారాళముగాఁ బ్రయోగించిరి. 'ఐన్దు' అను సానునాసిక తమిళ శబ్దమును బట్టి యం దరసున్న యుండనగునను తలంపునఁ గావలయు 'ఆం. భా. చ.' కర్తగారు 'ఐఁదు' అను సార్ధబిందుక రూపమె గలదనుచు నాంధ్రమహాభారత ప్రయోగములను బెకిటిని దిద్ద యత్నించిరి. (ఆం. భా. చ. ౧-౨౧౩ పుటలు). కాని కర్ణాట మందువలెనె యిందలి యానునాసిక్య మాంధ్రుల యుచ్చారణమందును భ్రష్టమైనదేమో యని తలంపరైరి. ఆంధ్రభాషావికాసకర్తగారు భాషాచరిత్ర పంక్తులను గొన్నిటిని స్వగ్రంథమున నెక్కించికొనిరి. (చూడు ఆం. భా. వి. ౪౫౧ పుట).

"ఉ. క్రీడి తనూజుఁడైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి దిక్కుల। ల్లాడఁగఁ బోరుచో శరములా అయిదుల్ శ్రుతకీర్తి శల్యుమై।...... (భార. కర్ణ. ౧ ఆ. ౧౧౧ ప.)" అను రీతిగల ప్రయోగములను బట్టి 'అయిదు' శబ్దము తెలుఁగునఁ గలదని యంగీకరింపక తీరదు. 'ఐదు' శబ్దమె సబిందుకమైనచో దాని రూపాంతర మనఁదగు 'అయిదు' శబ్దము సబిందుకమై యుండవలసి యుండును గదా. "హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్" (ఆంధ్ర శబ్ద చింతామణి చూడు 'వ్యా. సం. ౪౮ విష). 'అయిందు' అను సబిందుక రూపము తెల్గున లేదనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు గదా? 'ఐదు' శబ్దము సార్థబిందుక మెట్లగును? ఈ రీతి నది నిర్బిందుక మగుటచేతనే యాంధ్రకోశకారు లెల్లరును ఐదు = అయిదు' శబ్దములను నిర్బిందుకములనుగానె చూపిరి. నన్నయేతర కవులు సఖండాఖండ ప్రాసమును వాడినవారయ్యు సఖండ ప్రాసమును బాటించుకోర్కె గలవారు కాకపోలేదు. కాన భాషాచరిత్ర కర్తగారీక్రింది రీతిగల యాంధ్ర కవి ప్రయోగములను మన్నింపకుండుట యుక్తము కాదు.

"ఐదు యోజనముల నతఁడొక్క పురము। భూదేవి చరణ నూపురము శ్రించి. (రంగ. రా. అయో).

శా॥ ఐదు న్నాలుగు నాఱు రెండు నిరుమూఁడక్షౌహిణుల్ సుట్టిసం।
ఛాదించెన్......(భాగ. ౧౦ స్కం. పూ. ౧౫౩౦ ప. సూ. రా. ని).

౯౭. II విష:—"సంస్కృత 'పఞ్చన్' శబ్దమునకును దమిళ మలయాళములలోని 'అఞ్జు' శబ్దమునకును బలమైన పోలిక చూపట్టుచున్నది.

కాని 'నన్నూలు' మున్నగు వానిలో నియ్యది సంగ్రహింపఁబడలేదు. క్రీ. శ. ౩-౪ శతాబ్దముల నాఁటి దనఁబడుచున్న 'కుఱళ్' అను గ్రంథమున నది ప్రయుక్తమై యున్నది. మలయాళమున 'అఞ్జు' అనునది మాత్రమె పంచ సంఖ్యార్థక శబ్దము. సంస్కృత 'పఞ్చ' శబ్దములోని యాదిమ 'ప' కారము లోపింపఁగా 'అఞ్జు' శబ్దమేర్పడియుండుననియు నదియే 'ఐన్దు-ఐదు' శబ్దములకుఁ బ్రకృతి కానోపుననియుఁ గొందఱు తలంచుట కవకాశము కల్గియున్నది. కాని యింగ్లీషులోని 'one'=(వన్) అనునదియు మలయాళములోని 'ఒన్' అను నదియుఁ బరస్పరము పోలియున్నను వాని సంబంధమును నిర్ణయించుట కాపోలిక యెట్లు సమర్థము కాదో? అట్లే యితర ద్రావిడ పంచ సంఖ్యార్థక శబ్దములను బట్టి వాని పోలిక తదీయ సంబంధమును నిర్ణయింప సమర్థము కాదని గ్రహింప నగును" (కాల్డు. ౩౩౬, ౩౩౭ పుటలు).

"'ఐ-ఏ' అను పంచ సంఖ్యార్థక ద్రావిడ విశేషణము పైని 'దు' అనెడి 'అదు' శబ్ద సంక్షేప రూపమనఁదగు నపుంసక ప్రత్యయము నిల్వఁగా 'ఐదు' అను విశేష్యరూప మేర్పడును. ఎరడు శబ్దములోని 'డు' అను దాని కీ 'దు' ప్రత్యయము రూపాంతరము. ఈ 'ఐదు' శబ్దము విశేషణముగా సైతము ప్రయుక్తమగును (ఐదు పుస్తకములు). ఇం దుచ్చారణార్థ కానునాసికాగమము నిల్వఁగా 'ఐన్దు' అని యేర్పడెను. కన్నడ భూతకాలిక క్రియా జన్య విశేషణములలోని 'ఎదు' అనునది తమిఌమున 'న్దు' అని యేర్పడ లేదా? ఉదా:—కన్న-అలెదు= తమి-అలైన్దు=(తిరిగినది) ఇట్లేర్పడిన 'ఐన్దు' అనునది 'అఞ్జు' అని పరిణమించుట కేవలము స్వాభావికమై యున్నది. ఉదా:—తమి-పఱైన్దాన్. మల-పఱఞ్ఞు= (చెప్పెను).

'న్దు' అనునది కొన్ని యెడల మలయాళమున 'న్న' అను రూపము నొందును. తమి-నడన్దు=(నడచి). మల-నడన్ను. ఈ పద్ధతి చొప్పుననె 'తమి-ఐన్దు' అను దానినుండి 'ఐను' అను తుళు రూపమును 'ఏను' అను తెలుఁగు రూపమును నేర్పడెను" (కాల్డు. ౩౩౭, ౩౩౮ పుటలు).

"ఈ 'ఐదు' శబ్దమునకు సిథియను భాషలగు 'ఫినిష్-ఉగ్రియను' భాషల శబ్దముల పోలికలు గలవు.

| వోగుల్ భాష | ఓష్టియకు భాష | మగ్యారు భాష |
|---|---|---|
| అత్ | వెత్ = వుయెత్ | ఒత్-ఎత్ |

ఇట్టి పోలిక యాదృచ్ఛికమె కాని సహజము కాదు. ఉగ్రియను భాషలలోని తకార మావయవికమై యుండఁగా 'ఐదు' అను ద్రావిడ శబ్దములోని 'దు' వర్ణము ప్రత్యయ సంబంధియై యున్నది. చీనా భాషలోని పంచ సంఖ్యార్థకమగు 'ఉ' అను దాని సంబంధము కొంత పరిశీలింపఁదగినది'' (కాల్డు. ౩౩౭, ౩౩౮ పుటలు).

విమర్శము:—'కుఱళ్' అను తమిళ గ్రంథము క్రీ. శ. ౩-౪ శతాబ్దముల నాఁటిదనుట సరికాదు. ఇది తొల్కాప్పియమునకుఁ దర్వాతిది. (చూడు ౧౦-౧౫ IV విభ). తెల్గు-వస్తాను మున్నగువానివలెఁ దమిళమున నిది యపభ్రష్టరూపము గాన నట్టి 'అఞ్జు' రూపము వైయాకరణ సమ్మతము కాదయ్యెను. 'అఞ్జు' అను దీనికి సంస్కృత పంచశబ్దముతోడి పోలిక యాదృచ్ఛికము. ఐన్దు శబ్దము దీనికిఁ బ్రకృతి యనుట యంతకన్న మిక్కిలి స్వాభావికము. 'ఒన్-ఇరన్-మూన్-నాన్-ఐన్' అనునాంత శబ్దములును వానిపై నిల్చు 'అదు' శబ్దసంక్షేపమగు 'దు' అను నమహత్ప్రత్యయమును కేవల ద్రావిడభాషా సంబంధులనుట యెంతయు విశ్వాసనీయమై యున్నది.

౯౭. III విభ:—ఐన్దు శబ్దము వ్యుత్పత్తి:—''ఇండో యూరపియను భాషలలోని దశ సంఖ్యావాచకము 'రెండు చేతులు' అను నర్థముగల తైహన్=(Two hands) అను మెసోగాతిక భాషా శబ్దమునుండి యేర్పడెనని లెప్సియస్ దొరగారు వ్రాసిరి. ఈ పద్ధతి చొప్పున 'కై' అను ద్రావిడశబ్దమైదు వ్రేళ్ళుగల చేతికి వాచకము గాన నద్దానినుండి కకార లోపమున 'ఐ' శబ్దమేర్పడె ననఁదగును. కాని యిది యిట్లేర్పడెననుటకును 'ఐ' శబ్దము కకార పూర్వకమై యుండెననుటకును నిదర్శనము లేవియు లేవు.

మార్గాంతరమునను దీని వ్యుత్పత్తి చెప్పవచ్చును. 'ఐ' అను ద్రావిడ ధాతువునకు 'పరస్పరము సమీపించి నిల్చు=వెంబడించు' అని యర్థముగాన నీ ధాతు వైదింటిని జూపుట కెత్తఁబడిన పరస్పరము సన్నిహితములై యుండు వ్రేళ్ళయిదింటిని సూచించును గాన నిది పంచ సంఖ్యార్థకము కానోపుననియు దాని పైని 'దు' అను నమహత్ప్రత్యయము నిల్చుటచే 'ఐదు' శబ్ద మేర్పడు ననియు నూహింపనగును ('ఐ' అను ద్రావిడ ధాతువు కాని దానికట్టి యర్థములు గాని కానరావు. వే. వేం. రెడ్డిగారు ౨౦-౫-౫౩).

డా. కిట్టెలు దొరగారును 'అయ్దు' శబ్దమునకు సంస్కృత పంచ శబ్దముతో సంబంధము లేదనియు 'అయ్దు=(లభించు)' అను ధాతువునుండి 'అయ్న్దు=అఞ్జు' శబ్ద మేర్పడుననియు వచించిరి. (చూడు ఇండియన్ ఆంటిక్వేరి-౧౮౭౩

జనవరి). 'అయ్ + దు = అయ్+న్+దు=అయ్న్దు=అఞ్జు' అని యేర్పడు ననిరి. పంచ సంఖ్యార్థకశబ్దము కన్నడభాషలో 'అద్యు' అనియే యుండుటను బట్టి 'అయ్' అనియే వ్రాయఁబడెను. కాని 'ఐ' అను దానికే ప్రాచుర్యము గలదు. (ఐదు). తక్కిన ద్రావిడ భాషలలో సైతము 'ఐ' అను రూపమె వాడుకలో నున్నది. దీర్ఘాచ్కములగు 'మీ=మియ్-బే=బెయ్' మున్నగు ధాతువులపైని 'దు' వర్ణకము నిల్చునపుడు ధాత్వాది దీర్ఘము హ్రస్వమై దానికిఁ బరముగ నున్న నిల్చును. మీ-మిందు=స్నానము చేసిన. బే-బెందు= వేచిన. (ఇట్లే 'ఐ=అయ్' ధాతువునుండి 'ఐన్దు=అఞ్జు' అను రూపమేర్పడెనని భావము). 'తమి-వే-(వేఁగు) వెందు=వేఁచిన.' అను రూపము కలదు గాని మీ-మియ్=(స్నానము చేయు) అను ధాతువు తమిళమున లేదు. కాని 'నీన్దు=ఈఁదు' అను ధాతువు గలదు.

పయి రీతిని 'అయ్=లభించు' అను ధాతువునుండి డా. కిట్టెలు దొరగారు చూపిన వ్యుత్పత్తి సరిగా నున్నట్లు నాకుఁ దోఁచలేదు. ఇది తమిళమున 'చేరు-లభించు' అను నర్థములతో 'ఎద్యు' అను రూపమున నున్నది. కన్నడమందలి ఇసు ధాతువువలెనె తమిళమున 'ఎయ్' ధాతువు 'త్రోయు' అను నర్థము గల్గియున్నది. ఇట్టి ధాత్వర్థము లెవ్వియుఁ బయిని వ్రాసిన పంచ సంఖ్యార్థక శబ్ద వ్యుత్పత్త్యర్థములకు సరిపడవుగదా" (కాల్డు. 33౨-33౯ పు).

విమర్శము:—డా. కిట్టెలుగారి వ్యుత్పత్తి సరికాదనుచు కాల్డువెల్లుగారు నిశ్చయించిన 'ఐ=వెంబడించు' అను వ్యుత్పత్తి మాత్రమేమి సరిగానున్నది! అట్టి యర్థముగల ధాతువును దమిళమునఁ గానరాదు. పరిశీలింపఁగాఁ గాల్డువెల్లుగా రుపేక్ష్యమని తలంచిన 'కై' శబ్దమూలక వ్యుత్పత్తియె కొంత సరిగా నున్నది. తెలుఁగు దేశములో 'చేయి-చేతి+ఏఁడు=చేతేఁడు' అనఁగా 'పంచసంఖ్య' అను నర్థము సుప్రసిద్ధమై యున్నది. 'చేతేఁడు కాయలు' అనఁగా నయిదు కాయలనియు నూటికిరువది చేతులనియుఁ బ్రసిద్ధమగు వాడుక గలదు. ఎల్ల శబ్దములకును వ్యుత్పత్తులు చెప్పెడి సంప్రదాయముగల సంస్కృతమందును సంఖ్యావాచక వ్యుత్పత్తులు మున్నగు కొన్ని యిట్లె యర్థవిషయమున నసంతుష్టి కరముగానె యుండును. శబ్దరూపసాధనమె యట్టి వ్యుత్పత్తులకుఁ బ్రయోజన మనఁదగును. సంస్కృతమందలి యేకద్విత్రి శబ్దముల వ్యుత్పత్తు లీ వఱకె చూపఁబడెను. (చూడు ౯-౫ II విష). 'పఞ్చన్-దశన్' అనువాని వ్యుత్పత్తు లిటఁ జూపఁబడుచున్నవి. "పఞ్చన్-త్రి. పచి విస్తారే. (పచి+అని) పఞ్చ సంఖ్యాయుక్తే" "దశన్-త్రి-(దన్శ+కనిన్) దన్శ-దంశనే. (దశ) సంఖ్యా విశేషే" (శబ్దస్తో).

'అద్యు=ఐదు' అను కన్నడ రూపముల కేదో భేదమున్నట్లు కాల్డువెల్లు గారు వ్రాయుట వింతగ నున్నది. 'అయ్' అను దానికిని 'ఐ' అను దానికిని లిపిలోని భేదముతప్ప నుచ్చారణమున భేదములేదు. ఉచ్చారణమున 'ఐ=అయ్' అనునవి రెండును నేకరీతినే వినబడును. "ద్విగౌ సంఖ్యావాచినా ముపాన్త్య వ్యఞ్జనాదే ర్లోపః." (కర్ణా. భూ. ౧౫౨ సూ.)=ద్విగుసమాసమున సంఖ్యా వాచకముల యుపాంత్యవ్యంజనము మొదలుకొన్న యవయవము లోపించును ఉదా:—...అద్యు=ఐదు+సరం=ఐసరం. మొ. అద్యు శబ్దమందును 'ఐదు' శబ్దమందును నుపాంత్య హల్లనఁగా నంత్య సమీప హల్లు 'ద' కారమె యగును గదా. అట్టి దకారము మొదలుకొన్న భాగము లోపింపఁగా నేర్పడు 'అయ్ సరం=ఐసరం' అను వానికి భేదము లేదుగదా. తెలుఁగు భాషయందలి 'అయిదు' అనునది వీనికిఁ గేవలము భిన్నము. ఇందును మాత్రా భేదములేదు గాని స్వరసంఖ్యా భేదము గలదు. 'అద్యు=ఐదు' అనునవి ద్విస్వరికములు త్రిమాత్రికములు. 'అయిదు' అనునది త్రిమాత్రికము త్రిస్వరకము (చూడు ౯౭ I విష). "ఉ......అ। ల్లాడఁగఁ బోరుచో శరము లాఁఅయిదుల్ శ్రుత కీర్తి శల్యుపై।" అనుచో 'ఐదు' అని (అద్యు తెల్గున లేదు) నిల్పినచో ఛందో భంగమగును. మాత్రా గణచ్ఛందః పద్యములలో నిట్టి చిక్కు గల్గనేరదు.

"క॥ పది దినము లైదు ప్రొద్దులు।......"

అనుచో 'పది దినము లయిదు ప్రొద్దులు' అని పఠించినను బాధలేదు.

౯౦. I విష:—"ఆఱు:—షట్సంఖ్యార్థక ద్రావిడ శబ్దముల పట్టిక.

| తమిళ | కన్నడ | తెల్గు | మలయాళ | తుద | గోండు | తుళు |
|---|---|---|---|---|---|---|
| ఆఱు | ఆఱు | ఆఱు | ఆఱు | ఆర్ | సారూన్ | ఆజి (ఱ=జ) |

కన్నడములోని 'మూఱు' అనునది 'మూజి' అని యేర్పడినట్లె 'ఆఱు' అనునది తుళుభాషలో 'ఆజి' అని యేర్పడును. ఈ యాఱు శబ్దము నాద్యచ్చు హ్రస్వమగుటచేత విశేషణరూప మేర్పడును. కొన్నియెడల నీమాత్రపు భేదమును విశేషణత్వ విషయమున నగపడదు. తమి-అఱుబదు. కన్న-అరవత్తు. తుళు-అజిప. తెలుఁగు-అఱువై. ఇట్లు వీనిలో నాద్యచ్చు హ్రస్వముగ నున్నను, కన్న-ఆరునూరు. తుళు-ఆజినూదు. తెలుఁగు-ఆర్నూరు మున్నగు సమాసము లలో దీర్ఘరూపమే చూపట్టుచున్నది. తమి - అఱునూఱు = (ఆఱునూఱ్లు)

ఆఱాయిరమ్=(ఆఱువేలు). వీనిలో హ్రస్వ దీర్ఘభేదమున్నపుడు హ్రస్వమా ద్యచ్చుగనుండు విశేషణ శబ్దమె మూలరూపమని గ్రహింపవలెను. 'ఒన్దు-ఇరణ్డు-ఐన్దు' అనువానిలో 'దు' ప్రత్యయమును, 'నాల్కు' అనుదానిలో 'హు' ప్రత్యయమును (తమిళమున హకారమె లేదు. 'కు' అని కాఁబోలు?) నిల్చును. 'ఆఱు-వేలు' అనువానిలో విశేషణ రూపములోని హ్రస్వ మగు నాద్యచ్చు దీర్ఘమగుటచేత నవి విశేష్యములయ్యెనని యెఱుఁగునది.'' (కాల్డు. ౩౮౦ పుట).

విమర్శము:—'ఆఱు - నూఱు' అనునవి ఱకారఘటితములు. దొరగారి వ్రాఁతలో నట్టి నియమము లేదు. ఒకపుడు రేఫమును మఱొకపుడు ఱకార మును నిట్లు యథేష్టముగా వ్రాసిరి. తెనుఁగున 'అఱువది' అను చోటుదప్ప నెల్లెడలను విశేషణత్వము నందును దీర్ఘాద్యచ్కమగు 'ఆఱు' శబ్దమె నిల్చును. ఉదా:—ఆఱేండ్లు-ఆఱుపదులు-ఆఱునూర్లు-ఆఱువేలు - మొ. కన్నడమందును హల్పరకత్వమున మాత్రము పాక్షికహ్రస్వము నిల్చును. ''ఆఱోః. (కర్ణాట శబ్దా ౩౹౨౹౫ సూ.)='ఆఱు' ఇత్యస్య హ్రస్వాదేశో వా భవతి వ్యఞ్జనాదా వుత్తర పదే పరే; న ద్వన్ద్వసమాసే. మొ-వరితు నిత్యమ్.'' ప్రయోగ-అఱుగావుదం= ఆఱుగావుదం=(ఆఱు క్రోసులు). 'అఱుమె=(ఆఱుసార్లు) అఱువర్=' (ఆఱు వురు) అను స్థలములందు మాత్రమె నిత్యము. ద్వంద్వ - ఆఱేటు=(ఆఱేడులు) స్వర పరకత్వమున హ్రస్వము రాదు-ఆఱానె=(ఆఱేనుఁగులు). తమిళమందును సంఖ్యావాచక పరిమాణవాచక పరకత్వమున హ్రస్వము వచ్చునని మాత్రము తొల్కాప్పియమున నున్నది. (ఇతర హల్ పరకత్వనందును బాక్షికముగ నగునని వ్యాఖ్య) (చూడుడు ౯౩ II విష. తొల్కా. ౪౭౯ సూ.) ఉదా:—ఆఱు+పత్తు= అఱుపఃితు = (అఱువది). ఆఱు + నూఱు = అఱునూఱు = (ఆఱువందలు). ఆఱు + ఆయిరమ్ = అఱాయిరమ్ = (ఆఱువేలు). 'అఱాయిరమ్' అనునది యర్వాచీనము. ఇందులకుఁ బ్రమాణము తొల్కాప్పియ సూత్ర మీ క్రింద నుదాహరింపఁబడును. హలాది పరిమాణార్థకశబ్ద పరకత్వమందును 'ఆఱు' శబ్దాద్యచ్చు హ్రస్వమగునని తొల్కాప్పియమున సూత్రింపఁబడెను. ఉదా:— ఆఱు + కలమ్ = అఱుకలమ్ = (ఆఱుకలముల కొలతగలది). అజాది శబ్ద పర కత్వమున రాదు. ఉదా:—ఆఱు+ఉటక్కు—ఆఱుటక్కు=(ఆఱుఉటక్కుల పరిమితి) ఆఱు+ఆటాక్కు=ఆఱాక్కు=(ఆఱు ఆఱాక్కుల పరిమితి) ఇట్లగుటచేత ద్రావిడ భాషలందెల్ల విశేషణరూపమునఁ బదాది హ్రస్వముండునని దొరగారు వ్రాయుట సరికాదు (చూడుడు ఆం.భా.వి.౪౪౫-౪౪౬ పుటలోని పొరపాటులు).

మఱియు నీ విషయమున దొరగా రుదాహరించిన యపశబ్దములు:— 'తమి-అఱుబదు'. ఇది యపశబ్దము. తొల్కాప్పియమున 'అఱుపఃితు' అని

యుండవలెను. 'అరవత్తు' అను కన్నడోదాహృతియు సరికాదు. చూడు ఆం. భా. వి. ౪౪౬ పుట.) 'అఱువత్తు' అనునది సాధురూపము. 'అఱువై' అను నాంధ్రోదాహరణము సరికాదు. గ్రాంధిక రూపము 'అఱువది'. వ్యావహారిక రూపము 'అరవై' అనునది. తమిళమున ఆఱాయిరమ్=(ఆఱువేలు) అను నాద్యచ్చు దీర్ఘముగా నుండుననుటయుఁ బ్రామాదికమె. 'అఱాయిరమ్' అనియే యుండును.

"ఆఱన్మరుజ్కిల్......" (తొల్కా. ౪౭౦ సూ.)=ఆఱు శబ్దమునుండి వచ్చిన 'అఱు' శబ్దము తుది 'ఉ' కారము 'ఆయిర' శబ్దపరకత్వమున లోపించును. ఉదా:—ఆఱు+ఆయిరమ్=అఱాయిరమ్. తమి 'ఐన్దు' మున్నగువాని తుదిని 'దు' ప్రత్యయమువలెనె (తమి) 'నాలుకు' శబ్దము తుదిని 'హు' ప్రత్యయము నిల్చెననుట ప్రత్యక్ష విరుద్ధము. అచట 'కు' ప్రత్యయము నిల్చెననుట యర్థము. తమిళమున 'హ' అను వర్ణమే లేదు.

౯౮. II విష:—"ఆఱుశబ్దపు వ్యుత్పత్తి:—ప్రాచీన కన్నడమున 'ఆఱు' శబ్దమునకు 'బలిష్ఠమైనది' అని యర్థము. కావున 'మునుపున్న దానిలో మఱొకటి చేరుట' అను నర్థముచే నీ శబ్దమేర్పడెనని కిట్టెలుగారు వ్రాసిరి. శబ్దమణి దర్పణమున నాఱు ధాతువున కిచ్చిన యర్థములలో నిది యొకటి. 'తడియెండు' అనునది రెండవ యర్థము. ఈ రెండవ యర్థము ద్రావిడభాషా సామాన్యము. 'అఱు' అని హ్రస్వాద్యచ్కమగు ధాతువును గలదు. కాని దీనికట్టి యర్థములు లేవు. ఇది ఛేదనార్థకము. 'ఆఱు' అను సంఖ్యా పరమగు నర్థమునకును దీనికిని సంబంధము స్పష్టముగా లేదుగాని యీ రెండిటి కిని నేదో యొక సంబంధము గలదని యూహింపవచ్చును. కానఁ బదిలోని రెండవ సగపు భాగము రెండవ చేతితోఁ జూప నారంభింపఁబడునని ద్రావిడు లుద్దేశించి యుందురు. షట్ సంఖ్యార్థక సిథియను భాషా శబ్దముల పోలికలు:—

| మగ్యారు భాష | టర్కీ భాష | లాపిష్ భాష | ఫిన్నిష్ భాష | చెరెమిస్ |
|---|---|---|---|---|
| హాత్ | ఆల్తి-ఆల్తై | కొత్ | కుఉత్-కఉసి | కుత్ |

టర్కీ భాషలోని 'ఆల్తి' అనుదానిలోని లకారము సిథియను భాషా సంప్రదాయము చొప్పున రేఫమగును గాన 'ఆఱ్' అనుదాని పోలిక గలదన వలసెను. టర్కిషు భాషలలోని 'ఆల్తి' అనుదానికిని మగ్యారు భాషలోని 'హాత్' అనుదానికిని సంబంధముండి యుండును. కాని యీ పోలిక యసందిగ్ధ

ముగ లేదు. ‘హాత్’ అనునది పరుషాదివై యుండవచ్చును” (కాల్డ్వె. ౩౮౦, ౩౮౧ పుటలు).

విమర్శము:—ఆఱుశబ్దపు వ్యుత్పత్తి బొత్తిగా సరిపడదు. ‘ఆఱు=నిర్ద్రవే-సమర్థత్వే’ (శబ్దమణి దర్పణ ధాతుపాఠము) ఇట్టి శబ్దముతోఁ బోలికను జూపక దీనికి సంబంధి యనుచు ఛేదనార్థకమగు ‘అఱు’ ధాతువును మూలముగాఁ జూపుట సరికాదు. మఱియు నట్టి వ్యుత్పత్త్యర్థమును బ్రకృతమునకు సరివై యుండలేదు.

‘ఒన్దు=ఒన్ఱు ఇరణ్డు-మూన్దు=మూన్ఱు-ఐన్దు-ఎణ్టు’ అనువానిలో వలెనె ‘అదు’ శబ్దసంక్షేపమగు ‘తు=దు’ అను నమహత్ప్రత్యయము ‘ఒన్-ఇరన్-మూన్-నాన్-ఐన్-ఎన్’ అనువానిమీఁదవలెనె ‘ఆన్-ఏన్’ అనువానిమీఁద సైతము నిల్చుటచేత ‘ఆఱు-ఏఴు’ అనునవి యేర్పడెననుట సంభావ్యమై యుండును. ఆన్=తు = ఆన్ఱు = ఆఱు =(షట్ సంఖ్య) (మూఱు=శబ్దవలెనె). ఏన్ + తు = ఏఴు = (సప్తసంఖ్య). వ్యుత్పత్తి-‘ఆఱు’ = ‘నది’ అనునది మూల శబ్దము. ద్రావిడదేశములోఁ బ్రసిద్ధములైన నదులు ‘ఆఱు’.

౯౯. I విష:—“ఏడు: సప్తసంఖ్యార్థక ద్రావిడ శబ్దముల పట్టిక:—

| తమిళ | మలయా | కన్నడ | తుళు | తెలుఁగు | తుద | మహాదేవో గోండు | సెయొని గోండు |
|---|---|---|---|---|---|---|---|
| ఏఴు | ఏఴు | ఏళు | ఏళ్ | ఏడు | ఏళ్ఘు | యేనో=యేతూ | ఏరో |

తమిళములోఁ బ్రాచీనరూపము ‘ఎఴుమై’ అనునది గలదు. తెనుఁగు డెబ్బది-ఏడువందలు’ అనువానిలో ‘ఏడు’ శబ్దమున నించుక మార్పుగలదు. తమిళమున ‘ఆఱు’ శబ్దము చోటవలెనె ‘ఏఴు’ శబ్దపు విశేషణరూపమున నాద్యచ్చు ‘ఎఴు’ అనురీతిని హ్రస్వత నందును. తుళు-ఎళ్‌ప = డెబ్బది. ఏళ్‌నూదు=ఏడువందలు. తెనుఁగు-ఏళ్‌నూఱు=డెభై =‘ఎడుభై’ అనుదాని నుండి వర్ణవ్యత్యయ వికృతిచే నేర్పడెను. ఈ ‘ఎడుభై’ అనునది తమిళ కన్నడ ములలోని యాద్యచ్చు హ్రస్వమునకు సరియయి యున్నది. పయివాని నరయఁగా ‘ఎఴు’ అనునదే దీనిమూలరూపమని తోఁచును. ‘తమి-ఏఴు=ఎక్కు’ అనుధాతువు గలదు. కావున ‘ఆఱిటికన్న నొకటి హెచ్చినా’ దని దీని వ్యుత్పత్త్యర్థము. రెండవచేతి వ్రేళ్ళలోని రెండవ వ్రేలిని గలిపి చూపెడి సంఖ్య యని యర్థము నరయునది.

'ఏఱు=ఏడు=ఏళు' అను వానిలోని 'ఱ-డ-ళ' లలో నేది ప్రాచీనమో నిర్ణయింపరాదు. తమిళ భాషలో ఱకారము ళకారముగా మాఱుట ప్రచుర మగుటచేతను గోండు భాషలో నంతకన్నఁ బ్రచురముగా న కారముగ మాఱు చుండుటచేతను దమిళ ఱకారమె ప్రాచీన మనఁదగును. కాని యీ ఱ-డ-ళ లు మూఁడును వేఱొక ప్రాచీనధ్వనియొక్క వ్రాఁతలోని మార్పులే యనుట సంభావ్యముగా నుండును" (కాల్డు. ౩౮౧-౩౮౨ పుటలు).

విమర్శము:—హాఁసగన్నడమునందలి 'ఏళు' అను రూపమె ప్రాచీన మనుకొని కర్ణాటరూపము 'ఏళు' అని చూపుట యుక్తముకాదు. 'ఏఱు' అను నదే ప్రాచీన కర్ణాట వాఙ్మయమునఁ బ్రచురమైయున్నది. కన్నడమందు 'ఏఱు' శబ్దమునకు (సమాసమున) విశేషణత్వమున హ్రస్వమురాదు. అంత్యస్వర లోపము పాక్షికముగఁ గల్గును. తమిళమున మాత్రము విశేషణత్వమున నాద్యచ్చు హ్రస్వమగును.

"సప్తాభిధాయినశ్చ." (కర్ణా. భూ. ౧౫౮ సూ.)=సప్తసంఖ్యార్థకమగు 'ఏఱు' శబ్దముయొక్క యుపాన్త్య హల్లు లోపింపదు. (అంత్యాచ్చు లోపించును). ఉదా:—ఏఱు+కడల్ = ఏఱ్కడల్ = సప్త సముద్రములు. ఏఱు+మొఱం= ఏఱ్మొఱం=(ఏడుమూరలు.)

కం. అకుఱం లోపం నాల్కై। దకఱఁత్య క్కాఱటాది యొళ్ హ్రస్వంతా। నకుఱమ దేఱక్కేఁటెం। దకుఱం చరమక్కె లోపమెంటకఱఁక్కుం (శబ్దమణి దర్పణము ౧౫౯ ప.) (ఏఱకేఁటల్ = ఏఱునకు 'ఏఱ్' అనునది యగును) ప్రయోగ - ఏఱ్పత్తు=(డెబ్బది) ఏఱ్కడల్=(సప్త సముద్రములు).

"లుప్ సాసిరైఱోః. (కర్ణాటశబ్దా-౩౫౬ సూ.)=(వృత్తి) 'సాసిర-ఏఱు. ఇత్యేతయోః లుప్ భవతి-వ్యఞ్జనాదా వుత్తరపదే పరే. న ద్వంద్వ సమాసే. మె-వరితు నిత్యమ్. ప్రయోగః - సాసిర్దలెయం=(సహస్రశిరుఁడు) సాసిరద లెయం.......ఏఱ్గయ్యం=ఏఱుగయ్యం (సప్త హస్తుఁడు)".

పయి కర్ణాటవ్యాకరణ సూత్రములచొప్పున 'ఏఱు' శబ్దమునకు వ్యంజ నాదియగు నుత్తరపదము పరమగునపు డంత్యాచ్చు పాక్షికముగ లోపించును. ఆద్యచ్చునకు హ్రస్వము కర్ణాటభాషలో లేదు. ఇట్లు భాషావికాసమున "'ఏళు' విశేష్యము. 'ఏ' విశేషణము" అని వ్రాయుట పొరపాటు.

ప్రాచీన కర్ణాటమున 'ఏఱు' అనియుండఁగా హాఁసగన్నడమున నద్దాని వికృతి 'ఏళు' అని యుండఁగా నం దేది ప్రాచీనమని దొరగారు వికల్పించుట చాల వింతగ నున్నది. ఇంక 'డ ఱ' ల విషయమున వికల్పించిన వికల్పింప

వచ్చును. 'డ' కారము నీషత్స్పృష్టముగాఁ బల్కినచో నది ళకారమగును. (చూడు ౧౭ IX విష.) ఒకప్పుడు డకారమునుండి ళకార ముత్పత్తిల్ల వచ్చును. కొన్ని యెడల ళ కారమునుండి డ కారము జనింపవచ్చును.

'తమి-ఏళు (ఎళు?) = ఎక్కు' అను ధాతువును మూలముగఁ గొని దొరగారు చూపిన వ్యుత్పత్తి సైతము రూప సాధనయోగ్యమె యనఁదగును. వ్యుత్పత్త్యర్థమంత సంతుష్టిగ లేదు.

'ఏన్ + తు = ఏడు = ఏళు' అని 'ఏన్' శబ్దము మూలమనుట లెస్స, (చూడు ఆఱు శబ్ద వ్యుత్పత్తి—౯౮ II విష). సంఖ్యావాచకము లన్నియు నాంతములు. 'తు' అను సమహత్ప్రత్యయము నిల్చుటచేత 'ఒన్దు' మున్నగునవి యేర్పడినట్లె 'ఏళు' శబ్దమును నేర్పడియుండును. 'ఏ' అను నక్షరము 'ఏడవది' గాన 'ఏడు' అనునది సప్త సంఖ్యావాచి యయ్యెననుట లెస్స. 'డ'కారమును దుఃస్పృష్టముగాఁ బల్కినచో 'ళ' వర్ణమగును (చూడు ౧౭ XI విష).

౯౯. II విష:—"ఏళు శబ్దమునకుఁ గల యీ క్రింది సిథియను భాషల పోలికలు విశ్వసనీయములుగా నుండలేదు:—

| తెలుఁగు | టర్కిష్ | యార్కండు టర్కిషు | మగ్యార్ | ఆర్మీనియన్ | తిహిషియన్ | లాపిష్ | ఫిన్నిష్ |
|---|---|---|---|---|---|---|---|
| ఏడు | యేది | యెత్తహ | హెత్ | యెత్ను | హెతు | కియెత్య | సెయిత్ |

"మగ్యారు భాషలోని 'హ' కారమును 'టర్కిష్' భాషలోని 'య' కారమును నభిన్నములె. కాని యీ రెండును నొక పరుషధ్వనినుండి యేర్పడిన వని 'మగ్యార్' భాషలోని 'హెత్' అను దానిని లాపిషు భాషలోని 'కియెత్య' అను దానితోను ఫిన్నిషు భాషలోని 'సెయిత్' అను దానితోను బోల్చి చూచినపుడు తెలియఁగలదు" (కాల్డు. ౩౮-౯ పుట).

విమర్శము:—పై విషయములందు దొరగారు చెప్పినదె వేదమనుట లెస్స.

౧౦౦. I విష:—"ఎనిమిది:—అష్ట సంఖ్యావాచకమగు 'ఎట్టు' అను తమిళ శబ్ద మిండోయూరపియను భాషలలోని లాటిన్ భాషయందలి 'అక్టో' (ఒక్టో) అను శబ్దముతోను గాథిక్ భాషయందలి 'అహ్తౌ' అను శబ్దతోను నత్యధికమగు సామ్యము గల్గియున్నది. ఇది ముఖ్యముగా సంస్కృతమందలి 'అష్టన్' శబ్దమునుండి యేర్పడిన 'అట్ట' అను దానినుండి వెలసినదని తలంపఁ బడుచున్నది. కాని వెనుక 'పఞ్చన్ = అఞ్జ' అను శబ్దము విషయమున

(౯-౭ II విష. చూడు) వ్రాసినట్లు యింగ్లీషు భాషలోని ‘one=(వన్)=ఒన్న్’ అను శబ్దముల పోలికవలెనె వీని సామ్యమును యాదృచ్ఛికమె యని సూక్ష్మ పరిశీలనమున విశదము కాఁగలదు.

అష్ట సంఖ్యార్థక ద్రావిడ విశేష్య శబ్దముల పట్టిక:—

| తమిఴ | మలయా॰ | కన్నడ | తెల్గు | తుళు | గోండు | తుద | మాడి |
|---|---|---|---|---|---|---|---|
| ఎట్టు | ఎట్టు | ఎణ్టు | ఎనిమిది<br>ఎన్మిది | ఎణ్మ | అర్మార్<br>అనుమర్ | ఎట్ట్ | ఎర్మది |

దీని విశేషణ శబ్దము తమిఴమున ‘ఎణ్’ అనునది. ఉదా:—ఎణ్బదు=(ఎనుబది) ఎణ్నూఱు=(ఎనిమిది వందలు) ఎణ్కణ్ణన్=(ఎనిమిది కన్నులుగల బ్రహ్మ) ఎణ్ ఏఴు=(ఎనిమిదేళ్ళు=౫౬). కన్నడ విశేషణ రూపము-ఎణ్-ఉదా:—ఎణ్వర్=(ఎనమండ్రు)=‘ఎమ్బర్’ అను రూపమున నోష్ఠ్య సంపర్కముచే బకార మేర్పడెను. (కన్నడమున ‘వ=బ’. ఎణ్బర్-కర్ణాటక శబ్దా. ౩౪౧ సూ. వృత్తి-వ్యాఖ్య) ఎణ్టునూఱు=(ఎనిమిది వందలు). ఇట ‘ఎణ్టు’ అను విశేష్య రూపమె విశేషణముగా వాడఁబడుచున్నది. తుళు భాషలోని ‘ఎణ్బ’=(ఎనుబది) అను దానిలోని ‘ఎణ్’ అనునదియె విశేషణ రూపమనఁదగును. “తుళు భాషలోని ‘ఎణ్మ’ అను దానియందలి మకారము దశ శబ్దార్థకము కాదు. అది విశేష్యములపై నిల్చు ప్రత్యయము. తమిఴ భావార్థకము—‘మై’ శబ్దము. తుళు కన్నడ భావార్థకము ‘మె’ శబ్దము. ఇట్లు ‘ఎణ్మ’ అనునది తుళు విశేష్య రూపము. ‘అష్టత్వము’ అని దాని యర్థము. ఇట్లు దీని రూపమును సాధించిన యాతఁడు డా. కిట్టెలు దొరగారు. ‘తమి-ఎళ్=బీదయగు’ అను ధాతువునుండి పుట్టిన భావార్థకము ‘ఎణ్మై’=(బీదతనము) అనునది తమిఴమునఁ గలదు. తుళు ఎణ్మ—తెలుఁగు ‘ఎనిమిది’ అను శబ్దములందలి మకారము పదిశబ్ద సంక్షేప రూపములగు ‘ప=బ’ అను వానిని సంబంధించినదని యీవఱకు నేను తలంచి యున్నాను” (కాల్డు. ౩౮౨, ౩౮౩ పుటలు).

“తెనుఁగులోని ‘ఎనిమిది’ తుళులోని ‘ఎణ్మ’ అను విశేష్య రూపములు తమిఴ కన్నడములందలి ‘ఎట్టు-ఎణ్టు’ అను శబ్దములతోఁ జాల భేదించుచున్నవి. కాని వాని విశేషణ రూపములం దట్టి భేదములేదు. ఉదా:—ఎనబది=ఎనభై. వీనిలోని ‘ఎన’ అను విశేషణము తమిఴ కన్నడములలోని ‘ఎణ్’ అను దానికభిన్నము. ఆంధ్ర గ్రాంధిక రూపము <u>‘ఎన్బ+అది=ఎన్బది’</u> అను దాని

యందును 'ఎన్' అనియే యున్నది. న ణల భేదము ద్రావిడ భాషలందు వింత కాదు. ఉదా:—తమి-ఎణ్ణు=తెల్గు-ఎన్ను. "ఎనమన్నూరు-ఎనమండుగురు=ఎనమండ్రు" అను శబ్దములలోని 'మ' కారమే దేని శబ్దపు మూల రూపమును సంబంధించినదిగాఁ గన్పట్టుచున్నది. ఎనిమిది మున్నగు నీ శబ్దములలోని 'మిది-మ' అనునవి 'అష్ట' శబ్దార్థక మూల రూపములోనివి (ఎణ్=ఎన్) కావనియు వేఱు విధముగ వచ్చినవనియు ముందు నిరూపింపఁబడును. కాఁగా మకార విరహితమగు 'ఎణ్=ఎన్' అనునదియే మూలరూపమగు విశేషణ శబ్దమని నిశ్చయింపనగును. పయిసందర్భమునుబట్టి 'ఎట్టు' శబ్దము సంస్కృతాష్ట శబ్దభవము కాదనియు నయ్యది శుద్ధ ద్రావిడ శబ్దమనియు విశదమగుచున్నది" (కాల్డు. ౩౪౩, ౩౪౪ పుటలు).

"'ఎరడు-ఐన్దు' అనువాని యందలి 'డు-దు' అనువాని రూపాంతర మనఁదగు 'టు' అనునది 'ఎణ్' శబ్దముపైని నిల్చుటచేత 'ఎణ్టు' అను కన్నడరూపమేర్పడియుండును. అట్టి 'ఎణ్టు' అను దానినుండి 'ఎట్టు' అను తమిఌరూపమేర్పడును. అనునాసిక ఘటితరూపము తమిఌమందుండుట సామాన్యమైనను నిట్టి విపరీత స్థితియు లేకపోలేదు. ఉదా:—కన్న-పెణ్టె=(హళెగన్నడ-హెంటె)=తమి-పెట్టె" (కాల్డు. ౩౪౪ పుట).

"తెల్గునందును ఎనబది-ఎనభై-ఎనుబది-ఎన్బది" మున్నగు స్థలములందలి 'ఎన్' అనునది తమిఌ కన్నడములందలి ఎణ్ అనుదాని కభిన్నమె యని పైని వ్రాసియె యున్నాను. ఇంక 'తుళు' లోని 'ఎణ్మ' తెలుఁగులోని "ఎనిమిది - ఎనమండ్రు - ఎనమండుగురు - ఎనమన్నూఱు" మున్నగువానిలోని 'మకారమునకును' 'మిది' అనుదాని స్థితికిని మూలమేమి యను ప్రశ్నమునకుఁ దొమ్మిది శబ్దపు సామ్యమునఁ బది శబ్దరూపాంతరమగు 'మిది' శబ్ద మిందుఁ జేరెనని యుత్తర మీయనగును.

తొమ్మిది యనుచో "పదికొకటి, ముందు-తక్కువ" అని యర్థము దలంచునట్లె యెనిమిది యనుచో సైతము 'మిదికి=పదికి, ఎని-రెండు, ముందు=తక్కువ' అని యర్థము చెప్పుట తుల్యన్యాయమున (చూడు ౧౦౦ II విభ.) యుక్తముగానుండునుగాని యీమార్గము 'ఎనుబది=ఎనభై' మున్నగుచోట్ల బాధితమగును. 'ఎనుబది' యనఁగాఁ బదికి రెండు తక్కువయని యర్థముకాదుగదా. 'ఎనిమిది పదులు' అనికదా యర్థము. ఇట్లగుటచేత 'ఎనిమిది' శబ్దములోని 'మిది' శబ్ద మర్థవంతము కాదనియు నిరర్థకముగాఁ దొమ్మిది శబ్దసామ్యము (Analogy=సామ్యసిద్ధాంతము) చొప్పునఁ జేరినదిమాత్రమె యనియు గ్రహింపవలయును" (కాల్డు. ౩౪౪-౩౪౫ పుటలు).

విమర్శము:—దొరగారు తమ నిరర్థక నిర్హేతు కానునాసికాగమ సిద్ధాంత మిచట విడిచికొనక తీరదయ్యెను. ఇట 'ఎణ్టు' అను సానునాసికరూపమునె మూలముగాఁ గొని 'ఎట్టు' అను తమిళశబ్దమును సాధించుకొనవలసెను. ఈ స్థలమందు మాత్ర మనునాసికము సహజమనియు నిరర్థక నిర్హేతుకోచ్చారణ మాత్ర ప్రయోజనికాగమము కాదనియు దొరగా రంగీకరించినవారైరి ఎణ్టు శబ్దము 'ఎట్టు' అనునదిగాఁ బరిణమించుట సహజమె. (౨౫ I - ౨౫ VII- విష. చూడు).

దొరగారి తమిళ శబ్దోదాహృతులలోని తప్పులు.

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| ఎణ్బది | ఎణ్పంఁతు—"ఒన్ఱు ముదల్ . . ." (తొల్కా. ౪౩౮ సూ. చూచునది). |
| ఎణ్నూఱు | ఎణ్ణూఱు —"ణాళవెన్ . . ." (తొల్కా. ౧౫౧ సూ. చూచునది). |
| ఎణ్ఏఱు | ఎణ్ణేఱు —"నెడియదన్ మున్నర్ . . ." (తొల్కా. ౧౬౧ సూ. చూచునది). |

'ఎన్బ' అను తుళుభాషా శబ్దముతో సరిపెట్టుటకుఁ గాఁబోలును దొర గారు తెల్గునందు 'ఎన్బ+అది=ఎనబది' అను ఛేదమును జూపిరి. ఇది యాంధ్ర సంప్రదాయ విరుద్ధము. 'ఎనుబది' అనుదాని యుత్వము లోపించుటచేత 'ఎన్బది' అని యేర్పడును. 'ఇరు=ఇను=ఎను+పది=ఎనుబది' అని యచటి పదచ్ఛేదము నెన్నవలయును. 'ఎనిమిది+పది' అనియే యచటి పదచ్ఛేదము నెన్ననగును. 'ఎనిమిది-ఎనమండ్రు' మున్నగువానిలోని 'మిది' శబ్ద స్థితికై యగతికగతి యగు సామ్యసిద్ధాంతము నాశ్రయింపనేల? 'తొమ్మిది' శబ్దమందు వలెనె (చూడు ౧౦౧ I విష.) యెనిమిది శబ్దమందును 'మిది=పదికి, ఎని= రెండు ముందటిది=రెండు తక్కువ' అని యర్థమనియు నచటి 'మిది' శబ్దము నిరర్థకము కాదనియుఁ దెలుఁగునందలి యీ సందర్భములోని 'ఎన్' శబ్దము ద్విత్వవాచకమెకాని యష్టసంఖ్యావాచి కాదనియు గ్రహింపనగును. తమిళ కన్నడాదులలోని 'ఎణ్' శబ్దము 'అష్ట' సంఖ్యార్థకమగుఁగాక. తెలుగున నే తద్విషయమున నెవ్వరిపక్షమందును మార్గాంతరము నాశ్రయింపక తీరదుగదా. వ్యుత్పత్తి సరిగాఁ గుదురని యష్టసంఖ్యార్థము నుపేక్షించి 'ఇరు=ఎను=ఎని= (రెండు)' అను సమర్థమగు పక్షము నాంధ్రులు గ్రహించిరనుట యెంతయు యుక్తముగను విశ్వసనీయముగను నుండును. 'ఎనుబది' అనుచో 'ఎణ్పంఁతు' అను తమిళ శబ్దమందువలె 'ఎనిమిది పదులు' అని యర్థముచేయుట యుక్తమని స్థూలదృష్టికిఁ దోఁచునుగాని తమిళశబ్దమందలి 'ఎణ్' అను సమాసములోని

పూర్వావయవ మష్ట సంఖ్యావాచక మయినట్లు తెలుఁగునందలి సమాస పూర్వావయవమగు 'ఎనిమిది' శబ్దములోని 'ఎను' అనునది యష్టసంఖ్యార్థకముకాదు. అది ద్విత్వవాచకము. "మిది=పదికి, ఎని=రెండు ముందు=రెండు తక్కువ" అని కదా యర్థము. 'ఎనిమిది+పది' అని విగ్రహము నెన్నినపుడు సమాస పూర్వావయవమగు 'ఎనిమిది' శబ్దమందలి 'ఎని' అనుదానికి లేని యష్టసంఖ్యార్థమట్టి సమాస పదమగు 'ఎనిమిది' శబ్దమందలి 'ఎని' అనుదాని కెట్లు లభించును? విగ్రహ వాక్యమందలి 'ఎనిమిది' శబ్దములోని 'ఎని' అనుదానికిఁ గల ద్విత్వసంఖ్యార్థము దాని సమాసమున నెట్లు లేకపోవును? కాన "ఎనుబది=రెండు పదులు నూటికి ముందటిది" అనియే 'తొమ్మిది' శబ్దస్థలమందువలెనె (౧౦౧ I విష. చూడుఁడు). యర్థము చేయవలయును. "ఇరువురు-మువ్వురు-నల్వురు-ఏవురు-ఆఱ్వురు ఏడ్వురు" అను రీతిని 'ఎణ్+వురు=ఎణ్వురు' అను రూపము లేదుగదా. 'తొమ్మండ్రు'='తొమ్మండుగురు' అను రీతిని 'ఎనమండ్రు-ఎనమండుగురు' అనియెకదా పరిణమించినది. 'తొమ్మన్నూఱు' అనునట్లె 'ఎనమన్నూఱు' అనియె కదా యున్నది. ఇట్లెల్లయెడలను 'తొమ్మిది' శబ్దపు సామ్యము నంగీకరించునపుడింక 'ఎనిమిది-ఎనుబది' అను స్థలములందు 'తొమ్మిది-తొంబది' అనువాని రీతి నాశ్రయించుటకు సంకోచమేల? 'తొమ్మిది' శబ్దములోని 'మిది' శబ్ద మర్థవంతమనియు 'ఎనిమిది' శబ్దములోని 'మిది' శబ్దము నిరర్థకమనియుఁ జెప్పుట కేవలము నయుక్తికము కాదా?

౧౦౦. II విష:—"మాక్సుముల్లరు దొరగారును 'క్లే' దొరగారును ఎనిమిది శబ్దపు వ్యుత్పత్తి విషయమున 'రెండు' అను నర్థముగల 'ఇర్' అను దాని రూపాంతరమనఁదగు 'ఎర్' అను దానితోఁ 'ఎన్' అనుదానికి సంబంధము గలదని యూహించిరి. 'ఎనిమిది=పదికి రెండు తొలి=ముందు-తక్కువ' అను నీ వ్యుత్పత్తి 'ఎనిమిది' శబ్దమునకు సంభావ్యమె యనఁదగును. క్లే దొరగారు 'తేపు' అను నర్థముగల 'ఎల్లి' శబ్దపు సంక్షేప రూపమగు 'ఎల్' అను దానినుండి 'ఎని' శబ్దము పుట్టినదనియు నూహించిరి. కాని 'ఎల్' శబ్దమునకు ద్విత్వమను నర్థము గలదనుటకు నిదర్శనములు లేవు. 'తెల్గు-ఎల్లి=తుళు-ఎల్లె' అనునవి తమిళమందలి 'దినము' అను నర్థముగల 'ఎల్' శబ్దముతో సంబంధించుచున్నవి. తమిళమున 'దినము' అను నర్థముగల 'నాళై' అను శబ్దము 'తేపు' అను నర్థమున వాడఁబడుచున్నది. కానఁ దెనుఁగునందును దినవాచియగు 'ఎల్' శబ్దమె 'తేపు' అను నర్థమున వాడఁబడసాగె ననవచ్చును. "తెల్గు-ఎల్లుండి=తమి-నాళై నిన్ద్రు." అను దానిని బోల్చి చూచునది.

'ఎనబది=ఎనభై' శబ్దమున 'మిది' శబ్దము కనఁబడకుండుటచేతఁ దెల్గు లోని 'ఎన్' అనునది తమిళ కన్నడములందలి 'ఎణ్' అనుదాని కభిన్నమనఁ దగును" (కాల్డు. ౩౮౫ పుట).

విమర్శము:—'ఎనిమిది' శబ్దములోని 'ఎన్' అనునది 'ఇరు=ఇను' అను ద్విత్వమునకే వాచకమని మాక్స్ముల్లరుగారు 'క్లే' దొరగారును జెప్పిరిగదా. ఇంక 'క్లే' దొరగారు చెప్పిన 'ఎల్లి' శబ్ద మూలకత్వ విషయముతో వివదింపనేల? అది యంత ప్రసక్తము కాదు. 'ఎనబది=ఎనభై=ఎనుబది' అనుచోట సైతము 'ఎన్' శబ్దము ద్విత్వ వాచకమేకాని 'అష్ట' శబ్దార్థకము కాదని మీఁద వివరింపఁబడుటచే నిట మరలఁ బునరుక్తము చేయుట యనావశ్యకము. ఎల్ల విషయములందును 'తొమ్మిది' అనుచోటియందు వలెనె ఎనిమిది-ఎనమండ్రు-ఎనమన్నూఱు-ఎనభై మున్నగు చోటులందును సమాస పదమె తెల్గున గ్రాహ్య మని గ్రహింపవలయును.

౧౦౦. III విమ:—"ఎణ్ శబ్దవ్యుత్పత్తి:—తమి-ఎణ్=లెక్కించుట=సంఖ్య. గ్రామ్యాఱవము 'ఎణ్ణు'=తెల్గు-ఎన్ను=కన్నడ-ఎనిసు. ఇట్లు సంఖ్యా సాధారణార్థకమగు 'ఎణ్' ధాతువును మూలముగాఁ గొని యష్ట సంఖ్యను ద్రావిడులు వ్యవహరించిరన నగును. లాపిష్ భాషలోని పదియను నర్థముగల 'లొక్కె' అనునది 'లెక్కించుట' అను నర్థముగల 'లొక్కెత్' అను శబ్దమునుండి యేర్పడెను. ఆర్య భాషలలోని 'నవన్' శబ్దము 'నూతన సంఖ్య' అను నర్థమున వచ్చినదే కదా." (కాల్డు. ౩౮౫ పుట).

విమర్శము:—సంస్కృతమునందు సంఖ్యావాచకముల వ్యుత్పత్తులు రూప సాధనమాత్ర ప్రవణములె కాని యర్థవిషయమున సంతుష్టి కరముగ నుండవని యీవఱకె వ్రాసి యున్నాను. (చూడుము ౯౫ II, ౯౭ III విమ). సంస్కృత మందలి నూతనత్వార్థకమగు 'నవః' అను శబ్దము వేఱు. 'తొమ్మిది' అను నర్థముగల 'నవన్' అను శబ్దము వేఱు. ఈ రెండును నభిన్నము లనెడి దొరగారి వ్రాఁత రూపసామ్య భ్రాంతికృతము.

"నవః-పు-('ను' (ధా)+అప్) స్తవే-రక్తపునర్నవాయాఞ్చ. ను+అచ్=నూతనే. త్రి." (శబ్దస్తో)

"నవన్-త్రి.-బహు. (ను (ధా)+అని). సంఖ్యాభేదే" (శబ్దస్తో)

ఇట్లీ రెండు శబ్దములును విభిన్నములు. నూతనార్థకమె సంఖ్యా విశేష వాచకమయ్యెననుట సరికాదు.

'ఆం. భా. వి.' కర్తగారు కాల్డువెల్లుగారి వ్యుత్పత్తిని సైత మంగీకరించుచు "ఎనిమిదిలోని 'మిది' పది యొక్క వికారము. ముందటి 'ఎని' అనునది 'రెండు'

అను నర్థముగల 'ఇరు' యొక్క గాని 'ఎణ్' యొక్క గాని రూపాంతరము. 'ఎణ్' పూర్వరూపమనుట యుక్తతరము. 'ఎణ్=జంట-కన్నడము. ఇణై=జంట-అరవము.' అని ౭౫౩ పుటలో వ్రాసియున్నారు. "'ఎణ్=గణించు' అను ధాతువుగూడఁ గావచ్చును." (ఆం. భా. వి. ౭౫౭ పుట) అని వ్రాసిరి. ఎనిమిది శబ్దములోని 'మిది' శబ్దము నిరర్థకమని కాల్డువెల్లుగారివలెఁ జెప్పక 'పది' శబ్దపు వికారమనుచు నర్థవంతముగా నంగీకరించునపుడు (అర్థవంతము కాదన్నచో 'రెండు' అను నర్థము గలదియుఁ గావచ్చుననుట యసంగతమగును) దానిలోని 'ఎని' శబ్దము 'ఎణ్=గణించు' అను ధాతువునుండి యేర్పడినదనియుఁ జెప్పవచ్చుననుట యెట్లు? కాల్డువెల్లుగారన్నరో 'ఎనిమిది' శబ్దములోని 'మిది' శబ్దము నిరర్థకమెయను పక్షము వారగుటచే నందలి 'ఎని' శబ్దము 'ఎణ్=(గణించు)' ధాతు మూలకమని వచింపఁ గల్గిరి.

౧౦౧. I విష. తొమ్మిది:—"ద్రావిడ భాషలన్నిటిలోను నవసంఖ్యా వాచకము సమాస పదమె. అదియె విశేషణముగను విశేష్యముగను వాడఁ బడును. ఈసమాసములోని యుత్తరపదము దశసంఖ్యా వాచకము.

ద్రావిడ భాషలలోని నవసంఖ్యావాచక శబ్దముల పట్టిక:—

| తమిళ | మలయా | కన్నడ | కూర్గ | తెలుఁగు | తుళు | తుద | కోత | గోందు |
|---|---|---|---|---|---|---|---|---|
| ఒన్‌బదు | ఒమ్‌బదు | ఒమ్భత్తు | ఒయిమ్ బదు | తొమ్మిది | ఒర్మ్బ | ఒన్‌పత్ | ఒర్మ్‌పత్ | అన్మ |

ప్రాచీన గ్రాంథిక తమిళమునఁ బ్రాచీన తార్థకమగు 'తొణ్డు' శబ్దము నవ సంఖ్యను దెల్పునది గలదు. సంస్కృత సంఖ్యావాచి నవ శబ్దము నూతనత్వ వాచకమగుచుండఁగా నఱవ 'నవ' సంఖ్యావాచకము ప్రాచీనతార్థకమగు చున్నది. దశ శబ్దార్థకమగు 'పాన్' శబ్ద ముత్తర పదముగాఁగల 'ఒన్‌బాన్' అనునది 'నవ' శబ్దార్థకమగుచు గ్రాంథిక తమిళమునఁ గలదు.

పత్తు శబ్దము తమిళమున 'పదు' శబ్దరూపాంతరము. ఉదా:—ఒన్‌బదు=(తొమ్మిది). ఇరుబదు =(ఇరువది). ఒన్‌బత్తేటు =(తొమ్మిదేళ్ళు). ప్రాచీన కన్నడ దశార్థకము - పత్తు. హళాసగన్నడము - హత్తు. కన్న- "ఒమ్భత్తు=(తొమ్మిది). ఎమ్భత్తు=(ఎనుబది)." అను వానిలో నోష్ఠ్య వర్ణమె నిల్చియున్నది. ఈ యుదాహృతులనుబట్టి కన్నడమందును దమిళ మందువలెనె దశార్థకమునకు మొదట నేకార్థక శబ్దము నుపపదముగాఁ జేర్చుట

చేత నవార్థక శబ్దమేర్పడునని విశదమగుచున్నది. తెల్గున 'తొమ్మిది' శబ్దములో నుత్తరపదమగు పది శబ్దము 'మిది' అను భిన్నరూపముతో నున్నది, కాని దాని మహద్వాచక రూపమగు 'తొమ్మండుగురు' అను దానిని బట్టి చూడఁగా 'తొంబది' అను శబ్దమె 'తొమ్మిది' శబ్దముగాఁ బరిణమించెనని విశదమగును. 'ఎనిమిది-తొమ్మిది' శబ్దములలోని 'మిది' శబ్దరూప పరిణామముకన్న 'ఇరవై-ముప్ఫై-నలభై' మున్నగు వానిలోని పదిశబ్దపు పరిణామము మిక్కిలి యధికము. ఇది యీ సమాస శబ్దమందలి యుత్తరావయవ స్వరూపము.

పూర్వావయవ విమర్శము:—తమిళమందలి యీ శబ్దముయొక్క పూర్వావయవము-'ఒన్' అనునది. ఉదా:—తమి-ఒన్బాన్-ఒన్బదు. కన్నడ మలయాళములలో నియ్యది 'ఒమ్' అనియు, 'కూర్గు' భాషలో 'ఒయిమ్' అనియు మాఱియున్నది. ఇందలి 'ఒన్' శబ్దము, "తమి-ఒన్ఱు, కన్నడ-కూర్గు-ఒన్దు, తెల్గు-ఒండు, మలయాళ-ఒన్ను" అను వానిలోని పూర్వావయవమున కభిన్నము. డా. గుండర్టుగారును నిట్టి యభిప్రాయముతోనె యున్నారు. తుళు-కోత భాషలలోని 'ఒర్మ్బ'=(తొమ్మిది) అను నవార్థక శబ్దమున స్పష్టముగ నేకసంఖ్యార్థకమగు 'ఒర్' శబ్దమే నిల్చియున్నది. తమి-'పదినొన్ఱు'=(పదునొకండు) శబ్దమున 'పదిలో నొకటి కలుపుట' యర్థమగుచుండఁగా 'ఒన్బదు' శబ్దమునఁ బదిలో నొకటి తీయుట యర్థమగుట సహజమై యున్నది. కాని 'ఒన్' శబ్ద మేకత్వార్థమున వాడఁబడినట్లు నిదర్శనములు కానరావు. (ఇది 'తొల్=తొన్' శబ్దమునుండి యేర్పడెనని ముందు వివరింపఁబడును).

తెల్గు-"తొమ్మిది=(నవార్థకము), తొమ్మండుగురు, తొంబది=తొంభై, తొమ్మన్నూఱు. తమిళ-తొణ్డు=(తొమ్మిది), తొణ్ణూఱు=(తొంబది), తొళ్ళాయిరమ్=(తొమ్మిది వందలు). కన్న-తొంభత్తు=(తొంబది), కూర్గు-తొన్నూరు=(తొంబది) తుళు-సొన్బ=(తొంబది) (తొళ్=సొన్)." అని యిట్లు నవాద్యర్థకముల మొదట "తొమ్=తొణ్=తొన్=తొళ్=తొల్" అను శబ్దము చూపట్టుచున్నది. తుళులోని 'సొన్' అనునది తక్కిన భాషలలోని 'తొల్' అనుదాని రూపాంతరము. 'తొళ్=తొల్' అను దానిలోని ళకారము పరపదాది వర్ణమునుబట్టి మకారాది రూపముల నందును. ఉదా:-ఎళ్+నెయ్=ఎణ్ణెయ్=(నూనె). కల్+మలై=కన్మలై=(కనుమలు=కొండలు) కొళ్+డు=కొణ్డు. తెల్గు-కొను. ప్రాచీన తార్థకమగు 'తొల్' శబ్దముపైని 'దు' అను నమహత్ప్రత్యయము నిల్వఁగా 'తొన్ఱు=తొణ్డు' అని

యేర్పడును. 'తొల్' శబ్దమునకు 'ముందు' అనియర్థము. తెల్గు-తొలి వారము-తొలినాఁడు-మొ. ఏ సంఖ్య కియ్యది మొదటఁ జేర్పఁబడునో దానికి ముందటిదను నర్థము లభించును. ఉదా:—తెల్గు-తొమ్మిది, మిది=పదికి తొమ్=తొలి సంఖ్య యని యర్థము. తమి-మల-తొణ్ణూఱు=నూటికిఁ బూర్వ సంఖ్య యనఁగా 'తొంబది' యని యర్థము. యిట్లే-తమి-మల-తొళ్ళాయిరమ్. ఆయిరమ్=వేయికి, తొళ్=ముందటిసంఖ్య=తొమ్మిదివందలు. తెల్గులోని 'తొంబది', కన్నడమందలి 'తొంభత్తు' అను చోటులందుఁ బై మార్గము కుదురు పడదు. వీనిలోని సమాస పూర్వావయవమగు 'తొమ్' అనునది తొమ్మిదికి వాచక మగుచున్నది. తెల్గు-తొమ్+పది=తొమ్మిది పదులు=నవతి సంఖ్య. ఇచటి 'తొమ్' శబ్దము తొమ్మిది శబ్దభాగమని గ్రహింపవలెను. తుళుభాష లోని 'సొన్‌ప' అను నవత్యర్థకమున 'ప' అనునది "ఎళ్‌ప=డెబ్బది. ఎన్‌ప= ఎనుబది" అను రీతిని దశార్థకమగుచున్నది. 'సొన్' అనునది 'తొల్' అను దాని రూపాంతరము. కానఁ బదికి ముందటిదను నర్థము లభించును. కావున 'తొమ్మిది' అను నర్థము లభించునేకాని నవత్యర్థము లభింపనేరదు. నవత్యర్థము నలసినపుడందు శతార్థక శబ్దముండవలెనే కాని దశార్థక శబ్దముండరాదు. (ఇటఁ గుదురలేదని భావము).

"తొల్=తొళ్=తొణ్=తొన్=తొమ్" అను శబ్దమందలి మొదటి తకారము లోపింపఁగా 'తమి-ఒన్‌బదు. కన్న-ఒంభత్తు' మున్నగు తమిళ కన్నడ సమాస పూర్వావయవమగు 'ఒన్' శబ్ద మేర్పడెననుట యుక్తము. ఆ పక్షమునఁ దమిళ ప్రాచీన శబ్దము 'తొంబదు', కన్నడ ప్రాచీన శబ్దము 'తొంభత్తు' అనునవి యుండి తెల్గు తొమ్మిదికి సరిపడియుండును. కాని యథాస్థితముగా నెన్నినచోఁ దమిళ కన్నడ శబ్దములలోని నవార్థక సమాస మగు 'ఒన్బదు-ఒంభత్తు' అను వానిలోని పూర్వావయవమగు 'ఒన్' అనునది యేకత్వార్థకమని తోఁచక మానదు.

తమిళ వైయాకరణులు "'తొణ్ణూఱు-తొళ్ళాయిరమ్' శబ్దముల పూర్వా వయవము, 'ఒన్‌బదు' శబ్దమే యనుచు దానినుండియే 'తొణ్' 'తొళ్' శబ్దము లను సాధింతురు. (చూడు నన్నూలు). శబ్దచరిత్రమును బరిశీలింపక యథేష్ట ముగా నాదేశాగమాదులను విధించువారికి దేనినుండి యేది సాధింపఁబడదు." (కాల్డు. ౩౮౬ మొ. ౩౮౯ వ. పుటలు).

విమర్శము:—తెల్గు-'తొంబది'=(నవతి) మున్నగు వానిలోని పూర్వావ యవము 'తొమ్మిది' శబ్దపు సంక్షేప రూపమని వచించిన దొరగారు 'తొమ్' అను నది విశేషణ రూపమని యేల వివరింపరైరో? తెలియకున్నది. దొరగారు మామూ

లుగా తొల్కాప్పియము నాఁటికిలేని 'ఒన్‌బదు' మున్నగు నర్వాచీన శబ్దము లనే యుదాహరించుచు వచ్చిరి. కన్నడమున 'ఒంభత్తు' అను వర్గ చతుర్థ ఘటిత రూపము దుర్లభము, 'ఒంబత్తు' అనియే దొరగారు వ్యవహరింపనగును. 'పత్తు' శబ్దమునకు 'పాన్' అను రూపము తమిళమున విభక్తిపరకత్వమందు మాత్రమె కల్గును. (చూడు పది శబ్దము ౧౦౨ I విష). తొంబది శబ్దమె తొమ్మిదిగా మాఱెననుటకు 'తొమ్మండుగురు' శబ్దమును నిదర్శనముగాఁ జూపుట యసంగతము. తొంబది శబ్దము నవతివాచకమై యుండుటచేత వ్యావర్తకముగా 'తొమ్మిది' శబ్దము 'మిది' రూప ఘటితమయ్యెనని తోఁచును. పదికిఁ దొలి సంఖ్య యగుటచే 'తొమ్మిది' యయ్యెనను వ్యుత్పత్తి సరిపడినట్లు 'తొణ్ణూఱు-తొళ్ళాయిరమ్' శబ్దముల దొరగారి వ్యుత్పత్తులు సరిగఁ గుదురు పడలేదు. కాన 'తొల్+నూఱు' అను దానికి 'నూటికిఁ దొలిదశ సంబంధి సంఖ్య'యని యర్థము చేయుట యుక్తము. అట్లే 'తొళ్+ఆయిరమ్' అనుచోఁ 'వేయికిఁ దొలి శతపు సంబంధి సంఖ్య' అని యర్థము చేయనగును. తెలుఁగు తొంబది శబ్దపు సమాసమందలి పూర్వావయవము తొమ్మిది శబ్దభాగమను దొరగారి వివరణమును బొసఁగును గాని 'తొంబత్తు' అను కన్నడ శబ్దమట్లు కుదురుపడ నేరదని దొరగారు తలంపరైరి. తెల్గున 'తొమ్' శబ్దాదియగు 'తొమ్మిది' శబ్ద మున్నట్లు కన్నడమున 'తొమ్' శబ్దాదియగు నవసంఖ్యావాచకము లేదు గదా. కన్నడమున నవసంఖ్యావాచకము 'ఒంబత్తు' శబ్దము మాత్రమే కదా. 'ఒంబత్తు+పత్తు' అను సంధిలో 'తొంబత్తు' శబ్దమెట్లు సిద్ధింపఁగల్గును? ఇట్లె తుళు భాషలోని 'సొన్‌ప=(నవతి)' అను రూపము కుదురు పడదని కాల్డు వెల్లుగారే వ్రాసిరి. మఱియుఁ దుళుభాషలోని యష్ట సంఖ్యావాచకము 'ఎణ్మ' అనునది గాన దొరగారు సాధించిన 'ఎన్‌ప=(ఎనుబది)' అను రూప మును సిద్ధింపనేరదు. తెల్గు 'ఎనుబది' శబ్ద విషయమున నీ వఱకు వ్రాసియే యున్నాను. (చూడు ౧౦౦ I, II విష). కావున "తెల్గు-ఎనుబది-తొంబది. కన్నడ-తొంబత్తు. తుళు-సొన్‌వ-ఎన్‌వ" అనువాని విషయమున వ్యుత్పత్త్యర్థము లను మార్పకతీరదు:—తెలుఁగు-తొంబది=నూటికిఁ బదిచేతఁ దొలిది. ఎనుబది (ఇరు=ఇను=ఎను) నూటికి రెండు పదులు ముందటిది. కన్నడ:—తొంబత్తు= నూటికిఁ బదిచేతఁ దొలిది. తుళు-సొన్‌ప=నూటికిఁ బదిచేతఁ దొలిది. ఎన్‌ప= నూటికి రెండు పదులు ముందటిది. (చూడు ౧౦౦ I విష).

ఇంక 'తొమ్' శబ్దమె మూల రూపమనియు దానినుండి తకార లోప మున 'ఒన్' శబ్దమేర్పడెననియు దొరగారేల యసంభవ మార్గమును ద్రొక్కిరో తెలియకున్నది. ఎట్టి యనుపపత్తులను వారించుట కీ మార్గ మావశ్యకమో?

తెలియకున్నది. 'ఒన్‌పఁహితు' మున్నగుచోటులందు 'తొన్‌పఁహితు' మున్నగు రూపములుండెడివని నిరూపించు భారము దొరగారి పైఁబడియున్నది. అట్టి యాధారము లెవ్వియు లేవు. "ఒన్‌పఁహితు-ఒన్తు-ఒరు-ఒర్-ఓర్-ఒన్దు-ఒండు" మున్నగు ప్రసిద్ధ శబ్దములెల్ల నప్రసిద్ధములగు "తొన్‌పఁహితు-తొన్తు-తొరు-తొర్-తోర్-తొన్దు-తొండు" అను వానినుండి యేర్పడిన వనుట కేవలము నసంభవము. ఇట్టి వాని సూచనయేని తొల్కాప్పియము వంటి కేవల ప్రాచీన గ్రంథమున లేదు. "పదమధ్య గత తకారము 'అ' కారమై తుదికి లోపించుట గలదు గాని పదాది తకారమట్లు లోపింపదు" (ఆం. భా. చ. ౧౧౯౦ పుట). అను భాషా చరిత్రాశయము పరిశీలింపఁ దగినది. (చూడు ౮౩ విష). మఱియు "తమి-తొన్‌పఁహితు=తొంబదు. కన్న-తొంబత్తు" అను శబ్దములు నవార్థక ములు నవత్యర్థకములునై (నవార్థకత్వము దొరగారు సంపాదించినది. నవత్యర్థ కత్వము ప్రయోగ ప్రసిద్ధము) వ్యావర్తకత లేక వ్యవహార విప్లవము సంభవిం చును. 'ఆం. భా. వి.' కర్తగారు కాల్డువెల్లుగారి వ్రాఁతనె స్వీకరించిరి.

"'ఒన్' శబ్దము 'ఊన' అను సంస్కృత శబ్దమునుండి యేర్పడునని ఆం. భా. చరిత్రమున వ్రాయఁబడెను. "'ఒన్' పూర్వ రూప మనుకొన్నయెడల నది సంస్కృ-'ఊన=(ఒకటి)' అను పదమునుండి కలిగియుండును." (ఆం. భా. చ. ౧౧౯౦ పుట). ఊన శబ్దమున కొకటి యను నర్థ మదృష్టచరము. "ఊన. త్రి. (ఊన హానౌ. అచ్)=హీనే-అసంపూర్ణేచ". (శబ్దస్తో) 'ఊన' శబ్దమునకే 'ఏకార్థకత్వము'న్న యెడల 'ఏకోనవింశతిః' అనురీతిగల వ్యవహారమే యుండనేరదు. "'వైకోన స్యైకాద్యేకాన్నౌ సంఖ్యాయామ్'-ఏకాద్న వింశతిః=ఏకాన్నవింశతిః=ఏకోనవింశతిః" (ముగ్ధబోధ వ్యా. ౩౫౨ సూ.) మఱియు నిట్టి 'ఊన' శబ్దమునుండియే 'ఒన్తు-ఒరు-ఓర్-ఒర్-ఒన్ద్రు-ఒన్దు-ఒండు' మున్నగు శబ్దములెల్లఁ గల్గెననుట కేవలము నసంభవము.

డా. కాల్డువెల్లుగారు ద్రావిడ వ్యాకర్తల సూత్రములను నిరసించుట న్యాయము కాదు. ద్రావిడ వ్యాకర్తలు రూపసాధన మాత్ర ప్రయోజనిక మగు వ్యాకరణ శాస్త్రమును రచింప నుద్యోగించిరే కాని శబ్ద చరిత్రమును జూప నుద్యోగించిన వారు కారు. ప్రయోగ ప్రసిద్ధములైన శబ్ద రూపములను వాని ప్రసిద్ధమగు నర్థమును జూపిరి. ఉదా:—కన్న-ఒంబత్తు + పత్తు = తొంబత్తు=ఒంబత్తు పత్తు = (తొమ్మిది పదులు). తమి-ఒంబత్తు+పత్తు= తొణ్ణూఱు. (తొంబది) ఒంబత్తు+నూఱు=తొళ్ళాయిరమ్. (తొమ్మిది వందలు).

"ఒంబత్తో స్తొమ్ పత్తౌ" (కర్ణాట శబ్దా. ౩౬౧ సూ.)=ఒంబత్తు ఇత్య స్య తొమ్ ఇత్యా దేశః శిదన్యద్భవతి పత్తుశబ్దేపరే, న ద్వన్ద్వే సమాసే, మొ-

వరితు నిత్యమ్. ప్రయోగః-తొంబత్తు=ఒంబత్తు పత్తు. తొమ్మె=తొమ్మిది మార్లు. తొంబర్=తొమ్మండ్రు. పత్తావితికిమ్-ఒంబత్తు నాల్కు.

"ఒన్‌పాన్......" (తొల్కా. ౪౪౬ సూ.)=......ఉదా:—ఒన్‌పఃతు+పత్తు=తొణ్ణూఱు=(తొంబది).

"ఒన్‌పాన్ మొదల్‌నిలై......" (తొల్కా. ౪౬౪ సూ.)...... ఉదా:—ఒన్‌పఃతు+నూఱు=తొళ్ళాయిరమ్=(తొమ్మిది వందలు).

౧౧౧. II విష:—ద్రావిడ నవార్థకశబ్దము పోలిక యిండో యూరపియను భాషలందు లేదు. సంస్కృ-నవ. గ్రీకు-ఎన్నియ. తమి-ఒన్‌పంతు. తెల్గు-తొమ్మిది. కన్న-ఒంబత్తు-మొ. సిథియను కుటుంబములోనిదగు 'మంచు' భాషయందలి 'ఒన్ యన్'=(ఒన్‌పాన్-తమి) అనుదానియందు ద్రావిడభాషల పోలిక యగఁపడును. కాని దాని యవయవములగు 'ఎము' (తమి-ఒన్ఱు) 'జుఅన్'=(ఒన్‌పంతు-తమి) అను శబ్దములందు ద్రావిడభాషల పోలిక యేమియుఁ గానరాదు.

౧౧౨. I విష:—"పది:—దశ సంఖ్యార్థక ద్రావిడశబ్ద పట్టిక:—

| తమిఌ | పఌగన్నడ | హళాసగన్నడ | తుద | తుళు | తెలుఁగు | గోండు |
|---|---|---|---|---|---|---|
| పత్తు | పత్తు | హత్తు | పత్తు | పత్త్ | పది | పుద్‌త్ |

దశ సంఖ్యార్థక శబ్ద ముత్తరపదముగాఁ గల సమాసములలో 'పత్తు' అనునది 'పదు' అని (ఇరుబదు-మొ.) మాఱును. ఇది తెల్గులోని 'పది' శబ్దమునకు దగ్గఱగా నుండును. గ్రాంథిక తమిఌ సమాసములలో 'పత్తు' అనుదాని చోట 'పాన్' అనునది నిల్చుటయుఁ గలదు. ('బాన్' అను బకారము సంధి వశమునఁ గల్గినది). ఉదా:—తమి-ఒన్‌బాన్=(తొమ్మిది). ఇరుబాన్=(ఇరువది). ఇట్టి వానియందు 'పదికి' తుల్యమగు 'పన్' అను దానిలోని దీర్ఘ ముచ్చారణ వశమునఁ గల్గినది.

"పత్తొమ్‌బదు=(పందొమ్మిది) శబ్దములోని 'పత్తు' అనునదియు, పన్నిరణ్డు శబ్దములోని 'పన్' అనునదియు దీని విశేషణ రూపములు. 'పన్' అనునది 'పాన్' అనుదాని రూపాంతరము. లేదా 'పదిన్' అనుదాని సంక్షేపరూపము. 'పదిన్' అనునది పంచమీ షష్ఠీ సప్తమ్యర్థములందును నాపవిభక్తికత్వమునందును వచ్చు 'ఇన్' ప్రత్యయముతోఁ గూడిన పదుశబ్దముయొక్క విశేషణ రూపమై యున్నది. ఉదా:—పదిన్‌మర్=(పదిమంది). పదిన్‌మడఙ్గు=(పది

రెట్లు). మలయాళమునందును నిట్టి రూపములె యుండునుగాని తమి-'పన్నిరణ్డు' అను దానికి బదులుగా 'పన్‌దిన్‌రెన్‌డు' అని కాని 'పన్‌ద్రెన్డు' అని కాని యుండును.

"'అదు' (తమి) శబ్దము తెల్గున 'అది' అనునదిగా మాఱునుగాన 'పదు' (తమి) శబ్దము తెల్గున 'పది'గా మాఱుట సహజము. తెల్గున సమాసములం దీ 'పది' శబ్దము వివిధరూపములుగా మాఱును. ఉదా:—ఎనిమిది=(ఎను+పది)-ఎనమండ్రు = ఎనమఁడుగురు, ఎనమన్నూఱు, తొమ్మిది = (తొమ్ + పది)-తొమ్మండ్రు=తొమ్మండుగురు-తొమ్మన్నూఱు, పదునొకఁడు, పండ్రెండు, పన్నిరువురు=పన్నిద్దఱు, పదుమూఁడు - పదుమూవురు, పదునాలుగు - పదునల్వురు, పదునేను=పదిహేను, పదునాఱు=పదహారు, పదునేడు=పదిహేడు, పదునెనిమిది=పద్ధెనిమిది, పందొమ్మిది=పంథొమ్మిది, ఇరువది=ఇరువై, ముప్పది=ముఫై, నలువది = నలుబది = నలభై, ఏఁబది = యాభై, అఱువది = అరవై, డెబ్బది=డెబ్భై, ఎనుబది=ఎనభై, తొంబది=తొంభై. 'పది=పఇ=పై=భై-వై' మున్నగురీతిని దీని పరిణామ పద్ధతి నరయునది. 'పదిహేను-ముఫై' మున్నగువానిలోని మహాప్రాణోచ్చారణము విషయమున నీవఱకు వ్రాయఁబడెను" (చూడు ౩-౨ IX విష).

"ప్రాచీన కన్నడమున దశార్థకము తమిటమందువలెనే 'పత్తు' అను రూపముతోనె యుండును, హొసగన్నడమున 'హత్తు' అని యగును. పదికి నిరువదికిని నడిమి సంఖ్యలలోఁ దమిటమందువలెనె 'పదిన్' అని యుండును. 'పన్నొందు-పన్నెరడు' (పదునొకఁడు-పండ్రెండు) అనువానిలో 'పన్' అనునది నిల్చును. 'పదిన్ + సాసిరమ్' అనునది 'పయిన్‌సాసిరం' = (పదివేలు) అని యేర్పడును. ఇరువదికి మీఁది సంఖ్యలను బోధించు సమాసములలో 'పత్తు-వత్తు-భత్తు' అను వానిలో నేదేని రూపముతో నుండును. కూర్గుభాషలో 'పది' శబ్దవిషయము కన్నడమందువలెనె యెన్నఁగనునుగాని 'పదుమూఁడు' మున్నగు సంఖ్యలలో 'పదిన్' అని నిల్వక 'పదున్' అను రూపము నిల్చును. తుళు భాషలో 'పత్-పద్-పద్న్-పాద్న్' అను రూపములు నిల్చును. ఇరువదికిఁ బై సంఖ్యలను దెల్పు శబ్దములలో 'పత్' అనునది-'ప-వ' అను వానిలో నొక రూపమునందును. 'ఇరువతొంజి' మున్నగు సమాసములలో నొక తకారము లోపించును. 'పాద్‌నేల్' అను చోటి దీర్ఘము తమిట 'పాన్' శబ్దపు దీర్ఘము వంటిది" (కాల్డు. ౩౫౦-౩౫౧ పుటలు).

విమర్శము:—పత్తు శబ్దమునకు 'పదు' శబ్దము తమిటమున రూపాంతరమనుట తొల్కాప్పియము నాఁటికి లేదు. సమాసములలోఁ గొన్నియెడల 'పత్తు'

అనుదానిచోట 'పంఁతు' అనునది నిల్చును. అట్టి ఆయ్‌తము స్వపరస్థపరుషము యొక్క స్థానకరణములు గలదియె యైయుండును (చూడు ౧౭ IV విష).

"ఒన్ఱు ముదల్ ఒన్పాన్......" (తొల్కా. ౪౩౮ సూ.) = ఒకటి మొదలుగాఁ దొమ్మిది వఱకుఁగల సంఖ్యావాచకములకు 'పత్తు' శబ్దము పరమగునపుడందలి తకారము లోపించి దానిచోట 'ఆయ్‌తము' నిల్చును......ఉదా:— ఒన్ఱు+పత్తు=ఒరుపంఁతు. ఇరణ్డు+పత్తు=ఇరుపంఁతు.

"ఒన్ఱుముదలాక......" (తొల్కా. ౨౦౦ సూ.)=విభక్తిపరమగునపుడు 'ఒరుపంఁతు. ఇరుపంఁతు' మున్నగు దశాంత సంఖ్యావాచకముల 'పంఁతు' శబ్దములోని 'ప' అనునది మాత్రము నిల్చి దానిపయిని 'ఆన్' అను నాగమము రావచ్చును. ఉదా:—ఒరుపంఁతు+ఐ=ఒరుపానై=(ఒక పదిటిని). ఇరుపానై= (ఇరువదిటిని). ఇపుడు 'ఒరుపదై - ఒరుపదినై - ఒరు పత్తినై' అని వాడుదురు. ఇట్లె నేఁటి వాడుకనుబట్టి దొరగారు చూపిన 'పత్తొంబదు' అనుచోఁ దొల్కాప్పియము చొప్పున 'పత్తొన్పంఁతు'=(పందొమ్మిది) అనవలెను.

'పదిన్' అను తమిళశబ్దము విషయమునందును దొరగారి వ్రాఁత సరి కాదు. 'ఒన్ఱుమొదలాక......' (తొల్కా. ౪౩౪ సూ.)=ఒకటి మొదలుగ నెనిమిదివఱకుఁ గల సంఖ్యావాచకములు పత్తు శబ్దమునకుఁ బరమగునపు డా 'పత్తు' శబ్దపు 'తు' వర్ణము లోపించును. ఆ శబ్దముల నడుమ 'ఇన్' అనెడి యాగమము నిల్చును. (ఇరణ్డు-శబ్దపరకత్వమున నింకను విశేష విధులు గలవు. విస్తరభీతిని జూపలేదు-పన్నిరణ్డు). పత్తు+ఒన్ఱు=పత్+ఒన్ఱు=పత్+ఇన్+ ఒన్ఱు=పదినొన్ఱు=(పదునొకటి) పదిన్మూన్ఱు=(పదుమూఁడు). స్వరపరకత్వమున నందలి 'న' కారము ఱకారమగును.

"అళవు ఆగు......" (తొల్కా. ౧౨౨ సూ.)=సంఖ్యావాచకములందును బరిమాణవాచకములందును వచ్చెడు 'ఇన్' అను నాగమములోని 'న' కారమున కచ్చు పరమగునపుడు ఱకార మాదేశమగును. ఉదా:—పత్+ ఇన్+ఒన్ఱు=పత్+ఇఱ్+ఒన్ఱు=పదిఱ్ఱొ(ట్ట్రొ)న్ఱు=(ఒక పది). ఇట్లే 'పదిన్' అను రూపము సంఖ్యా పరిమాణవాచక పరకత్వమందే కొన్నియెడల వచ్చును. పదినాయిరమ్=(పది వేలు). పదిన్ కలమ్=(పది కలముల పరిమితి). కాని దొరగారు వ్రాసినట్లు పంచమీ షష్ఠీ సప్తమ్యర్థములలోని యాపవిభక్తికత్వమందు సామాన్యముగా రానేరదు. ఇట్టి స్థితిలోఁ దమిళమందలి 'పదు' అనుచో 'పది' అని నిల్చుటకు 'అదు' శబ్దము 'అది' అనునదిగా మాఱుట నిదర్శనమని దొరగారు వ్రాయుట కేవలము న సంగతమనక తీరదు. (చూడు ౭౪ I విష).

స్వల్పభేదములున్నను ప్రాచీన కర్ణాటమందును సంఖ్యావాచక పరకత్వమందె 'పది' అను నాదేశము వచ్చును. కాని దొరగారు వ్రాసినట్లు పంచమ్యాద్యర్థములందు సామాన్యముగా రానేరదు.

"పన్నేకద్వ్యర్థయోః" (కర్ణా. భూ. ౧౬౩ సూ.)=దశసంఖ్యావాచకమున కేకద్వి సంఖ్యావాచకములగు 'ఒందు - ఎరడు' అనునవి పరమగుచుండఁగా 'పన్' అను నాదేశము గల్గును. ఉదా:—పన్నొందు = (పదునొకటి) పన్నెరడు=(పంద్రెండు). తమి-(పదినొన్ను).

"అన్యత్రపదిః" (కర్ణా. భూ. ౧౬౪ సూ.)='పత్తు' అనుదానికి 'ఒందు-ఎరడు' శబ్దములు తప్పఁ దక్కిన సంఖ్యలు పరమగునపుడు 'పది' అను నాదేశమగును.

"స్వరాదౌనాగమః" (కర్ణా. భూ. ౧౬౫ సూ.)=స్వరాది సంఖ్యావాచకము పరమగునపుడు పైవాని నడుమ 'న'కారాగమ మగును. ఉదా:—పత్తు+మూఱు=పదిమూఱు=(పదుమూఁడు). పత్తు+నాల్కు=పదినాల్కు (పదునాల్గు). పత్తు+అయ్దు=పదినయ్దు (పదునేను). ఇట్లె పదినాఱు=పదినేళు-పదినెంటు. కేశిరాజును నిట్లె సాధించెను.

కం. పత్తర్కె పన్నెనిక్కుమ । దుత్తర కొందెరడు నెలసె పదియొందక్కుం। మత్తొదవి మూఱునాల్కిరె । సుత్తెం స్వరమిరె నకారవిధి ముందెల్లం ॥ (శబ్దమణి దర్పణము-౧౯౨ ప).

పయిసూత్రముల యుదాహరణ స్వారస్యములచేతఁ బైస్థలములు తప్ప మఱెచ్చటను బైకార్యములు రానేరవని గ్రహింపనగును. ఈ విషయమున నీ క్రింది కర్ణాటశబ్దానుశాసనము ప్రమాణమగుచున్నది.

"పదిర్మూఱ్వాది షట్కే" (కర్ణాటశబ్దా-౩౬౬ సూ.)=(వృత్తి) 'పత్తు' ఇత్యస్య పదిరాదేశః శిద్వద్భవతి. (శిత్తు సర్వాదేశమగును) 'మూఱు' ఇత్యేతదాదిషు షట్సు శబ్దేషు పరేషు. ఉదా:—పదిమూఱు. పదినాల్కు. ఉత్తర సూత్రము చొప్పున నగాగమమురాఁగా 'పదినయ్దు-పదినాఱు-పదినేళు-పదినెంటు' మూఱ్వాది షట్కె ఇతికిమ్-పత్తొంబత్తు=(పందొమ్మిది). దీని మకరంద వ్యాఖ్యలో నీ యాఱు శబ్దములు పరమగునపుడే 'పది' శబ్దాదేశము వచ్చునని యింకను స్పష్టముగా వ్రాయఁబడెను. "ఆదిశబ్దోఽత్ర వ్యవస్థావచనః. యా మానుపూర్వీ మాశ్రిత్య లోకే సంఖ్యాశబ్దా వ్యవతిష్ఠన్తే తథా వ్యవస్థితేష్వేవ మూఱు ప్రభృతిషు షట్సు శబ్దేషు పరేషు. నయథా కథంచి [illegible] ష్విత్యర్థః" (మఞ్జరీ మకరందవ్యాఖ్య).

"పదే నగాక్ స్వరే" (కర్ణాటశబ్దా-౩౬౭-సూ.) = (వృత్తి) 'పది' ఇత్యస్య నగాగమో భవతి స్వరాదావుత్తర పదే పరే. ఉదా:—పదినయ్దు. పదినాఱు-పదినేలు-పదినెంటు. పదే రితి కిమ్. "పత్తొంబత్తు=(పందొమ్మిది) పన్నొండు......"

"దశాఖ్యాయాం పయిన్" (కర్ణా. భూ. ౧౬౨ సూ.)='పత్తు' శబ్దమునకు సాసిరశబ్దము పరమగునపుడు 'పయిన్' అను నా దేశమగును. ఉదా:—పత్తు+సాసిరమ్=పయింఛాసిరమ్=(పదివేలు) (33 సూ. ఛకారా దేశము. ౧౧౨ సూ. నకారమున కనుస్వారము).

"ఒంబయ్ శతే" (కర్ణా. భూ. ౧౬౦ సూ.)='సహస్రేచ' (కర్ణా. భూ. ౧౬౧ సూ.)=నవసంఖ్యావాచియగు 'ఒంబత్తు' శబ్దమునకు శత, సహస్ర సంఖ్యావాచక (నూఱు-సాసిరమ్) శబ్దములు పరమగుచుండఁగా 'ఒంబయ్' అను నాదేశమగును. ఉదా:—ఒంబత్తు + నూఱు = ఒంబయ్నూఱు=(తొమ్మిది వందలు). ఒంబత్తు+సాసిరమ్=ఒంబయ్ సాసిరమ్=(తొమ్మిది వేలు).

౧౦-౨. II విమ:—"డా. గుండర్టుగారు ద్రావిడభాషలలోని 'పదు=పది' అను శబ్దము సంస్కృత పంక్తిశబ్దభవమని (౧౮౬౯ - జర్మన్ ఓరియంటల్ సొసైటీ జర్నలులో) వ్రాసిరి. "పంక్తిశబ్దభవమగు తమిః 'పన్తి=పన్ది' అను శబ్దమునకు 'అతిథులబంతి' అని యర్థము. (తెల్గు-బువ్వముబంతి=బంతి కుడుపు). మలయాః-పన్దిరు=పన్దిరెండు=(పంద్రెండు). తమి-పత్ (ద్)+త్తు=పత్తు" అను శబ్దము లీ విషయమునఁ బరిశీలింపఁదగియున్నవి. ద్రావిడులు 'అఞ్జు'= (అయిదు) శబ్దము నెరవు తెచ్చికొనిరనుటకంటె నంతకంటెఁ బెద్దసంఖ్యను దెల్పు 'పది' శబ్దము నెరవు తెచ్చికొనిరనుటలో వింత యేమున్నది. కాని 'నూఱు-వేయి' అను నధిక సంఖ్యలను ద్రావిడ శబ్దములతో వాడఁగల్గిన ద్రావిడులు (అఞ్జు) పది శబ్దము నెరవు దెచ్చికొనిరనుట సంభావ్యముకాదు. కొన్ని సంస్కృత సమాసములలో పంక్తిశబ్దము దశ సంఖ్యావాచకమైయున్నను (పంక్తిరథుఁడు=దశరథుఁడు. పంక్తి గ్రీవుఁడు=దశగ్రీవుఁడు) 'పంక్తి' శబ్దము 'వరుస' అను నర్థమునకే వాచకమయి యున్నది. పంక్తి శబ్దభవమై ద్రావిడ భాషలలో వెలసియున్న 'తెల్గు బంతి' శబ్దము 'వరుస' అను నర్థమునకే వాచకము. తమి -'పన్తి=పన్ది' అను పంక్తి శబ్దభవము 'అతిథుల వరుస'నే బోధించునుగాని దశసంఖ్య నెన్నఁడును బోధింపదు. ద్రావిడు లీ విషయమున నెరవు తెచ్చికొనుటకే తలంచినపు డిట్టి యర్థాంతర ప్రసిద్ధ శబ్దము నేల తెచ్చికొనవలెను? దశశబ్దమునె తెచ్చికొందురనుట విశ్వసనీయము. మల యాళమున 'పన్దిన్ రెణ్డు=(పంద్రెండు)' అని యుండుటచే నందలి 'పన్' అను భాగమునుబట్టి పంక్తిశబ్దభవతావాదము బలముగాఁ గన్పడునేకాని యట్టి 'పన్ద్'

అనుదాని నితర ద్రావిడభాషలలోని "తమి-పన్నిరణ్డు. తెల్గు-పన్నెండు. కన్న-పన్నెరడు" అను వానితోను ముఖ్యముగాఁ దుళుభాషలోని నకార రహితమగు 'పద్ రాడ్' శబ్దముతోను సరిపోల్చి చూచునపుడు గుండర్టుగారి వాదమందలి బలము చూపట్టదు. "కన్న-పన్నొందు (పదునొకటి) తమి-పదినొన్ఱు. మలయా-పదినొన్న్. తుళు-పత్తొంజి" అను శబ్దములతోను సరిపోల్చి చూడనగును. పైవానిలోని 'పన్' అను శబ్దమువలెనె మలయాళమందలి ద్వాదశార్థక శబ్దములోని 'పన్ద్' శబ్దమందలి 'పన్' అనునదియు 'పదిన్' శబ్దపు సంక్షేపరూప మనఁదగును. లేదా 'పన్' శబ్దము 'పదిన్' అనుదాని పర్యాయమన్నను ననవచ్చును. నిర్దేశక సర్వనామ ప్రాచీనరూపములగు 'అన్-అమ్' అనునవి తర్వాతి 'అదు=అది' శబ్దములతో సంబంధించునవని యంగీకరింపలేదా? (చూడు ౨౮ V, VII. ౬౧ III విభ). తక్కిన 'ఒందు-ఎరడు' మున్నగువానిలోవలెనె 'పత్తు=పన్తు' అను వానిలోనిది యమహాప్రత్యయ తకారమైయుండఁగాఁ బంక్తి శబ్దములోని దనుట యుక్తమా? 'పత్' అను దానిలోని తకార మమహాప్రత్యయ మగుటచేత 'ప' అను ధాతువు మిగిలియుండును. ఇట్టి ధాతువు తమిళమునఁ గానరాదు. అట్లయినను 'పదు-పది-పద్-పన్-పమ్-పై-పర్-పల్' అను వానికి మూలరూపము 'ప' అను ధాతువనియు దానికి 'గుణించు' అని యర్థమనియు నెఱుంగనగును. సంస్కృత దశశబ్ద వ్యుత్పత్తియందును నిట్టి చిక్కులు లేకపోలేదు.

'పగు=విభాగించు' అను ధాతువు దీనికి మూల మన్నను ననవచ్చును. ప్రాచీన తమిళ వైయాకరణులు 'పత్తు' అనుదానిని 'పఃహ్తు' (పఃహ్త్) అనియుఁ గొన్ని యెడల 'ఆయ్తముతోను' వ్రాయవచ్చునందురు. ఉదా:—తమి. ఒరుపఃహ్తు=(ఒకపది) ఇరుపఃహ్తు=(రెండు పదులు). తమిళ భాషలో 'ఆయ్తము' అనఁబడుచున్న యీ కంఠ్యధ్వని హకార రూపమునఁ బ్రాచీన పండిత వ్యవహార మాత్ర ప్రసిద్ధమైయున్నది. 'పఃహ్తు' అను చోటి 'ఆయ్తము' కంఠ్య కకారమును సూచించుచున్నదనియు నట్లగుటచేత 'పఃహ్తు' అనుదాని మూలరూపము '(పకు?)=పగు' అనునదై యుండవచ్చుననియు నూహింపనగును. 'పఃహ్తు' అనునది 'పగుది' అనుదాని కభిన్నము. పాల్-పాఱ్ఱు (ట్టు)-పాన్మై=(భాగము). 'పగుది' అనుదాని సంక్షేపరూపము 'పాది' (సగము)" (కాల్డు. ౩౫౧-౩౫౨-౩౫౩ పుటలు).

విమర్శము:—డా. గుండర్టుగారి వాదముపైఁ జేసిన డా. కాల్డువెల్లుగారి విమర్శనము మిక్కిలి యుక్తముగా నున్నది. 'పది' శబ్దము సంస్కృతపంక్తి శబ్దభవము కాదనియె చెప్పనగును. కాల్డువెల్లుగారి 'ప' ధాతుకల్పనము యుక్తమె యనఁదగును. భాషలో ధాతువులు కొన్నియెడల నశించియుండవచ్చును.

కావునఁ బ్రయోగానుసారముగా 'ధాతువులను బ్రత్యయములను' గల్పించి కొనవచ్చును. సంస్కృతమున ధాతువుల నంత తఱచుగాఁ గల్పింపకున్నను బ్రత్యయములను గల్పించుట మిక్కిలి తఱచు. సంస్కృత కోశకర్తలు చూపు వ్యుత్పత్తులలోఁ బ్రత్యయకల్పనము మిక్కిలి తఱచుగఁ జూపట్టును. "సంజ్ఞాసు ధాతు రూపాణి। ప్రత్యయాశ్చ తతః పరే। కార్యా ద్విద్యా దనూబంధ। మేత చ్ఛాస్త్ర ముణాదిషు. భాష్యమ్." (సి. కౌ. ౩౧౯౯ సూత్రపు వివరణము). "ప్రయోగ వశాత్, ధాతు విశేషేభ్యః అర్థ విశేషేషు ప్రత్యయ విశేషాన్ కృత్వాఽన్యేపిసాధు శబ్దా వ్యుత్పాద్యాః" (ముగ్ధబోధ వ్యాకరణమ్. ౧౧౮౩ సూ. దుర్గాదాస వ్యాఖ్య.)

తెల్గు భాషలో 'ఉన్' అనునది సముచ్చయార్థకము. 'పదునొకటి' మున్నగు చోటులందు 'పదియును నొకటియు' నని యీ రీతిగ నర్థము నెన్న నగును. తెల్గునందు 'పదియు నొకటి=పదినొకటి' అనియు ననవచ్చును. తెల్గులోని 'ఉన్' అను దానిని సంబంధించినదె తమిళ మందలి 'ఉమ్' శబ్దము. కాని తమిళమున 'ఉన్' అను నకార రూపమెచ్చటను గానరాదు. 'పదిన్' శబ్దమున మాత్రము వింతగాఁ గన్పట్టుచున్నది. 'పదునొకటి' మున్నగు చోటులందుఁ దెల్గు వ్యాకర్తలును నచటి 'ఉన్' అనునది సముచ్చ యార్థకమని సూత్రింపలేదు. (చూడు 'వ్యా. సం.' ౨౨౦ మొ. ౨౨౮ విష).

'పత్తు' శబ్దమునకు మూలము 'పగు' ధాతువని నిరూపించుటకై 'పఃతు' అను రూపములోని 'ఆయ్‌త (ద)ము హకార రూపమనియు నాయ్‌దము కంఠ్య కకార సూచకమనియు వ్రాయుట కేవలము తమిళ సంప్రదాయ విరుద్ధము. ఆయ్‌తము పరుష పరకమయియే యుండుననియు నది యట్టి పరస్థ పరుషస్థాన ప్రయత్నములె కలదనియుఁ దొల్కాప్పియరుచే ప్రత్యేకముగా సూత్రింపఁబడి యున్నది. (చూడు ౧౭ IV విష). పరుష పరకత్వమునఁ గల్గు పారుష్య ముచ్చారణమున హకార భ్రాంతిని దొరగారికిఁ గల్పించినది.

౧౦౩. I విష:—"నూఱు:—ద్రావిడభాష లన్నిటిలోను 'నూఱు' అనునదే శతసంఖ్యను బోధించును. వంద శబ్దము సైతము తెల్గునఁ గలదు. తుళు భాషలో 'నూఱు' అనునది 'నూదు' అను రూపముతో నున్నది. కావునఁ దుళులో ఱకారముచోట 'ద-జ' అను వానిలో నేదేని నిల్చు ననఁదగును. ఇండో యూరపియను భాషలు మున్నగువానిలో దీని పోలికగల శబ్దములు లేవు. సిథియను భాషలలో నే రెండు భాషలందును నొక్క శబ్దము శతసంఖ్యార్థకము లేదు. ఇట్టి యనాగరక జాతుల భాషలలో (సిథియను కుటుంబ భాషల నాగరకములను కాల్డువెల్లుగారి యాశయ మిట విశదమగుచున్నది) దీనికన్న భిన్నముండుననుకొన నక్కఱలేదు. ఫిన్నిషు (సిథియను కుటుంబము) భాషలో

నిండో యూరపియను భాషలనుండి శతశబ్ద మెరవు తెచ్చికొనఁ బడెను. ఇండో యూరపియను భాషలన్నిటిలోను స్వల్ప భేదములతో శతశబ్ద మొక్కటే వాడఁబడుచున్నది. అది యా భాషలవారి యైకమత్యమునకును నాగరకతకును నిదర్శనమగుచున్నది.

తెలుఁగు నందును మలయాళ మందును, 'గుండ-పొడి-బూడిద' అను నర్థముగల నూఱు శబ్దము శతసంఖ్యార్థకమగు 'నూరు=నూఱు' శబ్దమున కభిన్నము. తమిళమున 'గుండ' అను నర్థముగల 'నీఱు' శబ్దము 'నూఱు' అనియే వాడఁబడుచున్నది. తెల్గులోను మలయాళములోను నీ పదము 'ఈ' కారముతోను 'ఊ' కారముతోను వాడఁబడుచున్నది. ఇట్టి యచ్చుల భేద ముచ్చారణకృత మనఁదగును. కాఁగా శతార్థక 'నూఱు' శబ్దము బూడిద యను నర్థముగల శబ్దమునుండి వ్యుత్పన్నమైన దనుటకు సందేహము లేదు. ప్రాచీన కాలమున ననాగరకతా స్థితిలోనున్న ద్రావిడజాతి యత్యధిక సంఖ్య యనుకొనఁదగు శతార్థమున 'బూడిద' యను నర్థముగల శబ్దమును వాడుట సహజమె కదా." (కాల్డు. ౩౫౮ పుట).

విమర్శను:—తెల్గున నూఱు శబ్దమునకు భస్మమను నర్థమె లేదు. తెలుఁగున 'నూరు' అను రేఫఘటితమును లేదు. 'నీఱు=భస్మము' అను శబ్దము తెల్గునఁ గలదు. ఇయ్యది 'నూఱు=శతము' అను దానికి మూలమని దొరగారి యాశయము. భస్మ మనేక రేణు రూపము గాన నది యీ పెద్ద సంఖ్య విషయమునఁ గేవల ప్రాచీన ద్రావిడులు వాడుట సహజమె యని దొరగారి యాశయము. 'ఆం. భా. చ.' కర్తగారును దీని నీ క్రిందిరీతి నంగీక రించుచు వ్రాసిరి.

"'నూఱు'కు వ్యుత్పత్తి కనుగొనుట కష్టము......'నూఱు' అనఁగా 'పొడి' అని యర్థమును గల్పించి (తమి-కలదు) పొడిలోనుండు రేణువు లెన్నో యుండును గనుక ద్రావిడులకు శతసంఖ్య మిక్కిలి యధికమగుటచేత నా సంఖ్యకు 'నూఱు' అని పేరిడిరని కాల్డువెల్లు తెలిపి యున్నాఁడు. మఱియొక వ్యుత్పత్తి తోఁచనపు డేదోయొక సమాధానము చెప్పకోవలెను గదా." (ఆం. భా. చ. ౧౯౯-౨ పుట).

భాషా చరిత్రకర్తగారు చెప్పిన దానికన్న డా. కాల్డువెల్లుగారు చెప్పినదే మేలు. 'నీఱు=నూఱు' శబ్దము లభిన్నము లనిరి. 'నీఱు' శబ్దమునకు భస్మ మనియె యర్థము. దీనికి మూలరూపము 'నిగుఱు' అనునది. ఒక్క వస్తువుగాఁ గనఁబడు భస్మము నందలి పరమాణువుల బాహుళ్యమును దెలిసిన ద్రావిడు లనాగరకులనుట యెట్లు పొసఁగును? 'నూఱు' సంఖ్య యత్యధికమని

తలంచు ననాగరకులకు శతసంఖ్యయొక్క యావశ్యకత యెట్లు కల్గెను? పరిశీలింపఁగా ద్రావిడులు కొంత నాగరకులయి యున్నపుడే యీ 'నూఱు' శబ్దమును సంస్కృతాను కరణమునఁ గల్పించికొనిరని తోఁచుచున్నది.

"శో=తీక్ష్ణీ కరణే. దివాది......" (శబ్దస్తో). "శత. న. (శో-ధాతు. డతచ్ - ప్రత్యయ) = స్వనామఖ్యాత సంఖ్యాయామ్" (శబ్దస్తో) "నూఱు-దే-స-క్రి. ౧. ఆయుధము వాఁడిచేయు. ౨. సన్నెకంట మర్దించు. సర్వనామ. శతము......" (శ. ర).

"ఆయుధతీక్ష్ణీ కరణార్థక 'శో' ధాతువునుండి సంస్కృతమున శతసంఖ్యార్థక శబ్ద నిష్పత్తి చేయఁబడుటంజేసి యట్టి యర్థమే గల 'నూఱు' ధాతువునుండి శతసంఖ్యార్థక శబ్దమును ద్రావిడులు సృజించికొనిరని చెప్పుట యెంతయు విశ్వసనీయముగ నున్నది. 'వంద' అను తెలుఁగు శబ్ద మర్వాచీనము. ఇది సమూహార్థమున వృన్ద శబ్దభవముగఁ బ్రాకృతమున నున్నది......వంద యను సమూహార్థక ప్రాకృత పదమే తెనుఁగున నూఱను నర్థమున నెలకొని యుండును" (ఆం. భా. చ. ౧౯౯-౨ పుట).

౧౦౩. II విష:—"వేయి:—తమిళ మలయాళములలో సహస్రార్థక శబ్దముగ 'ఆయిరమ్' శబ్దము వాడఁబడును. కన్నడమున-సావిర=సవర-శబ్దములును దెల్గున 'వేయి' శబ్దమును, తుళు-'సార' శబ్దమును వాడఁబడును. 'సావిర-సవర-సార' శబ్దముల భిన్నములు. 'సహ+శిరన్=సహస్ర' అనియు 'అ+అ+యిరమ్=ఆయిరమ్' అనియు గుండర్టుగారు వీని వ్యుత్పత్తి క్రమమును జూపిరి. 'అధికము-వేఁడి=కఠినము' అను నర్థ క్రమముగల 'వె' అను దానినుండి తెల్గు 'వేయి' శబ్దమేర్పడి యుండును" (కాల్డు. ౩౫౭ పుట).

విమర్శము:—'సార' అను తుళు శబ్దముతో సంబంధమును జూపుచు సంస్కృత సహస్ర శబ్దభవము కాదని నిరూపించు తలంపునఁ గావలయు దొరగారు ప్రాచీన కర్ణాట ప్రసిద్ధ 'సాసిర' శబ్దము నుపేక్షించి 'సావిర=సవర' శబ్దములను బ్రదర్శించిరి. 'అ+అ+యిరమ్=ఆయిరమ్' అను గుండర్టు దొరగారి పదచ్ఛేదమును జూపుటయు నట్టి తలంపునే విశదీకరించుచున్నది. 'సహ+శిరన్' అను సహస్ర శబ్దపు గుండర్టుగారి ఛేదము సంస్కృత కోశ సమ్మతము కాదు.

"సహస్ర-న. సమానం హసతి. (హస=హసే+ర) = దశశత సంఖ్యాయామ్" (శబ్దస్తో).

దీనినిబట్టి 'స=(సమాన)+హస్+ర' అను ఛేదము సంస్కృతకోశ ప్రసిద్ధమని విశదమగుచున్నది. 'వె' అను శబ్దమె శబ్దరత్నాకరమున లేదు. "వే. యు. దే. స. వేయి......వై. క్రి-విణ-వేగముగ......" (శ-ర). అని

యిట్లు 'వే' శబ్ద ముదాహరింపఁబడెను. "వేఁడి-దే-వి - ౧ వేఁడిమి......విణ-ఉష్ణము–" (శ-ర) అని యిట్లు 'వేండి' శబ్దము చూపఁబడెను. దీని నాశ్రయించునపుడు–'వేం=వేమ్=వేన్' అను దానిని ధాతువుగా నెన్నుట యుక్తము.

౧౦౪. విష:—"పూరణార్థకములు:—సామాన్య సంఖ్యావాచక విశేష్యములకు వేఱుధాతువుల క్రియాజన్య విశేషణములను జేర్చుటచేతఁ బూరణార్థకము లేర్పడును. ఏకత్వార్థక శబ్దవిషయమున మాత్ర మిండో యూరపియను భాషలందువలెనె రూపాంతరముండును. అట్టిది – ముదల్ = కాలముయొక్క– కాని స్థలముయొక్క– కాని ప్రాథమ్యము. తమిళమునఁ దక్కిన సంఖ్యావాచకముల తుదినివలెనె దీని తుదిని సైతము తమి–'ఆగు' ధాతు తద్ధర్మార్థక విశేషణ గ్రాంథికరూపమగు 'ఆగుమ్' అనుదానిని దీని వ్యావహారిక రూపమగు 'ఆమ్' అనుదానిని జేర్చుటచేతఁ బూరణార్థకరూప మేర్పడును. ఉదా:— ముదలాగుమ్=ముదలామ్=('మొదటి' అనునది తెల్గు పూరణార్థకము). తమిళమందలి సామాన్యరూపము-ఒన్ద్రామ్=(తెల్గు-ఒకటవ). ముదల్ శబ్దమునకు 'మున్=ముందు' అనువానిలోని 'ము' అనునది సంస్కృతమున 'ప్ర=ప్రథమ' శబ్దమువలెనె మూలరూపము=ధాతువు. 'ముదల్' అనునది కృదంతరూపము. ము+దల్ = (లేదా)-మున్+దల్ = 'ముదల్ = ప్రారంభించు' అను ధాతురూపమును గలదు. దమిళమునఁ బ్రాచీనమను నర్థముగల 'ముదు' అను శబ్దమును గలదు. (తెల్గు-ముదిమి-ముదుకఁడు)." (కాల్డు. ౩౫౪-౩౫౫ పుటలు).

"తెల్గున 'అగు' ధాతు సంబంధియగు 'అగ' అనుదాని గకారము వకారము కాఁగా నేర్పడు 'అవ' అనునది పూరణార్థక ప్రత్యయము. ఉదా:— ఒకటి+అవ = ఒకటవ = (ప్రథమ) ఇట్లె–రెండవ–మూడవ–మొ. కన్నడమున 'అనే' అనునది పూరణార్థక ప్రత్యయము. ఉదా:—మూరనే = (మూఁడవ). తమి–మూన్ద్రు+అమ్=మూన్ద్రామ్" (కాల్డు. ౩౫౫-౩౫౬ పుటలు).

" 'ఆగు' ధాతుజములగు మఱికొన్ని శబ్దములు సంఖ్యావాచకములకుఁ జేర్చుటచేత సంఖ్యావాచకావ్యయములు మఱికొన్ని యేర్పడును. 'ఆవదు' మున్నగునవి ధాతుజ విశేషణమునకుఁ దచ్ఛబ్దార్థక యోగమున నేర్పడిన విధేయ విశేషణములు. ఇట్లె సంఖ్యావాచకములకుఁ బరముగ వారార్థక శబ్దములను జేర్చుటచేత మఱికొన్ని విధేయ విశేషణము లేర్పడును. ఉదా:—ఇరుముఱై= రెండుమార్లు. (సంస్కృ–ద్విః=ద్వివార)" (కాల్డు. ౩౫౬ పుట).

విమర్శము:—'పూర్యతే అనేనేతి పూరణః'=దీనిచేత సంఖ్య పూరింపఁబడునని యర్థము. 'రామకృష్ణు లిద్దఱిలోఁ గృష్ణుఁడు రెండవ వాఁడు' అనుచో రామ కృష్ణు లిద్దఱును ద్విత్వ సంఖ్యావయవములె యైనను గృష్ణుఁడు దీనఁ

సంఖ్యను బూరించును గానఁ గృష్ణుఁడు రెండవ వాఁడని యెఱుంగ నగును' ('వ్యా. సం.' ౨౨౪ విష).

"తొల్కాప్పియమునఁ బూరణార్థక ప్రత్యయము విధింపఁబడలేదు. కానఁ బ్రాచీన తమిళమునఁ బూరణార్థము 'ఆగు' ధాతు తద్ధర్మార్థక విశేషణము చేత (ఆగుమ్) నిర్వహింపఁబడెడిదనియు దాని వ్యావహారిక రూపము 'ఆమ్' అనునది పూరణార్థకముగ నేర్పడెననియు గ్రహింపనగును. "ఒన్ఱామ్=ఒన్ఱావదు. ('ఆవదు' అమహదర్థ విషయకము) ఇరణ్డామ్=ఇరణ్డావదు" అని పూరణార్థమున 'ఆమ్-ఆవదు' అనునవి వచ్చును" (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారి జవాబు ౧౯౫౩ జూన్ ౬ తేది జాబునకు). తెల్గున నిందలి 'అవ' అనునది 'అగు' ధాతువు యొక్క తద్ధర్మార్థక విశేషణ జన్యమె కావచ్చును గాని యది తద్ధర్మార్థక విశేషణ రూపము కాదు. కన్నడమందలి పూరణార్థక ప్రత్యయము క్రియాజన్య విశేషణమని దొరగారు నిరూపింపనే లేదు. హళోసగన్నడ పూరణార్థక ప్రత్యయము 'అనే' అనునదే కాని ప్రాచీన కర్ణాట పూరణార్థకము 'అనెయ' అనునది యనియు వ్రాయరైరి.

"సంఖ్యాయాః పూరణేఽనెయః" (కర్ణా. భూ. ౧౭౬ సూ.)=పూరణార్థమున సంఖ్యావాచికిఁ బరముగ 'అనెయ' ప్రత్యయమగును. ఉదా:—అయ్దనెయ=(అయిదవ=పంచమ).

"సంఖ్యా వాచక గళమేలూ.....పూరణార్థదల్లి 'అనెయ' అథవా 'అనే' ఎంబ ప్రత్యయం బరువదు". (హొసగన్నడ శబ్దాదర్శ. ౧౯౧ సూ). 'ఉదా:—ఒందనెయ=ఒందనే'.

తెల్గునందును 'అగు' ధాతు తద్ధర్మార్థక విశేషణ రూపమె ప్రాచీన కాలమునఁ బూరణార్థమును నిర్వహించెడి దనియు నదియె కాలక్రమమున 'అవ' అను పూరణార్థక ప్రత్యయముగ నేర్పడెననియు నూహింప నగును. కాని దొరగారు 'అగు' ధాతువునుండి 'అగ' అని యేర్పడి 'గ' కారము వకారము కాఁగా 'అవ' అని యయ్యెననుట సరికాదు. 'అగ' అను పూరణ ప్రత్యయమెన్నఁడును దెల్గున లేదు. అట్టి నిదర్శనము లెవ్వియు లేవు. కాన 'అగు' ధాతు రూపాంతరమగు 'అవు' ధాతువు నుండియె 'అవ' ప్రత్యయ మేర్పడెననుట సంభావ్యము. 'సమానేఽవస్తు సర్వదా' అని యథర్వణాచార్యుఁడే దీనిని బేర్కొనెను. నన్నయయు దీనిని వాడినట్లు కన్పట్టును (చూడు 'వ్యా. సం.' ౨౨౪ విష). తద్ధర్మార్థక విశేషణముచేఁ బూరణార్థము సరిగా నిర్వహింపఁబడమింజేసి కాలక్రమమున నీ ప్రత్యయ మేర్పడెనని తోఁచును.

సీ. "ఆయంబునందు రెండవ భాగమొండె మూఁడవ భాగమొండె నందర్థమొండె (సభా. ౧ ఆ. ౪౭). ఇందలి సందర్భమున ద్వితీయ భాగము

తృతీయ భాగము" అను నర్థము లావశ్యకములు. అందలి 'అవ' ప్రత్యయము చోట 'అవు' అను తద్ధర్మార్థక విశేషణమును నిల్పినచో 'భాగద్వయము—భాగత్రయము' అను నపార్థములు గల్గును. 'రెండవు భాగము' అనఁగాఁ బరిశిష్ట మొక భాగమనుటచేత మూఁడు వంతులలో రెండువంతులను నపార్థము స్ఫురించును. అట్లగుటచేతఁ బూరణార్థక ప్రత్యయము లేర్పడవలసి వచ్చెను.

"సంఖ్యాయా మె ద్వారే" (కర్ణాట శబ్దా. ౨33 సూ.) "సంఖ్యా వాచినో 'మెత్' ప్రత్యయో భవతి వారార్థే గమ్యమానే. ప్రయోగః. ఒందు బారి= ఒమ్మె (ఒక తడవ). ఏవం ఇమ్మె-మూమ్మె-సాసిమ్మె".

తెల్గున వారార్థమున 'మాఱు-తడవ' మున్నగు శబ్దములు వాఁడబడును. ఉదా:—ఒక మాఱు. ఒక తడవ-మొ. తమి-తదవై-ముఖై. సంస్కృతమున వారార్థమున 'కృత్వస్' అను ప్రత్యయ మున్నను 'వార' శబ్దమును వాడఁబడును. 'త్రీన్ వారా నభిషు ణ్వాతే......' (అనర్ఘరాఘవము) 'పంచకృత్వః'=(అయిదు తడవలు) అను రీతిని 'కృత్వస్' ప్రత్యయమును వాడఁబడును. 'సుచ్' అను ప్రత్యయమును 'ద్వి-త్రి-చతు' శ్శబ్దములపై నిల్చును. ఉదా:—'ద్విః-త్రిః-చతుః'. పై రీతినె కన్నడమున 'బారి' శబ్దము వాడఁబడును. ఉదా:—ఒందు బారి=(ఒక తడవ) మొ.

౧౦౫. I విమ:—"భాషా కుటుంబ విమర్శము:—సంఖ్యా వాచక చరిత్రమునుబట్టి పరిశీలింపఁగా ద్రావిడ భాషా జనకత్వము సంస్కృతమునకు లేదు సరేకదా యార్యభాషా కుటుంబమునకే లేదని విశదమగుచున్నది. 'అజ్ఞు= పఙ్చ్వ. పత్తు=పఙ్క్తి' అను రెండు స్థలములు సంస్కృత భవములె యని గుండర్టు దొరగారి వాదమున కొప్పికొన్నను ననాగరక భాషలు సమీపస్థ నాగరక భాషలనుండి కొన్ని శబ్దముల నెరవు తెచ్చుకొనెడి పద్ధతి మాత్రమె స్థిరపడును గాని వానికిఁ గుటుంబ సంబంధము గలదని స్థిరపడ నేరదు. పదముల నెరవు తెచ్చికొనుట వేఱు. భాషల జన్యజనక భావము వేఱు. ద్రావిడ భాషలకును నిండో యూరపియను భాషలకును బ్రాచీన సంబంధము గలదని వాని వ్యాకరణ సంబంధమగు సామ్యమునుబట్టి చెప్పవచ్చును గాని పయి సంఖ్యావాచక చరిత్ర మా విషయమున నిదర్శనము కానేరదు. గ్రీకు-గాథికు-కెల్టికు మున్నగు భాషలలోని యేకత్వార్థములకు సంస్కృతములోని యేకశబ్దము విభిన్నముగా నగపడుటనుబట్టియుఁ దెల్గులోని 'ఒక' శబ్దమునకును 'ఉగ్రియను' భాషలలోని 'ఒగ్-ఒకర్' మున్నగు వానికిని (చూడు ౯3 IV విమ.) సామ్యమగపడుటను బట్టియు సంస్కృతమునందే పైని వ్రాసిన 'ఉగ్రియను' భాషల నుండి యేకశబ్ద మెరవు తెచ్చుకొనఁబడెనని యూహింపనగును".

"సిథియను భాషలలోని సంఖ్యావాచకములకును ద్రావిడ సంఖ్యావాచకములకును గల పోలికలు వానికిఁగల వ్యాకరణ సంబంధముతోపాటు వాని పరస్పర సంబంధమును స్థిరపఱుచును. ముఖ్యముగా 'ఒకటి-నాలుగు' సంఖ్యలకు వాచకములగు శబ్దముల విషయమున ద్రావిడ భాషలకును 'ఫిన్నో ఉగ్రియను' భాషలనెడి సిథియను భాషలకును గల సామ్యము వాని కుటుంబ సంబంధమును నిరూపింపఁజాలి యున్నది. 'హన్‌పాల్వి' దొరగారును వీని సంబంధము నంగీకరించిరి. 'ఫిన్నో ఉగ్రియను' భాషలయందును ద్రావిడ భాషలందును బోలికలచే నభిన్నమైయున్న చతురర్థక శబ్దమునకు ద్రావిడ ధాతువు నుండి నిష్పత్తిని జూపుట కవకాశము లేకుండుటనుబట్టి యా రెండు కుటుంబముల సంబంధము విశదమగుచున్నది. పది సంఖ్యలలో రెండిటి విషయమున మాత్రము పోలిక గల్గియుండుట వాని కుటుంబ సంబంధమునకుఁ బెద్ద నిదర్శనము కాఁజాలదనరాదు. గణిత జ్ఞానమంతగా వృద్ధినందని జాతులలో సంఖ్యావాచక శబ్దములు నియమ శూన్యముగను మందమందముగను నేర్పడుటయే కాక సులభముగా మాఱిపోవుచుండుటయు సంభవించును. ముఖ్యములగు ద్రావిడ భాషలలోని సంఖ్యావాచకముల పట్టిక యీ క్రిందఁ జూపఁబడుచున్నది." (కాల్డు. 3౫౬, 3౫౭ పుటలు).

విమర్శము:—భాషాకుటుంబ నిర్ణయ విషయమున సంఖ్యావాచక సామ్యము మిక్కిలి ప్రధానమైనదని యీ వఱకుఁ బీఠిక ౧౨ I విషయమున విపులముగాఁ జూపఁబడెను. అచట ద్రావిడ భాషల ప్రత్యేక కుటుంబితయు నిండో యూరపియనుభాషల భిన్నకుటుంబిత్వమును సిద్ధాంతితము లయ్యెను. ఇచటి విశేష మొక్కటి గలదు. 'నాలుగు' శబ్దపు సంబంధము ద్రావిడ భాషలకును ఫిన్నో ఉగ్రియను భాషలకును బలముగాఁ జూపట్టుచున్నది. అంత మాత్రమున ద్రావిడ భాషలు ఫిన్నో ఉగ్రియను భాషల కుటుంబములోనివనుట విశ్వసనీయముగఁ గన్పట్టదు. (చూడు ౧౨ II విషయము). ఒక శబ్దపు సంబంధము పెక్కు సిథియను భాషలలోఁ గలదనియు సంస్కృత సిథియను ద్రావిడ భాషలు మూఁడు కుటుంబములకును వేఱొక భాషనుండి వచ్చియుండుననియు దొరగారే స్థలాంతరమందు వ్రాసిరి. (౯3 IV విష.). ఇచట సంస్కృత భాషయె ఉగ్రియను భాషలనుండి యెరవు తీసికొనెనని యూహింపనగునని దొరగారు వ్రాయుట సరికాదు. 'నాల్' శబ్దపు వ్యుత్పత్తి ద్రావిడ శబ్దముతోఁ గుదురుపాటు బాగుగఁ గాలేదు గాన ద్రావిడ భాష లుగ్రియను భాషల కుటుంబ సంబంధము గలవనుట కేవలము నసంగతము. అందుమాత్రము వ్యుత్పత్తి కుదురు పడినదా?

౧౦౫. II "విష:—ముఖ్యములగు ద్రావిడభాషలలోని సంఖ్యావాచక శబ్దముల పట్టిక:—

| | తమిళము | మలయాళము | తెలుఁగు | కన్నడము | తుళు |
|---|---|---|---|---|---|
| ౧ | ఒన్దు-ఒరు-ఓర్ | ఒన్ను-ఒరు-ఓర్ | ఒకటి-ఒక-ఒండు | ఒన్దు-ఒర్ | ఒఞ్జి-ఒర్ |
| ౨ | ఇరణ్డు-ఇరు-ఈర్ | రెణ్డు-ఇరు-ఈర్ | రెండు-ఇద్దరు | ఎరడు-ఇర్ | రడ్డు-ఇర్ |
| ౩ | మూన్దు-మూ-ము | మూన్ను-మూ-ము | మూడు-ముగ్గురు | మూరు-మూ-ము | మూజి-మూ-ము |
| ౪ | నాలు-నాల్-నాన్గు | నాల్-నాన్గు | నాలుగు-నలు-నల్-నల | నాలు-నాల్కు-నాల్ | నాలు-నాల్ |
| ౫ | ఐన్దు-అఞ్జు-ఐ | అఞ్జు-ఐ | ఐదు-ఏను-ఏ | ఐదు-ఐ | ఐను-ఐ |
| ౬ | ఆఱు-అఱు | ఆఱు-అఱు | ఆరు-అరు | ఆరు-అర | ఆజి-ఆజ్-అజి |
| ౭ | ఏఱు-ఎఱు | ఏఱు-ఎఱు | ఏడు-ఏళ్-ఎ | ఏళు-ఎ | ఏళు-ఏళ్ |
| ౮ | ఎట్టు-ఎణ్ | ఎట్టు-ఎణ్ | ఎనిమిది-ఎన్మిది-ఎన | ఎణ్టు-ఎణ్ | ఎణ్మ-ఎణ్ |
| ౯ | ఒన్బదు-ఒన్బాన్ తొణ్డు-ఒమ్బతు తొళ్ | ఒమ్బదు-తొళ్ | తొమ్మిది-తొమ్మండు-తొమ్మ | ఒమ్భత్తు-ఒమ్భయి-తొమ్ | ఒర్మ్బ-సొణ్ |
| ౧౦ | పత్తు-పాన్-పన్ పదు-పదిన్ | పత్తు-పదిన్-పన్దు | పది-పద-పన్-పై-భై-వై | పత్తు-హత్తు-భత్తు-వత్తు పదిన్-పన్-పది | పత్తు-పాద్-పదు-పదన్ పత్-వ-ప |
| ౧౦౦ | నూఱు | నూఱు | నూరు | నూరు | నూదు " |

(కాల్డు. 3౫౮ పుట).

విమర్శము:—దొరగారి వ్యావహారిక భాషల వాసన లధికముగఁ జూపట్టుచున్నవి. కేవలాపభ్రంశ శ్రుతిగల 'ఒన్ద్రు - మూన్ద్రు' అనువాని నుదాహరించి సుప్రసిద్ధములగు 'ఒన్ఱు-మూన్ఱు' శబ్దములను స్మరింపరైరి. అట్లే 'ఏళు' అను హళాంసగన్నడరూపము నుదాహరించి 'ఏఱు' అను పఱగన్నడ శబ్దమును దొరగారు స్మరింపలేదు. 'మూఱు' అను ఱకార ఘటిత పఱగన్నడ శబ్దము నుపేక్షించి రేఫఘటితమగు 'మూరు' అను హళాంసగన్న శబ్దమును జూపిరి. 'ఆఱు-నూఱు' అను ఱకారఘటిత శబ్దములను దమిళ మలయాళము లందుఁ జూపి యాంధ్రకన్నడములలో 'ఆరు-నూరు' అని రేఫఘటితములనుగాఁ జూపుటలోని దొరగారి యాశయమేమో తెలియకున్నది. ఇంకను నిట్టి వీ పట్టికలో వ్యావహారికపు వాడుకలు పెక్కు గలవు.

IV సంఖ్యావాచక ప్రకరణము ముగిసెను.



# ద్రావిడ భాషా పరిశీలనము

## V ప్రకరణము – సర్వనామములు

### పురుష బోధకములు — (౧ భాగము).

౧౦౬. I విమ:—“భాషల సంబంధమును భాషా కుటుంబముల సంబంధమును నిర్ణయించుటకు దశావర సంఖ్యావాచకములవలెనె సర్వనామములును గొప్ప నిదర్శనము లగుచున్నవి. అందును బురుష బోధక సర్వనామములలోని యనఁగా నుత్తమ మధ్యమ పురుష సర్వనామములలోని యేక వచన రూపము లితర భాషాభాగములకన్న నత్యంత చిరస్థాయులైయున్నవి. పెక్కు యుగములు గతించుచున్నను వానిలో నత్యల్పములగు మార్పులు మాత్రమె కలుగుచున్నవి. ఇవి సంఖ్యావాచకములకన్నను సుప్తిఙ్ ప్రత్యయములకన్నను స్థిరమైనవి. ఉత్తమ మధ్యమ పురుష సర్వనామములు లేకుండుట జపాను భాషలో మాత్రమె కలదు. ఇంగ్లీషులో ‘Your servant’=(మీ సేవకుఁడు) అనునది ‘నేను’ అను దానికిని ‘Your honour’= (మీ గౌరవము) అనునది ‘మీరు’ అను దానికిని వాచకములైనట్లె జపాను భాషయందలి పురుష బోధక సర్వనామములు వ్యవహార వేద్యములు” (కాల్డు. ౩౪౯ పుట).

విమర్శము:—సర్వనామసంజ్ఞను బ్రాచీన ద్రావిడ వైయాకరణులు చేసియుండలేదు. సంస్కృత వ్యాకరణములలో ‘సర్వ’ మున్నగు కొన్ని శబ్దములు సర్వనామసంజ్ఞ గలవని చెప్పఁబడెను. ఈ సర్వాది శబ్దములపైఁ గొన్ని సుబ్విభక్తులు నిల్చునపుడును గొన్ని తద్ధిత ప్రత్యయములు నిల్చునపుడును దక్కిన నామములకంటె వైలక్షణ్యము గన్పట్టుటంజేసి వాని కట్టి సంజ్ఞ సంస్కృత వైయాకరణులచేఁ జేయఁబడెను. నవీనులగు నాంధ్రవ్యాకర్తలు బాల వ్యాకరణకారాదు లట్టి సంజ్ఞ నంగీకరించి సర్వనామ ప్రకరణమనుచు వేఱుగ నొక భాగమును సూత్రించిరి. డా. కాల్డువెల్లుగారును నట్టి ప్రకరణమును వివరించిరి. కాని సంస్కృతమున ‘సర్వాది’ శబ్దములకుఁగల విభక్తి రూపాదులందలి ప్రత్యేకత తెల్గు శబ్దములకు–ద్రావిడ శబ్దములకు–లేదు. ఆంధ్ర భాషా వికాసకర్తగారు చూపిన యట్టి ప్రత్యేకత యాభాస రూపమెకాని నిజమైనది కాదు. (చూడు ‘వ్యా. సం.’ ౨౧౧ I విమ).

"(౧) ఉత్తమ పురుష సర్వనామము:—కనీస మేడెనిమిదివందల సంవత్సరముల క్రిందటి వనఁదగు వ్యాకరణాదులందలి శబ్దములు విభక్త్యాది రూపములు ప్రాచీనములని విశ్వసింపవచ్చును. అట్టి ప్రాచీనములగు రూపములను వ్యావహారిక రూపములను బట్టి ప్రథమా విభక్త్యంతములును ద్వితీయాది విభక్త్యంగములును సమాపక క్రియా ప్రత్యయములును నిట విమర్శితములగుచున్నవి. ప్రథమా రూపములకును నితర విభక్తిరూపములకును భేదమున్నను బ్రథమా రూపములకుఁ గ్రియావిభక్తి ప్రత్యయములతో సామ్యమున్నచో నట్టి ప్రత్యయముల రూపమె యా సర్వనామముల ప్రాచీనరూపమని నిరూపింపఁజాలును. పురుషబోధక సర్వనామ ప్రథమా రూపమందలి దీర్ఘ మితర విభక్తిరూపములలో హ్రస్వమగును. సంఖ్యావాచక విశేష్యమందలి దీర్ఘము దాని విశేషణ రూపమున హ్రస్వమగుట దీనితో సరిపోల్పనగును."

"ఉత్తమ పురుష బహువచన రూపమునకు 'నేనును వారును' అని యర్థము. మధ్యమ పురుష బహువచనమునకు 'నీవును వారును' అని యర్థము. (ఉభయార్థక సర్వనామ బహువచనమునకు 'నేనును నీవును' అని యర్థమనుచు దొరగారేల వ్రాయలేదో?). వైదిక సంస్కృతమును సంబంధించిన యిండో యూరపియను భాషలలోవలెఁగాక ద్రావిడభాషలలో మధ్యమ పురుషైక వచనమునకు బహువచన ప్రత్యయమును జేర్చుటచేత బహువచన రూపమేర్పడును. ద్రావిడభాషలు పెక్కిటిలోఁ బదాదినున్న 'ఎ'కారము యకార విశిష్టమై పల్కఁబడును. ఉదా:—ఎన్ = (నాయొక్క). దీనిని 'యెన్' అని యుచ్చరింతురు. ఒకార విశిష్టపదాది వ కారమును నిట్టిదె. ఇట్టి యకారము నిటఁ బరిగణింప మానుచున్నాను. గ్రాంథిక భాషారంభ దశలోఁ బ్రామాణిక గ్రంథకర్తలు వాడిన యకార మాదియందుఁగల రూపములె యప్పటికి సరియైన రూపములనెడి నమ్మకముతో నట్టివానిని మాత్రమె యీ సందర్భమున నుదాహరించుచున్నాను" (కాల్డు. ౩౪౯, ౩౬౦, ౩౬౧ పుటలు).

విమర్శము:—భాషా కుటుంబ సంబంధ పరిశీలన విషయమున 'నేను—మేము' మున్నగు సర్వనామముల సామ్యము సయితము ప్రధానముగఁ బరిశీలింపవలయునని యీ వఱకు ౧౨ I విషయమున వ్రాయఁబడినదె. దొరగారికిని వ్యావహారిక భాషలలోని రూపములు కేవల ప్రాచీనభాషల సంబంధమును బరిశీలించు విషయమున విమర్శింపఁ దగినవికావని తెలియకపోలేదు. కావుననె యిటఁ బ్రాచీన గ్రంథస్థరూపములె పరిశీలనార్హములని దొరగారు వ్రాయవలసినవారైరి. వీరు పండ్రెండవ శతాబ్దపు నన్నూలు వ్యాకరణమె ప్రధానమనుకొని 'కనీస మేడెనిమిదివందల సంవత్సరముల క్రిందటిది ప్రాచీనము' అని వ్రాసిరి. కాని

తొల్కాప్పియము తమిళపండితులు చెప్పునట్లు క్రీస్తునకు ముందటిదికాకున్నను, (క్రీ. శ.) ౬ శతాబ్దము నాఁటిదనుటకు సందేహములేదు. వ్యావహారికోచ్చారణము ప్రామాణికము కాదనియుఁ బ్రాచీన ప్రామాణిక వ్యాకరణాదిస్థ రూపములె ప్రాచీనములని విశ్వసింపఁదగునని యు దొరగారిచట స్పష్టముగను గంఠోక్తముగను వచించిరి. 'స్టడీ-ద్రవి' కర్తగారు మున్నగు పండితులు దీనిని బరిశీలింతురుగాక, (చూడుఁడు ౧౮ I, ౧౮ IX, ౨౧ I విష).

౧౦౬. II విష:—డా. కాల్డువెల్లుగారు ౪౧౬ మొ. ౪౨౦ వ. పుటలలో ద్రావిడ సర్వనామరూపముల పట్టిక లుదాహరించిరి. పునరుక్తిభీతి నచట వ్రాయక యిచటనే యాయా సందర్భముల వాని పట్టికల నుదాహరించితిని.

"తమిళోత్తమ పురుష సర్వనామ ప్రథమాదిరూపముల పట్టిక:—

| | ఏక వచనము | | | బహు వచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| వ్యావహారిక రూపములు | నాన్ | ఎన్ | ఏన్ | నామ్—నాఙ్గళ్. | నమ్—ఎఙ్గళ్ | ఓమ్ |
| గ్రాంథిక రూపములు | 'యాన్'—నాన్ (నన్నూలులో 'యాన్' మొదటఁజేర్కొనఁబడెను) | ఎన్ | ఎన్—ఏన్ అన్ | యామ్—నామ్ (యామ్—ప్రచురము) | ఎమ్—నమ్ (నమర్ = ఎమర్)= (మాయొక్క) (ఎలామ్= మేమందఱము) | ఎమ్—ఏమ్ అమ్—ఆమ్ —ఓమ్. |

ఏకవచన బహువచన ప్రత్యయములు చేరని శబ్దముల నుత్తమ పురుష రూపములనుగా వైయాకరణు లుదాహరింతురు. కాని నేను వాని నుదాహరింపను. 'నడన్దనమ్=నడన్దనెమ్=(నడచితిమి)' అను రీతిగల క్రియలలో 'నమ్-నెమ్' అనునవి సమాపక క్రియా ప్రత్యయములవలెఁ గన్పట్టునుగాని వాని మొదటి నకార ముచ్చారణార్థకమగు సంహితా వ్యవధాయక వర్ణము. అట్టి వర్ణము నిల్వనపుడు 'నడన్దామ్ - నడన్దేమ్' అను రూపము లేర్పడును. (నడన్ద + అమ్-(లేదా)-ఎమ్). వాడుక తమిళములోని 'ఓమ్' అనునది వానిలో 'ఆమ్, అనుదానినుండి యేర్పడియుండును" (కాల్డు. ౩౬౧ పుట).

"'ఆగుమ్'=(ఆ+ఉమ్=అది యట్టిదె) అనుదాని సంక్షేపము 'ఆమ్' అనునది 'ఓమ్' అనునదిగఁ గొన్నియెడల నేర్పడుచున్నది కాదా. 'అ' అనునది 'ఎ-ఐ-ఒ' అని యేర్పడుట కనేకోదాహరణములు గలవుగాని 'ఎ-ఐ-ఒ' అనునవి 'అ' అనునదిగా నేర్పడుట కుదాహృతి లేదు" (కాల్డు. ౩౬-౧, ౩౬-౨ పుటలు).

విమర్శము:—"పట్టికలోని 'యాన్=నాన్' అనునవియును 'యాామ్=నామ్' అనునవియును బరస్పరమును బర్యాయములుగా వ్రాయుట సరికాదు. అస్మదేకవచనము 'యాన్' అనునది మాత్రమె తొల్కాప్పియమునఁ జేర్కొనఁబడెను. 'నాన్=(నేను)' అనునది యర్వాచీన రూపము. 'యామ్=(మేము) నామ్=(మనము)' అనునవియును బర్యాయములు కావు. 'యామ్' అనునది యస్మదర్థక బహువచనము. 'నామ్' అనునది యుష్మదస్మదుభయార్థకము. (నీ+యామ్=నామ్.) ఇట్లగుటచేతనే 'నామ్' అనుదాని కేకవచన రూపము ప్రాచీనము లేదయ్యెను. 'నన్' అనెడి ద్వితీయాద్యేక వచనాంగమును లేదయ్యెను. కాలక్రమమున 'నాన్=(నేను)' అనునది వాడుక కెక్కినను 'నామ్' అనుదానికి 'నమ్' అను విశేషణరూపమేర్పడినట్లే 'నాన్' అనుదానికి 'నన్' అను ద్వితీయాద్యేక వచనాంగమవతరింప లేదయ్యెను. (చూడు ౨౧ XV విష). 'నమ్' అనునది యుభయార్థకమగు 'నామ్' అనుదాని ద్వితీయాద్యంగము. 'ఎమ్' అనునది 'యామ్' అనుదాని ద్వితీయాద్యంగము. క్రియా ప్రత్యయములందును 'ఎమ్-ఏమ్' అనునవి 'యామ్' అనుదానిని సంబంధించినవి. 'అమ్-ఆమ్' అనునవి 'నామ్' అనుదానిని సంబంధించినవి. కాల్డువెల్లుగారి ననుసరించినవారే యగుటచేత వికాసకర్తగారును 'నామ్=మేము' అనునవి పర్యాయములనియే వ్రాసిరి" (చూడు ఆం. భా. వి. ౪౭౯ పుట).

దొరగారు 'ఎలామ్' అని వ్రాసిరి. కాని యట్టి ద్విత్వరహిత రూపము తొల్కాప్పియమునందుఁ గానరాదు. మఱియు 'ఎలామ్=(మేమందఱము)' అని వ్రాసిరి. అట్టి రూప మమహత్త్వమున మాత్రమె యుండును. మహత్త్వమందు 'ఎల్లేముమ్ వన్దేమ్' అని యుండవలయును. వ్యావహారిక రూపములను వ్రాసియుందురు.

"తన్నుళ్......" (తొల్కా. ౬౭౧ సూ.)=ఉత్తమ పురుషమునం దమహత్తులును మహత్తులును గలిసిన కర్తలుండునపుడు మాత్రమె 'ఎల్లామ్' శబ్దము

వాడఁబడును. ఉదా:—ఎల్లామ్ వన్దేమ్=(నేనును మృగములును వచ్చితిమి) రెండును మహత్తులగునపుడు 'ఎల్లేముమ్ వన్దేమ్'=(నేనును వాఁడును వచ్చితిమి).

ఈ క్రిందిరీతి శబ్దముల నుద్దేశించి కావలయును "ఏకవచన బహువచన ప్రత్యయములు చేరనిశబ్దముల నుత్తమపురుష రూపములనుగ వైయాకరణు లుదాహరింతురని దొరగారు వ్రాసినారు" కాని వానియందు బహువచన ప్రత్యయము చేరదనుట పొరపాటు.

"కటతఱ......" (తొల్కా. ౬౮౭ సూ.)='కు-టు-తు-ఱు' అనునవి యును 'ఎన్-ఏన్-అల్' అనునవియును దుదినిగల క్రియ లుత్తమ పురుషైక వచనములు. ఉదా:-చెయ్కు=(చేయుదును) కణ్టు=కణ్డు=(చూచితిని). చెయ్దు=(చేసితిని-చేయుదును) చెన్ఱు=(చనితిని). చెయ్దనెన్=చెయ్దేన్=(చేసితిని). చెయ్వల్=(చేయుదును). 'కు-అల్' భవిష్యదర్థమున మాత్రము వచ్చును. 'టు' భూతార్థమున మాత్రమె వచ్చును. 'దు' భూత భావులు రెంటను వచ్చును. ఇందలి-'కు-టు-తు-ఱు' అనువానిని దొరగా రుద్దేశించియుందురు. కాని వీని మీఁద బహువచన ప్రత్యయ 'మ' కారము నిల్చును. ఏకవచన ప్రత్యయము మాత్రము వేఱుగ నిల్వదు.

"అవైతామ్......" (తొల్కా. ౬౮౬ సూ.)=" 'అమ్-ఆమ్-ఎమ్-ఏమ్-కుమ్-డుమ్-తుమ్-ఱుమ్-' అనునవి తుదినిగల క్రియ లుత్తమ పురుష బహువచనములు......".

'నడన్దనమ్-నడన్దనెమ్' అను వానిలోని 'నమ్-నెమ్' అను వానియందలి నకార ముచ్చారణార్థక సంహితా వ్యవధాయక వర్ణమాత్రమని దొరగారు వ్రాయుట పొరపాటు. ఆ నకారము ప్రాచీన ద్రావిడ ప్రత్యయభాగము. ఈ విషయ మీ వఱకు విపులముగఁ బ్రదర్శితమయ్యెను. "నడన్త్+అన్+అమ్=నడన్దనమ్. నడన్త్+అన్+ఎమ్=(నడచితిమి)" అని భేదము. (చూడు 3౨ IV విష. ఇరుక్కిన్ఱనన్.) (చూడు 33 విష. ఎన్మనార్).

౧౦౬. III విష:—"మలయాళోత్తమ పురుష సర్వనామ ప్రథమాది రూపముల పట్టిక:—

| ఏక వచన రూపములు | | | బహు వచన రూపములు | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు |
| ఞాన్<br>onion=ఆన్<br>యన్=ఎఱ్ఱి | ఎన్—ఇన్.<br>చతుర్థిలో<br>'ఇనిక్కు— | ఏన్. మలయాళమునఁ<br>బురుషబోధక ప్రత్య<br>యములు లేవు. | నామ్—<br>నోమ్—<br>నమ్మళ్— | ఞజ్ఞళ్—<br>ఎజ్ఞళ్—<br>(నో-నోమ్?)<br>నామ్- | ఓమ్ |
| యుల్లి. ఇందలి<br>'న్య'=అను<br>దానిపలుకుబడి<br>వంటిది 'ఞాన్'<br>లోని 'ఞ'<br>కారము యొక్క<br>పలుకుబడి. | ఎనిక్కు—<br>ఎనక్కు'<br>అను రూప<br>ములుండును | (చూడు—౧౦౫ II విష-<br>'పురుషభేదని రాసః'.)<br>(లీలాతిలకము—౨<br>శిల్పము—౨౮ సూ) | ఞజ్ఞళ్—<br>నుమ్మళ్<br>(ఎజ్ఞళ్?) | (నమ్ ?)<br>నుమ్ | |
| | | కాని పద్యకావ్యము<br>లలోఁ గన్పట్టును.<br>'అడియేన్=దాసుఁ<br>డను. అడియన్=<br>దాసుఁడను' అను<br>రీతిగల యస్మదర్థక విశే<br>షణములును గలవు. | 'నామ్'<br>అను దానికి<br>బదులుగ<br>'నోమ్'<br>అనునది<br>యరుదుగ<br>వాడఁ<br>బడును. | 'ఞజ్ఞళ్—<br>ఎజ్ఞళ్'<br>అను హ్రస్వ<br>ములు వింత. | మలయాళమునఁ<br>బురుషబోధక<br>ప్రత్యయములు<br>లేవు. కాని యివి<br>పద్యకావ్యము<br>లలో మాత్రము<br>చూపట్టును.<br>(చూ.౧౦౫ II విష.<br>౮ సూ). (చూ.<br>లీలాతిలకము ౨<br>శిల్ప ౨౮ సూ.)" |

(కాల్డు ౩౬౨ పుట).

౧౦౬. IV విష:—"కర్ణాటోత్తమ పురుష సర్వనామ ప్రథమాది శబ్దముల పట్టిక:—

| | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమాంత శబ్దము | ద్వితీయా ద్యంగములు | క్రియా ప్రత్యయములు | ప్రథమాంత శబ్దములు | ద్వితీయా ద్యంగములు | క్రియా ప్రత్యయములు |
| (హొస గన్నడ) వ్యావహారిక రూపములు | నాను. నా | నన్ | ఎను – ఏను. ఏనె - ఎ | నావు. ('నాము' అని యుండవలసి యుండఁగా నందలి 'మ' కారము వకార మయ్యెను). | నమ్ | ఎవు. ఏవు- ఏవె |
| గ్రాంథిక రూపములు | ఆన్-యాన్ | ఎన్ | ఎన్ - | ఆమ్ ఆవు | ఎమ్ | ఎవు. (ఇది - 'ఎము' అని యుండ వలసినది – మకారము వకార మయ్యెను). |

తెల్గునందువలెనె కర్ణాటమందును ప్రాతిపదికము మాత్రమె ప్రథమైక వచనముగా 'నా'—అనునది—వాడఁబడుట విశేషము" (కాల్డు. ౩౬౨, ౩౬౩ పుటలు).

విమర్శము:—కన్నడమున 'నాన్ = (నేను) నామ్ = (మేము)' అను రూపాంతరములు గలవని దొరగారెఱింగియున్నచో వాని నుదాహరించి యుండరా? కాల్డువెల్లుగారు వ్రాయకుండుటచేతనె వికాస కర్తగారును (చూడు 'ఆం. భా. వి.' ౪౭౯ పుట) భాషా చరిత్రకర్తగారును (చూడు 'ఆం. భా. చ.' ౧౧౩౪ పుట) నుదాహరింపరైరి. వీ రెవ్వరును నీ క్రింది మకరంద వ్యాఖ్యను జూచియుండలేదని తోఁచెడిని. పటగన్నడమందుఁగాని హొసగన్నడమందుఁ గాని ద్రుతవ్యవహారమును దాని పదాంత లోపాదికమును లేవు గానఁ దన్నా

ర్గము ననుసరించి 'నా=(నేను)' అనెడి రూపము హాలసగన్నడమందుఁ గల దనుట సరికాదు (చూడు హాలసగన్నడ వ్యాకరణ శబ్దాదర్శము ౭౮ సూ).

'యాన్' అనునది తమిళోత్తమ పురుష సర్వనామ ప్రథమైకవచనము. కన్నడమున నట్టిరూపము లేదు. 'ఆవు' అను బహువచన రూపమును గన్నడమున లేదు. వీనిని గన్నడరూపములనుగా దొరగా రుదాహరించుట వింత!

'తన్నినెనో మనేకత్వే' (కర్ణాట శబ్దానుశాసనము ౨౮౨ సూ.) భాషా మఞ్జరీ వృత్తిః—'తన్-నిన్-ఎన్' ఇత్యేతేషాం 'మ'కారా దేశో భవతి. అనేకత్వే సుపిపరే. ప్రయోగః. తామ్-(తాము). నీమ్=(మీరు). ఆమ్=(మేము). (కర్ణాట వైయాకరణులు 'తన్-నిన్-ఎన్' అనువానిని ప్రాతిపదికములుగా నిల్పి రూపసాధన ప్రక్రియను నడపింతురు).

'ఆదేనః' (కర్ణాట శబ్దా. ౨౮౫ సూ.)=భాషామఞ్జరీ వృత్తిః—'ఎన్' ఇత్యేతస్య దీర్ఘ ఆకారో భవతి మకారే సుపి ('మ్' అను ప్రథమైకవచన బహువచన ప్రత్యయము) పరే. ప్రయోగః—ఆన్=(నేను) ఆమ్=(మేము). ఈ సూత్రములనుబట్టి కన్నడభాషయందు 'యాన్' అనునది యుత్తమ పురుష ప్రథమైక వచన రూపమనికాని 'ఆవు' అనునది యుత్తమ పురుష బహువచన రూపమని కాని చెప్పుట నిర్మూలమనక తీరదు. 'In the classical dialect, or what is commonly called 'Old Canarese' the nominative is ân yân, or âm;... ...............' (కాల్డు. 3౬౨ పుట). '.........Plurals: nominative, coll. dial. nâvu; class. dial. âvu;.........' (కాల్డు. 3౬3 పుట).

క్రియా ప్రత్యయములలో 'ఎ' అనునది కన్నడోత్తమ పురుషైకవచన ప్రత్యయము కాదు. కే చిన్నతమున మధ్యమ పురుషైకవచన ప్రత్యయముగాఁ జెప్పఁబడి యున్నది.

'ధాతో రేకానేకత్వేఽమరయిరెనెవవోఽన్య యుష్మదస్మత్సు కర్తరి.' (కర్ణాట శబ్దా. ౪౪౨ సూ.)=భాషామఞ్జరీ వృత్తిః—"అన్య యుష్మదస్మదర్థేషు ప్రత్యేకం ఏకత్వానేకత్వయోః వివక్షితయోః యథాక్రమం ధాతోః 'అమ్-అర్ (ప్రథ), అయ్-ఇర్ (మధ్య), ఎన్-ఎవు' (ఉత్త) ఏతే ప్రత్యయా భవన్తి కర్తరి అభిధేయే......ఎనో దీర్ఘమపి కేచిదిచ్ఛన్తి......తథాత్ర తృతీయ (అయ్) మైకారం అర్ధేకారమపి (ఎ) కేచిదిచ్ఛన్తి." (కర్ణాట శబ్దా. 3౭౨—3౭౮ పుటలు).

"The personal termination of this person of the verb, when nu is dropped, becomes e,........." (కాల్డు. 3౬3 పుట).

దొరగారు తఱచుగా నుదాహరించు హళాసగన్నడరూపముల స్థితి నిచటఁ బరిశీలింపవలెను. హళాసగన్నడములోని 'నాను-నావు' అను నుత్తమ పురుష సర్వనామ ప్రథమా రూపములును 'నన్-నమ్' అను హళాసగన్నడ ద్వితీయా ద్యంగములును దొరగా రుదాహరించిన గ్రాంథిక భాషలో లేని వెట్లు వచ్చినవో పరిశీలింపలేదు. అవి నిర్మూలములు కావు; ప్రాచీన కర్ణాటమున నస్మదర్థక రూపములు 'ఎన్-నన్' అను రెండు జాతులుగ నుండెడివి. వీనిలో 'ఎన్' అను దానిని సంబంధించిన రూపములు మాత్రమె కర్ణాట భాషా భూషణ శబ్దమణిదర్పణ కర్ణాట శబ్దానుశాసనములలో సాధింపఁబడినవి. కర్ణాట శబ్దానుశాసనపు మంజరీ మకరంద వ్యాఖ్యలో 'నాన్=(నేను), నామ్=(మేము) నన్నం=(నన్ను) నమ్మం=(మమ్ము)' అను రీతిగల రెండవజాతి రూపములు ప్రాచీన కర్ణాటమునఁ గలవనుచు సప్రమాణముగా—ప్రాచీన కర్ణాట ప్రయోగములతో—నిరూపింపఁబడినవి. ఇవి యుత్తర మార్గానుగామి కవి సమ్మతములనియు దక్షిణమార్గానుయాయి కవులు 'ఎన్' రూపపక్షపాతు లనియు నీ దక్షిణోత్తర మార్గభేదము నృపతుంగుని కవిరాజమార్గమున విశదీకరింపఁబడెననియు నీ క్రింది రీతిని వ్రాయఁబడెను. ఈ యుదీచ్య కర్ణాట ప్రాచీన కవి సమ్మతరూపములె హళాసగన్నడములోని 'నాను=(నేను), నావు=(మేము)' అను ప్రథమారూపములకును 'నన్-నమ్' అను ద్వితీయాదుల యేకవచన బహువచనముల యంగములకును మూలము లని గ్రహింపవలెను. ఇది తమిళమందలి యర్వాచీనమగు 'నాన్=నేను' అను దానిని, 'నామ్=(మనము) నమ్మై=(మనలను)' మున్నగు ప్రాచీన యుష్మ దస్మ దుభయార్థక రూపములను, తెల్గులోని నకారాదికములగు 'నేను-నన్నున్-నాచేతన్' మున్నగువానిని సంబంధించుచున్నదనియు గ్రహింపవలయును. కేవల ప్రాచీనతమకాలమునఁ దమిళమందువలెనె హళహళ=(మిక్కిలి ప్రాచీన) గన్నడమందును 'నామ్'=(మనము) మున్నగు నుభయార్థక బహువచన రూపములె వెలసి యుండెడి వనియుఁ గాలక్రమమున 'నాన్'=(నేను) మున్నగు నేకవచన రూపములును 'నామ్' మున్నగువాని కస్మదర్థకత్వమాత్రమును సంభవించె ననియు నూహింపనగును. ఇట్టి యూహకు 'మాడువం' (మనము చేయుదము) మున్నగు చోటులందలి యుభయకర్తృక ప్రార్థనా ద్యర్థకమగు కన్నడ 'అమ్' ప్రత్యయమె మూలమనఁదగును (చూడు ౧౧౩ VII విష).

"అత్ర తనాది ప్రకరణే అస్మదర్థ వాచకో 'నన్' శబ్దః కశ్చి దస్తి. ప్రక్రియాపి తస్య తనాది సాధారణీ ఉక్త లక్షణైవ. న విలక్షణా. రూపనిష్పత్తిశ్చ:—నాన్-నామ్; నన్నం-నమ్మం; నన్నిం నన్నిందె-నన్నిందం; నమ్మిం-నమ్మిందె-నమ్మిందం;

ననగె-నమగె......ప్రయోగశ్చ:—క. శ్రీమదనుపమ జినేంద్రప । దామర కుజయుగళ మవనతామరపతి చూ । డామణి మరీచిలతికో । ద్దామం నమగీగె (నమగె+ఈగె) విమల రత్నత్రయమం ॥..... (మఱిరెండు పద్యము లుదాహ రింపఁబడెను)......బహుళ ముపలభ్యతే.......తథాపి స క్కైశ్చిదే వాఙ్గీ క్రియతే. ఉత్తర మార్గానుగామిభిః కవీశ్వరైః, న సర్వైః. దక్షిణ మార్గాను యాయిభి స్తై రనఙ్గీకారాత్. ఎన్పతుపాతినోపి దాక్షిణాత్యాః కవిజనాః (నాగవర్మ కేశిరాజాదులు) ఇతి దక్షిణోత్తర మార్గభేద భిన్నప్రయోగ చాతురీ ప్రపఞ్చో నృపతుఙ్గగ్రన్థే ద్రష్టవ్యః" (కర్ణాట శబ్దా. ౨౮౭ సూత్రపు మంజరీ మకరందవ్యాఖ్య).

౧౦౬. V విష.—"తెలుఁగు నందలి యుత్తమ పురుష ప్రథమాది రూప ముల పట్టిక:—

| | ఏకవచన రూపములు | | | బహువచన రూపములు | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు |
| వ్యావహారిక రూపములు | నేను-నే | ... | ... | మేము<br>మనము | ... | ... |
| గ్రాంథిక రూపములు | ఏను-ఏ | ద్వితీయ } నన్ (నన్నున్) | ను | ఏము | ద్వితీయ } మమ్ (మమ్మున్) | ము |
| | | తృతీయా ద్యంగము } నా | ఇకారమునకుఁ దర్వాత:—ని | | తృతీయా ద్యంగము } మా మన | ఇకారమునకుఁ దర్వాత—మి. |

ఈ సర్వనామముయొక్క యవయవములోని యచ్చులు 'అ-ఎ' అను నవి. 'అ' అను దాని కన్న 'ఎ' అనునది ప్రాచీనము మధురమైనదియు నయి యున్నది. తెలుఁగు పురుషబోధక క్రియా ప్రత్యయములు మూఁడు పురుషము లందును సర్వనామ ప్రథమా రూపముల తుదివర్ణములు. నేను-ను-ని; నీవు-వు-వి; వాఁడు-ఁడు; మేము-ము-మి; ప్రథమ మధ్యమ పురుష పుం స్త్రీ సాధారణ ప్రత్యయము 'రు-రి'. వీనిలో సర్వనామ ప్రధానావయవములు విడువఁబడినవి. మిగిలినవి లింగవచన బోధక ప్రత్యయములె" (కాల్డు. ౩౬౩ పుట).

విమర్శము:—'నే' అనునది ప్రథమా రూపమనుట యాంధ్ర సంప్రదాయ విరుద్ధము. ఆంధ్ర వైయాకరణులు 'నా-నీ-తా' అనునవి ప్రాతిపదికము

లందురు. మఱియు 'ను' వర్ణ విరహితములగు 'నే-ఏ' అనునవి ప్రథమైక వచనము లనుట తప్పు. 'నే నిచ్చితిని-ఏ నిచ్చితిని' అను సాధురూపములచోట 'నే యిచ్చితిని-ఏ యిచ్చితిని' అను రీతిగల యసాధు రూపములు గల్గవలసి వచ్చును. అట్టి రూపములను వైదేశికు లంగీకరింతు రేమో కాని తెల్గువా రెవ్వరును నంగీకరింపనేరరు.

'నన్నున్-ఏను' అను వానినిబట్టి కావలయును 'అ-ఎ' అను నచ్చు లంగములని దొరగారు వ్రాసిరి. 'ఏను-ఏము' అను ప్రథమా రూపములందుఁ దప్పఁ దెల్గున నస్మదర్థక రూపములలో 'ఎ' అను నంగ మెచ్చటను నిలువదు.

ఇంక 'నేను-మనము-మేము' అనునవి వ్యావహారిక రూపమాత్రము లనుట సాహసము. ఇవి ప్రాచీనాంధ్ర వాఙ్మయమున విస్తరించి యున్నవి. 'ఏను-ఏము' అను రూపము లతిస్తృతములయిన నగుం గాక!

నేను:—చ. అలయక యేన దేవ యజనాధ్యయన వ్రత పుణ్య కర్మ ములే । నలుపుదు నేని నేన గురుసద్ద్విజ భక్తుఁడనేని నేన య । త్యలఘు తపస్వి నేని......(ఆది. ౧ ఆ. ౧౪౯) (ఏని కళ).

క. ......న । న్నెవ్వరు మార్కొన లేమికి । నొవ్వం గురురాజు నేఁ దునుముదును ద్రోహిన్ (ద్రోణ. ౨ ఆ. ౩౧౩) ('కురు రాజు నొవ్వన్' అని యన్వయము).

ఉ. రండిట యొక్కరుఁ డొక్కఁడ దురం బొనరింపఁగ మీరు నల్వురో । క్కండను నేను హేతిహతకాయత డస్సిన వాఁడ......(శల్య. ౨ ఆ. ౧౦౩ ప.) ఆ. వె. పసులఁగాచి కాని బ్రదుక గౌరవుల ప్రాఁ । తలము మున్ను నేను ధర్మపుత్త్రు । పశుగణంబు నెల్లఁ బాలింతు......(విరా. ౧ ఆ. ౨౭౫) ('కౌర వుల ప్రాఁ । తలము మేము నేను ధర్మ......' అని డా. నారాయణరావుగారి పాఠము. చూడు ఆం. భా. చ. ౧౧౭౭ పుట).

చ. తడయక యేఁగి నీతిబలదర్పము లొప్పఁగ వాని డాసి క । వ్వడియును నేను భీముఁడు నవశ్యము......(సభా. ౧ ఆ. ౧౭౪) ఇట్టివి పెక్కు నన్నయ వాడుకలు గలవు).

మనము:—సీ.......పాండు భూజనపతి జీవించి మనలఁ గావ ।...... (ఆది. ౮ ఆ. ౭౩ ప.) ఇట్టివి యనేకములు గలవు. చూడు 'వ్యా. సం.' ౨౧౯ I విష.) ఇది కేవలాస్మ దర్థకము కాదు. యుష్మ దస్మ దుభయార్థకము.

మేము:—"మేము మాతపో దృష్టిం జూచితిమి......" (ఆరణ్య ౨ ఆ. ౧౦౨-గద్యము).

క॥ ఓడితిమె మేము రణమునఁ।
  గ్రీడికి......(ద్రోణ ౧ ఆ. ౩౭౮).
  క. మనుజేశ్వర విడువు పంపు మమ్ము దెలివితోన్॥
  (కర్ణ. ౩ ఆ. ౧౦౩ ప).

ఉ......ఆయనే। మేమయి యున్నవారము సుమిత్రా వికచాంబుజ
  పత్రలోచనా॥ (విజయ. ౨ ఆ. ౧౬౫ ప).
  కం......మేము ప। ఠింపని శాస్త్రములె మా పఠింపని శ్రుతులే॥
  (ఆము ౬ ఆ. ౩౨ ప. ప్రౌఢ-కార. ౧౫ సూ).

ప్రయోగము లిట్లుండఁగా నాంధ్ర శబ్దచింతామణి వ్యాకరణమున నీ రూపములు నన్నయ భట్టారకునిచే నీ క్రిందిరీతి సాధింపఁబడినవి. "దేశ్యా దస్మ ద్యుష్మ। చ్ఛబ్దా త్సుజసో ర్ను మూ వురూచ స్తః।......ఏ దస్మద ఏతయో ర్బ హుత్వే మః।......। భూయ ఉభయార్థవాచీ। యః కశ్చి ద్భవతి నిత్య బహు వచనః। తస్య జసో 'ము' శసో 'ల'ః। ప్రాగ్వ త్సర్వం భిసాది కేన్యత్ర" (ఆం. చిం. చూడు 'వ్యా. సం.' ౨౧౯ విష).

మఱియుఁ దమిళ కర్ణాట ప్రసిద్ధములగు 'నాన్-నన్' అను వానిని సంబంధించు నకార ఘటితములు 'నేన్-నన్నున్-నాచేతన్' మున్నగునవి తెల్గు నందును బ్రాచీనములై వెలసియుండెననుటకు సంకోచింపనేల? ద్వితీయా ద్యంగము 'న' కార ఘటితమె (నన్-నా) తెల్గునఁ గలదు కాని 'ఎ' కార ఘటిత రూపము గ్రాంధిక భాషయందుఁగాని వ్యావహారిక భాషయందుఁగాని మచ్చున కేని లేదు. తొల్కాప్పియము నాఁటికే 'న' కార ఘటితమగు 'నామ్' అను రూపము వెలసి యున్నది. తొల్కాప్పియము నాఁడు దాని కుభయార్థకత్వ ముండెడిది. కాలక్రమమున దాని యుభయార్థకత్వము కర్ణాటాంధ్రములలో మాసిపోయి కేవలాస్మదర్థకత్వమె నిల్చినది. ఏడవ శతాబ్దపు నృపతుంగుని నాఁటికే 'నామ్' అనుదాని యీ యర్థ పరిణామమును 'నాన్-(నేను)' అను నేక వచన రూపపు వాడుకయు విస్తరించినవని పయిరీతిని విశదమగుచున్నది. తమిళ మందలి 'యాన్' అను దానిని దెనుఁగులోని 'ఏన్' అనునది సంబంధించు చున్నది. దీని సంపర్కముననే 'నాన్' అనునది తెల్గున 'నేన్' అని యేర్పడి యుండును. తమిళ కర్ణాటములలోని 'నామ్-నమ్' అను వానిలోని మకార మును దెల్గులోని 'మేము-మమ్ము-మాచేన్' అనువాని మకారము సంబంధించు చున్నది. 'నామ్' అనునది యస్మదర్థకముగా మాఱిపోవుటచేతనే తెల్గున 'మన' అను నుభయార్థక శబ్ద మవతరించిన దయ్యెను. ఇది 'నామ్' అనుదాని వ్యత్యయ వికృతియే కానోపును. తొల్కాప్పియము నాఁటికే ప్రసిద్ధమయి

యున్న 'యాన్'=(నేను) అనుదానిని 'ఆన్' అను కర్ణాట రూపమును 'ఞాన్' అను మలయాళ రూపమును 'ఏన్' అను తెలుఁగు శబ్దమును సంబంధించుచున్నవి. 'యాన్' అను దానినుండి 'ఆన్' అనునది యేర్పడుట సహజము. 'ఆన్' అను దానినుండి 'యాన్' 'ఏన్' అనునవి యేర్పడుట యసంభవము. కాన 'ఆన్-యాన్=ఞాన్=నాన్=నాను=నేను' అని యుత్పత్తి క్రమమును 'ఆం. భా. వి.' కర్తగారు చూపుట సరికాదు. 'వచ్చినవాఁడను=వచ్చినాఁడను=వచ్చినాను' అను నుత్పత్తి క్రమముగల పదునాఱవ శతాబ్దమునాఁటి (చూడు ౭౧ XV విష). తెల్గు 'నాను' శబ్దమును లేదా యనక్షరుల వాడుకలోని యాధునిక మగు 'నాను' శబ్దమును నర్వాచీనమగు హొసగన్నడపు 'నాను' శబ్దమును నన్నయ నాఁటికె ప్రయుక్తమగుచుఁ జింతామణిచే సాధితమగుచున్న నేను శబ్దమునకన్నఁ బ్రాచీన రూపమనుట కేవలము నసంభవము.

"తెనుఁగున 'వచ్చినాను-వచ్చినాము' మొదలయిన క్రియా రూపముల తుదిని 'ఆ' కార యుక్త రూపముండుటవలనను, తెనుఁగున నేఁటికిని 'నాను-నాము' అను రూపములె విద్యా విహీనుల నోటిని బ్రథమా విభక్తిలోఁ గూడ వినఁబడుచుండుటవలనను 'ఆ' కార యుక్త రూపమె ప్రాచీనమని తోఁచు చున్నది. అట్లయినచో 'ఆ' అనునదే ప్రాచీన ద్రావిడ రూపము. తుదినున్న నకారము కేవల వచన బోధకము. 'ఆన్=యాన్=ఞాన్=నాన్=నాను=నేను' అనునట్లు మాఱియుండవచ్చునని యూహింపఁబడినది." (ఆం. భా. వి. ౪౭౦ పుట). 'యాన్-యామ్' అనువాని ప్రకృతి వేఱు. 'నాన్-నామ్' (నీ+యా=నా=మన) అనువాని ప్రకృతి వేఱు. అవి యభిన్న శబ్దములనుట పొరపాటు. 'వచ్చినాను' అనువానివంటివి 'నేను' శబ్దమునకన్నఁ బ్రాచీనములని వికాసకర్తగారి వంటి దేశీయ పండితులు వ్రాయుట వింత! వైదేశికులగు దొరగారు వ్రాసిన వ్రాయుదురు గాక! 'వచ్చినవాఁడను' అనురీతివె నన్నయ కాలపు రూపములు. 'వచ్చినాఁడను' అనురీతివి తిక్కన కాలమున బయల్వెడలినవి. 'వచ్చినాను' అను రీతివి పదునాఱవ శతాబ్దము వఱకుఁ మహాకవి సమ్మతములు కాలేదు. ఇట్టి రూపములు నన్నయ నాఁడుగాని తత్పూర్వముగాని మచ్చునకేని లేవనుటకు సందేహము లేదు.

తెలుఁగున 'నేము' అను 'మేము' శబ్దపర్యాయ మర్వాచీనముగా బయల్వెడలినది. ఇది ప్రాచీనాంధ్ర వాఙ్మయమునఁ గానరాదు. నన్నయా

ధర్వాణులు దీనిని సాధింపలేదు. ఉ. నేము భవన్నియోగ సరణిం జరియించుచు నొక్క- శూద్రు ను। ద్దాముని......(శ్రీరంగమహాత్మ్యము. ౩ ఆ. ౫౯౧ భైరవ) అనురీతి నర్వాచీన కవుల గ్రంథములందుఁ జూపట్టును. ఇది భారత మందుఁ గలదనుట విశ్వసనీయము కాదు. "నేము-(S. I. I. IV. ౨౮౦. ౮౦౨. భార, అరణ్య V ఆశ్వా. ౨౦౦)" (ఆం. భా. చ. ౧౧౭౬ పుట) "నీమది చంద మిట్టిదని నిక్క-మెఱుంగక నే మజప్రమున్।......" అరణ్య ౫ ఆ. ౨౦౦ ప.) ఇందు 'మేమజప్రమున్-యేమప్రమున్' అను వానిలో నేదేని కవి ప్రయుక్త మనఁదగును.

౧౦౬. VI విష:—"తుళు భాషలోని యుత్తమ పురుష సర్వనామ ప్రథమాది రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు | ప్రథమా రూపములు | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు |
| యాన్ | యెన్ (యెన-పట్టిక) | ఎ | నమ - యెన్కుళు | నమ్ = (నమ) / యెజ్జళ్ (ఎజ్జుళ్ ?) | అ |

ఇచట మాత్ర మిందలి పదాది యకారము, వ్రాఁతలో సైతము గలదు. పయి యుత్తమ పురుషైక వచన ప్రత్యయమగు 'ఎ' అనుదాని పలుకుబడి యాంగ్ల భాషలోని 'man' అను శబ్దమందలి 'a' అను దాని యుచ్చారణమును బోలియుండునని బ్రిగ్గెలు దొరగారు చెప్పుచున్నారు. తుళులోని పురుష కర్తృక ప్రథమ పురుషైక వచనరూపమగు 'ఎ' అను ప్రత్యయము స్వచ్ఛమగు 'ఎ' కారోచ్చారణముతోనె యున్నది. తుళులోని యుత్తమ పురుష బహు వచన క్రియా ప్రత్యయమును నపుంసక ప్రథమైక వచన సర్వనామమును 'అ' అనియె యుండుట మిక్కిలి వింత!" (కాల్డు. ౩౬౩, ౩౬౪ పుటలు).

| " భాషలు విషయము | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| తుద భాష. ౧౦౬ VII విష. కాల్డు. ౩౬౮ పుట. | ఆన్ | ఎన్ | ఎన్-ఎని-ఇని | ఆమ్-ఓమ్-ఏమ్ | ఎమ్ ఆమ్? అమ్? | ఎమి-ఇమి |
| కోత భాష. మెడ్జి దొరగారు చెప్పినది ౧౦౬ VIII విష. కాల్డు. ౩౬౮ పుట. | ఆనె | ఎన్ | ఎ | ఆమె-ఏమె-నామె | ఎమ్-నమ్ | ఏమె-ఎమె |
| గోందు భాష. ౧౦౬ IX విష. కాల్డు. ౩౬౮ పుట. | అన్నా ఆను (హంటరు దొరగారు) | నా నాన్దె (హంటరు దొరగారు) | ఆన్ - న | అమ్మాట్ | మా | ఆమ్-అమ్-ఓమ్ |
| కు=ఖోండు భాష. ౧౦౬ X విష. కాల్డు. ౩౬౮ పుట. | ఆను | నా | ఇన్-ఇ ఉదా- మాయిన్= (ఉన్నాను) మాస్సె= (ఉంటిని). (ఇజ్-ఎ-పట్టిక) | ఆము (ఆజు-పట్టిక) | మా-ఆ జు-అమ్మా | ... ఆము (పట్టిక) |
| రాజమహల్ భాష. ౧౦౬ XI విష. కాల్డు. ౩౬౮ పుట. | ఎన్ | ఒన్గికి= (నాది) ఒన్ | ... | నమ్-ఒమ్ (ఎమ్-ఎన్ పట్టిక) (నామ్-పట్టిక) | ఎమ్కి= నామ్కి= (మాయొక్క) ఎమ్ హి= (మాయొక్క) | ... ... |
| ఒరాఒన్ భాష. ౧౦౬ XII విష. కాల్డు. ౩౬౮ పుట. | ఎన్ | ఎన్ఘి= (నా యొక్క) | ... | ఎమ్ 'ఎన్'- (హంటరు దొరగారు) | | |
| బ్రహుయి భాష. ౧౦౬ XIII విష. కాల్డు. ౩౬౮ పుట. | ఈ | క-కన్ (ఉదా- కనా= (నా యొక్క) కనె= (నన్ను) (నాకు) | ... | నన్ | ... | ఎన్- (ఉదా- అరెన్= ఉన్నాము)" |

"ఉత్తమ పురుషైక వచన విషయమున ద్రావిడ భాషల సంబంధ మీ బ్రహుయి భాషకు లేదు. 'హూని ఫారమ్ సిథియన్-బాబిలోనియను-గుజరాతి.' అను భాషలలోని 'ఉ-హు' అను వానితో నధిక సంబంధమున్నట్లు కన్పట్టుచున్నది. (బహువచనమున ద్రావిడ భాషల సంబంధము బ్రహుయి భాషకు స్పష్టముగాఁ గలదు గాన నిట దానిని జేర్పనయ్యెను)" (కాల్డు. ౩౬౪ పుట).

౧౦౭. I విష:—యాన్ శబ్దపు ప్రాచీనత:— ప్రాచీనతమ ద్రావిడోత్తమ పురుష ప్రథమాదిరూప విమర్శము:—

"నా మొదటి ముద్రణమునఁ దమిళములోని 'నాన్' అను ప్రథమైక వచనరూపము ప్రాచీన ద్రావిడరూపమునకుఁ దక్షిణవానికన్న సన్నిహిత మనియుఁ గన్నడములోని 'నా' అను ప్రాతిపదికమె (దొరగారు 'నాను' అను హళగన్నడరూపమును మాత్రమె యుదాహరించిరిగాన నిచట వారు పేర్కొను 'నా' అనునది హళగన్నడ సంబంధియె. గ్రాంథికములగు 'నాన్-నామ్' అను రూపము లున్నవనియే దొరగారికిని దెలియదు.) ప్రాచీనతమ మనియు వ్రాసితిని. 'యాన్' అను దానికంటె 'నాన్' అనునదె ప్రాచీనతరమని ముందు విశదము కాఁగలదు. ముద్రణము కానున్న సమయమందు 'యాన్' అనునదె ప్రాచీనతరమని భావించితిని. ఉత్తమ మధ్యమ పురుష సర్వనామములలోఁ దుది నకార మేకవచన ద్యోతకము. మొదటి నకారమెట్టిటో వ్యక్తిబోధకమగుననియు మధ్యనున్న యచ్చులె—'అ-ఇ' అనునవె—యుత్తమ మధ్యమ పురుషభేద బోధకము లనియు నే నప్పుడును నిప్పుడును దలంచుచునే యున్నాను" (కాల్డు. ౩౬౪, ౩౬౫ పుటలు).

"డా. గుండర్టు దొరగారు, డా. పోపు దొరగారును (చూడు ౫ పుట. పోపు దొరగారి తఱద వ్యాకరణ పుస్తకము) 'నాన్' అను దానికంటె 'యాన్' అనునదె ప్రాచీనతరమనిరి. కీ॥ శే॥ గోవరు దొరగారు తుదికి 'ఆన్' అనునదిగాని 'ఏన్' అనునదిగాని ప్రాచీనమనిరి. వీరు 'అస్మద్' అను దానినుండి యిది యేర్పడెననియుఁ దలంచిరి. 'ఆన్ - యాన్ - నాన్' అనెడిది వారి యుత్పత్తి క్రమమని ప్రమాణీకరించుచున్నాను" (కాల్డు. ౩౬౫ పుట).

"'యాన్' అనునది 'ఆన్' అనునదిగా మాఱుట సహజము. ఉదా:— తమి-యావర్ = యార్ = ఆర్ = (ఎవరు). యాణ్డు = ఆణ్డు = (ఎప్పుడు - సంవత్సరము) 'యాన్' అనునది 'ఆన్' అనియు 'ఏన్' అనియు మాఱెననుట సహజము" (కాల్డు. ౩౬౫, ౩౬౬ పుటలు).

"తమిళు, మలయాళములలో 'య' అనునది 'న'కారముగా మాఱుట గలదు. తమిళమున ఇకారముతోఁగాని నకారముతోఁగాని యారంభించు

శబ్ద మితర ద్రావిడ భాషలలో నచ్చుతో నారంభించును. ఉదా:—తమి-నీన్దు=తెల్గు-ఈఁదు. తమి-మలయాళ-నణ్డు=య(ఞ?)ణ్డు= తెల్గు-కన్న-తుళు-ఎణ్డే=ఎణ్ట్రి-యణ్డ్రి. పయివానిలోని పదాది 'న'కారము ధాతు (తమిట) జన్యమని, నిశ్చయింపఁ జాలము. ఉదా:—తమి-చొల్లియ=చొల్లిన=చొన్న=(చెప్పిన). ఈ భూతార్థక విశేషణములలో సంహితా వ్యవధాయకము మొదట 'నకారమా? యకారమా?' అను విషయము సందిగ్ధమె. సంస్కృ-యుగమ్=తమిట తద్భవము-నుగమ్ (తఱుచు);=ఉగమ్ (అరుదు). సంస్కృ-యమ=తమిట-తద్భ = యమన్ = ఞమన్ = నమన్ = ఎమన్. పయి యుదాహృతులనుబట్టి 'య'కారము పరుషమగు 'న'కారముగాను సరళమగు నచ్చుగాను మాఱు ననఁదగును. పయి సందర్భమునుబట్టి ప్రాచీన ద్రావిడ 'యాన్' శబ్దము కొన్నియెడల 'నాన్' అనునదిగాను మఱికొన్ని భాషలందు 'ఆన్' లేదా-'ఏన్' అనునదిగాను మాఱిన దనఁదగును. మఱియుఁ దమిట కన్నడ ద్వితీయాద్యంగము 'ఎన్' అనునదగుటచేత నయ్యది 'యాన్' అనుదానినుండి యేర్పడె ననుట సంభావ్యము కాని 'నాన్' అనుదానినుండి యేర్పడెననుట సహజము కాదు. ఉదా:—తమి-యావర్=ఎవర్=(ఎవరు). యాఙ్గు=ఎఙ్గు=(ఎక్కడ), సంస్కృ-యన్త్రమ్=తమిట-ఎన్దిరమ్. సంస్కృ-యజమాన=తమి-ఎశమాన్. 'యాన్' అనునది 'నాన్' అనునదిగఁ బరిణమించుటలోని మధ్యావస్థారూపము. మలయాళమందలి 'ఞాన్' శబ్దమనఁదగును" (కాల్డు. ౩౬౬, ౩౬౭ పుటలు).

౧౦౭. II విష:—"పయిరీతిని 'యాన్' అనునదే ప్రాచీనమని తోఁచుచున్నను నీ క్రింది విధమున 'నాన్' అనునదే ప్రాచీనతరమని నిశ్చయింపఁదగును:—ఈ సర్వనామముయొక్క యాద్యక్షరములగు 'యాన్=నాన్=ఞాన్' అనునవి క్రియాప్రత్యయములలో లోపించుచున్నవి. తుది 'న' కారము సదా యన్నిట నిల్చుచున్నది. ప్రాచీన తమిట వ్యాకరణములలో 'యాన్=నాన్' అనునవి పర్యాయములుగఁ జెప్పఁబడెను. వాని ద్వితీయాద్యేక వచనాంగము 'ఎన్' అనునది మాత్రమె యై యుండఁగా బహువచనాంగము 'నమ్=ఎమ్' అను రెండు విధముల నున్నది. నమ్బి=(మాయొక్క ప్రభువు) ప్రభువు. 'తెలుఁగు-వ్యావహారికపుఁ గన్నడము-కు-గోందు' భాషల ద్వితీయాద్యేక వచనాంగము 'న' లేక 'నన్' అనున్నదై యున్నది. మలయాళమునఁ బ్రథమైక వచనము 'ఞాన్' అనునదె యైనను నరుదుగ 'యాన్' అనునదియుఁ గలదు. ఇందలి ద్వితీయాద్యేకవచనాంగము 'ఞాన్' అనుదానిలోని 'ఞ' కారము లోపింపఁగా మిగిలిన 'ఆన్' (ఎన్?) అనున్నదై యున్నది. (ఎన్?) తుళులోని ప్రథమా బహువచనము 'నమ' అనునది. తెల్గులోని ప్రథమా బహువచనమగు 'మేము'

శబ్దము 'నేము' శబ్దమూలకము. (ఇది తప్పు. నేము శబ్దమర్వాచీనము. దీనిని జింతామణి సాధింపలేదు. చూడు ౧౦౫ V విష). 'నాన్' అనునది 'యాన్' అను దానితోఁ గలసి మిక్కిలి విదూరములైన 'కు-తమిల' భాషలును 'మలయాళ-గోండు' భాషలును విడిపోవకముందటి యతిప్రాచీన కాలమున వాడఁబడుచుండెనని పై నిదర్శనముల వలన విశదమగును. ద్రావిడ భాషల లోని గ్రంథములు సుమారు వేయి సంవత్సరములకు ముందున్న ట్లగపడదు. ప్రస్తుతపుఁ దమిళులయొక్కయు గోండు వారియొక్కయుఁ బూర్వులు గలసి యుత్తర హిందూస్థాన సమప్రదేశములందు నివసించుకాలము సుమారు మూఁడు వేల సంవత్సరములకుఁ బయిఁబడి యుండును. ఈ యూహను బలపఱుచుట కిచట సంస్కృతమునుండి మంచి యుదాహృతు లీయఁబడుచున్నవి."

"సంస్కృ - వయమ్=వైదిక సంస్కృ - అస్మే=గ్రీకు - అమ్మెస్=(మేము) వీనినిబట్టి 'అస్మే' అను వైదిక రూపము ప్రాచీనతరమని తోఁచినను 'వయమ్' అనునదే ప్రాచీనతరమనక తీరదు. దీని మూలరూపమగు 'వ' లేక 'వె' అను నది జండుభాషలోని 'వయెమ్' అనుదానియందును గాతికుభాషలోని 'వీస్' అను దానియందును గన్పట్టుచుండుటచేత 'ట్యూటానికు' జాతులవారు ప్రాచ్య దేశములను విడిచి పోవక ముందటి కాలమున సైత మీ 'వయమ్' అనురూప ముండెడిదని తెలియుచున్నది. 'వైదిక సంస్కృ - యుష్మే = సంస్కృ - యూయమ్.' అనువానిలోని 'యు' అను వర్ణమునకు మూల మనఁదగు 'తు' అనునది తక్కిన యార్యభాషలలోనెల్ల నశించినను 'తుమ్హే' అను పాళీ ప్రాకృతమున నిల్చియున్నది. ప్రాచీన శబ్దము వేఱొక శబ్దముయొక్క వాడుకచేతఁ దిరస్కృతమయ్యుఁ గొంతకాలమునకు మరల బయల్పడవచ్చు ననుట కిదియె నిదర్శనము" (కాల్డు. ౩౯౭, ౩౯౮ పుటలు).

౧౦౭. III. విష:—"ద్రావిడ మధ్యమపురుషైక వచన రూపముయొక్క మొదటనున్న 'న' కారము వలెనె యుత్తమ పురుషైక వచనము మొదటి 'న' కారమును దుల్యన్యాయమున ప్రాచీనమనఁదగును:—తుద భాషకు వ్యాకర ణము వ్రాసిన, డా. పోపు దొరగారు 'నాన్' అనుదానిలోని పదాది నకార మర్వాచీనమని చెప్పుచు 'నీన్'=(నీవు) అను దానిలోని పదాది 'న' కారము నిస్సంశయముగా మూలరూపములోనిదని నమ్ముచున్నారు. 'నీన్' అనుదాని లోని పదాది 'న' కారము ద్వితీయాది విభక్త్యంగములు పెక్కిటిలోను గ్రియల పురుష బోధక ప్రత్యయము లన్నిటిలోను లోపించినను, 'తుళు' భాషలోని 'ఈ' అనుదానియందును, దెల్గులోని 'ఈవు-ఈరు' మున్నగు వానియందును లోపించియున్నను, నట్టి 'న' కారము ధాతు సంబంధి మూలరూపమని యంగీక

రించునపు డుత్తమ పురుష సర్వనామ 'నాన్' శబ్దములోని పదాది 'న' కారము సైతము ధాతు సంబంధి యనకున్నను, మన యూహా కందనంతటి ప్రాచీనమని యైన నంగీకరింప నక్కఱలేదా" (కాల్డు. ౩౬౮, ౩౬౯ పుటలు).

"పయిరీతి నుత్తమపురుష సర్వనామ ప్రథమైకవచన రూపములలో 'నాన్' అనునది ప్రాచీనమగునపుడు దానినుండి యేర్పడిన 'ఆన్' అనునది తక్కిన 'యాన్' మున్నగు తమిళాది రూపములకు మూలరూపమై యుండును. (చూడు ౧౦౭ I విష). అకారము 'ఎ' కారముగా మాఱుట సహజము. ఉదా:—సంస్కృ-జపః=తమిళ తద్భవ-శెబమ్. సంస్కృ-బలమ్=తమిళ తద్భవ-బెలమ్. దీనికి విపరీతముగా 'ఎ' కారముఁ 'అ' కారముగా మాఱనేరదు. (ఈ యుదాహృతులును సరికావు. చూడు ౧౦౮ I విష). అకారము 'ఎ' కారముగా మాఱుట—అకారము వ్రాయఁబడి 'ఎ' కారముగాఁ బల్కఁబడుట-పెక్కు స్థలములలోఁ గలదు. డా. గుండర్టుగారు 'య' అనునది 'యె' అనునదిగా మాఱి యీ సర్వనామముయొక్క ప్రాచీన రూపమగు 'యే' అను రూపము నందినదని యభిప్రాయపడుచున్నారు. 'ఎ' అనునది 'అ' అనుదాని మాఱురూపమని వారంగీకరించియున్నారు" (కాల్డు. ౩౬౯ పుట).

విమర్శము=౧౦౭. I, II, III. విషయముల విమర్శము:—తమిళమందలి 'యామ్-నామ్' శబ్దము లభిన్నములనెడి భ్రాంతిచేత దొరగా రీ యస్మచ్ఛబ్ద ప్రకరణము నతివిస్తృతము గావించిరి. అట్టి భ్రాంతిచేతనే ప్రాచీన కాలమున 'యామ్' అను దానికి 'యాన్' అను నేకవచన రూపమున్నట్లే 'నామ్' అనుదానికిని 'నాన్' అను నేకవచన రూప మున్నదని భ్రమించి యర్వాచీనమగు 'నాన్' శబ్దము 'నామ్' శబ్దమువంటి ప్రాచీనత గలదేయని సిద్ధాంతము చేయఁగడంగి దొరగా రూరకయె గ్రంథవిస్తృతిని గావించి వ్యర్థ ప్రసంగము లెన్నెన్నో చేసిరి.

తమిళమందలి 'యాన్-యామ్' శబ్దములు కేవలాస్మదర్థకములు. 'నామ్' శబ్దము యుష్మ దస్మ దుభయార్థకము. ఇట్లగుటచేతనే దీని కేకవచన రూపము ప్రాచీన కాలమున నసంభవమయ్యెను. 'నాన్'=(నేను) అనునది తమిళమున నర్వాచీనముగా నవతరించినది. కావుననే తొల్కాప్పియమునఁ జెప్పఁబడలేదు. దొరగారు ప్రాచీన తమిళ వ్యాకరణములలో 'నాన్-యాన్' శబ్దములు పర్యాయములుగాఁ జెప్పఁబడెనని వ్రాసిన వ్రాఁత కల్ల. కర్ణాటాంధ్రాదీతర ద్రావిడ భాషలకు వాఙ్మయవత్త్వావస్థ గల్గిన నాఁటికి వానిలోని 'నామ్' శబ్దము యొక్క యుష్మ దస్మ దుభయార్థ కత్వము మాసిపోయెను. అయ్యది కేవలాస్మ దర్థకముగనే వెలసియుండెను. (చూడు ౧౦౬ IV విష). అట్లగుటచేతనే

'నాన్-నామ్' అను నేకవచన బహువచనాస్మదర్థక రూపములు ప్రాచీన కర్ణాట మున వెలసియుండెను. తమిళమందలి 'యాన్-యామ్' శబ్దముల కభిన్నము లనఁదగు 'ఆన్-ఆమ్' అను నస్మదర్థక రూపములును బ్రాచీన కర్ణాటకమున నిల్చియుండెను. హళసగన్నడము నాఁటికి వానిలోని 'నాన్-నామ్' అనువాని వికృతులె యనఁదగు 'నాను-నావు' అను నస్మదర్థక రూపములు వాడుక కెక్కెను. ఇట్లె 'తు-తుళు-గోండు' మున్నగు భాషలయందును 'నామ్' శబ్దసంబంధి రూపములు నిల్చుట సంభవించి యుండును. వేలకొలఁది యేండ్లక్రిందట 'తు-తుళు-గోండు' ప్రభృతి భాషలలో సైతము 'నామ్' శబ్దసంబంధి రూప ములు కేవలాస్మదర్థకములై యుండెడివని దొరగారు నిరూపింపఁజాలరు గదా. ఇట్లగుటచేత ౧౦౭ II విషయమున దొరగారు గావించిన చర్చయెల్ల నసంగత మగుచున్నది. ఇంక ౧౦౭ III విషయమునందలి దొరగారి చర్చ యిష్టాపత్తియె. 'నాన్-నామ్' శబ్దముల పదాది నకారము మూలరూపమె యనుటలో విప్రతి పత్తియే లేదు. ప్రాచీన కర్ణాటమున 'నాన్-నామ్' శబ్దములును 'ఆన్-ఆమ్' శబ్దములును గేవలాస్మదర్థకములె యని యీావలకు వ్యాకరణోదాహరణ పూర్వక ముగ నిరూపింపఁబడెను. తెల్గులోని 'నేను-మేము-నేము' శబ్దములు 'నాన్-నామ్' అను కర్ణాటక రూపముల కభిన్నములు. తెల్గునందలి 'ఏన్-ఏము' శబ్దములు తమిళమందలి 'యాన్-యామ్' శబ్దముల కభిన్నములు. ఇంకఁ దమిళ మున 'నాన్' శబ్దము ప్రాచీనము కాదనుటకుఁ దొల్కాప్పియ సూత్రములు నిదర్శనముగాఁ జూపఁబడుచున్నవి.

'అవ్వఱి......' (తొల్కా. ౬౪౬ సూ.)=''అవన్-ఇవన్-ఉవన్-అవళ్-ఇవళ్-ఉవళ్-అవర్-ఇవర్-ఉవర్-యాన్-యామ్-నామ్-యావన్-యావళ్-యావర్ అను నీ పదునైదు శబ్దములును మహన్మహతీ నామములు.'' ('నాన్=నేను' అనునది తొల్కాప్పియమునాఁటికి లేదు). 'ఇయర్ పెయర్...' (తొల్కా. ౬౫౦ సూ.) ''......ఠ-ముఱైప్పెయర్ = వావినిబట్టి వచ్చు నామములు. ''తన్దై=(తండ్రి) మొ. తాన్=(తాను)-తామ్=(తాము)-ఎల్లామ్=(ఎల్ల)-నీ=(నీవు)-నీమ్=(మీరు)'' అనునవియును......మహన్మహత్యమహన్నామములు.''

ప్రాచీన కర్ణాటమునఁ గేవలాస్మదర్థకములగు 'నాన్-నామ్' అనునవి లేవనియు హళసగన్నడమున నవతరించినవనియు దొరగా రపరిశీలితముగా వ్రాసి దానిని సమర్థించుటకై ''ఒక్క-భాషలో నొక శబ్దము ప్రాచీన కాలమున నుండి మధ్యకాలమున నశించి మరల బయల్పడవచ్చునని పెద్ద చర్చతో నొక సిద్ధాంతమును జేసిరి. ప్రాచీన కర్ణాటమునఁ బదాది నకార ఘటితాస్మ

ద్వాచక శబ్దము లేకపోలేదు. మధ్యకాలమున నశింపను లేదు. మరల బయల్పడుటయను నవస్థ కల్గను లేదు." (చూడు ౧౦౯ IV విష).

డా. గుండర్టుగారు, డా. పోపుగారు మున్నగువారు 'నాన్' అనుదాని కన్న 'యాన్' అనునదే ప్రాచీనమని చెప్పుటయు నిరాధారము, సత్య విదూరము. 'నాన్' అనునదే తొల్కాప్పియము నాఁటికిలేదు. మఱియు వారు సయితము తమిళమందలి 'నామ్' శబ్ద ముభయార్థకమనియు 'యాన్-యామ్' శబ్దములు కేవలాస్మదర్థకములనియు 'యామ్-నామ్' శబ్దములు విభిన్న ప్రకృతికములనియు నెఱింగినవారు కారు. అవి యభిన్నములె యను భ్రాంతితో వాని పౌర్వాపర్యమును జర్చించుచున్నవారై యున్నారు.

'యామ్-నామ్' శబ్దములు ప్రత్యేక ప్రకృతులు గలవగునపుడు వీనిలో దేనినుండి యేది యేర్పడెనను పరిశీలనమె యసంగతము. రెండును ప్రాచీన ములె. రెండును తొల్కాప్పియమునఁ జేర్కొ-నఁ బడినవె. 'నామ్' శబ్ద ముతో ముడిపెట్టుటకయి 'నామ్-ఆమ్-యామ్' అను నుత్పత్తి క్రమమును గల్పించుకొను నవసరము లేదు. గుండర్టుగారు మున్నగువారు చెప్పినట్లు (చూడు ౧౦౭ I విష). 'యాన్' శబ్దమె మూలరూపమని యంగీకరించి దానినుండియే 'ఆన్; యేన్=ఏన్; ఞాన్' అను మూడు తెగల రూపములును నవతరించెనని యంగీకరించుటయే యుక్తము.

౧౦౭. IV విష:—"'నాన్-యాన్=(నేను) నీన్=(నీవు), 'తాన్=(తాను).' అను మూఁడిటిలోను దుది నకారమేకత్వమును 'నామ్-యామ్=(మేము), నీమ్=(మీరు), తామ్=(తాము)' అను మూఁడిటిలోను దుది మకారము బహుత్వమును దెల్పును. తొలి మూఁడిటిలోను నేకత్వద్యోతకమగు నకారము నశించి దానిచోట బహుత్వమున 'ఉమ్' అను (సముచ్చయార్థకము) దానిలోని మకారము నిల్చినది. పయి విషయము స్థూలదృష్టికి సరియని తోఁచును" (కాల్డు. ౩౯౯, ౩౭౦ పుటలు).

"నాన్-యాన్-మున్నగు వానిలోని 'న' కార మేకవచన బోధక మగుటయేకాక పుంలింగ ప్రథమైకవచన ప్రత్యయమగు 'అన్-న్' అనుదానిని సయితము సంబంధించుననియుఁ దోఁచును. పయి విషయములను నే నంగీక రింపఁజాలను. తార్తారు భాషలో 'మాఞ్=నేను' అను దానిలోని 'ఞ్' కారమువలెఁ బయివానిలోని 'న' కార ముచ్చారణార్థకమనుటను సయితము నే నంగీకరింపను. పై వానిలోని 'న' కారము, తమిళ మలయాళములలోఁ బ్రసిద్ధముగ నిల్చుచున్న నపుంసకలింగ ప్రథమైకవచన (చూడు కాల్డు. ౩౭౦ పుట ౨ పేరా) ప్రత్యయమగు 'అమ్' అనుదానికిఁ బ్రతిగా వచ్చుచుండు 'అన్'

అనుదాని కభిన్నము. ఉదా:—తమి-ఉరమ్=ఉరన్=(బలము). ఈ 'న్-మ్' అనునది సంస్కృతమునఁ 'అహమ్-త్వమ్-స్వయమ్' అను వానియందును, నపుంసక ప్రథమా ద్వితీయైకవచనములందును దుదిని నిల్చు 'అమ్' అను ప్రత్యయమును వాడుకయందును, నుత్పత్తియందును బోలియున్నది. (చూడుడు నామప్ర. ప్రథమా విభక్తి) గ్రాంథిక కన్నడములోని 'ఆన్=(నేను)=ఆమ్=(నేను) అనువానిలోఁ దుది 'న' కార 'మ' కారములు పర్యాయములుగా నుండుట నిటఁ బరిశీలింపనగును. అట్లె 'అవన్' అనుదానికిఁ బదులుగా 'అవమ్' అనియు గ్రాంథిక కన్నడమున నుండుటను నిటఁ బరిశీలింపఁదగును" (కాల్డు. 320 పుట).

"సంస్కృత సర్వనామ ప్రథమైకవచన ప్రత్యయమగు 'అమ్' అనునది (అహమ్-త్వమ్-స్వయమ్) బహువచన బోధకము సైతమగుచున్నది. ఉదా:—వయమ్=(మేము). యూయమ్=(మీరు). ఇవి యర్థమున బహుత్వ బోధకములయ్యు నిజముగా నపుంసక ప్రథమైకవచన రూపములు. ద్రావిడ భాషలలోని 'అమ్=అన్' అను ప్రత్యయమన్ననో సదా యేకవచనాంతమె" (కాల్డు. 321 పుట).

"బ్రహుయి భాషలోని 'తెన్'=(తాను) అను దానిని, 'ఓస్టియాకు' భాషలోని 'నిన్'=(నీవు) అనుదానిని బరిశీలించునపుడు 'యాన్-నీన్-తాన్' అనువాని తుది నకారము మిక్కిలి ప్రాచీనమని తోఁచుచున్నది. అట్లె యీ సర్వనామముల పదాది నకారము సైతము తమిళ ప్రాచీన వాఙ్మయముకన్నను మిక్కిలి ప్రాచీనమను నభిప్రాయము బలపడుచున్నది. (ద్రావిడులు హిందూ దేశమునకు వచ్చునప్పటికె 'నిన్-తెన్' శబ్దములకు మూలములగు రూపము లుండెడివని భావము)" (కాల్డు. 321 పుట).

"ద్రావిడ క్రియాప్రత్యయములలో నీ యుత్తమ పురుష సర్వనామ రూపములలోని మొదటి భాగము కొంతలోపింపఁగా మిగిలిన తుది నకారముగాని నడిమి 'ఎ' కారముగాని యుత్తమైక వచనమును బోధించుట వింత! ఇట్టి వింతలు భాషాంతరములందును గలవు. హెబ్రు భాష-ఏక. అనచ్=(నేను) (వాడుక-అనోకి) బహువచ-అనచ్ను=(మేము). ఇందుత్తమ పురుష బహువచన ప్రత్యయము సైతము 'ను' అనునది మాత్రమె. తెనుఁగు-మధ్యమపురుష సర్వనా- 'నీవు'. నిన్నున్-నీ చేతన్' మున్నగునవి ద్వితీయాదులు. కాఁబట్టి 'నీవు' (నీ+ఉ=నీవు) అనుదానిలోని 'వు'అనునది యుచ్చారణార్థక మనఁదగును. అట్టె 'వు' అనునదే క్రియాప్రత్యయమగుచున్నది. ఏకవచన ద్యోతకమగు నుత్తమైక వచన 'న' కారముతో సమాన స్థానము నాక్రమించి యున్నది" (కాల్డు. 321 పుట.)

విమర్శము:—'యాన్-యామ్' మున్నగువాని తుది 'న-మ'లు వరుసగా నేకత్వ బహుత్వ బోధకములని స్థూల దృష్టికి గోచరించునే కాని యవి నపుంసక ప్రథమైక వచన ప్రత్యయమగు 'అమ్' అను దాని కభిన్నము లనియు (చూడు ౭౫ II విష.) 'న-మ' లు పర్యాయ రూపము లనియుఁ గాల్డువెల్లు గారు వ్రాసినది సరికాదు. సంస్కృతమున "అహమ్=(నేను), వయమ్=(మేము). త్వమ్=(నీవు), యూయమ్=(మీరు)" అను నేకవచన బహువచన రూపములన్నియు 'అమ్' ప్రత్యయాంతములె యగుట వీరికిట్టి భ్రాంతి కల్గుటకు మూలమయ్యెను. పళగన్నడమున 'ఆం' అను దానికి 'నేను-మేము' అను నర్థములున్నను 'అమ్' అను దానికి 'నేను' అను నర్థము లేదు. పళగన్నడమునఁ బదాంత 'న-మ' లు రెండిటిచోటను బిందు వాదేశమగును. (చూడు ౮౧ II విష). 'మన యోర్బిన్దుః' (కర్ణా. భూ. ౧౧౨ సూ.)='మకార నకారములకు బిందువగును'. ఇంత మాత్రమున నట్టి బిందువునకు మూలములగు 'మ-న' లు పర్యాయములు కానేరవు. తమిళు మలయాళ ప్రసిద్ధమగు 'అమ్' ప్రత్యయ మమహద్వాచక మాత్ర విషయకము. (చూడు ౭౫ II విష). 'యాన్-యామ్' మున్నగునవి మహన్మహా త్యమహద్వాచకములు. తమిళు ప్రసిద్ధమగు 'న-మ' ల పర్యాయ స్థితి యమహచ్ఛబ్ద మాత్ర విషయకము. (చూడు ౨౧ XIV విష.). పుంస్త్వ బోధక 'న' కారము తుదిని గల తమిళు శబ్దమెన్నఁడును (చూడు 23 II విష) నమహద్వాచకము కానేరదు. అమహద్వాచకమునకుఁ దమిళమున బహువచన రూపమె వేఱుగ సాధారణముగా నుండదు. 'యామ్-నామ్' మున్నగునవి బహువచనార్థము నిచ్చుచున్నను నేకవచన రూపములె యనుట మిక్కిలి పొరపాటు. 'నీన్-నీమ్' అనునవి తమిళు మధ్యమ పురుష సర్వనామ రూపము లనుట సరికాదు. తొల్కాప్పియమున 'నీ' అనునది మాత్రమె యేకవచన రూపముగను, 'నీయిర్' అనునది బహువచన రూపముగను సూత్రింపఁబడెను. 'నీన్-నీమ్' అనునవి కర్ణాట మధ్యమ పురుష సర్వనామ రూపములు.

"నీయిర్......" (తొల్కా. ౬౭౨ సూ.)="'నీయిర్-నీ' అను శబ్దములు మహదమహత్త్వములు రెండిటిని దెల్పును."

"అవట్రుళ్......" (తొల్కా. ౬౭3 సూ.)=నీ శబ్ద మేకవచనము. ఉదా:—నీ వన్దాయ్=(నీవు (మానిసిగాని పక్షిగాని) వచ్చితివి).

"ఏనై......" (తొల్కా. ౬౭౪ సూ.)='నీయిర్' శబ్దము బహువచనము. ఉదా:—నీయిర్ వన్దీర్=(మీరు (మనుష్యులుగాని పక్షులుగాని)

వచ్చితిరి.) ఇట్టి 'నీ-నీయిర్' అనునవి తమిళ ప్రసిద్ధమగు 'అమ్' ప్రత్యయాంత రూపము లనుట యెట్లు పొసంగును? మఱియు 'అమ్' ప్రత్యయము సాధారణ ముగాఁ గ్రియలపై నిల్చి వానిని నామములనుగా మార్చు స్వభావముగలదని వెనుక వచించిన (కాల్డు. ౨౯ పుట) (౭౫ II విష. చూడు) విషయము లను దొరగారు స్మరింపక యిట 'యాన్-యామ్' మున్నగు శబ్దముల విషయ మున నుపయోగించుట మిక్కిలి వింత!

౧౦౭. V విష:—"'నా-యా-ఆ' అనువాని వ్యుత్పత్తి:—ద్రావిడోత్తమ పురుష సర్వనామము యొక్క ప్రాథమిక రూపముల వరుస 'నా-యా-ఆ' అను నదియు మధ్యమ పురుష సర్వనాముల వరుస (ముందు వివరించు రీతిని) 'నీ-యీ-ఈ' అనునదియు నగు నపుడు వాని ప్రప్రథమ రూపములు 'ఆ-ఈ' అనునవే యని నిర్ణయింపనగును. ఈ రెండు సర్వనామము లందును దుల్యముగా నున్న 'న' కారము వ్యక్తిని బోధించుచుండఁగా నందలి 'ఆ-ఈ' శబ్దము లుత్తమ మధ్యమ పురుష భేదములను బోధించును. కాఁగా నస్మద్యుష్మ చ్ఛబ్దములగు 'ఆ-ఈ' అనునవి తదిదం శబ్దములగు 'ఆ-ఈ' శబ్దముల కభిన్నము లనఁదగును. ఈ పద్ధతిలో నొక యనివార్యమగు విరోధము తోఁచుచున్నది. ద్రావిడ భాషలలోను నిండో యూరపియను భాషలలోను 'అ' కారము విదూరస్థితిని 'ఇ' కారము సమీపస్థితిని 'ఉ' కారము మధ్యస్థితిని దెల్పు చుండఁగా నీ పద్ధతిలో నన్నిటికన్నను సన్నిహితమగు తన్ను బోధించు నుత్తమ పురుషార్థమును 'ఆ' శబ్దము బోధించుట యెట్లు పొసఁగును? కాని నిర్దేశ సర్వనామముల (అ-ఇ-ఉ) యీదూరాదూరార్థముల వాడుకకు నియ తత్వము కానరాదు. ఉదా:—తమి. 'అవ్విడమ్=(ఆ చోటు) మీరు'. 'ఇవ్వి డమ్=(ఈ చోటు)=మేము.' అని గౌరవార్థకమగు వాడుక వెలసియున్నది. ఇట్లె మలయాళమునందును 'అద్దేహమ్=(ఆ దేహము) నీవు. అజ్ఞు=(అక్కడ) నీకు. ఇద్దేహమ్=(ఈ దేహము) నేను. ఇజ్ఞు=(ఇక్కడ) నాకు' అను వాడుకలు వెలసి యున్నవి" (కాల్డు. ౩౭౧, ౩౭౨ పుటలు).

"అకారము మొదటిదియు సుఖ ముఖోచ్చారణము గలదియు నగుట చేత నది యుత్తమ పురుషార్థక మయ్యెను. ఇకారము పై రెండు విషయము లందును రెండవదే యనఁదగును గాన మధ్యమ పురుషార్థక మయ్యెను. చీనా భాషలోను నిట్లె 'అ' కార మస్మదర్థక మనియు 'ఇ' కారము యుష్మదర్థకమనియు 'ఎడ్కిన్స్' దొరగారు చెప్పిరి. తమిళ మలయాళ కన్నడములలో నిట్లు 'ఉ' కారము 'అకార-ఇకారము'లకు నడిమి యుచ్చారణము గలదైయుండ దాని యర్థము మధ్యస్థితిని దెల్పుట ద్రావిడ భాషలయొక్క వింత స్వభావము.

ఉదా:—అ=నేను. ఇ=నీవు. ఉ=వాఁడు-ఆమె-అది" (కాల్డు. 32౨, 323 పుటలు).

విమర్శము:—ఈ వ్యుత్పత్తి యెంత మాత్రమును విశ్వసింపఁదగినది గాదు. 'అ' శబ్దమె యస్మ దర్థవాచియుఁ బరోక్షభూత తచ్ఛబ్దార్థవాచియు ననుట కేవలము నసంభవము. ద్రావిడ భాషలలోని 'అ-ఆ' అను సర్వనామము కేవల పరోక్ష వస్తువాచి. అ+అన్=అవన్=వాఁడు. కన్న-అవం=వాఁడు. ఈ 'అ' శబ్దమె పద్యకావ్యములందుఁ దమిళమున 'ఆ' అను రూపము నందును.

"నీడవరుదల్......" (తొల్కా. ౨౧౯ సూ.) 'అ' శబ్దము పద్య కావ్యములందు 'ఆ' శబ్దమగును. ఉదా:—అ+ఇడై=ఆయిడై=(ఆ చోటు). తెల్గున 'ఆ' శబ్దమె తచ్ఛబ్దార్థకము. 'ఉ' అను సర్వనామమునకు 'వాఁడు-ఆమె-అది' అను తచ్ఛబ్దార్థము నిచ్చుట యథార్థ విదూరము. తమిళ కన్నడముల లోని 'ఉ' శబ్దము పురోవర్తి పరోక్షముల మధ్య స్థితిని దెల్పును. చాలవఱకిది సమీప వస్తువాచిగనే వాడఁబడును. మఱియు ద్రావిడోత్తమ పురుష సర్వ నామములలో 'యా' అనునది ప్రాచీనము. అట్టి 'యా' అను దానిమీఁద 'ఆ' అను స్వరమున్నను నందుఁ దాలవ్యతా వేశ మెక్కుడుగఁ గలదని 'ఎన్-ఎమ్' అను నస్మదర్థక ద్వితీయా ద్యంగములు విశదీకరించుచున్నవి. కన్నడ ప్రథమ 'ఆం' అనునదేమైనను నందలి ద్వితీయాద్యంగములు 'ఎన్-ఎమ్' అనునవె మైయున్నవి. కర్ణాట వైయాకరణులు 'ఎన్' అనునదె యస్మదర్థక ప్రకృతి యని సూత్రించిరి.

"నీనాన్ తానః ప్రథమావిభక్తౌ ని నెన్ తనామ్" (కర్ణా. భూ. ౯౨ సూ.) యుష్మ దస్మ దన్యార్థకములగు 'నిన్-ఎన్-తన్' అను వానికిఁ బ్రథమయందు 'నీన్-ఆన్-తాన్' అను నా దేశములగును.

పయి సందర్భములను బట్టి యస్మ దర్థకము 'యా' శబ్దమే కాని 'అ-ఆ' అనునవి కావని సిద్ధాంతితమగుచున్నది. ఇట్లె యుష్మదర్థకమును నతి ప్రాచీనమగు 'నీ' శబ్దమె కాని 'ఇ-ఈ' శబ్దము కాదని నిశ్చితమగుచున్నది. నీ శబ్ద నకార మిండో యూరపియను 'తు-తి' శబ్దజమనియు నతి ప్రాచీన మనియు దొరగారే నిరూపింతురు. (చూడు ౧౧౧ I, II విష).

"'అఱవమున మధ్యమ పురుష గౌరవార్థకము' 'అవ్విడత్తిల్-ఇవ్విడత్తిల్' అనియుఁ జెప్పుదురు. 'మేము' అను నర్థమున 'ఇవ్విడమ్' అనుటయరుదు. మలయాళమున 'అద్దేహమ్=(వారు). ఇద్దేహమ్=వీరు' అందురు. వీనికి 'నీవు-నేను' అను నర్థములు చెప్పుట పొరపాటు" (శ్రీ విద్వాన్ వే. వేంకట రాజులు రెడ్డిగారు ౧౯౩౩. జూన్ ౬ తేది జాబునకు జబాబు).

౧౦౮. I విష: — "ద్రావిడేతర భాషలతోడి సంబంధము:—'ఆసియా-ఐరోపా-ఉత్తరాఫ్రికాలలోని యిండో యూరపియను సెమెటికు సిథియను కుటుంబములలోని యుత్తమ పురుషైకవచన సర్వనామరూపములు రెండేసి మూలరూపములను సంబంధించునవిగా నేను నమ్ముచున్నాను. సంస్కృతమున-'అహమ్' అను దానిలోనిది 'అహ్' అనునదొకటి. 'మామ్-మయా' మున్నగు వానిలోని 'మ' కార రూపము మఱొకటి" (కాల్డు. 323 పుట).

"సెమెటిక్ సర్వనామము ద్రావిడ సర్వనామములను బోలినట్లు చూపట్టును. ద్రావిడ భాషలలోని యస్మదర్థకము 'నా' శబ్దము. సెమెటికు భాషలు:—ఈజిప్టు భాష-అనుక్-బాబిలోనియా భాష-అనకు-ఆనక-అన్కు. జూయిష్‌సిరియకు భాష - అనా. క్రిష్టియన్ సిరియకు భాష-ఎనొ. ఇతియోపికు భాష-అరబికు భాష-అనా. ఆరమెయికు భాషలోని యుత్తమ పురుష బహువచనము 'అనాన్' అనునది. ఈజిప్షియా భాషలో నియ్యది 'అనెన్' అని యుండును. వీనిని దమిళమందలి 'నామ్' అనుదానితోఁ బోల్ప నగును. ఇట్టి సెమెటికు భాషలతోడి సామ్యము యాదృచ్ఛికమేమో? చెప్పఁజాలము. పై సెమెటికు సర్వనామముయొక్క 'అన్' అనెడి యాగమ ముత్తమపురుషరూపములందేకాక యితర పురుషములందును జూపట్టుచున్నది.

అన=(నేను) ఆరమెయికు భాష. ఇది 'అనహ్' అనుదానినుండియు నది 'అనహ్' అనుదానినుండియు వచ్చెను.

అన్‌తా=(నీవు) ప్రాచీన హెబ్రు భాష. అరబిక్ భాష.
అన్‌త్ =(నీవు)-'ఆరమెయికు' భాష.
ఎన్‌తెక్ } = (నీవు) ఈజిప్షియన్ భాష.
ఎన్‌త }
ఎన్‌తుఫ=(వాఁడు) ఈజిప్షియన్ భాష.
ఎన్‌తున్ =(ఆమె)-ఈజిప్షియన్ భాష.
ఎన్‌హు=(వాఁడు). 'చాల్ డెయికు' భాష. హెబ్రు భాష.

పై వానిలో నుత్తమ పురుష రూపములందలి మొదటి 'అన్' అను దానిని విడిచినయెడల మిగిలిన 'ఒక్-అహ్-అహ్. అకు-అక్' అనునవి సంస్కృతోత్తమ పురుషరూపములలోని 'అహ్-గాథిక్-ఇక్, గ్రీకు-లాటిన్-ఎగ్,' అనువానితో సంబంధించుచున్నవని నిస్సందేహముగాఁ దోఁచును. అట్లె పై 'సెమెటికు' భాషలలోని మధ్యమ పురుషరూపములందలి 'అన్-ఎన్' అను

వానిని విడిచినయెడల మిగిలిన 'త-తే-త్' (చూడు-మీఁది-అన్‌తా-అన్‌త్-ఎన్‌తెక్-ఎన్‌త) అనునవి సంస్కృత ('త్వమ్')లాటిన్ భాషల సర్వనామములలోని 'తు' అనువానితో సంబంధించును.

'సెమెటికు' భాషలలోని పై నుదాహరించిన 'అన్' అనునది యుచ్చారణ సౌకర్యమునకై చేరినదని యూహింపఁబడుచున్నది. ఇట్లైయైనచో దీనికిని ద్రావిడభాషల 'నా' లేక-'అనా' అనుదానికిని సంబంధములేదని చెప్పనగును. ఉచ్చారణ సౌకర్యార్థ మిట్లు చేరుట పెక్కు-భాషలలోఁ గలదు. హెబ్రు భాషలోని 'హూ' అనుదానికి 'ఈన్' అనునది 'తాల్ముడికు' భాషలో నుచ్చారణార్థము చేర్పఁబడినది. గ్రీకులోని "'ఇగోసీ' =(నేను), ఫిన్నిషుభాషలోని 'మినా'=(నేను)" అనువానిలోని తుదియచ్చులగు 'ఈ-ఆ' అనునవి యుచ్చారణార్థము చేరినవె. అట్లే యుత్తర హిందూస్థానభాషలలో 'మైఁ' 'తైఁ=తు=(నీవు)' అనువాని తుదియనునాసికము లుచ్చారణార్థము చేరినవె" (కాల్డు. 328 పుట).

విమర్శము:—పై రీతిగల యాదృచ్ఛికసామ్యమును జూపుటకయి దొరగారంతగా విస్తరించి వ్రాయనేల? 'సెమెటిక్' భాషల పురుషబోధక సర్వనామరూపముల కిండో యూరపియను భాషలతోడి సంబంధము దొరగారిచేఁ బైని గొంత చూపఁబడినది. ఇంక ముందటి విషయము సైతము 'సెమెటిక్' భాషల సర్వనామముల మొదటి 'అన్' అనుదాని కుచ్చారణార్థకత్వమును దప్పించి 'అహమ్-వయమ్-త్వమ్-యూయమ్' అనువానిలోని 'అమ్' అను దానితోడి యభిన్నత నిరూపింపఁబడును. అట్టి నిరూపణముచేత 'సెమెటికు' భాషల సర్వనామముల మొదటి 'అన్' అనుదానికి ద్రావిడభాషల పురుషబోధక సర్వనామముల తుది నకారముతోడి సంబంధము నిరూపిత ప్రాయము కాఁగలదు. ద్రావిడ భాషలలోని 'యాన్' మున్నగు సర్వనామముల తుది నకారము 'అహమ్' మున్నగువాని తుదినున్న 'అమ్' ప్రత్యయమున కభిన్నమనికదా దొరగారి యాశయము!

౧౦౮. II విష:—" 'సెమెటికు' భాషలలోని పయిని వ్రాసిన 'అన్' అనునది నిర్దేశవాచకమనియు 'అహ్+అమ్' మున్నగువానిలోని 'అమ్' అను దాని కభిన్నమనియు, సర్-హెచ్-రావిన్‌సనుగారు చెప్పిరి. 'మ'కారము 'న'కారముగా మాఱుటయు నొక కుటుంబమున (ఇండో యూరపియన్ కుటుంబమున) నంతమందుండు ప్రత్యయము మఱొక కుటుంబమున (సెమెటిక్కు-టుంబమున) నాదియందుండుటయు మాత్రమె భేదము కన్పట్టుచున్నది. (అహ్+అమ్=అన్+అహ్).

సంస్కృత నపుంసక లింగబోధక ప్రత్యయమగు 'అమ్' అనునది 'అహ్+అమ్' మున్నగువానిలోని 'అమ్' అనుదానికి భిన్నముకాదనియు మధ్యమోత్తమ పురుష సర్వనామముల (త్వమ్-యూయమ్-అహమ్-వయమ్)-ప్రథమాంతములలో వ్యక్తిబోధ మధికమై స్వాభావికముగ నుండుటచేతఁ బ్రత్యయమందు ('అమ్' అనుదానియందు) లింగావిష్కరణభేద మనావశ్యకమగుటంజేసి యట్లు సామాన్యమగు నపుంసకలింగ ప్రత్యయము చేర్పఁబడెననియు నీవఱకె వ్రాయఁబడెను.

ద్రావిడ పురుషబోధక సర్వనామముల తుది నకారము (యాన్-నేన్ మొ.) ద్రావిడ నపుంసకలింగ ప్రత్యయమగు 'అమ్' అనుదానితోను, రూపసాధకమగు 'అన్' అనుదానితోను నభిన్నమనియు సంస్కృత నపుంసక లింగ ప్రథమా ద్వితీయైకవచన ప్రత్యయమగు 'అమ్' (అహమ్మాదులలో సైతము చూపట్టుచున్నది.) అనుదానితో సయిత మభిన్నమై యుండవచ్చుననియు నీవఱకె వ్రాయఁబడెను. 'సెమెటిక్' భాషలలోని సర్వనామముల మొదటి 'అన్' అనునది సంస్కృతమందలి 'అమ్' అనుదానితో సంబంధించినదైనపుడు ద్రావిడ సర్వనామములగు 'నాన్-నీన్-తాన్' అనువాని తుది 'న' కారముతోఁగూడ సంబంధించియుండు ననఁదగును. మొత్తము మీఁద నీ సందర్భమున సెమెటికు-ద్రావిడభాషల సర్వనామములందుఁ గన్పట్టుచున్న పోలిక యాదృచ్ఛికమని తోఁచుచున్నది" (కాల్డు. ౩౭౮, ౩౭౫ పుటలు).

విమర్శము:—'అమ్' అనుదాని రూపసామ్యభ్రమచే దొరగా రీవిషయమున మిక్కిలి యపమార్గమునఁ బడిరని యీవఱకే విశదీకరింపఁ బడెను. (చూడు ౧౦౭ IV విష).

---

౧౦౯. I విష:—"ఇండోయూరపియను భాషలతోడి సామ్యములు:— ఇండో యూరపియను భాషలందును, సెమెటికు-సిథియను భాషయందువలెనె యుత్తమ పురుష సర్వనామైక వచనములందు ద్వివిధ రూపములు గలవని యీవఱకె వ్రాసియున్నాను. అందొకటి ప్రథమా విభక్తియందును దక్కినది ద్వితీయాది విభక్తులందును గన్పట్టుచున్నది.

ఇండోయూరపియ నుత్తమ పురుషైక వచనము

| | | | |
|---|---|---|---|
| సంస్కృత భాష | - అహమ్=(నేను) | గాథికు భాష | - 'ఇక్'=(నేను) |
| ప్రాచీన పెరిషియన్ | - అదమ్ | ప్రాచీన జర్మన్ భాష | - ఇహ్ |
| జండు భాష | - అజమ్ | ప్రాచీన 'శ్లావానికు' భాష | - అజ్ |
| లాటిన్ భాష | - ఎగో | లిథూనియన్ భాష | - అస్ జ్ |
| గ్రీకు భాష | - ఎగోన్ | బొహెమియన్ భాష | - గా |

పయి యిండో యూరపియను రూపములలోను 'అహ్మా-అహ్మా-ఉక్-అకు-ఓకీ' మున్నగు 'సెమెటిక్' భాషల రూపములలోను 'ఆకూ (మలయ భాష), ఆకో (తగల భాష) ఔ-(ఔహిటియన్ భాష)' అను మలయో పొలినీషియన్ భాషా కుటుంబములలోని యనేక భాషలందలి రూపములలోను ప్రథమా విభక్త్యేక వచనాంగమగు మూలరూపము నొక్కదానినే ('అఘ్' అనుదానిని. చూడుడు కాల్డు. 32౮ పుట. ౮ పేరా) కనుఁగొనుచున్నాము.

ఇంక నిండో యూరపియను భాషల ద్వితీయా ద్యేకవచనాంగము మొత్తము మీఁద మకారమని చెప్పవచ్చును. ఈ మకారమునకుఁ దర్వాత 'అ' కారముగాని దానికి బదులుగా వేఱొక స్వరముగాని నిల్చుచున్నది. (సంస్కృ-మా-మమ-మయి-మే-మొ).

ఇండో యూరపియన్ భాషలలోని యుత్తమ పురుష సర్వనామ
ద్వితీయా ద్యేకవచన రూపములు

| | |
|---|---|
| మ:—(మా-మయి-మమ-మే-మొ.) | సంస్కృతభాషోత్తమపురుష ద్వితీయా ద్యేకవచన రూపములు. |
| మే-మోయి:— | జండు భాషలోని చుతుర్థీ షష్ఠుల రూపములు. |
| అమ:— | ప్రాచీన పెరిషియన్ భాషలోని యవ్యయీభావ సమాస రూపము. |
| మె-ఎమె-మెఇ—మె ఉ. | గ్రీకు భాషా రూపములు. వీనిలోని మొదటి 'ఎ' కారము పదాది నొక యచ్చును జేర్చు నభ్యాసమునఁ జేరినది. (ఉదా:—ఒనోమ=నోమ) |
| మిహి-మె | లాటిను భాషలోని చతుర్థి-'మిహి', తక్కిన విభక్తుల యంగము 'మె' అనునది. |
| మి-మెయ్ | గాథికు భాషలోని ద్వితీయా ద్యేకవచనాంగములు. షష్ఠీ రూపము 'మెయ్న' అనునది. |
| మన్ | లిథూనియను భాషలోని ద్వితీయా ద్యేకవచనాంగము. ఇందలి తుది 'న' కారము 'గాథికు' భాషలోని షష్ఠీ 'న' కారము వంటిది" (కాల్డు. 32౫, 32౬ పుటలు). |

"ఇండో యూరపియను భాషలలోని యుత్తమ పురుషైక వచన క్రియా ప్రత్యయములన్నిటను దుదిని 'మ' కారమె నిల్చుచున్నది.

మి-మ్:—సంస్కృత భాషా జందు భాషల క్రియా ప్రత్యయములు.
మి-మై:-గ్రీకు క్రియా ప్రత్యయములు.
సుమ్-ఇన్-క్వమ్:—లాటిన్ క్రియా ప్రత్యయములు.
మి:—లిథూనియన్ క్రియా ప్రత్యయము.
అమ్:—పోలిషు భాషా క్రియా ప్రత్యయము.
ఎమ్:—ఆర్మీనియన్ భాషా క్రియా ప్రత్యయము.
అమ్:—నవీన పెరిషియన్ క్రియా ప్రత్యయము.

గామ్= వెళ్ళుచున్నాను
తువామ్=చేయుచున్నాను
బిమ్=పిమ్=ఉన్నాను
} ప్రాచీన గ్రాంథిక జర్మన్ భాషా రూపములు.

భవామి=అగు చున్నాను. సంస్కృత క్రియా రూపము. ద్వితీయా ద్యేకవచనాంగమునుండియే యీ క్రియా ప్రత్యయ రూప మేర్పడి యుండును. 'మ' కారము 'మి' అని యగుట కుదాహరణము:—ఫిన్నిషు కుటుంబములోని ఎస్తోనియన్ భాష:—'మ=(నేను) ప్రాచీన రూపము; మిన్న=(నేను) అర్వాచీన రూపము. స=నీవు-ప్రాచీన రూపము; సిన్న=నీవు-అర్వాచీన రూపము'.

పయి నుదాహరించిన యుత్తమ పురుష సర్వనామ ప్రథమైక వచనాంగము 'అఘ్' అనునదియు, ద్వితీయ ద్యేకవచనాంగము 'మ్' అను నదియుఁ బ్రాచీనములె. అందు 'మ' కారము ప్రాచీన తరము. మనకుఁ దెలిసినంత వఱ కెల్ల భాషలలోని యుత్తమైక వచనరూపములలో 'మ్' అనునది మిక్కిలి ప్రాచీనములగు వానిలో నొకటి" (కాల్డు. 32౬, 322 పుటలు).

"ఇండో యూరపియను భాషలలోని యీ 'మ'కారము ద్రావిడోత్తమైక వచనరూపములగు 'న-య-అ' అను వానితో నెంతవఱకు సంబంధించు చున్నదనుట కట్టి మకార మిండో యూరపియను కుటుంబ భాషా భేదములలో నొందు మార్పులను బరిశీలింపవలయును. ఈ యిండో యూరపియను 'మ' కారము 'న-వ-అ' అను మార్పులనందును.

(౧) అందు 'న' కారముగా మాఱుటకుదా:—

సంస్కృ — ఆసమ్=(ఉంటిని)=లాటిన్-ఎరమ్=గ్రీకు-ఎన్.
సంస్కృ — అదదమ్=(ఇచ్చితిని)=గ్రీకు-ఎదిదోన్.
ప్రాచీన జర్మను — బిమ్=పిమ్=(ఉన్నాను)=నవీన జర్మను-బిన్.
పెరిషియన్ — హాస్తమ్=(ఉన్నాను)=బెలూచిష్ భాష-హాస్ జనన్.
లఫ్మనీ భాష — పాకన్=(వెళ్ళుచున్నాను)" (కాల్డు. 322 పుట).

విమర్శనము:—పయి నుదాహరించిన రీతి నిండో యూరపియను భాషల లోని యుత్తమ పురుష సర్వనామ ద్వితీయా ద్యేకవచనాంగమగు 'మ' కారమున కును దజ్జన్య 'న' కారమునకును ద్రావిడోత్తమ పురుష సర్వనామైక వచన 'నాన్' శబ్ద మభిన్నమని దొరగారి యాశయము. ప్రాచీన ద్రావిడ భాషలో 'నాన్-నేను' అను శబ్దమే లేదనుటకు యుష్మ దస్మ దుభయార్థక నిత్య బహు వచన 'నామ్' శబ్దము మాత్రమె తొల్కాప్పియమున నుదాహరింపఁబడుటయే ప్రబల నిదర్శనము. ఇట్లు తమిళ కన్నడములందలి 'నాన్=(నేను)' అనునది యర్వాచీన మగుటచేతఁ జరిత్రకందని కాలపు సంబంధముగల యిండో యూరపియను 'మ' కారమునుండి ద్రావిడ 'నాన్' శబ్దమేర్పడినదను నభిప్రా యము కేవలము నసంభవము. (చూడు ౧౦౬ II, IV విమ). ఇట్టి స్థితిలో నిండో యూరపియను భాషలలోని యుత్తమ పురుష సర్వనామైకవచన 'మ'కార విషయమునను నది 'న' కారముగఁ బరిణమించు విషయమునను దొరగారు చేసిన గ్రంథవిస్తృతి నిష్ప్రయోజన మనుటకు సందియము లేదు.

౧౦౯. II విమ:—"ఇండో యూరపియను భాషలలోని యుత్తమ పురుష సర్వనామ బహువచన పదాది 'న' కారము నయితము పయిని వ్రాసిన రీతిని మకారమునుండి యేర్పడినదె యనుట స్పష్టము. అట్టి యుత్తమ పురుష బహు వచన మకార ఘటిత రూపములలోని ప్రాచీనమగు నొక రూపము క్రియా ప్రత్యయములలో వాడఁబడుచున్నదని చెప్పవచ్చును. ఉదా:—సంస్కృ-మస్- వైదిక-సంస్కృ-'మసి'. లాటిన్-'మస్' గ్రీకు-మెన్ ('యోలిక్' గ్రీకు-మెన్).

ఇండో యూరపియను భాషలలోని యుత్తమ పురుష సర్వనామైక వచన 'మ' శబ్దమునకు బహువచన చిహ్నమగు 'స' కారమును జేర్పఁగా 'మస్' అను నది యేర్పడును. ప్రాచీనమగు నీ 'మస్' అనుదానిలోని మకారము సాధారణ ముగా నకారమగుచున్నది.

ఇండో యూరపియను భాషలలోని యుత్తమపురుష సర్వనామ బహు వచన రూపములు:—

| | | | |
|---|---|---|---|
| నోస్=(మేము) | లాటిన్ భాష | నస్ - నౌ | - సంస్కృతమందలి రూపాంతర బహు వచన ద్వివచన రూపములు. |
| ని | - 'కెల్టిక్' భాష | నో | - జండు భాష |
| నోఇ | - గ్రీకు భాష | న | - 'ప్రాచీన స్లవాని కు' భాష. |

ఈ పదాది 'న' కారము మకారముయొక్క వికృతి యనియు, నిది వచన సంబంధము లేకయే (వచనమును బోధింపకయె). యుత్తమపురుష సర్వనామ వ్యక్తిని బోధించుననియు స్పష్టముగా నెన్ననగును. అచటి వచనము పదము యొక్క తర్వాతి భాగముచేతనే వాచ్యమగుననియు నా యభిప్రాయము.

'వెల్షు' భాషలో 'మి=(నేను) ని=(మేము)' అని యుండఁగాఁ క్రియా ప్రత్యయములలో నుత్తమైక వచన ప్రత్యయము 'న' కారమును బహువచన ప్రత్యయము మకారమును నగుట వింత! ఉదా:—గ్వెల్ వ్ న్=(చూచితిని). గ్వెలెమ్=(చూచితిమి). గ్రీకు భాష:—ఎదిదోన్=(ఇచ్చితిని). దీని బహు వచనము - ఎదిదోమెన్=(ఇచ్చితిమి). ఐరిష్ భాష - కెయిరిమ్=(ప్రేమించు చున్నాను). వెల్షు భాష:—కర్ వెన్=(ప్రేమించుచున్నాను). పైని వ్రాసిన 'వెల్షు' భాషోదాహరణములతోఁ (ఏక-గ్వెల్ వ్ న్; బహు-గ్వెలెమ్) దమిళుమందలి "ఏక-ఏన్; బహు-ఏమ్" అను నేకవచన బహువచన ప్రత్యయములు మిక్కిలిగఁ బోలుచున్నవి" (కాల్డు. 322, 323 పుటలు).

(౨) "ఇండో యూరపియను భాషలలోని మకారము వకారముగా మాఱుట:—ఇండో యూరపియను భాషలలోని యుత్తమ పురుష బహువచన పదాది వకారము మకారముయొక్క వికృతియె. అట్టి 'వ' కారము'న' కార ముతో సరిగఁ గన్పట్టుచున్నది. నకార, వకారములు పరస్పరముగ నెచట మాఱునో యచట నా రెండును బ్రాచీన మకార స్థానీయములై ద్రావిడ భాషలలో నుండునని యీవఱకు ధ్వనిప్రకరణమునఁ జెప్పియున్నాను. ఈ సూత్ర మిండో యూరపియను భాషలలో సైతము సరిగ నన్వయించుచున్నది. సంస్కృ-వయమ్=(మేము)=(వ+అమ్=నపుంసకైకవచన ప్రత్యయము). ఈ శబ్దములోని 'వ' కారమును దాని ద్వితీయా చతుర్థీ షష్ఠీ బహువచనములలోని 'న' కారమును (నః=మమ్మును-మా కొఱకు-మాకు) బరిశీలించిన యెడల నట్టి 'వ-న'లు ప్రాచీనమగు 'మ' కారమునుండి (అస్మచ్ఛబ్దసంబంధి) వచ్చినవెయని స్పష్టముగాఁ జెప్పవచ్చును. జందు భాషలో సైత మదేవిధమున నున్న 'వ-న'ల స్థితియుఁ బై యభిప్రాయమును బలపఱచుచున్నది. మఱికొన్ని యుదా హృతులు:—

మెస్=(మేము)-ఓల్డు 'శ్లవానిక్' భాష.
వీస్='గాథిక' భాష.
వె=(మేమిద్దఱము)=ద్వివచనరూపము. ఓల్డు 'శ్లవానిక' భాష.
న=(మమ్మిద్దఱను)=ద్వితీయా రూపము. ఓల్డు 'శ్లవానిక' భాష.
వెదు-ముదు } { మమ్మిద్దఱను } మహద్వాచక ప్రథమా ద్వితీయా ద్వివచన రూపములు. లిథూనియన్ భాష.

వె- } క్రియాప్రత్యయము. ఉత్తమ పురుష ద్వివచనము. ఓల్డు 'శ్లవానికు' భాష. బహువచనము 'ము' వర్ణముతో నంతమగును.

వ-లిథూనియన్ భాష. క్రియాప్రత్యయము. ఉత్తమ పురుష ద్వివచనము. బహువచనము 'మె' వర్ణముతో నంతమగును" (కాల్డు. ౩౨౭ పుట).

(3) "ఉత్తమ పురుష సర్వనామములోని 'మ' శబ్దము కొన్నియెడల నదృశ్యమై 'అ' కారమగుచున్నది. ఉదా:—అస్మే=(మేము) వైదిక సంస్కృత రూపము. (గ్రీకు-అమ్మెస్). యుష్మే=(మీరు) వైదిక సంస్కృత రూపము. (గ్రీకు-ఉమ్మెస్). వీనిలో 'స్మే' అనునది బహువచన చిహ్నమనియు, 'యుష్మే' అనుదానిలోని 'యు=తు' అనునది యేకవచనమగు 'నీవు' అను నర్థమును బోధించుననియు, నట్లె 'అస్మే' అనుదానిలోని 'స్మే' అనునది బహువచన చిహ్నమనియు, 'అ' అనునది 'నేను' అను నేకవచనార్థమును బోధించుననియు నెఱుంగనగును. కావున 'అస్మే' అనునది 'మస్మే' అనుదాని సంక్షేపరూపమనఁదగును. 'ఆవామ్' అను సంస్కృతోత్తమపురుష సర్వనామ ద్వివచన రూపములోని 'ఆ' అనుదానికిని పై రీతి వ్యుత్పత్తిని భావింపవలెను. కొందఱిది 'మ=(నేను)+ద్వ-(రెండు)' అను శబ్దములనుండి యేర్పడెనని తలంతురు. 'అస్మే' అనుదానిలోని 'అ' కారము సైత మిట్లె ప్రాచీన బెంగాలీ భాషలో 'మామి' అనియు, నవీన బెంగాలీ భాషలో 'ఆమి' అనియు దీర్ఘముగా నేర్పడెను" (కాల్డు. ౩౨౭, ౩౨౯ పుటలు).

" 'య=ఇ=న=అ' అనురూపముల వరుసగల ద్రావిడ సర్వనామమునకును 'మ=న=వ=అ' అను వరుసగల యిండో యూరపియను సర్వనామమునకును శబ్దార్థ సామ్యముండుటచేత వీనికిఁ బరస్పర సంబంధము లేదనుట దుష్కరము. ద్రావిడ సర్వనామ రూపములలో 'న' అనునదే ప్రాచీనమని యంగీకరించునపుడు 'మ' కారము 'న' కారముగా మాఱుట సహజమగుటంజేసి వీనికి సంబంధము గలదనుటకు సందేహింప నక్కఱలేదు. ఇండో యూరపియను భాషలలో నెచ్చటను మకారము యకారముగా మాఱుట లేకున్నను 'మ' శబ్ద మిండో యూరపియను భాషలలోనెకాక సిథియను భాషలలో సైతము వివిధానునాసికముల రూపమున మాఱుచుండుటంజేసి 'ఇ' కారముగా (మలయాళ) మాఱిన ద్రావిడ య శబ్ద సర్వనామము ప్రాచీన ద్రావిడుల కిండో యూరపియను 'మ' శబ్దమునుండి లభించెననుట యయుక్తికము కాదు" (కాల్డు. ౩౨౯ పుట).

విమర్శము:—ఇండో యూరపియను భాషలందును వకారము నకారమయ్యె ననుట (వయమ్=నః) స్వభావవిరుద్ధమె. 'వ-న'లు పరస్పరము మాఱునను

సూత్రమును దొరగారు ధ్వని ప్రకరణమున నిరూపింపను లేదు. మకారమె కొన్నియెడల వకారముగాను గొన్ని యెడల నకారముగాను బరిణమించె ననుట సమంజసము. దొరగారట్లును బూర్వోత్తర సందర్భ శుద్ధిని బాటింపక వ్రాయఁగడంగిరి. మకారము వకారమగుననియుఁ గొన్ని యెడల నకారమగు ననియుఁ జెప్పుట కన్ని యుదాహరణములిచ్చి యంతగా గ్రంథమును బెంచి వ్రాయుట యనావశ్యకము. అట్టి పరిణామములు సహజములు కావని యెవ్వరందురు? అట్టి ఇండో యూరపియను భాషలలోని కేవలాస్మదర్థక 'మ' శబ్దమునుండి ద్రావిడ భాషలలోని 'నామ్=మనము' అను యుష్మ దస్మ దుభయార్థక ముప్పతిల్లెననుట విశ్వసనీయము కాదు. ఈ విషయమున ద్రావిడ భాషల సర్వనామ రూపములు కేవలము విలక్షణమగు స్వభావము గల్గి యున్నవి. ఇండో యూరపియను భాషలలో నుభయార్థక సర్వనామమే లేదు. అయ్యది ద్రావిడ భాషలలో నుండుట యొక విలక్షణ ధర్మము. అయ్యది నిత్య బహు వచనము. దాని కేకవచనముండుట యసంభవము. "భూయ ఉభయార్థ వాచీ యః కశ్చి ద్భవతి నిత్యబహువచనః" (ఆం. చిం. చూడు వ్యా. సం. ౨౮౯ విష). తొల్కాప్పియరును దీనిని, నిత్యబహువచనముగానే యుపదేశించిరి. ఇది యేకవచనీభూత 'మ' శబ్ద జన్యమను దొరగారి నిరూపణము కేవలము న యథార్థము. (చూడు ౧౮౯ I విష. విమర్శము). (చూడు ౧౮౬ II విష). ద్రావిడ భాషలలోని 'నామ్-యామ్' శబ్దములు కేవల విభిన్న ప్రకృతులు. ఆ రెంటిని నభిన్నములనుచు దొరగారు ముడిఁబెట్టఁ గడంగుచుందురు. ఇండో యూరపియను 'మ' శబ్దమునుండియే ద్రావిడ 'యాన్-యామ్' శబ్దము లేర్పడెనని దొరగారు వ్రాయుట కేవలము సాహసము. తమిఴు 'యాన్' శబ్దము 'ఞాన్' అని మలయాళమున మాఱినది గాన నట్టి 'యాన్' శబ్దము మకార జన్యమనవచ్చు ననుట పృష్ఠతాడ నన్యాయమును స్మరింపఁజేయుచున్నది. సిథియను భాషలలోను నస్మదర్థక 'మ' శబ్దము వివిధములగు మార్పుల నందు చున్నది గాన నిండో యూరపియను 'మ' శబ్దము ద్రావిడ 'య' శబ్దమునకు మూల మనఁదగుననుట యంతకన్నను నసంగతముగా నున్నది. 'వయమ్' అను సంస్కృత శబ్దమునకు 'వ+అమ్' అను ఛేదమును జూపుట పొరపాటు. అచట సంహితా వ్యవధాయక యకారము నిల్చెనని దొరగారు భావించుట వింత! సంస్కృతమున యకారము సంహితలో నిలుచుట యశ్రుతచరము. ఇండో యూరపియను భాషలకును సిథియను భాషలకును నీ యస్మచ్ఛబ్ద 'మ-న'ల సంబంధము బలముగా నున్నదనుట కెవ్వరును విప్రతిపన్నులు కారు. (చూడు ౨ విష). ద్రావిడ భాషలలో 'నామ్' శబ్దమునకుఁ బ్రయోగ మరుదు. 'యాన్ = యేన్ = ఏన్' శబ్దములె కేవలాస్మదర్థకములుగా విస్తృతముగాఁ

బ్రయుక్తములగుచున్నవి. తమిళ 'నామ్' శబ్దమున కుభయార్థకత్వము మాసి పోయి యర్వాచీనముగా నది యస్మదర్థ మాత్ర బోధకమగుట కన్నడ మందున్నను నదియు మిక్కిలి యరుదె. కర్ణాట భాషాభూషణమందును శబ్దమణి దర్పణమునందును నయ్యది యుపదేశింపఁబడనే లేదు. దాని ప్రయోగము దాక్షిణాత్య కన్నడ సమ్మతమే కాదు. ఉదీచ్యులు క్వాచిత్క ముగా దానిని వాడిరనుచు మకరంద వ్యాఖ్యాత ప్రదర్శించెను. (చూడు ౧౦౬ IV విష). ద్రావిడ భాషలలో నస్మదర్థక శబ్దముల తుది 'న' కార మేకవచన ద్యోతకము. మకారము బహువచన ద్యోతకము. ఇండో యూరపియను భాషలం దట్లు కాదు.

తమిళమందలి 'యాన్-యామ్' అనువాని పరిణామము లనఁదగు కర్ణాటములోని 'ఆన్-ఆమ్' అనునవి ప్రాచీన శబ్దములనుగాఁ దలంచుచు దొర గారు వైదిక సంస్కృతమందలి 'అస్మే' అనుదానిలోని 'అ' శబ్దమున కభిన్నము లనుగా నిరూపించుట సరికాదు. కన్నడ ప్రథమా విభక్తిలో 'ఆన్-ఆమ్' అను యా శబ్ద 'య' కారలోప పరిణామములు నిల్చినను ద్వితీయా ద్యంగ మేకవచన బహువచనములు రెండిటను 'యాన్' 'యామ్' శబ్దముల తాలవ్యతా సంబంధు లగు 'ఎన్-ఎమ్' అను రూపములె నిల్చుచున్నవి. (చూడు ౧౦౬ IV విష).

౧౯౯. III విష. (౩) "సిథియన్ భాషల సంబంధము:—ఇండో యూరపియను భాషలలోని దీని ద్వితీయాది విభక్తుల యంగమగు మ శబ్దము సిథియను భాషలలో ద్వితీయా ద్యంగమగుటయేకాక ప్రథమా విభక్త్యంగమును నగుచున్నది. ఇండో యూరపియను భాషలందును గొన్నియెడల 'మ' శబ్దమె ప్రథమాంగమును నై యున్నది. 'కెల్టిక్' భాష-'మి'. నవీన పెరిషియన్ భాష-'మజ్'. ఉత్తర హిందూస్థానభాషలు-'మయిజ్'. సిథియను కుటుంబము లోని నవీన మాండలిక భాషాభేదములలో వ్యాకరణ విరుద్ధముగఁ బ్రథమా విభక్తి ద్వితీయా విభక్తికి బదులుగా వాడఁబడుచున్నది. సింహళభాష 'మామ'. కవిభాష-'మమి'. కుర్దిస్తానీ పెరిషియన్ భాష-'మామ్'. ఇవి యిటాలియన్ భాషలలోని 'మి' ఫ్రెంచి భాషలోని 'మొయి' అను వానివలెనె మొదట ద్వితీయాది విభక్తులె యై యుండును. బెహిస్తను ఫలకములలోని శాసనముల సిథియను భాషలలో మాత్రము ప్రథమా విభక్తి 'హు' అనునదై యున్నది. కాని యందును షష్ఠీ విభక్తి 'మి' అనియే యున్నది.

(౧) సిథియన్ భాష లన్నిటిలోను ద్వితీయా ద్యంగమేకాక ప్రథమా విభక్త్యంగమ్మును 'మ' శబ్దమె యై యున్నది. ఈ 'మ' శబ్ద మనుస్వారసదృశాను నాసిక పరమగుచు నుండుటచేత (మజ్-మొ) నయ్యది ద్రావిడ భాషలలోని

'నాన్' అనుదానిని సంపూర్ణముగాఁ బోలియున్నది. కాని సిథియను భాషల లోని తుది యనునాసిక ముచ్చారణార్థకము. ఇట్లుచ్చారణార్థకానునాసికము చేరుట యిండో యూరపియను భాషలందును గలదు. మన్=(నేను) పెరిషియన్ భాష. మాన్-సింధియన్ భాష. మనిక్-బెలూచి భాష. ఎగోనె=తునే-ప్రాచీన గ్రీకు భాష.

ఇట్టి యుచ్చారణార్థకానునాసికము తుదిని గల్గియుండుట సిథియను భాషలం దింతకంటె నధికముగఁ గలదు.

తురిుష్కు భాషా కుటుంబము.

మెన్—(నేను) ప్రాచ్య తురుష్క భాష.
మాన్—తుర్కోమన్ భాష.
మామ్—కివన్ భాష.
బెన్—ఒట్టోమన్ తురుష్క భాష. (మకారమె బకార రూపమందెను). (మెన్=బెన్).

ఫిన్నిష్ భాషా కుటుంబము.

మినా—ఫిన్నిషు భాష.
మొన్—లేపిష్ భాష.
మ-(లేక) మిన్న—ఎస్తోనియన్ భాష.
మొన్ — మొర్డ్విన్ భాష, (లేక) 'వోటియకు' భాష.
మ—'ఓస్టియకు' భాష. ద్వివచనము 'మిాన్' బహువచనము-మెన్.
ఏన్—మగ్యార్ భాష.
మన్-మనీ-సామోాయిదీ మాండలిక భాష.

ఫిన్నిష్ కుటుంబములోని మంగోలియా, మంచు భాషలలోని ప్రథమైక వచనము 'బి'=(నేను) అనునది. ఇది 'మి' అనుదానినుండి యేర్పడియున్నది. ఓట్టమన్ టర్కిషుభాషలో 'మెన్' అనునది 'బి' అని యైనరీతినె. ఈ మంగోలియా, మంచుభాషలలో దీని ద్వితీయాద్యంగము 'మన్' అనునది. షష్ఠి-మిను-(లేక) మిని. మంగోలియను చతుర్థి-మెన్దో. మంచుభాష చతుర్థి-మిన్దె" (కాల్డు. ౩౭౯, ౩౮౦ పుటలు).

"పయి విమర్శమువల్ల సిథి యను భాషలలోని యుత్తమ పురుష సర్వనామ ప్రాతిపదికము 'మ' శబ్దమని విశదమగుచున్నది. ఇది యార్వాచీన మగు 'మన్' అనురూపముతో సైతము వైకల్పికముగ వాడఁబడును.

సిథియన్ కుటుంబభాషల రూపములు

మ—మింగ్రేలియన్ భాష.
మి—సౌనియన్ భాష.
మ—లేసియన్ భాష.
మె—జార్జియన్ భాష.
మె-మ-మినా-మియ—ఫిన్నిషు భాష.
మిన్-మ—'ఓస్టియాకు' భాష.

'మన్' అనునది ప్రథమా విభక్తిగా వాడఁబడు భాషలలోఁ గ్రియా ప్రత్యయములందును, సాధ్య సమాసములందును (Inflexional compounds) 'మ' అనునది నిల్చును. ఇట్టి పద్ధతి యుత్తర హిందూస్థాన భాషలందును బెరిషియాలోని వ్యావహారిక భాషలందును గలదు. ఉదా:—పెరిషియన్-మన్ = (నేను). ద్వితీ-మరా = (నన్ను-నాయొక్క). ఇందలి క్రియా ప్రత్యయము 'మ్' అనునది. తుర్కిష్ భాషా కుటుంబములో సైత మిదే విధమున నుండును. ఉదా:—మన్ = (నేను-ప్రథమ). ద్వితీ-మెన్. క్రియా ప్రత్యయము-మ్. ప్రాచ్య తురుష్క భాషలో-వర్తమాన-మెన్. బొలామెన్ = (ఉన్నాను). భూత-మ్-బోల్డిమ్=(ఉంటిని)" (కాల్డు. ౩౨౧ పుట).

"కొన్ని సిథియన్ భాషలలో నుత్తమపురుష సర్వనామ 'మ' శబ్దము పదాంతమున నిల్చును. ఉదా:—తుర్కిష్ భాష-బాబామ్=(మ+బాబా:) (నా తండ్రి). మాగ్యరు భాషలోని ప్రథమైక వచనము 'ఏన్' అని యున్నను షష్ఠీ సమాసములోను సకర్మక క్రియా ప్రత్యయములలోను 'న' కారముచోట 'మ' కారమె నిల్చును. ఉదా:—అత్య=(తండ్రి). అత్యమ్=(నా తండ్రి). స్చెరెటెమ్=(ప్రేమించుచున్నాను). ఈ మాగ్యరు భాషలోని 'ఏన్'=(నేను) అను దాని బహువచన రూపము-'మి (లేక) మిన్క్' అనునది.

(౨) ఇండో యూరపియన్ భాషలందువలెనె కొన్ని సిథియన్ భాషలందును 'నాన్'=(నేను) అను ద్రావిడ సర్వనామపు సంబంధము చూపట్టుచున్నది. ఉదా:—ఫిన్నిష్ భాష-"మ=మిన్నా=(నేను). ఇసా=(తండ్రి). ఇసాని =(నాతండ్రి). ఓల్=ఉండు. ఓలెన్=(ఉన్నాను). సమాసమందును గ్రియా ప్రత్యయములందును గన్పట్టుచున్న యీ 'న' కారము, 'మ' అనెడి యుత్తమ పురుష సర్వనామ మూలరూప పరిణామమే కాని యుచ్చారణార్థకమగు ఫిన్నిషు భాషలోని 'మిన్నా' అను దానిలోని 'న' కారపు సంబంధి కాదు. ఇందులకు నిదర్శనముగా 'ఒలెత్'=(ఉన్నావు) అను మధ్యమ పురుషరూపమందు 'సినా=నీవు' అను దాని యుచ్చారణార్థక 'న' కారము మధ్యమ పురుష ప్రత్యయముగా నిలువ లేదు. ఇంక సర్వనామావయవ 'స' కారజన్య 'త' కారమె మధ్యమైకవచన ప్రత్యయముగా నిల్చినది. ఈ ఫిన్నిష్ భాషలోని 'ఓలెన్'=(ఉన్నాను) అను దాని యందలి యుత్తమ పురుషైకవచన ప్రత్యయ 'న' కారము సర్వనామావయవ 'మ' శబ్ద (పరిణామ) సంబంధి. ద్రావిడోత్తమ పురుషైక వచనములగు 'నాన్=యాన్' అను వానిలోని తుది నకార ప్రత్యయము సర్వనామావయవ సంబంధికాక యేకవచన ప్రత్యయరూప 'న' కార సంబంధియై యున్నది.

'మాగ్యర్' భాషలోని 'ఏన్=నేను' అనునది ద్రావిడ సర్వనామము (యాన్-యేన్-ఏన్) నెక్కుడుగాఁ బోలుచున్నను దీని సకారము మకార జన్యమె యనక తీరదు. సమాసమందును క్రియా ప్రత్యయములందును దీని చోట 'మ' కారమె చూపట్టుచున్నది. సింధియన్ మాండలిక భేదమగు 'లాపు' భాషలోని (ఇండో యూరపియన్) 'ఆన్=నేను' అను దానితో సైతము ద్రావిడ సర్వనామమును (తమి-యాన్-కన్నడ-ఆన్) బోల్పనగునా యని యాలోచింపవలసి యున్నది. ఫిన్నిషు (లేక) ఉగ్రియన్ కుటుంబములోని 'మార్ డ్విన్' భాషలోని యుత్తమ పురుష సర్వనామ ప్రథమైకవచనము 'మొన్= (నేను).' క్రియా ప్రత్యయము-'అన్' అనునది. ఉదా:—పజన్=(ప్రభువను)" (కాల్డు. ౩౮౧, ౩౮౨ పుటలు).

"మంగోలియన్ భాషా కుటుంబములోని దగు 'ఒలెత్ (లేక) 'కల్మక్' అను మాండలిక భాషతో నింకను బలమగు సంబంధము చూపట్టుచున్నది:— బి=(నేను). ఇది 'మి' శబ్దమునుండి యేర్పడెను. దీని షష్ఠి—మిని. తక్కిన విభక్తులు:—నద=(నాకు). నదయెద్ జె=(నా వలననుండి). నమై=(నన్ను). ఈ తుది రూపములు ద్రావిడ 'నాన్=(నేను)' శబ్దమును బలముగాఁ బోలు చున్నవి.

కొన్ని సిథియన్ భాషలలో ద్రావిడ 'నాన్-(నేను)' శబ్దమున కభిన్న రూపములె వెలయుచున్నవి. కకేషియాభాషా భేదమగు 'క్వసిక్విముక్' భాష:—న=(నేను). సామోయిదీ భాషా భేదమగు మోటార్ భాష:—నె= (నేను).

కొరియన్ భాష:—న=(లేక) నై=(నేను). బాస్కు భాష:—నె=ని= (నేను). తూర్వాసియా భాష గ్న్=న్గ. (తమిటమందలి 'న' కారము మలయాళ మున 'ఞ' కారముగా మాఱినట్లు). కాటన్ చీనా భాష:—న్గొ. మాండరిన్ భాష:- వొ. ప్రాచీన చీనా భాషా రూపములు:—'న్గ-గ-గొ-కన్-అ' అనునవి యుత్తమ పురుష సర్వనామ రూపములని 'ఎడ్కిన్స్' దొరగారు చెప్పుచున్నారు. ఇంక నితర భాషల సామ్యములు:—బర్మన్ భాష-నా-(లేక) న్గా. టిబెత్-గ్రాంథిక భాష:—నా. వ్యావహారిక భాష:—గ్నై. గ్రాంథిక భాష:—నకి=నయి= (నాది). టెటెంజి భాష-(ఆసాం భాషా భేదము):—నె. మికిర్ భాష:—నె. ఖాలీ నాగ భాష:—ని. హిమాల యోపత్యకా వాసుల భాషలలో 'నా' అను బర్మన్ భాషా శబ్దమే వాడఁబడుచున్నది. వీరును, మధ్య హిందూదేశపు 'కోలు' లను జాతివారును హిందూదేశముయొక్క యీశాన్య భాగము వారును 'న్గ' అను దానితో నంత మందెడి రూపమును సాధారణముగా వాడెదరు. ఉదా:—అన్గ-

ఉన్-ఇన్-ఐన్. ద్రావిడ సర్వనామముతోను నిండో యూరపియను సర్వనామముతోను సంబంధించునవియు, హైయేపియన్ జాతివారు వాడునవియు నగు 'మ-న్గ-న' అను వానితోఁ బై రూపము లెట్టి సంబంధము గల్గియున్నవో స్పష్టముగాఁ జెప్పఁ జాలను. 'తిబెతు' భాషలోని 'నా=(నేను)' (దీని వ్యావహారిక రూపము 'న్గా') అనునది మలయాళ భాషలోని 'ఞా' అనుదానితో సంబంధించినదని దృఢముగాఁ జెప్పఁవచ్చును. చీనా భాషలోని 'న్గో'=(నేను) అను దానిని నందలి 'ని'=(నీవు) అను దానిని జూచునపు డయ్యవి ద్రావిడ సర్వనామములతో సంబంధించునవని చెప్పవచ్చును. ఈ సందర్భమున 'న్గ-న్గన్య=(నేను) న్గలీ=(మే మిద్దఱము) న్గల్లు=నద్జు=(మేము)' అను నాస్ట్రేలియా సర్వనామములతోను ద్రావిడ సర్వనామమును సరిపోల్చి చూడనగును" (కాల్డ్వె. ౩౮౨, ౩౮౩ పుటలు).

(3) "తూర్వాసియా భాషలలో 'న-న్గ' అను రూపములు 'య-అ' అను రూపములుగ మాఱినవని చెప్పుటకుఁగాని కనీసము 'న-న్గ' అను రూపములకుఁ బదులుగ 'య-అ' అను రూపములు వాడఁబడుచున్నవని చెప్పుటకుఁగాని కొన్ని యాధారములు కనఁబడుచున్నవి. "స్గాకరెన్ భాష-యా-యాహ్=(నేను). పోకరెన్‌భాష-యెర్. 'మనియకు' భాష-ఆ. పెకిన్ చీనా భాష-వో" అను రూపములను బైని వ్రాసిన తూర్వాసియా భాషలతో సరిపోల్పవచ్చును.

మొత్తముమీఁద సిథియన్ భాషా కుటుంబములోని యుత్తమ పురుష సర్వనామైకవచన రూపములును బైని వివరించిన వివిధభాషలలోని రూపములును నభిన్నములని తేలుచున్నది. సిథియన్ భాషోత్తమ పురుష సర్వనామైక వచన రూపములు:—'మ-న-బ-న్గ-య'. ఇండో యూరపియను రూపములు:—'మ-వ-న-అ'. ద్రావిడ రూపములు:—'న-య-అ'. పై రెండు కుటుంబముల రూపముల నందును సిథియను రూపములను ద్రావిడ రూపములు పోలుచుండుటచేత వీని నా రెండిటికి నభిన్నములుగాఁ జెప్పుట యుక్తము. ఈ సిద్ధాంతము చొప్పున నిండో యూరపియను జాతులు సిథియను జాతులనుండి వేఱుపడక ముందటి జాఫెటికుకుటుంబమునందు 'బహుశః' మ శబ్దమే యుత్తమ పురుషైక వచన సర్వనామముగా వాడఁబడుచుండెనని సిద్ధాంతితమగు చున్నది. ప్రొఫెసర్ 'హన్‌ఫెల్‌వి' దొరగారు ౧౮౭౮ సం॥ అంతర్జాతీయ ప్రాచ్య విద్వత్పరిషత్తునందుఁ జేసిన యుపన్యాసమునందును బై విషయములు సూచితములయ్యెను. ఆర్యతురేనియన్ భాషలలోని పురుష బోధక సర్వనామముల సామ్యమునుబట్టి యా రెండు భాషలకును మూలమైన భాష యొక్కటియె

మై యుండునని యూహించిరి. 'పప-మమ' (తల్లి-తండ్రి) అను శబ్దముల వంటి కొన్ని ప్రత్యేక శబ్దములు పై ప్రాచీన భాషనుండి వచ్చినవె యని యూహించిరి." (కాల్డు. ౩౮౩ పుట).

విమర్శము:—ఇండో యూరపియను కుటుంబ సంబంధాభాసమును విస్తరించినట్లె (౧౦౯ II విప. చూడు) యీ సిథియను కుటుంబ సంబంధమును దొరగారు మిక్కిలి విస్తరించిరి. ఇండో యూరపియను భాషలందును సిథియను భాషలందును 'మ' శబ్ద ముత్తమ పురుష సర్వనామైక వచనమనియు నట్టి 'మ' శబ్దమె కొన్నియెడల 'న' కారముగాఁ బరిణమించెననియు నిరూపించుటకై యెంతయు గ్రంథము పెంచఁబడినది. ఈ విషయమున విప్రతిపత్తియే లేదు. మకారము నకారముగా మాఱుట సరికాదని యెవ్వరును వచింపలేదు. ఉత్తమ పురుష సర్వనామ విషయమున ద్రావిడ భాషలు విలక్షణ స్వభావము గల్గి యున్నవి. 'నాన్=(నేను)' అను రూపమె ప్రాచీన ద్రావిడ భాషలో లేదు. 'యాన్=(నేను)-యామ్=(మేము)' అనునవి మాత్రమె యస్మదర్థకము లేకవచన బహువచన రూపములతోఁ దొల్కాప్పియమునఁ జేర్కొనఁబడెను. ఇంక 'నామ్' అను నిత్య బహువచన రూపము మాత్రమె తొల్కాప్పియమునఁ గలదు. (చూడు ౧౦౭ II విప). అయ్యది యుష్మ దస్మ దుభయార్థకముగ మాత్రమె ప్రాచీన తమిళ వాఙ్మయమున వాడఁబడి యున్నది. కావుననె దానికి 'నాన్' అను నేకవచన రూపము తొల్కాప్పియమున వచింపఁబడదయ్యెను. 'నాన్=(నేను)' అనునది యర్వాచీనముగాఁ దమిళమునఁ జేరుటచే నన్నూలు దానిని వచించుచున్నది. ఇది యర్వాచీన కర్ణాట సంపర్కమునఁ దమిళమునఁ జేరి యుండును. ఉత్తమ పురుష సర్వనామ ద్వితీయా ద్వ్యేకవచనాంగము 'యాన్' శబ్ద సంబంధి యగు 'ఎన్' అనునది మాత్రమె యనుటలో నెవ్వరును విప్రతి పన్నులు కానేరరు గదా. 'ఎన్నై'=(నన్నున్). 'నాన్'=(నేను) అనునది తమిళమున సహజముగ నుండియున్నయెడలఁ గన్నడమందువలెనె తమిళ మందును ద్వితీయా ద్వ్యేకవచనాంగము 'నన్' అనునదియు నుండదా? అది లేదే! (చూడు ౧౦౭ IV విప). తుదికిఁ గర్ణాటమందును 'నాన్=(నేను) నామ్= మేము' అను రూపములు మిక్కిలి యరుదై యున్నవి. ప్రాచీనములగు కర్ణాట భాషాభూషణమందును శబ్దమణి దర్పణమందును నవి పేర్కొనఁబడనే లేదు. ఇట్టి యరుదును నర్వాచీనమును నగు 'నాన్=(నేను)' అను దానిని ద్రావిడ భాషలలో నత్యంత ప్రాచీన మూలశబ్దమని దొరగారు వ్రాయుట కేవలము నయథార్థము. ఇట్టి 'నాన్' శబ్దము కేవలము భిన్నార్థకము భిన్న ప్రకృతికము నగు 'యాన్' శబ్దమున కభిన్నమనుట యంతకన్నను నయథార్థ

శబ్దమును నస్మదర్థక రూపములలోఁ గనఁబడుఁగాక! ద్రావిడ భాషలకును సిథియన్ భాషలకును నేదో యొక విధమయిన సంబంధ ముండుట వింతకాదు గదా. మఱియు నాస్ట్రేలియా-కనురీ-టిబెటన్ భాషలు మున్నగు ననేక భాషలలో నస్మదర్థకము 'న' శబ్దము దొరగారిచేఁ జూపఁబడెను. చరిత్రకును నూహకును నందని స్థితిగల యిట్టి విషయములందు హేత్వాభాసములను గల్పించి యవెల్ల నభిన్నములనుట సాహసము. యుష్మ దస్మ దుభయార్థక ద్రావిడ రూప మన్నిటికిని విలక్షణ మనుటలో వింత యేమున్నది? (నీ+యా= నా + మ్ = నామ్).

౧౧౦. I విష:—"మధ్యమ పురుష సర్వనామైక వచనము:—తమిళ మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయా ద్వ్యంగ ములు | క్రియా ప్రత్యాయ ము లు | ప్రథమ | ద్వితీయా ద్వ్యంగములు | క్రియా ప్రత్యయ ములు |
| మధ్యమ పురుష. ప్రార్థనా ద్వ్యర్థక. | నీ - నీయ్ | నిన్ - నున్- ఉన్ | ఆయ్-ఓయ్ ఐ-ఇ<br>ధాతుమాత్రము —ఆయ్ | నీర్ -నీయిర్ నీవిర్ -నీఙ్గళ్ | నుమ్-ఉఙ్గళ్ - ఉమ్ | ఇర్ ఈర్<br>ఈర్ -మిన్ |

తమిళమునందలి 'నాన్-యాన్' అను నుత్తమ పురుష ప్రథమైక వచనమునకు సరిగ నుండెడి 'నీన్' అనుదానికి బదులుగా 'నీ' అనునది మధ్యమ పురుష సర్వనామైక వచనముగ వాడఁబడుచున్నది. ఇది 'నీన్' అనియె యుండెడిదనుటకు 'నిన్' అను ద్వితీయాద్వ్యంగమె నిదర్శనము. ప్రాచీన గ్రంథములలో నరుదుగను లేనేలేదు. అర్వాచీనము వ్యావహారిక తమిళమునం దెల్లెడలను 'ఉన్' అనునదె ద్వితీయా ద్వ్యంగమై యున్నది. కానఁ దమిళమున 'నిన్-నున్-ఉన్' అనుమూఁడును ద్వితీయాద్వ్యంగము లనఁదగును. గ్రాంథిక తమిళమున 'నీయ్=(నీవు)' అను రూపమును నరుదుగ వాడఁబడుచున్నది. 'నాన్-యాన్' అను స్థలమందలి మార్పువలెనె 'నీయ్=నీన్' అను స్థలమందును 'న-య'ల పరిణామము నంగీకరింపనగును. (౧౦౬ II. ౧౦౭ II విష. చూడు). 'నీయ్' అను దానిలోని తుది 'య' కారము 'ఆయ్-ఓయ్' అను క్రియా ప్రత్యయములయు, విధేయ విశేషణములయుఁ దుదిని గన్పట్టుచున్నది. తమిళ మధ్యమ పురుష క్రియా ప్రత్యయములు 'ఆయ్-ఓయ్-ఐ-ఇ' అనునవె యున్నవి.

'నడన్తనై =(నడచితివి), నడన్దనీర్ =(నడచితిరి)' అను రీతిగల స్థలములందు 'నై-నీర్' అనునవి యేకత్వబహుత్వములందలి మధ్యమ పురుష క్రియా ప్రత్యయములవలె స్థూలదృష్టికిఁ గన్పట్టును. కాని పరిశీలింపఁగా నట్టి 'న' కారము సంధిజన్యమనియు 'ఐ-ఈర్' అనునవె మధ్యమ పురుష క్రియా ప్రత్యయములనియుఁ దోఁచును.

తమిళ విధ్యాద్యర్థక మధ్యమ పురుషైక వచనము, ధాతువున కే ప్రత్యయమును జేరకయే యేర్పడును. వ్యావహారిక తమిళములోని ప్రార్థనా ద్యర్థక బహువచన రూపములలో 'ఉమ్-మ్' అను ప్రత్యయములు కనఁబడు చున్నవి. ఇవి ద్రావిడ సర్వనామములకు సామాన్యముగా బహువచన చిహ్న ములై యున్నవి. ఇందలి 'ఉమ్' అనునది సముచ్చయార్థకము కావచ్చును. తెనుఁగు భాషలోఁ బ్రార్థనాద్యర్థమున నేకత్వమునందుఁ బాక్షికముగా 'ము' ప్రత్యయము కనఁబడుచున్నది. దీనిని బూజ్యార్థకముగా నెన్నవలెను. తమిళము నందలి 'ఉమ్' అనుదానివలెనె తెల్గునందలి 'ము' ప్రత్యయము ప్రాచీనావస్థలో బహువచనమందె వచ్చియుండును. తమిళ బహువచనాంగము కన్నడమందు వలెనె 'నిమ్' అనియె యుండవలసినది కాని 'నుమ్' అని యేర్పడినది, . (చూడు ౧౧౩ IV విష).

ప్రార్థనాద్యర్థకత్వమున నేకవచనమందు ధాతుమాత్రమె నిల్చును. కాని 'ఆయ్' ప్రత్యయము నిల్చుట సైతము గ్రాంథికభాషలోఁ గలదు. ఉదా:— కేళాయ్ =(వినుము). కేళీర్ =(వినుఁడు). కేణ్మిన్ =(వినుఁడు). వ్యతిరేక ప్రార్థనార్థకరూపములును బ్రార్థనార్థకరూపములును నభిన్నములె యగునని 'బెశ్చి' దొరగారు తలంచిరి. కాని నఞర్థకమగు 'అల్' అనుదాని సంక్షేప రూపమగు 'అ' అనునది 'ఆయ్-ఈర్' అనువానిచాటున నణఁగియున్నదని గ్రహింపనగును. కాన 'కేళాయ్=(నీవు వినవు=వినలేదు); కేళీర్ =(మీరు వినరు=వినలేరు)' అను వ్యతిరేకరూపములు శంకాస్పదములు కావు" (కాల్డు. ౩౮౪, ౩౮౫ పుటలు).

విమర్శము:—తమిళ మధ్యమ పురుష సర్వనామముయొక్క ద్వితీయా ద్యేకవచనాంగమునుబట్టి మధ్యమ పురుష సర్వనామ ప్రథమైకవచన రూపము 'నీన్' అనియె మొదట నుండియుండునని దొరగారు నిశ్చయించిరి. కాని తమిళ మధ్యమ పురుషైకవచన క్రియా ప్రత్యయములనుబట్టి తుదిని నకారము లేని 'నీ' అను రూపమె మధ్యమ పురుష సర్వనామ ప్రథమైకవచనమగుట యర్థమునఁదగును. తొల్కాప్పియముకన్నఁ బ్రాచీనకాలపు స్థితి దొరగారికిఁ

దెలియు ననరాదుగదా. తొల్కాప్పియమున ‘నీ=(నీవు)’ అనునదే మధ్యమ పురుషైకవచన సర్వనామమనియు ‘నిన్’ అనునదె ద్వితీయా ద్యంగమనియు విశద మగుచున్నది. దీని తుది ‘న’ కారము ‘నుమ్’ లోని మకారమునుబట్టి యేర్పడి యుండును.

‘‘అవఱ్ఱు (ట్రు)ళ్ ......’’(తొల్కా. ౬౨3 సూ.)=‘నీ’ అనునది మధ్యమ పురుష సర్వనామ ప్రథమైక వచనరూపము. ఉదా:—నీ వన్దాయ్=(నీవు వచ్చితివి).

‘‘ఏనై ......’’ (తొల్కా. ౬౨౪ సూ.)=‘నీయిర్’ శబ్దము మధ్యమ పురుష సర్వనామ ప్రథమా బహువచనరూపము. ఉదా:—నీయిర్ వన్దీర్=(మీరు వచ్చితిరి).

‘‘నీయెన్ ఒరుపెయర్ ......’’ (తొల్కా. ౧౮౦ సూ.)=విభక్తి పర మగునపుడు ‘నీ’ అను శబ్దము హ్రస్వమగును. వాని నడుమ ‘న’ కారము నిల్చును. ఉదా:—నీ+ఐ=ని+న్+ఐ=నిన్నై=(నిన్ను).

‘‘నుమ్మెన్ ఇఱుది ......’’ (తొల్కా. ౧౮౮ సూ.)=‘నుమ్’=(మీరు) అనెడి శబ్దమునకు విభక్తి పరమగునపు డే యాగమమును రాదు. ఉదా:—నుమ్+ఐ=నుమ్మై=(మిమ్మును).

‘నీయ్’ అను యాంతరూపమును ‘నీన్’ అను నాంతరూపమును దొల్కాప్పియ సమ్మతములుకావు. అట్టి రూపములు తొల్‌కాప్పియమునాఁటికి లేవు. అవి ప్రాచీనరూపములని దొరగారు వ్రాయుట సరికాదు. అట్లె- ‘నున్-ఉన్’ అను ద్వితీయా ద్యంగములు సయితమానాఁటికి లేవు. ‘ఉమ్-ఉఙ్గళ్’ అను ద్వితీయాది బహువచనాంగములును దొల్కాప్పియమునాఁడు లేవు. ఇవెల్ల నర్వాచీన రూపములు. మధ్యమ పురుష క్రియా ప్రత్యయములలో ‘ఆయ్’ అనునది యున్నదిగాన ‘నీయ్’ అను యాంత మధ్యమ పురుష సర్వ నామైక వచనము ప్రాచీనకాలమున నుండవలయునని దొరగారు తలంచుట సరి కాదు. ‘నుమ్’ అను మధ్యమ పురుష సర్వనామ ద్వితీయాది బహువచనాంగము నుండి ‘ఉమ్’ మున్నగు నంగము లర్వాచీనముగా నేర్పడి యుండవచ్చును. ‘ఉమ్’ అనునది తమిళ సర్వనామ ప్రాచీన బహువచన రూపమనుట యుక్తమె యనవచ్చును (చూడు ౧౧3 IV విష.). ‘నీ+ఉమ్=నుమ్’ అను రీతిని ‘నుమ్’ అను రూప మేర్పడియుండును. (చూడు ౧3౬ III విష.). తమిళ మధ్యమ పురుష సర్వనామ ప్రథమా బహువచనమున ‘ఇర్’ అను బహువచనాంతరము నిల్చినను ద్వితీయాది బహువచనాంగముగ ‘నుమ్’ అనునదె నిల్చుట సంభ

వించెను. తమిళ బహువచన ప్రత్యయమగు 'ము' కారము (ఉమ్ శబ్ద ఖండము) పైని గన్నడ ప్రసిద్ధమగు 'నీమ్' అనుదానిని సంబంధించు 'ఇమ్=ఇన్' అను మధ్యమ పురుష ప్రథమా బహువచనరూపము నిల్చుటచేత 'మిన్' అను తమిళ విధ్యర్థక బహువచన రూప మేర్పడియుండును. ఇంక 'నీ' శబ్దము మీఁది స్వరమగు 'ఈ=ఇ' అనునది మధ్యమ పురుషైకవచన ప్రత్యయమగుట సహజమె కదా! (చూడు ౧౦౭ V విష).

'తా'=(తాను) శబ్దము మూఁడు పురుషములందును వాడఁదగిన దగుట చేతను నొకొకప్పు డది మధ్యమ పురుషార్థము నిచ్చున దగుటచేతను (చూడు ౧౧౨ II విష.) దాని సంక్షేపరూపమగు 'ఆ' అనెడి స్వరమునకుఁ బరముగ 'ఇ' అను మధ్యమ పురుషైక వచన ప్రత్యయము నిల్చుటవలన 'ఆ+ఇ=ఆయ్=ఓయ్' 'ఆ+ఇ=అ+ఇ=ఐ' అనెడి మధ్యమ పురుష సర్వనామమైె యట్టి ప్రత్యయములును నేర్పడి యుండవచ్చును.

"ఇకర యకరమ్......" (తొల్కా. ౫౮ సూ.)=తమిళ శబ్దాంత మందలి యకారపు పొల్లు 'ఇ' కారమున కభిన్నమై యుండును.

"అకరత్తింబర్......" (తొల్కా. ౫౬ సూ.)=అకారమునకుఁ దర్వాతి యకారపు పొల్లు 'ఐ' కారమగును.

"అకర ఇకరమ్......" (తొల్కా. ౫౪ సూ.)=అకారమును 'ఇ' కారమును గూడి 'ఐ' కారమగును.

ఇట్లేర్పడిన 'ఆయ్=ఓయ్-ఐ-ఇ' అనునవి మధ్యమ పురుష ప్రత్యయములని తొల్కాప్పియమున నుపదేశింపఁబడెను.

"అవట్టు (ట్టు) ళ్......" (తొల్కా. ౭౦౭ సూ.)=వానిలో 'ఇ=ఐ=ఆయ్' అనునవి తుదినిగల క్రియలు మహ దమహదర్థక మధ్యమ పురుషైక వచనమును దెల్పును. ఉదా:—చెయ్+ఇ+తు+ఇ=చెయిది=(చేయుదువు చేయుము). చెయ్+త్+అన్+ఐ=చెయ్దనై=(చేసితివి). చెయ్+త్+ఆయ్=చెయ్దాయ్=(చేసితివి).

"ఇర్ ఈర్......" (తొల్కా. ౭౦౮ సూ.)='ఇర్=ఈర్=మిన్' అనునవి తుదిని గల క్రియలు మహ దమహదర్థక మధ్యమ పురుష బహువచనమును దెల్పును. ఉదా:—చెయ్+త్+అన్+ఇర్=చెయ్దనిర్=(చేసితిరి). చెయ్+త్+ఈర్=చెయ్దీర్=(చేసితిరి). చెయ్+మిన్=చెయ్మిన్=(చేయుఁడు). 'మిన్' ప్రత్యయము విధ్యర్థక మాత్రము.

౧౧౦. II విష:—"మలయాళ మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక.—

| | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయ ములు |
| గ్రాంథి | నీ | నిన్ నినక్కు= (నీకు) | ... | నీజ్ఙళ్ | నిమ్ - (వ్యావాహార భ్రష్ట 'నీమ్' సంక్షేపము) నిమ్మోడు =(నీతో) | ... |
| వ్యావ | నీ | నిన్ | ... | నిజ్ఙళ్ | నిజ్ఙళ్ | ...” |

(కాల్డు. ౩౦౫ పుట).

విమర్శము:—మధ్యమ పురుష సర్వనామము విషయమునఁ జాలవఱకు మలయాళము కన్నడమును బోలియున్నను బ్రథమైక వచనమునఁ గన్నడమందువలె 'నీన్' అని నిల్వక తమిళమందువలెనె 'నీ' అని మాత్రమె నిల్చియున్నది. ప్రథమా బహు వచనమునఁ గన్నడమందువలెనె బహువచన మకారము తుదిని గల నీ శబ్దమె నిల్చుచున్నది. దానిపైని 'కళ్' ప్రత్యయము సైతము నిల్చుటచేత మలయాళ సంధి సంప్రదాయము చొప్పున (చూడు ౧౫ II విష) 'నీజ్కళ్=నిజ్ఙళ్' అను రూప మేర్పడెను. ద్వితీయాది బహువచనమునఁ దమిళమందువలె 'ఉమ్' అను దానితోఁగూడిన రూపము నిల్వలేదు. ఇంకఁ బ్రాచీన కన్నడమందువలెనె 'నిమ్' అనునదియె గ్రాంథిక రూపమై యున్నది. ('నిజ్ఙళ్' తఱుచు. శ్రీ రెడ్డిగారు.) ప్రథమా బహువచన సదృశమగు 'నిజ్ఙళ్' అనునది వ్యావహారిక ద్వితీయాది బహువచనాంగమగుట వింతకాదు. మలయాళమునఁ దిజ్ఞులు లేమింజేసి (౧౫ II (iv) విష) పయి పట్టికలోఁ గ్రియా ప్రత్యయములు లేవయ్యెను.

౧౧౦. III విష:—"తుళు భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమా బహువచనము | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| ఈ (తెల్గులోని 'ఈవు' అను వ్యవహార భ్రష్ట రూపమునకు సరియైనది) | నిన్ - ని (నిన=నీయొక్క) (నిక్కు=నీకు) | అ | ఈర్ - నికులు (వాడుక తమిళ మందలి 'నీర్' అను దానివలెనె యిందలి 'ఈర్' అనునదియుఁ బూజ్యార్థకమె) | ఈర్ నికుళ్ ('ఈరె, నికుళె' పట్టిక) | అర్ ,, |

(కాల్డు. ౩౮౫ పుట).

విమర్శము:—ద్వితీయా ద్యేకవచనాంగములు 'నిన్-ని' అనునవి నిల్చుటయుఁ గ్రియా ప్రత్యయములు 'అ-అర్' అనునవి యేర్పడుటయుఁ బరిశీలింపఁ దగును. సర్వనామ ప్రకరణాంతపు పట్టిక దీనికి భిన్నముగ 'నికుళె-ఈరె' అనునవి ద్వితీయాది బహువచనాంగములుగ వ్రాయఁబడెను. అందు ద్వితీయా ద్యేకవచనాంగము 'నిన' అని యున్నది. ముద్రణ ప్రమాదమేమో?

౧౧౦. IV విష:—"కర్ణాట మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమైక వచనము | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయములు | ప్రథ- | ద్వితీయా ద్యంగములు | క్రియా ప్రత్యయములు |
| పలగన్నడము | నీన్ - | నిన్ (నిన్న = నీ యొక్క) | అయ్ (తమిళమందలి 'ఆయ్' అను దానినిబోలినది) | నీమ్ | నిమ్ (నిమ్మ = మీ యొక్క) | ఇర్ (తమిళ ప్రత్యయములను బోలును) |
| హళసగన్నడము | నీను - నీ (తమిళమందువలెనె 'నీ' అను ప్రాతిపదికమును వాడఁబడును) | నిన్ | ఇ-ఈ-ఈయె-ఎ | నీవు | నిమ్ | ఇరి-ఈరి-అరి" |

(కాల్డు. ౩౮౫, ౩౮౬ పుటలు).

విమర్శము:—హళసగన్నడ వ్యాకరణమగు 'శబ్దాదర్శ'మునందు 'నీ' అను ప్రథమైకవచన రూపము లేదు. హళసగన్నడ క్రియాప్రత్యయములను గాల్డువెల్లుగారు మిశ్రితముగాఁ జూపిరి. శబ్దాదర్శమున విభజించి వ్రాయఁబడెను. వర్తమాన-తద్ధర్మ-ఏక-'ఈయె.' బహు-'ఈరి' భూత-భవిష్యత్-ఏక-'ఎ-ఇ.' బహు-'ఇరి.' విధ్యాద్యర్థ-ఏక-'ఉవదు.' బహు-'ఇరి.' వ్యతిరేకార్థ-ఏక-'ఎ.' బహు-'అరి.'

కర్ణాట ప్రార్థనాద్యర్థ రూపములను దొరగారు స్మరింపలేదు. తమిళమందువలెనె కన్నడమందును ధాతురూపమె ప్రార్థనాద్యర్థకైకవచన మగును. కన్నడ ప్రార్థనాద్యర్థక బహువచన ప్రత్యయము 'ఇమ్' అనునది. ఇయ్యది కర్ణాట మధ్యమ పురుష సర్వనామ 'నీమ్' శబ్దపు ఖండ మనఁదగును. ఉదా:—మాడు=(చేయుము) మాడిం=చేయుఁడు. కర్ణాటమునఁ బదాంతిమ 'న-మ' లనుస్వార మగును.

"కన్నడము-నీను-(ఏక). నీవు-(బహు)" (ఆం. భా. వి. ౪౮౧ పుట). 'నీన్-నీమ్' అను ప్రాచీన కర్ణాటరూపముల నుదాహరింపక కన్నడ విషయమున నిట్లు హళసగన్నడ రూపముల నిట నుదాహరించుటలో గ్రంథకర్తగారి యభిప్రాయ మేమో తెలియకున్నది. "తెలుఁగున ఏకవచనమగు 'నీవు' అను రూపమే

కన్నడమున బహువచనముగా నున్నది. దీనినిబట్టి వచన భేదము కాలక్రమమునఁ గలిగినదనియు నొక్క రూపమే రెండువచనములయందును వాడుకలో నుండెననియు నూహించుట కవకాశము గలదు" (అం. భా. వి. ౪౮౨ పుట). తెల్గు ప్రథమైకవచన వు ప్రత్యయ మత్యంత ప్రాచీన రూపము. కన్నడ ప్రథమా బహువచన 'వు' ప్రత్యయ మర్వాచీనమగు హళగన్నడ రూపము. ప్రాచీన కన్నడములోని 'నీమ్' అను చోటి 'మ' కారము 'వ' కారముగాఁ బరిణమించుటచేత నయ్యది యేర్పడినది. ఇట్టి 'వు' ప్రత్యయ ద్వయమున నైక్యము గల్పించుట యెట్లు పొసఁగునో తెలియకున్నది. కాల్డువెల్లుగా రిట్లు పొరవడి వ్రాసిన దానిని (చూడు తెల్గు నీవు శబ్దము ౧౧౦ V విష) సరియని భ్రమించుట సరికాదు.

౧౧౦. V విష:—"తెనుఁగు మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్వ్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్వ్యంగము | క్రియా ప్రత్యయము |
| నీవు=ఈవు (ఇది వ్యవహార భ్రష్టము) ('నీ' అని పట్టిక) | ద్వితీ-నిన్. ('నిన్ను -నిను' అనునవి ద్వితీయా రూపములు. ఇవి 'నీను' అను దాని నుండి యేర్పడెను). తృతీయాద్వ్యంగము. 'నీ' అనునది. | వి - వు | మీరు=ఈరు (ఇది వ్యవహార భ్రష్టము) | ద్వితీ-'మిమ్' ('మిమ్ము=మిము' అనునవి ద్వితీయా రూపములు). తృతీయా ద్వ్యంగము 'మీ' అనునది | రి - రు |

తక్కిన భాషలందువలెనె 'నీ' అను ప్రథమైక వచనరూపమున కుచ్చారణ సౌకర్యార్థము 'వ' కారము చేరుటచేత 'నీవు' అని యేర్పడినది. కన్నడ బహువచనరూపమగు 'నీవు' అనుదానికిఁ దెల్గులోని యీ యేకవచనరూప మభిన్నము. తృతీయాదులలో 'వు' వర్ణము లోపించి 'నీ' అనునదే నిల్చును. (నీచేతన్-మొ). ద్వితీయయందు మాత్రము తక్కిన భాషలందు వలెనె 'న' కారము చేరఁగా హ్రస్వత గలును. ద్వితీ 'నిన్ను-నిను' అనునవి 'నీను' అను ప్రథమ

నుండి యేర్పడెననుట స్పష్టము. గ్రాంథి కాంధ్రమునఁ దుళుభాషలోని 'ఈ' అనుదాని కభిన్నమైన వ్యవహార భ్రష్టమగు 'ఈవు' అనునది క్వాచిత్కముగా వాడఁబడును. బహువచన రూపములలో 'మీరు-మిము' అనువానికి 'మీ' అనునది యంగము. ఉత్తమ పురుష సర్వనామమునందువలెనె 'నా-మా' అనువాని పరిణామము నరయునది. (నేను-మేము; నీవు మీరు). తెల్గునఁ గ్రియా ప్రత్యయములం దవయవరూపము నిల్వక యుచ్చారణార్థకమగు 'వు=వి' అనునది నిల్చును" (కాల్డు. ౩౮౬ పుట).

విమర్శను:—'నీవు' అను తెల్గు శబ్దమునందలి 'వు' అనునది యుచ్చారణార్థకమనుట నిశ్చయ మనఁజాలము. 'ఈ' కారమునకుఁ బరముగా నుచ్చారణార్థకమే చేరునపుడు 'వు' అనుదానికన్న 'వి' అనునది చేరుట యింకను 'యి' అనునది చేరుట యుచితమనఁదగును. కాని మఱి యే ద్రావిడ భాషలందును బ్రథమైక వచనమున 'వ' కారస్థితి కానరాదు. హాళగన్నడములోని 'నీవు' అను ప్రథమా బహువచనమునకుఁ దెల్గులోని యీ 'నీవు' అనెడి ప్రథమైక వచన మభిన్నమనుట యసంగతము. 'నీమ్' అను పఴగన్నడ రూపమందలి 'మ' కారము 'వ' కారముగఁ బరిణమించుటచేత 'నీవు' అను హాళగన్నడ బహు వచన రూప మేర్పడెను. ఇట్లె హాళగన్నడమం దుత్తమపురుష నా శబ్ద బహు వచనము 'నావు' అనియు నాత్మార్థక 'తా' శబ్ద బహువచనము 'తావు' అనియు నేర్పడెను. అట్టిది తెల్గులోని యేకవచన 'వు' వర్ణకమున కభిన్నమనుట సరికాదు. అట్లె 'నీను' అనుదాని నుండి 'నిన్ను-నిను' అనునవి యేర్పడెనను టయు నసంగతమె. 'నీను' అనునది హాళగన్నడ ప్రథమైకవచ రూపము 'నీన్' అను పాళగన్నడ రూప పరిణామము. 'నిన్ను=నిను' అనునవి తెల్గు ద్వితీయైక వచనాంతరూపములు. వీనితుది 'ను' అనునది ద్వితీయా ప్రత్య యము. మఱియుఁ బ్రాచీనతమములగు తెల్గు 'నీవు-నిన్ను=నిను' శబ్దము లెక్కడ? అర్వాచీనములగు హాళగన్నడ రూపము లెక్కడ? హాళగన్నడ రూపములనుండి ప్రాచీనతమాంధ్రరూపము లేర్పడెననుట సరికాదు. తెలుఁగు మధ్యమ పురుష సర్వనామ ప్రథమైకవచన బహువచనరూపముల తుదివర్ణములె తెలుఁగు మధ్యమ పురుష క్రియా ప్రత్యయములు. తెల్గునఁ బ్రార్థ నాద్యర్థక మధ్యమ పురుషైకవచనమున 'ము' ప్రత్యయమును బహువచనమున బిందు పూర్వక డు ప్రత్యయమును నిల్చును. ఏకత్వమందలి 'ము' ప్రత్యయము వైకల్పికముగ లోపించును. లోపించిన రూపము తమిళ కన్నడ ధాతుమాత్ర రూపములకు సరిపడియుండును. ఈ 'ము' వర్ణకము 'నీవు' శబ్దములోని 'వు' అనుదాని పరిణామమని తోఁచుచున్నది. (దేముఁడు=దేవుఁడు).

౧౧౦. VI విష:—"తుద భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయాద్యంగము | క్రియాప్రత్యయము | ప్రథమ | ద్వితీయాద్యంగము | క్రియాప్రత్యయము |
| నీ | నిన్ | ఇ-ఎ | నిమ | నిమ్ | ఇ-ఎ ” |

(కాల్డు. ౩౮౬ పుట).

౧౧౦. VII విష:—"కోత భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయాద్యంగము | క్రియాప్రత్యయము | ప్రథమ | ద్వితీయాద్యంగము | క్రియాప్రత్యయము |
| నీ | నిన్ | ఇ | నీమె-నీవె | నిమ్ | ఇరి-ఈరి ” |

(కాల్డు. ౩౮౬ పుట).

౧౧౦. VIII విష:—"గోందు భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయాద్యంగము | క్రియాప్రత్యయములు | ప్రథమ | ద్వితీయాద్యంగము | క్రియాప్రత్యయములు |
| నేటి రూపములు | ఇమ్మా (ఇది ప్రాచీన కాలపు బహువచన రూపము. ఇపుడిది గౌరవార్థకైకత్వ విశిష్టవాచియై యున్నది) | ని - నివ | ని - ఇ | ఇమ్మాత్ (ఇమ్మాట్ - పట్టిక) | మీ (తెల్గునందు వలెనె) | ఈత్ |

ఈ గోండు భాషయందలి యుత్తమ మధ్యమ పురుష సర్వనామ రూప ముల విషయ మాలోచింపఁదగినది. ఒక కాలమున నుత్తమ పురుష సర్వ నామైకవచనము:— 'ఆయాతోనా' = (అగుచున్నాను). మధ్యమ పురుష సర్వనామము:—'ఆయాతోనీ' = (అగుచున్నావు). మఱికొన్ని కాలము లలో:—ఆన్‌దాన్ =(అయితిని). ఆత్తాన్ =(ఇప్పుడైమైతిని). పయి యుత్తమ మధ్యమ పురుష సర్వనామ రూపములలో 'ఓన్ =(వాఁడు)' అను ప్రథమ పురుష సర్వనామ రూపపు మేళన మున్నదని నే నూహించుచున్నాను. 'ఆయాత్ + ఓన్ + ఆ = ఆయా తోనా =(అయిన వాఁడను). ఆయాత్ + ఓన్ + ఈ = ఆయాతో నీ =(అయిన వాఁడవు)' అని పయి రూపముల ఛేదము నరయు నది. అట్టి యెడల మధ్యమ పురుష క్రియా ప్రత్యయము 'ఈ' అను సామాన్య రూపము గలదే యగును" (కాల్డు. ౩౭౬, ౩౭౭ పుటలు).

౧౧౦. IX విష:—"కు భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూప ముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| ఈను | నీ | ఇ | ఈరు | మీ | ఏరు<br>ఆరు " |

(కాల్డు. ౩౭౭ పుట).

౧౧౦. X విష:—రాజమహాల్ భాష మధ్యమ పురుష సర్వనామ రూప ముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| నిన్ (ఈ ప్రకర ణాంతపు పట్టికలో 'నిన' అనియు నున్నది) | నిన్ | ... | నిన (ఈ ప్రకర ణాంతపు పట్టికలో 'నిమ' అనియు నున్నది) | నిమ్ | ... " |

(కాల్డు. ౩౭౭ పుట).

౧౧౦. XI విష:—"ఒరాఒన్ భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| నీఎన్ (ఈ ప్రకర ణాంత మందలి పట్టికలో 'నిన్' అనియు నున్నది) | నీఎన్ (ఈ ప్రకర ణాంతమున 'నిన్' అనియు నున్నది) | — | ఆసు (ఈ ప్రకర ణాంతమందలి పట్టికలో 'నిమ్' అనియు నున్నది) | ఆస్స్ (ఈ ప్రకర ణాంతమందలి పట్టికలో 'నిమ్' అనియు నున్నది)" | — |

(కాల్డు. ౩౮౭ పుట).

౧౧౦. XII విష:—"బ్రహుయి భాషలోని మధ్యమ పురుష సర్వనామ రూపముల పట్టిక:—

| ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయము |
| నీ | నా | — | నుమ్ | నుమ్ (గ్రాంథిక తమిళమందు వలెనె) నమా= (మీయొక్క.) | రి అరెరి= (ఉన్నారు). అరెన్= (ఉన్నాము)" |

(కాల్డు. ౩౮౭ పుట).

(సెంట్రలిండియాలోని (మధ్య హిందూదేశ) యప్రధాన ద్రావిడ భాషా భేదము లందలి మధ్యమ పురుష సర్వనామరూపము లీ ప్రకరణాంత మునఁ బట్టికలుగాఁ జూపఁబడును.)

౧౧౦. XIII విష:—"మధ్యమ పురుష సర్వనామ ద్రావిడ మూల రూప పరిశీలనము:—'నీన్–ఈన్' అను మధ్యమ పురుష సర్వనామైకవచన రూపము తుది 'న' కారము 'నాన్–యాన్–ఆన్' అను నుత్తమ పురుష సర్వనామ ప్రథమైక వచనముల తుది నకారమువలెనె యేకవచనమాత్ర ద్యోతకమని యీ వఱకె నిశ్చయింపఁబడెను. బహువచనమున నట్టి నకారస్థానమున "మ్–ర్–ఇర్– ('ఇవర్' అనుదాని లుప్తశేషము)" అనునవి నిల్చును. కాన నీ తుది నకార విషయమునఁ జర్చింప నక్కఱలేదు.

'నాన్–యాన్–ఆన్' అను నుత్తమ పురుష సర్వనామరూపములు మూఁడును బ్రాచీనరూపమునకు సన్నిహితములె యనియు వానిలో 'యాన్' అనుదాని నుండియే 'నాన్–ఆన్' అనునవి యేర్పడినవనియు మనము గ్రహించి యున్నాము. అట్టి 'యాన్' అనుదానిని బోలిన 'యీన్' అను మధ్యమ పురుష సర్వనామరూపము గల దనుట కట్టి చిహ్నము లేవియును గానరావు. కాన 'నీన్–ఈన్' అనువానిలో 'ఈన్' అనునదియే ప్రాచీనరూపమని నేను నిర్ణయించుచున్నాను. 'నాన్' అనుదానిలోని నకార మనునాసికీకరణముచేత నేర్పడిన దనునపుడు 'నీన్' అనుదానిలోని మొదటి 'న' కారము ధాతుజన్య మనుట సరికాదుగదా. 'నీ' అనుదానిలోని మొదటి నకారము 'నాన్' అను దానిలోని మొదటి నకారమునకన్న భిన్నముకాదు. 'నాన్' అనుదాని మొదటి నకార ముత్తమ పురుష క్రియా ప్రత్యయములలో నిల్వక లోపించినట్లె 'నీన్' అను మధ్యమ పురుష సర్వనామపు మొదటి 'న' కారము సైతము మధ్యమ పురుష క్రియా ప్రత్యయములలో నిల్వక పూర్తిగా లోపించినది. ద్వితీయాది విభక్త్యంగములలోఁ గొన్నియెడల నరుదుగ 'నీ' శబ్ద 'న' కారము నిల్చియున్నను మధ్యమ పురుష క్రియా ప్రత్యయములలోఁ బూర్తిగ నశించినది.

పయిరీతిని 'ఈ' శబ్దమె మూలరూపమైనను బెహిస్తను ఫలకములలోని సిథియను భాషలలోను (చూడు ౮ విష.) జీనా భాషలోను 'ని' అనునది మధ్యమ పురుషైకవచనమై యుండుటచేత ద్రావిడ భాషలలోని 'నీ' శబ్దము సయితము 'ఈ' శబ్దముతో నించుమించుగ సరియైన ప్రాచీనత గల్గియున్న దన వచ్చును. మధ్యాఫ్రికాలో వాడఁబడుచున్న 'బోర్ను' అను భాషలో సైతము 'ని' అనునది మధ్యమ పురుష సర్వనామైక వచనమై యున్నది. 'నీ–ఈ' అనువానిలో నేది ప్రాచీనమైనను నిజమైన మధ్యమ పురుష సర్వనామావయవ మచ్చేకాని హల్లు కానేరదని నేను నమ్ముచున్నాను. (చూడు ౧౦౭ V విష.) మధ్యమ పురుష సర్వనామ స్వరములలో 'అ–ఎ–ఇ–ఉ' అనునవి చూపట్టు చున్నవి. అందు 'అ–ఎ' అనునవి యరుదగుటచేత వాని విషయము నాలో చింప నక్కఱలేదు. ఇంక నతి ప్రచురములైయున్న 'ఇ–ఉ' అనువానిలో నేది

ప్రాచీనమో? పరిశీలింపవలసి యున్నది. ఇకార ముకారము నణఁచివేయుచున్నది. ద్రావిడ భాషలలో 'ఉ' కార మికారముగా మాఱుట తఱచుగా నున్నది. ఉదా:—తమి-పులి=వ్యావహా-పిలి=(వ్యాఘ్రము). ఇండో యూరపియను భాషలలోని యుత్తమ పురుషమందలి 'ఉ' కారము సిథియను భాషలలో 'ఇ' కారముగా మాఱుచున్నదని ముందు విశదము కాఁగలదు. ప్రాచీనతమిళోచ్చారణమున 'ఇ-ఉ' అనువానికిఁ బ్రస్ఫుటమైన భేదమున్నట్లుకనఁబడదు. ఉదా:—గ్రాంధిక తమి:—'నిన్=నున్' ద్వితీయా ద్యేకవచనాంగములు. 'నుమ్=ఉజ్గళ్' ద్వితీయాది విభక్తుల బహువచనాంగములు. వీనిలో 'నిమ్' అనునది లేకున్నను బ్రథమా బహువచనములోని 'నీజ్గళ్' అనునది 'నీమ్' అను ప్రాచీనరూపమును సూచించుచున్నది. ('ఇ-ఉ' అనువాని కుచ్చారణభేదమంతగా లేకుండుటచేతనే ద్వివిధ స్వరఘటితరూపములు గల్గినవని భావము)" (కాల్డు. ౩౮౭, ౩౮౮ పుటలు).

విమర్శము:—'నాన్-యాన్-నీన్' మున్నగు వానిలోని తుది నకారము ద్రావిడ నపుంసక ప్రత్యయమగు 'అమ్' అనుదాని కభిన్నమనియు వానిలోని మకార నకారములు పర్యాయములనియు నీవఱకు దొరగారు వ్రాసిరి. (చూడుడు ౧౦౭ IV విష.) (చూడుడు ౨౧ XIV విష). మఱియు 'నీన్' అను నకారాంత రూపము సరికాదని యీవఱకే వ్రాసియున్నాను. (చూడుడు ౧౦౦ I విష).

'నాన్-యాన్-ఆన్' అను శబ్దములలో 'యాన్' అనుదానినుండి 'నాన్' అనునది యేర్పడెనని యీ వఱకు గ్రహించితిమను దొరగారి వ్రాఁత సత్యము కాదు. 'నాన్' అనునదే ప్రాచీనమనియు దానినుండియే 'ఆన్-యాన్' అనునవి యేర్పడెననియు నీ వఱకు దొరగారు వ్రాసియున్నారు. (చూడుడు ౧౦౭ II-III విష.) మఱియు 'యాన్' అనునది ప్రాచీనమనియు దాని నుండి 'నాన్' అనునది యేర్పడెననియు డా. గుండర్టుగారు మున్నగువారు వ్రాసిన వ్రాఁతలను దొరగారు నిరసించియు నున్నారు. (చూడుడు ౧౦౭ III విష.) 'నాన్-ఆన్-యాన్-ఇూన్' అను రీతిని వాని యుత్పత్తి క్రమమును దొరగారిచేఁ జూపఁబడెను. (చూడుడు ౧౦౭ III విష.). 'నీన్-నాన్' అనువాని పదాది నకార మనునాసికీకరణ (Nasalisation) సిద్ధము కాదనియు ధాతు సంబంధియనియు (చూడుడు ౧౦౭ III విష.) నీవఱకు దొరగారు వ్రాసియున్నారు. క్రియా ప్రత్యయములలో సాధారణముగా సర్వనామముల తుది వర్ణములె నిల్చునని తలంపక యట్టి స్థితి నాధారముగాఁ గొని 'నీన్' అనుదాని పదాది నకారము ధాతుసంబంధి కాదనుట సరికాదు. విభక్తిరూపములలో నత్యంత ప్రచురముగా నున్న మధ్యమ పురుష సర్వనామ పదాది నకార మరుదని దొరగారు వ్రాయుట కేవలము నయథార్థము. తెనుఁగులోఁ బాక్షికముగాను 'తుళు-కు' భాషలలో

నిత్యముగాను బ్రథమైక వచనమున 'ఈ' అను రూపము కన్పట్టుచున్నది. తక్కిన ద్వితీయాది విభక్తులలో నట్టి భాషలు మూఁడిటియందును 'నీ' శబ్ద రూపమె వెలయుచున్నది. ద్రావిడేతరభాషలందు సయితము 'నీ' శబ్దస్థితియే దొరగారిచే విరివిగాఁ జూపఁబడెను. ఇంకను జూపఁబడును. (చూడు ౧౧౧ విష.) ఇట్లగుటచేతనే దొరగారు "'నీ-ఈ' అనువానిలో నేది ప్రాచీనమైనను" అని వ్రాయఁవలసినవారైరి. పయికారణములచే 'నీ-ఈ' అనువానిలో 'నీ' శబ్దమే ప్రాచీనతరమనియును 'నీ' శబ్దమునందలి పదాది నకారము లోపించుటచేత 'ఈ' శబ్దము తెల్గునందు వికల్పముగాను 'కు-తుళు' భాషలందు నిత్యముగాను బ్రథమైక వచనమున నిల్చెనని గ్రహింపవలయును. అంతియకాని ద్రావిడ భాషలందెల్ల నూరకయే 'నీ' శబ్దాదిమ 'న' కారము చేరినదని చెప్పరాదు. తమిఁబ భాషలో 'నీ' శబ్దముపైని 'ఉమ్' అను బహువచన బోధకము నిల్చుటచేత 'నుమ్-ఉమ్-ఉజ్గళ్' మున్నగు బహువచనరూపము (వీని మూలమున 'నున్-ఉన్' అను ద్వితీయాద్యంగము లవతరించి యుండును) లవతరించుట నరయక దొరగారు 'ఇ-ఉ' అనునవి మధ్యమ పురుషావయవములనియు 'ఇ-ఉ' అను స్వరముల కుచ్చారణమున ద్రావిడభాషలలో స్పష్టమగు భేదము లేదనియు నిట్లు లేనిపోని విషయములను వ్రాయుట సరికాదు. ఇకారము పల్కునపుడు పం డ్లిగిలింపఁ బడును. ఉకారము పలుకునపుడు పెదవులు గుండ్రముగా నేర్పడును. ఇట్టి విభిన్న ప్రయత్నములచే జనించు 'ఇ-ఉ' అను స్వరములకు ద్రావిడభాషలలో నుచ్చారణమున స్ఫుటమగు భేదము లేదనుట సత్యవిదూరము. అనుభవ విరుద్ధము (చూడు ౧౭ VIII విష. తొల్కా. ౮౩-౮౭-సూ). 'నున్-ఉన్-ఉమ్ - ఉజ్గళ్' అనునవి యర్వాచీన రూపములనియుఁ దొల్కాప్పియమునఁ జేర్కొనఁబడలేదనియు నీవఱకు విశదీకరింపఁ బడెను (చూడు ౧౧౦ I విష).

౧౧౧. I విష:—"ద్రావిడ మధ్యమ పురుష సర్వనామమునకు ద్రావిడేతర భాషల సంబంధములు:—సిథియనుభాషలందును నిండో యూరపియను భాష లందును మధ్యమ పురుష సర్వనామైక వచనమునఁ దఱచుగా 'తు=త' అనునది గాని తజ్జన్య సకారముగాని కనఁబడుచున్నది. పయి రెండు కుటుంబములలో నే భాషయందైనను దక్కిన రూపములందు నకారము కనఁబడుచున్నది. ఈ నకారము పక్షమున మూలరూపములు మొదటినుండియుఁ బరస్పర సంబంధ రహితములై యున్నట్లు కనఁబడును. ఒకదానినుండి వేఱొకటి క్రమపరిణామము నందుట నేను గనిపెట్టియుండలేదు.

తకార తజ్జన్య సకారములు:—'తు' శబ్దము నిర్దేశ సర్వనామరూపమగు తకారమునుండి వచ్చినదని యూహింపఁబడెను. సంస్కృత మధ్యమపురుష సర్వనామైక వచనము 'త్వమ్' అనునది. ద్వితీయ 'త్వా', షష్ఠి-తవ=(నీ యొక్క).

జండు భాష-తూమ్=నీవు. కవిభాష - సెమెటికు భాష-అంతా=(నీవు). ఇది షష్ఠిలో 'కా' అనునదిగా మాఱును. మధ్యమ పురుష బహువచనావయవ మగు 'యు' అనునది 'తు' శబ్దజన్యమనియు సంస్కృత బహువచనమగు 'వస్' అను దానికిని, లాటిన్ 'వొస్' అను దానికిని నవయవమగు 'వ' అనునదియు 'త్వ' శబ్దమునుండి పుట్టినదనియు 'బొవు'గా రూహించిరి. 'వ' కారము మకార జన్యమని యుత్తమ పురుష మకారమునుండి యేర్పడినదని 'వయమ్' శబ్దోదా హృతిచేఁ దెలియనగును. తకారము 'వ' కారముగాను యకారముగాను నెట్లు మాఱెనో విశదపఱుచుట సులభము కాదు. సంస్కృత 'త్వమ్' శబ్దము ప్రాచీన పెరిషియను భాషలో 'తువమ్' అని యయ్యెను. ఇట్టి 'తు' శబ్దమునుండియే సంస్కృత 'తుభ్యమ్' శబ్దమేర్పడెను. దీని యంగమగు 'తు' అనునది 'లాటిను-ఆర్మీనియను-ఇయోలికు-డోరికు-పెరిషియను-ఆఫ్ఘను-సింగాలీ' అను భాషల లోని 'తు' శబ్దముతోడను, గాథికు భాషలోని 'థు' శబ్దముతోడను సంబంధించి కాని యభిన్నమై కాని యున్నది. గాథికు-జండుభాషలలోని 'థ్' అనునది ప్రాచీన గ్రీకు భాషలోని 'తు' అనుదానియొక్క 'సు' అను పరిణామమును సూచించుచున్నది. 'ఎకిక్-నిసు' దొరగారు వారి 'చైనా భాష స్థానము' అనెడి పుస్తకమునందు మధ్యమ పురుష సర్వనామమగు 'ని-ను' అనుదానితో ('ను' ద్వితీయాద్యేక వచనాంగము) 'యు' అనునది సంబంధించుచున్నదనియు, 'ని-ను' అను మధ్యమ పురుష సర్వనామపు ప్రాచీన రూపములు 'ఇ-ఉ' అనునవే యనియు వ్రాసిరి. ఈ యూహయె సరియైన యెడల 'యు' అనునది చీనా భాషలోని 'నె-ను' అను వానికే కాక, ద్రావిడ భాషలలోని 'ని' (ప్రథమ) 'ను' (ద్వితీయాద్యేక వచనాంగము) అనువానికిని సరిపడి యుండును" (కాల్డు. ౩౮౯, ౩౯౦ పుటలు).

"సంస్కృతమునందును దానిని సంబంధించిన యితర భాషలందును మధ్యమ పురుషైక వచన 'త' కారము క్రియా ప్రత్యయములలో 'స' కార ముగా మాఱినది. బహువచనమున నల్పములగు మార్పులనంది బహువచన చిహ్నములతోఁ గూడికొని నిల్చియున్నది. (సి-థస్-థ-మొ).

ఇండో యూరపియను సిథియను కుటుంబముల మధ్యమ పురుష సర్వనామము లభిన్నములు. అట్టి యభిన్నతయే ప్రాచీన కాలమందలి వాని యైక్యమునకు నిదర్శనము. మధ్యమ పురుష 'త' కారము సిథియను భాషలలో సకారముగాఁ బరిణమించి యతోధిక వ్యాప్తి కల్గియున్నది. 'అ-ఉ' అను వానితోఁ గూడునప్పటికంటె 'ఇ-ఎ' అను వానితోఁ గూడునప్పుడీ సకార పరిణామము తఱచై యున్నది. ఉదా:—(సిథియను) మాగ్యరు భాష:— తె=(నీవు). తి-తిక్=(మీరు). ఆర్మీనియను భాష:—తు=(నీవు). తుక్=(మీరు).

**మంగోలియన్** భాష:—త్చి=ద్జి=(నీవు). ఈ మంగోలియను రూపములు 'త-స' పరిణామ మధ్యావస్థలో నున్నవి. ఫిన్నిషు భాష:—సె=సినా=(నీవు). వీని బహువచన రూపములందును క్రియా ప్రత్యయముల యేకవచన రూపము లందును 'స' కార పరిణామము గల్గలేదు. తకారమె నిల్చియున్నది" (కాల్డు. ౩౯౦ పుట).

"ఉత్తమ పురుష సర్వనామమునందు. వలెనె (౧౦౯ III విష.) యీ మధ్యమ పురుష సర్వనామమునందును సిథియను భాషా కుటుంబ ములోఁ దుది నుచ్చారణ సౌకర్యమునకై నకారము చేరియుండును. (గ్రీకు-**తూనే**=**తూన్**=ఇగోనే=ఇగోన్=('నేను') ఉత్తరహిందూస్థాన భాష లందును నిట్టి పద్ధతి గలదు. హిందీ-పంజాబీ-సింధీ-'తుజ్'=(నీవు). మరాటీ-**గుజరాతీ**-'**తూజ్**'=(నీవు). మరాటీ-**గుజ**రాతీ భాషలలో ప్రథమయేకాక ద్వితీయాద్యంగమును ననునాసికాంతమయియే యుండును.

సిథియను భాషలలోని యనునాసికాంత మధ్యమ పురుష సర్వనామ శబ్దముల పట్టిక:—(ఇందే సిథియను భాషలలోని 'త-స'ల పరిణామమునకును నుదాహృతులు పెక్కు-గలవు).

సిన్-సెన్=(నీవు). తుర్కి-షు భాషా కుటుంబము. వీని తుది నకారము ద్వితీయాద్యంగము తుదిని నిల్చియున్నది. కాని 'సిజ్' బహువచన రూపమున నిలువక నశించినది.

పెన్=(నీవు)—జార్జియన్ భాష.

తన్-తని=(నీవు)—సామోయిదీ భాష.

దొన్=(నీవు)—లాపిష్ భాష.

తొన్=(నీవు)—వోటియాకు మార్డ్విను భాషలు. బహువచనము-తిన్=(మీరు)

సినా—సె=(నీవు)—<br>సె-సియ-సియె- } ఫిన్నిష్. భాష.

స-సిన్న=(నీవు)—ఎస్తోనియన్ భాష. ఫిన్నిషు భాషా భేదము. ఉత్తమ పురుషము-'మ-మిన్న'

త్చి=(నీవు)—మంగోలియన్ భాష. షష్ఠి-త్చిని. చతుర్థి-త్చిందో.

సి=(నీవు)—మంచు భాష. షష్ఠి:='సిని'. చతుర్థి:—'సిందె'.

డ్జి-డ్జిమ=(నీవు)—కల్లుకు భాష. షష్ఠి:—డ్జిని. చతుర్థి:—డ్జిమదో. ద్వితీయ:—డ్జిమై. ఈ భాషయం దుచ్చారణార్థక 'న' కారమునకు మాఱుగాఁ బెక్కు-చోట్ల 'మ' కారము చేరును.

పయి నుదాహరించిన భాషలలోని మధ్యమ పురుషైకవచన సర్వనామములకును ('త్వ-తు-తి-సి' మొ.) ద్రావిడ మధ్యమ పురుష 'నీ' శబ్దమునకును బోలిక యేమియుఁ గన్పట్టదు. ఫిన్నిషు భాషలోని 'సినా' గ్రీకులోని 'తు నే' మున్నగు చోటులందలి 'నా-నే' మొదలగునవి యవయవ సిద్ధములు కావనియు నుచ్చారణార్థకాగమములనియు గ్రహింపవలెను" (కాల్డు. ౩౯౦, ౩౯౧ పుటలు).

"ఇండో యూరపియను సిథియను కుటుంబములలోని యుత్తమ పురుష సర్వనామ 'మ' కారము ద్రావిడోత్తమ పురుష 'నా' శబ్దమునకు మూలమైనట్లె యిండో యూరపియను సిథియను భాషల మధ్యమ పురుష 'త' కారము ద్రావిడ మధ్యమ పురుష 'న' కారమునకు మూలమనఁదగునా యని యాలోచింపవలసి యున్నది. 'టర్కి-షు-ఫిన్నిషు' కుటుంబముల భాషలలోని మధ్యమ పురుషైకవచన మందలి పురుషబోధక ప్రత్యయ 'న' కారము పైరీతిని వచ్చినదే యని ప్రామాణికులగు 'కౌస్ట్రెయను' దొరగా రూహించిరి. ఇండో యూరపియను భాషలలో నిట్లు తకారము నకారముగా మాఱుట కుదాహరణములు లేకపోలేదు. సంస్కృ-ఏతమ్=ఏనమ్=(ఏనిని). ఇట్టి మార్పు పాళీ భాషలోఁ బ్రచురమై యున్నది.

| సంస్కృత | —— | పాళీ |
|---|---|---|
| తే | = | నే =(పుం లింగము-వారు) |
| తా | = | నా =(స్త్రీ లింగము-వారు) |
| తాని | = | నాని=(నపుంసక లింగము-అవి). |

ఇదే విధమున ద్రావిడ మధ్యమ పురుష సర్వనామ 'నీ' శబ్దము వచ్చిన దనుటకు నిదర్శనము లేదు. ద్రావిడ భాషా చరిత్రమునుబట్టి పరిశీలించునపుడు ప్రాచీన తకారమునుండి (ఇండో యూరపియను సంబంధి) ద్రావిడ మధ్యమ పురుష 'న' కారము వచ్చిన దనుట నిరాధారము. కాని యీ 'తు=తి-నీ' అను వాని సంబంధమును బ్రాచీనతను బరిశీలించునపు డుత్తమ పురుష సర్వనామ పక్షమున 'అహ-మ' అను రూపద్వయ మంగీకరింపఁబడినట్లె 'తు-ని' అనునవి సైతము మధ్యమ పురుష సర్వనామముయొక్క మూలరూపములయి యుండునా? యని కాని, (చూడు ౧౯ III విభ.) లేదా 'జాఫెటికు' జాతినుండి ద్రావిడులును చీనావారును చీలిపోవకమునుపే 'తు' శబ్దము

'ను' శబ్దముగాను నది 'ని' శబ్దముగాను మాఱి యుండెనా? యని కాని కలుగు సందేహము నివృత్తి కాకున్నది" (కాల్డు. ౩౯౧, ౩౯౨ పుటలు).

విమర్శము:—'తు-ని' అనునవి రెండును జాఫెటికు మూలరూపములయి యున్నను ద్రావిడులు 'జాఫెటికు' జాతినుండి వీడుటకు ముందే 'నీ' శబ్ద మేర్పడి యున్నను దొరగారు సంశయించిన రెండుపక్షములలో నేది సత్యమైనను ద్రావిడ మధ్యమ పురుష సర్వనామ 'నీ' శబ్ద మూహ కందనంత ప్రాచీన మనియు (చూడు ౧౧౧ II విష.) నకారము మూలధాతు సంబంధియే కాని యనునాసికీకరణ సిద్ధము కాదనియు సిద్ధాంతిత మగుచున్నది గదా. తమిళ మందలి యర్వాచీనములగు 'ఉన్-నున్' మున్నగు మధ్యమ పురుష సర్వనామ రూపముల నిర్వహణమునకయి యత్యంత ప్రాచీన ద్రావిడ మధ్యమ పురుష సర్వనామ 'నీ' శబ్దము 'ఇ-ఉ' అను నస్పష్ట స్వరరూప మనెడి దొరగారి తలంపు సరికాదనియు నందలి 'ఉ' కారము 'ఉమ్' శబ్దమూలక మనియు విశదమగు చున్నది. (౧౧౦ XIII విష. చూడు). అట్లె ద్రావిడ భాషలలో 'ఈ' శబ్దమె మూలరూప మనియు దాని కనునాసికీకరణమున 'నీ' శబ్ద మేర్పడెననియు దొరగారు వ్రాసిన వ్రాతయు నిరాకృత మగుచున్నది (చూడు ౧౧౦ XIII విష).

౧౧౧. II విష:—"ద్రావిడ 'నీ' శబ్దముతో నిశ్చయముగా సంబంధించి నదియుఁ బైకిఁ నభిన్నముగాఁ గన్పట్టునదియు నగు సిథియను భాషలలోని మధ్యమ పురుష సర్వనామమందలి 'న' కారస్థితి నిశ్చయింపఁబడుచున్నది.

మిక్కిలి ప్రాచీనమైన చీనా భాషలోని మధ్యమ పురుష సర్వనామ ములోఁ గల ప్రాచీన ద్రావిడ సర్వనామపు పోలికలను జూపుచున్నాను. చీనా భాషలో నైతము ద్రావిడ భాషలలోవలెనె 'ని' అనునదె మధ్యమ పురుష సర్వనామము. దీని బహువచనము 'నిమెన్ =(మీరు). వొమెన్ = (మేము). తమెన్ =(వారు).' ప్రాచీన చీనా భాషలో 'జి-ను-యు-ఉ' అను నాల్గును మధ్యమ పురుష సర్వనామములు. 'ఎడ్కిన్స్' దొరగారు ప్రాచీన తమరూపము 'ఇ' అనునదనియు దానికిముందు నకారము చేరుటచేత 'ని' అను నది యేర్పడెననియు నూహించిరి.

నిమె =(నీవు)—గ్యామీ భాష.
నిని = (నీవు)—హొర్పా భాష.

} చీనా దేశపు పశ్చిమ సీమలోని తిబెతు ప్రాంతమున నున్న దేశ ద్రిమ్మరుల భాషలివి. (తిబెతు భాషలోని యుత్తమ పురుషైకవచనము ద్రావిడ భాషలకు సరిపడియున్నది గాని మధ్యమ పురుష సర్వనామము సరిపడలేదు).

నంగ్=(నీవు)—బర్మా మాండలిక భాషలు.

నహ్-నెర్-నా=(నీవు) 'కరెన్' అను బర్మా మాండలిక భాష.

నో=(నీవు)-ఈ కుటుంబములోని 'మన్యకు' భాష. (ఇందలి యుత్తమ పురుష సర్వనామరూపము 'ఆ' అనునది.

తూర్పేషియాలో నున్న భాషలందలి సర్వనామ రూపములు చీనా భాషపై నాధారపడియున్నవి. చీనా భాషా వాఙ్మయము చాలా ప్రాచీనమైన దగుటచేత నందలి మధ్యమ పురుష రూపమునకును ద్రావిడభాషా మధ్యమ పురుష రూపమునకును గల యభిన్నత చాల ముఖ్యమై యున్నది. బెహిస్తను ఫలకములందలి (చూడు ౮ విమ.) సిథియను భాషలలోని మధ్యమ పురుష సర్వనామముతోడి సామ్యమును మిక్కిలి ముఖ్యమైనదె. ఈ ఫలకములలోని మధ్యమ పురుష సర్వనామము ద్రావిడ భాషలలోవలెనె 'నీ' అనునదె యై యున్నది. షష్ఠీ సమాస రూపము 'ని' అనునది. (బహువచన రూప మందు లేదు.) క్రియాప్రత్యయము 'ని' అని నిల్వక 'న్తి' అని యున్నది. సెమెటికు భాషలలోని 'అంతా-అంతి' అనువానివలెనె 'ని+తి' అనువాని సంయోగమున నేర్పడియుండవచ్చును.

| | |
|---|---|
| నీ=(నీవు) | బ్రహుయి భాషా రూపము. దీని బహువచనము 'నుమ్=మీరు' అనునది. ఈ భాషను ద్రావిడ భాషలలోనె చేర్చియున్నాను గాని యిది బెలుచి స్థానములోని దగుటచేత మరల నిట వ్రాయుచున్నాను. (కాల్డువెల్లుగారు దీని నిండో యూరపియను భాషలలోఁ జేర్చి ద్రావిడ భాషలలోఁ జేర్ప లేదనియు లోఁగడ వ్రాసిరి (చూడు ౧౫ XII విమ). |
| ని=(నీవు) | కనురి భాష మధ్యాఫ్రికాలోని బోర్ను దేశమందు వాడుకలో నున్నది" (కాల్డు. ౩౬౨, ౩౬౩ పుటలు). |

"ఈరీతిని ద్రావిడ మధ్యమ పురుష సర్వనామపు ప్రాచీనత పూర్తిగా నిరూపితమయ్యెను. పై సంబంధములు యాదృచ్ఛికములు కావు.

| | |
|---|---|
| ఇమెన్=నీ భార్య | ఫిన్నిషు భాషా భేదమగు 'ఓస్టియాకు' భాషలోని సామాసిక మధ్యమ పురుష ప్రత్యయము 'న' కారముగ వాడఁబడును. ఉత్తమ పురుషమున 'మ' కారము నిల్చును. ఉదా:—ఇమెమ్=(నా భార్య). |

| రూపములు | వివరణ |
| --- | --- |
| కెరిన్ = నీవు చేసితివి. కెరినిద్ = మీరు చేసితిరి | ఫిన్నిషు భాషా భేదమగు 'సిరియనియను' భాష. ధాతువు-'కెరి' = (చేయు). 'కెరినిద్' అనుదానిలోని 'ని' అను నేకవచన రూపమునకు బహువచన ద్యోతక 'త' కారము చేర్పఁబడెను. |
| నెణ్ = (నీవు) నీణ్ = మీరిద్దఱు. నెన్ = మీరు | ఉగ్రియను భాషలలోని 'ఉగ్రోఓష్టియాకు' భాష. ఈ భాషలోని తుది 'న' కారపు బలమైన యుచ్చారణము 'టర్కీ-' భాషలో సైతము కన్పట్టుచున్నది. తక్కిన 'ఓస్టియాకు' భాషలలో 'నుమ్-ము' అనునవియును, 'నిన్-నిన్త్' అనునవియును గన్పట్టుచున్నవి. 'నిన్త్' అనుదాని బహువచన రూపము 'న్తి' అనునది. |
| నెయ్ - ని - నన్ని - న్గి - నన్క్ = (నీవు) | వోగుల్ భాష. మధ్యమ పురుష సర్వనామైక వచన రూపములు. |
| నెన్—నాన్. | 'వోగుల్' భాష. మధ్యమ పురుష సర్వనామ బహువచన రూపములు. |
| ఒలెత్ = (ఉన్నావు) ఒలెత్తె = (ఉన్నారు) కాతెస్ = (నీ చెయ్యి) కాతెన్నె = (మీ చెయ్యి) | ఫిన్నిషు భాషలోని మధ్యమ పురుష క్రియా రూపములు. వీనిని బట్టి ఫిన్నిషు భాషలో మధ్యమ పురుషమునందు రెండు సర్వనామము లున్నవని తేలుచున్నది. I ఏక-'సి'-(లేక) 'తి'. బహు-'తె'. II ఏక-'ని'. బహు-'నె'. ఇందలి బహువచన ప్రత్యయమునుబట్టి 'ని' అను నేకవచన ప్రత్యయ మూహింపఁబడెను. |
| బాబజ్ = (నీ తండ్రి) | ఓస్మాలీ టర్కిష్ భాష. ఈ 'జ' కారము 'జీ-జె' అను వాని సంక్షేపమనఁదగును. ఉత్తమ పురుష సర్వనామ షష్ఠీ సమాసమున ఉదా:—బాబామ్ = (నా తండ్రి). ఈ మకారము 'మి-మె' అను వాని సంక్షేపము కానోపును. ఇందలి మధ్యమ పురుష 'జ' కారము సైబీరియాలో మాటలాడెడి 'యాకూటీ టర్కిషు' భాషలో సైతము గలదు. |
| ఈదు జ్ = (ఉంటివి) | టర్కిష్ భాష. ఈదుమ్ = (ఉంటిని). ఈదీ = (ఉన్నాఁడు). ఇవి మిక్కిలి ప్రాచీనములగు క్రియా ప్రత్యయములు. ఇపుడు 'సెన్' అనునది మధ్యమ పురుషమునఁ దఱచుగా వాడఁబడు చున్నది. |

బోల్డూజ్ =(నీవు) — ప్రాచ్య టర్కిష్ భాష. ఉత్తమ పురుష సర్వ నామైక వచనము:—బోల్డీమ్=(నేను). ప్రథమ పురుష సర్వనామైకవచనము:—బోల్డీ = (వాఁడు). ఇవి పై వానికి సరియైన రూపములు.

సిజ్ =(మీరు) — ఇట్లు 'టర్కిషు' భాషలలోని బహువచనమున 'జ్' కారము చేరును. బిజ్ =(మిజ్)=(మేము).

బాబాజుజ్ = (మీ తండ్రి) — ఇట్లు టర్కిష్ భాషలో షష్ఠీ సమాసమున 'ఇ'కారము 'ఉ' కారమగును. బాబా ముజ్ =(మా తండ్రి). పయి రూపములు 'జీజ్ =(మీరు)-మిజ్ = మేము' అని ప్రాచీన రూపము లుండెడివని సూచించుచున్నవి.

ఉజూజీజ్ = (మీ యంతట మీరు) — ఓరియంటల్ టర్కిష్ భాష. ఓస్మాన్లీ టర్కిషు భాషలోని 'ఇ' కారము 'ఉ' కారమగు చుండఁగా నీ ఓరియంటల్ టర్కిషు భాషలో 'ఇ' కారమే నిల్చు చున్నది. ఇందలి 'జీ జ్' అను బహువచన రూపములోని బహువచన చిహ్నమగు 'జ్' అను దానిని దీసివేయఁగా 'జీ' అను నేకవచన రూపము నిల్చును.

క్షోర్క్కదుజుజ్ = (మీరు భయపడితిరి)
క్షోర్క్కదుజ్ = (నీవు భయపడితివి)
క్షోర్క్కదుజుజ్ = (మీరు భయపడుఁడు) — టర్కిషు క్రియా రూపము లన్నిటిలోను మధ్యమ పురుష క్రియా బహువచన ప్రత్యయములు పైరీతినె యుండు ననుట కియ్యవి యుదాహరణాంతరములు. వీనిలోని 'క్ష' అనునది క కార జ కారముల నడిమి యుచ్చారణము గల్గియుండును.

పయి యుదాహరణము లన్నిటిలోను గల 'జ' కారము పిన్నిషు భాష లోని 'న' కారమునకు సరియైనది. 'టర్కిషు-ఉగ్రియను' భాషలందుఁ (సమాసములందు) గన్పట్టుచున్న మధ్యమ పురుష సర్వనామైక వచన రూపము ద్రావిడ భాషలయొక్కయు 'చీనా-జెహిస్తను ఫలక సిథియను' భాషల యొక్కయు, సర్వనామముతో నభిన్నమని తేలుచున్నది. ద్రావిడ మధ్యమ పురుష సర్వనామములోని 'ఇ' కారము 'ఉ' కార మగుట టర్కిషు భాషలో సైతము కన్పట్టుచునే యున్నది" (కాల్డు. ౩౭౩, ౩౭౪, ౩౭౫ పుటలు).

"హిమాలయ మాండలిక భాషా భేదములందు సైతము ద్రావిడ మధ్యమ పురుష సర్వనామపు పోలికలు గన్పట్టుచున్నవి. ఉదా:—

| | |
|---|---|
| నా = (నీవు) - ధిమల్ భాష.<br>నో=(నీవు)-మిరి భాష.<br>నా ఆ = (నీవు) - గరో భాష. | ఇక్లే-'లోహితిక-భాషాభేదములలో (హిమాలయ మాండలిక) సైతము మధ్యమ పురుష సర్వనామమునం దీ 'న' కారము ముఖ్యమైనదిగను ధాతు సంబంధిగను గన్పట్టుచున్నది. |

ఆస్ట్రేలియను భాషాభేదములందును ద్రావిడ మధ్యమ పురుష సర్వనామ సామ్యము కన్పట్టుచున్నది:—

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| నిన్న - న్గిన్ని - న్గిన్ తె = (నీవు) | నివ-నుర=(మీ యిద్దఱు) | నిమెదు=(మీరు) |

పయి యుదాహృతులనుబట్టి ద్రావిడ మధ్యమ పురుష సర్వనామ ముత్తమ పురుష సర్వనామమువలెనె యిండోయూరపియను భాషలకంటె సిథియను భాషలతో నెక్కువగా సంపూర్ణమగు సామ్యము గల్గియున్నదని స్పష్టపడుచున్నది" (కాల్డు. ౩౯-౪౫ పుట).

విమర్శము:—ద్రావిడ మధ్యమ పురుష సర్వనామ 'నీ' శబ్దమునకు "చీనాభాష బెహిస్తను ఫలకస్థ సిథియనుభాష-ఫిన్నిషు-ఉగ్రియను ప్రభృతి సిథియనుభాషలు - నితరములగు బ్రహూయి - కనురి - భాషలు నాస్ట్రేలియను భాషలు" మున్నగువానిలోని మధ్యమ పురుష సర్వనామముతోఁగల సామ్యముల నింత విస్తృతముగాఁ జూపియు నియ్యది 'జాఫెటిక' జాతులవారి వాడుకలో సైత్త ముండెడిదనియు 'తు-తి' అనువాని పరిణామమనియు నిరూపించియుఁ గాల్డువెల్లుగారు దీనిలోని 'న' కార ముచ్చారణార్థకమగు ననునాసికీకరణమున సిద్ధించినదేయనియు నిందలి 'ఈ' అను స్వరమె దీని మూలరూపమనియు వచించుట మిక్కిలి వింతగా నున్నది. 'తు-తి' అను యుష్మదర్థకములగు హల్లులు 'ఈ' అను స్వరరూపముగ నెట్లు పరిణమించునని తలంచిరో? లేదా యింత ప్రాచీనకాలమున నున్న యీ 'నీ' శబ్దములో 'న' కార ముచ్చారణార్థము చేర్పఁబడినదని వీరి కెట్లు తెలిసెనో? దురూహామై యున్నది. ఊహకందనికాలమునుండియు నున్న యీ 'నీ' శబ్ద 'న' కార మనునాసికీకరణ సిద్ధమనుట (Nasalisation) కాధారమేమో తెలియకున్నది. మొట్టమొదటి వ్యవ

హర్తలు వర్ణములలో మొదటివగు 'అ-ఇ' అనువానిని నస్మ ద్యుష్మదర్థకములుగా వ్యవహరించి యుందురను నిరాధార దుర్బల బాధితోహామే కదా యీ సిద్ధాంత మునకు మూలము. పిమ్మట నాధునికులగు 'ఎడ్కిన్సు' దొరగారు చీనా భాష లోని 'నీ' శబ్ద విషయమున నిట్లు వ్రాయుట రెండవ యాధారము. వ్యుత్పత్తి తెలియనపు డిట్లు సాహసించి నిరూపించుట న్యాయముకాదు. ఆ మొట్ట మొదటి వ్యవహర్తలు 'అ - ఆ' అను నొక్కదానినే పరోక్షవస్తువాచి తచ్ఛబ్దార్థ కముగాను నస్మదర్థకముగాను వ్యవహరించిరనుట యెట్లు విశ్వసింప నగును? (చూడు ౧౦౭ V విష). ఇట్టి నమ్మరాని దుర్బల వ్యుత్పత్తిని మూలముగాఁ గొని 'కు' తుళు తెల్గు భాషలలో నీ శబ్ద 'న' కారలోపమున నేర్పడిన 'ఈ' శబ్దమె మధ్యమ పురుష మూలరూపమని వ్రాయుటయుఁ దక్కిన ద్రావిడ భాష లన్నిటియందును నితర భాషా ప్రపంచమునందును విస్తరించియున్న 'నీ' శబ్ద నకార మనునాసికీకరణ సిద్ధమని వ్రాయుటయుఁ గేవలము నయుక్తముకదా. ఆ మూఁడు భాషలలోను తెల్గున 'నీ' శబ్దము సైతము ప్రసిద్ధమై ద్వితీయా ద్యంగములందు నిత్యమై వెలసియుండగాఁ బయి భాషలందును ద్వితీయా ద్యంగములు 'నీ' శబ్దఘటితములె యైయుండఁగా నట్టి 'నీ' శబ్ద నకారము మూలధాతు రూపము కాదనుటకు దొరగా రెట్లు సాహసించిరో? తెలియ కున్నది (చూడు ౧౧౦ XIII విష). తమిళుమందలి 'నున్-ఉన్-నుమ్-ఉజ్గళ్' అను శబ్దములలోని 'ఉ' కారము 'ఉమ్' శబ్దమూలకమనియు, నద్దానిని జూచి భ్రమించి ద్రావిడ మధ్యమ పురుష సర్వనామము 'ఇ-ఉ' అనువాని యస్పష్ట మిశ్రోచ్చారణ రూపమని తలంచుట మఱియు నసంగతమనియు, నీవఱకే విశద పఱిచియున్నాను (చూడు ౧౧౦ XIII విష.) (చూడు ౧౧౧ I విష).

౧౧-౨. I విష:—"ఆత్మార్థక సర్వనామము; తాను శబ్దము:—ద్రావిడ ప్రథమ పురుష సర్వనామములు నిర్దేశవాచకములె కాని నిజమైన పురుషబోధక సర్వనామములు కావు. ఆత్మార్థక సర్వనామ తాను శబ్దము సంస్కృత స్వయం శబ్దముతోను, గ్రీకు 'ఎ' శబ్దముతోను, లాటిను 'సుఇ-సిబి-సె' అనువానితోను సరిపడియుండును. ఇది పురుషబోధక సర్వనామములవంటి స్వాది విభక్తి ప్రత్యయములు గలదగుటచేత, నీ పురుషబోధక సర్వనామ సందర్భమున వివ రింపఁబడుచున్నను 'తాను' శబ్దము కర్తగాఁగల క్రియ ప్రథమ పురుషము గానె యుండును. అట్లగుటచే దీనిని బ్రథమ పురుష సర్వనామ మనుటయె యుక్తము" (కాల్డు. ౩౫౫ పుట).

"తా శబ్దము ద్రావిడభాష లన్నిటియందును నేకరీతినె యుండుటచేతఁ దమిళు కర్ణాటాంధ్రముల రూపములు మాత్రమె చూపఁబడుచున్నవి.

| ఏకవచనము | | | బహువచనము | | విశేష వివరణము |
|---|---|---|---|---|---|
| భాష | ప్రథమ | ద్వితీయా ద్యంగము | ప్రథమ | ద్వితీయా ద్యంగము | |
| తమిళు | తాన్ | తన్ | తమరు-తామ్. (గ్రాంధికము) (తాజ్గళ్) | తమ్ | విశేషణపు వాడుకలో— "సుఇ-సూన్-సుఅ సూమ్-" అని యుండును. |
| ప్రాచీనకర్ణాటము | తాన్ | తన్ | తామ్ | తమ్ | — |
| హళగన్నడ | తాను | తన్ | తావు | తమ్ | — |
| తెలుఁగు | తా. తాను | తృతీ- అంగ } తన | తాము-తారు-తమరు (తమరు సంక్షేపము తారు). | తృతీ- అంగ } తమ | ద్వితీయైకవచన-తనున్-తన్నున్. ద్వి-బ-తమున్-తమ్మున్. |
| బ్రహుయి | తెనత్ | షష్ఠి-తెన చతు-తెనె | — | — | ఇట్లు తుదిని 'త' కారము చేరుట గోందుభాషలోఁ బురుష బోధక సర్వనామములందుఁ గలదు." |

(కాల్డు. ౩౯౬ పుట.)

విమర్శము:—తమిళుమున 'సుఇ-సూన్-సుఅ-సూమ్' అను రూపములు విశేషణపు వాడుకలోనున్నట్లు తొల్కాప్పియమున లేదు. అట్లె గ్రాంథిక తమిళు రూపము 'తమరు' అనునది లేదు. (మల-'తమరు = తమ బంధువులు' అని కలదు.) "తమిళుమున స్వయం శబ్దభవము 'సుయమ్' అని యున్నది. విశేషణము 'సుయ' అని యుండును. 'తమర్' అనునది 'తామ్' శబ్దరూపాంతరము కాదు. మల - తమర్ = తమ్ముఁ జేరిన బంధువు లని యర్థము" (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు. ౬—జూన్—౧౯౫౩ తేది జాబునకు జవాబు).

౧౧-౨. II విష:—"ఈ సర్వనామముయొక్క వాడుక యిండో యూరపియను భాషలలోని యాత్మార్థకశబ్దముల వాడుకకు సరిగనున్నది. ఇది వాక్యములోని కర్తతోను బ్రధాన క్రియతోను నన్వయించుచుండును. సంస్కృత 'స్వయమ్' శబ్దమువలెను, నింగ్లీషులోని 'సెల్ఫ్' (Self) శబ్దమువలెను, లాటిను

లోని 'ఇప్సె' శబ్దము వలెను, నిది సర్వనామ శబ్దము లన్నిటితోను నదుకుచు నవధారణార్థము నిచ్చుచుండును. ఉదా:—తమిళ-నాన్ తాన్ (దాన్)=(నేనే= నాయంతటనేనే). నీతాన్ (దాన్)=నీవే=(నీ యంతట నీవే). అవన్ తాన్ దాన్) వాఁడే=వానియంతటవాఁడే). అవళ్ తాన్ (దాన్)=(ఆమెయె= ఆమెయంతట నామెయె). అదుతాన్ (దాన్)=(అదియే=దానియంతట నదే). ఇట్లే 'తామ్' అను బహువచన రూపమును సర్వనామ బహువచనములకుఁ జేర్పఁబడును. 'తమ్‌తమ్' అనుదానికి బదులుగ 'తత్తమ్' అనునది 'తమతమ' అను నర్థమున వాడఁబడును. సంస్కృత 'స్వయమ్' శబ్ద మవ్యయము. ద్రావిడ 'తా' శబ్దము స్వాది విభక్తులను నియతముగా నందెడి సర్వనామము. ఈ భేదము పరిశీలింపఁదగినది. 'తాన్' శబ్దమునకు 'అయి' శబ్దము చేరుటచేతఁ గ్రియా విశేషణరూప మేర్పడును. తానాయ్ = (తాను+ఆగి) = (తనంతట తానే). గుణవాచకములతోను, సంబంధార్థకములతోను జేరునపు డియ్యది 'నిజముగా'='కేవలము' అను నర్థము నిచ్చును. ఉదా:—తమి-మెయితాన్= (దాన్)=నిజమె. సరితాన్=(దాన్)=సరియె''.

''ద్రావిడ భాషలలో 'తా' శబ్దము పూజ్యార్థమునఁ బ్రయోగింపఁబడుట యొక విశేషము. పూజ్యతా తారతమ్యమునుబట్టి యేకవచనముగను బహు వచనముగను ద్విరుక్త బహువచనముగను వాడఁబడును. ఇది ప్రథమ పురుష సర్వనామమె యైనను మధ్యమ పురుషమునకు బదులుగాఁ బూజ్యార్థమున వాడఁబడును. అపుడు దాని క్రియ మధ్యమ పురుషములోనె యుండును. ఇట్లగుటచేత నిది 'త్వా-తు'=(నీవు) అను నిండో యూరపియను శబ్దమునుండి యేర్పడెనేమో యను నూహ గల్గుచున్నది'' (కాల్డు. ३౯౭ పుట).

విమర్శము:—పూజ్యతయందు 'తా' శబ్ద బహువచనము యుష్మదర్థమున వాడఁబడినను గ్రియ మధ్యమ పురుషములోనుండుట సాధుకవి ప్రయోగా రూఢము కాదు. పూజ్యతాతిశయంబున యుష్మదర్థ బహువచనమునకు మాఱుగా నాత్మార్థ బహువచనంబు ప్రయుక్తంబగు. ఉదా:—స్వామీ 'తాము దయచేయవలయును.' (ప్రౌఢ-శబ్ద-౭౫ సూ.) 'తాము దయచేయుఁడు' అను మధ్యమ పురుష క్రియాప్రయోగము గన్పట్టదు. తెలుఁగు తా శబ్దము వాడుకలు ప్రౌఢ ౭౭-౭౮-౭౯, బాల వ్యా. ౧౨౦-మొ. సూత్రములచోటఁ జూడనగును. 'తా' శబ్దము 'త్వా' చ్ఛబ్దజ మనుట యసంగతము.

౧౧_౨. III విష:—''తాన్' శబ్దము పూజార్థకమగుటచేత ('నిర్దేశార్థక మగుటచేత' అనుట లెస్స. ఇట్లె యంతటను సవరింపనగును) దీని మూల మునఁ జరిత్ర నూహించుటకు శక్యముగాని వింతవింతలగు ద్రావిడ శబ్దము

లుప్పతిల్లును. 'Her majesty=(రాణి) your worship=(పూజ్యులగు తాము)' అను రీతి వాడుక లాంగ్లమున వెలసియున్నవి. ప్రాస్వత నందిన పూజ్యార్థక బహువచన రూపమగు (తమ్) 'త' అనునది 'తల్లి-తండ్రి' మున్నగు సంబంధార్థక తమిళ మలయాళ శబ్దములకుఁ బూర్వావయవముగా నిల్చి సమసించుటగలదు. అట్టి 'తమ్=త' అనువానికి బదులుగ 'ఎమ్-నమ్'=(మాయొక్క) 'ఉమ్'=(మీ యొక్క) అనునవి వైకల్పికముగా నిల్చుటయుఁ గలదు. తమిళ మలయాళేతర ద్రావిడ భాషలందును గుర్తింపరానంతటి వికృతినందిన పయిరీతి సమాసములు గలవు. ఉదా:—తమిళమున:—

తమ్బిరాన్:—(మలయా-తమ్బురాన్)=(దేవుఁడు. ప్రభువు. శైవ మఠాధికారి.) దీని కింగ్లీషులో 'His lordship' అనునది పర్యాయము. తమ్+(పూజ్యార్థకము) పిరాన్ =(ప్రభువు). ('పిరాన్' అనునది సంస్కృత 'ప్ర' (ముందు) శబ్దభవము కానోపును.) ఎమ్బిరాన్ =(మా ప్రభువు). ఉమ్బిరాన్ =(మీ ప్రభువు). తమ్బిరాట్టి=(పూజ్యరాలు). ఎమ్బెరుమాన్ =(ఎమ్=మాయొక్క-పెరుమాన్ =దొడ్డమానిసి=మా ప్రభువు). ఇది కావ్యములలోను శాసనములలోను వాడఁబడు బిరుదనామము. పెరుమాట్టి=(పూజ్యరాలు).

తగప్పన్ =(తండ్రి) 'తమ్+అప్పన్=తమప్పన్' అను ప్రాచీన రూపమును బ్రాహ్మణులు వాడుదురు. మల-తగప్పన్=తమ్మప్పన్. 'His fatherhood' అనునది దీని యాంగ్లపర్యాయము. ('తగప్పన్'- అపశబ్దము. చూడు 22 II విష).

తన్దై=(తండ్రి)= 'His fatherhood' అని యాంగ్లపర్యాయము. ఇది 'తగప్పన్' అనుదానికన్నఁ బ్రాచీనమైనను దాని యంతటి తఱచుగా వాఁడఁబడుచున్నది. (కన్న-తందె. తెల్గు-తండ్రి. మల-తన్త). తమిళ కవులు 'ఎన్దై' (ఎమ్=మాయొక్క) 'నన్దై' (నమ్=మాయొక్క), 'ఉన్దై' (ఉమ్=మీయొక్క) 'నున్దై' (నుమ్=మీయొక్క) (తై=తండ్రి) అనియు వాడుచున్నారు. 'మున్దై'=(ప్రాచీనుఁడు=ముందటి తండ్రి). పై సమాసములలోని యుత్తరపదమగు 'తై' అనుదాని చరిత్రము దురూహమై యున్నది. తమిళమున 'అత్తన్'=(తండ్రి), 'ఆత్తన్'=(దొడ్డమానిసి) 'అత్తై=అత్తాళ్'=(తల్లి) ('ఆత్తా-ఆత్తాళ్' అనవలెను. 'శ్రీ రెడ్డిగారు') అను శబ్దములు గలవు. వీనిని బరిశీలింపగాఁ దల్లియని కాని, తండ్రియని

కాని యర్థము చేయఁదగిన 'అత్తై' (తమిళమున నిట్లు లేదు-తెల్గున 'అత్త' అని కలదు) శబ్దమునుండి 'త్తై' శబ్ద మేర్పడెనని తోఁచుచున్నది. 'తన్నై=తల్లి - అక్క-భ్రాత' అను చోటను వలెనె 'అత్తై' శబ్దమునకును సందర్భానుసారముగ నర్థము నెన్నవగును. 'అత్తు=(కూర్చు)' (ఇది వ్యావహారికమని కోశములలో నున్నది. 'శ్రీ రెడ్డిగారు') అను ధాతువునుండి 'అత్తై' అనునది యేర్పడి యుండును (చూడు గ్లసోరియల్, ఎఫెనిటీస్ - సంస్కృత - సిధియను).

తాయ్=(తల్లి) (Her maternity). 'తా' అనునది పూజ్యార్థకము. తా+ఆయి=తాయ్=(తల్లి). కన్న-ఆయ్=తాయి=(తల్లి). 'ఆయ్=ఎంచు-సుందరమైన' అను నిట్టి యర్థము నలువదేండ్లు వయసుగల తల్లిపక్షమున సరిపడియుండదుగాన 'ఆవు' అను నర్థముగల 'ఆ' శబ్దమునుండి 'ఆయి' శబ్ద మేర్పడిన దనఁదగును. 'ఆవుల యజమానురాలు' అని యర్థము. సంస్కృతమున 'దుహిత్రీ' శబ్దమునకుఁ బాలు పిదుకునదని యర్థమున్నట్లె పై వ్యుత్పత్తి సంభావ్యమె యనఁదగును. దక్షిణ మలయాళమున 'ఆయి' పదమునకు బదులుగా 'ఆచ్చి'=(ఇల్లాలు) అను శబ్దము వాడఁబడును. ("దక్షిణ మలయాళమనునది యఱవభాషా సంబంధి. అఱవమున నె 'ఆయి-ఆచ్చి' శబ్దములు గలవు. మలయాళమున లేవు. ఆయి=తల్లి. 'ఆచ్చి' శబ్దమునకు 'ఇల్లాలు' అను నర్థము లేదు. 'బ్రాహ్మణ స్త్రీ' అందురు. 'ఆయ్చ్చి'=(గోప స్త్రీ). గ్రాంధికము. శ్రీ రెడ్డిగారు"). 'ఆయి' అనుదానిపైని స్త్రీపుంస సాధారణమైన బహువచన ప్రత్యయము (అర్) నిల్వఁగా 'ఆయర్' (పసుల కాపరులు) అను శబ్దము వాడఁబడుచున్నది.

తమ్మై=(తల్లి). త=(పూజ్యార్థకము)+అమ్మై=తమ్మై=పూజ్యురాలగు తల్లి. (తమిళ లెక్సికనులో 'తమ్మై' లేదు. 'తమ్మాయ్' అని యున్నది. 'శ్రీ రెడ్డిగారు').

తన్నై=(తల్లి). త=(పూజ్య)+అన్నై=తన్నై=(పూజ్యురాలగు తల్లి). 'అన్నై=అమ్మై' శబ్దము లభిన్నములు. 'అన్నై' శబ్దమునకు 'తల్లి' అనియే కాక, 'అక్క-భ్రాత' అను మఱి రెండర్థములును గలవు.

తమైయన్ =(అన్న). '(His eldership)'=(వాని పెద్దతనము) అని యాంగ్ల పర్యాయము. 'తమ్=(పూజ్య) + ఐయన్' =(తండ్రి – అన్న – గురువు)= తమైయన్ = (అన్న). 'అన్న' అను తెలుగుపదమునకు సరిగ 'కన్న – అణ్ణ, తమి-అణ్ణన్-అణ్ణల్' అనునవి వాడఁబడుచున్నవి. 'అణ్ణు'=(ఆనుకొను) ధాతువునుండి యిది వచ్చియుండును. తమిళ కావ్యభాషలో 'అన్న' అను నర్థముగల 'తమ్మున్' శబ్దము గలదు. 'తమ్=(పూజ్య)+మున్= (ముందటివాఁడు)' అని దాని భేదము నెన్నఁదగును.

తమక్కై=(అక్క). ('Her eldership')=(ఆమె పెద్దతనము) అని దాని యాంగ్ల పర్యాయము. 'తమ్=(పూజ్య)+అక్కై=(అమ్మ-అక్క)=తమక్కై= (అక్క)'. 'అక్క' అను నర్థమునఁ దమిళమందు సాధారణముగా 'అక్కా–అక్కాళ్' అను శబ్దములు వాడఁబడుచున్నవి.

తమ్బి=(తమ్ముఁడు). తమ్=(పూజ్య)+పి=తమ్బి=(తమ్ముఁడు) (తెల్గు-తమ్ముఁడు. కన్న-తమ్మ. మల-తమ్బి=తమ్బాన్). తమి–మల–'పైదల్ =(పిల్లవాఁడు)' అనుదానిని పై 'పి' శబ్దముతో సరిపోల్చి చూడనగును. 'పైదల్' శబ్దము నకు 'నవ్యమైనది'='ఆకు పచ్చనిది' అని యవయవార్థము. పై 'పి' శబ్దము 'పిన్'=(వెనుక) శబ్దమునుండి యేర్పడినదని తోఁచుచున్నది. 'పిన్= పిఱన్దోన్'=(వెనుకఁ బుట్టినవాఁడు) అనునది, 'పిన్నోన్'=(వెనుకఁ బుట్టిన వాఁడు) అనుదానికి సరియైనదనియు, 'తఙ్గై'=(చెల్లెలు) అనుదానికి సమానార్థకమగు 'పిన్నై' శబ్దము 'పిన్నోన్' శబ్దముయొక్క స్త్రీలింగ రూపమనియు వ్యాఖ్యాతలు వ్రాయుచున్నారు. 'మున్' శబ్దమునకు 'ము' అనుదానివలెనె 'పిన్' శబ్దమునకు 'పి' అనునది ప్రాచీనరూపమై యుండవచ్చును. 'పిన్' శబ్ద 'న' కారము పిఱగు శబ్దములోని రేఫమై యుండవచ్చును. (సరికాదు చూడు ౨౧ XX విష). 'తమ్మున్'=(అన్న) (చూడు–'తమైయన్' శబ్దవివరణము) అను సమాసములోని యుత్తరపద మగు 'మున్' శబ్దము 'న' కారాంతమై నిల్చినట్లు 'తమ్బి' శబ్దము తుది 'పి' శబ్దము 'న' కారాంతమై యేల నిల్వలేదో తెలియకున్నది. గ్రాంథిక తమిళమున 'ఎమ్బి'=(మా తమ్ముఁడు) 'ఉమ్బి=నుమ్బి'=(మీ తమ్ముఁడు) అనునవి 'తమ్బి' = (తమ్ముఁడు) శబ్దార్థ ఘటితములుగా వాడఁబడు చున్నవి. 'నమ్బి=(మన తమ్ముఁడు)' శబ్దము సైతము 'తమ్బి' శబ్దార్థ ఘటితముగనె యూహింపనగును. తమిళమున, 'తమ్=(ఆత్మార్థక బహు వచనము) నమ్=(ఉభయార్థక బహువచనము) నుమ్=(యుష్మ దర్థక

బహువచనము) ఎమ్=(అస్మదర్థక బహువచనము)' అను శబ్దముల వాడుక యీ క్రింది రీతిగా నుండును. ఉదా:—తమన్=(తమవాఁడు) తమళ్=(తమ స్త్రీ) తమర్=(తమవారు) నమన్=(మనవాఁడు) నమళ్=(మన స్త్రీ) నమర్ = (మనవారు) నుమన్ = (మీవాఁడు) నుమళ్=(మీ స్త్రీ) నుమర్ (మీవారు) ఎమన్=(మావాఁడు) ఎమళ్=(మా స్త్రీ) ఎమర్=(మావారు). (చూడు 'త-న-ను-ఎ......' (తొల్కా. ౬౩౮ సూ). కావున నవి ('ఎమ్బి' ప్రభృతులు) కేవలము 'తమ్బి' శబ్ద సమానార్థకము లనరాదు).

తఙ్గై=(చెల్లెలు). 'తమ్=(పూజ్య)+కై=తఙ్గై' మల-తఙ్గ. కన్న-తంగి. కూర్గ-తంగె. ఇందలి 'కై' శబ్దమునకు 'చేయి' అని యర్థముగాన 'తఙ్గై' శబ్దమునకు 'చేఁదోడు' అని యర్థము నెన్నఁదగును. చెల్లెలికి గృహమం దిచ్చెడి స్థాన మట్టిదేకదా. దీనికి సరియగు తెల్గు శబ్దము 'చెలియలు' అనుదానికి 'క్రీడన స్వభావముగలది. ప్రేమించునది' ('చెలికత్తె' అనుదానిని బట్టి కాఁబోలును) అను నర్థము లీనమైయున్నది. గ్రాంధిక తమి-'నఙ్గై=(స్త్రీ)-మఙ్గై= (పిల్ల)' అనువానిని బట్టి చూచునపుడు వీనిలోని 'కై' శబ్దము 'చిన్నది-వెనుకఁబుట్టినది' అను నర్థములుగలది కాదని విశదమగును. మఱియుఁ దమిళ కవులు 'కైమ్మై' శబ్దమును 'తఙ్గై'=(చెల్లెలు) అనుదానికిఁ బర్యాయముగ వాడుదురు. దీనిని బట్టి 'కై' శబ్దార్థము నిర్ణీతమైన (చేయి - చేఁదోడు) దనవచ్చును. 'కైమ్మై-కైమ్బెణ్=(విధవ)' అనువానిలోని 'కై' శబ్దము 'చేదుగానుండు' అను నర్థము గలదానినుండి పుట్టిన దనవచ్చును. ఈ 'కై' శబ్దమునకు 'కశు' (కచ?) అను రూపాంతరము గలదు. దీనికి 'ఆపద' అనియు నర్థము గలదు. కావున 'తఙ్గై' శబ్దములోని 'కై' శబ్దము దీనికి భిన్న మనఁదగును.

నమ్బి=(అల్పుఁడగు పూజారి). 'తమ్బి' శబ్దమునకువలెనె దీనికిని 'తమ్ముఁడు' అని యర్థము కావచ్చును. (వెనుకటివాఁడు = చిన్నవాఁడు = అల్పుఁడు). మలయాళ బ్రాహ్మణులలో నొక తెగవారికి 'నమ్బూరి-నమ్బూతిరి' అను (నమ్బియార్?) పేర్లు గలవు. మఱియుఁ దెలుఁగు నందలి 'తమ్మళి' శబ్దముతో సరిపోల్చి చూడనగును. 'తంబళి=తమ్మళి-దే. వి. శివార్చనము చేసి బ్రదుకు జాతి' (శ-ర). ''నమ్బి'=(పురుషశ్రేష్ఠుఁడు). దీని కల్పుఁడను నర్థమే లేదు. 'పూజారి' అను నర్థమును గలదు'' (శ్రీ రెడ్డిగారు).

తమ్మావు=(మామ) } ఇట్లు కూర్గుభాషలో 'శ్వశ్రూ-శ్వశుర' వాచకము
తమ్మావి=(అత్త) } లకు ముందుగ 'తమ్' శబ్దము నిల్చును. కాని తమిలి
మం దట్టి 'తమ్' శబ్దయోగము లేకయే 'మామ-మామి' శబ్దములు
వాడఁబడుచున్నవి" (కాల్డు. ౩౯౭ మొ. ౪౦౦ పుటలు).

విమర్శము:—పయి వానిలో 'తమ్బి' = (తమ్ముఁడు) 'తఙ్గై' = (చెల్లెలు) మున్నగువానిలోని మొదటి 'తమ్' శబ్దము పూజ్యార్థకమనుట యసంగతము. వీనిని బట్టి తక్కినవానిలోని 'తమ్' శబ్దమును బూజ్యార్థకము కాదని తోఁచును. 'నమ్బి - ఎమ్బి - నుమ్బి - ఉమ్బి' = అనునవియును బై యభిప్రాయమును బల పఱుచును. "నమ్బి=(మన తమ్ముఁడు). ఎమ్బి=(మా తమ్ముఁడు). నుమ్బి= ఉమ్బి=(మీ తమ్ముఁడు). తమ్బి=(వాని తమ్ముఁడు) ఇది తమ్ముఁడను నర్థమున వాడఁబడును. ఉదా:—ఎన్ తమ్బి-ఉన్ తమ్బి—మొ. 'తన్దై' లోని "తన్" శబ్దమును బ్రథమ పురుషార్థకమె. ఉదా:—తాయ్ = (వాని తల్లి). యాయ్=నా తల్లి మొ." (శ్రీ వి. వేంకటరాజులు రెడ్డిగారు). తెల్గునఁ గొన్ని యెడల 'ఆ' అనెడి తచ్ఛబ్దమును 'తా' అనెడి యాత్మార్థకమును స్వార్థిక ములుగాఁ (వ్యర్థముగాఁ) బ్రయోగింపఁబడుట గలదు. అట్టివానిని బూజ్యార్థకము లనుట సంప్రదాయము కాదు.

'పదాద్యగతం బాశబ్దం బమహదర్థకంబు సమస్తంబు వ్యస్తంబు నయి కొన్నియెడల నర్థశూన్యం బగు. ఉదా:—చ......అర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబునన్ (ఆది. ౮ ఆ. ౭౬ ప.) పాడు గావు నాగతి (కళా. ౩ ఆ.). చ... ...మఱి బావులు నూఱిటికంటె నొక్క న। త్తతు వది మేలు......... (ఆది. ౪ ఆ. ౯౪ ప.) (ప్రౌఢ వ్యా. శబ్ద ౬౩ సూ).

'నామ త దేత ద్య త్క్రమర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమా ద్యంతమయి పూర్వ పరంబులుగ నాత్మార్థం బభిహితం బగు. ఉదా:—ఉ...... తా। వచ్చెసుదర్శనాయుధుఁడు - ......(భాగ. ౧౦. స్కం. పూ.) క....... విదురుఁడు విషాగ్నులవలనన్। మానుగ నేమరకుం డని। తాను బ్రబోధించె ......(ఆది. ౬ ఆ. ౧౫౨) ఇచట ప్రాసగతమగు తాను శబ్దము పాదపూర ణార్థకము.

దొరగా రుదాహరింపలేదుగాని కన్నడమునందలి 'ఆతం-ఈతం-ఊతం' శబ్దములందును దెల్గులోని 'ఆతఁడు=అతఁడు, ఈతఁడు=ఇతఁడు' అను శబ్దము లందును నది=('తా' శబ్దము) యున్నది. 'ఆ+తన్=ఆతం, ఈ+తన్=ఈతం'

అను రీతిగల ఛేదము చొప్పున 'తా' శబ్దమేయని యూహింపనగును. (౧౧౬_౧-౧౧౬_౪ పుటలు. ఆం. భా. చ.) పై వానిలోని 'తా' శబ్దము వ్యక్తిమాత్రవాచకము.

“కన్నడమునను తెనుఁగునను 'ఆతం-ఈతం-ఏతం, ఆతఁడు-ఈతఁడు-ఏతఁడు' అను రూపములు గలవు. వీనిలోని త్రికములను (బహు?) దొలఁగించి పరీక్షించినచో 'తం-తన్-తను-తఁడు' అనునదియే మూలమనుట స్పష్టము” (ఆం. భా. వి). కన్నడమున నున్న 'ఊతం' అనుదానిని విడిచి లేని 'ఏతం' అను దానిని వచించుటలో వికాసకర్త గారి యాశయమేమో? తెలియకున్నది. 'అదు-ఇదు-ఉదూనా మంతే వ తౌ పుంసి' (కర్ణా. భూష. ౯౫ సూ.)='అదు-ఇదు-ఉదు' అనువాని తుదివర్ణములకుఁ బుంస్త్వమున విభక్తిపరమగుచుండఁగా 'వ' కార 'త' కారము లాదేశము లగును. ఉదా:—అవం-ఇవం-ఉవం-ఆతం-ఈతం-ఊతం.

డా. కాల్డువెల్లుగారు పై నుదాహరించిన 'తాయ్' (తల్లి) శబ్దపు వివరణమున 'పుత్త్రీవాచి దుహిత్రీ' శబ్దమని ప్రయోగించి యున్నారు. 'దుహితృ=' (కూఁతురు) అను ఋకారాంతమునకు 'జీప్పు' రాదు. 'పుత్త్రిక' అను నర్థమున దాని యవయవార్థము 'పాలుపిదుకు' అని వ్రాసిన దొరగారి వ్రాఁత సంప్రదాయ విరుద్ధము.

'న షట్ స్వస్రాదిభ్యః' (౪-౧-౧౦) 'షట్సంజ్ఞకేభ్యః స్వస్రాదిభ్యశ్చ జీప్ టాపౌ న స్తః. 'స్వసా తిస్ర శ్చతస్ర శ్చ। ననాన్దా దుహితా తథా। యాతా మాతేతి సప్తైతే। స్వస్రాదయ ఉదాహృతాః' (సి. కౌ. ౩౦౮ సూ).

'దుహితృ. స్త్రీ-దోగ్ధి ధనహారణేన రిక్తీకరోతి పితరౌ ఇతి దుహితా. ఋ. స్త్రీ - దుహ ప్రపూరణే'=(తల్లిదండ్రులను ధనహరణముచేత రిక్తులుగాఁ జేయునది. కూఁతురి పేరు) (అమరకోశము. లింగాభట్టీయ గురుబాల ప్రబోధికా వ్యాఖ్య).

పయి సందర్భమునుబట్టి దొరగారు వ్రాసిన 'తాయ్' శబ్దపు వ్యుత్పత్తియు నసంభవమె యగుచున్నవి.

౧౧_౨. IV విమ:—“ఆత్మార్థక సర్వనామముయొక్క ద్వితీయా ద్యేకవచ నాంతమగు 'తన్' శబ్దము, 'తనమ్-తన్నై' అను భావార్థక తమిళ రూపములలోఁ బూర్వావయవమై యుండుట మఱొక విశేషము. తమిళ 'మై' ప్రత్యయము — ... తమిఁగలి 'తఁమ్' లాటిను లోని 'తన్' ఇంగ్లీషులోని

'ness (నెస్)' అనువానికి సరియగు నర్థముగలది. 'తన్మై' అనుదానికి స్వతంత్ర ప్రయోగమును గలదు. సంస్కృత 'తత్త్వమ్' శబ్దమును దమిల 'తన్మై' శబ్దమును సమానార్థకములు. ఈ రెండిటికిని నేదేని పరంపరా సంబంధముండి యుండును'' (కాల్డు. ౪౦౦, ౪౦౧ పుటలు).

విమర్శము:—తన ప్రత్యయము కర్ణాటాంధ్రాదులందును గలదు. కర్ణాటమున భావార్థక 'మె' ప్రత్యయము సైతము గలదు. 'చేతనే ష్వికె-ఉ-మె-తనాని' (కర్ణా. భూష. ౧౭౯)='అజడవాచకములకు భావార్థమున 'ఇకె-ఉ-మె-తన' అను ప్రత్యయము లగును.' ఉదా:—......పెర్మె = (పెత్తనము). ఆళ్తనమ్ = (వీరత్వము) (ఆళ్=వీర).

'త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్' (ఆం. చిం.) ('వ్యా. సం.' ౨౮౯ విష). ఉదా:—పెద్దతనము=పెత్తనము. చిన్నతనము-మె. ప్రాకృతమున నిది 'త్తణ' అను రూపమున నున్నది. 'త్వస్య తు డిమా త్తణౌ' (వాల్మీకి సూత్ర. ౨-౧-౧౩)= "భావార్థస్య త్వ ప్రత్యయస్య డిత్ 'ఇమా-త్తణ' ఇత్యాదేశౌ 'తు=వా' భవతః. సంస్కృ-పీనత్వమ్=ప్రాకృ-పీణిమా-పీణత్తణమ్......పక్షే-పీణత్తం-పీణతా=(సంస్కృ-పీనతా) పీణదా=పీణ ఆ'' (షడ్భాషాచంద్రిక. ౧౧౪ పుట). ఇట్టి 'తన' ప్రత్యయము కేవల మర్వాచీనమనుచు దొరగారు వ్రాయుదురు. (చూడుడు ౧౧-౨ V విష).

౧౧-౨. V విష:—"ఆత్మార్థకమగు 'తా-త' అనునది ద్రావిడ ధాతుజన్యమనుట నిశ్చయమెకాని దీనిని బోలునట్టి యిండోయూరపియను శబ్దముగాని సిథియను శబ్దముగాని లేకపోలేదు. సంస్కృత 'తత్'=(అది) శబ్దమునందును, (ఇందలి తుది 'త' కారము నపుంసక చిహ్నము. మొదటి 'త' శబ్దము నిర్దేశ సర్వనామము) 'తదా'=(అప్పుడు) శబ్దమునందును, 'సః=(వాఁడు) సా=(ఆమె)' (తకారము సకారముగాఁ బరిణమించెను) అనువానియందును నాత్మార్థక ద్రావిడ శబ్దపు పోలిక లగపడుచున్నవి. ఇండో యూరపియను కుటుంబములోని యాత్మార్థకములగు 'స్వ-సె' మొదలగునవి (చూడుడు ౧౧-౨ I విష.) చాల మార్పుల నందినను నవి తచ్ఛబ్దావయవములె యననగును. ఇట్లె గ్రీకు భాషలోని నిర్దేశ సర్వనామమగు (Article) 'తాస్-తె-తొ' అనునవియు జర్మను భాషలోని తత్తుల్యములె యగు 'డెర్-డై-డస్' అను నవియుఁ బై ద్రావిడ సర్వనామమును (తాన్ శబ్దమును) బోలుచున్నవి. 'తేనస్'=(వాఁడు) అను డోరికు భాషా (గ్రీకు భాషా భేదము) శబ్ద మాత్మార్థక ద్రావిడ శబ్దమువలెనె 'న' కారయుక్తమై యున్నది. ఈ డోరికు భాషా శబ్దమునుండియే 'కేనస్' అను 'ఇయోలియను'

భాషా (గ్రీకు భాషా భేదమె) శబ్దమును 'ఎకైనస్' అను నవీన గ్రీకు భాషా శబ్దమును బుట్టిన (హెబ్రూ సర్వనామాగమమగు 'క' అనునది 'త' అనుదాని నుండి వచ్చినట్లు) ట్లూహింపఁబడుచున్నవి. ద్రావిడ 'తాన్' శబ్దమునకును గ్రీకు 'తేన్' శబ్దమునకునుగల పోలిక విచిత్రమైనది. మధ్యమ పురుషముగా వాడఁబడుచున్న (తామ్) పూజ్యార్థక ద్రావిడ సర్వనామము గ్రీకు భాషలోని పూజ్యార్థకముగ వాడఁబడుచున్న యవ్యయమగు 'తన్' (లేక) 'ఓతన్'= (అయ్యా నా మంచిస్నేహితుఁడా!) అనుదాని వ్యుత్పత్తికి సూచకము కారాదా? గ్రీకులోని యీ 'తన్' శబ్దము 'తేనస్' శబ్దమునుండి వచ్చినదని కొందఱు వైయాకరణులును, వ్యవహారభ్రష్ట సంబోధనమగు 'తు' (లేక) 'తూనే' శబ్దము నుండి వచ్చినదని కొందఱును నూహించుచున్నారు" (కాల్డు. ౪౦౧ పుట).

"ప్రాచీన పారసీక భాషలోని 'తన్స్' (తనస్=వాఁడు) అను శబ్దము నందుఁ బై నిర్దేశ సర్వనామరూపమె తుది నకారముతోఁ గూడి వెలయుచున్నది. సిథియను భాషలందును నీ నిర్దేశవాచకము 'న' కారయుక్తముగాను 'న' కార విరహితముగాను గన్పట్టుచున్నది. ఫిన్నిషు భాషలో (సిథియను) 'తోమ' అను దూర నిర్దేశవాచకములోను 'తెమ' అను సమీపస్థవాచకములోను నయ్యది కన్పట్టుచున్నది. సియోనీ గోండుభాషలో నీ యాత్మార్థక సర్వనామ మాత్మార్థకముగాను నిర్దేశార్థకముగాను వాడఁబడుచున్నది. 'సన్సుమ్జి' పాటలో (చూడు-బెంగాలీ యేషియాటిక్ సొసైటీ పేపరు - డా. మాజరుగారి వ్యాసము) 'తున్న'=(వానియొక్క) 'తానె'=(ఆమెయొక్క=అది) అను వాడుకలు గలవు. ఆ పాటలోనె 'తున్వ'=(తమి-తన్)='సూనస్ ఆఉమ్' అను నాత్మార్థకపు వాడుకయుఁ గలదు. పయి సందర్భమునుబట్టి 'తా' అనునది మొదట నిర్దేశవాచకమై (తచ్ఛబ్దార్థకమై) యుండెడిదని తోఁచుచున్నది. అఱవ కావ్యభాషలో నామవాచకమునకును దాని ద్వితీయాది విభక్తులకును నడుమ 'అదు' శబ్దము వలెనె యాత్మార్థక సర్వనామము సైతము (విభక్తి పూర్వాగమముగ) నిల్చుట గలదు. ఉదా:—మరన్దనై కణ్డేన్=(చెట్టును జూచితిని). (ఇందలి 'తన్+ఐ' అనుచోటి 'తన్' అనునది 'తాన్' శబ్దపు ద్వితీయైకవచనాద్యంగము). మరన్దనై= మరమదై (మరమ్+అదు+ఐ)=మరత్తై (ఇది వ్యావహారిక రూపము)= (చెట్టును) (చూడు-నామవాచక ద్వితీయైకవచన సందర్భము)" (కాల్డు. ౪౦౧, ౪౦౨ పుటలు).

"సంస్కృతమునందలి తచ్ఛబ్ద భావార్థకరూపమగు 'తత్త్వమ్' అనుదానికి సమానసానికముగా వాడఁబడుచున్న 'తన్మై-తనమ్' శబ్దములలో 'తాన్' శబ్దపు

ద్వితీయాద్యంగమగు 'తన్' (లేక) 'త' అను శబ్దము నిల్చియుండుట, యట్టి
ద్రావిడాత్మార్థక 'తన్' శబ్దమునకును సంస్కృత సిథియను భాషలలోని తచ్ఛ
బ్దార్థక నిర్దేశ సర్వనామమునకును సంబంధము గలదనుటకు బలమైన నిదర్శనమై
యున్నది. ఈ ద్రావిడ 'తన్మై' శబ్దము సంస్కృతమందలి 'తత్త్వమ్' శబ్దమును
జూచి కల్పింపఁబడినదై యుండును. కాని యద్దానినుండి పుట్టినది గాదు.
భావమాత్ర గోచరమగు ధర్మమును దెల్పునట్టి 'తనమ్' అను తమిఌ పదము
మిక్కిలి యర్వాచీనమై యుండును. 'తన్మై=తత్త్వమ్' శబ్దముల మూలరూపములు
మిక్కిలి ప్రాచీన సంబంధమును గల్గియుండిన నుండవచ్చును. అదే నిజమైన
యెడల నట్టి సంబంధ మత్యంత ప్రాచీనమై యుండవలెను. ద్రావిడభాషలందలి
యాత్మార్థక సర్వనామమునందుఁ బ్రాచీన నిర్దేశార్థక 'త' కారము నిల్చియుండఁగా
నిండోయూరపియను భాషలలో దీనికి సరిగ వాడఁబడు నాత్మార్థక సర్వనామ
ములో సకారము (స్వ-సె-మొ. చూడు ౧౧-౨ I విష) వెలయుచున్నది.
ఆయా భాషలు (ఇండోయూరపియను) మూలభాషనుండి విడకముందె తకారము
'స' కారముగా మాఱియుండవలెను" (కాల్డు, ౪౦౧, ౪౦౨ పుటలు).

విమర్శము:—ద్రావిడ 'తా' శబ్దము మొదట తచ్ఛబ్ద సమానార్థక
మయి నిర్దేశ సర్వనామాభిన్నమై యుండెడి దనెడి కాల్డువెల్లుగారి యాశ
యము విశ్వసనీయము కానేరదు. ఇండోయూరపియను భాషలలో నతి
విస్తృతముగాను సిథియను భాషలలోను వారు చూపిన 'తాస్-తె-తో' మున్నగు
శబ్దములెల్ల సంస్కృత తచ్ఛబ్దాభిన్నములు. తచ్ఛబ్దాదుల 'త' కారమును
ద్రావిడాత్మార్థక 'తా' శబ్ద 'త' కారమును రూపసామ్యము నందియున్నంత
మాత్రమున ద్రావిడాత్మార్థక 'తా' శబ్దము ప్రాచీనకాలమునఁ దచ్ఛబ్దార్థకమె
మై యుండెడిదని యూహించుట రూపసామ్య భ్రాంతి కృతమెకాని సత్యము
కానేరదు. ఇంత గ్రంథ విస్తృతిచేసి చూపనేల? ఇండోయూరపియను భాష
లలో 'త' చ్ఛబ్దార్థకములందెల్ల 'త' కారము విస్తరించి యున్నదనుటలో
విప్రతిపత్తి యేమున్నది? 'త్వమ్' శబ్దములోను 'త' కారము గలదనుచు దానిని
సైత మిందేల చూపరాదు? పరస్పర విభిన్నార్థకములగు ప్రకృతుల కాకార
సామ్య మున్నంతమాత్రమున వానికి సంబంధమును గల్పించుట యసంగతము.

'ఆం. భా.' చరిత్రమున 'ఆత్మన్' శబ్దరూపాంతరము 'త్మన్' అనునదే ఋగ్వే
దమునఁ గలదనుచు వ్రాసిరి. (చూడు ఆం. భా. చ. ౧౧౪౪ పుట) వికాస
కర్తగారును నిదె స్వామినాథయ్యరుగారి యభిప్రాయమనుచు వ్రాసి "అయినను
కావచ్చును. కాని యన్ని విషయములలోను స్వతంత్రములని నిరూపించిన

ద్రావిడ భాషలలోని కిది యందుండి వచ్చెననుటకు......అంగీకరింపఁ జాలము" (ఆం. భా. వి. ౪౮౬ పుట) అని వ్రాసిరి. ఈ సంబంధము యాదృచ్ఛికముగఁ జూపట్టుచున్నను 'ఆత్మ' శబ్దము వికృతి నందుటలో 'అతుమ-ఆయా-ఆదా-అల్లా-అత్తా-అప్పా' మున్నగు రీతిగాఁ బరిణామమందుట ప్రాకృతములలోఁ బ్రసిద్ధముకాని 'తాన్' అని నిల్చుట ప్రసిద్ధము కాదు.

" 'శోశ్చ పఞ్చమో వా లోప్యః' (వృత్తి) వర్గపరః శుపరశ్చ వర్గపఞ్చమో వా లోప్యో భవతి. జ్ఞానమ్=ణాణమ్..... ఆత్మా=ఆదా=ఆయా=అత్తా=అల్లా" (చండప్రాకృతలక్షణము. వ్యంజన విధానము).

'వాత్మ భస్మని పః' (౧-౪-౪౨) (వృత్తి) 'ఆత్మ భస్మ' అనయోః స్తోః పో వాస్యాత్-అప్పా-మనయా మితి మ లోపే శేష ద్విత్వే అత్తా. (షడ్భా. ౮౬ పుట).

తమిట 'తన్మై' శబ్దమును సంస్కృత 'తత్త్వమ్' శబ్దమును నభిన్నార్థకము లను నభిప్రాయముతో, డా. కాల్డువెల్లుగారు వానికిఁ బోలిక గలదని వ్రాయుచున్నారు. అవి సమానార్థకములు కావు. 'తస్యభావః=తత్త్వమ్=తత్వమ్'=(దానియొక్క ధర్మము). 'తన్+మై=తన్మై' ('స్వస్య భావః=స్వభావః' మై ప్రత్యయము భావార్థకము. ౧౧౬ విష.) తత్త్వ శబ్దపూర్వావయవము పరోక్ష వస్తువాచియగు సంస్కృత తచ్ఛబ్దము. ఇంక 'తన్మై' అను శబ్దముయొక్క పూర్వావయవ మాత్మార్థక తా శబ్ద సంబంధి. దొరగారు మొట్టమొదట నాత్మార్థక ద్రావిడ 'తా' శబ్దము ద్రావిడ ధాతు జన్యమె యని ప్రతిజ్ఞచేసిన వారగుటచేత 'తత్త్వమ్' శబ్దమునుండి 'తన్మై' శబ్దము పుట్టలేదనియు దాని పోలికయును గల్పితమనియు వ్రాసిరేకాని యట్లె వారి యుద్దేశమయినచో నాత్మార్థక ద్రావిడ 'తా' శబ్దము ప్రాచీనకాలమునఁ దచ్ఛబ్దార్థకమయియె యుండెడిదని యూహింపనేల? ఇండో యూరపియను భాషలు ద్రావిడ మూలభాషనుండి వీడకముందే 'స్వ-సె' అను వానికిని 'త' కారమునకును బరిణామము గల్గియుండ వలెనని యూహింపనేల? 'త-స' ల పరిణామము కొన్నియెడల (తత్-సః-సా-మొ.) నుండిన నుండుఁ గాక. స్వ శబ్ద సకారము 'త' చ్ఛబ్ద త కారమునుండి మూల భాషలోనె పరిణమించె ననుమాట సత్యము కానేరదు. ఇండో యూరపియను భాషలలోని 'స్వ' శబ్దము వేఱు. వానిలోని నిర్దేశార్థక 'త' చ్ఛబ్దము వేఱు. ద్రావిడాత్మార్థక 'తా' శబ్దము వేఱు. వీనిలో 'త-స' ల పరిణామము గలదనరాదు.

అదు శబ్దమువలె ద్రావిడ 'తా' శబ్దము విభక్తి పూర్వాగమ మగుట తొల్కాప్పియ సమ్మతము కాదు. 'మరన్దనై = మరమదై' (చెట్టును) అనునవి తొల్కాప్పియ సమ్మతములు కావు. 'తొల్కాప్పియమునకు విరుద్ధముగాఁ బ్రయోగములు దాని తర్వాతివి గలవు' (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డి గారు జూన్ ౧౯౫౩). 'మరత్తై' = (చెట్టును) అనునది వ్యావహారిక రూపమను వ్రాఁత సరికాదు.

"మఃకాన్ పుళ్ళి......" (తొల్కా. ౧౮౬ సూ.) = మకారాంత శబ్దములకు విభక్తి పరమగునపుడు 'అత్తు' అను నాగమము వచ్చును......ఉదా:—మరమ్ + ఐ = మరమ్ + అత్తు + ఐ = మరత్తై = (చెట్టును).

౧౧౩. I విష:—"యుష్మ దస్మ దాత్మార్థక బహువచన రూపములు:—పాఠకుల సౌకర్యమునకయి కావలయును గాల్డువెల్లుగా రిచట వెనుక నుదాహరించిన పురుషబోధక సర్వనామరూపములనె మరల వివరింప సాగిరి. ౧౦౬ II, IV, V విషయములందు వరుసగా నస్మదర్థక తమిళ కర్ణాటాంధ్ర రూపములును ౧౧౦ I, IV. V విషయములందు వరుసగ యుష్మదర్థక తమిళ కర్ణాటాంధ్ర రూపములును ౧౧౨ I విషయమునఁ దమిళ కర్ణాటాంధ్రములందలి యాత్మార్థక సర్వనామరూపములును నుదాహరింపఁబడి యున్నవి. తమిళ ప్రథమా బహువచనముపైని బహువచన 'కళ్' ప్రత్యయము మరల నిల్చిన పునరుక్త బహువచన రూపములు సైత మచటఁ జూపఁబడినవి. అట్టివానినె మరల వివరించెడి దొరగారి యనావశ్యక విస్తృతి నిట నుపేక్షించి విశేష విషయములు మాత్రమె విమర్శింప దలంచుచున్నాను. పునరుక్త బహువచన సందర్భమునఁ 'యామ్-నామ్-నీయిర్-తామ్' అను ప్రాచీనరూపములు పూజ్యార్థకములుగను వానిపైని 'కళ్' ప్రత్యయము నిల్చినరూపములనఁగా 'నాజ్గళ్ (మేము) నీజ్గళ్ = (మీరు) తాజ్గళ్ (తాము)' అను ద్విరుక్త బహువచన ప్రత్యయాంతరూపములు సామా న్యాస్మ ద్యుష్మ దాత్మార్థకములుగను నేఁటి తమిళమున వ్యవహరింపఁబడుచున్నవని వ్రాయఁబడెను. ఉదా:—నీయిర్ = పూజ్యులగు మీరు. నీజ్గళ్ = మీరు. మొ. "ఇట్టి పూజ్యార్థకత లేదు. 'నీయిర్' అనుదానికి 'మీరు' అనియే యర్థము. ఇది ప్రాచీన శబ్దము. 'నీజ్గళ్' అర్వాచీనము" (శ్రీ రెడ్డిగారు). తెల్గునందును ద్విరుక్త బహువచన రూపములు గలవు. ఉదా:—వారలు-వీరలు-మీరలు. ఇట్టి యర్వాచీన ద్విరుక్త బహువచన రూపములు 'గారియను' భాషలందును (ఉత్తర హిందూస్థాన వ్యావహారిక భాషలు) గలవు. బీమ్సుగారు ౧౮౭౨ సం॥ అక్టోబరు ఇండియన్ ఏన్టిక్వెరీలో నోత్ర భాషలోని ద్విరుక్త బహువచన రూపముల నీ క్రిందిరీతిని

వ్రాసిరి. 'ము=(నేను) అమ్హే=('అమ్హే' అని వాడుక) (మేము). తు=(నీవు). తుమ్హే=('తుమ్హే' అని వాడుక)=(మీరు). కాలక్రమమున నట్టి బహువచన రూపములనుండి 'అమ్హేమానే-తుమ్హేమానే' అను ద్విరుక్త బహువచన రూపము లేర్పడెను. టర్కీ భాషయందును నిట్టి ద్విరుక్త బహువచన రూపములు గలవు. ఉదా:—బెన్=(నేను). బిజ్=(మేము). ద్విరుక్త బహువచన రూపము-బిజ్ లెర్=(మేము). సెన్=(నీవు). సిజ్=(మీరు) దీని ద్విరుక్త బహువచనాంత రూపము-సిజ్ లెర్=(మీరలు)" (కాల్డు. ౨౦౨, ౨౦౩ పుటలు).

"పురుష బోధక క్రియాప్రత్యయము లేర్పడుటలో నాయా పురుషముల సర్వనామములలోని మొదటి హల్లు లోపింపఁగా మిగిలిన యచ్చును, దుది బహువచన చిహ్నమును మాత్రమె నిల్చును. ఉదా:—తమి-'యామ్' అను దానినుండి 'ఎమ్-ఏమ్' అనియు 'నామ్' అను దానినుండి 'అమ్-ఆమ్' అనియు నేర్పడును. 'ఓమ్' అను నుత్తమ పురుష బహువచన క్రియాప్రత్యయము వ్యావహారికము. తమిళ మధ్యమ పురుష సర్వనామము 'నీయిర్' అనునది గాన క్రియా ప్రత్యయములు-'ఇర్-ఈర్' అనునవె యున్నవి. తమిళమందే కాక కర్ణాటాంధ్రములందును మధ్యమ పురుష క్రియా ప్రత్యయము రేఫ ఘటితమె. సర్వనామముల యేకవచన 'న' ప్రత్యయము లోపించి యచట బహువచన 'మ' ప్రత్యయము నిల్చుటచేతఁ బ్రాచీన బహువచన రూపము లేర్పడును. ఉదా:—ఏక-యాన్-బహు-యామ్. ఇట్టి దీనిపైని 'కళ్' అను నమహద్బహువచన ప్రత్యయము మరల నిల్వఁగా వ్యావహారిక ద్విరుక్త బహువచన రూపమేర్పడును. ఉదా:—యాఙ్గళ్.

నీ శబ్దవిశేషములు:—తమిళ మందలి మధ్యమ పురుష బహువచన రూప మసాధారణమగు నపవాద శబ్దము (చూడు ౧౧౩ IV విభ). అందుఁ దక్కిన వానిలోవలె బహువచనమున 'మ' కారము నిల్వదు. రేఫము నిల్చును. ('నీమ్' లేదు. 'నీయిర్' నిల్చును. తమి). కాని వ్యావహారిక ద్విరుక్త బహువచనాంత రూపమేర్పడినపుడు 'కళ్' ప్రత్యయము 'మ' కారము మీఁదనే నిల్చును. ఉదా:—నీఙ్గళ్=(మీరు). మధ్యమ పురుష సర్వనామ బహువచన ద్వితీయాద్యంగము సైతము 'నుమ్-ఉమ్-ఉఙ్గళ్' అను మాంతరూపములతోనె యుండును. వీనియందు 'ఇ' కారముండవలసినచోట 'ఉ' కారము నిల్చుట మాత్రమె విశేషము. తమిళ యుష్మదర్థక బహువచన ద్వితీయాద్యంగము 'నుమ్' అని నిల్చును. ఈ 'ఉ' కారము బహువచన ప్రత్యయమగు 'ఉమ్' శబ్దసంబంధి కానోపును. (చూడు ౧౧౩ IV విభ)" (కాల్డు. ౨౦౩, ౨౦౪ పుటలు).

నా శబ్ద విశేషములు:—"తమిళ వ్యావహారిక ద్విరుక్త ప్రథమా బహువచనాంత రూపము 'నాఙ్గళ్' అని యుండును. అనఁగాఁ దమిళ 'నామ్'

శబ్ద ముభయార్థక మాత్రమె యైనను వ్యావహారిక కేవలాస్మదర్థకైక వచన 'నాన్' శబ్ద మవతరించిన పిమ్మట దాని మూలమున 'నామ్-నాఙ్గళ్ =(మేము)' అను వ్యావహారిక కేవలాస్మద్బహువచన రూపమేర్పడెను. దీని పుట్టుకచే 'యాఙ్గళ్'=(మేము) అను నస్మద్వ్యావహారిక ప్రథమా బహువచన రూప మేర్పడదయ్యె. 'యాన్=(నేను) యామ్ (మేము) అను గ్రాంథిక ప్రథమా రూపముల కనుకూలముగా 'ఎన్-ఎమ్' అను గ్రాంథిక ద్వితీయాద్యంగము లును, 'నామ్=మేము' అను నస్మత్ప్రథమా బహువచనమున కనుకూలముగా 'నమ్' అను గ్రాంథిక ద్వితీయాది బహువచనాంగమును నవతరించెను. వ్యావ హారిక తమిళమందును నేకత్వమున ద్వితీయాద్యంగము 'ఎన్' అనియే యేర్పడినను బహుత్వమున 'యాన్=నేను' అనుదానికి 'ఎఙ్గళ్' అనియు 'నామ్=మేము' అను దానికి 'నమ్' అనియు ద్వితీయాద్యంగము లేర్పడెను." (కాల్డు. ౪౦౩, ౪౦౪ పుటలు).

విమర్శము:—కాల్డువెల్లుగారు 'నామ్' శబ్దమునకును 'we' అనియే యర్థము వ్రాయుచున్నారు (చూడు కాల్డు. ౪౧౫ II పేరా). 'నామ్' శబ్దము యుష్మ దస్మ దుభయార్థకము. 'యామ్=నామ్' శబ్దములు పర్యా యములనియు 'యాన్' (నేను) అను దానివలెనే 'నాన్' అనునదియుఁ బ్రాచీన తమమె యనియు దొరగారు భ్రమించి వ్రాయుచున్నారు. 'యామ్=(మేము). నామ్=(మనము)' (నీ+యామ్=నామ్) అనురీతి నయ్యవి విభిన్న శబ్దములు (చూడు ౧౦౬ II విష).

౧౧౩. II విష:—"కర్ణా టాస్మదర్థక విశేషములు:—ద్వితీయా ద్యంగ ములలో నాయా సర్వనామముల యచ్చు హ్రస్వ మగుచుండును. తమిళమందు వలెనె కన్నడమందును నుత్తమ పురుష సర్వనామ ప్రథమా రూపమందలి 'అ' కారము 'ఎ' కారముగా మారును. (ఉదా:—అన్-ఎన్-అమ్-ఎమ్). హళాస గన్నడ మందలి యుత్తమ పురుషమున 'ఎమ్మ' అను దానికి బదులుగా వాడఁబడు 'నమ్మ' అను రూపము మిక్కిలి ప్రాచీనమైనది. హళగన్నడ బహువచన ప్రత్యయమగు మకారము హళాసగన్నడములో వకారముగాఁ బరిణమించి యుచ్చారణార్థకమగు 'ఉ' కారముతోఁ గూడును. ఉదా:—హళ-నీమ్=హళాస- నీవు=(మీరు). ఇట్లె—హళ-నామ్=హళాస-నావు=(మేము). హళ-తామ్= హళాస-తావు=(తాము). హళాసగన్నడ క్రియా ప్రత్యయములలో 'నావు' అను సర్వనామమునకు సరిగా నేర్పడిన 'ఎవు-ఏవు-ఏవె' అను ప్రత్యయముల లోని 'ఎ' కారము, తమిళ భాషలోని యుత్తమ పురుషైకవచన ప్రత్యయమగు 'ఏన్' అనుదాని 'ఏ' కారమునకు సరిపోవుచున్నది. హళగన్నడ మధ్యమ

పురుష క్రియా బహువచన ప్రత్యయము 'ఇర్' అనునది. ఇట్లే హాసగన్నడ మధ్యమ పురుష క్రియా బహువచన ప్రత్యయములు 'ఇరి-ఈరి' అనునవై యున్నవి" (చూడుడు ౧౧౦ IV విమ.) (కాల్డు. ౪౦౩, ౪౦౪ పుటలు).

విమర్శము:—కన్నడ ప్రథమ యందలి 'ఆన్-ఆమ్' అనువాని 'అ' కారము ద్వితీయా ద్యంగములలో 'ఎ'కార మగుననుటకంటె 'గన్నడ ప్రథమయు ద్వితీయా ద్యంగములును దమిళ 'యాన్-యామ్' (నేను-మేము) శబ్ద మూలకము లగుటచే నట్టి 'య' కార పరిణతిచేతఁ గన్నడమున 'ఆన్-ఆమ్' అను ప్రథమయు 'ఎన్-ఎమ్' అను ద్వితీయా ద్యంగములును నేర్పడవలసె ననుట యుక్తము. హాసగన్నడములోని 'ఎమ్మ'=(మా యొక్క) అనుదానికిఁ బదులుగ 'నమ్మ' (మా యొక్క) అనునది వాడఁబడు ననుటకంటెఁ బ్రాచీన కన్నడమందలి 'నాన్-నామ్' అను శబ్దమె హాసగన్నడ ప్రథమయందును ద్వితీయా ద్యంగమందును నిల్చె ననుట యుక్తము. హాసగన్నడ క్రియా ప్రత్యయములలో 'నాన్-నామ్' శబ్దములు నిల్వక పటగన్నడమందు వలెనె తమిళ 'యాన్-యామ్' శబ్ద సంబంధులె ('ఎన్' మొ.) నిల్చెనని గ్రహింపవలెను. హాసగన్నడ ప్రథమా బహువచనమగు 'నావు' అనుదానికి సరిగ 'ఎవు' మున్నగు కన్నడ క్రియా ప్రత్యయము లేర్పడెనను దొరగారి వివరణము సరికాదు. 'ఎవు' అనునది పటగన్నడ క్రియా ప్రత్యయము. అది పటగన్నడ మందలి 'ఎమ్' అను ద్వితీయాది బహువచనాంగమునకు సరిగ నేర్పడెననుట యుక్తము. పటగన్నడ సర్వనామ మకారమె 'వ' కారముగఁ బరిణమించి 'ఎవు' అను క్రియా ప్రత్యయ ముగా నేర్పడెననుట సుసంభవముగా నుండును. కర్ణాట మధ్యమ పురుష బహువచన క్రియా ప్రత్యయము మకార ఘటితము కాక రేఫాంతమగుట వింతయగు ద్రావిడ మధ్యమ పురుష బహువచన 'నీయిర్' శబ్ద మూలకమని తలంపనగును. ఈ రేఫస్థితి తమిళమందువలెఁ బ్రథమా బహువచనమునఁ గన్నడమందు సంభవింపకున్నను గ్రియా ప్రత్యయములందు సంభవించిన దయ్యెను. అట్లే తమిళమందలి 'ఆయ్' అను దానివలెనె కన్నడమందును మధ్యమ పురుషైకవచన క్రియా ప్రత్యయములు 'అయ్' మున్నగునవి యేర్పడెను.

౧౧౩. III విమ:—"తెలుఁగు భాషలోను, దమిళమందు వలెనె మధ్యమ పురుష బహువచన సర్వనామమందు మకారము నిల్వక రేఫమె నిల్చును. తమి—నీయిర్-తెల్గు—మీరు-ఈరు. 'ఈరు' అను రూపము గ్రాంధికాంధ్ర మందు మాత్రమె నిల్చును. తమిళ కన్నడములందువలెనె తెల్గునందును మధ్యమ పురుష బహువచన క్రియా ప్రత్యయము రేఫ రూపమై యుండును" (చూడుడు ౧౦౭ V విమ. ౧౧౦ IV విమ.) (కాల్డు. ౪౦౪, ౪౦౫ పుటలు).

"తెలుఁగు భాషలో నుత్తమ పురుష బహువచన క్రియా ప్రత్యయ గత 'మ' కారము కన్నడమందువలె 'వ' కార పరిణతి నందలేదు. 'అము-ఆము-ఎము-ఏము' అనునవి తెల్గున నుత్తమ పురుష బహువచన క్రియా ప్రత్యయములు. భూతార్థక క్రియాగత 'తి' ప్రత్యయ శక్తిచేతఁ దెల్గున నుత్తమ పురుష బహువచన క్రియా ప్రత్యయము 'ఇమి' అని యేర్పడెను. తెలుఁగు మధ్యమ పురుష బహువచన క్రియా ప్రత్యయములగు 'అరు-ఈరి-ఎరు-ఏరు-ఉరు-రు' అనువానిలో 'మీరు' శబ్ద సంబంధి రేఫమే ముఖ్యావయవము. తెల్గులోని యాత్మార్థక సర్వనామ ప్రథమా బహువచనము 'తాము' అనుదానికి 'తమరు' శబ్ద సంక్షేపరూపమగు 'తారు' శబ్దము రూపాంతరము. మధ్యమ పురుషము నందువలెనె యీ యాత్మార్థకమునందును ద్వితీయాది బహువచనాంగములలో రేఫము నిల్వలేదు. మకారమె నిల్చును. ఉదా:—మీ చేత, తమ చేత. తమ యొక్క— మొ" (చూడు ౧౧౨ I విష).

"తెల్గున 'మా-మీ' అనునవి ద్వితీయాది బహువచనాంగములై వెలయుచున్నవి. వీని ద్వితీయా బహువచన రూపములు 'మమ్ము-మము. మిమ్ము-మిము' అనునవి తమిళ కన్నడపద్ధతులనే వెలయుచున్నవి. తృతీయాది బహువచనాంగములు 'మా-మీ' అనునవి తమిళ కన్నడ విలక్షణరూపములు. ఇట్టి 'మా-మీ' అను సంగము లర్వాచీనములనియుఁ బురుషబోధక సర్వనామ బహువచన రూపముల తుదిని మకారము నిల్చుట సహజము ప్రాచీన స్థితియు ననియు నెఱుంగనగును".

"తెలుఁగు 'మేము-మీరు' అను స్థలములందుఁ బదాది నకారము మకారమగుట యొక వింత. బహువచన ద్యోతక 'మ' కారము రేఫమును వాని తుదిని జేరుటచేత 'నేము-నీము-నీరు (నీయిర్)' అను రూపము లేర్పడుటకు మాఱుగా 'మేము-మీరు' అను రూపము లేర్పడుట యెట్లు? ఈ పదాది మకారము ప్రాచీన సర్వనామ శబ్ద మూలరూపగతమని నేను తలంపను. ఒక పక్షమున నొక్క యుత్తమ పురుష సర్వనామము మకార రూపమున నున్నచో నది సంస్కృత, సిథియను భాషలలోవలె (చూడు ౧౦౯ II, III-విష) మూల రూప గతమనిన, ననవచ్చు నేమో? కాని మధ్యమ పురుష సర్వనామమును 'మ' కార రూపమె యగుటచేత నట్టి యూహ పొసఁగనేరదు. మఱియు బెహిస్తను ఫలకగత సిథియను భాషలలోను 'చీనా' మున్నగు భాషలలోను 'నీ' శబ్దమె వెలయుచున్నది. (చూడు ౧౧౧ II విష). కాన నెల్లభాషలలోను నెక్కుడు శ్రుతిహితమగు తెలుఁగున 'న' కారము మకారముగఁ బరిణమించుట చేత 'నేము-నీము' అను వాని 'న' కారమునుండియె 'మేము-మీరు' మున్నగు వాని పదాది మకార మేర్పడెనని తలంపనగును. ఇట్లు క్రియాప్రత్యయముల

లోను బ్రథమా బహువచన రూపములలోను రేఫము నిల్చియున్నను ద్రావిడ పురుషబోధక సర్వనామ బహువచన ద్యోతకము మకారమే యనుట నిశ్చయము. 'నీవు-మీరు' అనువాని పదాది హల్లు వైకల్పికముగా లోపించుటయుఁ గలదు. ఉదా:—నీవు=ఈవు. మీరు=ఈరు" (కాల్డు. ౪౦౫, ౪౦౬ పుటలు).

విమర్శము: — కాల్డువెల్లుగారి హృదయమున నాధునిక వ్యావహారిక భాషారూపములు బలముగా నెలకొనియున్నవి. కాన ననావశ్యకములగు నాధునిక వ్యావహారిక రూపముల నాశ్రయించిన ప్రసంగము లధికముగఁ జేయు చుందురు. ప్రాచీన కర్ణాటమున 'నీ-నా-తా' శబ్దముల బహువచన 'మ' కారమునకు 'వ' కార పరిణతి లేదు. ఉదా:—నీమ్-నామ్-తామ్=(మీరు-మేము-తాము). ఇట్టి స్థితిలోఁ గన్నడమున వలెఁ దెల్గునందును 'మ' కారమునకు 'వ' కార పరిణతి లేదను దొరగారి వ్రాఁత యెట్లు పొసఁగును? అర్వాచీనమగు హాళన గన్నడములోని 'వ' కార పరిణతి ప్రాచీనాంధ్రమున లేదని చెప్పుట సుసంగతమగునా? నవీన కర్ణాటమున 'నామ్' మున్నగునవి 'నావు' మున్నగురీతిని 'వ' కార పరిణతి నందినమాత్రమునఁ గర్ణాట సామాన్యముగా వకార పరిణతి గలదని వచించుట యర్హమా? ప్రాచీన తమిళాంధ్ర కర్ణాటముల సంబంధము పరిశీలింపవలసిన యీ శాస్త్రమున నాధునిక పరిణామములను బ్రదర్శించుట యెట్లు సుప్రసక్తమగును? తెల్గునందలి యుత్తమ మధ్యమ పురుష క్రియా ప్రత్యయములను జూపుటలో 'ఈరి-ఏరు-ఏము' మున్నగువానిని జూపుట 'చెప్పీరి-చెప్పేరు-చెప్పేము' మున్నగు నధునాతన (వ్యావహారిక) క్రియల నుద్దేశించుట చేతనే కదా సంభవించెను.

'మేము - మీరు - మాచేత - మీచేత' మున్నగుచోటులందలి పదాది 'మ' కారము 'న' కార పరిణామ రూపమేయనియు నట్టి పరిణామమునకుఁ బూర్వ రూపములు 'నేము-నీరు-నాచేత-నీచేత' అను నకార ఘటితములె యనియు దొరగారు తలంచుట సరికాదు. అచట మకారము నకార మూలరూపము నుండి పరిణమించినదికాదు. బహువచన ద్యోతక మకారము ప్రకృతి గత నకారముచో నాదేశముగా నిల్చుటచేత నచటి మకార మేర్పడినది. 'నాచేత-నీచేత' అనునవి బహువచన మూలరూపములనుట కేవలము నయథార్థము; అసంభవమును. 'మేము, మీరు మమ్ము-మిమ్ము-మాచేత-మీచేత' మున్నగు చోటులందలి పదాదిస్థ మ కారమె బహువచన ద్యోతకమనియు 'మేము-మమ్ము-మిమ్ము' మున్నగుచోటులందలి పదాదీతర స్థలగత మకారము ద్రావిడ భాషలందలి యలవాటునఁ జేరిన పునరుక్త బహువచన ప్రత్యయములనియు భావింపవలయును.

'నీవు-మీరు' అను చోటులందేకాక 'నీకు' అను షష్ఠ్యంతమందును బదాది హల్లోపము తెల్గున నవతరించినది. (చూడు వ్యా. సం. ౨౧౯-౨౧౯ I. విష).

౧౧౩. IV విష:—"మకారమే పురుషబోధక సర్వనామ బహువచన ప్రత్యయమగునపుడు నామవాచకములయుఁ బ్రథమ పురుష సర్వనామములయు బహువచన ప్రత్యయమగు రేఫము మధ్యమ పురుష సర్వనామ బహువచన ప్రత్యయమగుట యెట్లు సంభవించెనని యాలోచింపవలసియున్నది. ప్రాచీన ద్రావిడ భాషలో మధ్యమ పురుష సర్వనామ బహువచనమున రేఫ మీఁ క్రింది విధమున నిల్చిన దనఁదగును. మధ్యమ పురుష బహువచనమగు 'నీయిర్' అను దానికి 'నీ=నీవును, ఇర్=వీరును' అని యర్థము. 'ఇ' అను సర్వనామమునకు సమీపస్థవస్తు వర్థముగాన 'ఇర్' అనునది సమీపస్థజనుల కర్థమగుట సుసంభవ మగుచున్నది. మఱొకమార్గము:—'నీయిర్' అనుదానిలోని 'ఇర్' అనునది ద్విత్వవాచకము. కాన 'నీ+ఇర్=రెండు నీవులు' అను నర్థము లభించును. కాలక్రమమున నిట్టి ద్విత్వము బహువచనము గావచ్చును. ఈ రీతిని సైతము వ్యుత్పత్తి చెప్పవచ్చును. ఇట్లు తమిళమున 'నీయిర్' అనియు, దెల్గున 'మీరు' అనియు రేఫము నెలకొన్నది. వీని మూలముననే తమిళ కన్నడాంధ్రములు మూఁటిలోను గ్రియా ప్రత్యయములు రేఫరూపము లయ్యె ననఁదగును" (కాల్డు. ౪౦౬, ౪౦౭ పుటలు).

విమర్శము:—ఇట్టి రేఫస్థితి తమిళ కర్ణాటాంధ్ర తుళు-కు-కోత భాషలలో వ్యాపించినది.

౧౧౩. V విష:—"బహువచన మకార చరిత్రము:—ద్రావిడ భాషల లోని 'ఉమ్' శబ్దము సముచ్చయార్థకము. బహువచనము వ్యక్తుల సముచ్చయముచేత నేర్పడున దగుటచేత 'ఉమ్' శబ్దము బహువచనార్థక మగుట సుసంభవము. (చూడు ప్రార్థనార్థక క్రియలు ౧౩౬ III విష.) ఉదా:— నా+ఉమ్=నామ్. నీ+ఉమ్=నీమ్. తా+ఉమ్=తామ్. సముచ్చయాద్యర్థ విశేష బోధకమగు (చూడు ౧౩౬ III విష.) నియ్యది "తమి-ఉమ్, మల-ఉమ్, హళగన్న-ఉమ్, అమ్ హొసగన్న-ఊ, తెల్గు-ఉ" అను రూపములతో నున్నది. తెల్గునందలి సముచ్చయార్థక శబ్దము కొన్నియెడల 'యు' అనియుఁ గొన్నియెడల 'ను' అనియుఁ బూర్వ స్వరమునుబట్టి యుచ్చారణ సౌకర్యార్థమునకై యేర్పడు చుండును. పై భాషలలోని 'ఉమ్' అనుదాని తుది మకారము నపుంసక సాధక ప్రత్యయము. 'ఉ' అనునది 'అ-ఇ' అను వాని మధ్యస్థితిని దెల్పు నిర్దేశక సర్వనామము. తుళు భాషలో మాత్రము

'లా' అనునది సముచ్చ యార్థకము. ప్రాచీనమగు నీ 'ఉమ్' శబ్దము సంబంధి పదములను జేరియే యుండును. ఇది లాటిను భాషలోని 'క్వె' శబ్దము వంటిది. ఉదా:—తమి-ఎవనుమ్ = (ఎవఁడును) = లాటిను-ఉబిక్వె. తమి-ఎప్పొలుదుమ్=(ఎల్లప్పుడును)-మలయా-ఎల్లావుమ్=ఎల్లా+ఉమ్=(అందఱును)= తమి-ఎల్లామ్. దీనిని వైయాకరణు లమహద్బహువచనమందురు. దీని స్త్రీ పుం సాధారణ రూపము-ఎల్లారుమ్. తమిళ కావ్యములలో 'ఎలామ్' అనునది యుత్తమ పురుష సర్వనామ బహువచనముగ వాడఁబడును. ఇందు 'ఆమ్' అనునది 'మేము' అను నర్థమునఁ జేరియుండును. ఇట్లిది సర్వార్థక సర్వ నామరూపములలో బహువచన ద్యోతకమగునపుడు పురుష బోధక సర్వనామ ములలో మాత్ర మట్టిది యేల కారాదు. కొన్ని ద్రావిడ క్రియలయందును నీ 'ఉమ్' అనునది బహువచన ద్యోతకమై యున్నది. ఉదా:—తమి-చెయ్‌గు= (చేయఁగలను). చెయ్‌గుమ్=(చేయఁగలము). చెయ్‌దు=(చేసితిని). చెయ్‌ద్+ ఉమ్ = చెయ్‌దుమ్ = (చేసితిమి). కేళ్ =(వినుము). కేళుమ్ = (వినుఁడు). ఇది తమిళ వ్యావహారిక రూపము. పూజ్యార్థక బహువచనముగాఁ దఱచుగా వాడఁబడును. కేళుఙ్గళ్ =(వినుఁడు). తెల్గు-ఏకవ-రా. బహు-రమ్ము= పూజ్యార్థక బహువచనము. తమిళ ప్రార్థనార్థక బహువచనమగు 'ఉమ్' అనునదిగాని తెల్గులోని విధ్యాద్యర్థక మధ్యమ పురుషైక వచనమగు 'ము-మ్ము' అనునది గాని తమిళ మధ్యమ పురుష సర్వనామ ద్వితీయాది బహువచనాంగ మగు 'ఉమ్' అనుదాని కభిన్నమని నిరూపించుటకుఁ దృప్తికరములగు యుక్తులు చాలవు గాని యట్టి తమిళ మధ్యమ పురుష సర్వనామ ద్వితీయాది బహువచ నాంగమగు 'ఉమ్' అనునది 'నీ-నా-తా' శబ్ద బహువచన ప్రత్యయముల కభిన్న మగుటకు సందియము లేదు.

ఓస్ట్రియాకు భాషలోని ద్వివచన విభక్తి ప్రత్యయమగు 'క=గ=గై' అనునది యా భాషలోని సముచ్చయార్థకమగు 'క (లేక) కి' అను దానినుండి వచ్చినదే యని 'కాడ్రైన్' దొరగారు చెప్పిరి" (కాల్డు. ౪౦౭, ౪౦౮ పుటలు).

"మకార రూపద్రావిడ బహువచన ప్రత్యయమునకు ద్రావిడేతర భాషా సంబంధములు:—'మ' కారము 'న' కారముగా మాఱుట సహజమగుటచేత బహువచనము తుది నెందేని 'న' కారముండునపు డది 'మ' కారము వంటిదేయని భావింపవలయును. అట్లైనచో 'మ' ప్రత్యయ సదృశములు పెక్కు చూపట్టును.

| | |
|---|---|
| నన్ =(మేము) బ్రహుయి భాష. | తన్ =(మేము)-పెరిషియన్ భాష. |
| అనాన్ =(మేము) చాల్డీ భాష. | మిమికెన్ =(మేము) బెలూచి భాష. |
| మెన్ =(మేము) ఓస్ట్రియాకు భాష. | (మెనిక్ = నేను). |

సిధియను భాషలలో స్వరముల మార్పుచే నేకవచన బహువచన భేదము ద్యోత్య మగును. ఉదా:—మంచు భాష:—బి=(నేను) బె=(మేము). మాగియార్ భాష:—తె=(నీవు). తి=(మీరు). ఓస్టియాక్ ఫిన్నిషు భాషలు:—మ=(నేను). మె=మెన్=(మేము)" (కాల్డు. ౪౦౯ పుట).

<u>విమర్శము:—సముచ్చయార్థక శబ్దము బహువచన</u> ప్రత్యయమగుట సుసంభవమె యనవచ్చును. కాని తెల్గున సముచ్చయార్థకరము 'ఉ' అనునది మాత్రమె యను దొరగారి వ్రాఁత సరికాదు. 'ఉన్' శబ్దము తెల్గు సముచ్చయార్థకము. (చూడు 'వ్యా. సం.' ౮౪ విష). (చూడు ౨౪ IV విష). ఇట్లు సముచ్చ యార్థకము 'ఉన్' అనెడి నాంతమును నుండుటచేత బహువచనము నాంతమగుటయుఁ గొన్నియెడల సంభవింపవచ్చును. 'ఎలామ్' అను శబ్దము తొల్కాప్పియ సమ్మతము కాదు. తెల్గున 'రా' అనునది మాత్రమె ప్రార్థనాద్యర్థకైక వచన రూపమనియు దాని బహువచనము 'రమ్ము' అనునది. యనియు నది పూజ్యార్థమున నేకత్వ విషయమున వాడఁబడుననియు వ్రాసిన దొరగారి వ్రాఁత సరికాదు. తెల్గున-'రమ్ము' అనుదాని రూపాంతరము 'రా' అనునది. కాన నవి రెండును ప్రార్థనాద్యర్థకైక వచన పర్యాయ రూపములె.

ఈ సముచ్చ యార్థకమగు 'ఉమ్' అనునది యిండో జెర్మానికు భాషల సంబంధమైన దనుచు నీ క్రింది రీతిని 'ఆం. భా. చ.' కర్తగారు వ్రాసిరి. "ద్వంద్వ సమాసములలో రెండవయవములకును సముచ్చయ చిహ్నమును జేర్చుట ఐరేని యను భాషలో ప్రాచీన అవెస్తా భాషలో నున్నది. ఋగ్వేదము నందును ద్వంద్వ సమాసములలోని రెండవయవములును ద్వివచనమున నుండుటయే సర్వసాధారణముగాఁ గాన్పించుచున్నది......సంస్కృత భాషయందు 'ఔ' అనునది ప్రథమా ద్వితీయా ద్వివచన ప్రత్యయము. కాని ప్రాచీన వేద భాషయం దది 'ఆ' గాని 'ఔ' గాని యై యుండెను......'ఆ' అనునది సమాసము మొదటి యవయవమునకుఁ జేరుచుండెను. ఉదా:—మిత్రావరుణౌ-సూర్యా చంద్రమసౌ. మొ.......నేఁటి ఇండో ఆర్యభాషలలో 'ఔ'కు సరిపోవు సముచ్చయ చిహ్నములు గలవు. హిందీ-అఉ. ఒటియా-ఆఉ...... ఈ 'ఉ' అనునదియే అనునాసికత్వమును బొంది 'ఉ-ఉమ్'-లుగా మాఱి యుండవచ్చుననియు ఆ 'ఉమ్' ద్రావిడ భాషలయందు సముచ్చయ చిహ్నమైనదనియు......స్వామినాథ అయ్యరుగా రభిప్రాయపడినారు" (ఆం. భా. చ. ౧౧౩౭, ౧౧౩౮ పుటలు). 'ఔ' నుండి 'ఉమ్' పుట్టినదనుట కేవలము నసంభవము. అందును నేఁటి యుత్తర హిందూస్థాన భాషల 'ఔ' లోని యొక భాగమగు 'ఉ' కారమునుండి ప్రాచీనతమ కాలపు 'ఉమ్' శబ్దమేర్పడెననుట

బ్రాత్తిగా నసంభవము. కాన నీ యూహాలు గ్రాహ్యములు కావు. (చూడు ఆం. భా. వి. ౮౫౦ పుట).

౧౧౩. VI విష:—"బహువచన ప్రత్యయ మకారమున కిండో యూరపియను భాషల పోలికలు:—ఉత్తర హిందూస్థాన భాషలలో నేకవచనమున 'స-న' లుండును. బహువచనమున 'మ' కారము నిల్చును.

మైఞ్ =(నేను) హమ్=(మేము). } హిందీ భాష.
తూ = (నీవు) తుమ్ = (మీరు). }
తూన్
తైన్

హూన్ = (నేను)—హామె=(మేము) } గుజరాథీ భాష.
తూన్ = (నీవు) — తమె = (మీరు) }

తూన్=(నీవు) — తుష్మి=(మీరు). మరాటి భాష.

'తోమ=తుమి' — ఇవి బెంగాలీ భాషలోని మధ్యమ పురుష సర్వనామ బహువచన ద్వితీయాద్యంగములు.

తుమ్భ=తుమ్భమానే=(మీరు)—ఉరియా భాష. '(తుమ్భమానే' అనునది ద్విరుక్త బహువచనము).

తుమ్హే=(మీరు)—అమ్హే=(మేము). పాళీ ప్రాకృత జన్య గౌడ భాషలు.

షుమా=(మీరు) హాస్తేమ్=(ఉన్నాము) నవీన పెరిషియన్ భాష.

౧౮౭౨ సం॥ నవంబరు-ఇండియన్ ఏంటిక్వైరీలోని 'బీమ్సు' గారి వ్యాసమునుండి యెత్తి వ్రాసినవి:—

హోమ్=(మేము)—బెంగాలి. (నవీన బెంగాలి. 'ఆమి')

హామ్=(మేము). హిందీ భాష. ఇది వింతయగు రూపము. ఉత్తర హిందూస్థాన భాష లేడింటిలో దీని మూల పదము ప్రాకృతము 'అమ్హే' అనునది.

అమ్భే=హామే=(మేము) ఉరియా భాష" (కాల్డు. ౮౯, ౮౧౦ పుటలు).

ఏకవచన బహువచన
ఎగోన్-తౌన్. } హేమీాస్ } గ్రీకు భాషలోని రూపములు.
ఎగోనే-తౌనె. } హుమీాస్ }

వీనిలోని "'హేమీాస్' అను దానితోఁ దెలుఁగు 'ఏము' శబ్దమును 'హుమీాస్' అనుదానితోఁ దమిట మధ్యమ పురుష ద్వితీయాది బహువచనాంగ మగు 'ఉమ్' శబ్దమును సరిపోల్చి చూచునది. గ్రీకు—పెరిషియను—గారియను భాషలలో (గారియను=ఉత్తర హిందూస్థాన వ్యావహారిక భాషలు) బహువచన

'మ' కారము మధ్యమోత్తమ పురుషములలోనె నియతముగా నున్నది" (కాల్డు. ౪౧౦ పుట).

"గోవరు దొరగారీ యార్య ద్రావిడ బహువచన మకారములకు నిశ్చయమైనట్టియు సన్నిహిత మయినట్టియు సంబంధము గలదని వ్రాసిరి. డా. పోపు దొరగారు తమ 'తుద' వ్యాకరణములో 'ఓమ్' అను 'తుద' భాష శబ్దమునకు సంస్కృత 'వయమ్' శబ్దముతోను గ్రీకు—'హేమీాస్ — అమ్మెస్' అనువాని తోను, వైదిక సంస్కృత:—'అస్మే' శబ్దముతోను సంబంధము లేదనుటకు వీలులేదని నిశ్చయించిరి. వీరు 'వయమ్' శబ్దము నిందుదాహరించుటే వీరి వాదపు బలహీనతను దెలుపుచున్నది. 'వయమ్-యూాయమ్-అహమ్-త్వమ్-స్వయమ్' అనువానిలోని 'అమ్' ప్రత్యయము నపుంసకలింగైకవచన ప్రత్యయమనియు, వీనిలోఁ గొన్నిటిలోనిది యేకవచన ప్రత్యయమైనను బహువచనార్థము నిచ్చుననియు నీవఱకు వ్రాసియే యున్నాను. అట్లయినను గొన్ని బలమైన పోలికలు (ఆర్య ద్రావిడ భాషల బహువచన 'మ' కారములకు) లేకపోలేదని నేనంగీకరించుచున్నాను.

| ద్రావిడ భాషలు. | | ఇండో యూరపియన్ భాషలు. |
|---|---|---|
| ఆమ్=(మేము)—కన్నడ<br>యూామ్=(మేము)—తమిళ | = | అమ్మెస్=(మేము) గ్రీకు భాష.<br>అస్మే=(మేము) వైదిక సంస్కృత భాష. |
| ఆమ్=(మేము) కన్నడ భాష | = | హామ్=ఆమీా=(మేము) బెంగాలి. |
| ఉమ్=తమిళ మధ్యమ పురుష ద్వితీయాద్యంగము | = | ఉమ్మెస్=(మీారు) గ్రీకు భాష. యుష్మే=(మీారు) వైదిక సంస్కృత భాష. తుమ్-(మీారు) హిందీ భాష." |

(కాల్డు. ౪౧౦, ౪౧౧ పుటలు).

"ఇట్టి పోలికలున్నను రూప సాదృశ్య మాత్రమునుబట్టి శబ్దముల సంబంధమును నిర్ణయింపరాదనియు వాని ప్రాచీన చరిత్రమును బరిశీలింపవలయుననియు నా యభిప్రాయము. ప్రాకృతములనుండి యుత్తర హిందూాస్థాన నవీన గౌడ భాష లేర్పడకముందె యనేక శతాబ్దములకుఁ బూర్వమున ననఁగా దమిళులును గోదులును నొక్క సంఘమువారుగ నున్నకాలమందును బయి ద్రావిడ భాషల బహువచన 'మ' కారము మకారముగనే యుండెడిదనుటకు సందియము లేదు. (ఎల్ల ద్రావిడ పురుష బోధక సర్వనామ బహువచనము

లందును నప్పటినుండియు 'మ' కారము వ్యాపించియున్నదని భావము) 'హేమీస్' 'హుమీస్' అను గ్రీకు శబ్దములు ప్రాచీన బహువచన రూపములు కావు. 'డోరికు-ఇయోరికు' అను గ్రీకు మాండలిక భాషా భేదములలో 'హామెస్-అమ్మెస్-అమ్మె' అనునవి వాడఁబడుచున్నవి. 'హుమీస్' అనుదానికి బదులుగా 'హుమెస్-ఉమ్మెస్-ఉమ్మె' అనునవి వాడఁబడుచున్నవి. ఇక్లె పయినుదాహరించిన యుత్తర హిందూస్థాన భాషల శబ్దములలో 'అమ్హే' అనునదియు, 'తుమ్హే' అనునదియుఁ బ్రాచీనము లనఁదగును. కాఁగా 'హేమీస్-హామెస్-అమ్మె-అమ్హే' అనురీతిని, 'హూమీస్-హుమెస్-ఉమ్మెస్-ఉమ్మె' (జండు భాష-యూషెమ్-ద్వితీయాద్యంగము-యుష్మ-యూస్మ) 'తుమ్హే' అనురీతిని, నుత్తరోత్తర ప్రాచీనతను బరిశీలించి 'అమ్హే' అనునది 'అస్మే' (మేము) అను వైదిక సంస్కృత శబ్దమునుండియు, 'తుమ్హే=(మీరు)' అనునది 'తుస్మే=యుస్మే=(మీరు)' ('తుస్మే' నుండి 'యుస్మే' యవతరించును) అను వైదిక సంస్కృత శబ్దమునుండియు నేర్పడి యుండునని తలంపనగును. 'మస్మే-అస్మే-అమ్హే' అనియు, 'తుస్మే-యుస్మే-తుమ్హే-ఉమ్హె' అనియు వాని పరిణామ క్రమము నరయునది. 'అస్మే'=(మేము) 'యుష్మే' (యుస్మే శబ్దస్థానీయము)=(మీరు) అనునవి రెండిటిలోను 'స్మ+ఏ' అను భేదము నంగీకరించి 'ఏ' అనునదే బహువచన ప్రత్యయమనియు 'స్మ' అనునది యర్థదార్ఢ్యమునకై చేరిన 'స్వయమ్' శబ్దార్థకమగు నవ్యయమనియు గ్రహింపవలయును. 'స్మ' అనునది సంస్కృతమున నవ్యయము. వర్తమానార్థక క్రియతోఁ జేర్చి దీనిని వాడినచో నది భూతార్థము నిచ్చును. ఈ 'స్మ' శబ్దము వైదిక సంస్కృతమందలి 'అస్మే-యుస్మే' అను బహువచన శబ్దములందే కాదు; ఎల్ల సర్వనామములందును 'చతుర్థీ-పంచమీ-సప్త' ముల యేకవచనములు పరమగు నపుడును నీయది వాని నడుమ నిల్చును. (సర్వస్మై-సర్వస్మాత్-సర్వస్మిన్).

ఇట్టి స్థితి నరయఁగా నీ 'స్మ' శబ్దము 'స్వయమ్' శబ్దార్థకమగు (ఆత్మార్థక 'తా' శబ్దమువంటిది) ప్రథమ పురుష సర్వనామమనియు నర్థదార్ఢ్యమునకై చేర్పఁబడుచుండుననియుఁ (చూడుడు ౧౧౨ విషయమెల్లను) దోఁచుచున్నది. తమిళ కావ్యములలో నాత్మార్థక 'తా' శబ్ద మిట్లు చేరుట గలదు. (మరమ్+తన్+ఐ=మరన్దనై=చెట్టును) (చూడుడు ౧౧౨ V విష). బాపు దొరగారు జండు భాషలోని 'త్వహ్మి' = (నీయందు) అను నేకవచనమందును, గాథికు-లాటిను భాషలలోని యేకవచనమునందును నీ 'స్మ' శబ్దము కన్పట్టుచున్నదని సంశయించిరి. ప్రాచీన వ్యావహారిక సంస్కృత మనఁదగు ప్రాకృతమందు 'మమస్మి=మమమ్మి=(నాయందు) తుమస్మి=తుమమ్మి=(నీయందు)' అను రూపములందును నీ 'స్మ' శబ్దము కన్పట్టుచున్నదనుట నిశ్చయము. ఏకవచనపు రూపము

లందుఁ బై 'స్మ' శబ్దపు వాడుక నవ్యయమనియు బహువచన (అస్మే=మేము. యుస్మే=మీారు) రూపానుకరణమున వచ్చి యుండుననియు 'బాపు' గా రూహించిరి. నిర్దేశక సర్వనామములందును సంబంధవాచక సర్వనామములందును బ్రశ్నార్థక సర్వనామములందును నేకవచనమందును బహువచనమందును గన్పట్టు నీ 'స్మ' శబ్దములోని మకారమునకును ద్రావిడ పురుష బోధక సర్వనామ (యామ్-నామ్-నీమ్-తామ్) బహువచన మకారమునకును సంబంధము గలదనుట కేవలము నసంగతమనుటకు సందేహము లేదుగదా" (కాల్డు. ౪౧౧ మొ. ౪౧౪-వ పుటలు).

విమర్శము:—డా. పోపుదొరగారును గోవరు దొరగారును జూపిన యిండో యూరపియను బహువచన మకారమునందు ద్రావిడ సర్వనామ బహువచన 'మ' కారపు పోలికలు విశ్వసనీయములు కావనుట సత్యమె. ఉదా:—బెంగాలీ-హామ్-ఆమి=కన్నడ-ఆమ్-(మేము). గ్రీకు-హేమీాస్=తెల్గు-ఏము. గ్రీకు-హుమీాస్. తమిఴు-ఉమ్. మొ. 'యామ్' అను ప్రాచీన ద్రావిడ శబ్దమునుండి యవతరించిన 'ఏమ్' శబ్ద మెక్కడ? ద్రావిడ భాషల మూల భాషతో సంబంధముగల యిండో యూరపియను భాషల పరిణామముల పరిణామములగు 'హామ్-ఆమి' మున్నగు నర్వాచీన శబ్దము లెక్కడ? ఇట్లె తమిఴములోని 'నుమ్' అను యుష్మ దర్థక సర్వనామ ద్వితీయాది బహువచ నాంగము నుండి యాధునికముగా నేర్పడిన 'ఉమ్' అను తమిఴ ద్వితీయాది బహువచ నాంగ మెక్కడ? గ్రీకు-'హుమీాస్' హిందీ-'హుమ్' గుజరాథి 'తుమ్' మున్నగు 'యుస్మే' అను వైదిక సంస్కృత పరిణామ పరిణామము లెక్కడ? ఇట్టి యాదృచ్ఛిక సాదృశ్యముల ప్రదర్శనము స్థూలదృష్టికి వినోదముగాఁ గనంబడినను గ్రంథ విస్తృతి తప్ప విమర్శన దృష్టికి ఫలము కానరాదు.

'స్మ+ఏ=స్మే' అను దొరగారి ఛేదము సంస్కృత సంప్రదాయ విరుద్ధము గాన 'స్మ+ఇ=స్మే' అని వైదిక సంస్కృత-'అస్మే' యుస్మే' శబ్దములచోట ఛేదము చేయుట యుక్తము.

"స్మ-అవ్యయ-(స్మి-ధాతు-'డ' ప్రత్యయ). అతీతే. పాదపూరణేచ" (శబ్దస్తో).

"స్మ-అవ్యయ-అతీతే-పాదపూరణే. ప్రసిద్ధే......" (శబ్దార్థచిం) అను కోశముల చొప్పున 'స్మ' శబ్దము పాదపూరణార్థక మగుటచేత "అస్మే-యుస్మే-సర్వస్మై-సర్వస్మాత్-సర్వస్మిన్" మున్నగు చోటులందు స్వార్థికముగనె ప్రకృతికిని విభక్తి ప్రత్యయమునకును నడుమ నిల్చెననుట లెస్స. ద్రావిడ 'తా' శబ్దము వలెనె యీా 'స్మ' శబ్దమును నాయాస్థలములం దర్థవిశేషశూన్యమై నిల్చుట వింతకాదు (చూడుఁ ౧౧౨ విషయమెల్లను).

పరిశీలింపఁగా 'అస్మే-యుష్మే' అనువానిలో 'స్మ' శబ్దమును ఛేదించుట సరికాదని తోఁచుచున్నది.

'లట్ స్మే' (3-౨-౧౧౮)-'లిటోఽపవాదః-యజతిస్మ యుధిష్ఠిరః' (సి. కౌ. ౨౭౭౮ సూ.). "స్మేత్యవ్యయమ్. తద్యోగే లిడ్విషయే లట్ స్యాదిత్యర్థః. 'స్మ' శబ్దో భూతకాలద్యోతకః." (బాలమనోరమా వ్యాఖ్య). అను చెప్పఁబడిన భూతార్థక 'స్మ' శబ్దమునకును 'అస్మే=(మేము), యుష్మే=(మీరు), అస్మత్=(నావలన),' మున్నగు వానిలోని 'స్మ' శబ్దమునకును సంబంధమున్నట్లు కనబడదు.

'త్వ మౌ వేకవచనే' (౭-౨-౯౭)="ఏకస్యోక్తౌ యుష్మ దస్మదో ర్మపర్యన్తస్య 'త్వ-మౌ' స్తో విభక్తౌ." (సి. కౌ. ౩౨౯ సూ.) 'మపర్యన్తస్య' అనుటచేత 'త్వద్-మద్' అనునవి యేకవచనమున నేర్పడునని విశదమగుచున్నది. 'అస్మద్-మద్, యుష్మద్-త్వద్' అను శబ్దములను బరిశీలించునపుడు 'మద్-త్వద్' అనునవె సర్వనామ రూపములనియుఁ, ('యుస్వద్' అనునది 'యుష్మద్' అని కానోపును) బరిశిష్టభాగము బహువచన ద్యోతక మనియుఁ దోఁచకమానదు. 'అస్మే-యుష్మే' అనువానిలోని 'మే' అనునది 'మద్' అనుదాని రూపమే యని చెప్పనగును.

యుష్మ దస్మ చ్ఛబ్దముల బహువచన రూపములందలి 'స్మ' అను దానికిని సర్వనామములందెల్ల నేకత్వమునఁ జతుర్థ్యాదులలో వచ్చు 'స్మ' శబ్దమునకును సంబంధము లేదని తోఁచుచున్నది.

౧౧౩. VII విష:—"ఉభయార్థక సర్వనామము:—ద్రావిడోత్తమ పురుష బహువచన సర్వనామములెల్ల నట్టి బహువచనార్థమందె కాక పూజ్యార్థమందును వైకల్పికముగ (ఇంగ్లీషులో 'we' శబ్దము రాజులచేతను సంస్కర్తలచేతను వాడుకొనఁబడుచున్నట్లె) వాడఁబడుచున్నవి."

"ద్రావిడోత్తమ పురుష సర్వనామ బహువచనమున 'మేము-మనము' అను నర్థభేదముగల రూపములు కన్నడమందుఁ దప్పఁ దక్కిన యన్ని ద్రావిడ భాషలందును గలవు. వక్త తనతో నెదుటివారిని జేర్చి వచించునపుడు మనము శబ్దమువంటి యుభయార్థక సర్వనామము (Inclusive plural) వాడఁబడును. ఎదుటివారిని బృథక్కరించి తన్నుమాత్రమె యుద్దేశించునపుడు 'మేము' శబ్దమువంటి యుత్తమ పురుష బహువచన సర్వనామము (Exclusive plural) వాడఁబడును. 'గుజరాథి-మరాథి' భాషలలో సైత మిట్టి యుభయార్థక సర్వనామము గలదు. ఉదా:—గుజ-హమే=(మేము) ఆపనే=(మనము). ఉత్తర హిందూస్థానభాషలం దిట్టి యుభయార్థక సర్వనామ వ్యవహారము ద్రావిడ భాషలనుండి లేదా యార్యేతర భాషలనుండి సంభవించెను. ఇట్టి యుభయార్థక సర్వ

నామము సంస్కృతమందుఁగాని తక్కిన యిండో యూరపియను భాషలందుఁ గాని లేదు. ఈ యుభయార్థక సర్వనామ వ్యవహారము సిథియను భాషలకు సహజమగుచు ద్రావిడ భాషలకు వానితోఁగల సంబంధమును నిర్ణయించు విషయములలో నొకటియై యున్నది. మధ్యాసియాలోని యెల్ల భాషలలోను నిట్టి యుభయార్థక సర్వనామము గలదు. ఉదా:—మంచు భాష:—'ము'=(మేము). 'బె'=(మనము). మంగోలియా భాషలోను నిట్టి వాడుక గలదు. చీనాదేశములోని యుత్తరభాగపు భాషలలో సయిత మిట్టి వాడుక కలదు. ఉదా:—'త్సమెన్'=(మనము). 'వొమెన్'=(మేము). ఈ భేదము 'పొలి నీషియన్ భాషలలోను నమెరికాదేశపు భాషలు పెక్కిటిలోను నాస్ట్రేలియనుల చిన్నచిన్న తెగల భాషలలోను గలదు" (కాల్డు. ౪౧౪, ౪౧౫ పుటలు).

"ద్రావిడ భాషలన్నిటియందును 'మేము మనము' అను వాని యర్థముల నిచ్చు శబ్దము లభిన్నములు కావు. ఉదా:—వ్యావహారిక తమిళు:—నాఙ్గళ్=(మనము). ('దీనికి 'మనము' అను నర్థము లేదు'. శ్రీ రెడ్డిగారు) మలయా-నాఙ్గళ్=నాఙ్ఙళ్=(మనము). (చూడుఁ ౧౧౩ I విష. కాల్డు). తుళు:—ఎన్కుళు=(మనము). ; తెలుఁగు-మనము. (తమిళమందువలె 'మేములు' అనురూప మవతరింపలేదు.) కుభాష:—ఆజు=(మనము). దీని ద్వితీయాద్యంగము 'అమ్మా' అనునది. తెనుఁగు మనము శబ్దపు ద్వితీయాద్యంగము:—'మన' అనునది. ఇది 'మేము' శబ్దపు ద్వితీయాద్యంగమగు 'మా' అనుదాని కుచ్చారణార్థకాగమము చేరుట చేతఁగాని 'మా' శబ్ద ద్విరుక్తిచేతఁ గాని యేర్పడి యుండును" (కాల్డు. ౪౧౫ పుట).

విమర్శము:—సంస్కృతమునఁ బూజ్యతయందేకాక రాజులు మున్నగు వారి విషయమునసేకాక సామాన్యముగ నస్మచ్ఛబ్దమున కేకత్వమందు వైకల్పిక ముగ బహువచనము నిల్చును.

'అస్మదో ద్వయోశ్చ' (౧-౨-౫౯)=ఏకత్వే ద్విత్వేచ వివక్షితే అస్మదో బహువచనం వా స్యాత్. ఉదా:—'వయం బ్రూమః = అహంబ్రవీమి.' (సి. కౌ. ౮౧౮ సూ.) దీని ననుసరించి నేఁటి తెల్గువారు తెల్గునందును నిట్లు ప్రయోగించుచున్నారు. కాని తెల్గునఁ గొంత యౌచిత్యము పాటించుట మహాకవి సంప్రదాయమై యున్నది (చూడుఁ 'వ్యా. సం.' ౨౧౧ IV విష). 'క్వచిత్ స్వస్య భవే దిష్టా । రుచిః స్యా ద్యది మానసే' అని యథర్వణా చార్యులు వచించిరి. (వికృ. అజం. ౮ కారి). (చూడుఁ 'వ్యా. సం.' ౨౧౧ IV విష).

కన్నడమున నుభయార్థక సర్వనామ రూపములు లేవను దొరగారి వ్రాఁత సరికాదు.

'అ ముత్తమ స్యైకవచనా దన్యత్ర' (కర్ణా. భూష. ౨౧౯ సూ.)= ప్రార్థనా ద్యర్థములం దుత్తమ పురుషమున నేకవచనము తప్పఁ దక్కిన చోట్ల ననఁగా ద్విత్వ బహుత్వములందు 'అమ్' అను నాదేశ మగును. ఉదా:— మాళ్పం = మాడువం = (మనము చేయుదము)......కొడువం = (మనము ఇత్తము). మొ. ప్రార్థనాద్యర్థములం దనుటచేత నిట 'మేము చేయుదుము' మేము 'ఇత్తుము' మున్నగు రీతి నర్థము చేయరాదు. ఈ 'అమ్' ప్రత్యయ ముభయకర్తృక ప్రార్థనా ద్యర్థక మె యనక తీరదు. కాని యిట్టి యుభయ కర్తృక క్రియకుఁ గర్తగా నుండఁదగిన యుభయార్థక సర్వనామము 'మనము' అనుదాని వంటిది కన్నడమున నగపడదు. 'ఎమ్=ఎవు' అను దానికి విలక్షణముగా నున్న పైని వ్రాసిన 'అమ్' అను నుభయకర్తృక క్రియా ప్రత్యయమునుబట్టి పరిశీలింపఁగాఁ గన్నడ మందలి 'నామ్-మేము' అనుదాని కుదీచ్యుల పక్షమున 'మేము' అను నర్థమర్వాచీనముగా వెలసినను (చూడు ౧౦౬ IV విభ). దమిళ మందువలెనె 'మనము' అను నర్థము కర్ణాటసామాన్యముగాఁ బ్రాచీనతమ కాలమున నుండెడిదని యాలోచింపవలసియున్నది.

మకరంద వ్యాఖ్యలోఁ గేవలాస్మ దర్థకముగా నుదాహరింపఁబడిన 'నామ్' శబ్దము కర్ణాట భాషా భూషణ-శబ్దమణిదర్పణ-కర్ణాట శబ్దాను శాసనములలో సూత్రింపఁబడలేదు. పై నుదాహరింపఁబడిన కర్ణాట భాషా భూషణములోని యుభయ కర్తృక ప్రార్థనార్థక మనఁదగిన 'అమ్' ప్రత్యయము భూషణమందు వలెనె శబ్దానుశాసన-శబ్దమణి దర్పణములందును గలదు. ఈ 'అమ్' ప్రత్యయము 'నామ్' శబ్దపు సంక్షేప రూపమనియు నుభయార్థకమనియు 'ఎవు' అనునది కేవలాస్మద్బహువచన ప్రత్యయమనియుఁ దోఁచక మానదు.

'ఎవో ర్వమ్' (కర్ణాట శబ్దా. ౪౭౦ సూ.)......'ఆనుమ్ నీనుమ్ ఈ నోమ్పియం మాళ్పం'='నేనును నీవును నీ నోమును జేయుదము' అనియె యీ యుదాహృతి కర్థము చెప్పుట యుక్తము. ఇట్టివి దీని యుభయకర్తృకతను నిర్ణయింపఁ జాలును. (చూడు శబ్దమణి దర్పణము ౨౨౯ ప).

డా. కాల్డువెల్లుగారు 'యామ్-నామ్' అను ప్రాచీన తమిళ గ్రాంథిక రూపములు పర్యాయములును మేము శబ్దార్థకములును బూజ్యార్థక బహువచన ములు ననియు 'నాఙ్గళ్'=(మేము) అనెడి వ్యావహారిక రూపము మాత్రమె యుభయార్థకమనియుఁ బొరపాటుగా (చూడు కాల్డు. ౪౦౨, ౪౦౩ పుటలు—౪౧౫ పుట II పేరా) వ్రాసిరి. ప్రాచీన గ్రాంథిక రూపములలోని 'యామ్' శబ్దము కేవలాస్మదర్థక మనఁగా 'మేము' శబ్దార్థక మనియు 'నామ్' శబ్ద ముభయార్థక సర్వనామమనియు గ్రహింపవలెను. 'నామ్' అనునది పూజ్యార్థక మగు నపుడును నుభయార్థక మె. వ్యావహారిక శబ్దమగు 'నాఙ్గళ్' అనునది కేవలాస్మ

దర్థకము. దీనికి 'మనము' అను నర్థము లేదు. (చూడుము ౧౦౬ II విష. పరిశీ. ౧౧౩ I విష. పరిశీ).

తెల్గు 'మన' శబ్దము 'మా' అనుదాని కుచ్చారణార్థ కాగమము చేరుట చేతఁగాని 'మా' శబ్దద్విరుక్తి చేతఁగాని యేర్పడెనను దొరగారి వ్యుత్పత్తులు సరి కావు. 'మా' శబ్దమును 'మన' శబ్దమును విభిన్నార్థకములు. అస్మ దర్థక 'మా' శబ్దమును యుష్మదర్థక 'నీ' శబ్దమును మేళగించుటచేత నుభయార్థక 'మన' శబ్దమేర్పడియుండుననుట యుక్తము.

సంస్కృతమందుఁగాని తక్కిన యిండో యూరపియను భాషలందుఁగాని యిట్టి యుభయార్థక సర్వనామము లేదని డా. కాల్డువెల్లుగారు వ్రాయుచుండఁగా (కీ. శే.) డా. నారాయణరావు గారీ యుభయార్థక సర్వనామపు వాడుక వైదిక సంస్కృతమునుండియే ద్రావిడ భాషలకు వచ్చినదని వ్రాసిరి.

“'నౌ' అనునది యుష్మ దస్మ దుభయార్థకముగ వేదమునందు సాధారణ ముగఁ గాన్పించుచున్నది.”

I. 'సహ నౌ యశః సహ నౌ బ్రహ్మవర్చసమ్' (తైత్తి-ఆర. ౫-౩) కలసి మన మిద్దఱము యశస్సును-కలసి మన మిద్దఱము బ్రహ్మవర్చస్సును (పొందు దుము గాక).

II. 'సహనావ్ అవతు సహనౌ భునక్తు'

కలసి మనల నిద్దఱను (ఈశ్వరుఁడు) రక్షించుఁగాక. కలసి మనల నిద్దఱను (ఈశ్వరుఁడు) (వరముల) ననుభవింపఁ జేయుఁగాక.

III. 'తేజస్వి నౌ వధీత మస్తు'=మన యిద్దఱకుఁ జదివినది తేజస్వి యగుఁగాక......” (ఆం. భా. చ. ౧౧౪౦ పుట).

'ఆం. భా. వి.' కర్తగారు పయి విషయముల నుదాహరించి “పయి యుదాహరణముల నన్నిటిని సందర్భానుసారముగా అర్థము పరిశీలనము చేసినం గాని నిర్ణయింప వీలులేదు” అని వ్రాసిరి (ఆం. భా. వి. ౪౦౪ పుట). పరిశీలనముం జేసినఁ జేయవలయును గాని యిట్లు నిరసించుట యుక్తమా? డా. నారాయణరావుగారు వేదవాక్యముల కర్థము వ్రాయుటలో 'మనము' అను నుభయార్థక సర్వనామమును బ్రయోగించిరే కాని వేదవాక్యముల కట్టి యర్థమే చేయవలయునన్న యుపపత్తిని జూపలేదు. 'నౌ' అను ద్వివచన మున్నంత మాత్రమున 'మనము' అనునర్థ మెట్లు వచ్చును? 'నౌ' అనునది యస్మ త్ప్రథమా ద్వివచనమే కాదు. I “మమ్ము నిద్దఱను గీర్తియు బ్రహ్మవర్చస్సును గూడుఁ గాక” అని యర్థము చేయుటలో బాధ యేమున్నది? నారాయణ

రావుగారు 'పొందుదుము గాక' అని యస్మత్ కర్తృకముగానే యర్థము వ్రాసిరి గాని యుభయార్థక కర్తృకముగా 'పొందుదము గాక' అని వ్రాయనేలేదు. అట్లే II వాక్యమునకును "మమ్ము నిద్దఱను నీశ్వరుఁడు రక్షించుఁగాక. మమ్ము నిద్దఱను వరముల ననుభవింపఁ జేయుఁగాక" అనియు III వాక్యమునకు "మా యిద్దఱయొక్క చదువు తేజోవంత మగుఁ గాక" అనియు నర్థము చెప్పుటలో బాధ యేమున్నది? ఇట్లె వారి యుదాహృతులలో నొక్కటియు నుభయార్థకత్వమును నిర్ణయింప నేరదు. డా. నారాయణరావుగారికి సాహస మత్యధికము. (చూడు 'వ్యా. సం.' విస్తర ౧౭౧ విభ. విస్తర II ౯౯౯ విభ).

౧౧౪. I విభ:—సాదృశ్య పరిశీలన సుకరత్వమునకయి యిట, డా. కాల్డు వెల్లుగారు ద్రావిడోత్తమ మధ్యమ పురుష సర్వనామముల రూపములను బట్టికలుగా నుదాహరించిరి. అట్టి పట్టిక లీవలకె యాయాభాషల పురుష బోధక సర్వనామముల వివరణ సందర్భమునఁ జూపఁబడి యుండుటచేత నిట మరల నట్టి పట్టిక లుదాహరింపలేదు. చూడుఁడు:—౧౦౬ విషయము II మొ. XIII వ. గల విషయములలో మొట్టమొదటనే యాయా ద్రావిడ భాషా భేదముల యుత్తమ పురుష సర్వనామ రూపముల పట్టికలును, ౧౧౦ I మొ. ౧౧౦ XII వ. విషయముల మొదట ద్రావిడ మధ్యమ పురుష సర్వనామముల రూపముల పట్టికలును నుదాహరింపబడెను. కూర్గు భాషయొక్క పురుష బోధక సర్వనామముల వివరించు పట్టిక లచట లేమింజేసి యవి మాత్ర మిచటఁ జూపఁబడుచున్నవి.

"బాగుగఁ బరీక్షింపఁ బడినట్టియు వ్యాకరణములు గల్గినట్టియు భాషల లోని రూపములు మాత్రమే యీ పట్టికలలోఁ జూపఁబడుచున్నవి.

| కూర్గు భాష | ఏకవచన రూపములు | | | బహువచన రూపములు | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయ | ప్రథమ | ద్వితీయా ద్యంగము | క్రియా ప్రత్యయ |
| ఉత్తమ పురుష రూపము | నన్ | ఎన్ | ఇ-ఉ-ఎ | నఙ్గ-ఎఙ్గ | ఎఙ్గ | అ-ఇ-ఉ |
| మధ్యమ పురుషము | నిన్ | నిన్ | ఇయు | నిఙ్గ | నిఙ్గ | ఇర " |

(కాల్డు. ౪౧౬, ౪౧౭ పుటలు).

౧౧౪. II విష:—"డా. హంటరుగారి కంపారిటీవు నిఘంటులోని మధ్య హిందూస్థాన (ఇండియా) మండలి పదునేడు భాషల యుత్తమ పురుష సర్వ నామ రూపములు.

| | ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|---|
| భాషల పేరులు | నేను | నాయొక్క | మేము | మాయొక్క |
| " హో (కోల్) | ఈఙ్గ్ | ఇన్య | అల్లె, ఆబు | అల్లెయ, ఆబుఅ |
| కోల్ (సింగ్ భూమ్) | ఐఙ్గ్ | ఇయన్ | అలిఙ్గ్, అల్ | అల్లెఅ |
| సంతాళి | ఇఙ్గ్, ఇఙ్గె | తిఙ్, ఇఙ్గ్ రిఅ | { అలిఙ్గ్, అలఙ్గ్, అలే-అబన్. | { తల్ నిగ్, తలె, తబన్, (అల్లెఅ?) |
| భూమిజ్ | ఇఙ్గ్ | ఇన్య | అలె | అయిసబన్ |
| మండల | ఇఙ్గ్ | ఝుతన | అల్లెగె | అహుఅ తన |
| గయెతి | నన | ఇదన, అవ | మమద్ | ఇదన, అవ |
| రుత్లుక్ | నన్న | నవ | కరెత్ | మవ |
| నైకుడె | అన్ | అనెత్ | అలె? | అమెద్ |
| కోలమి | అన్ | అనెతెన్ | అనన్దున్ | అనెత్ |
| మాది | నన్న, నన్ | నవ | మమ్ | మవ, అదునవస్న |
| మాదియ | అన | కరెత్ | కరెత్ | కరెత్ |
| కురి | ఇన్ (ఇఙ్గ్ ?) | ఇఙ్గ్ | అలె | నన్ |
| కైకాది | నను | నమ్తు | నఙ్గ్ | కరెత్ |
| సవర | గ్న | గ్ననతె | మొని | మొనినతె |
| గదబ | నైస | నొఇన్యొ | నెయమ్ | నియ్యినో |
| ఎరుకుల | నను | { నన్ గుడెది, నమ్ బురుదు | నమ, నమ్బరు | నమ్బురుదు |
| చెన్చు | హామె, హామి | హామార్ | హామె | హామార్. " |

(కాల్డు. ౪౧౨ పుట).

౧౧౮. III విష:—"డా. హంటరుగారి కంపారిటివ్ నిఘంటువులోని మధ్య హిందూస్థాన (ఇండియా) మండలి పదునేడు భాషల మధ్యమ పురుష సర్వనామ రూపములు.

| | ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|---|
| భాషల పేర్లు | నీవు | నీయొక్క | మీరు | మీయొక్క |
| "హో (కోల్) | ఉమ్ | ఉమ్మె | ఆప్పె | ఆప్పెఅ |
| కోల్ (సింగ్ భూమ్). | ఉమ్ (ఆమ్?) | ఉమ్మా | అపె | అప్పెఅ |
| సంతాళి | ఆమ్ - ఉమ్ నె | తామ్, ఆమ్రిఅ | ఆబెన్ - ఆపె | తబెన్, తాపె (అప్పె?) |
| భూమిజ్ | ఆమ్ (అమ్?) | ఉమ్మా | ఆపె? | (ఆప్పె? తాపె?) |
| మండల | ఆమ్, (అమ్) | ఆమాతన | ఇన్కోఫి | ఆపి ఆతన |
| గయెతి | ఇమె | నివ | ఇమ్ | ఇదవోనన్ |
| రుత్లుక్ | ఇమ | నివ | కరెత్ | మివ |
| నైకుడె | నివ | ఇనెత్ | ఆపె! | ఇమెద్ |
| కోలమి | నివ | ఇనెతెన్ | నివ | యెఇన్నతో |
| మాది | నిమ | నివ | మిరద్ | నివ, అదునివన్ద్ |
| మాదియ | కరెత్ | కరెత్ | కరెత్ | కరెత్ |
| కురి | అమ్ | ఆమ | ఆపె | కరెత్ |
| కైకాడి | నిను | నిమ్తు | నె | మివ |
| సవర | అమన్ | అమ్మవతె | అమన్ | అమ్మనతె |
| గదబ | నో | నెన్నె | పెన్ | కరెత్ |
| ఎరుకుల | నిను | నిన్గడెఒ, నినడిది. | నిజ్గలు, అవరు | నిజ్గలిదె, నినెబుడుదు |
| చెన్చు | యికె, తుమ్బు, తు. | తోర్ | తె, తుమ్యి | తోర్." |

(కాల్డు. ౮౧౯ పుట).

# ద్రావిడ భాషా పరిశీలనము

## V ప్రకరణము—౨ భాగము—ప్రథమ పురుష సర్వనామములు

౧౧౫. I విష:—"(౧)-ఉత్తమమధ్యమ పురుషములందువలెనె ప్రథమ పురుషమునందును బ్రత్యేకముగా నొక సర్వనామ ప్రాతిపదికము (తురిక్-షు-ఉగ్రియను భాషలలోఁ బ్రథమ పురుష సర్వనామ మొక్కటే కలదు.) లేదు. దానికి బదులుగా ద్రావిడ భాషలలో నిర్దేశక సర్వనామ ప్రాతిపదికము పైని లింగ బోధక ప్రత్యయములు నిల్చినవె వాడఁబడును. ప్రశ్నార్థక సర్వనామ ప్రాతిపదికము పైని సైత మట్లే లింగబోధక ప్రత్యయము నిల్చినదె వాడఁబడును. 'పురుషుఁడు-స్త్రీ' అను నర్థముగల పదములు (అన్-ఆలు) (నపుంసక లింగ 'వ' ప్రత్యయ చరిత్రమిట్లు తెలియదు) తమ ప్రాచీన స్థితిని గోల్పోయి లింగ బోధక ప్రత్యయములుగ మాఱినవి. ద్రావిడ భాషా సమష్టిలో 'అజ్మాత్రము' లగు నాలుగు నిర్దేశవాచక సర్వనామ ప్రాతిపదికములు గలవు.

అ—శబ్దము దూరస్థ వస్తువాచకము.

ఇ—శబ్దము సమీపస్థ వస్తువాచకము.

ఉ—శబ్దము పయి రెండిటి మధ్యస్థితిని దెల్పును. దీనికిఁ గన్నడ-తుళు భాషలలో వాడుక యధికము. తమిళమున నరుదు.

ఏ—శబ్ద మవధారణార్థకమె నైనను 'తు' భాషలో 'అ' శబ్దముతోను, 'ఇ' శబ్దముతోను గూడిన నిర్దేశ వాచకముగ వాడఁబడును. ఏ వారు = (తెల్గు - ఏ వారు). 'ఏదహ్=(ఇది) హూదహ్=(అది)' అనునవి 'ఒరాఒన్' భాషలో నిర్దేశక సర్వనామములయి యున్నవి. పైని జూపిన నాల్గు స్వరములలో మొదటి మూఁడు మాత్రమె నిర్దేశక సర్వనామములుగ వాడఁబడుచున్నవి" (కాల్డు. ౪౨౦ పుట).

(౨) "ప్రశ్నార్థక సర్వనామ ప్రాతిపదికములు:—ద్రావిడ భాషలలోఁ బ్రశ్నార్థక సర్వనామములు రెండు విధములు. I. యత్కి-మర్థకములు. ఉదా:—ఎవఁడు-ఏది-ఏ వస్తువు. మొ. II. కాకువర్థకములు. ఉదా:—అదేనా? రాముఁడే వచ్చెను. వచ్చితివే? వచ్చితివా? మొ. 'ఎ' అనునది ముఖ్యమగు ప్రశ్నార్థక సర్వనామము. దీనికిఁ బర్యాయ మనఁదగు (ప్రాచీనతరము కావచ్చును.) 'యా'

శబ్దము మఱొకటి గలదు. పై నాలుగు సర్వనామములయుఁ దమిళ ప్రథమైక వచనరూపము లొక పట్టికగా నిటఁ జూపుచున్నాను. తక్కిన ద్రావిడ భాషలలోని రూపములు వీనికి సరిగనె యుండును గాన విస్తరభీతిని వాని నెల్లఁ జూపలేదు.

| | | ఇ | అ | ఉ | ఎ |
|---|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచకము | ఇవన్ (హిక్) | అవన్ (ఇల్లె) | ఉవన్ | ఎవన్-యావన్-(క్విస్) |
| | మహతీవాచకము | ఇవళ్ (హీక్) | అవళ్ (ఇల్ల) | ఉవళ్ | ఎవళ్-యావళ్-(క్వ) |
| | అమహద్వాచకము | ఇదు (హొక్) | అదు (ఇల్లుద్) | ఉదు | ఎదు-యాదు-(క్విద్) |
| బహువచన | మహన్మహతీవాచకము | ఇవర్ (హి-హా) | అవర్ (ఇల్లి) (ఇల్లే) | ఉవర్ | ఎవర్-యావర్ (క్వి-క్వ) |
| | అమహద్వాచకము | ఇవై (హేక్) | అవై (ఇల్ల) | ఉవై | ఎవై-యావై-(క్వ) |

పై పట్టికలోని-క్విస్ మొదలయినవి యిండో యూరపియన్—లాటిను మున్నగు వానిలోని ప్రశ్నార్థకములు. (చూడు ౧౧౮ IV విభ.)

పై నాలుగు సర్వనామములయొక్క పయిరీతిగల సామ్యము ప్రాపంచిక భాషా కుటుంబములలో నెందును (న్యూపెరిషియను భాషలోఁ గొన్నిచోట్లు తప్ప) గానరాదు. అనితరసాధారణమగు నిట్టి సామ్యముగల యీ సర్వ నామములు సంస్కృతమునకును దక్షిన యిండో యూరపియను భాషలకును మూలమగు జఫేటికు భాషలోని మూలరూపములనుండి యేర్పడినవని నిర్ణీత మగుచున్నది.

ద్రావిడభాషలలోని 'యా' అను ప్రశ్నార్థక రూపము తెల్గున నెంత మాత్రము లేదు. అది కన్నడమందుఁ దఱచుగాను దమిళమందుఁ గొంత యరుదుగాను వాడఁబడుచున్నది. ప్రాచీన కాలమున 'యా' అనున దొక్కటే యుండి కాలక్రమమున 'ఏ-ఎ' అను రూపముల నందియుండును. (చూడు ధ్వనులు I భాగము). 'యా' శబ్దము 'యే' అను రూపమునందిన తర్వాతఁ బదాది యకారము విడువఁబడెననుట సహజము. 'ఏ' అనునది 'ఎ' అను హ్రస్వరూపము నందియుండును. మలయాళమున నేఁటికిని 'ఏవన్-(ఎవఁడు) ఏవళ్ (ఎవతె)' అను రూపములు నిల్చియున్నవి. తమిళ మలయాళములలో 'ఏదు' శబ్దమందును దెల్గులో 'ఏది' శబ్దమందును 'ఏ'కారము నిల్చియున్నది. 'యాదు' శబ్దముయొక్క యనునాసికీకరణము (Nasalisation) వలన యాణ్డు శబ్ద మేర్పడియుండును. తమి—యాణ్డు = (ఎక్కడ-ఎప్పుడు సంవత్సరము). తెల్గు—ఏడు=(ఎక్కడ) ఏడి=(వత్సరము). తెల్గు—ఏల=తమి—ఆల=(అట్లు) ఈల=(ఇట్లు)" ("ఆల-ఈల" తమిళమున లేవు. శ్రీ రెడ్డిగారు.) (కాల్డు. ౪౨౧, ౪౨౨ పుటలు).

"కన్నడ భాషయందు 'యా' శబ్దము వింతగ 'దా' అను రూపమును సైతం మందుచున్నది. ఉదా:—యావను=దావను=(ఎవఁడు). తుళు భాషలో 'దా=(ఏ)' అనునది 'వా-వోవ' (యా శబ్ద పరిణామములు) అను వానితో సమానార్థకముగా వాడఁబడుచున్నది. ఉదా:—తుళు — దానె = (ఏది). దాయె=(ఏల). ఇతర ద్రావిడభాషల సామ్యములచే ('యా=దా=వా=బా' అను వానిలో) 'యా' అనునదే నిర్దుష్టమును ప్రాచీనమును ననఁదగును. 'యేర్=(ఎవరు)' అను శబ్దములో 'యా' అనునది 'యే' అనునదిగా మాఱినట్లు కన్పట్టుచున్నది. గోండు భాషలోని 'బా-బో' అను ప్రశ్నార్థకములు తుళు లోని 'వా' శబ్దమువలెనె 'యా' శబ్ద వికృతులె యని తోఁచుచున్నది." (కాల్డు. ౪౨౩ పుట).

విమర్శము:—ద్రావిడభాషలందలి నిర్దేశవాచక సర్వనామములలోని 'ఉ' శబ్దము తదిదం శబ్దమాధ్యస్థ్యమును దెల్పుననుట సరికాదని డా. నారాయణ రావుగారీ క్రిందిరీతిని వ్రాసిరి. "'ఉదు-ఉవు' లు దూరముగాక దగ్గఱయుఁగాక మధ్యమందుండు వస్తువని కాల్డువెల్లర్థము చెప్పెను. కాని 'అదు' వలె 'ఉదు' కూడ దూరవస్తువును దెలియఁజేయునదే. కాల్డువెల్లు ననుసరించి నేఁటికొందఱు తెనుఁగులోని 'ఉల్ల'కు "దూరముననుగాక దగ్గఱనుగాక మధ్యముననున్న" యని యర్థము చెప్పుదురు. కాని యట్లు చెప్పుట సరికాదు. 'ఉల్ల' దూరపు వస్తువునే నిర్దేశించునట్టి విశేషణము. శ. ర. కారుఁడు 'ఇల్ల-ఉల్ల'లను తన నిఘంటువునఁ జేర్పలేదు. 'అల్లను' నన్నయవాడినాఁడు. (ఆది. IV.౨౦. VI౨౧౧. ౨౬౪. ఆర I-౧౧౫-III ౭౬.) 'ఇల్ల-ఉల్ల' లను వాడలేదు. ఎఱ్ఱాప్రెగ్గడ 'ఉల్లను' వాడినాడు. ఉల్లకాంచన రథము (అర VI-౧౫౩-౧౭౫) ఉల్లపద్మాకరముపొంత (ఆర. VI ౧౫౪) ఉల్లమహాగజంబు (అర VI-౧౭౩) ఉల్ల (అర VI ౧౫౨-౨౯౯-౨౧౩)" (ఆం. భా. చ. ౧౧౭౨ పుట).

పయిరీతిని వ్రాసిరేకాని యందులకు బలమగు ప్రమాణము గానరాదు. ముద్రితభారత ప్రతులలోని డా. నారాయణరావుగారు చూపిన పద్యములందలి ప్రయోగములలో విశ్రమస్థానగతములందును 'ఉల్ల' శబ్దముతోను 'అల్ల' శబ్దముతోను పాఠములు వెలయుచున్నవి.

"ఉల్లకాంచన రథముపై నున్నవాఁడు"

"అల్లకాంచన రథముపై నలరువాఁడు"

"ఉల్లపద్మాకరము పొంతనుండి నిన్ను = ఉవిద పద్మాకరము పొంతనుండి నిన్ను"

"ఉల్లమహాగజంబు = అల్లమహాగజంబు"

ఇట్లె నన్నయ ప్రయోగస్థలమందును "ఉల్లతెల్లని తురగోత్తము వాలంబు= అల్లతెల్లని తురగాధిపువాలంబు" అను పాఠాంతరము గలదు. పయి పాఠాంతరములలో 'ఉల్ల' శబ్దముచోట 'అల్ల' శబ్దము సవరింపఁబడుటచేఁ గావలయు డా. నారాయణరావుగారు 'ఉల్ల' శబ్దము 'అల్ల' శబ్దమువంటి విదూరార్థమునె యిచ్చునని పై రీతిని వ్రాసియుందురు. కాని పై ప్రయోగస్థలములెల్ల హస్త నిర్దేశయోగ్య సమీపస్థల విషయకములె యగుటచేత నచట 'ఉల్ల' శబ్దము నాతి సమీపార్థమునఁ బ్రయోగింపఁబడెననుట విశ్వసనీయము. 'అ - ఇ - ఉ' అను నవి నిర్దేశవాచకములని వైయాకరణులెల్లఁ జెప్పియుండుటచేత వానికిఁ బర స్వరభేద మించుకేని గలదనుట యుక్తము. కాన 'ఉల్ల' శబ్దమునకుఁగల సుప్రసిద్ధ తదిదం శబ్దమాధ్యస్థ్యార్థము కాదనరాదు. కర్ణాట శబ్దాను శాసన మంజరీ వ్యాఖ్యాకర్త యిట్లుగ వ్యాఖ్యానించెను. "అనితు=తావాన్. ఇనితు=ఇయాన్. ఉనితు=ఏతావాన్." (౪౩౬ సూత్రపు వ్యాఖ్య) "అంతు=తథేత్యర్థః...... ఇంతు=ఇత్థమిత్యర్థః......ఉంతు=ఇత్థమిత్యర్థః." (౪౩౭ సూ. వ్యాఖ్య).

దొరగారు తమిళమందలివని పట్టికలోఁ జూపిన "ఎవన్-ఎవళ్-ఎవర్-ఎదు" అను రూపము లర్వాచీనములు. ఇవి తొల్కాప్పియమున 'యావన్' మున్నగువానివంటి యర్థము గలవిగా సూత్రింపఁబడలేదు. 'ఎవన్' మున్నగునవి యం దట్టి యర్థమున లేవనియే చెప్పవచ్చును. మఱియు 'ఎవన్' అను ప్రశ్నార్థకమునకుఁ దొల్కాప్పియమున 'ఏది-ఏవి' అను నర్థములు చూపఁబడెను.

"యాతెవన్......" (తొల్కా. ౨౧౪ సూ.) 'యాదు (తు), ఎవన్' అను నీ రెండు శబ్దములును నజ్ఞాతవస్తు విషయక ప్రశ్నములో వాడఁబడును. ఉదా:—అదు యాదు, అదు ఎవన్=(అదియేది). అవై ఎవన్=(అవి యేవి?).

"అత్తిణై......" (తొల్కా. ౭౦౩ సూ.) 'ఎవన్' శబ్ద మమహదేకవచన బహు వచనములలోఁ బ్రశ్నార్థకముగా వాడఁబడును. ఉదా:—అదు ఎవన్=(అది యేది?). అవై ఎవన్=(అవి యేవి?).

తెల్గున 'యా' శబ్ద మనఁగాఁ బదాది యకారఘటిత శబ్ద మెంతమాత్రమును లేదనెడి దొరగారి భ్రాంత సరికాదు. తాలవ్య స్వరయుక్తపదాది యకారము నన్నయ భట్టారక సమ్మతము. అర్వాచీనులు ప్రక్రియా సౌలభ్యమునకయి పదాది యకారము నుజ్జగించిరి. "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" (చూడు 'వ్యా. సం.' ౨౩ విమ).

ప్రాచీన తమిళమున 'యావన్=(ఎవఁడు)' మున్నగునవి యరుదనుట పొసంగదు. ప్రాచీనకాలమునఁ దమిళమున నున్న రూపము లవి మాత్రమె.

ఇంకఁ గన్నడమున నట్టి 'యావన్' మున్నగునవి తఱుచను దొరగారి వ్రాఁత
సరికాదు. ప్రాచీన కర్ణాటమున 'యావన్' మున్నగు రూపములు లేనేలేవు.
"యావను=(ఎవఁడు) యావళు=(ఎవతె) యారు=(ఎవరు)" మున్నగునవి
హొస గన్నడరూపములు. (చూడు హొసగన్నడ వ్యాకరణము శబ్దాదర్శ.
౧౯ పుట). ప్రాచీన కర్ణాటమున "ఆవం=(ఎవఁడు), ఆవళ్=(ఎవతె) ఆర్=
(ఎవరు) ఆవుదు=(ఏది)" మున్నగు నజాది (ఆ) శబ్దములు మాత్రమె కలవు.
(చూడు క్రింది శబ్దానుశాసన సూత్రోదాహృతులు). 'ఎదు=ఏదు (ఏది)'
అనునవి తొల్కాప్పియమున లేవు.

తెల్గు-'ఏడి=వత్సరము-ఏడు=ఎక్కడ' అను దొరగారి వ్రాఁత పొర
పాటు. 'ఏఁడి=(ఎక్కడనున్నాఁడు.) ఏఁడు=(సంవత్సరము)' అని యుండవల
యును. 'యాణ్డు=సంవత్సరము' అను తమిళ శబ్దములోని 'ణ'కార మను
నాసికీకరణ సిద్ధము కాదు. శబ్దసిద్ధము. (చూడు ౨౮ VII విష).

'యావను-దావను' అను రీతిగల ద్వివిధ రూపములును హొసగన్నడ
రూపములు. అందలి 'దావను' అను రీతిది హొసగన్నడ వ్యాకర్తలచేత
నయిత ముపేక్షింపఁబడిన యగ్రాహ్యరూపము. శబ్దాదర్శమను హొసగన్నడ
వ్యాకరణమున 'యావను=(ఎవఁడు) యావళు-యారు-యావదు-యావవు'
అనునవి మాత్రమె యుదాహరింపఁబడెను (చూడు శబ్దాదర్శ. ౧౯ పుట).
ప్రాచీన కర్ణాటమున 'యావను=దావను=(ఎవఁడు)' అను రీతిగల రూప
ములు లేవు. నాగవర్మ యీ ప్రశ్నార్థకములను సాధింపనేలేదు. శబ్దమణి
దర్పణమున 'ఆవుదు=ఆవం-ఆర్' అను ప్రశ్నార్థకరూపములు పేర్కొనఁబడెను.

"క. ఆవుదె నిప్పీశబ్ద। క్కావం బహువచనదెడెయొళార్......"
(శబ్దమణిదర్పణము. ౧౫౧ ప). ప్రశ్నార్థకమగు 'ఆవుదు' శబ్దమున కేకత్వమునఁ
బుంలింగమున 'ఆవం' అనియుఁ, బ్రథమా బహువచనమున 'ఆర్' అనియు
నాదేశములగునని యర్థము. కర్ణాటశబ్దానుశాసనమునఁ బైకేశిరాజు చెప్పిన
విషయము విస్తరింపఁబడెను.

'ఆవుదోరార్' (కర్ణాటశబ్దా. ౧౭౪ సూ.)="......ఆవుదు శబ్దస్య
'ఆర్' ఇత్యాదేశో భవతి. పుంలిఙ్గే-స్త్రీలిఙ్గేచ విషయే" ఆవుదు శబ్దమునకుఁ
బుంలింగ స్త్రీలింగ ప్రథమా బహువచనమున 'ఆర్' అను రూప మాదేశ
మగును. ఉదా:—'ఆర్=ఎవరు' అని యర్థము.

'ఆవోనావౌ చైకత్వే' (కర్ణాట శబ్దా. ౧౭౫ సూ.)="ఆవుదు శబ్దస్య
'ఆవోన్-ఆవ' ఇత్యాదేశౌ భవతః. చకారాత్ 'ఆర్', చ-ఏకత్వే పుంలిఙ్గే స్త్రీ
లిఙ్గేచ విషయే. ఉదా:—ఆవోం (న్)=ఆవం-ఆర్". ఈ సూత్రము నందలి
'ఏకత్వే' అను దానిచేఁ బూర్వ సూత్రమందలి 'ఆర్' అను దాని విధానము

బహువచన విషయకమని విశదమగుచున్నది. ఇట్లు వ్యాఖ్య చేయునపుడే శబ్దమణి దర్పణ సూత్రము సుసంగత మగును.

'వానస్యేతుః' (కర్ణాట శబ్దా. ౧౭౬ సూ.)=“ఆవుదు ఇత్యస్య 'ఏతుః' ఇత్యాదేశో వా భవతి ఏకత్వే నపుంసక లిఙ్గ విషయే.”

'కేత్యేచ్చ' (కర్ణాట శబ్దా. ౧౭౭ సూ.)=“ఆవుదు ఇత్యస్య ఏకారః చకారాత్ ఏతుశ్చ ఆదేశౌ వా భవతః ఏకత్వే కేతిపరే నపుంసకలిఙ్గ విషయే.” ('కెతి' అనఁగాఁ జతుర్థి-కెప్రత్యయ)

'ఏన్నమోః' (కర్ణాట శబ్దా. ౧౭౮ సూ.)=“ఆవుదు ఇత్యేతస్య 'ఏన్' ఇత్యాదేశో వా భవతి ఏకత్వేఽమి (ప్రథమాయాఁమ్) అమిచ (ద్వితీయా యామ్) పరే.” ఉదా:—ప్రథమైక-ఆవుదు=ఏన్=(ఏది). ద్వి-ఏక-ఆవుదం=ఏనం=(దేనిని). తృ-ఏక-ఆవుదఱిం=ఏతఱిం=(దేనిచేత). చతు-ఏక-ఆవుదక్కెౕ=ఏతకెౕ=ఏకె=(దేనికొఱకు. దేనికి) పం-ఏక-ఆవుదత్తణిం=ఏతఱత్తణిం=(దేనివలన). ఆవుదఱ=ఏతఱ=(దేనియొక్క). సప్త ఏ. ఆవుదొళ్=ఏతఱొళ్=(దేనియందు) పయి సూత్రములలోని 'ఏకత్వే' అను దాని చేత బహుత్వమున 'ఆవువు=(ఏవి). ఆవువం=(వేనిని)' మొ. అను రీతిరూపములఁ నూహింపవలయును.

౧౧౫. II విష:—“గ్రాంథిక తమిళమందు యా శబ్దము 'అ-ఇ-ఉ-ఎ' శబ్దములవలెనె నామములకు ముందునిల్చి విశేషణమగుటయే కాక (యాకా-లమ్)=(యేకాలము) స్వతంత్ర సర్వనామముగ సైతము వాడఁబడుచున్నది. ఉదా:—యా సె (చె) య్దాయ్=(ఏమి చేసితివి). “ఆణ్డు=(అప్పుడు), ఈణ్డు=(ఇప్పుడు)” అనువానికి 'అ-ఇ' అనువానివలెనె 'యాణ్డు=(ఎప్పుడు-ఎక్కడ-సంవత్సరము)' అను దానికి యా శబ్దము ప్రకృతి యగుచున్నది. ఇట్టి 'యా' అను ప్రాతిపదికమునుండి యేర్పడిన “యావన్=(ఎవఁడు), యావళ్=(ఎవతె), యావర్=(ఎవరు), యాదు=(ఏది), యావై=(ఏవి)” అను రూపములు తమిళ మందును గన్నడమందును వెలయుచున్నవి. కన్నడమందలి 'యావదు-యావవు' అను వానిలోని రెండవ యక్షరమగు 'వ' కారము 'యావను' మున్నగువాని యలవాటునఁ జేరినను నచట 'వ' కారమునకు స్థానము లేమిం జేసి యట్టి రూపము (యావదు-యావవు) లపశబ్దములె యనఁదగును. ('యా+అన్=యావన్' అను చోటియందువలె 'దు' ప్రత్యయ పరకత్వమున స్వరాదిత్వము లేమింజేసి వకారాగమము రానేరదని భావము). తమిళమందలి 'యావర్' అనునది 'యార్' అను సంక్షేప రూపము నందినదై వాడుక భాషలో నేకవచన బహువచనములు రెండిటిని దెల్పును. ఉదా:—అవన్ యార్=

(వాఁడెవడు), అవళ్ యార్ =(ఆమె యెవతె). ఈ 'యార్' శబ్దము సమాసము లలో 'ఆర్' అను సంక్షేప రూపము నందును" (కాల్డు. ౪_౧౩, ౪_౧౪ పుటలు).

"అ+అన్=అవన్. అ+అళ్=అవళ్. అ+అర్=అవర్" అను చోటులందు స్వరపూర్వకముగఁ బ్రత్యయము నిల్చిన ట్లమహత్సర్వనామ ప్రథమైక వచన నిర్మాణమున స్వరాది ప్రత్యయము నిలువదు. ఇంక రూపనిష్పత్తి కొఱకొక్క హల్లు దకారము నిల్చును. అట్టి దకారము మీఁదఁ దెల్గున 'ఇ' కారమును దమిళ మలయాళ కన్నాటములలో నర్ధమాత్రి కోకారమును నిల్వఁగాఁ దెల్గున 'అది-ఇది-ఏది' అను రూపములును, దమిళ మలయాళ కర్ణాటములలో 'అదు-ఇదు-ఉదు-ఎదు' అను రూపములును నేర్పడుచున్నవి. (మలయా-'ఉదు' లేదు. శ్రీ రెడ్డిగారు). గోండు భాషలో 'అద్-ఇద్' అనియే యుండును. ఇట్లు స్వరాది ప్రత్యయము నిల్వమింజేసి మహన్మహతీ రూపము లందువలె వీనిలో స్వరసంహితా వ్యవధాయక 'వ' కారము నిల్వవలసిన ప్రసక్తి లేదయ్యెను. ఇట్లగుటంజేసి యమహత్ప్రథమైక వచనము లందలి 'అ-ఇ-ఉ' అనునవె నిర్దేశక సర్వనామ ప్రాతిపదికములని సిద్ధాంతిత మగుచున్నది. తక్కిన రూపములలో సంహితా 'వ' కారము నిల్చుటచేత "అవన్ - ఇవన్ - ఉవన్ - అవర్-ఇవర్-ఉవర్-అవళ్-ఇళ్-ఉవళ్. అవై-ఇవై-ఉవై" అను రూపము లేర్పడెను. 'ఐ' అనునది యమహత్ప్రథమా బహువచన ప్రత్యయము. ఉచ్చారణ సౌకర్య మంతగాఁ బాటింపఁ బడని 'కు' భాషలో సంహితా 'వ' కారము చేరదు. ఉదా:—ఆ ఆఞు=(వాఁడు), ఆ ఆలు=(ఆమె). తమిళ మున నొకప్పుడు సంహితావ్యవధాయక 'వ' కారము నిల్వకుండుటచేత నచటి స్వరములు కలిసిపోవుట గలదు ఉదా.—యావర్ = యూర్ = ఆర్ = (ఎవరు).

"తమిళమున స్వరసంహితలో 'న' కారము నిల్చుటయుఁ గలదు. ముఖ్య ముగాఁ గ్రియా ప్రత్యయములలో 'న' కారము నిల్చుట సామాన్యమై యున్నది. ఉదా:—ఇరున్దవన్=ఇరున్దాన్=(ఉన్నాఁడు) ఇట్టి యెడలఁ గవులు 'ఇరున్దనన్' అనియు దీని చొప్పున 'ఇరున్దవ' అను-చో 'ఇరున్దన'=(ఇరున్ద+అ=ఉండిన) అనియుఁ బ్రయోగింతురు. గోండు భాషలో నపుంసక బహువచన ప్రత్యయము లేకయె 'అవ్=(అవి), ఇవ్=(ఇవి)' అను రూపములు వాడఁబడును. ఈ భాషలో ద్వితీయాది విభక్తులందు 'అ' కారమునకు బదులుగా 'ఎ' కారము వాడఁబడును. తెల్గులో నీ సంహితా వర్ణమగు 'వ' కారము శబ్దావయవము వలె వర్ణప్లుతి వికృతి నందుటచే ద్వితీయాది బహువచనాంగములలో 'వా-వీ' అనునవి నిల్చును. ఉదా:—అవర్=వారు. ఇవర్=వీరు. వారిన్-వారిచేన్. వీరిన్-వీరిచే. మొ. ఇట్లే యమహద్రూపములలో 'డ' ప్రత్యయము వర్ణప్లుతి

వికృతి నందును. ఉదా:—అది-దానిన్-దానిచేతన్. ఇది-దీనిన్-దీనిచేతన్-మొ. ఈ సందర్భమునఁ దెల్గులోని యత్కిమర్థకమగు 'ఏ' శబ్దమును పై రీతినే సాధింపనగును. ఉదా:—ఎవఁడు-ఎవరు. ఎవనిన్-ఎవరిన్. ఏది-దేనిన్. ఏవి-వేనిన్, మొ." (కాల్డు. ౪౨౪, ౪౨౫ పుటలు).

విమర్శనము:—'అ-ఇ-ఉ' అను వానివలెఁ బ్రాచీన తమిళమున 'ఎ' అను సర్వనామము లేదు. 'యా' అనునది మాత్రమె తొల్కాప్పియమునఁ బేర్కొనఁబడెను. 'అదు-ఇదు......' (తొల్కా. ౬౫౧ సూ.)="... ...యాదు-యా-యావై"......అమహన్నామములు. తెల్గునందలి 'ఎ' శబ్దమువంటి యత్కిమర్థకము తొల్కాప్పియమున లేదు. 'ఎవఁడు' మున్నగు తెల్గు శబ్దముల యర్థమునఁ 'యావన్' మున్నగు శబ్దములె తమిళమున వాడఁబడును. 'అవ్వాఱె......' (తొల్కా. ౬౪౬ సూ.)="......యావన్ - యావళ్ - యావర్......మహన్మహతీ నామములు". ఇంక నజ్ఞాతవస్తు విషయక ప్రశ్నమున సమహాహదర్థమున మాత్రమె 'ఎవన్' అను శబ్దము వాడఁబడును.

'యా తెవన్......' = (తొల్కా. ౫౧౪ సూ.)= "యాదు - ఎవన్ అనునవి యజ్ఞాతవస్తు విషయక ప్రశ్నములో వచ్చును."

పయి సూత్రములనుబట్టి ప్రశ్నార్థక సర్వనామమగు 'ఎ' శబ్దము తెల్గు నందువలెఁ బ్రాచీన తమిళమున లేదనియు 'ఎవన్'=(ఎవఁడు) మున్నగునవి యర్వాచీనముగఁ బ్రవేశించెననియుఁ దెలియనగును.

తమిళములోని 'యాణ్డు=(ఎక్కడ-వత్సరము)' అను దానికి యా శబ్ద మాత్రమె ప్రకృతి కాదనియు నచటి ణకార మనునాసికీకరణసిద్ధము కాదనియు 'యా+అవణ్=యా+అణ్=యాణ్+దు=యాణ్డు' అని యచటి శబ్దావయవముల నెన్నవలెననియు నీ వఱకు సువిస్తరముగా వివరింపఁబడెను. (చూడు ౨౮ VII విభ). 'యావన్' మున్నగునవి ప్రాచీన కర్ణాట రూపములు కావనియు, నవి హళెగన్నడమున 'యావను' మున్నగు రీతిని నిల్చుననియు నీవఱకు వ్రాయఁబడెను (చూడు ౧౧౫ I విభ). 'యావదు=(ఏది)' అను వకార ఘటిత రూపము తప్పిదమనియుఁ (Corrupted) దమిళమందువలెనె హళెగన్నడ మందును 'యాదు' అనియే యుండుననియు డా. కాల్డువెల్లుగారు వ్రాయుట పొరపాటు. 'యావదు-యావవు' అను హళెగన్నడ రూపములు 'ఆవుదు-ఆవువు' అను ప్రాచీన కర్ణాటరూప (చూడు ౧౧౫ I విభ) సంబంధులుగాన వానియందలి ద్వితీయ వర్ణము వకారముగ నుండుటయే సాధువు-లేకుండుటయె తప్పు. తమిళ మందలి 'యార్' శబ్దమునకుఁగల యేకవచన వ్యవహారము గ్రామ్యభాషలో (Colloquial)ని దను కాల్డువెల్లుగారి వ్రాత ప్రామాదికము. తొల్కాప్పియమున నట్టి ప్రయోగము సాధువుగా సూత్రింపఁ బడెను.

'యార్ ......' (తొల్కా. ౬౯౭ సూ.)='యార్' అనెడి ప్రశ్నార్థక శబ్దము మహన్మహతీ వాచకముల కేకత్వ బహుత్వములలో వాడఁబడును. ఉదా:—అవన్ యార్=అతఁడెవరు?. అవళ్ యార్=ఆమె యెవరు?. అవర్ యార్=వారెవరు?. ఇట్టి వింతప్రయోగములు తెల్గునందును గలవు. "నీ వెవ్వరిత్యాది విశేష ప్రయోగంబులుం గలవు. క॥ నీ వెవ్వ రేమి పనికై ..." (చూడు ప్రౌఢ వ్యా. శబ్ద. ౪౭ సూత్రపు వివరణము).

కాల్డువెల్లుగారీ సందర్భమునఁ బునరుక్తముగా నామ ప్రకరణ ప్రపంచిత విషయములనె పాఠకుల సౌకర్యమునకుఁ గావలయు విస్తరించిరి. వాని నిట నేను సంక్షేపించి చూపితిని.

'ఇరున్దనన్' అనుచోట స్వరసంహితా వ్యవధాయకముగ 'ఇరున్దవన్' అని మాత్రమె వకారము నిల్వవలసి యుండఁగా నచట 'న' కారమును (ఇరున్దనన్) నిల్పుచున్నదని వ్రాసిన కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదు. "ఇరున్దనన్=(ఉండినాఁడు), అనుచో 'ఇరున్ద+అన్+అన్' అని ఛేదము. అందలి మొదటి 'అన్' శబ్దము ప్రాచీన తమిళు పురుషబోధక ప్రత్యయము. ఈ విషయ మీవఱకు సువిస్తరముగా విమర్శింపఁబడినది." (చూడు ౩_౨ IV విష. ౩౩ విష).

౧౧౫. III విష:—"తుళుభాషలోని నిర్దేశక సర్వనామరూపముల వైలక్షణ్యము. కాల్డువెల్లుగారు చెప్పినవిషయములు పాఠక సౌకర్యమునకయి పట్టికారూపముగాఁ జూపఁబడుచున్నవి. దొరగారు వివరింపని రూపభేదము లిందుఁ గొలఁతగా నుండును గాన నది శంకాస్పదము కాదు."

| | | ఇ | అ | ఉ | ఎ—యా |
|---|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | ఇమ్బె | ఆయె | — | — |
| రూపములు | మహతీవాచి | మోళ్ | ఆళు | — | — |
| | అమహద్వాచి | ఇన్దు | అవు | ఉన్దు | దానె |
| బహువచన | మహన్మహతీ | మేర్ (పురు) | ఆర్ | — | యేర్ |
| రూపములు | వాచకములు | మోకుళు (స్త్రీ) | | | |
| | అమహద్వాచి | — | ఐకుళు | — | — |

"తుళుభాషలో 'దా' అనుదానికి 'వా-వోవ' అనునవి రూపాంతరములు. "దాయె=(ఏల)-అవుళు=(అక్కడ)-మోళు=(ఇక్కడ)" అను వింతరూపములును నిందుఁ గలవు. (కన్న-అల్లి=(అక్కడ)). పైపట్టికలోని కొన్నిరూపముల పరిణామక్రమము:—ద్రావిడ-ఇవన్=ఇమన్=తుళు:—ఇమ్బె. ద్రావిడ-ఇదు=తుళు:—ఇన్దు. ద్రావిడ-ఉదు=తుళు:—ఉన్దు. 'ఇన్దు-ఉన్దు' అనునవి యను

నాసికీకరణ సిద్ధరూపములు. తుళు.—'అవు=(అది)' అను దానిలోని వకారము సంహితా వ్యవధాయక వర్ణమనుటకు తుళు:—'ఐకుళు'=(అవి) అనునది ప్రబలాధారము. ఉదా:—అవు=అయు=ఐ-ఐకుళు. తుళు.—'ఆయె=(వాఁడు)' అనుచో 'య' కారము స్వరసంహితా వ్యవధాయక వర్ణముగా నిల్చెనని యెఱుంగనగును. తుళు.—'ఆళు=(ఆమె)' అనుచో 'ఆ+అళ్' అను ఛేదము చొప్పున రెండచ్చులును గలిసి పోయినవని యెన్నసగును. ఇట్లె తుళు:—'ఆర్=(వారు)' అనుచోట సయితము 'అ+అర్' అను ఛేదము చొప్పున స్వరద్వయ మేళనము నరయునది. తుళు:—'మోళ్=(ఈమె)' అనుచో ద్రావిడ:—'ఇవళ్=ఇమళ్=మోళ్' అనురీతిని వర్ణప్లుతి పరిణామమును ('అవర్=వారు. ఇవర్=వీరు)' అనువానివలెనె గ్రహింపవలెను. తమిఱు 'మార్' శబ్దమును సరిపోల్చి చూచునది. (తమి-అవర్=అమర్=మార్)" (కాల్డు. ౭౨౫, ౭౨౬ పుటలు).

"తుదభాషలోని నిర్దేశార్థక తచ్ఛబ్దరూపము 'అదమ్' అనునది యేకత్వ బహుత్వములందును మహదమహత్తులందును నేకరూపముగానే యుండును. ఇట్లే నిర్దేశార్థకమగు 'ఇ' శబ్దము 'ఇదమ్' అనునది మాత్రమె వచనద్వయమునందును మహదమహత్త్వములు రెంటను నేకరీతిగనే యుండును. ఉదా:—అదమ్=వాఁడు-ఆమె-అది-వారు-అవి. ఇదమ్=వీఁడు-ఈమె-ఇది-వీరు-ఇవి. 'అదమ్-ఇదమ్' శబ్దముల తుది 'మ'కార మొకొక్కప్పుడు లోపించుటయుఁ గలదు. 'అదమ్-ఇదమ్' శబ్దములను దెల్గులోని అతఁడు-ఇతఁడు మున్నగు వానితోను గన్నడమందలి 'ఆతం-ఈతం' అనువానితోను సరిపోల్చి చూడనగును" (కాల్డు. ౭౨౫, ౭౨౬ పుటలు).

విమర్శము:—'ఇన్దు-ఉన్దు-(ఇది)' అను తుళుభాషా శబ్దములలోని 'న' కార మనునాసికీకరణ సిద్ధమనుట సరికాదు. 'ఇదు-ఉదు' శబ్దముల పర్యాయములగు 'ఇన్-ఉన్' అను ద్రావిడ శబ్దములనుండి (చూడు ౨౮ V విష.) యేర్పడెననుట యథార్థము.

౧౧౫. IV విష:—డా. కాల్డువెల్లుగారు నిర్దేశక సర్వనామముల సుబంతరూప విశేషములను గొన్నిటిని ౧౧౫ I, II, III విషయములలో సందర్భవశమున విస్తరించి యున్నారు. వానినెల్ల నేర్చి కూర్చి పాఠకుల సౌకర్యమునకై యిచటఁ బట్టికలుగాఁ జూపుచున్నాను. అందుఁ దమిఱు (౧౧౫ I విష. చూడు) తుళు (చూడు ౧౧౫ III విష) భాషల పట్టిక లీవఱకుఁ జూపఁబడినవి గానఁ దక్కిన విచటఁ బ్రదర్శింపఁబడుచున్నవి:—

డా. కాల్డువెల్లుగారు చూపిన

## I. మలయాళ రూపముల పట్టిక

| | | ఇ | అ | ఉ | ఎ | |
|---|---|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | ఇవన్ | అచన్ | ఉవన్ | ఏవన్ | (మలయాళము 'ఉ' శబ్దమున్ తెడు. అమహద్వ్యా-(అకా- తమి-మల. (ఉదా) రెడ్డిగారిది). |
| | మహతీవాచి | ఇవళ్ | అవళ్ | ఉవళ్ | ఏవళ్ | |
| | అమహద్వాచి | ఇదు | అదు | ఉదు | ఏదు | |
| బహువచన | మహన్మహతీవాచి | ఇవర్ | అవర్ | ఉవర్ | ఏవర్ | |
| | అమహద్వాచి | ఇవు | అవు | ఉవు | ఏవు | |

## II. డా. కాల్డువెల్లుగారు చూపిన ప్రాచీన కర్ణాట నిర్దేశక సర్వనామ రూపములు.

| | | ఇ | అ | ఉ |
|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | ఇవం | అవం | ఉవం |
| | మహతీవాచి | ఇవళ్ = ఈకె | అవళ్ = ఆకె | ఉవళ్ - |
| | అమహద్వాచి | ఇదు | అదు | ఉదు |
| బహువచన | మహన్మహతీవాచి | ఇవర్ | అవర్ | ఉవర్ |
| | అమహద్వాచి | ఇవు | అవు | ఉవు |

## III. కాల్డువెల్లుగారు చూపిన హళగన్నడ నిర్దేశ సర్వనామ రూపముల పట్టిక.

| | | ఇ | అ | ఉ | యా |
|---|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | ఇవను | అవను | ఉవను | యావను-దావను |
| | మహతీవాచి | ఇవళు | అవళు | ఉవళు | యావళు-దావళు |
| | అమహద్వాచి | ఇదు | అదు | ఉదు | యావదు-దావదు |
| బహువచన | మహన్మహతీవాచి | ఇవరు | అవరు | ఉవరు | యావరు-దావరు |
| | అమహద్వాచి | ఇవు | అవు | ఉవు | యావవు-దావవు |

IV. కాల్డువెల్లుగారు చూపిన
తెఁగు నిర్దేశ సర్వనామ మహదాది రూపముల పట్టిక.

| | | ఇ | అ | ఉ | ఎ |
|---|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | వీఁడు | వాఁడు | — | ఎవఁడు |
| | మహతీవాచి | ఈమె-ఈపె<br>ఈకె | ఆమె-ఆపె<br>ఆకె | — | ఏమె-ఏపె-<br>ఏకె |
| | అమహద్వాచి | ఇది | అది | — | ఏది |
| బహువచన | మహన్మహతీవాచి | వీరు | వారు | — | ఎవరు |
| | అమహద్వాచి | ఇవి | అవి | — | ఏవి |

V. కాల్డువెల్లుగారు చూపిన ‘కు’ భాషా నిర్దేశక సర్వనామరూపముల పట్టిక.

| | | ఇ | అ | ఉ | యా—ఎ |
|---|---|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | — | ఆఆఞు<br>జ | — | — |
| | మహతీవాచి | — | ఆ-ఆలు | — | — |
| బహువచన | మహద్వాచి | — | — | — | ఏ+వ్+ఆర్ = ఏవార్ = (వారు) నిర్దేశార్థకము |

VI. కాల్డువెల్లుగారు చూపిన గోందుభాషా నిర్దేశక సర్వనామ మహదాది రూపముల పట్టిక.

| | | ఇ | అ | ఉ | యా—ఎ |
|---|---|---|---|---|---|
| ఏకవచన | అమహద్వాచి | ఇద్ | అద్ | — | — |
| బహువచన | అమహద్వాచి | ఇవ్ | అవ్ | — | — |

VII. కాల్డువెల్లుగారు చూపిన తుదభాషలోని నిర్దేశక సర్వనామ మహదాదిరూపముల పట్టిక.

| | | ఇ | అ |
|---|---|---|---|
| ఏకవచన | మహద్వాచి | ఇదమ్ | అదమ్ |
| | మహతీవాచి | ఇదమ్ | అదమ్ |
| | అమహద్వాచి | ఇదమ్ | అదమ్ |
| బహువచన | మహన్మహతీవాచి | ఇదమ్ | అదమ్ |
| | అమహద్వాచి | ఇదమ్ | అదమ్ |

౧౦౬. I విష:—ద్రావిడభాషలలోని నిర్దేశక సర్వనామములనుండి యేర్పడిన భావార్థకాది రూపములు పాఠకుల సౌలభ్యమునకయి పట్టికలుగాఁ జూపఁబడుచున్నవి.

{ "భావార్థక తమిళ 'మై' ప్రత్యయము. ఇది సాధారణముగా ద్విరుక్త మకారకమై యుండును. }

| ఇ | అ | ఉ | ఎ | విశేషములు |
|---|---|---|---|---|
| ఇమ్మై= (దీనితనము. = ఈ జన్మము.) | అమ్మై= (దానితనము. = ఆ జన్మము=భావి జన్మము = మఱు జన్మము.) | ఉమ్మై= (తదిదంశబ్ద మాధ్యస్థ్య వాచకము. అవ్యవహితగత జన్మము.) | ఎమ్మై= (దేనితనము. ఎమ్మైయుమ్. = ఏజన్మమునందైనను.) | 'తన్మై' శబ్దము 'తా' శబ్ద భావార్థకము. (చూడు ౧౧౨ V విష). 'ఇమ్మై' మున్నగువానికి 'ఈ జన్మము' మున్నగు నర్థములు వ్యావహారికార్థములు. (గ్రాంథికములె. శ్రీ రెడ్డిగారు). |

(కాల్డు. ౪౨౬, ౪౨౭ పుటలు).

విమర్శము:—'మై=మయి=మెయి' అనునవి శరీరవాచకములు. కాన 'మై' ప్రత్యయాంతములు 'ఈ జన్మము' మున్నగు నర్థముల నిచ్చుట సహజమె యనఁదగును. తమి-మెయ్=(శరీరము. హాల్డు.)

౧౦౬. II విష:—ప్రశ్నార్థక శబ్దమునుండి (ఏ) యేర్పడిన ద్రావిడ రూపములు:—డా. కాల్డువెల్లుగారు వివరించినవి.

| " తమిళ | తెలుఁగు | మలయాళము | హళగన్నడము | విశేషములు |
|---|---|---|---|---|
| ఎదు<br>ఎన్<br>ఎన్నదు<br>ఎన్న<br>ఏన్<br><br>ఎన్నమ్<br>ఎన్నమాయ్ } | ఏది<br>ఏమి—ఏని<br>ఏది—<br>ఏవి<br>ఏల—<br><br>ఏది | <br>ఎన్దు<br>ఎన్దు<br><br>ఏన్=(ఏమి)<br>(ఏల)<br>——— | <br><br><br><br><br><br>ఏను<br>(అవ్యయమును గలదు.) | తమిళ ప్రథమా బహు వచనరూపమగు 'ఎన్న' అను నది వాడుకభాషలో నేక వచనముగావాడఁబడుటయే కాక 'ఎన్నమ్' అను నపుంస కైక వచనరూపముగను నేర్పడుచున్నది. మలయాళపు 'ఎన్దు' శబ్దము తమిళ మందలి 'ఎన్నదు' అనుదాని సంక్షేపరూపముగా నచ్చును. "తమి-ఎన్నమ్. |

తెల్గు-ఏమి. కన్న-ఏను" అనువానికెల్ల విభక్తులరూపములును గలవు. తెల్గు-'ఏమి' శబ్దమునకు 'ఎమ్' అనునది ప్రాచీనరూపమై యుండును. తమిళమందలి 'ఎన్-ఎదు' అను వాని కెట్టి

సంబంధము గలదో, తెల్గు 'ఏమి-ఏది' శబ్దముల కట్టి సంబంధము గలదు. తెల్గులోని 'ఏని' శబ్దము ప్రశ్నార్థ గర్భితము. క్రియలపై నిల్చి చేదర్థ బోధక మగును."

(కాల్డు. ౪౨౭, ౪౨౮ పుటలు).

విమర్శము:—పై పట్టికలోని ప్రధాన రూపమగు 'ఎదు'=(ఏది) అను శబ్దము దొల్కాప్పియమునఁ జేర్కొనఁబడలేదు. కాన నది యర్వాచీన రూప మనఁ దగును. (చూడు ౧౧౫ II విష) "ఆన్ = (అక్కడ) = అన్, ఈన్ (ఇక్కడ)='ఇన్' " అను వానివలెనె 'ఏన్=ఎన్' అను ప్రశ్నార్థకమును గలదని యంగీకరింపనగును. (చూడు ౨౭ V విష. ౮౨ III విష). అట్టి 'ఎన్' అను ప్రశ్నార్థక ప్రకృతి పయిని ద్రావిడ ప్రథమా బహువచన రూపమగు 'అ' ప్రత్యయము నిల్చుటచేత 'ఎన్న' అను రూపమేర్పడ నగును. అట్టి 'ఎన్న' అను బహువచన రూపమె 'ఎన్నమ్' అను నపుంసక ప్రథమైక వచనముగ నేర్పడెననుట సరికాదు. 'ఎన్' అను ప్రకృతి పైని నపుంసకైక వచన ప్రత్యయము నిల్చుటచేత 'ఎన్నమ్' అను రూపమేర్పడెననుట యుక్తము. మలయాళపు 'ఎన్దు' శబ్దము తమిళ 'ఎన్నదు' శబ్దసంక్షేపమననేల? 'ఎన్+దు = ఎన్దు' అనియు, 'ఎన్+అదు=ఎన్నదు' అనియు నేర్పడెననుట యుక్తము కాదా? 'ఏను=(ఏది)' అనునది హళగన్నడ రూపము. దాని ప్రాచీన కన్నడ రూపము 'ఏన్' అనునది. ఈ 'ఏన్' శబ్దము 'ఆవుదు' శబ్దరూపాంతరమనియు 'ఆవుదు' శబ్దమునకు సువిభక్త్యంత రూపము లెల్ల నున్నట్లె 'ఏన్' శబ్దమునకును గలవనియు నీ వఱకె శబ్దానుశాసన సూత్రోదాహృతి పూర్వకముగా వ్రాయఁబడెను. ప్రథ 'ఏన్' ద్వి-ఏనం. తృ-ఏతఱిం. చ-ఏతర్కె. పం-ఏతఱత్తణిం. ష-ఏతఱ. సప్త-ఏతఱొళ్. (చూడు ౧౧౫ I విష). 'ఏని' అను తెలుఁగులోని యవ్యయము 'ఏమి' శబ్దమువంటిదనరాదు. 'ఏమి' అనునది 'ఏది' అనుదాని వంటిది. 'ఏని' అనునది యవ్యయము. పయిని వ్రాసిన రీతిని 'ఏన్=ఎన్' అను ద్రావిడ ప్రశ్నార్థకములు గలవు గాన నందలి 'ఏన్=ఎప్పుడు' అనుదాని నుండి 'ఏని' శబ్దమేర్పడెనని యెన్నవగును. "చేసిన యేనిన్ (చేసినేనిన్)=చేసినప్పుడు=చేసినయెడలన్=చేసినన్" అని యద్దాని యర్థపరిణతి నెన్నవగును.

క॥ "తగు మాటలాంబికే యుం।
డగునని కైకొనునె యెన్నఁడైనను గొడుకున్।
మగటిమి గలఁడనియెడి న।
మ్మిగఁ జూచుచునుండు విషము మ్రింగిన యేనిన్॥"

(ఉద్యో. ౧ ఆ. ౩౧౫ ప).

ఎల్ల విభక్తులు చేరఁదగిన తమిళ భాషలోని ‘ఎన్నమ్’ శబ్ద మర్వాచీనమె యై యున్నను దెల్గులోని ‘ఏమి’ శబ్దమును బ్రాచీన కన్నడములోని ‘ఏన్’ శబ్దమును నెల్ల విభక్తుల నొందుట ప్రాచీన పద్ధతియె యని ప్రాచీనకవి ప్రయోగములును బ్రాచీన వ్యాకర్తల సూత్రములును (‘ఏన్’ శబ్ద విభక్త్యంత రూపములు పైని జూపఁబడెను) నిరూపించుచున్నవి. ‘ఏన్’ అను ప్రాచీన కర్ణాట శబ్దపరిణామమె ‘ఏను’ అనెడి హాలాసగన్నడ రూపము. దాని విభక్తి రూపము లిట్లు ‘శబ్దాదర్శ’ అను హాలాసగన్నడ వ్యాకరణమునఁ జూపఁబడినవి. “ప్ర-ఏను. ద్వి-ఏనన్ను. తృ-ఏతరింద. చ-ఏతకెౘ=ఏకె. పం-ఏతరదెసెయింద. ష-ఏతర-సప్త-ఏతరల్లి.” (శబ్దా దర్శ. ౬౨ సూ. ౨౬ పుట).

౧౧౬. III విష:—“‘అమ్’=(అది) అను సర్వనామశబ్దము తమిళ మలయాళములలోని యమహాదేకవచన ప్రత్యయమునందును ద్రావిడ ద్వితీయైకవచన ప్రత్యయమునందును నిల్చియున్నది. ‘అమ్’ అనుదానిచోట ‘అన్’ అనియు వాడుక కలదు. (చూడు III భాగము. విభక్తి ప్రకరణము). ఇట్లె ‘ఇమ్’ శబ్దము కన్నడ పంచమీ విభక్తియందును (ఇది మొదట సప్తమీ విభక్తి) దమిళమందలి ‘ఇల్’ ప్రత్యయమునకు సరియగు ‘ఇన్’ ప్రత్యయమందును గన్పట్టుచున్నది. ‘ఇక్కడ-ఈ స్థలము’ అని దీని ప్రాచీనార్థము. కాలక్రమమున ‘స్థలము=ఇల్లు’ అను నర్థము దానికిఁ గల్గెను. ‘అల్ - ఇల్’ అనునవి ముఖ్యముగాఁ గృత్ ప్రత్యయములు. ఇవి ‘అమ్-అన్’ అనునవి చేరిన శబ్దములతో సమసంఖ్యాకములై యున్నవి. డా. గుండర్టుగారు నిర్దేశ సర్వనామ విశేషణరూపములగు ‘అన్ద-(ఆ) ఇన్ద (ఈ)’ అనునవి ‘అమ్-ఇమ్’ శబ్దముల నుండి యేర్పడినవని యూహించిరి. ఆంధ్ర కర్ణాటములలోని ‘అంత-ఇంత’ శబ్దములకు నట్లె వ్యుత్పత్తి చెప్పెదరని తోఁచుచున్నది. ‘అన్ద-ఇన్ద’ అనునవి ‘అద్-ఇద్’ అను వాని యనునాసికీకరణరూపములని నే నూహించెదను. తుళుభాషలోని ‘ఇన్దు-ఉన్దు’=(ఇది) శబ్దములును నిట్టివెయని యీవఱకుఁ దెలిసికొనియున్నాము. కన్నడమందలి ‘ఇంద’ అను పంచమీ ప్రత్యయమును ‘ఇమ్’ శబ్దమునుండి యేర్పడినదె. “అన్ద్రు=(అన్టు)=(ఆ దినము) ఇన్ద్రు=(ఈ దినము)=(ఇన్టు), ఎన్ద్రు=(ఏ దినము)=(ఎన్టు)” అనునవి “అమ్=అన్, ఇమ్=ఇన్, ఎమ్=ఎన్” అనువానినుండి యేర్పడినవె యని నేను నిస్సంశయముగా నూహించుచున్నాను. (చూడు నిర్దేశార్థక, ప్రశ్నార్థక క్రియా విశేషణములు).”

‘అమ్-ఇమ్-ఎమ్’ అనువానివలెనె ‘ఉమ్’ అనునదియు ‘ఉ’ అను నిర్దేశక సర్వనామముపై మకారము నిల్చిన రూపమనియు నిదియె తమిళ

మలయాళ ప్రసిద్ధమగు 'ఉమ్' అను సముచ్చయార్థక రూపమనియు (పలిగన్నడ-ఉమ్, తెల్గు-ఉ, హళాసగన్నడ-ఊ,) (చూడు ౧౧౩ V విష) నూహింపనగునా?"

"డా. గుండర్టుగారు చేసిన యద్భుతకల్పనములలో నీ 'ఉమ్' శబ్దపు వ్యుత్పత్తి యొకటి. 'ఉయర్ = ఔన్నత్యము = ఎత్తు' అను ధాత్వర్థకమునకు మూలమగు 'ఉ' ధాతువునుండి యీ 'ఉమ్' శబ్దమేర్పడినదని వారు రచించిన మలయాళకోశమున వ్రాసిరి. (చూడు ౧౧౩ V విష). 'ఉమ్' అనుదానికి బదులు 'అమ్' అనునది సముచ్చయార్థకముగఁ బ్రాచీన కర్ణాటమునందుఁ గ్వాచిత్కముగ వాడఁబడును. ఈ వాడుక 'అ' శబ్దము నిర్దేశక సర్వనామాంగమె యని నిరూపించుచున్నది. (పర్యాయములగు 'ఉమ్=అమ్' అనునవి నిర్దేశ సర్వనామరూపములె యని భావము). "అమ్బర్ =(అ స్థలము), ఇమ్బర్ = (ఈ స్థలము), ఎమ్బర్ =(ఏ స్థలము)" (చూడు ౨౮ V విష). అనువానితో సరిగ 'ఉమ్బర్' అను తదిదం శబ్దమాధ్యస్థ్య బోధకమును నగపడుచున్నది. కావున సముచ్చయార్థకమగు 'ఉమ్' శబ్దము విషయమునఁ జెప్పఁబడిన పయి యంశము లయ్యాది నిర్దేశక సర్వనామాభిన్న మనుటకు సరిపడియున్నవి. తమిళ కావ్యములలో సముచ్చయార్థకమగు 'ఉమ్' శబ్దము 'ఉన్దు' అను రూపాంతరము నందుచున్నది. ఇయ్యది తుళుభాషలోని (చూడు ౧౧౫ II విష). 'ఉన్దు'= (ఇది = ఈ వస్తువు. అనుదానిని స్మరింపఁజేయుచున్నది." (కాల్డు. ౪౨౮, ౪౨౯ పుటలు).

విమర్శము:—'అన్దు-ఇన్దు' అను చోటులం దూరకయె 'న' కారము చేరిన దనుటకంటె డా. గుండర్టుగారు చెప్పినట్లుగ 'అన్-ఇన్' అను సర్వనామశబ్దములు వానికి మూలమనుట యుక్తతరమైయుండును. 'అన్దు'=అ దినము మున్నగునవి నేటి తమిళాపభ్రష్టోచ్చారణములు. 'అన్+తు=అన్తు' అను రీతి శబ్దములు వాని నిజరూపములు. పలగన్నడమున 'అమ్' అనుదాని సముచ్చయార్థకత క్వాచిత్క మననేల? అది వైయాకరణసమ్మతము. సుప్రసిద్ధము. చతుర్థీ సప్తమ్యంత ములపైని 'అమ్' శబ్దము సముచ్చయార్థమున నెల్లెడలను బాహుళకముగ నిల్చును.

'ఒళ్గెతో రమ్చ' (కర్ణాట శబ్దా. ౨౯౦ సూ.)=ఒళన్తా ద్గెదన్తాచ్చ పదా త్పర 'ఉమ్-అమ్'చ భవతః సముచ్చయే గమ్యమానే. ఉదా:—అవ నొళుం=అవనొళం=(వానియందును)......అతంగెయుమ్=అతంగం = (అతని కిని). 'ఉమ్' అనుదానికి 'ఉన్తు-(న్దు)' అను రూపాంతరముగలదని తొల్కాప్పి యమునందె చెప్పఁబడెనుగాన నది కేవల ప్రాచీనరూపమని విశ్వసింపనగును.

'ఉమ్ ఉన్తాకుమ్ ఇడనుమార్ ఉణ్డే' (తొల్కా. అవ్యయ ప్రకరణము 'ఇడైయియల్' ౨౭ సూ). 'ఉమ్' అను శబ్దము 'ఉన్తు-(న్దు)' అను రూపమునందు స్థలమును గలదని యర్థము.

పయి సందర్భమునుబట్టి 'ఉమ్' అను సముచ్చయార్థక శబ్దము 'అమ్-ఇమ్-ఉమ్' అను నిర్దేశక సర్వనామరూపములలోని 'ఉమ్' శబ్దమున కభిన్నమను డా. గుండర్టుగారి వ్యుత్పత్తి యెంతయు విశ్వసనీయమనుటకు సందియము లేదు. వైదిక సంస్కృతములో 'ఔ' ప్రత్యయమునుండి (ఔ=అఉ=ఉఁ=ఉమ్) వచ్చినదనెడి డా. నారాయణరావుగారి వ్యుత్పత్తి విశ్వసనీయము కానేరదు. (౧౧౩ V విష. చూడు).

౧౧౭. I విష:—"(౨) నిర్దేశ సర్వనామ విశేషణములు, ప్రశ్నార్థక సర్వనామ విశేషణములు:—నిర్దేశ సర్వనామ ప్రకృతులగు 'అ-ఇ' శబ్దములు నామములకుఁ బూర్వమున నిల్చి విశేషణములగుచున్నవి. అట్టి విశేషణములు లింగ విభక్తివచన చిహ్నముల నొందవు. అట్టియెడలఁ బరస్థిత నామముల మొదటి హల్లుచ్చారణానుకూల్యమునకయి ద్విరుక్తి నందును. ఉదా:—తమి-అన్నాళ్ (అ + న్ + నాళ్) = (ఆ దినము). అట్లు ద్విత్వముగల్గనపుడవి దీర్ఘరూపమున నిల్చును. తమిలమున ద్విత్వముగల్గులెు తఱుచు. మలయాళ కన్నడములలోఁ దఱుచుగ దీర్ఘరూపము నిల్చును. అజాదిశబ్ద పరకత్వమునందలి స్వరసంహితా వ్యవస్థాయకవర్ణము సయితము తమిలమున ద్విరుక్తమగును. ఉదా:—అ+ ఊర్ = అవ్వూర్ = (ఆ యూరు). స్వాభావికమగు నిర్దేశకసర్వనామపు నిర్దేశకతయొక్క దార్ఢ్యమును బోధించుటకై యిట్టి ద్విత్వము గల్గుచుండును. ఇవి విశేషణవాచకము లగుటచేత నితరాగమములవలెఁ గాక ప్రాముఖ్యమును వహించి సమాసోత్తర పదములగు నామముల మొదటి హల్లునకును ద్విత్వమును గల్గించును. ఇట్లె తద్భవములందును ముందుగ 'అ'కారము నిల్చునపుడు గ్రామ్యభాషయందును మొదటి హల్లు ద్విరుక్తమగును. ఉదా:—అ+ఞానమ్= అఞ్ఞానమ్=(అజ్ఞానము)."

"మలయాళమునందును గన్నడమునందును నితర ద్రావిడ భాషలందును నిర్దేశక సర్వనామము లప్పుడప్పుడు దీర్ఘరూపమున నిల్చుచుండును. నిర్దేశ వాచకతా దార్ఢ్యమిట్లు దీర్ఘముచేత ద్యోత్యమగుట రెండవ మార్గము. ఇట్లర్థ దార్ఢ్యద్యోతకముగా దీర్ఘము వచ్చుట సహజ మనఁదగును. ఉదా:—అదిగమ్= (అధికము). మిక్కిలి యాధిక్యమును వివక్షించునపుడు 'అదీగమ్' అని వాడఁబడును. ద్రావిడభాష లన్నిటిలోను బ్రథమపురుష రూపములందు నియత

ముగా హ్రస్వరూపములై వెలయుచుండుటచేత నిర్దేశక సర్వనామములకు హ్రస్వరూపమె సహజమని యెన్నవగును." (కాల్డు. ౪౨౯, ౪౩౦ పుటలు).

"ప్రశ్నార్థకమగు 'ఏ' శబ్దముకూడ దీర్ఘమగుట గలదు. తమిళ భాషలో దీని కర్థదార్ఢ్యప్రయుక్తమగు దీర్ఘము వచ్చుట యరుదు. 'ఏదు=(ఏది) ఏన్= (ఏమి)' అను దీర్ఘఘటిత రూపములు తమిళ కావ్యములలో మాత్రము గన్పట్టును. ('వ్యవహారమునను గలవు.' శ్రీ రెడ్డిగారు.) మలయాళమున దీర్ఘరూపములు (ఏదు-ఏన్) మిక్కిలి తఱుచు. తెల్గు నందును నిట్టి దీర్ఘ రూపములు గలవు. (ఏది-ఏవి-ఏమి). 'ఏమి-ఏల' అను శబ్దములందేకాక విశేష్య పూర్వవృత్తిత్వ మందును బ్రశ్నార్థమున దీర్ఘము నిల్చును. ఉదా:—ఏ యూరు-ఏ దేశము. మొ. తమిళమున 'ఎవ్విదము' అను రీతిని హ్రస్వ రూపమె యుండును. కాని తెల్గున 'ఎవ్విధము-ఏవిధము' అను రీతిని హ్రస్వ దీర్ఘరూపములు రెండును నుండును. తమిళములోని 'ఎవన్' శబ్దమువలెనె తెల్గున 'ఎవ్వఁడు' అను హ్రస్వరూప ముండును. విశేషణముగా వాడినపుడు సైతము తమిళమందు వలెనె తెల్గునందును హ్రస్వ రూపము గలదు. ఉదా:—ఎప్పుడు=ఎపుడు= ఎప్డు. 'ఏపుడు' అను దీర్ఘ రూపము లేదు. తుళు భాషయందలి ప్రశ్నార్థక కాలవాచకములలో 'ఏ' అను దీర్ఘ రూపమె ప్రకృతి యనఁదగును. స్థలవాచక ములలో 'ఏ' శబ్దమునకు బదులుగా 'ఓ' శబ్దమున్నది. ఉదా:—ఓళు=(ఎక్కడ) 'వోళు' అని యుచ్చరింతురు.' (కాల్డు. ౪౩౦ పుట).

"'అన్ద=(ఆ) ఇన్ద(ఈ) ఎన్ద=(ఏ)' అను మఱి మూఁడు తమిళ వ్యావహా రిక విశేషణ రూపములు గలవు. ఇవే నిజమైన తమిళ నిర్దేశక సర్వనామము విశేషణ రూపములు. ఉదా:—అన్దమరమ్=(ఆ చెట్టు). ఇన్ద నిలమ్=(ఈ నేల). ఎన్ద ఆళ్=(ఏ మనుష్యుఁడు). ఇట్టివి మలయాళమునఁ గాని యితర ద్రావిడ భాషలందుఁ గాని తమిళ గ్రాంథిక భాషయందుఁ గాని లేవు. (తమిళ గ్రాంథిక భాషలోఁ గలవు. శ్రీ రెడ్డిగారు) తమిళమునుండి మల యాళము వేఱుపడిన తర్వాతఁ దమిళ గ్రాంథిక ప్రాథమిక స్థితి దాఁటిన వెనుక నివి యేర్పడి యుండును. ఈ విశేషణముల తుది 'అ' కారము క్రియాజన్య విశేషణముల తుదిని నిల్చు 'అ' కారమునకును, శేష షష్ఠియొక్క 'అ' కార మునకును నభిన్నము. ఇంకఁ దక్కిన 'అన్ద్=అన్త్' మున్నగునవి నిర్దేశక సర్వ నామ రూపములు. కొంచెమర్థ భేదముతో నున్నట్టి వీనికి సరియగు నాంధ్ర కన్నడ రూపములు 'అంత-ఇంత-ఎంత' అనునవి. "అంత అను దానికి=అటు వంటి=దానివంటి" అని యర్థము. మలయాళములో 'ఇన్న' శబ్దమున కిట్టి యర్థము గలదు. ('తమిళమందును గలదు.' శ్రీ రెడ్డిగారు) ఉదా:—ఇన్నపూర్= ఏతాదృశ పురము. ఈ రీతిగల 'అన్న' శబ్దము మలయాళమునందును లేదు."

“‘ఈ సందర్భమునఁ దెల్గులోని ‘అట్టి–ఇట్టి–ఎట్టి’ శబ్దములును గన్నడ మందలి ‘అనితు–ఇనితు–ఎనితు’ అను శబ్దములును నుదాహరింపఁ దగినవి. ‘అందఱు–ఇందఱు. ఎందఱు–అన్ని–ఇన్ని–ఎన్ని’ అను తెనుఁగు శబ్దములును వీనిని సంబంధించినవె.’’ (కాల్డు. ౪౩౦, ౪౩౧ పుటలు).

“‘‘అల్–ఇల్–ఎల్’ అను ప్రకృతులు క్రియా విశేణములు. వానిలో నొకటియగు ‘అల్’ అనునది తెల్గున ‘అల్ల’ అను రూపముతో విశేషణముగా వాడఁబడుచున్నది. ఉదా:—అల్లది. మలయాళములోని ‘ఆ–ఈ’ అను విశేషణ ములకును దమిటమందలి ‘అన్ద–ఇన్ద’ అను విశేషణములకును బదులుగా ‘అదు–ఇదు’ అను శబ్దములు తమిటి మలయాళములలో నిపుడు దఱచుగా (‘అఱవమున అరుదు’. శ్రీ రెడ్డిగారు). వాడఁబడుచున్నవి. ఉదా:—తమి–అదు కారియమ్=(ఆ కార్యము). (మల)–అదు పొఱుదు=(ఆ ప్రొద్దు)’’ (కాల్డు. ౪౩౦, ౪౩౧ పుటలు).

విమర్శము.—ద్రావిడ భాషలన్నిటిలోను బ్రథమ పురుష నిర్దేశక సర్వ నామములు నియతముగా హ్రస్వరూపములై యుండును గాన నిర్దేశక సర్వ నామములు హ్రస్వ రూపములె యనందగు ననెడి కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదు. ప్రథమ పురుష రూపములు తెల్గున–“వాఁడు–వీఁడు–వారు–వీరు–ఆమె–ఆపె–ఆకె–ఈమె–ఈపె–ఈకె’’ అనియుఁ గన్నడమున “ఆతం=(వాఁడు) ఈతం=(వీఁడు) ఆకె–ఈకె’’ అనియు ‘కు’ భాషలో ‘ఆ ఆఞు’ ‘ఆ ఆలు’ అనియు నిట్లు పెక్కు దీర్ఘ రూపములును గలవు. ‘ఆ–ఈ’ అనునవి విశేషణ త్వావస్థలో ద్రావిడ భాషలన్నిటి యందును దీర్ఘ రూపములై యున్నవి. నపుంసక ప్రథమ పురుష సర్వనామ రూపములలో హ్రస్వరూపము లున్నవి గాన వానిమూలరూపము హ్రస్వఘటితమె యనుటలో యుక్తి యేమున్నది? విశేష ణములందలి దీర్ఘమె మూలరూపమని యేల చెప్పరాదు? “తమిటి కావ్యము లందె దీర్ఘరూపము లుండుట, తక్కిన తమిటములో లేకుండుట’’ అను స్థితియే నిర్దేశక సర్వనామములు దీర్ఘరూపము లనుటను స్థిరపఱుపఁ జాలును.

‘నీడవరుదల్......’ (తొల్కా. ౨౧౯ సూ.)=‘అ’ శబ్దము పద్యము లందు ‘ఆ’ అను రూపముతో నుండును.

మఱియుఁ దెలుఁగున ‘ఆ మానిసి=అమ్మానిసి’ అను ద్వివిధ రూపములు నుండుటయుఁ, నందలి దీర్ఘము హ్రస్వమగుటకుఁ బరిహారముగాఁ బరహల్లు ద్విత్వమగుటయు నను నీ స్థితియే వాని మూల రూపము దీర్ఘమె యనుటకుఁ బ్రబల నిదర్శనమనఁదగును. దీర్ఘముగాని పరవ్యంజన ద్విత్వముగాని యర్థదార్ఢ్య

ద్యోతకమనుట పట్టి కల్ల. అచట నర్థదార్ఢ్య మేమియు భాసింపదు. కావున నట్లనుట యనుభవ విరుద్ధము.

"ఇద మద ఏత ద్య త్త । చ్ఛబ్దా శ్శబ్దాన్త రాన్వయే బహుళమ్ । హ్రస్వం ప్రపద్య దీర్ఘా । ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి" (ఆం. చిం. చూడు. ‘వ్యా. సం.’ ౨౮౦ విష.) కన్నడమం దిట్టి యెడల హ్రస్వరూపమే లేదు. ద్విత్వ మెట్లును లేదు. ‘అదు-ఇదు-ఉదు’ శబ్దముల కుత్తరపద పరకత్వమున (అనఁగా సమాసమున) దీర్ఘమే నిల్చును.

"‘ఆ దీ దూ దద్వి దూదోః’ (కర్ణాట శబ్దా 320 సూ.)=(వృత్తి) ‘అదు-ఇదు-ఉదు’ ఇత్యేతేషాం యథాక్రమం ‘ఆ-ఈ-ఊ’ ఇత్యేతే ఆదేశా భవన్తి. ఉత్తర పదేపరే. ప్రయోగః. అదు+నాడు=ఆ నాడు=(ఆ దేశము). ఈ యానె=(ఈ యేనుఁగు)......" (చూడు ౪౯ III విష).

తమిళ మలయాళములలో హ్రస్వమే నిల్చును గానఁ బరహల్లు నియతముగా ద్విరుక్తమగుచున్నది. ఉదా:—అ+ఇడై = అయ్యిడై = (ఆ చోటు). అ+అడి=అవ్వడి (ఆ పాదము) ఇ+మణి=ఇమ్మణి=(ఈ గంట)=(చూడు తొల్కా. ౨౦౫, ౨౦౬-౨౦౯ సూ.). తమిళమున ‘ఆన్-ఈన్’ మున్నగు స్వతంత్ర దీర్ఘ రూపములును గలవు.

"మన్నుమ్ చిన్నుమ్......" (తొల్కా. 33౪ సూ.)="మన్-చిన్-ఆన్=(అక్కడ) ఈన్=(ఇక్కడ)-పిన్-మున్" శబ్దములకు......పరుష పరకత్వమున వ్యస్త సంధిలో ‘న’ కారము ఱకారమగును.

"చుట్టుచ్చినై......" (తొల్కా. ౪౨౮ సూ.)="ఆఙ్కు (ఙ్గు)=(అచట) ఈఙ్కు (ఙ్గు)—(ఇచట) ఊఙ్కు=(ఙ్గు)" అను శబ్దములకును......వ్యస్త సంధిలోఁ బరస్థ పరుషము ద్విరుక్తమగును. ఉదా:—ఆఙ్కు+చెన్రాన్=అఙ్కు (ఙ్గు) చ్చెన్రాన్=(అచటికిఁ జనెను).

తెల్గులోని ‘అద్ది’ అనుచోట ద్విత్వము (ఇద్ది-ఎద్ది) ‘ఆయది=అద్ది=అది’ అను పరిణామ క్రమమును సూచించుచున్నది. ఏ+వాఁడు=ఏవాఁడు=ఎవ్వాఁడు=ఎవఁడు-మొ.

ప్రశ్నార్థక సర్వనామములలోఁ దొల్కాప్పియమునఁ బేర్కొనఁబడిన ‘యా=యాదు’ శబ్దమే ప్రాచీనమనియు దాని పరిణామ మనఁదగు-‘ఏ=ఏదు’ అనునది ‘ఎదు-ఎది’ మున్నగు నర్వాచీన రూపములకు మూలమనియు గ్రహింపవలెను. తొల్కాప్పియము నాఁటికి ‘ఎదు’ శబ్దముగాని దానికి మూలమగు ‘ఏదు’ శబ్దముగాని లేదు. ‘యా=యాదు శబ్దమె పేర్కొనఁబడెను.

"అదు ఇదు......" (తొల్కా. ౬౫౧ సూ.)="......‘యాదు-యా-యావై’......అమహాన్నామములు."

అజ్ఞాన శబ్దపు వికృతిలో 'జ ఞ'ల సంయోగము ద్విరుక్త 'ఞ' కారముగాఁ బరిణమించుటచేత 'అఞ్ఞానము' అని యేర్పడెననుట యుక్తము.

'అంత-ఇంత-ఎంత' అనునవి తెల్గు శబ్దములు. ఇట్టి రూపములు కన్నడ మున లేవు. ఇవి యాంధ్ర కర్ణాట రూపములనెడి దొరగారి వ్రాఁత సరికాదు. తెల్గున నివి పరిమాణార్థమును దెల్పును. 'అటువంటి' అనురీతి సాదృశ్యమును బోధింపవు. తెల్గులోని 'అంత' మున్నగువానికి సరియగు కన్నడ రూపములు 'అనితు' మున్నగునవి.

"అద్వాదూదో ర్నితుః పరిమాణే దో ర్లుప్చ" (కర్ణాట శబ్దా-౪౩౫ సూ.) (వృత్తి) "అదు-ఇదు-ఉదు ఇత్యేతేభ్యః నితు ప్రత్యయో భవతి పరిమాణే ఽర్థే గమ్యమానే దో ర్లోపశ్చ. ఉదా:—అనితు-ఇనితు-ఉనితు" ఇట్లగుటచేత 'అనితు' మున్నగునవి 'అట్టి' మున్నగు తెల్గు శబ్దములవంటివి కావు.

తెల్గున 'అల్ల' శబ్దమాత్రమే కాదు. 'ఇల్ల-ఉల్ల' అను విశేషణ రూపములును బ్రయుక్తములై యున్నవి. 'అల్ల=అల'. నిర్దేశమునకు:—సీ. నీలజీమూతంబు లీల నాక్షేపించు నల్లనై తోఁతెంచు నల్ల గృహము (భార. ఆది. ౬ ఆ. ౨౧౧ ప.) "ఇల్లకప్పడి సంగమేశ్వరంబందు (బసవ. ౧ ఆ. ౫౫౧ ప.) "ఉల్ల. స......గీ. ఉల్లపద్మాకరము పొంతనుండి నిన్న............(భార. ఆర. ౬ ఆ. ౧౫౪)........గీ. ఉల్లకాంచన రథముపై నున్న వాఁడు-(భార. ఆర. ౬ ఆ. ౧౫౩)......సీ. మేలుగాకేమి టంకాల జాలెము లెన్ని I యుల్లపెట్టియ నిండి యున్నయవియ. (కాశీ. ౭ ఆ. ౨౪౪ ప. సూ. రాని)

సీ. ఉల్ల తెల్లని తురగోత్తము వాలంబు......(భార. ఆది. ౨ ఆ. ౩౪) (చూడు ౧౧౫ I విష). (చూడు ౭౧౧, ౭౧౨ పుటలు).

౧౧౭. II విష:—"నిర్దేశకములు ప్రశ్నార్థకములు నగు సర్వనామావ్యయములు:—ద్రావిడభాషలందలి యవ్యయము లన్నియు నిజముగా నామములో క్రియలోనై యుండును. అట్టి నామముల పైని విభక్తులు నిల్వఁ దగియున్నను నిలుపరు. అట్లు నిలుపకున్నను నవి చతుర్థ్యర్థక (క షష్ఠి)ములో సప్తమ్యర్థకములో నై యుండును. ఉదా:—తమి-అఙ్గు = ఆఙ్గు = (ఆ చోటియందు). ఇఙ్గు=ఈఙ్గు=(ఈ చోటియందు) మొ. అట్టివి స్థలవాచకములు, కాలవాచకములు, హేతు వాచకములు మున్నగువానిలో నేదే నొక్కొక్క యర్థమొక్కొక్క భాషయందు వెలయుచుండును. "క-గ-జ-చ-జ-ఞ-ట-డ-ణ-త-ద-న-మ్బ" అను ప్రత్యయములు నిర్దేశక సర్వనామముల పైని బ్రశ్నార్థక సర్వనామముల పైని నిల్చుచుండుటచేత వివిధములగు నవ్యయము లేర్పడుచుండును. అట్టి ప్రత్యయములు వచ్చిన సర్వనామావ్యయము లిటఁ బాఠక సౌలభ్యమునకై పట్టికఁగా జూపఁబడుచున్నవి."

"నిర్దేశక సర్వనామములయుఁ బ్రశ్నార్థక సర్వనామములయుఁ బట్టిక.

| తెలుఁగు | తమిళము | కన్నడము | గోండు | తుళు |
|---|---|---|---|---|
| ఇక్కడ | ఇజ్గు=ఈజ్గు. ఇవన్ (ణ్?)= (గ్రాం - తమి). ఈణ్డు = (ఇక్కడ - ఈ జన్మమందు). ఇమ్బర్-(తమి-మలయా). | ఈగ | ఇగ | — |
| అక్కడ | అజ్గు=ఆజ్గు అవన్ (ణ్?) అమ్బర్-(తమి-మల). | ఆగ | అగ-హాగ | — |
| ఎక్కడ | ఎజ్గు=యాజ్గు. యాణ్డు= (ఆణ్డు - గ్రామ్య తమి) = (ఎక్కడ - ఎప్పుడు - సంవత్సరము). ఎవన్ (ణ్?). ఎమ్బర్ (తమి-మలయా). | యావాగ | బగ | — |
| ఇట్లు | | హీగె | | |
| అట్లు | | హాగె | | |
| ఎట్లు | | హ్యాగె | | |
| ఏల | | యాకె | | |

కాల్డు.—నిర్దేశక సర్వనామావ్యయములు. ప్రశ్నార్థక సర్వనామావ్యయములు.

| తెలుఁగు | తమిళము | కన్నడము | గోండు | తుళు |
|---|---|---|---|---|
| ఇటు | | | | ఇఞ్చి-ఇడె |
| అటు | | | | అఞ్చి-అడె |
| ఎటు | | | | ఒఞ్చి-ఒడె |
| ఈలాగు | | | | ఇఞ్చ |
| ఆలాగు | | | | అఞ్చ |
| ఏలాగు | | | | ఎఞ్చ |
| ఇప్పుడు / ఈ దినము | ఇన్ద్రు=ఇత్రై=మల-ఇన్న్. | ఇందు=(ఇప్పుడు ఈ దినము-ఈ జన్మము) | ఇఙ్గ= (ఇప్పుడు) | ఇని |
| అప్పుడు / ఆ దినము | అన్ద్రు=అత్రై=మలయా-అన్న్. | అందు = (అప్పుడు. ఆ దినము—భావిజన్మము) | | ఆని |
| ఎప్పుడు / ఏ దినము | ఎన్ద్రు=ఎత్రై. మల-ఎన్న్. | ఎందు = (ఎప్పుడు ఏ దినము) | | ఏని |
| ఈ వైపు | | | హికె | |
| ఆ వైపు | | | హాకె | |

"

(తెల్గు-ఆ వైపు; ఏ వైపు; ఇట=ఈడ=ఇందు. అట=ఆడ=అందు; ఎట=ఏడ=ఎందు అనువానికి దొరగా ఇతర ద్రావిడ పర్యాయముల నిచట వ్రాయలేదు).

"ఇఙ్గు మొదలగు తమిళ శబ్దము లనునాసికీకరణ సిద్ధములని నా యూహ. వీని నిరనునాసికరూపములగు 'ఇగ' మున్నగునవి కన్నడ గోండు భాషలలో వెలయుచున్నవి. గోండు భాషలోని 'ఇగ' శబ్దమును సంస్కృతమందలి 'ఇహ' శబ్దమును మిక్కిలి పోలిక గల్గియున్నవి. అయినను 'ఇగ' అనునది సంస్కృత భవముకాదు. 'ఇ' అను సర్వనామము ద్రావిడభాషలం దనాదిగఁ గలదు. ఈ పోలిక "సంస్కృ-'అహమ్'=లాటిన్-'ఎగో'" అను వాని (౧౧౯ I విభ). వంటిదే. 'ఇగ' అనునది ద్రావిడశబ్దమె యనుటకుఁ గన్నడ గోండు భాషలలోని 'గ' ప్రత్యయాంతములు పెక్కుశబ్దములు నిదర్శనములు. మంగోలియను భాషలోని (సిథియను) 'యగొ=(ఏమి)' శబ్దము సైతము నిదర్శనము కానోపును."

"దక్షిణ తిరునెల్వేలిజిల్లాలో 'ఇఙ్గె=ఇఙ్జె'=(ఇక్కడ) అను శబ్దము వాడఁ బడుచున్నది. తెల్గు-'ఏడ=(ఎక్కడ)' అనుదానికి 'ఎప్పుడు' అను గౌణార్థము చొప్పున 'ఏడు' అనుదానికి సంవత్సరమను నర్థము గల్గెను. తమిళ 'యా' శబ్దమునుండి "యాడు=యాణ్డు=(ఏకాలము - సంవత్సరము)" అనెడి యను నాసికీకరణ సిద్ధరూప మేర్పడెను. (కాలమాత్రవాచి కాలవిశేష వత్సరార్థకము కానోపునని భావము) పయిశబ్దములపై నన్ని భాషలందును విభక్తులు నిల్చును. కాన నవి నామవాచకములె యనఁదగును. 'ఇదు-అదు-ఎదు' శబ్దము లను నాసికీకరణముచేత 'ఇందు-అందు-ఎందు' అను కన్నడ శబ్దములు సిద్ధించె ననఁదగును. కన్నడమందలి 'అల్లి' (సప్తమి) శబ్దమువలెనె తెల్గునందలి 'అందు' శబ్దము సప్తమీప్రత్యయమయినది. 'అల్ + దు=అన్దు=అన్ద్రు'=(ఆ కాలము), 'ఇల్ + దు = ఇన్దు = ఇన్ద్రు' = (ఈ కాలము) 'ఎల్ + దు = ఎన్దు = ఎన్ద్రు'= (ఏ కాలము). ఈ రూపముల ప్రక్రియను బైరీతి నరయునది. క్రియ లందును నిట్టి రూపములు గలవు. అల్=(కాదు)+దు=అన్టు=అన్ద్ర. ఎన్= (వచించు)+దు=ఎన్టు=ఎన్ద్రు" (చూడు ౧౭ XVI విభ).

"'అమ్బర్ ఇమ్బర్-ఎమ్బర్'=(ఆ స్థలము-మొ.) (చూడు ౧౧౬ III విభ) అనునవి వ్యవహారభ్రష్టములై గ్రంథములందుమాత్రము నిల్చియున్నవి. వీని తుది 'అర్' అనునది 'అల్' అనుదానికి సమానమైనది. 'యమ్బర్=(ఏమి) యగె=(ఏమి)' (మంగోలియను భాష)' అనువానికి యత్కిమర్థకమగు 'యా=ఏ' శబ్దమె మూలము" (కాల్డు, ౪౩౧, మొ. ౪౩౪ పుటలు).

విమర్శము.—డా. కాల్డువెల్లుగారు పయిశబ్దములెల్ల నింగ్లీషుపద్ధతి నవ్యయములె యని వ్రాసిరి. 'అక్కడ' మున్నగు తెల్గుశబ్దములు విభక్తియోగ యోగ్యములగుటంజేసి యవి యవ్యయములు కానేరవు. (చూడుఁడు అవ్యయ శబ్దార్థనిరూపణము. 'వ్యా. సం.' ౨౧౧ విష).

తమిళమందును "అఙ్గు నిన్ఱు=(అక్కడనుండి)" అనుటగలదు. కాని 'అఙ్గు' అనుదానిపైని విభక్తిచిహ్నములు నిల్చుటలేదు. అట్టివాని నవ్యయములు (ఇడైచ్చొల్) అనుట యుక్తమె. (శ్రీ రెడ్డిగారి జాబు. ౨౦-౯-౫౩).

'అఙ్గు-ఇఙ్గు-యాఙ్గు' మున్నగు తమిళ శబ్దములును 'అన్దు-ఇన్దు' మున్నగు కన్నడ శబ్దములును ననునాసికీకరణ సిద్ధరూపములు కావు. 'అల్-అన్' అను సర్వనామ శబ్దములు వాని పూర్వావయవము లనఁదగును. ఈ విషయములు విమర్శితపూర్వములు. కాల్డువెల్లుగారె 'అన్దు-అన్ద్రు' మున్నగువాని పూర్వావయవములు 'అల్-అన్' శబ్దములె యని యీ సందర్భమందె వ్రాసియున్నారు. తెల్గులోని యాధునికమగు-'ఏడ' శబ్దము 'ఏ యెడ' శబ్దముయొక్క యపభ్రష్ట రూపమనియు నట్టి నవ్యశబ్దము ప్రాచీనమగు - 'ఏందు - ఏఁడు' శబ్దమునకు మూలము కానేరదనియు నీ వఱకు వ్రాయఁబడెను. (చూడుఁడు ౨౮ V మొ. ౨౮ VII-వ. గల విషయములు).

౧౧౭. III విష:—"లళ ప్రత్యయములు:—కన్నడ:—ఇల్లి =(ఇక్కడ). అల్లి=(అక్కడ). ఎల్లి=(ఎక్కడ). తెల్గున 'ఇల్' అను నిర్దేశవాచక సర్వనామ రూపము లేదు. కాని 'ఇలు-ఇల్లు' (తెల్గు) అను శబ్దములం దయ్యది చూపట్టు చున్నది. ఇల్=ఇల్లు=ఇలు=(ఈ స్థలము-ఇక్కడ). దీని తెల్గు దీర్ఘరూపము. ఈలా=(ఈలాగు). ఇల్లె-అల=అక్కడ. ఆలా=(ఆలాగు). ఎల్లి=(ఎక్కడ). ఎల్లి=(తేపు). తుళు-ఎల్లె=(తేపు). ఏలా=ఏల=(ఏలాగు). పైవానినిబట్టి 'ల' అనునది నిర్దేశవాచకములకును బ్రశ్నార్థకమునకును జేరు ప్రత్యయములలో ముఖ్యమైనదని తేలుచున్నది. తుళుభాషలోని 'ల' ప్రత్యయము 'ళ' కార రూపము నందును. ఉదా:—మూళు=(ఇక్కడ). అవళు=(అక్కడ) ఓళు=(ఎక్కడ)." (కాల్డు. ౪౩౪ పుట).

"తెల్గు-కన్నడములందువలెఁ దమిళమున 'ల' కారయుక్త సర్వనామము లేదు. 'ఎల్' శబ్దమున దాని ఛాయ చూపట్టుచున్నది. సకల ద్రావిడభాషల లోను 'ఎల్' శబ్దమునకు 'సీమా'ర్థమును సర్వశబ్దార్థమును గలవు. తమిళమందలి 'ఎల్' శబ్దార్థపరిణామక్రమ మీ క్రింద నుదాహరింపఁబడుచున్నది.

౧. 'ఎల్' శబ్దమునకు='ఎక్కడ-ఎప్పుడు-ఏమి' అను నర్థములు కర్ణాటాంధ్రములలోఁ గలవు. ఇవి యూహింపఁబడిన యర్థములు.

౨. "కొంతకాలము-ఒకదినము తేపు" అను నర్థములు దీనికిఁ దెల్గు తుళు భాషలలోఁ బరిశీలింపనగును. తమిళమున 'సూర్యుఁడు' (పగటికిఁ గారణము) 'రాత్రి.' (అదియుఁ గాలవాచకమె) అను నర్థములు గలవు. దీని రూపాంతరములు:—ఎల్లై-ఏల్లై=(కాలము. ఒకదినము). ఎల్లి-ఎల్లవన్-ఎన్రు-(ఎల్+తు). ఎన్రవన్=(సూర్యుఁడు). ఎల్+పాడు=ఎఱ్పాడు=(సూర్యాస్తమయము). ఎల్లి శబ్దమునకు 'రాత్రి-సూర్యుఁడు' అను నర్థములు గలవు.

3. సరిహద్దు:—'ఎల్లై' ఇది తమిళరూపము. ప్రాచీన తమిళరూపము-'ఎల్గై' అనునది. 'గై' భావార్థక ప్రత్యయము. ఈ పదమునకుఁ దమిళమున "సీమ-కాలములోని యొక భాగము - కాలము-సూర్యుఁడు-తుది-తుదిది" అను నర్థములు గలవు. వీనిలో ద్వితీయ తృతీయ పరిణామము లభిన్నము లన వచ్చును. 'కాలముయొక్క తుదిభాగము' అను నర్థముద్వారా 'సరిహద్దు' అను నర్థము లభించును. "ఎల్లై (త్) తీ=తుదియగ్ని=ప్రళయాగ్ని" అని గ్రాంథిక తమిళమునఁ గలదు.

౪. సర్వము:—ఇది సందిగ్ధముగ నున్నను 'సరిహద్దు' అను మూలార్థము పట్టున నాకును డా. గుండర్టుగారికిని నేకీభావము గలదు. 'సరిహద్దు వఱకుఁ గలదంతయు' అనురీతిని 'సర్వము' అను నర్థము దీనికిఁ గల్గెనని నా యూహ. 'ఎల్+ల్+ఆ=ఎల్లా' అను చోపూన నభావార్థక (వ్యతిరేకార్థక) 'ఆ' శబ్దము మూలమున హద్దు లేనిదనఁగా 'సర్వము' అను నర్థము గల్గునని గుండర్టుగారి యాశయము. ప్రాచీన తమిళరూపమున నిట్టి యభావార్థపు జాడలు గన్పట్టవు గాన నేను గుండర్టుగారితో నేకీభవింపఁజాలను. "ఎల్+ఆమ్ = ఎలామ్ = (మేమందఱము), ఎల్+ఈర్ = ఎలీర్ = (మీరందఱు)". ప్రాచీనరూపము ('ఎల్లావుమ్=(ఎల్ + ల్ + ఆ = ఉమ్)' అనుదానిలోని 'ఆ' శబ్దము 'ఆగు' ధాతుజ విశేషణ సంక్షేపరూపము, 'ఉమ్' శబ్దము సాకల్యార్థకము. 'ఆగు' అనునది విశేషణ విశేష్యముల సంబంధమును దెల్పును. ఇట్లు 'ఎల్' శబ్దపు సీమార్థము 'సర్వము' అను నర్థమును సంపాదించుచున్నది. "ఎవన్+ఉమ్=ఎవ్వఁడును=ఎవ్వఁడేని=ఎల్లవారును" అనురీతినె, కిమర్థకము-సీమార్థకము నగు 'ఎల్' శబ్దము సర్వార్థకమగుచున్నది. సూర్యార్థకము నేకవచనము నగు 'ఎల్లవన్' శబ్దము సైతము 'ఎప్పుడు-కాలము' అను నర్థము గల 'ఎల్' శబ్దమునుండి వచ్చినదె. దాని బహువచనమగు 'ఎల్లవర్' శబ్దము గ్రాంథిక తమిళమున సర్వార్థకముగా (ఎల్లవారు) వాడఁబడుచున్నది. పైరీతిని

'ఎల్' శబ్దము లన్నియు నభిన్నములె యని యూహింపనగును." (కాల్డు. ౪౩౪, ౪౩౫ విషయములు).

విమర్శను:—తొల్కా-ప్పియమున 'ఎలామ్-ఎలీర్-ఎల్లావుమ్' మున్నగు దొరగారు చూపిన రూపములు లేవు. అవెల్ల నర్వాచీన రూపములు కావల యును. 'ఎల్లామ్ = (అవెల్ల) ఎల్లారుమ్ = (వారందఱు)' 'ఎల్లీరుమ్ = (మీా రందఱు)' మున్నగు రూపములె ప్రాచీన రూపములు. మఱియు 'ఎల్లామ్' మున్నగు వానిలో 'ఆ' అనునది 'ఆగు' ధాతుజ విశేషణ సంక్షేపరూపమనియు నది విశేషణ విశేష్యముల సంబంధమును దెల్పుననియు వ్రాసిన దొరగారి వ్రాఁత సరికాదని తోఁచుచున్నది. తొల్కా-ప్పియమున 'ఎల్లామ్' అనునది ప్రకృతిగాఁ జెప్పఁబడినది. విభక్తి పూర్వాగమము నిల్చునపుడు సైతము పూర్వావయవము 'ఎల్లా' అను దీర్ఘరూపముననే నిల్చును.

"ఎల్లామ్ ఎన్నుమ్......" (తొల్కా. ౧౯౦ సూ.)='ఎల్లామ్' శబ్దమునకు విభక్తి పరమగునపుడు 'వఱ్ఱు' (ట్టు) అనునాగమము వచ్చును. ఆ విభక్తికిఁ దర్వాత 'ఉమ్' శబ్దము నిల్చును. తొల్కా-. ౧౩౪ సూత్రము చొప్పునఁ దుది 'మ' కారము లోపించును. ఉదా:—ఎల్లామ్+ఐ=ఎల్లామ్+వఱ్ఱు (ట్టు)+ఐ+ఉమ్=ఎల్లావఱ్ఱై (ట్టై) యుమ్=అన్నిటిని. విభక్తి ప్రత్యయమునకుఁ దర్వాత 'ఉమ్' నిల్చుట సంప్రదాయము గాన దానిని సంబంధించిన తుది మకారము ౧౩౪ సూత్రము చొప్పున లోపించుట యుక్తమె. పయి రీతిని బ్రకృతి ప్రత్యయముల సంబంధమును దెల్పు విభక్తిపూర్వాగమమునకు సైతము పూర్వమున నిల్చునట్టి 'ఆ' శబ్దము ప్రకృతిలోనిదే యనఁదగును గాని విశేష్య విశేషణముల సంబంధమును దెల్పు 'ఆగు' ధాతుజ విశేషణ సంక్షేపరూపము కానేరదు. అచట నట్టి విశేషణమునకుఁ బ్రసక్తియే లేదు. కాన—డా. గుండర్టుగారు చెప్పినరీతిని 'ఎల్లామ్' శబ్దములోని 'ఆ' శబ్దము వ్యతిరేకమును బోధించు ప్రత్యయమె యనుట యెంతయు యుక్తమనఁదగును. ఉదా:—'ఎల్+ల్+ఆ+మ్=ఎల్లామ్'. అను ప్రకృతిలోని 'ఆ' వ్యతిరేకార్థ బోధకమగుటచేత 'హద్దులేనిది=సర్వమును' అను నర్థము లభించుననుట యుక్తతరము. అందలి 'ఆ' శబ్దము వ్యతిరేకార్థకము-'ఉమ్' సాకల్యార్థకము. ఇందెట్టి విరోధమును గానరాదు. ఎట్టి విరోధమును భావించి డా. కాల్డువెల్లు గారు డా. గుండర్టుగారితో నేకీభవింపఁజాలనని వ్రాసిరో తెలియకున్నది. తొల్కాప్పియ ప్రసిద్ధరూపములలో నభావార్థపు జాడ కనఁబడుచుండఁగా నేవో లేనిపోని రూపములలో నయ్యది లేదని దొరగారెట్లు చెప్పఁగలరు? తొల్కా-

ప్పియ రూపముకన్నఁ బ్రాచీనరూపము దొరగారికిఁ దమిళమున లభించుట యసంభవము గదా!

౧౧౭. IV విష:—" 'అల్-ఇల్' శబ్దముల వివరణము:—'ఎన్-ఏన్' అను ప్రశ్నార్థకములకు సరిగా 'ఇన్-ఇమ్-అన్-అమ్' అను సర్వనామములున్నట్లె వెనుకటి విషయమున వివరించిన 'ఎల్' అను ప్రశ్నార్థక సర్వనామమునకు సరిగా 'ఇల్-అల్' అను నిర్దేశార్థక సర్వనామములును దమిళమునఁ గలవని యంగీకరింపనగును. 'ఇల్' శబ్దము సప్తమీ విభక్తి ప్రత్యయము. దీని రూపాంతరము 'ఇన్' అనునది పంచమీ ప్రత్యయము. 'ఇల్' అనునది 'ఇల్లు' శబ్దార్థకము. భావార్థకములగు 'ఇల్-అల్' ప్రత్యయములును దమిళమునఁ గలవు. ఉదా:—ఇల్:—కట్టిల్=(మంచము). వణ్డిల్=(బండిచక్రము). అల్:—కడ+అల్=కడల్=(సముద్రము). ఇందలి 'అల్' అనునది 'అన్-అమ్' అనువానికి సరియగును. ఉదా:—ఆట్+అమ్=ఆటమ్=(లోఁతు). కడ+అన్=కడన్=(ఋణము). అల్+తు=అన్టు=అన్దు=(ఆ దినము). ఇల్+తు=ఇన్టు=ఇన్దు=(ఈ దినము). ఎల్+తు=ఎన్టు=ఎన్దు=(ఏ దినము) (చూడు ౧౧౭ XVI విష). వీనిలోని పూర్వావయములు 'ఇన్-అన్-ఎన్' అనునవె యనియుఁ జెప్పనగును. ఉదా:—'ఎన్=(వచించు)+తు=ఎన్టు=ఎన్దు' అనియు నున్నను 'ఎన్దు=(ఏ దినము)' అనుదానిలోనిది 'ఎల్' శబ్దమే యని నిశ్చయింపనగును. (చూడు ౧౧౭ II విష). ఇట్టి 'ఎన్దు' అనుదాని సమానన్యాయమున 'అన్దు=(ఆ దినము), ఇన్దు=(ఈ దినము)' అనువానిలోని తమిళ పూర్వావయవములు 'అల్-ఇల్' అనునవె యననగును. కాని కన్నడములోని వీనికి సరియగు 'అందు=(ఆ దినము) ఇన్దు=(ఈ దినము)' అను (చూడు ౧౧౭ II విష. పట్టిక) వాని పూర్వావయవములు 'అన్-ఇన్' అనునవి యనక తీరదు.

'అల్-ఇల్' అను ద్రావిడ నఞర్థక శబ్దములు 'అల్-ఇల్' నిర్దేశవాచకములను మిక్కిలి పోలుచున్నవి. అల్=కాదు. ఇల్=లేదు. తమిళ భాష యందు 'అల్' ధాతువునకు 'తగ్గుట' అని యర్థము. 'అల్' ధాతువు తమిళమున లేదు.' (శ్రీ రెడ్డిగారు)

'అల్'=(రాత్రి) (రాత్రి పూచెడి పూవు) అను శబ్దమును గలదు. ఇట్లు వీని కాకార సాదృశ్యమేకాక తత్తజ్జన్య శబ్దములయందును సంబంధము చూపట్టుచున్నది. ఉదా:—అల్ + తు = అన్టు = అన్దు = (లేదు). అల్ +

తు = అన్తు = అన్దు = (ఆ దినము). ఇల్ + తు = ఇన్తు = ఇన్దు = (ఇది కాదు). ఇల్ + తు = ఇన్తు = ఇన్దు = (ఈ దినము). (ఇట్టి యాకార సాదృశ్యముచే 'అన్దు' మున్నగు వానిలోని పూర్వావయవములు 'అల్' మున్నగు లాంత నిర్దేశవాచకములె యని భావము). కాని నిషేధవాచకత్వమునకును నిర్దేశవాచకత్వమునకును జారిత్రకమగు సంబంధము కన్పట్టదు" (కాల్డు. ౨౩౫, ౨౩౬ పుటలు).

౧౧౭. I విమ:—"నిర్దేశక సర్వనామముల ద్రావిడేతర భాషా సంబంధములు:—ద్రావిడ భాషలలోని 'అ-ఇ-ఉ' అనెడి నిర్దేశ సర్వనామములకును నుత్తర హిందూస్థాన భాషలలోని నిర్దేశ సర్వనామములకును నస్ఫుటమగు కొంత పోలిక గలదు. బంగాళీ-సింఘళీ భాషలలో 'ఏ' అనునది నిర్దేశవాచకముగ వాడఁబడుచున్నది. మరాఠీ భాషలో 'హా-హీ-హెఇఁ' అనునవి నిర్దేశ వాచకములు. హిందుస్థానీ భాషలో 'వుహ్ = (ఆ) యిహ్ = ఈ' అనునవి నిర్దేశవాచకములు. వీని ద్వితీయాది విభక్త్యంగములందీ పోలిక హెచ్చయి యున్నది. ఉదా:—ఇస్కో = (దీనిని). ఉత్తర హిందూస్థాన భాషలలో 'అ' శబ్దముగాని దానివంటి శబ్దాంతరముగాని దూరస్థవాచక తచ్ఛబ్దార్థకముగా వాడఁబడుటకంటె సమీపస్థవాచకమగు 'ఇ' శబ్దపువాడుక ప్రచురమై యున్నది" (కాల్డు. ౨౩౬ పుట).

"ఉత్తర హిందూస్థాన భాషల పోలికల పట్టిక:—

| ఈ శబ్దపు పోలికలు | | | | ఆ శబ్దపు పోలికలు | | |
|---|---|---|---|---|---|---|
| మరాఠీ<br>ఇకడె =<br>(ఇక్కడ)<br>ఇతకె =<br>(ఇంత) | హిందీ<br>ఇధర్ =<br>(ఈవైపు) | సింధీ<br>హీ - హే =<br>(ఈ) | లార్ భాష<br>ఈ =<br>(ఈ) | సింధీ<br>హూ -<br>హో =<br>(ఆ) | లార్ భాష<br>ఊ - ఓ =<br>(ఆ) | లార్ భాష<br>సింధీమాండలిక<br>భాషాభేదము." |

(కాల్డు. ౨౩౬ పుట).

౧౧౮. II విష:— "హిమాలయ ప్రాంత భాషలకును గొన్ని సిథియను భాషలకును మఱికొన్ని భాషలకును ద్రావిడ భాషలలోని నిర్దేశవాచక సర్వనామములతోడి పోలికలు:—

| హిమాలయ ప్రాంతభాషలు | | | ద్రావిడ భాషలలోనివి | | సిథియను భాషలు | | | సెమిటికు | ఇండో యూర- |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తెలుగు | బొడోభాష | ధిమల్ భాష | ఒరాఒన్ భాష | రాజమహాల్ భాష | ఫిన్నిష భాష | ఓస్టియాకు భాష | మాగియార్ భాష | హెబ్రు | ప్రాచీన పెరిషియన్ |
| ఈ, ఇది | ఇంబె | ఈ | ఎదహ్ | ఎహ్ | తామ | తెమ | ఎజ్ | — | — |
| ఆ, అది | హాంబె | ఊ | హబాదహ్ | ఆహ్ | తుఒ | తోమ | అజ్ | హూ | హావ |

పయివానిలోని 'ఒరాఒన్-రాజమహాల్' భాషలు ద్రావిడ భాషల లోనివె. కావుననె రాజమహాల్-'ఎహ్. ఆహ్' శబ్దములు ద్రావిడ నిర్దేశ వాచకముల కభిన్నములగుచున్నవి. ద్రావిడ భాషలలోని 'ఉ' అనెడి తదిదం శబ్దార్థమాధ్యస్థ్య బోధక శబ్దముతో 'ధిమల్'-'ఊ' శబ్దమునకును, 'ఒరాఒన్' 'హూదహ్' శబ్దమునకును, హెబ్రు భాషలోని స్త్రీ పుంస సామాన్యవాచియగు ప్రథమ పురుష సర్వనామమైన 'హూ' శబ్దమునకును బ్రాచీన పెరిషియను భాషలోని తచ్ఛబ్దార్థకమగు 'హావ' శబ్దమునకునుగల సంబంధము పరిశీలింపఁ దగినది. 'హావ' శబ్దములో మొదటి భాగము 'హు' అనియు నుత్తర భాగము 'అవ' (ద్వితీయాద్యంగము) అనియు ఛేదము నెన్నవగును. సిథియను భాషలలోని 'ఉ-ఒ' అను నచ్చులతో సయుతము ద్రావిడ 'ఉ' శబ్దమును సరి పోల్చి చూడనగును. హిందూస్థానీ-'వుహ్'. బొదో భాషలోని 'హొబె' అను వాని యచ్చులతోడ సైతము సరిపోల్చి చూడనగును. మాగియూర్ భాషలోని యచ్చుల సాదృశ్యమును బరిశీలింపఁదగినది. ఇతర సిథియను భాషల నిర్దేశ సర్వనామములకును ద్రావిడ నిర్దేశవాచకములకును బోలిక లేదు. ఉదా:— తుర్కిష్ - 'బొఉ' = (ఆ. తచ్ఛబ్దార్థకము) 'ఒల్' = (ఈ-ఇదం శబ్దార్థకము)" (కాల్డు. ౪౩౯, ౪౩౭ పుటలు).

౧౧౮. III విష:—"దూరసామీప్య బోధవిషయమున ద్రావిడ భాష వంటి నియమ మిండో యూరపియన్ భాషలలో లేకున్నను వానియందును 'అ-ఇ' శబ్దములె నిర్దేశవాచకములు. సంస్కృతమందలి 'ఇదమ్' శబ్దపు ద్వితీయాది విభక్తి రూపములలో 'ఇ' కారముకన్న 'అ' కారమె యధికమై యున్నది. (అయమ్-అనేన-అస్మై-ఆభ్యామ్-మొ). అదశ్శబ్దమునకు దూర సామీప్యార్థములు రెండును గలవు. (అసౌ-అమూ-అమీ-మొ). అయి నను సంస్కృతమందు సైతము సాధారణముగా 'అ' శబ్దము దూరస్థ వస్తు వాచకము. 'ఇ' శబ్దము సమీపస్థవస్తువాచి. అవ్యయములందు 'ఇ' శబ్దము సామీప్యమునే బోధించును. అ శబ్దమునకు బదులుగా 'త' శబ్దము నిల్చును. ఉదా:—ఇహ=(ఇక్కడ), ఇదానీమ్=(ఇపుడు). ఇతి=(ఇట్లు). అథ=(అట పయిని) తదానీమ్=(అప్పుడు). సామీప్యబోధక నిర్దేశ సర్వనామమగు 'ఇ' శబ్దము, 'హృద్+ఇ=హృది' అనురీతిగల శబ్దములలోని సప్తమ్యేకవచనమగు 'ఇ' ప్రత్యయమున కభిన్నము. ఇంగ్లీషులోని 'ఇన్' (in) శబ్దమునందును 'ఇ' శబ్దమే యున్నది. ప్రాచీన పెరిషియను భాషలోని 'అవదా=(ఆ వైపు) ఇదా=(ఈ వైపు)' అను శబ్దములును నిటఁ బరిశీలింపఁదగినవె. నవీన పెరిషి యన్ భాషలో 'ఆన్=(ఆ) ఈన్=(ఈ)' అని యివి ద్రావిడ భాషల స్థితి

కభిన్నముగనే యున్నవి. ఇవి విశేషణ రూపములు. వీని బహువచన రూపములు:—ఆనాన్=(ఆ మనుష్యులు), ఈనాన్=(ఈ మనుష్యులు). ఈ శబ్దములె పెరిషియా దేశమునుండి తుర్కిష్టు దేశమునకుఁ బోయి తుర్కిష్టు భాషలోఁ జేరినవి. ఈ నవీన పెరిషియన్ భాషలోని 'ఆన్' అనుదానిని జందు భాషలోని 'అ ఎమ్' శబ్దముతోను సంస్కృతమందలి 'అ యమ్' శబ్దముతోను జోడించి చూచినయెడల నివి యార్యభాషా శబ్దములె యని తోఁచక మానదు. ఇట్లె నవీన పెరిషియను భాషలోని 'ఈన్' శబ్దము జందుభాషలోని 'ఈమ్' శబ్దముతో నభిన్నమె యగుచున్నది. ఈ 'ఈమ్' శబ్దము వైదిక సంస్కృత ద్వితీయ యగు 'ఈమ్' అనుదాని కభిన్నము. ఇది జందుభాషలోఁ బ్రథమా విభక్తి. ఇది నవీన పెరిషియను భాషలోని పైని వ్రాసిన 'ఈన్' శబ్దమును మిక్కిలి పోలుచున్నది. ప్రాచీన పెరిషియను భాషలోని స్త్రీ పుంస సాధారణమగు 'ఇ యమ్' శబ్దమునకు సంస్కృత స్త్రీలింగ ప్రథమైక వచనమగు 'ఇ యమ్' శబ్దము భిన్నముకాదు. ద్రావిడ నిర్దేశ సర్వనామాంగమగు 'ఇ' శబ్దము లాటిన్ భాషలోని 'ఇస్-ఇద్' శబ్దములందును గాథికు భాషలోని 'ఇస్' శబ్దము నందును గన్పట్టుచున్నది. 'అ-ఇ' శబ్దము లింగ్లీషులోని 'దట్=(that) దిస్=(this)' శబ్దములలోఁ జూపట్టుచున్నవి. ఇట్టి విషయమున నీ రెండు కుటుంబముల శబ్దములకును బలమైన పోలికలున్నను వీనికి జన్యజనక భావమును గల్పింపరాదు. ఇండోయూరపియను భాషలలోని—ముఖ్యముగా సంస్కృతములోని—పై శబ్దములం దొక నియమములేక చాల వ్యత్యాసములును గన్పట్టుచున్నవి. పరిశీలింపఁగా సంస్కృతమును నితరములగు నైరోపియను భాషలును నే ప్రాచీన భాషనుండి తమతమ భాషలలోని రూపములను దెచ్చికొన్నవో యా ప్రాచీన భాషయొక్క లక్షణములె ద్రావిడ భాషలందు వెలయుచున్నవని యూహింపనగును" (కాల్డు. ౪౩౭, ౪౩౮ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు చూపిన ద్రావిడ భాషలతోడఁ బోలికలు గల యిండోయూరపియను శబ్దముల పట్టిక:—

| | సంస్కృతము | ప్రాచీన పెరిషియా | నవీన పెరిషియా | జందు భాష | లాటిను | గాథిక | ఇంగ్లీషు | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|
| 'అ' అను ద్రావిడ శబ్దపు పోలికలు | అథ=(అటపైని). తదా=తదానీమ్=(అపుడు). తద్=(అ) | అ ఐదా=(అ వైపు) | ఆన్=(అ) ఆనాన్=(అ మనుష్యులు) | అ ఎమ్=(వీడు. సంస్కృ—అయమ్) | — | — | దట్=(that)=(అది) | "సంస్కృత—అయ్=జందు—అ ఎమ్=(వీఁడు). నవీన పెరిషియన్ భాష 'ఆన్'" ఈ మూఁడును నిర్దేశక సర్వనామములె |
| 'ఇ' అను ద్రావిడ శబ్దపు పోలికలు | ఇహ=(ఇక్కడ) ఇతి=(ఇట్లు) ఇదానీమ్=(ఇపుడు) హృద్+ఇ=హృది=(హృదయమందు) ఈమ్=వైదిక ద్వితీయాద్యంగము. ఇయ్=ఇదమ్ శబ్దద్వితీయ. | ఇదా=(ఈ వైపు) ఇయమ్=(ఈ స్త్రీ—ఈ పురుషుఁడు) | ఈన్=(ఈ) ఈనాన్=(ఈ మనుష్యులు) | ఈమ్=(ఇది) | ఇస్=(ఇది) | ఇస్=(ఇది) | దిస్=(this)=(ఇది) ఇన్=(in)=సప్తమ్యేకవచనము. | |

"అదస్. త్రి. (న దస్యతే ఉత్ క్షిప్యతేఽఙ్గుళి ర్యత్ర:—ఇదన్తయా నిర్ధారణాయ పురోవర్తిన్యే వాఙ్గుళి నిర్దేశ స్సంభవతి. నాఽపురోవర్తిని. న+దస్+క్విప్). అపురోవర్తిని=పరోక్షే జ్ఞాతే వస్తుని" (శబ్దస్తో).

పై వ్యుత్పత్తిచొప్పున 'అద' శ్శబ్దము దూరస్థమాత్రవాచి యనఁదగియున్నను బుద్ధిస్థ ప్రత్యక్షతా వాచిత్వమును దీనికిఁ గలదన నగును.

"అసౌ-త్రి. పరస్మిన్-పరత్ర. పురోవర్తినో నిర్దేశే. అసౌపుమాన్. అసౌ స్త్రీ-అదఃకులమ్" (శబ్దార్థ చింతామణికోశము). ప్రయోగములు:—

శ్లో. "<u>అముష్య</u> విద్యా రసనాగ్రనర్తకీ । .........." (నైష. ౧ స). 'అముష్యవిద్యా=ఈ నలుని విద్య' అని ప్రయోగించెను. ఇట్లె స్థలాంతరములందును గలవు.

శ్లో. "ముఖవిధు <u>మదసీయం</u> సేవితుం లమ్బమాన । శ్శశి పరిధి రివోచ్చైర్మణ్డల స్తేన తేనే" (నైష. ౨ స). (అదసీయమ్=ఈ దమయంతి సంబంధి)

శ్లో. "స్మర త్యదో దాశరథి ర్భవన్ భవా । నముం వనాన్తా ద్వనితాపహారిణమ్" (మాఘ. ౧ స). (అదస్=దీనిని. అముమ్=వీనిని)

'ఇదమ్' శబ్దమన్ననో కేవలపురోవర్తి వాచి.

"ఇదమ్. త్రి. (ఇన్ది కమి న లోపశ్చ) పురోవర్తిని. దృశ్యే చరాచరే" (శబ్దస్తో)

"ఇదమ్. త్రి-పురోవర్తిని. దృశ్యే చరాచరాత్మకే జగతి. సన్నికృష్టే......' (శబ్దా. చిం.) 'ఇదం కి లావ్యాజ మనోహరం వపుః' (కుమార ౫. స).

సకారాన్త పుంలింగాద శ్శబ్దము.

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర. | అసౌ | అమూ | అమీ |
| ద్వి. | అముమ్ | అమూ | అమూన్ |
| తృ. | అమునా | అమూభ్యామ్ | అమీభిః |
| చ. | అముష్మై | అమూభ్యామ్ | అమీభ్యః |
| పం. | అముష్మాత్ | అమూభ్యామ్ | అమీభ్యః |
| ష. | అముష్య | అముయోః | అమీషామ్ |
| స. | అముష్మిన్ | అముయోః | అమీషు. |

సకారాన్త స్త్రీలింగాద శ్శబ్దము.

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర. | అసౌ | అమూ | అమూః |
| ద్వి. | అమూమ్ | అమూ | అమూః |
| తృ. | అముయా | అమూభ్యామ్ | అమూభిః |
| చ. | అముష్యై | అమూభ్యామ్ | అమూభ్యః |
| పం. | అముష్యాః | అమూభ్యామ్ | అమూభ్యః |
| ష. | అముష్యాః | అముయోః | అమూషామ్ |
| స. | అముష్యామ్ | అముయోః | అమూషు. |

మకారాన్త పుంలింగమగు 'ఇదమ్' శబ్దము.

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర. | అయమ్ | ఇమౌ | ఇమే |
| ద్వి. | ఇమమ్ (ఏనమ్) | ఇమౌ (ఏనౌ) | ఇమాన్ (ఏనాన్). |
| తృ. | అనేన – (ఏనేన) | ఆభ్యామ్ | ఏభిః |
| చ. | అస్మై | ఆభ్యామ్ | ఏభ్యః |
| పం. | అస్మాత్ | ఆభ్యామ్ | ఏభ్యః |
| ష. | అస్య- | అనయోః (ఏనయోః) | ఏషామ్ |
| స. | అస్మిన్ | అనయోః – (ఏనయోః) | ఏషు |

మకారాన్త స్త్రీలింగమగు 'ఇదమ్' శబ్దము.

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర. | ఇయమ్ | ఇమే | ఇమాః |
| ద్వి. | ఇమామ్ (ఏనామ్) | ఇమే (ఏనే) | ఇమాః–(ఏనాః) |
| తృ. | అనయా (ఏనయా) | ఆభ్యామ్ | ఆభిః |
| చ. | అస్యై | ఆభ్యామ్ | ఆభ్యః |
| పం. | అస్యాః | ఆభ్యామ్ | ఆభ్యః |
| ష. | అస్యాః | అనయోః (ఏనయోః) | ఆసామ్ |
| స. | అస్యామ్ | అనయోః (ఏనయోః) | ఆసు. |

సంస్కృతమునఁ బరోక్షవాచియగు 'అ' శబ్దము 'తద్' అను రూపమున నుండును గానఁ దజ్జన్యములగు నవ్యయరూపములందు 'త' కారము నిల్చుట వింతకాదు. ఉదా:—తదా = తదానీమ్ = (అప్పుడు). ఇట్లె 'తత్ర-తథా' మున్నగునవియు వెలయుచున్నవి.

౧౧౭. IV విష:—"ప్రశ్నార్థక ద్రావిడ సర్వనామములకు ద్రావిడేతర భాషల సర్వనామములతోఁడి సంబంధములు:—'ఎ' శబ్దమునకుఁ గాని 'యా' శబ్దమునకుఁగాని యిండో యూరపియను భాషా కుటుంబములలోని ప్రశ్నార్థక సర్వనామముల పోలిక యెంతమాత్రమును లేదు. ఇండో యూరపియను భాషలందును సిథియను భాషలందును బ్రశ్నార్థక సర్వనామ ప్రాతిపదికము కంఠ్య క కారఘటితము. ఉదా:—(సంస్కృ) కిమ్=(ఏది. ఏమి). కః=(ఎవఁడు). కా=(ఎవతె). ఇది లాటిన్ భాషలోని 'క్వ' అనుదానితోను, గాథిక భాష లోని 'హ్వ' అనుదానితోను ఇంగ్లీషుభాషలోని 'వ్హా' (What) అనుదానితోను సమానమైయున్నది. పై మూలరూపమె తుర్కిషు భాషలోని (సిథియను) 'కిమ్ (లేక) కీమ్=(ఎవఁడు)' అనుదానిలోను, మాగియార్ భాషలోని 'కి= (ఎవఁడు) - బహు - కిక్ =(ఎవరు)' అనువానిలోను, ఫిన్నిషు భాషలోని 'కుక- (మూలధాతువు-కా)' అనుదానిలోను గన్పట్టుచున్నది. కకార యకారములకు సంబంధ మసంభవముగదా." (కాల్డు. ౪౩౭, ౪౩౯ పుటలు).

"పెక్కు సిథియను భాషలలో సంబంధార్థక సర్వనామములు లేకుండుట చేత వానిచోటఁ బ్రశ్నార్థక సర్వనామమె వాడఁబడుచున్నది. సాంస్కృతిక సంబంధార్థక సర్వనామ మూలరూపమగు 'య' శబ్దము (యః-యా-యద్) ద్రావిడ ప్రశ్నార్థక సర్వనామమగు 'యా' శబ్దముతో మిక్కిలి పోలుచున్నది. ఉత్తర హిందూస్థాన భాషలలోని 'జో' శబ్దమువలెను ఫిన్నిషు భాషలలోని 'యొ' శబ్దమువలెను సాంస్కృతిక 'య' శబ్దము కేవల సంబంధార్థబోధక సర్వనామమై యుండఁగా ద్రావిడ 'యా' శబ్దము కేవల ప్రశ్నార్థకముగానే యున్నది." (కాల్డు. ౪౩౯ పుట).

"సంస్కృత 'య' శబ్దము పై రీతి నిపుడు సంబంధార్థకమైయున్నను మొట్టమొదట నిర్దేశవాచకముగా నుండెడిదని యూహింపఁబడినది. ద్రావిడ ప్రశ్నార్థకములగు 'ఎ-అ' శబ్దములు మొట్టమొదట నిర్దేశవాచకములైనయెడల (ఇట్లూహించుటకుఁ గొన్ని కారణములున్నవని ముందుఁ జూపఁబడును) 'యా' శబ్దము సైతము నిర్దేశవాచకముగనె యుండెడిదని యూహింపవచ్చును. కాని దీనికి సరియగు నాధారమేమియుఁ గన్పట్టదు. 'యా' శబ్దము నిర్దేశవాచకమై యుండెడిదని నిర్ణయించునపుడు దానికిని సాంస్కృతిక సంబంధార్థక సర్వనామము

నకునుగల సంబంధము మఱియుఁ బ్రాచీనమని చెప్పవలసి వచ్చుచున్నది. సంబంధార్థక సర్వనామమునకు సంస్కృతమున నిర్దేశవాచకతా శక్తిలేదు. కాని మిక్కిలి ప్రాచీనకాలములో సంబంధించియున్న యితరభాషలలో నట్టి శక్తి యున్నది. ఉదా:—లిథూనియన్ భాష:—యిస్ = (వాఁడు). శ్లవోనియన్ భాష:—యమ్=(వానిని). జండుభాష-యిమ్=(వానిని)" (కాల్డు. ౪౩౯ పుట).

"ఏవార్థకమగు 'ఏ' శబ్దము:—'కు' భాషలో 'ఏ' శబ్దము నిర్దేశవాచకమని యీావఱకె వ్రాయఁబడెను. ఉదా:—ఏ+వ్+అర్=ఏవార్=(వారు). దీనిని సంస్కృతమందలి నిర్దేశవాచకమగు 'ఏతద్'=(ఇది) శబ్దముతోను, దీనికి సరియగు జండు భాషలోని 'అఏతత్' అను శబ్దముతోను సరిపోల్చి చూడ నగును. 'కు' భాష తప్పఁ దక్కిన ద్రావిడ భాషలలో 'ఏ' శబ్దము నిర్దేశ వాచకమై యుండక శబ్దముల తుదిని జేర్పఁబడు నవధారణార్థకమై యున్నది. (చూడు ౧౧౫ I విభ.) ఉదా:—తమి-కల్వియే సెల్వమ్=(కల్వి+య్+ఏ)=(విద్యయే ధనము.) కల్వి సెల్వమే=(విద్య ధనమె). క్రియకుఁగాని కృదంతము నకుఁగాని 'ఏ' శబ్దము చేరుటచేత 'నిశ్చయార్థము' సిద్ధించును. ఉదా:—తమి:—అల్ల+వ్+ఏ=అల్లవే=(కాదే=కాకుండుట నిశ్చయము). వ్యావహారిక తమిళ మం దూరకయే ప్రత్యయాంత శబ్దముల తుదిని 'ఏ' శబ్దము నిల్చుచుండును. కాన 'నిశ్చయార్థము' వలసినపు డవధారణార్థక శబ్దద్వయము నిల్చును. ఉదా:—ఎన్నాల్+ఏ+య్+ఏ=ఎన్నాలేయే=(నాచేతనే). తుళుభాషలో నీ 'ఏ' శబ్ద మునకు ముందటి స్వరసంహితలో 'న'కారము నిల్చును. ఈ 'ఏ' శబ్దము సంబోధనార్థకమును (తమిళమున?) నగును. నామముయొక్క యవధారణమే కదా సంబోధనము. (చూడు ౮౯ I విభ). హెబ్రు భాషలోను (సెమెటి క్కుటుంబము) 'అటికు గ్రీకు' భాషలోను నామమునకు ముందు నిర్దేశవాచక తచ్ఛబ్దమును (The = Definite article) జేర్చుట చేతనే సంబోధన మగుచుండును. పరిషియా భాషలో 'ఏ' శబ్దము ప్రార్థనార్థకమగుటను సైత మిటఁ బరిశీలింప నగును" (కాల్డు. ౪౩౯, ౪౪౦ పుటలు).

"హెబ్రు భాషలోని (సెమెటిక్) యర్థదార్ఢ్య బోధకమగు 'హె' శబ్ద మీా 'ఏ' శబ్దమును బోలుచున్నది. ఈ హెబ్రు భాషలోని విధ్యర్థకమగు 'హె' శబ్దమును నర్థదార్ఢ్యమునే బోధించును. ద్రావిడ భాషలలో నవధారణార్థక మగు 'ఏ' శబ్దమువలెనె బాల్టిభాషలో (సెమెటిక్కుటుంబము) 'ఆ' శబ్దము వాడఁబడుచున్నది. ఇయ్యది యనేక భాషలలోని నిర్దేశవాచక తచ్ఛబ్ద ముతో (Definite article) సరియై యున్నది. పెరిషియా భాషలోని నిర్ధార ణార్థకమగు 'ఏ' శబ్దమును ఘనతను బోధించు 'ఏ' శబ్దమును, వెనుకఁ జెప్పఁ

బడిన ప్రార్థనార్థకమగు 'ఏ' శబ్దమును (పెరిషియాలోనిదె) ద్రావిడభాషలలోని యవధారణార్థకమగు 'ఏ' శబ్దమునె మిక్కిలి పోలియున్నను నవి 'చాల్డెయికు-కుథితె' అను జాతులను సంబంధించిన పుట్టుక గలవని నే నూహించుచున్నాను" (కాల్డు. ౭౭౦ పుట).

విమర్శము:—ఇండో యూరపియను భాషలందును సిథియను భాషలందును బ్రశ్నార్థక సర్వనామము 'క'కార (కిమ్) ఘటితము. (అయంకః=వీఁడెవఁడు). ద్రావిడభాషలందు 'యా-ఎ-ఏ' అను శబ్దములు ప్రశ్నార్థకములగుటచేత (ఇవన్ యావన్=వీఁడెవఁడు) వీని కిండో యూరపియను ప్రశ్నార్థక శబ్దముతోఁ బోలికలేదనుట నిశ్చయమె. 'య స్యాస్తి విత్తం స నరః కులీనః' = (ఎవనికి ధనము గలదో యా నరుఁడె కులీనుఁడు) అను రీతిగల యిండో యూరపియను భాషలందలి సంబంధార్థక సర్వనామ ప్రయోగ సిద్ధార్థము ద్రావిడ భాషలందు ధాతుజ విశేషణములచే వాచ్యమగుట ప్రసిద్ధమై యుండుటచేత (విత్తము గల్గినవాఁడు కులీనుఁడు) ద్రావిడ భాషలయందు యత్తచ్ఛబ్దాన్వయ మూలక సంబంధార్థక సర్వనామ వ్యవహారము సంస్కృతమునవలెఁ బ్రచురము కాదనిన ననవచ్చును. ఉదా:—

శ్లో॥ కృష్టా యేన శిరోరుహేషు పశునా పాఞ్చాల రాజాత్మజా ।
యే నాస్యాః పరిధాన మప్యపహృతం రాజ్ఞాం గురూణాం పురః ।
య స్యోరస్థల శోణితాసవ మహం పాతుం ప్రతిజ్ఞాతివాన్ ।
సోఽయం మద్భుజ పఞ్జరే నిపతిత స్సంరక్ష్యతాం కౌరవైః ॥ (వేణీ).

దీనికిఁ గ్రియాజన్య విశేషణములతోడి తెల్గు:—

పాంచాల రాజపుత్రీ శిరోజములను లాగి యీడ్చినట్టియు నామె కట్టుపుట్టమును సైత మపహరించినట్టియు వక్షస్థల శోణి తాసవ పానాస్మాక ప్రతిజ్ఞా భాజనమైనట్టియు వీఁడు నాభుజ పంజరమునఁ బడియున్నాఁడు. కౌరవులు రక్షింతురు గాక. ఇట్టివి సంస్కృతమున నతి ప్రచురములనుటకు సందియము లేదు. తమిటమున 'యా-యాదు' మున్నగునవె తొల్కాప్పియమునఁ జేర్పఁబడినను యా శబ్దపరిణామము లనఁదగు 'ఏ=ఎ' శబ్దములతోడి సమాసములు తొల్కాప్పియము నాఁటికే కలవనియు నట్టి సమాసములందలి 'ఏ=ఎ' శబ్దములు సంబంధార్థకములగుట గలదనియు నంగీకరింపక తీరదు. అట్లగుటచేఁ దొల్కాప్పియమునాఁటికె తమిటమున యత్తచ్ఛబ్దాన్వయము గల దనక తప్పదు. తొల్కాప్పియమందె యట్టి ప్రయోగములు కన్పట్టుచున్నవి.

"ఎప్పొరుళాయినుమ్ అల్లతిల్లెనిన్ । అప్పొరుళల్లా ప్పిఱిదు పొరుళ్ కూఱల్" (తొల్కా. ౫౧౦ సూ.)=ఎప్పొరుళ్-(ఎ+పొరుళ్)+ఆయినుమ్ =ఏ వస్తువయినను, అల్లదు (తు) + ఇల్ + ఎన్ = అడిగినది లేనియెడల, అప్పొరుళ్+అల్లా = ఆ వస్తువు కానట్టి, పిఱిదు పొరుళ్=వేఱు వస్తువును, కూఱల్ = చెప్పునది.

"ఎన్నిల మరుజ్గిల్ పూవుమ్ పుళ్ళుమ్ అన్నిలమ్ పొఴుదొడు వారా వాయినుమ్ । వన్ద నిలత్తిన్ పయత్తవాగుమ్" (తొల్కా. (పొరుళధికారము ౨౧ సూ.)="ఎన్నిలమ్-(ఎ+నిలమ్), మరుజ్గిల్ = ఏ నేలయందుండవలసిన; పూవుమ్-పుళ్ళుమ్=పూవును, పక్షియును, అన్నిలమ్-(అ+నిలమ్) పొఴుదొడు= =దానికాలము వీనిలో, వారా+ఆయినుమ్=రానివయినను, వన్దనిలత్తిన్ = వచ్చిననేలకు, పయత్త ఆగుమ్=ప్రయోజనముగలవి యగును. అనఁగా ఒక నేలను సంబంధించిన పూవును బక్షియును వేఱొక నేలయందు వచ్చినను బాసఁగునని భావము" (౨౬-౮-౫౩) తేదీ జాబునకు శ్రీ రెడ్డిగారి జబాబు).

ఈ రీతిగఁ దొల్కాప్పియ సూత్రములందే ప్రయోగము లుండఁగా ద్రావిడ భాషలలో సంబంధార్థక సర్వనామములు లేవనుటయు యత్తచ్ఛబ్దాన్వయము లేదనుటయుఁ గేవలము సత్యవిదూరము గదా.

పయిరీతి ప్రయోగములు తొల్కాప్పియమందె వెలయుచుండఁగా దానికిఁ దర్వాతి తెల్గు మున్నగువానియందుఁ గలవని వేఱె చూపుట యనావశ్యక మయినను నొక్క నన్నయ ప్రయోగమును జూపుచున్నాను.

> కం. ఏయది హృద్య మపూర్వం ।
> బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం ।
> బై యుండు నఘనిబర్హణ ।
> మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్ ॥
>
> (భార. ఆది. ౧ ఆ. ౩౦ వ.)

ద్రావిడ భాషలలోని ధాతుజ విశేషణ ఘటిత వాక్యము యత్తచ్ఛబ్దాన్వయ బోధ్యార్థము నిచ్చును గాన ద్రావిడ భాషలలో సంబంధార్థక సర్వనామములు లేవనుట కేవలము నయుక్తికము. సంస్కృతమున మాత్ర మట్టి యత్తచ్ఛబ్దాన్వయ బోధ్యార్థమును దెల్పు ధాతుజ విశేషణ ఘటిత వాక్యములు లేవా? 'గతకాలః'=(ఏకాలము గతమో యా కాలము). 'కృతకార్యమ్' = (ఏ కార్యము చేయఁబడినదో యా కార్యము). "సంబంధ బోధకమైన 'యత్' (ద్?) శబ్దమునుగూర్చి కాని దానికిఁ (ని?) జేరిన 'తత్' (ద్) శబ్దమును గూర్చి

కాని తొలుకాప్పియనారు (తొల్కాప్పియ) తన గ్రంథమున వ్రాయలేదు. అరవమునందు ప్రాచీన భాషలో క్రియాజన్య విశేషణములు మాత్రమే వాడుచుండిరి......" (ఆం. భా. వి. ౪౯౪ పుట). పయిరీతిని తొల్కాప్పియ ప్రయోగములై యుండఁగా నీ వ్రాఁత యెట్లు పొసఁగును? తొల్కాప్పియము కన్నఁ బ్రాచీన తమిళభాష యెద్ది?

"అవ్వఴి......" (తొల్కా. ౬౭౬ సూ.)="......యావన్-యావళ్-యావర్" అను పదునైదు శబ్దములును మహాన్నామములు.

"అదు-ఇదు......" (తొల్కా. ౬౫౧ సూ.)="......యాదు-యా-యావై" అను పదునైదు శబ్దములును నమహాన్నామములు.

అని మాత్రమే తొల్కాప్పియమునఁ జెప్పఁబడెను గాని వాని యర్థములు వ్రాయఁబడలేదు. 'యా-యాదు' మున్నగువానికి సంబంధార్థకత్వము లేదనియుఁ బ్రశ్నార్థకత్వము మాత్రమే తొల్కాప్పియరు తలంచిరనియు నెట్లు నిర్ణయింపనగును? ఆతఁడర్థ నిర్ణయము చేయలేదు గదా.

సాకౌదాకార సామ్యముగల యార్య ద్రావిడ యచ్ఛబ్ద యా శబ్దములు ప్రాచీనతమ సంబంధముగలవనియుఁ దక్షిన నిర్దేశ సర్వనామముల వలెనె యీ యచ్ఛబ్ద యా శబ్దములును నేదో ప్రాచీన భాషనుండియే యిండో యూరపియను ద్రావిడ భాషలకు వచ్చియున్నవనియు నంగీకరించుట యుక్తము. నేఁటివలెనె యా కాలమందును దమిళమున యా శబ్దము ప్రశ్నార్థకమును సంబంధార్థకమును నయి యుండెడిదననగును.

ఇంక ద్రావిడ 'యా' శబ్దమును సంస్కృత యచ్ఛబ్దమును మొట్టమొదట నిర్దేశార్థకములై యుండెడివనుచు డా. కాల్డువెల్లుగారు "'కు' భాష:—ఏవార్=(వారు). జండు భాష:—'యిమ్'=(వానిని)" అనునవి యాదిగా రెండు మూఁడుదాహృతులను జూపిరి. కాని యా పక్షమున ద్రావిడ భాషలందప్పుడు ప్రశ్నార్థక సర్వనామ వ్యవహారమే లేదనియు, నట్లే ద్రావిడ భాషలలో ధాతుజ విశేషణ వ్యవహారమువంటి సంబంధార్థ సంగ్రహ సంప్రదాయములేని యిండో యూరపియను భాషలలో యత్తచ్ఛబ్దాన్వయ వ్యవహారము లేదనియు నసంభవముగా నంగీకరింపవలసి వచ్చును.

'యా' శబ్ద పరిణామరూపములగు 'ఏ-ఎ' శబ్దములు సర్వనామములైనంత మాత్రమున నట్టి యాకార సామ్యమున నవధారణార్థకమగు 'ఏ' శబ్దమును, సంబోధనార్థకమగు 'ఏ' శబ్దమును (తమిళమున) సర్వనామములె యనుట సరికాదు. అట్టి కాక్వాది స్వరములకు సర్వనామతాలక్షణ సంపత్తి

దుర్ఘటము గదా! తెల్గుభాషనుబట్టి 'ఏ' శబ్దమే యర్వాచీన మని చెప్పనగును. నన్నయ యవధారణార్థమున 'అ' శబ్దమునె ప్రయోగించును గాని 'ఏ' శబ్దము తొల్కాప్పియమునాటికె గలదని యంగీకరింపక తీరదు.

"తేజ్ఞ్జ (ట్ట) ఎకరముమ్......" (తొల్కా. ౨౮౪ సూ.)=నిశ్చయార్థక 'ఏ' ధాతువునకుఁ దర్వాత నిల్చెడి 'ఎ' కారమునకు......పరుషములు పరమగు నపుడు వానికి ద్విత్వము రాదు. ఉదా:—'యానేఎ సెయ్‌దేన్ =(నేనే చేసితిని') ......అవనేఎ సెయ్‌దాన్ =(వాఁడే చేసెను.)"

౧౧౭. V విష:—"పూజార్థక నిర్దేశ సర్వనామములు:—ఆంధ్ర కర్ణాటములందు మాత్రము వ్యవహరింపఁబడుచున్న కొన్ని పూజార్థక సర్వనామము లార్యభాషల వాసనచే నేర్పడి యుండును. ద్రావిడ భాష లన్నిటను బూజార్థమున నేకవచనముచోట బహువచనము వాడఁబడును. పూజ్యత తగ్గినకొలఁదిని 'ఆయన-ఈయన-ఆమె-ఈమె' అనునవియును నింకను బూజ్యత తగ్గినపుడు 'అతఁడు - ఆసె - ఇతఁడు - ఈసె' అనునవియును వాడఁబడును. ఇట్టియెడల 'అతను - ఆతను - ఇతను - ఈతను' అనునవి యాదిగా వాడఁబడును. కన్నడ మందును నిట్టి పూజార్థకములు గలవు. ఉదా:—కన్నడ:—ఆతం=(ఆతఁడు). ఈతం = (ఈతఁడు). కన్నడమందలి 'ఆకె = (ఆమె)-ఈకె = (ఈమె)' అను శబ్దములతోఁ దెల్గుఁ 'ఆసె-ఈసె' శబ్దము లంతగా సరిపడవు. పై శబ్దములకుఁ దెల్గున బహువచనరూపములు లేవు. కన్నడమునఁ గలవు. ఉదా:—కన్న-ఆతగళు=(వారు). ఈతగళు=(వీరు). ఆకెయర్=(ఆ స్త్రీలు). ఈకెయర్ = (ఈ స్త్రీలు). తుదభాషలోని 'అదమ్' అనుదానికిఁ (చూడు ౧౧౫ VII విష.) బై సర్వనామములతో సంబంధమున్నట్లు తోఁచును. ఈ 'అదమ్' శబ్దము తమిళ కర్ణాటములలోని 'అదు' శబ్దమునకు సరియైనదనియు నపుంసకైకవచన మనియు నపభ్రష్టముగాఁ బుం స్త్రీలింగములందును వాడఁబడుననియు నా యూహ" (కాల్డు. ౪౪౦, ౪౪౧ పుటలు).

" 'ఆయన-ఈయన-ఆమె-ఈమె' మున్నగువాని కార్యభాషా జన్యత్వ మును గల్పింపనగును. ఇట్లూహించుటవలన నివి కేవలాంధ్రముననె వెలసె నని సమర్థితమగుచున్నది. తుళుభాషలోని 'ఆయె' (వాఁడు-చూడు ౧౧౫ III విష.) అను శబ్దముకూడఁ బై వానిని సంబంధించుచున్నది. పై శబ్దములు పూజార్థకములుగా వాడఁబడుట వాని సాంస్కృతికత్వమునకు మఱింత తోడ్పడు చున్నది. "(తెల్గు)-ఆయన=(సంస్కృ) అయమ్. (తె) ఈయన=(ప్రాచీన పెరిషియా) ఇయమ్. (చూడు ౧౧౭ III పుట) (ఇచట 'ఇయమ్' అనుచో 'యమ్' అని తప్పుపడి యుండును)" అనువానిని సరిపోల్చి చూచునది. 'ఆమె-

ఈమె' అను నీ శబ్దములను సంస్కృతమందలి 'ఇమే-ఇమాః-ఇమాని' అను వానితోనే కాక 'అముమ్-ఇమమ్' శబ్దములతో సైతము సరిపోల్చి చూడ నగును. 'అముమ్-ఇమమ్' శబ్దములు రెండును ద్వితీయైకవచనములు గాన వాని తుది మకారము బహువచనద్యోతక మకారము కాదు. అది సార్వ నామిక ప్రాతిపదికములోని దనికాని సంహితా కార్యమగు నాగమ విశేషమని కాని చెప్పవచ్చును. బాపు దొరగారిందలి మొదటిపక్షము నంగీకరించిరి. ఇతర ద్రావిడభాషల సామ్యములనుబట్టి రెండవపక్షమును నే నంగీకరించు చున్నాను. ఈ రూపములలోని తుది మకారము ద్రావిడభాషలలోని నపుంసక సామాన్య చిహ్నమని యూహింపనగును. అందును ముఖ్యముగా నీ మకారము తమిళ నపుంసకైకవచనమునం దగపడుచున్నది. 'వ' అనునది 'మ' కారాపభ్రంశము కానోపును. ఆంధ్ర నపుంసక శబ్దముల తుదిని 'మె' అనునది సామాన్యముగా వాడఁబడుచున్నది" (కాల్డు. ౪౪౧ పుట).

"ఆంధ్రకర్ణాటములలోని పూజార్థకములగు 'ఆతఁడు - ఆతం' మొదలగు వానియందలి మొదటి స్వరము సార్వనామిక ప్రాతిపదికము. దానికిఁ దర్వాత నున్న 'త' శబ్ద మార్యభాషలలోని 'తద్' శబ్దసంబంధి స్వతంత్ర శబ్దము. 'అ-ఇ' అను సర్వనామముల కనుబంధముగాను, స్వతంత్రముగాను వాడఁబడును. ఉదా:—(సంస్కృ)-తద్. (ఇది స్వతంత్రస్థితి కుదాహరణము.) 'ఏతద్-ఇదమ్-అదస్' అనువానిలో స్వరమున కనుబంధముగా 'త' శబ్ద ముపయోగింపఁబడును. ఇట్లు 'ఆతఁడు-ఈతఁడు' మున్నగువాని కార్యభాషా సామ్యము చూపట్టుచున్నది. 'ఆసె-ఈసె-ఆమె-ఈమె-ఆకె-ఈకె' అనువాని తుది 'ఎ' కారము ద్రావిడ నామముల తుదిని నిల్చు 'ఎ-ఐ' అను ప్రత్యయము" (కాల్డు. ౪౪౧ పుట).

విమర్శము:—'అతఁడు-ఆతఁడు' మున్నగువానికిఁ బూజార్థకత్వ నియమ మాంధ్ర కర్ణాటములలో లేదు. తెల్గున నేఁటి వాడుకలోనున్న పూజార్థకత్వ మీ క్రిందిరీతిని బాల వ్యాకరణకర్తచే వచింపఁబడెనుగాని యది ప్రాచీన మహాకవి సమ్మతముకాదు. "తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునఁ బూజ వివక్షించునపుడు 'అతఁడు-ఆతఁడు-ఇతఁడు-ఈతఁడు-ఎతఁడు-ఏతఁడు' అను రూపంబులు వడయు. మహతీవాచకంబులు 'ఆమె-ఆపె-ఆకె-ఈమె-ఈపె-ఈకె-ఏమె-ఏపె-ఏకె' అను రూపంబులు వడయు" (బాల - ఆచ్ఛి.) (వ్యా. సం. ౨౧౮ విష. చూడుడు). వీనిలో 'ఏ' శబ్ద సంబంధిరూపములకుఁ (ఎతఁడు-ఏతఁడు-ఏమె-ఏపె-ఏకె) బ్రయోగములు కానరావు. వాడుకయుఁ గానరాదు. కన్నడమున 'అ-ఇ-ఉ' శబ్దముల సంబంధించినవి మాత్రమె విధింపఁ బడినవి. 'ఎ' శబ్ద సంబంధిరూపములు విధింపఁబడనేలేదు. మఱియుఁ బూజార్థ

కత్వమును బలుగన్నడ వ్యాకర్తలుగాని తుదికి హళెగన్నడ వ్యాకర్తగాని వచింప లేదు. తెల్గున వీనికిఁ బూజార్థకత్వ నియమము లేదనుటకుఁ బ్రయోగములు.

ఉ. సందియమేల సర్వగుణసంపదఁ జూడఁగ బాహుకుండు భూ ।
వందితుఁడైన నైషధుఁ డవశ్యము దానగు నామనంబు నా ।
నందముఁ బొందుచున్నది ఘనంబుగ వాఁడిటవచ్చు వాఁడొ యే ।
నందుల కేఁగుదాననొ రయంబున నాతని నిశ్చయింపఁగా ॥

(భార. ఆర. ౨ ఆ. ౨౦౩ ప). ఇందు దమయంతి తన భర్తను 'వాఁడు' అని వ్యవహరించినది. 'వాఁడు = అతఁడు' అనునవి పర్యాయశబ్దములు. (చూడు 'వ్యా. సం.' ౨౧౮ విష). కన్నడమున 'ఆతం-ఈతం-ఆకె-ఈకె' శబ్దములకుఁ బూజార్థకత్వ మెవ్వరిచేతనైన స్మరింపఁబడలేదు.

"అదు ఇదు ఉదూనా మంతే 'వ-తౌ' పుంసి" (కర్ణా. భూష. ౯౫ సూ.)= 'అదు-ఇదు-ఉదు' అను ప్రాతిపదికముల తుది 'దు' వర్ణమునకుఁ బుంస్త్వమున విభక్తి పరమగుచుండఁగా 'వ' కార 'త' కారము లాదేశములగును. ఉదా:— అవం=(వాఁడు) ఇవం=(వీఁడు)......ఆతం=(వాఁడు). ఈతం=(వీఁడు). (దొరగారు 'ఆతగళు-ఈతగళు' అని బహువచరూపము లుదాహరించిరి. కాని శబ్దమణిదర్పణమున 'ఆతంగళు-ఈతంగళు' అని యుదాహరింపఁబడెను. చూడు ౧౩౦ పద్యపు నుదాహృతులు). 'వళ్ కేచ స్త్రియామ్' (కర్ణా. భూష. ౯౬ సూ.)='అదు-ఇదు-ఉదు'ల తుదివర్ణమునకు విభక్తి పరమగుచుండఁగా స్త్రీత్వమున 'వళ్-కె' అను నాదేశములగును. ఉదా:—అవళ్ = (ఆ స్త్రీ)-ఇవళ్ =(ఈ స్త్రీ)......ఆకె=(ఆ స్త్రీ) ఈకె=(ఈ స్త్రీ).

'ఆసె=(ఆమె)-ఈసె=(ఈమె)' అని తెల్గునఁగలవనుచు డా. కాల్డు వెల్లుగా రుదాహరించుట వింతగనున్నది. తెల్గు కోశములందుఁగాని తెల్గు వ్యాకరణములందుఁగాని తుదికిఁ దెల్గు వాడుకలోఁగాని 'ఆసె-ఈసె' అను శబ్దములు కానరావు. 'ఆపె=(ఆమె) ఈపె=(ఈమె)' అను శబ్దములు తెల్గునఁ గలవు. ఆంధ్రాక్షర సారూప్యమున నిట్టి పొరపాటు సంభవించెనేమో?

ఈ సందర్భమున డా. కాల్డువెల్లుగా రొక వింత విషయమును వ్రాసిరి:— (సంస్కృ) అయమ్=(తెల్గు) ఆయన. (ప్రాచీన పెరిషియను) ఇయమ్= (తెల్గు-) ఈయన. (సంస్కృ.) ఇమే - ఇమాః - ఇమాని - అముం - ఇమం= (తెల్గు-) ఆమె-ఈమె. ఈ వ్రాఁత మిక్కిలి పొరపాటు. వైదేశికులగుటచేత నిట్టి వ్రాఁత యసంగతమని వారికిఁ దోఁచదయ్యెను. 'ఆయన. దేశ్య-సర్వ-(ఆ + అన) = అతఁడు'. 'ఆకె. ద్వ-సర్వ-ప. (ఆ+అక)......' 'ఆపె,

ద్వా-సర్వ-ఏ. (ఆ+అప)' 'ఆమె. ద్వా-సర్వ-ఏ. (ఆ+అమ)' (శ-ర) అను వ్యుత్పత్తులు వానికి సహజమయినవని యెఱుంగనగును. 'ఆమె-ఆపె-ఆకె మున్నగు స్థలములందలి తుది 'ఎ'త్వము ప్రాచీన కర్ణాటమందలి 'ఆకె-ఈకె-ఊకె' శబ్దముల సంపర్కమునఁ గల్గి యుండును".

'ఇదమ్' మున్నగు సంస్కృత శబ్దములలోని 'మ' కారము తమిళ నపుంస కైకవచన ప్రత్యయమనుట సరికాదు. 'మ' కారము 'వ' కారముగాఁ బరిణమించె నను వ్రాఁత కిచటఁ బ్రసక్తి కానరాదు. తెల్గు నపుంసక శబ్దముల తుదిని 'మె' అనునది సాధారణముగా నిల్చునను దొరగారి వ్రాఁత కేవలము సత్యవిదూరము.

'తెల్గు-అతఁడు-ఆతఁడు-ఇతఁడు-ఈతఁడు' 'కన్న-ఆతం-ఈతం' అను ద్రావిడ ప్రకృతులలోని 'త' శబ్దము సంస్కృత తచ్ఛబ్ద సంబంధియను కాల్డు వెల్లుగారి వ్రాఁత కేవలము నసంభవము. 'అ-ఇ-ఆ-ఈ' అను ద్రావిడ సర్వ నామ ప్రకృతులకుఁ బరముగ నాత్మార్థక ద్రావిడ 'తా' శబ్దము నిల్చెననుట సుసంభవముగా నుండును. (చూడు ౧౧౨ III విష).

౧౧౮. VI విష:—"వాక్యసంబంధములైన 'ఆ-ఓ' శబ్దములు:—ఇవి ప్రశ్నార్థక సర్వనామములగు 'ఎ-యా' అను శబ్దముల వంటివె. ఆంగ్లభాషలోఁ గర్తృక్రియల స్థలములు మాఱుటచేతఁ బ్రశ్నార్థము లభించును. it is=(అది యున్నది). దీని ప్రశ్నార్థకవాక్యము. is it=(అదియున్నదా?) నామ ములయుఁ గ్రియలయు వాక్యములయుఁ దుదినే 'ఆ-ఓ' అను ప్రశ్నార్థకములు ద్రావిడ భాషలన్నిటియందును నియతముగాఁ జేరుచుండును. ఉదా:—అవన్ తన్దాన్=(వాఁడు ఇచ్చెను)—ప్రశ్నా-అవన్ తన్దానా? = (వాఁడు ఇచ్చెనా?). అవనా తన్దాన్=(వాఁడా ఇచ్చెను?). అదు ఊరా=(అది గ్రామమా?)" (కాల్డు. ౨౨౨ పుట).

"మలయాళమున నిట్టి యర్థమున 'ఓ' అనునది తుదిని జేరును. మల యాళము 'ఇదు+ఆ=ఇదా=(ఓహో)' ఇంగ్లీ-'lo' అనుచోట మాత్రము 'ఆ' శబ్దపు వాడుక గలదు. "What is this?=(ఇదేమి?). తమిళమున 'ఓ' శబ్దము తఱుచుగా సంశయార్థమందే వాడఁబడును. ఉదా:—అవనో=('వాఁడో'-మఱొకఁడో? (వాఁడగునా? యని యర్థము.) తమి-అవనా (వాఁడా?). ఈ 'ఓ' శబ్దము 'ఆ' శబ్దపు వికృతియే కానోపును. ప్రశ్నార్థమే సంశయార్థ ముగాఁ బరిణమించి యుండును. ఈ సంశయార్థకమగు 'ఓ' శబ్దము ప్రశ్నార్థ కములకుఁ బరముగా సైతము నిల్వవచ్చును. ఉదా: ఎవనో=(ఎవఁడో?) ఎన్నవో=(ఏమో?). వీని కుత్తరముగా 'ఓ' అనునది వాడఁబడును. ఓ= (అదేమో?). తుళు భాషలో 'ఆ-ఓ-ఏ' (వే-నే-సంహితావర్ణముల యోగ

మున) అను మూఁడును బ్రశ్నార్థకములె. ఇందలి 'ఏ' శబ్ద మవధారణార్థక మగు 'ఏ' శబ్దమె యనుటకు సందేహములేదు. పై రీతిని 'ఆ–ఓ' శబ్దములను బ్రశ్నార్థకములుగా వాడుట సిధియను భాషలలోఁగాని యిండోయూరపియను భాషలలోఁ గాని లేదు. సంస్కృతమున బొత్తిగా లేదు. ద్రావిడేతర భాషలలో నొక్క కాశ్మీరభాషలో మాత్రము గలదు" (కాల్డు. ౪౪౨ పుట).

"పయిని వివరించిన 'ఆ' అను ప్రశ్నార్థకము దూరబోధక సర్వనామ మగు 'అ=ఆ' అను నిర్దేశక సర్వనామమునుండి యేర్పడినదేయని నేనూహించు చున్నాను. పూర్వావస్థలో నిర్దేశక సర్వనామ స్వరము హ్రస్వమైనను దీర్ఘమైనను బ్రశ్నార్థకమై వాక్యాంతమున నిల్చునపు డది దీర్ఘమే యగుట సహజము. తెల్గులో నయ్యది హ్రస్వరూపమె. అందును ముఖ్యముగాఁ బద్య కావ్యములందు హ్రస్వరూపమె (వాఁడ=వాఁడె). నిర్దేశవాచకమగు 'అ' అను సర్వనామము పదాది నుండును. ప్రశ్నార్థకము పదము తుదిని నిల్చును. ఇట్లీ రెండిటికిని స్థానమాత్రభేదము గలదు. 'ఏ' శబ్దము ద్రావిడ భాషలలో నవధారణార్థక మగుటయే కాక 'కు' భాషలో నిర్దేశ సర్వనామ విశేషణమును నయి యున్నది. పదాది నున్న 'ఎ' శబ్దము ప్రశ్నార్థకమును బదాంత మందున్న 'ఎ' శబ్ద మవధారణార్థకమును నగుచున్నవి. 'ఓ' శబ్దము 'ఆ' శబ్దము నుండి వచ్చినదే యన నగును. తమిళములోని 'యామ్=(మేము)' శబ్దము దాని సార్వనామిక క్రియా ప్రత్యయములలో 'ఓమ్' అగుచున్నది కాదా" (కాల్డు. ౪౪౨, ౪౪౩ పుటలు).

"పయిరీతిని 'ఆ-ఏ' మున్నగు స్వరములకు స్థానభేదము వలన నర్థభేదము గల్గుట యితర భాషలలో లేకపోలేదు. డేనిష్ భాషలోని (డెన్మార్కు దేశపు భాష) 'ఎన్' శబ్ద మట్టిదె. ఉదా:—ఎన్‌కొంగె=(ఒకరాజు). కొంగెన్=(ఆ రాజు). హెబ్రు భాషలోని 'హె' శబ్దమును బదాదిని నిల్చి ప్రశ్నార్థమును బదాంతమున నిల్చి యర్థదార్ఢ్యమును దెల్పును. (చూడు ౧౧౦ IV విష). ఇట్టి స్థలములందలి 'హె' శబ్దమునకుఁ గల స్వల్పమగు రూపభేద ముచ్చారణ సౌకర్యార్థ కృతమని యెఱుంగ నగును. ఆంగ్లభాషయందును బ్రశ్నార్థకము నిర్దేశార్థకమునుండియే యేర్పడుచున్నది. 'that?' ప్రశ్నార్థకము. 'that' నిర్దేశార్థకము. ఇందుచ్చారణ భేదముననే యర్థభేదము గల్గుచున్నది" (కాల్డు. ౪౪౩ పుట).

"కృత్స్నార్థక సర్వనామములు:—ద్రావిడభాష లన్నిటిలోను సముచ్చయార్థక శబ్దమును బ్రశ్నార్థక సర్వనామము తుదిని నిల్పినచోఁ గృత్స్నార్థక సర్వనామ మేర్పడును. ఉదా:—తమి:—ఎవన్=(ఎవఁడు). ఎవనుమ్=(ఎవఁ

డును=అందఱును). ఎప్పొటుదు=(ఏ ప్రొద్దు) ఎప్పొటుదుమ్=(ఏ ప్రొద్దును=ఎల్లప్పుడును=సర్వదా) ఈ పద్ధతి కన్నడమందును గలదు. యా+ఆగల్+ఊ=యావాగలూ=(ఎల్లప్పుడును). తెల్గునందును గలదు. ఉదా:—ఎవ్వఁడును=అందఱును. ఎప్పుడును=సర్వదా" (కాల్డు. ౪౪౩, ౪౪౪ పుటలు).

విమర్శము:—ఆకారసామ్య మాత్రమునుబట్టి 'ఆ - ఏ - ఓ' అను కాక్వాది స్వరములను సర్వనామము లనుట సరికాదు. అట్లె 'ఉమ్' అను సముచ్చయార్థకమును సర్వనామ మనరాదు. 'సర్వేషాంనామ = సర్వనామ' అను సర్వనామ లక్షణముగాని సర్వనామగణ పాఠముగాని, 'నామమునకు బదులుగా వాడఁబడు నామము సర్వనామ' మనెడి లక్షణముగాని సర్వనాములకుండు రూపాది ప్రత్యేకతగాని పై కాక్వాది స్వరములందును 'ఉమ్' శబ్దమునందును నించుకేని లేదు. మఱియు నీ స్వరములపైని విభక్తులు నిల్వనేరవు గదా! ఇట్టి వానిని సర్వనామము లనుట యెట్లు పొసఁగును? 'అప్పుడు' మున్నగు వాని యాద్యవయవములు సర్వనామము లగును గాని యవి సాకల్యముగ సర్వనామములు కావు. 'అ-ఇ-ఎ' అను స్వర రూప సర్వనామములు వేఱు. 'ఆ-ఏ-ఓ' మున్నగు కాక్వాద్యర్థక స్వరములు వేఱు. అట్లే 'ఉమ్' అను నవ్యయమును సర్వనామ లక్షణములు గలది కాదు. 'ఉమ్=ఉన్' అను చార్థకము కొన్ని సర్వనామములపై నిల్చి కృత్స్నార్థమును బోధించును. అందలి కృత్స్నార్థకము సర్వనామము కాదు. 'ఉమ్' శబ్దమునకు 'చా' ర్థకత్వము మూలమునఁ గృత్స్నార్థ కత్వము గల్గుచున్నది. (చూడుడు 'వ్యా. సం.' ౮౪ విష).

౧౧౯. విష:—"III సెక్షను—సంబంధార్థక సర్వనామములు:—ద్రావిడ భాషలలో సంబంధార్థక సర్వనామమే లేదనియు దానికిఁ బదులుగాఁ గ్రియాజన్య విశేషణములు వాడఁబడి యట్టి యర్థము నిచ్చుననియు విశదపఱుచుట కీ భాగము (III Section) ప్రత్యేకముగాఁ జూపఁబడినది. సంబంధార్థక సర్వనామముల యర్థమును దెల్పు ద్రావిడ ధాతుజ విశేషణముల నాంగ్ల భాషలో 'Relative participles' అందురు" (కాల్డు. ౪౪౪ పుట).

విమర్శము:—ఈ విషయ మీవఱకు ౧౧౮ IV విషయమున విపులముగా విమర్శిత మయ్యెను గాన నిట మరలఁ బునరుక్తి చేయలేదు.

సర్వనామ ప్రకరణము ముగిసినది.

---

# ద్రావిడ భాషా పరిశీలనము

## VI క్రియా ప్రకరణము

### ఉపోద్ఘాతము

౧౨౦. I విష:—"శబ్ద ప్రపంచమున నామరూపములు క్రియారూపములు నని ద్రావిడధాతువులు ద్వివిధములు. ధాతువు తుదిని 'గు-ఙ్గు' మున్నగు ప్రత్యయములు చేరును. భూతాద్యర్థక ప్రత్యయములు చేరునపుడు ధాతురూపము మాఱదు."

౧:—"తిజ్ ప్రత్యయములు:—సార్వనామిక శబ్దభాగములుగాని సర్వనామ శబ్దములె కాని చేరునవి క్రియారూప ధాతువులు. సుబ్విభక్తులు చేరుటగాని క్రియకుఁ గర్తగా నిల్చుటగాని నామరూప ధాతువుల లక్షణము. ఇందుల కపవాదములగు పద్ధతు లాయా సందర్భములనుబట్టి నిర్ణయింపనగును" (కాల్డు. ౪౪౫ పుట).

౨:—"ద్రావిడ ధాతువు లనేకములకు మూలరూపము నిల్వక 'వు-కు-గు-ఙ్గు-దు-న్దు-బు-మ్బు' మున్నగు వర్ణములు తుదిని జేరుచుండును. (చూడు II ధాతు ప్ర. ౬౦ విష. ౧౨౮ IV విష). అట్టి వర్ణములు ప్రత్యేక శబ్దభాగములగు ప్రత్యయములు గావు. ఆయా ధాతువుల యవయవముల వంటివే. అట్లవి చేరిన రూపము సాధారణముగాఁ గ్రియగానె యుపయోగింపఁబడుచున్నను నామముగా సైతె ముపయోగింపఁబడవచ్చును" (కాల్డు. ౪౪౫ పుట).

విమర్శము:—'గు-ఙ్గు-దు' మున్నగు ప్రత్యయములు చేరుట ద్రావిడ భాషలన్నిటియందును గలదు. తమిళమునఁ గొంత యరుదుగను బడగన్నడమున నంతకన్న నధికముగను దెల్గున నింకను నధికముగను నయ్యవి చేరును. (చూడు ౧౨౮ IV విష). తమిళమందును "అడఙ్గు = (అడఁగియుండు) తిరున్దు=(నిర్దుష్టమగు), నీన్దు=(నీటిమీఁదఁ దేలు), నిరమ్బు=(నిండియుండు)" అను నిట్టి ధాతువులు పెక్కు గలవని కాల్డువెల్లుగారు II ధాతు ప్రకరణమున నుదాహరించి యున్నారు (చూడు ౬౦ విష. ౧౨౧ II విష). ఇట్లగుటచేత నీ క్రింది యాంధ్రభాషా వికాస గ్రంథము సరికాదని తోఁచుచున్నది.

"ప్రాయికముగా నరవమునందలి. ధాతు రూపమునకు 'కు-గు-చు-యు-ఇంచు' మొదలయిన యాగమములను దుదిని జేర్చుటవలనఁ దెలుఁగునందును గన్నడ మందును ధాతువు లేర్పడును. ప్రాచీన ద్రావిడ రూపముతో నరవమునందలి రూప మభిన్నముగా నుండుటయే దీనికి హేతువని యూహించుట స్పష్టము" (ఆం. భా. వి. ౫౦౮ పుట). ఇట్లు వ్రాసి, 'గు-జు' మున్నగునవి చేరని కొన్ని ధాతువుల నొక పట్టికగాఁ జూపిరి. ఇట్లు వ్రాయుటకు మాఱుగా 'గు-జు-దు-న్దు' మున్నగునవి మూల ద్రావిడ ధాతువునకుఁ జేర్చుటచేతఁ దమిళ కర్ణాటాంధ్రా దులలోని కొన్ని ధాతువు లేర్పడునని వ్రాయుట యుక్తముగా నుండును. తమిళ మందువలెనె తెలుఁగు కన్నడములందును 'గు-జు' మున్నగునవి చేరని ధాతు వులు లెక్కకు మీఱియున్నవి.

౧౨౦. II విష:—౩:—"క్రియలపైని భూతాది కాలభేదములను బ్రేర ణాద్యర్థభేదములను బురుష వచనాద్యర్థ భేదములను దెలియఁ జేసెడి ప్రత్యయ ములు నిల్చునపుడు ధాతుగతమైన స్వరము మార్పునందకయే యుండును. ఏదేని యలంతి మార్పు కల్గినను నది యుచ్చారణ సౌకర్యార్థకమై యుండును" (చూడు II ధాతువులు) (కాల్డు. ౪౪౫, ౪౪౬ పుటలు).

౪:—"పయిని వివరించిన సూత్రమునకుఁ బ్రార్థనాద్యర్థక మధ్యమ పురుషైకవచన మపవాద మనవచ్చును. మఱికొన్ని భాషలయందువలెనె ద్రావిడభాషలందును నీ విధ్యాద్యర్థక మధ్యమ పురుషైకవచనము ధాతురూపము ననే యుండును. అచటి ప్రార్థనాద్యర్థములును బురుషవచనాద్యర్థములును బ్రకరణమునుబట్టి గ్రహించుకొనవలసినదె. ఉదా:—అడి విఋన్దదు = (దెబ్బ పడినది). ఇందలి అడి ధాతువు నామరూపము. క్రియకుఁ గర్తగా వాడఁ బడెను. ఎన్నై అడిత్తాన్ = (నన్నుఁ గొట్టెను). ఇందలి అడి ధాతువు క్రియారూపము. ఇదై అడి = (దీనిని గొట్టుము). ఇందలి 'అడి' ధాతువును గ్రియారూపమె; విధ్యర్థకము. పై మూఁడుదాహృతులందును 'అడి' అను ధాతు రూపమునందు మార్పులేదు. మూఁడవ యుదాహృతి విధ్యర్థకము. ఇందుఁ బ్రత్యయాదికము చేరలేదు" (కాల్డు. ౪౪౬ పుట).

౫:—"ద్రావిడ నామములకు సుబ్విభక్తియోగ ప్రక్రియ యేకవిధము గనే యుండునట్లె తిఙ్విభక్తియోగ ప్రక్రియయు నేకవిధముగనే యుండును. భూతాద్యర్థ బోధక ప్రత్యయములు ధాతువుపై నిల్చుట వానివెనుక సార్వ నామిక పురుషబోధక ప్రత్యయములు నిల్చుట మున్నగునవెల్ల ద్రావిడ భాష లన్నిటియందును నేకరీతినే యుండును. సంధికృతములగు మార్పులు మాత్రమె యరుదుగఁ గల్గును. సంస్కృత వైయాకరణులు చెప్పు ధాతుగణ భేదకృత

కార్యభేదము లంతగాఁ గానరావు. తుళు గోండు భాషలలో మాత్రము క్రియలకుఁ గాలభేదములును నర్థభేదములును జాలఁ గలవు'' (కాల్డు. ౪౪౬ పుట).

"సాధారణముగా ద్రావిడ క్రియలకుఁ గాలత్రయవాచకతలును దద్ధర్మ వ్యతిరేక ప్రార్థనాద్యర్థములును దుమర్థాదులును ననునంతటి యల్ప సంఖ్యాక భేదములుగల రూపములు మాత్రము గలవు. అందును వర్తమాన కాలిక రూపము లర్వాచీనములని యూహించుట కాధారములు చూపట్టు చున్నవి. అన్యభాషా కుటుంబములలోని యాశీరర్థక చేదర్థకాదుల యర్థము ద్రావిడ భాషలలోఁ (తుళు-గోండు భాషలు తప్ప) గొన్ని ప్రత్యయముల చేరికచేత బోధ్యమగును. అసంపూర్ణ భూతవర్తమాన రూపములు (Imperfect tenses) సంపూర్ణ భూతరూపములు (Perfect tenses)—(Present, Past, Future) నింకను నిట్టి శబ్దసమూహామేళితరూపములు మున్నగు వాని యర్థములు (Compound tenses) ద్రావిడ భాషలలోఁ గొన్ని సహాయక్రియల కూడికచే బోధ్యములగును. ఈ విషయమున ద్రావిడ క్రియలు ప్రాచీన సిథియను క్రియల యల్పవిధ స్థితిని గొంతవఱకుఁ బోలుచున్నవి. నవీన టర్కిషు భాషలోఁ బలు రూపములె కాక యత్యధికసంఖ్యాక భేదవిశేష కలిత క్రియారూపములు——చేదర్థకములు–ఆశీరర్థకములు–రెసిప్రోకల్ క్రియలు (Reciprocals) 'ఇన్‌సెప్టివు క్రియలు' (inceptives) (చూడు కాల్డు. ౪౬౩ పుట. ౧_౨౩ III విష.)= (ప్రారంభార్థకములు) వ్యతిరేకార్థకములు - నసంభవార్థకములు మున్నగునవియు వాని కర్త్రర్థకములు మున్నగు పెక్కు-భేదములు గల రూపములును గలవు. కాని యట్టి రూపభేద భూయిష్ఠత నవ్యమనియే తోఁచును. ప్రాచ్య టర్కిషు భాషయనఁదగు 'తార్తారు' భాషకీ పద్ధతి విరుద్ధమై యున్నది. క్రీస్తునకుఁ దర్వాత నిండో యూరపియనులతోడి సంబంధమున నీ సహాయక్రియల వాడెడి పద్ధతి టర్కిషు భాషకు వచ్చియుండుననుచు 'రెముస్యాసటు' అను నాతఁ డీ క్రింది రీతిని వ్రాసెను. 'ఆసియా తుదినుండు దేశములలోఁ బురుష వచనాది బోధక క్రియారూప నిష్పత్తి (Conjugation) పద్ధతియే లేదు. ప్రాచ్య టర్కి దేశస్థులు మొట్టమొదట దీని నత్యల్పముగ వాడుచుండిరి. దీనినిబట్టి యంతకు ముందింతకన్నను నల్పసంఖ్యాక రూపభేదవత్తా పద్ధతి యుండెడిదని యూహింప నగును' అని వ్రాసిరి'' (కాల్డు. ౪౪౬, ౪౪౭ పుటలు).

"ద్రావిడ భాషలన్నిటియందును బురుష వచనాది బోధక క్రియారూప నిష్పత్తి పద్ధతి ప్రాచీనతమమై యున్నది. ఒక్క మలయాళ కావ్య భాషలో మాత్రము కొన్నియెడలఁ గాలబోధక ప్రత్యయములున్నను బురుష వచనాది

బోధక సార్వనామిక ప్రత్యయయోగము లేదు. (చూడు ౧౫ II విష.)" (కాల్డు. ౪౪౭ పుట).

"తుళు-గోందు భాషలలో నవీన టర్కీ భాషలోఁగల పైని వివరించిన యర్థ విశేష బోధక క్రియారూప వైవిధ్యమంతయు నించుమించుగాఁ గలదు. తుళు భాషలో సంపూర్ణ భూతకాలిక క్రియలు (Perfect tenses) నసంపూర్ణ భూతకాల క్రియలు (Imperfect tenses) నస్పష్టభూతకాలిక క్రియలు (Indefinite past) వెలసి యున్నవి. మఱియుఁ జేదర్థకములు (Conditional) సామర్థ్యార్థకములు, (Potential mood) నాశీరర్థకములు (Subjunctive) నీ తుళు భాషలో వెలసి యున్నవి. తమిళమున ధాతుజ విశేషణము భూతార్థకము మాత్రమె యుండఁగాఁ దుళు భాషలో వర్తమాన భావ్యర్థకములును గలవు. పయిని వివరించిన సమాపకములకు నసమాపకములకును వ్యతిరేకార్థక రూపములును దుళు భాషలోఁ గలవు. ఇంక, సంపూర్ణ భూతము=(Pluperfect tense) (Second future) లేక సంపూర్ణ భావిభూతము (Future perfect tense)" అనునవి మాత్రము తుళు భాషలో సైత మితర ద్రావిడ భాషలలో వలెనె సహాయ క్రియల సంపుటిచేతనే సిద్ధించును" (కాల్డు. ౪౪౭ పుట).

"గోందు భాషలో, 'తుళు' లోని సమాపకములు నసమాపకములు మాత్రమె కాక మఱికొన్ని విశేషరూపములును గలవు. ప్రారంభార్థకములును (Inceptive mood) గలవు. (చూడు కాల్డు. ౪౬౩ పుట. ౧౨౩ III విష.) గోందు భాషలోని యసంపూర్ణ భూతకాలిక క్రియలు రెండు విధములు:— I. (Past perfect) = అసంపూర్ణ భూత వర్తమానము. I was going = నేను వెళ్ళుచుంటిని. II. I went = నేను వెళ్ళితిని. (Past indefinite). గోందు భాషలో నొక విధమగు సన్నంత రూపమును (ఇచ్ఛార్థకము) గలదు. ఈ యిచ్ఛార్థకమునకు ముందు భావిక్రియార్థ ఘటిత రూపమున్నయెడల నది చేదర్థకమగును" (కాల్డు. ౪౪౭ పుట).

"ఇట్లు తమిళముకన్న మిక్కిలి యధికముగ గోందు భాషలోఁ గ్రియా రూప వైవిధ్య విస్తృతి యున్నంతమాత్రమునఁ దమిళులకన్న గోందులు మిక్కిలి బుద్ధిమంతులని తలంపరాదు. తమిళమున కత్యంత ప్రాచీనకాలమందె లిపి-వాఙ్మయము నేర్పడుటచేత నందు భాష స్థిరపడి యపభ్రష్టరూపములు పెరుఁగఁ జాలవయ్యెను. అనాగరకులగు గోందులును 'కోలులు' ను గాల క్రమమునఁ గ్రియలకుఁ గాల విశేషములను బోధించు సహాయ క్రియలను జేర్చుటయు నవి యజాగరూకతాకృతాపభ్రంశ భూయిష్ఠములగుటయు సంభవించెను.

ప్రాథమిక రూపములకును నవీనరూపములకును నడిమికాలపు రూపములు నశించెను”.

“హంగేరియను భాషలలోవలె ద్రావిడ భాషలందు ‘కర్తృ ప్రధాన క్రియలు, కర్మ ప్రధాన క్రియలు’ అను ద్వైవిధ్యము లేదు. ఉదా:—I. నే నెఱుఁగుదును=(I know) ఇందలి క్రియ కర్తృ ప్రధానము. II. నేను దాని నెఱుఁగుదును=(I know it). ఇందలి క్రియ కర్మ ప్రధానము. ఇట్టి పద్ధతి బోర్ను భాషలో (లేక) ‘కనురీ’ భాషలోను (ఆఫ్రికాలోనిది) గలదు. ద్రావిడ భాషలయం దిట్టి పద్ధతి లేదు” (కాల్డు. ౪౪౮ పుట). (చూడు ౧-౨౧ I విష).

“ఇండో యూరపియను క్రియలవలెనె ద్రావిడ క్రియలును నామములతో సమసించును. సంస్కృతమందును గ్రీకునందును నుపసర్గములతో ధాతువులకు యోగము కల్గుటవలన వాని యర్థము మాఱుచుండును. ఇట్టి పద్ధతి సిథియను భాషలలో లేదు. ద్రావిడ భాషలలో నిట్టి పద్ధతి యరుదుగ నున్నను నా క్రియలను విభజించి చూచినపు డవి సంస్కృత పద్ధతికన్న భిన్నరీతి నేర్పడినవని తెలియఁగలదు. ద్రావిడ భాషలలో నుపసర్గములవలెఁ దోఁచు శబ్దములు:—“(తమి)-మేల్ = (తెల్గు)-మీఁదు-(తమి)-కీఴ్ = (తెల్గు)-క్రిందు” మున్నగునవి. ఉదా:—(తమి)-మేల్+కొళ్=మేఱ్కొళ్=(మీఁదు కొను=జయించు). (తమి)-కీఴ్ప్పడు=(క్రిందఁబడు=అణఁగియుండు). పయిని వివరించిన ‘మేల్-కీఴ్’ అనునవి యుపసర్గములు కావు. అవి నామములు. (తమి)-మి+య్+అల్=మేల్=(మీఁదు=ఆధిక్యము). ఇట్లగుటచేత ‘మేల్+కొళ్=మేఱ్కొళ్’ మున్నగునవి యుపసర్గములతోఁ గూడిన ధాతువులు గావు. ఇంక నామములతో సమసించిన క్రియలు. గ్రీకు భాషలోని ‘పెరి-కటొ’ మున్నగునవి యాదియందుఁగల క్రియలు సైతము పై ద్రావిడ సమాసముల వంటివి కావు. గ్రీకు-‘పొలియొరెకె-ఓ’ అను పట్టణమును ముట్టడించుట యను నవయవార్థముగల ‘నౌపెగెఓ=(ఓడకట్టుట)’ అనునది యాదిగాఁగల శబ్దములు పై ద్రావిడ సమాసములతో సరిపోల్పఁదగినవి”.

“ద్రావిడ క్రియలకు, సహాయ క్రియలయొక్క తుమర్థకములు, భావార్థకములు, ధాతుజ విశేషణములు మున్నగు రూపములయొక్క యోగమువలన నర్థపరిణామము గల్గును. ఉదా:—తమి-మున్దిప్పోనాన్=(వాఁడు ముందుగా వెళ్ళెను) (ముందు పొంది వెళ్ళెనని యవయవార్థము). తమి - చుట్టి (ట్రి) ప్పోనాన్=(ప్రదక్షిణము చేసెను)=(చుట్టును దిరిగి వెళ్ళెనని యవయవార్థము). తమి-తాటక్కు-దిత్తాన్=(వాఁడు క్రిందికి గెంతెను)=(క్రిందిభాగమును బొందు

నట్లు దుమికెనని యవయవార్థము). ఇట్టి ద్రావిడ సమాసములను డా. గుండర్టు గారి మలయాళ వ్యాకరణమునఁ జూడనగును" (కాల్డు. ౪౪౮, ౪౪౯ పుటలు).

విమర్శము:—"తమి-మేల్ + కొళ్ = (మీఁదుకొను) = మేఱ్కొళ్ = (జయించు)" ఇట్టివి తెల్గున శబ్దపల్లవము లనఁబడును. ఉదా:—మేలుకొను = (నిద్రమాను). ('మేలును బొందు' అని యవయవార్థము) (చూడు 'వ్యా. సం.' ౩౪౮ విష).

ఆంధ్ర భాషా చరిత్ర గ్రంథమం దుపసర్గముల విషయమున నీ క్రింది రీతిని వింతగ వ్రాయఁబడెను.

"సంస్కృతములోని యుపసర్గములు ప్రాకృతములోఁ బదములతో నేకమై వికృతి నొందుచుఁ దమ యుపసర్జనత్వమును ('ఉపసర్గ=ఉపసర్జన' అను రెండును నభిన్నములని కావలయును వీరి యుద్దేశము) గోలుపోయినవి...... సంస్కృతములోని యుపసర్గములు నేఁడు భారతీయ భాషలయందుఁ గానరావు. 'ప్రతి-పరి' అను నుపసర్గములు మాత్రము వాడుకలోఁ దద్భవదేశ్యములతోఁ గలసి యుపయోగింపఁబడుచున్నవి. ఉదా:—ప్రతిమాట-ప్రతిపల్లె......ప్రతీ మాట-ఆ మాటకుఁ బ్రతిలేదు......పరిగొను (చుట్టుకొను) పరిపరి=(చాల విధముల)......అవసడి-అపనమ్మకము-అపదూఱు-నిబద్ధి-నిబ్బద్ధి-మొదలగు వానిలో నుపసర్గములతోఁ గూడిన తద్భవపదములు చేరినవి............

౧. అతి=అడి. ఉదా:—అడిసిగ్గు (అధికమైన సిగ్గు)......ఐమూల= అతిమూల............

౨. అధి=అడి. అడుపు-అడుకు. అతుకు=అధి+కృ=దగ్గఱ చేరు. అలవరు (ఉు?) చు=అధి+పత్=(దగ్గఱ పడునట్లు చేయు)............

౪. అప......ఆపు=అపహ్నృ............

౫. అపి......పెనయు=పినహ్=అపినహ్.

౬. అవ......ఓరుచు=అవధృ............

౮. ఉద్......ఉద్+కృ=ఉతుకు. ఉతుకు=ఉదుకు=ఉద్+ధావ్ +కృ. ఉబుకు—ఉప్పొంగు=ఉద్+ప్లు+కృ. ఒలుకు=ఉద్+స్థా......" (ఆం. భా. చ. ౧౨౬, ౧౨౭ పుటలు).

సంస్కృత జన్య మాంధ్రమను తమవాదమును గ్రంథకర్తగా రిట్లు ప్రదర్శించిరి. ఈరీతి పరిణామముల నంగీకరించునపు డింక నే భాషనుండి యే భాష జనించె నన్నను సమర్థింపవచ్చును గదా.

ఆంధ్ర భాషా చరిత్ర కర్తగా రీ యుపసర్గముల విషయముననే కాక సంస్కృతము ప్రాకృత ద్వారమునఁ దెల్గుగా నేర్పడె ననుటను సైతము పైరీతి నసంభవమగు పరిణామ పరంపరను జూపి సమర్థించుకొనసాగిరి. అది సరికా దనుచు నాంధ్రభాషా వికాసకర్తగా రీ క్రింది రీతిని వ్రాసిరి.

"సంస్కృత ప్రాకృతములు వృద్ధభాషలుగా నుండిన కాలమునఁ దెనుఁగు ప్రాథమికావస్థయందుఁ దెనుఁగు నాట వ్యవహారములో నుండెను.......... ............'కృంత్ + కృ = గీఁకు. భింద్ + కృ = పీఁకు.'............ సంస్కృత ధాతువులను తెనుఁగునకుఁ దెచ్చుకొనునప్పుడు తెనుఁగు క్రియనే యనుబంధముగఁ జేర్చికొను నభ్యాసమును నిరూపించితిని. (ఈ యభ్యాసము ద్రావిడు లిండియాకు వచ్చిన పిమ్మటిది) పై యభ్యాసమున కీ సిద్ధాంత మెంత మాత్రము సరిపడదు. భాషయందలి ప్రకృతులు పైనుండి వచ్చినను ప్రత్యయములు మాత్రము తెనుఁగువే కదా! (ఇదియు నర్వాచీన పద్ధతియె.).........(*a*) జను లెల్లరును సంస్కృత ప్రాకృతములనే మాటాడు చుండ నవియే యపభ్రష్టములయి నేఁటి తెనుఁగయ్యె ననుచో పరిణామ ప్రకారము సిద్ధరూపముల ననుసరించును గాని ధాతుమాత్రముల ననుసరించుట గాదు.........సంస్కృత ప్రాకృతములు ధాతుమాత్రములుగానే యుండు నపుడు అనఁగా వ్యవహృతములగుచుండినపుడు ఆ ధాతువులు మాఱి తెనుఁగుగా నేర్పడిన వనవచ్చును. కాని తెనుఁగు తలచూపునప్పటికే సంస్కృతము వేల కొలఁది సంవత్సరములు పరిణతి నొంది అపభ్రంశ భాషలుకూడ నెలకొని యుండుటచే నిది యెంతయును జరిత్రకు విరుద్ధము. కాలము సరిపడదు" (ఆం. భా. వి. ౫౨౪-౫౨౫-౫౨౬ పుటలు) అని వ్రాసిరి.

ఆంధ్ర భాషా చరిత్రమునఁ జూపఁబడిన సంస్కృతభాషా పరిణామరూప మాంధ్రమనెడి విషయములు కేవలము నసంభవములని యీావఱకే ప్రదర్శింపఁ బడెను. అందులకై తెనుఁగు మిక్కిలి నవ్యముగఁ దలచూపెనని వికాసకర్త గారు వ్రాయుట సరికాదు. కొన్నికొన్ని విషయములందుఁ దమిళ కన్నడముల కన్నను దెలుఁగు ప్రాచీనమని తోఁచును. సంస్కృతమునకును ద్రావిడ భాషలకును సంబంధము చరిత్ర కందనికాలమునాఁటి నుండియుఁ గలదనక తీరదు గదా. పెక్కు విషయములలో నీ రెండు కుటుంబములకును బలమైన సంబంధ మత్యంత ప్రాచీనము గలదని చరిత్రాభిజ్ఞులెల్ల నంగీకరించి యున్నారు. పెక్కు విషయములు సంస్కృతమునకును ద్రావిడ భాషలకును మూలములగు జాఫెటికు భాషనుండి వచ్చినవని డా. కాల్డువెల్లుగారు నిరూపించి యున్నారు. కాన ద్రావిడ భాషలుగాని యందలి తెనుఁగుగాని సంస్కృతాపభ్రంశ

భాషలకును నర్వాచీనమె యనుట సాహసము! (చూడు ౧౧-౧౨ విష. ౭ విష. ౧౧౫ III విష. ౧౧౧ I విష).

I సెక్షను-క్రియల విభాగము. (౧) సకర్మకాకర్మకములు.

౧౨౧. I విష:—"ద్రావిడ వైయాకరణులు 'పిఱవినై'=(సకర్మకము) ('ప్రేరణక్రియలు'. శ్రీ రెడ్డిగారు) 'తన్‌వినై' = (అకర్మకము) (ఇవి తమిఱ శబ్దములు) అని క్రియలను రెండు విధములుగా విభజింతురు. క్రియా ఫలము కర్తృభిన్నవస్తువును జెందునపుడు సకర్మకమనియుఁ గర్తనె చెందునపు డకర్మకమనియు వ్యవహరింతురు. ఇతరములగు నిండో యూరపియను భాషలలో నున్న కర్త్రర్థ కర్మార్థములకంటె సంస్కృతమునందలి పరస్మై పదాత్మనే పదములనే యెక్కువగాఁ బై విభాగము పోలుచున్నది" (కాల్డు. ౪౪౯ పుట).

"సంస్కృత పరస్మైపదాత్మనే పదభేదము పురుష బోధక ప్రత్యయ భేదము వలన విశదమగును. ద్రావిడ భాషలందలి సకర్మకాకర్మకత్వములు ధాతువు తుదిని జేరిన 'గు' మున్నగు ననుబంధములలో నుండును. సకర్మక క్రియా ఫల మొక కర్మమును జెందును. ద్రావిడ సకర్మకాకర్మకములు హంగేరియను భాషలలోని కర్తృ ప్రధాన కర్మ ప్రధాన క్రియలను బోలియుండును. అందును నించుక భేదము గలదు. ఉదా:—I కర్మ ప్రధాన:—స్టెరెటెం = (ప్రేమించు చున్నాను). కర్తృప్రధాన - స్టెరెటెక్ = (ప్రేమతో నున్నాను). ద్రావి డా కర్మక క్రియ యిట్లు కర్మమును స్పృశింపదు. (చూడు ౧౨౦ II విష" (కాల్డు. ౪౪౯ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు సకర్మకత్వాకర్మకత్వ లక్షణములను బరస్మై పదిత్వాత్మనే పదిత్వలక్షణములను సరిపోల్చుట సరికాదు. కర్మాకాంక్ష గల క్రియ సకర్మకము. కర్మాకాంక్ష లేనిది యకర్మకము. ఉదా:—అక:-'దేవుఁడు కలఁడు' అనుచోటి క్రియ కర్మము నపేక్షింపదు గాన నది యకర్మకము. సక:- 'దేవుఁడు జనులను రక్షించును' అనుచోటి క్రియ 'ఎవరిని రక్షించును? జనులను' అను రీతిని గర్మము నాకాంక్షించును గాన నది సకర్మకము. ఆత్మనేపది క్రియ లకర్మకములును గావచ్చును. ఉదా:—విహగా డయన్తే=(పక్షులు ఎగురుచున్నవి. ఇందలి 'డయన్తే' అనునది యాత్మనే పది-అకర్మకము. దేవో రక్షతి భక్తాన్)= (దేవుఁడు భక్తులను రక్షించును.) ఇందలి 'రక్షతి' అనునది పరస్మై పది-సకర్మకము. సకర్మకత్వాకర్మకత్వములు సాధారణముగా ధాత్వర్థమును బట్టి సంభవించు చుండును. ఈ క్రింది రీతిగల యర్థము నిచ్చునవి యకర్మకములని వైయా కరణులు వచించిరి.

"శ్లో. సత్తా లజ్జా స్థితి జాగరణం। వృద్ధి క్షయ భయ జీవిత మరణమ్।
శయన క్రీడా రుచి దీప్త్యర్థా। నైతే కర్మణి ధాతవ ఉక్తాః ॥ విస్తరస్తు ౯౩౨
సూత్రే ద్రష్టవ్యః" (ముగ్ధ. ౨౮౨ సూ. గిరిశ చంద్ర వ్యాఖ్య). (చూడుడు
'వ్యా. సం.' ౨౩౬ విష).

సంస్కృత ధాతువు లాత్మనేపదులు పరస్మైపదులు నుభయపదులు నని మూఁడు విధములు. 'తిప్-తస్-అన్తి' మున్నగు పురుష బోధక ప్రత్యయములతో నుండునవి పరస్మైపదులు. 'తే-ఆతే-అన్తే' మున్నగు పురుషబోధక ప్రత్యయములతో నుండునవి యాత్మనే పదులు. పయి రెండు విధములగు ప్రత్యయములు-రాఁదగినవి యుభయ పదులు. పాణిన్యాచార్యులవారు రెండు విధములగు ప్రత్యయములను యథేష్టముగాఁ జేర్పరాదనియుఁ గ్రియా ఫలము గర్తృగామి యనఁగాఁ గర్తను జెందునపు డాత్మనే పది ప్రత్యయములను జేర్పవలయుననియుఁ (అవి ధాతు పాఠమున ఇకార మిద్వర్ణముగాఁగలవై యుండును) దక్కినయెడలఁ బరస్మై పది ప్రత్యయములను జేర్పవలయు ననియు నొక యేర్పాటును సూత్రించిరి.

"స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" (౧-౩-౭౨)="స్వరితేతో ఞితశ్చ ధాతో రాత్మనేపదం స్యాత్ కర్తృగామిని క్రియాఫలే" (సి. కౌ. ౨౧౫౮ సూ).

"శేషా త్కర్తరి పరస్మైపదమ్" (౧-౩-౭౮) = "ఆత్మనేపద నిమిత్త హీనా ద్ధాతోః కర్తరి పరస్మైపదం స్యాత్" (సి. కౌ. ౨౧౫౯ సూ).

ఉదా:—యాజకో యజతి=(యాజకుఁడు యజ్ఞము చేయుచున్నాఁడు.) ఇందలి 'యజతి' అనునది పరస్మైపది ధాతువు. యజమానో యజతే=(యజమానుఁడు యజ్ఞము చేయుచున్నాఁడు) ఇందలి 'యజతే' అనునది యాత్మనేపది ధాతువు. యజ్ఞఫలీభూత స్వర్గము యాజకునిని జెందదు - యజమానుని జెందును.

"వేతనేన యజ్ఞదత్తభృతో దేవదత్తః పచతీత్య త్రాపి పాకఫలస్య భోజనస్య పక్తృగామిత్వాభావా న్నాత్మనే పదమ్" (బాలమనోరమా వ్యాఖ్య).

ఈ పాణిని నియమము మహాకవులచేఁ బాటింపఁబడలేదు. "అకరో ద చిరేశ్వరః క్షణా। ద్ద్విషదారమ్భ ఫలాని భస్మసా దితి రఘుః (కాళిదాసుని ప్రయోగము). తనోతి శుభ్రం గుణసంపదా యశ ఇత్యాదౌ (ఇది భారవి ప్రయోగము)

ఫలవత్కర్తరి - పరస్మైపదమ్. ఫలం విశ్వోపకారాయ । ధత్తే పర్వాణి పర్వాణీతి. కమలవనోద్ఘాటనం కుర్వతే యే (సూర్యరశ్మయః) ఇత్యాదౌ (మయూరభట్ట సూర్యశతక ప్రయోగము) వఫలవత్కర్త ర్యాత్మనేపదం సిద్ధమితి" (ముగ్ధ. ౯౧౯ సూ. దుర్గాదాస వ్యాఖ్య). (వోపదేవకృత కవికల్పద్రుమ వ్యాఖ్య. ౭ పుట).

౧-౨౧. II విమ:—"తమిళమున భూతార్థక విశేషణమున 'ఇ' కారము నిల్చు ధాతువులకెల్ల సకర్మకములైనను నకర్మకములైనను నేకరీతినే సమాపక క్రియారూపము లుప్పతిల్లును. ఉదా:—తమి-సకర్మ-పణ్ణు=(చేయు). వర్త-పణ్ణుగిఱేన్=(చేయుచున్నాను.) భూత-పణ్ణినేన్=(చేసితిని). భవి-పణ్ణువేన్=(చేయఁగలను = చేయుదును). అకర్మక-పేసు = (మాటలాడు). వర్త-పేసుగిఱేన్ = (మాటాడుచున్నాను). భూత - పేసినేన్ = (మాటాడితిని). భవి - పేసువేన్- (మాటాడఁగలను=మాటాడుదును)" (కాల్డు. ౪౫౦ పుట).

౧. "ద్రావిడ భాషలలోఁ గొన్ని యకర్మకధాతువుల తుదిని 'గు-జ్గు; దు-న్దు' మున్నగు సరళవర్ణములు గన్పట్టుచున్నవనియు, నట్టి సరళములు మూల ద్రావిడ ధాతువుల తుది నుచ్చారణార్థకములై చేరుననియు నవి సకర్మకము లగునపు డా సరళము పరుషమై ద్విత్వమునందు ననియు నట్టి పరుష ద్విత్వము మూఁడు విధములుగ నేర్పడుననియు వానిలో నియ్యది మొదటి విధమనియు నీవఱకు వ్రాసియున్నాను. (చూడుడు ధాతువులు II ప్రక. ౬౦, ౬౦ III విమ.) ఉదా:—తమి-అక-పెరుగు=(వర్ధిల్లు). సక-పెరుక్కు=(వర్ధిల్లఁజేయు). అక-అడఙ్గు. సక-అడక్కు (అణఁచు). అక-పోగు=(పోవు). సక-పోక్కు=(పోవఁజేయు=పంపు). అక-అడైశు (చు)-సక-అడైచ్చు=(గ్రుచ్చు). అక-తిరున్దు. సక-తిరుత్తు=(శుద్ధపఱుచు). అక-నిరమ్బు. సక-నిరప్పు=(నింపు). ఇట్టి సకర్మకములనెల్లఁ బ్రేరణార్థకము లందురు. కాని సకర్మకములమీఁదఁ బ్రేరణార్థక మగు 'ఇ' ప్రత్యయము నిల్చినదానిని మాత్రమె ప్రేరణార్థకమనుట యుక్తము. ఉదా:—తమి - సక-పణ్ణు = (చేయు) + ఇ = పణ్ణువి = (చేయించు)" (కాల్డు. ౪౫౦, ౪౫౧ పుటలు).

విమర్శము:—ప్రేరణార్థము వాచ్యమగునపుడు దానిని బ్రేరణార్థక మనరాదనుట సరికాదు.

"తత్ప్రయోజకో హేతుశ్చ" (౧-౪-౫౫)="కర్తుః ప్రయోజకో హేతు సంజ్ఞః కర్తృసంజ్ఞశ్చ స్యాత్" (సి. కౌ. ౨౫౭౫ సూ).

"హేతుమతిచ" (3-౧-౨౬) = "ప్రయోజక వ్యాపారే ప్రేషణా దావాచ్యే ధాతో ర్ణిచ్ స్యాత్. భవన్తం ప్రేరయతి=(భూ+ఇ+తి)=భావయతి=

(కావించుచున్నాఁడు)=అగునట్లు చేయుచున్నాఁడు)" (సి. కౌ. ౨౫౭౬ సూ). (ణిచ్చులోని 'ణ్-చ్' అనునవి 'ఇ' ద్వర్ణములు. 'ఇ' అనునది ప్రేరణార్థక ప్రత్యయము).

"కర్తుః ప్రయోజకః = ప్రవర్తయితా......దేవదత్తః పచతి; తంప్రేర యతి యజ్ఞదత్తః. (దేవదత్తుఁడు ప్రయోజ్యుఁడు-యజ్ఞదత్తుఁడు ప్రయోజ కుఁడు.)......ప్రయోజక నిష్ఠః ప్రేషణాది వ్యాపారః. తస్మిన్ వాచ్యే ణిచ్ స్యా దిత్యర్థః" (బాలమనోరమా వ్యాఖ్య.) ప్రయోజకత్వమనఁగా నియోజకత్వాది వ్యాపారము వాచ్యమగునపుడు ధాతువు సహజముగా నకర్మకమైనను సకర్మకమయినను నది సకర్మకమై ప్రేరణార్థకమె యగును. కాన నట్టివి ప్రేరణార్థకము లనిపించుకొనవనియు నవి సకర్మకమాత్రములె యనఁదగు ననియు డా. కాల్డువెల్లుగారు వ్రాయుట యుక్తముకాదు. అట్టివానియందుఁ బ్రేరణార్థ బోధక ప్రత్యయము నిల్వక తుది పరుషము ద్విరుక్తమగుట మాత్రము సంభవించుచుండుటం జేసి యవి ప్రేరణార్థకము లనిపించుకొనవనెడి దొరగారి యాశయము కేవలభ్రాంతిమూలకము. అట్టి ద్విత్వము ప్రేరణార్థక ప్రత్యయ యోగమూలక మనియు నూరకయె కల్గలేదనియు డా. కాల్డువెల్లుగారు దలంప కుండుటయె యిట్టి భ్రాంతికి మూలము. (చూడు ౬౦ III, IV విష). ఇట్లె ముందును భూతార్థక క్రియాంత్య వర్ణద్విత్వము వీరిచే నిరూపింపఁబడును. (చూడు ౧౩౧ I విష). 'ఇ-పి-వి' అనునవి మాత్రమె (౧౩౭ నన్నూలు) ప్రేరణ ప్రత్యయము లనరాదు. 'కు-చు-టు-తు' మున్నగు పెక్కు ప్రేరణ ప్రత్యయములు గలవని నన్నూలు ౧౩౯ సూ. చెప్పుచున్నది. (చూడు ౬౦ II విష). వాని యోగముననే సంధివశమున ధాతువు తుది పరుషము ద్విత్వరూప మగుచున్నది. (చూడు ౬౦ III, IV విష). ఇట్లగుటచేత నీ సకర్మ కాకర్మకము లనుశీర్షికగల గ్రంథమెల్ల ననావశ్యకముగా డా. కాల్డువెల్లుగారిచేఁ బెంచఁబడినదనియుఁ, బ్రేరణ ప్రకరణమున 'ఇ-వి-పి' అను ప్రత్యయములతో పాటు 'కు-చు-టు-తు-అు-వు' మున్నగు ప్రత్యయములను సయితము ప్రేర ణార్థకములనుగా వివరించి యీ ప్రత్యయముల సంధులవశమునఁ బరుష ద్విత్వము సంభవించుచున్నదనియు, నీరీతి నేర్పడిన సకర్మక క్రియలును బ్రేరణార్థకములె యనియు నుపదేశించి యీ సకర్మ కాకర్మక విషయకములగు నాల్గువిధములను వివరించిన గ్రంథమెల్లఁ బ్రత్యాఖ్యానము చేయుట యుక్తము.

౧౨౧. III విష:—"తెల్గున నకర్మక 'గు' వర్ణాంత ధాతువులు సకర్మకము లగునపుడు తమిళమందువలె 'క్కు' వర్ణాంతములు కాక 'చు' వర్ణాంతము లగును. ఉదా:—అక-తూగు (వ్రేలాడు-నిద్రించు) ఉచ్చారణార్థ కానునాసిక

యోగమున-తూఙ్గు. సక-తూచు-తూఙ్చ్చు=(త్రాసుతోఁ దూఁచు=తూఁగఁ జేయు). ఇట్టి క చ ల మార్పు శబ్దతత్వ శాస్త్ర సమ్మతమె. ఇట్లు ధాతువు తుది నున్న 'గు' వర్ణము 'చు' వర్ణమగుట మాత్రమేకాక 'తమిళ 'క్కు' వర్ణముతో సమానమగు 'పు' వర్ణముగా మాఱుటయుఁ దెల్లునఁ గలదు. ఉదా:—అక-మేయ్. సక-మేపు. 'ప్పు' అనునది తమిళమున 'మ్బు' అను దానినుండి యేర్పడుట ప్రసిద్ధమై యుండుటచేతను 'గు' వర్ణము 'పు' వర్ణముగా మాఱుట ద్రావిడ శబ్ద పరిణామ సంప్రదాయ విరుద్ధమగుటచేతను, బువర్ణమునుండి 'పు' వర్ణము వచ్చెననుట సహజ మగుటచేతను దెలుఁగు క్రియల తుదిని 'గు' వర్ణముతోపాటుగ 'బు' వర్ణము సైతముండెడిదని విశద మగుచున్నది. తెలుఁగునందు 'చు-ంచు' లతో పాటుగ 'పు-ంపు' లును ధాతువుల తుదిని నిల్చుటయుఁ దమిళమున 'క్కు' అనుదానికి 'ప్పు' అనునది బర్యాయముగా నిల్చుటయుఁ బయి యభిప్రాయమును బలపఱచు చున్నది. ఉదా:—నడక్కు=నడప్పు=(నడువన్)." (కాల్డు. ౭౫౧ పుట).

" 'సంస్కృ - జీవాపయామి=(జీవింపఁజేసెదను) జ్ఞాపయామి=(తెలిపెదను)' మున్నగు సంస్కృత ప్రేరణార్థకములందలి 'ప' కారము ద్రావిడ భాషలందలి 'ప్పు' అను ప్రేరణార్థకమును బోలుచున్నది. కాని యీ పోలిక యాదృచ్ఛికము. ద్రావిడ భాషలలోని యీ యర్థ విశేషము (ప్రేరణార్థము) ధాతువు తుదిని గల్గిన 'పు' వర్ణ ద్విరుక్తతచేతఁ గల్గినదిగాని ధాత్వవయవ వర్ణముచేఁ గల్గలేదు. మఱియు సంస్కృత ప్రేరణార్థకము 'అయ' (ణిచ్) అను నదేకాని 'ఆప' అనునదికాదు. 'ఆప' అనునది సంధికార్య రూపముమాత్రమె" కాల్డు. ౭౫౧, ౭౫౨ పుటలు).

"అకర్మకము సకర్మకమైనప్పటి యీ పద్ధతి (తుది సరళము పరుషమై ద్విత్వమునందు పద్ధతి) విశేష్యము విశేషణమగునప్పుడును సంభవించునని యీ వఱకు II ప్రకరణమున (II ధాతువులు) విశదపఱుపఁబడెను. (చూడు ౬౦ I. XI. XIII విష). (చూడు ౯౧ III విష). ఉదా:—విశేష్య-మరున్దు=(మందు), విశేషణము మరుత్తు=(మందు సంబంధమైన). విశేష్య-పామ్బు=(పాము). విశేషణ పాప్పు=(పాము సంబంధమైన) ఇట్టి ద్విరుక్తి ప్రకృత్యర్థ దార్ఢ్యమును దెలుపును. హెబ్రు భాషలో సైత (సెమిటిక్) మిట్లె యకర్మకము సకర్మకమగునపుడు హల్లునకు ద్విత్వము వచ్చుట గలదు. ఉదా:—అక - లామద్=(వాఁడు నేర్చెను) - సక - లిమ్మేద్=(వాఁడు నేర్పెను)" (కాల్డు. ౭౫౨ పుట).

విమర్శము:—తమిఴ ప్రత్యయాదుల పరిణామమె తెలుఁగునఁ బ్రాచీన కాలమున నుండవలయునను నిర్బంధమేల? 'గెలుచు' మున్నగు తెల్గు ధాతువులు మొదట 'గెలుగు' అను రీతిని 'గు' వర్ణాంతములై యుండనోపు ననెడి దొర గారి యాశయము సరికాదని యీవఱకే విమర్శితమయ్యెను. (చూడు ౬౦ VI విష). ఇట్లే తెల్గు 'మేయ్గు' అని యుండుటకు మాఱుగ 'మేయ్బు' అని ప్రాచీనతమ కాలమున 'మేయు' ధాతురూప ముండెడిదనియు నట్లె కానిచో 'మేపు' అను సకర్మక (ప్రేరణ) రూప మెట్లు లభించుననియు దొరగా రిట వ్రాయుచున్నారు. తమిఴమందు 'గు-జ్గు-దు-న్దు-బు-మ్బు' మున్నగునవి ధాతు వుల తుదిని జేరుట కుపపత్తి యేమియుఁ జూపఁబడలేదుగదా. అట్లె (చూడు ౧-౨౮ IV విష). యాంధ్రకర్ణాటము లందును 'గు-చు'-మున్నగునవి తుదిని నిల్చియుండెనని చెప్పుటలో ననుపపత్తి యేమున్నది? ప్రేరణార్థమున-సకర్మకత్వ మున-తమిఴమందును నూరకయె ద్విత్వము రాలేదనియు 'ఇ-వి-పి' అనువాని వలెనె 'కు-చు-టు-తు-పు' మున్నగు ప్రత్యయములు ప్రేరణార్థకములై ధాతువు తుదిని నిల్చుటచేత నట్టివాని సంధిలో ధాతువు తుదివర్ణమునకు ద్విత్వము సంభ వించెననియు నీ వఱకు విపులముగా నిరూపింపఁబడెను (చూడు ౬౦ III విష). ఇట్లె తెల్గునందును 'చు-ంచు-పు-ంపు' అనునవి ప్రేరణార్థక ప్రత్యయములై నిల్చెనని గ్రహింపనగును. ఇవి 'ఇంచు' అనుదాని సంక్షేపరూపములని ముందు నిరూపింపఁ బడును.

ఇంకఁ దమిఴమున 'క్క' అనుదానిచో 'ప్ప' అనునది పాక్షికముగా నిల్చుననియు 'నడప్ప'=(నడువన్) అనుదానికి 'నడక్క' అనునది పర్యాయ రూపమనియు దొరగారు వ్రాయుట ప్రామాదికము. నడ ధాతువునకు భావ్యర్థ మున 'ప్-వ్' అనునవి నిల్వఁగాఁ నడప్పాన్=(నడవఁగలఁడు) మున్నగురూప ములు సిద్ధించును. 'పవ్వ......' (నన్నూ-౧౪౪ సూ.)='ప్-వ్' అనునవి భావ్యర్థకములు. నడప్పాన్=(నడ+ప్+ఆన్)=(నడవఁగలఁడు). చెయ్వాన్= (చెయ్+వ్+ఆన్)=(చేయఁగలఁడు).

నడ ధాతువునకుఁ బ్రేరణార్థమున 'పి' వర్ణకముచేరఁగా 'నడప్పి'=(నడువఁ జేయు=నడపించు) అను రూపము తమిఴమునఁ గల్గును. (చూడు ౬౦ II విష). నడ ధాతు తుమర్థకరూపము 'నడక్క' అనునది. 'నడప్ప' అనునదియు దాని పర్యాయము కావచ్చును. తుమర్థమందు 'అ' ప్రత్యయము నిల్చును. దానికిఁ బూర్వమున భావ్యర్థకములగు 'కు-ప' అనునవి నిల్చుటచేత 'నడక్క-నడప్ప' అనునవి సిద్ధించును. (చూడు-౬౦ XII) నడ ధాతు ప్రేరణరూపము 'నడప్పి'

అనునది. దీని తుమర్థకము 'నడప్పికర్' కావచ్చును. (చూడు ౧౩౭ III విష. శ్రీ రెడ్డిగారి జాబు).

౧౨౧. IV విష:—"రెండవ జాతి ధాతువులు—కాలబోధక ప్రత్యయము యొక్క మొదటి సరళము పరుషమై ద్విత్వమందుటచేత నకర్మకము సకర్మక మగును. ఈ జాతి క్రియలకుఁ దుదిని 'గు-ఙ్గు' మున్నగు నాగమము లుండవు. ఎందేని యున్నను నవి మార్పునకు లొంగవు. వర్తమాన కాలిక చిహ్నము 'గిఱు'; భూతకాలిక చిహ్నము 'ద్-న్దు', భావిచిహ్నము-'బ్-వ్' ఇవి సర్వ ద్రావిడ భాషా సామాన్యకాలబోధక ప్రత్యయములు. ఉదా:—తమి-ధాతు-చేర్=(కలియు-కూడు). అక-వర్త:—సే (చే) ర్గిఱేన్=(కలియుచున్నాను). భూత-సే (చే) ర్న్దేన్=(కలిసితిని). సే (చే) ర్వేన్=(కలియఁగలను. కలియు దును). సకర్మక:—వర్త - సే (చే) ర్క్కిఱేన్=(కలుపుచున్నాను). భూత - సే (చే) ర్త్తేన్=(కలిపితిని). భావి-సే (చే) ర్ప్పేన్=(కలుపఁ గలను. కూర్పఁ గలను). వీనిలోని ద్విత్వము సకర్మకతార్థ విశేషమును, గ్రియార్థ దార్ఢ్యమును బోధించును" (కాల్డు. ౨౫౨, ౨౫౩ పుటలు).

"ఈ రెండవ జాతి ద్విత్వమునకుఁ గొన్ని యెడల బహుళత్వమును గలదు:—కొన్ని యకర్మక క్రియా రూపములందును నట్టి ద్విత్వము కల్గును. ఉదా:—అక-ఇరు=(ఉండు) వర్త-ఇరుక్కిఱేన్=(ఉన్నాను). భావి. ఇరుప్పేన్=(ఉండఁగలను=ఉందును). పడు=(పరుండు). వర్త. పడుక్కిఱేన్=(పండుకొను చున్నాను). భూత—పడుత్తేన్=పరుండితిని). పడుప్పేన్=(పరుండఁ గలను=పరుండుదును). కొన్ని సకర్మక రూపములలో నట్టి ద్విత్వము కల్గదు. ఉదా:—ధాతు—ఈ=(ఇచ్చు) ఈగిఱేన్ = (ఇచ్చుచున్నాను). ఈన్దేన్ = (ఇచ్చితిని). ఈవేన్=(ఇయ్యఁగలను). ఇట్టి నియమ రాహిత్యము మాండలికములగు నుచ్చారణ భేదములచేఁ గల్గును" (కాల్డు. ౨౫౩ పుట).

విమర్శము:—పయి మొదటి జాతి రీతినె యీ రెండవ జాతి స్థలము లందును 'కు-చు-టు-తు-పు' మున్నగు ప్రత్యయములు ప్రేరణార్థకము లగుచు ధాతువుల తుదిని నిల్వఁగా వానికిఁ బరముగా నిల్చు కాలబోధక ప్రత్యయ ములతోఁ గల్గిన సంధుల వశమునఁ బరుష ద్విత్వములు సంభవించుచున్నవి. ప్రేరణార్థక ప్రత్యయము లచట నిల్చుచున్నవని చెప్పక యూరక ద్విత్వము కల్గునని యుపదేశించుటచేత నిట్టి ద్విత్వ వైవిధ్యమును జెప్పికొనవలసి వచ్చెనని యెఱుంగనగును. ఉదా:—చేర్+కు=(ప్రేరణ ప్రత్యయము)+కిఱు=(వర్త)+ఏన్=చేర్క్కిఱేన్=(కలుపుచున్నాను). చేర్ + తు = (ప్రేర—ప్ర) + త్ =

(భూత) + ఏన్ = చేర్ త్తేన్ = (కలిపితిని). చేర్ + ప్ = (ప్రేర - ప్ర) + ప్ = (భావి) + ఎన్ = చేర్ ప్పేన్ = (కలుపఁగలను).

౧౨౧. V విష:—"మూఁడవ జాతి ధాతువులు:—ధాతువు తుదిని 'త్తు' అను ప్రత్యయమును జేర్చుటచేతఁ గొన్ని యెడలఁ దమిళమున నకర్మకములు సకర్మకము లగును. ఇట్టి యెడలఁ గన్నడమున 'దు' ప్రత్యయము నిల్చును. ఉదా:—కన్నడ—అక-తాళు=(వంగు=క్రిందగు). సక—తాళు+దు=తాళ్దు=(వంచు=క్రిందగునట్లు చేయు). తమి.—అకర్మ—తాళ్ =(క్రిందగు). సక.—తాళ్ + త్తు = తాళ్ త్తు = తాట్టు (వంచు = క్రిందగునట్లు చేయు). హాల్ సంయోగ సందర్భమున నిది 'తు' అని నిల్చును. తమి—పడు=(పండుకొను) సక—పడు+త్తు=పడుత్తు=(పండుకొనఁ జేయు). ("ఇటరాదు. తమిళ లెక్సికనులో లేదు" శ్రీ రెడ్డిగారు) ల-ళ-డ-ఱాంతముల తుదిని 'తు' నిల్వఁగా సంధి వశమునఁ బరుష ద్విత్వము కల్గును. ఉదా:—అక—సుఱల్=(చుట్టఁబడు). సక—సుఱల్+తు=సుఱ్ఱు=(ట్రు)=(చుట్టఁబడఁ జేయు). అక—మీాళ్=(తిరిగి వచ్చు). సక—మీాళ్+తు=మీాట్టు=(తిరిగి వచ్చునట్లు చేయు). ఇట్టి యుదాహృతులను బరిశీలింపఁగా నీ ప్రత్యయపు ప్రాచీన రూపము 'దు' అనునది యని తోఁచు చున్నది" (కాల్డు. ౪౫౩, ౪౫౪ పుటలు).

"ఈ 'దు=త్తు' అను ప్రత్యయము III ప్రకరణమునఁ బూర్తిగాఁ బరిశీలింపఁ బడిన 'అత్తు-తు' అను విశేషణ ప్రత్యయమున నభిన్నమని నేను నమ్ముచున్నాను. కన్నడమున 'అద్' అనియుఁ దెల్గున 'టి-తి' అనియు నిల్చును. ఇవి నామమును విశేషణముగాను నకర్మకమును సకర్మకముగాను మార్చునవు డుపయోగించును. ఇట్టి యెడల నామముయొక్కయుఁ క్రియయొక్కయు నర్థము మఱొక పదార్థముతో సంబంధించి యుండును. ఇట్టి సంబంధ బోధకమగు వర్ణము నపుంసక నిర్దేశసర్వనామాభిన్నమని తెలియుచున్నది" (కాల్డు. ౪౫౪ పుట).

విమర్శము:—తక్కిన మూఁడు జాతులందును బరుష ద్విత్వ మూరకయె కల్గుననుచుఁ బ్రేరణార్థక ప్రత్యయ యోగము నుపదేశింపకున్నను నీ జాతి ధాతువులందు ఘట్టకుటీ ప్రభాత న్యాయమునఁ బ్రేరణార్థక ప్రత్యయము నిల్చునని దొరగారి కుపదేశింపక తీరదయ్యెను. ఈ జాతిలోను ల-ళ-డ-ఱాంత ధాతువులలో సంధి వశమునఁ బరుష ద్విత్వమె యేర్పడుచున్నను 'తాట్టు-పడుత్తు' మున్నగు కొన్ని ధాతువులందుఁ బ్రేరణ ప్రత్యయము పరుష ద్విత్వముగా మాఱిపోక ప్రత్యేకముగా నిల్చి యుండుటచేత దీనిని మొదటి జాతి ధాతు భాగమున నంతర్భవింపఁ జేయుటకు దొరగారికి వీలుపడదయ్యెను. ఈ మూఁడవ జాతి ధాతువుల విషయమున నంగీకరించిన 'తు-త్తు'లతో పాటుగ

కరించి ప్రేరణ శీర్షిక గ్రంథ సందర్భమున 'ఇ-వి-పి' అనువానితో పాటుగఁ ప్రేరణ ప్రత్యయములనుగా నుపదేశించి పై నుదాహరించిన పరుష ద్విత్వ రూపముల నెల్ల సాధించుకొనుచు నీ సకర్మకాకర్మక విషయక గ్రంథ భాగ మును దొలఁగించుట యుక్తమని చెప్పనగును గదా! అట్లయినను దొరగా రీ 'తు-త్తు' లను సైతము ప్రేరణార్థక ప్రత్యయములని వచింపరు. 'ఇ-పి-వి' అను ప్రత్యయములు మాత్రమె ప్రేరణార్థకములని డా. కాల్డువెల్లుగారి సిద్ధాంతము.

ఆకార సామ్యమునుబట్టి యీ 'తు-త్తు' అను ప్రత్యయము నపుంసక నిర్దేశసర్వనామాభిన్నమనియు నిది సంబంధార్థకమనియు దొరగారు వ్రాయుట సరికాదు. 'తు-త్తు' అనునదే కాక 'కు-చు-టు-పు' 'ఇ-వి-పి' మున్నగు పెక్కు ప్రత్యయములు వీనివంటివి గలవు. వీనియం దట్టి యాకారసామ్యము సైతము లేదు. ఇవెల్లఁ బ్రేరణార్థక ప్రత్యయములనక తీరదుగదా. వీనివంటి చరిత్రము గలవే 'తు-త్తు' లును ననుట యుక్తముగాని వీనినిమాత్రము విభక్తి పూర్వా గమములవలె నపుంసక నిర్దేశసర్వనామాభిన్నములని చెప్పుట యుక్తము కాదుగదా.

దొరగారు పైని వ్రాసిన రీతి నవిచారమూలక పరుషద్విత్వ వైవిధ్య రూపానావశ్యక ధాతు వివిధజాతి నిరూపణము చేయుటేకాక యీ సందర్భమున నింకొక ప్రమాదమునకును బాల్పడిరి. పయి 'తు-త్తు' ప్రత్యయములు తమిళ మున నిల్చు చోటులవంటి స్థలములందుఁ (ప్రేరణ స్థలములందు) గన్నడమున 'దు' ప్రత్యయము నిల్చునని వచించిరి. అందులకు 'తాల్దు=(వంచు)' అనునది కన్నడ ప్రేరణరూపమనుచు నుదాహరించిరి. ఇది కేవలము తప్పు. కన్నడమున 'దు' అనునది క్త్వార్థక ప్రత్యయము. 'తాళ్' ధాతువు ధారణార్థకము. కన్నడ ప్రేరణ ప్రత్యయములు 'ఇసు-చు' అనునవి. ఇవి తెల్గులోని 'ఇంచుక్-చుక్-పు' గాగమముల వంటివి. 'దు' అనునది ప్రేరణార్థకమని కాని యకర్మకము సకర్మక మగునపుడు వచ్చు ప్రత్యయమని కాని కన్నడ వ్యాకరణములం దెచ్చటను లేదు. అట్టి ప్రయోగములును లేవు. 'తాళ్-ధారణే' (శబ్ద మణిదర్పణధాతు పాఠము). కాన 'తాళ్=(ధరించు)' 'తాల్దు=ధరించి' అని చెప్పవలెను గాని 'తాల్దు=(వంచు)' అని యర్థము చెప్పరాదు.

'ప్రాక్కాలే దు స్తుల్యకర్తృకాత్' (కర్ణాట శబ్దా. ౫౮౦ సూ.)=ఉత్తర కాలక్రియయా సహ ఏకకర్తృకాత్ పూర్వకాలే అర్థే వర్తమానా ద్ధాతోః 'దు' ప్రత్యయో భవతి. ఉదా:—తాళ్+దు=తాళ్దు=(ధరించి).

'హేతౌ ఇసుః' (కర్ణా. భూ. ౨౨౦ సూ.)=ప్రేరణార్థమున ధాతువునకు 'ఇసు' ప్రత్యయమగును. ఉదా:—మాడు = (చేయు) - ప్రేరణ - మాడిసు= (చేయించు) మొ.

౧౨౧. VI విమ:—"నాల్గవ జాతి ధాతువులు:—ధాతువు తుది నున్న 'డ-ఱ' అనునవి పరుషములై ద్విత్వమునందునపు డకర్మకము సకర్మక మగును. ఉదా:—తమి-అక-వాడు = (మ్లానమగు). సక-వాట్టు = (వాడునట్లు చేయు). అక - ఓడు = (పరుగెత్తు). సక - ఓట్టు = (పరుగెత్తించు). అక - తేండు. సక-తీట్టు=(దారుగలదగునట్లు చేయు). అక-మాఱు=(మాఱు). సక-మాఱ్ఱు (ట్రు)=(మార్చు). ఇట్టివానికి సరియగు ధాతువులు తెల్గున 'చు' వర్ణముచేరుట చేత నేర్పడును. ఉదా.—వాడుచు=(మ్లానమగునట్లు చేయు). మాఱుచు= (మార్చు). విశేష్యము విశేషణమగునప్పుడును దమిళమున ఱ-డ లకుఁ బరుష ద్విత్వము గల్గును. ఉదా:—కాడు=(అడవి). కాట్టువఴి=(ఆరణ్యకమార్గము). ఇరణ్డు=(రెండు). ఇరట్టునూల్=(రెండు పిరులు (పెనలు) వేసిన త్రాడు). ఆఱు=(ఏఱు=నది). ఆఱ్ఱు-(ట్రు) మణల్=(ఏటి యిసుక)" కాల్డు. ౭౫౭, ౭౫౫ పుటలు).

విమర్శనము:—ఈ నాల్గనజాతి ధాతువుల తుదను సైతము ప్రేరణార్థకము లగు 'టు-తు' ప్రత్యయములు నిల్చుటచేతనె ప్రేరణరూపము లేర్పడును. ఇట్లె విశేష్య విశేషణపక్షమునను గ్రహింపవలయును.

పైరీతి నీ నాల్గుజాతుల ధాతువుల వివరణమును గేవల మనావశ్యకమనియు సకర్మకము లనఁబడుచున్న యీ క్రియలనెల్లఁ బ్రేరణార్థకములనుగా సంగీకరించి 'కు-చు-టు-తు-పు' అను ప్రేరణార్థక ప్రత్యయములను ధాతువుల తుదిని యథార్హముగాఁ జేర్చి పై ప్రేరణార్థక సకర్మక రూపములను నట్లె విశేషణ రూపములను సాధించుకొనుట యుక్తమనియు గ్రహింపవలెను. యథార్హముగఁ జేర్చుట యనఁగా 'కు' వర్ణాంతధాతువుల తుదను 'కు' అను ప్రేరణ ప్రత్యయము చేర్చుట మొదలగునది.

౧౨౨. I విమ:—(౨) "ప్రేరణార్థకములు:—ద్రావిడ భాషలలోని కొన్ని క్రియలను ణిజంతములనియె చెప్పవలసియున్నను ప్రాచ్య పాశ్చాత్య వైయాకరణులు సకర్మక మాత్రములనుగా వచించియున్నారు. 'బెశ్చి' దొరగారు మాత్రము వానిని వేఱుజాతి క్రియలనుగా గుఱుతించి వానికి 'ఏవల్ వినై' అని పేరిడిరి. అనఁగా నొకనిచేతఁ జేయించు క్రియ. అకర్మకములందలి యర్థము కర్తనే చెందును. ఉదా:—పోగిఱేన్=(పోవుచున్నాను). సకర్మకముల యర్థము కర్తృభిన్నమైన మఱొక వ్యక్తిని జెందును. ఇది (ఈ కర్త) సాధారణముగ

ద్వితీయా విభక్తిమై యుండును. ఉదా:—తమి-ఉన్నై అనుప్పుగిఱేన్=(నిన్నుఁ బంపుచున్నాను). ఇట్టి సకర్మక క్రియారూప జనితములు న్యాయ్యముగానే కొన్ని భాషలలో బ్రేరణార్థకములె యనఁబడును. 'అంపు—అంపఁజేయు' అను రీతిగల చోటులం దిండో యూరపియను భాషలలో వేఱొక యుపవాక్యమును వాడుకొనవలయును. (ప్రేరణపైని బ్రేరణము లేదని భావము). ద్రావిడ భాషలందన్ననో యట్టి యర్థము సైత మొక ప్రేరణ ప్రత్యయముచేత విశదపఱుపఁబడును. ఉదా:—(తమి) - అనుప్పువి=(పంపఁజేయు). తుర్కిషు భాషయందును నిట్లె ధాతువున కొక యనుబంధమును జేర్చుటచేత ణిజంత మేర్పడును. ఉదా:— టర్కిషు:—సెవ్=(ప్రేమించు). ప్రేర-సెవ్‌దుర్=(ప్రేమింపఁజేయు). ఆత్‌చు=(పనిచేయు)=ప్రేర-ఆత్‌చూ=(పనిచేయించు)" (కాల్డు. ౭౫౫, ౭౫౬ పుటలు).

"ఇండో యూరపియను భాషలలోని ప్రేరణార్థక క్రియతోఁ గర్మార్థకములగు రెండు ద్వితీయ లన్వయించును. ఆ కర్మములం దొకటి పురుష వాచకము; రెండవది వస్తు వాచకము. ఉదా:—సంస్కృ-అహం తం గృహం నిర్మాపయామి= నేను వానిని గృహమును గట్టించుచున్నాను. ద్రావిడభాషలందన్ననో కర్మము (వస్తువాచి) మాత్రము నిల్చి పురుషవాచకకర్మ మధ్యాహార్యమగును. ఉదా:— వీట్టై కట్టువిత్తేన్=(నే నింటిని గట్టించితిని). లేదా పురుషవాచి తృతీయాంతమై నిల్చును. ఉదా:—అవనైక్కొండు వీట్టై కట్టువిత్తేన్. గ్రాంథిక తమిఱమునం దక్కడక్కడ రెండు కర్మవాచి ద్వితీయలతోడి ప్రేరణ క్రియ వాడఁబడును. ఇట్టి ప్రయోగము మలయాళమున నరు దనరాదు. ఉదా:—'అవనె యమలోకం పోగిచ్చు=(వానిని యమలోకమును గూర్చి బంపెను).' అను మలయాళ వాక్యమును, డా. గుండర్టుగా రుదాహరించుచున్నారు. అట్టి ప్రయోగము సంస్కృతాభ్యాసకృతము" (కాల్డు. ౭౫౬ పుట).

"ద్రావిడ భాషలలో సహజములగు ప్రేరణార్థకములు ప్రేరణార్థక ప్రత్యయ యోగమున నేర్పడును. కాని కొన్నియెడల నిండో యూరపియను భాషలరీతిని 'చేయు' మున్నగు సహాయ క్రియలు తుమర్థక రూపములపై నిల్చుటచేతఁ బ్రేరణార్థకము లేర్పడును. "తమి-'సెయ్', కన్న-'మాడు', తెల్గు-'చేయు'" అనునవి యట్టి సహాయక్రియలు. ఇవి సంస్కృతమునుండి వచ్చిన ధాతువులకె చేర్పఁబడును" (కాల్డు. ౭౫౬ పుట).

"తమిఱు భాషయందును నితర మాండలిక భాషలందును (కన్నడ-తెల్గు-మొ.) నకర్మకముల (Neuter) నుండి కాక సకర్మకములనుండి ప్రేరణార్థకము లేర్పడును. కాని యీ నియమము కొన్నియెడల నుపేక్షితమగుటయుఁ గలదు.

తమిళమునందును బ్రేరణ ప్రత్యయమగు 'వి' అనునది యకర్మకములపై నిల్చుటయుఁ గలదు. కాని యిది గ్రాంథిక సంప్రదాయ విరుద్ధమును సిద్ధాంత విరుద్ధమును నై యున్నది. అట్టియెడల నా యకర్మక క్రియనుండి యేర్పడు సకర్మక క్రియనే వాడవలయును. ఉదా:—తమి-'వరువి=(రావించు)' అనునది 'వరత్తు' అనుదానివంటి సొంపుగలది కాదు. అట్లె 'నడప్పి' అనునది 'నడత్తు' అనుదానివంటిది కాదు" (కాల్డు. ౪౫౬ పుట).

"ఇట్లు సకర్మక రూపమును (Active) బ్రేరణ రూపమును నున్నపుడు ప్రేరణ రూపమును వాడుట సంప్రదాయ విరుద్ధ మనెడి పద్ధతి తమిళమందు మాత్రము గలదు. మాండలిక భేదములగు నాంధ్ర కర్ణాటములలో లేదు. వాని వాడుక యా భాషలలో నైచ్ఛికము. కొన్నియెడల నాంధ్ర కర్ణాటములలో సకర్మక రూపమే యుండక ప్రేరణ రూపము మాత్రమే యుండును. ఉదా:—తెల్గు-వచ్చు. ప్రేర-రావించు=రప్పించు. తెల్గు-అగు. ప్రేర-కావించు. కన్నడ-ఆగు-ప్రేర-ఆగిసు = (కావించు)" (కాల్డు. ౪౫౬, ౪౫౭ పుటలు).

విమర్శము:—ప్రాచ్య పండితులెల్లరును బ్రేరణార్థ భానమున్నపుడా క్రియను బ్రేరణార్థకమనియె వ్యవహరింతురు. అది యకర్మకమునుండి యేర్పడినను దానిని బ్రేరణార్థకమనియే తలంతురు. ఉదా:—అప్రేర-భవతి. ప్రేర-భావయతి.=(అగుచున్నది. ప్రే-కావించుచున్నది).

ఇండో యూరపియను భాషలందును బ్రేరణ ద్వయము ప్రేరణ ప్రత్యయముచేఁ దెల్పఁబడు పద్ధతి గలదు. అట్టియెడల వేఱొక యుపవాక్యమె నిల్పవలయునను లోపము గలదను దొరగారి వ్రాఁత సత్యవిదూరము. ముగ్ధబోధమున 'ణిచ్చు' 'ఞి' అని వాడఁబడును.

"ప్రేరణ ఞేః పరోపి ఞిః. యథా:—పితా పుత్రేణ శిష్యం వేదం పాఠయతి" (ముగ్ధ. వ్యాక. ౭౭౭ సూ. దుర్గాదాస వ్యాఖ్య). పై వాక్యమున నప్రేరణము:—శిష్యః వేదం పఠతి=(శిష్యుఁడు వేదమును బఠించుచున్నాఁడు). ప్రేర:—గురుపుత్రః శిష్యం వేదం పాఠయతి = (గురుపుత్రుఁడు శిష్యుని వేదమును బంపించుచున్నాడు). పునః ప్రేరణము:—పితా (గురుః) పుత్రేణ శిష్యం వేదం పాఠయతి=(తండ్రి పుత్రునిచేత శిష్యుని వేదమును బఠింపింపఁ జేయుచున్నాఁడు). ఇట్లె "గమయతి దేవదత్తో యజ్ఞ దత్తమ్. త మపరః ప్రయుఙ్క్తే=గమయతి దేవ దత్తేన (గ్రామం) యజ్ఞ దత్తం విష్ణు మిత్రః" (సి. కౌ. ౫౪౦ సూ. భట్టోజీ వివృతి). అప్రే-యజ్ఞ దత్తో గ్రామం గచ్ఛతి=(యజ్ఞ దత్తుఁడు గ్రామమునుగూర్చి వెళ్ళుచున్నాఁడు). ప్రేర:—దేవ దత్తో యజ్ఞదత్తం గ్రామం గమయతి=(దేవదత్తుఁడు యజ్ఞదత్తుని గ్రామమును బంపుచున్నాఁడు) పునః

ప్రేరణము:—విష్ణుమిత్రః దేవదత్తేన గ్రామం యజ్ఞదత్తం గమయతి=(విష్ణుమిత్రుఁడు దేవదత్తునిచేత యజ్ఞదత్తుని గ్రామమును బంపఁజేయుచున్నాఁడు). (చూడు బాల. క్రియా ౧౨౨ సూ).

ఇండో యూరపియను భాషలందు సైతము ప్రేరణార్థక క్రియలెల్ల రెండు ద్వితీయలతో నన్వయింప వలయుననఁగా రెండు కర్మములతో నుండ వలయునను నియమములేదు. గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మ కాకర్మకముల యణ్యంత కర్తకు మాత్రమె కర్మ సంజ్ఞ సంస్కృతమున విధింపఁబడినది. అట్టియెడల సహజ కర్మమును, బ్రయోజ్య కర్త కర్మముగా మాఱిన కర్మమును, నుండుటచేత రెండు ద్వితీయలతోడి యన్వయము సంభవించును.

"గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దక ర్మాకర్మకాణా మణి కర్తా సణౌ" (౧-౪-౫౨)="గత్యాద్యర్థానాం శబ్ద కర్మకాణా మకర్మకాణాం చాణౌ యః కర్తా స ణౌ కర్మ సంజ్ఞః స్యాత్. ఉదా.—

శ్లో. శత్రూ నగమయత్ స్వర్గం (గతి) ।
వేదార్థం స్వా నవేదయత్-(బుద్ధి) ।
ఆశయ చ్చామృతం దేవాన్ (ప్రత్యవసానార్థ) ।
వేద మధ్యాపయ ద్విధిమ్ (శబ్ద కర్మక) ।
ఆసయ త్సలిలే పృథ్వీం-(అకర్మక) య స్స మే శ్రీ హరి ర్గతిః ॥

గతిత్యాదికిమ్? పాచయ త్యోదనం దేవదత్తేన......" (సి. కౌ. ౫౪౦ సూ). అప్రే. దేవదత్తః ఓదనం పచతి = (దేవదత్తుఁ డన్నమును వండుచున్నాఁడు) ప్రేర—యజ్ఞదత్తః దేవదత్తేన పాచయ త్యోదనమ్ = (యజ్ఞదత్తుఁడు దేవదత్తునిచే నన్నమును వండించుచున్నాఁడు). ఇచటి ప్రేరణ క్రియకు రెండు ద్వితీయలతోడి యన్వయము (రెండు కర్మములు) లేదు. గత్యాద్యర్థక క్రియాప్రయోగమునందు మాత్రమె ప్రయోజ్య కర్తకుఁ గర్మ సంజ్ఞ గల్గును గాన నది ద్వితీయాంతమగును గాని తద్భిన్న క్రియాప్రయోగమునఁ బ్రయోజ్య కర్తకుఁ గర్మసంజ్ఞ లేమింజేసి యది తృతీయాంతమే యగును. గత్యాద్యర్థక ధాతు ప్రయోగమునందును ననేక స్థలములందుఁ బ్రయోజ్య కర్తకుఁ గర్మ సంజ్ఞ లేదనెడి పెక్కు విధులు గలవు. 'నీ వహ్యో ర్న.' (వార్తి. ౧౧౧౯.) ఉదా:—"నాయయతి వాహయతివా భారం భృత్యేన......" (సి. కౌ. ౫౪౦ సూ.) (యజమానుఁడు భృత్యునిచేత భారమును బొందించుచున్నాఁడు. యజమానుఁడు భృత్యునిచేత భారమును వహింపఁజేయుచున్నాఁడు.) ఇది మొదలగు పెక్కు విధులు గలవు.

నన్నూలు వ్యాకరణమున 'నడప్పి'=(నడపింపఁజేయు) అను ప్రేరణ రూపము నుదాహరింపఁబడెను. ఈతనికి 'నడత్తు' అను రూపము గలదని తెలియకపోదు. (చూడు నన్నూలు 'చెయ్‌యెన్...' ౧౩౮ సూ.) ఇట్టి వైయాకరణోదాహృతులు సిద్ధాంత విరుద్ధములనుట సరికాదు గదా.

ప్రేరణ క్రియా ప్రయోగముగల వాక్యములోని కర్మములు రెండిటిలో నొకటి వస్తు వాచకము మఱొకటి పురుష వాచకము నై యుండవలెననుటయు సరికాదు. "విష్ణుమిత్రుఁడు దేవదత్తుని యజ్ఞదత్తునిగూర్చి పంపెను. బండి వాఁడు బండిని భారమును వహింపఁజేయుచున్నాఁడు." ఇత్యాది ప్రయోగములు నిర్దుష్టములు కదా!

'చేయు' మున్నగు సహాయ క్రియల యోగముచేఁ బ్రేరణార్థక మేర్పడుట సంస్కృత ధాతువులకే యనుటయు సరికాదు. క......శక్రుసభనుండఁ జేయుము వారిన్ (సభా. ౧ ఆ. ౯౨) సీ......(ఎ. గీ.=ఆ. వె.)...... | దేవ భోగముల మహా విభూతిఁ | దనరఁజేయుచు......(ఆది. ౧ ఆ. ౭ ప). (చూడు 'వ్యా. సం.' ౩౮౭ విష). అకర్మకములనుండి ద్రావిడ భాషలందుఁ బ్రేరణ రూపమేర్పడరా దనుటయు సరికాదు. ఉదా:—అకర్మ-వాఁడు చచ్చెను. ప్రేరణ. రాముఁడు వానిని జంపెను. మొ. 'ఆసయ త్సలిలే పృథ్వీమ్' అని దీక్షితుల వా రకర్మకమునుండి యేర్పడిన ప్రేరణరూపమున కుదాహరించి యున్నారు. (చూడు పైని). తమి. ప్రే-నడప్పి=(నడపించు). (చూడు నన్నూ. ౧౩౮ సూ).

౧౨౨. II విష:—"తుళు గోండు భాషలు తప్పఁ దక్కిన ద్రావిడ భాష లన్నిటియందును గల ప్రేరణార్థక ప్రత్యయము లన్నియు నభిన్నములె యనఁ దగును. తమి-'వి-బి-ప్పి'-తెల్గు-'ఇంచు=పించు'-గ్రాంథిక కన్నడము 'ఇచు'-వ్యవహారిక కన్నడము 'ఇసు' అను నివెల్ల నభిన్నములె యనఁదగును. వీని యందెల్ల వాస్తవమగు ప్రేరణార్థకము 'ఇ' అను ప్రత్యయము మాత్రమె. దాని పూర్వాపరవర్ణములు క్రియా నిష్పత్తిలో నేర్పడినవె యనఁదగును" (కాలు. ౪౫౭ పుట).

"ధా-చేయు-ప్రేర-చేయించు. ధాతు-పిలుచు-ప్రేర-పిలిపించు" అను రీతిని దెల్గున 'ఇంచు=పించు' అనునవి ప్రేరణార్థకములయి యున్నవి. వీనిలో 'ంత్సు' అను నుచ్చారణముగల 'ఇంచు' అనుదాని తత్వమును బరిశీలింపవలసి యున్నది. ప్రేరణార్థకములుకాని 'జయి-రక్షి' మున్నగు సంస్కృత ధాతువుల పైని జేరు 'చు' గాగమమునకు నియతముగ శ్రుతి సుఖార్థకమగు బిందువు చేరుటచేత 'జయించు-రక్షించు' మున్నగునవి యేర్పడునట్లే ప్రేరణార్థకమగు

'ఇ' ప్రత్యయము 'ఇంచు' అను రీతిని 'చు' గాగమాంతమై శ్రుతి సుఖార్థక బిందువుతోఁగూడి యేర్పడునని గ్రహింపవలెను" (కాల్డు. ౪౫౭ పుట).

"తెల్గున 'ఇంచు' అనుదానిలోని 'చు' అనునది తమిళమందలి 'క్క' అనుదాని కభిన్నము. ఇవి క్రియారూప నిష్పత్తిలో నేర్పడు వర్ణములు. తమిళమున 'క్క' అనునది ణిజంత ధాతువులకు భావార్థకమగు (Infinitive) 'అ' వర్ణకమును జేర్చుటకు ముందుఁ జేర్పఁబడును. ఈ 'క్క' అనునది భావ్యర్థక తద్ధర్మ చిహ్నమగు 'ఉమ్' అనుదానిని జేర్చుటకు ముందుఁ జేర్పఁబడును. తమిళమందలి 'క్క' అనుదానికిని తెలుఁగునందలి 'చు' అను దానికిని గల యభిన్నత వాని తుమర్థక (Infinitive) రూపములను సరిపోల్చి చూచునపుడు విశదమగును. ఉదా.—(తమి-ప్రే) 'సెయ్‌విక్క'=(తెల్గు)-'చేయించ'. (తమి-ప్రే) - 'అలెప్పిక్క' = (తెల్గు) - 'పిలిపించ'. (తమి-సకర్మక) 'మఱక్క'=(తెల్గు) మఱచ. తమిళ దేశమునందలి దక్షిణపు చివర నున్న నిందమ్య గ్రామ్యమందును 'క్క' అనునది 'చ్' అనునదిగా మాఱును. ఉదా:-(తమి)-'మఱక్క'=దాక్షిణాత్య గ్రామ్య తమి-'మఱచ'. (దీనిని నేను వినలేదు. శ్రీ రెడ్డిగారు) (ఇట్లు తెల్గునందు వలెనె యుండును). తమిళమున 'క్క' అనునది తుమర్థక (Infinitive) భావ్యర్థక తద్ధర్మార్థకములలో మాత్రము చేర్పఁబడును. తెల్గునందలి 'ఇంచు' అనునది ధాతురూపములకెల్లఁ బ్రేరణమునఁ జేర్పఁబడును" (కాల్డు. ౪౫౭, ౪౫౮ పుటలు).

విమర్శము:—తెల్గునఁ గొన్ని ధాతువులకు స్వార్థమందును నెల్ల ధాతువులకును బ్రేరణమునందును వచ్చెడి 'ఇంచు' అనునది డా. కాల్డువెల్లుగారు చెప్పనున్న రీతిని 'ఈ'=(ఇచ్చు) అను ద్రావిడ ధాతువునుండి గాని 'ఇన్+మధురమైన-ఇంచు=రుచించు=చేయు' అను ద్రావిడ ధాతువునుండి గాని యేర్పడి యుండవచ్చును. కం......నీ కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్ (భార. ఉద్యో ౨ ఆ. ౨౪౮ ప). (చూడు 'శ. ర.' 'సూ. రా. ని.') ద్రావిడ ధాతువుల తుదిని జేరు 'కు-చు-టు-తు-పు' మున్నగు వర్ణము లర్థవిశేష బోధక ధాతు విశేషముల భాగములై యుండుననుట యుక్తము గాని యవెల్ల నూరకయె చేరిన యాగమములనుట శబ్ద తత్వశాస్త్రపద్ధతి కాదు. తమిళ ధాతువులకుఁ దుమర్థాదులందుఁ జేరు 'క్క' అనునది భావ్యర్థములందు వచ్చు 'కు' ప్రత్యయము. అయ్యది 'ఇంచు' అనుదానిలోని 'ంచు' అనుదాని కభిన్నమనుట కేవలము నయథార్థము. 'ఇంచు' అనునది తెలుఁగున ధాతువులకెల్లఁ బ్రేరణమునఁ జేరును. 'క్క' అనునది తమిళమున భావ్యర్థములందు మాత్రము చేరును. అయ్యది ప్రేరణార్థక ప్రత్యయము మీఁద సైతము భావ్యర్థమున

నిల్చును. తుమర్థకములందును భావ్యర్థము గర్భితమై యుండును. అకారణ మునఁ దుమర్థకములందు 'క్కు' అనునది తుమర్థకమగు 'అ' ప్రత్యయమునకుఁ బూర్వమునఁ గొన్ని ధాతువులందు నిల్చును. (చూడు ౬౦ XII విష. ౧౨౧ III విష).

సంస్కృత ధాతువు ద్రావిడ భాషలలోనికి-దెనుఁగులోనికి వచ్చునపుడు 'జయి-రక్షి' అను రీతిని 'ఇ' ప్రత్యయాంతమై వచ్చుననుట కల్ల.

"ఉపకృతి పరిణతి సంవృతి। భేదా త్రివిధా క్రియా.........భవతి క్రియాపదానాం। త్రివిధానా మించుగాగమో ణేశ్చ" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౩౨౬ విష). సంస్కృత ధాతువు తుదిని 'ఇంచు' అనునది నిల్చుటచేఁ దెల్గుని ధాతు వేర్పడును. ప్రాచీన కర్ణాటమున 'ఇచు' అనునది ధాతువు తుదిని నిల్చుననెడి దొరగారి వ్రాఁత నిరాధారము. ప్రాచీన కర్ణాటమందును 'ఇసు' అనునదియే నిల్చునని ప్రాచీన కర్ణాట వ్యాకరణములందెల్ల వచింపఁబడెను.

"ధాతో రనేకాక్షరా దిసుః." (కర్ణా. భూష. ౨౧౩ సూ). ఉదా:— రంజిసిదం=(రంజిల్లెను).

తెల్గునందలి 'ఇంచు' అనునదియు, బలగన్నడమందలి 'ఇసు' అను నదియుఁ దమిళమందలి 'ఇ' అనునదియు (సంస్కృత ధాతువులపై నిల్చునవి) నభిన్నము లనవచ్చును. ఉదా:—(తెల్గు) జయించితిని. (కన్న)-జయిసిదెన్=(జయించితిని). (తమి)-జయిత్తేన్=(జయించితిని).

పయిరీతిగల స్థలములందలి (తెల్గు)-'ఇంచు'-(కన్న) 'ఇసు'-(తమి)-'ఇ' అనువానికి 'చేయు' అను నర్థము నెన్ననగును. అట్లగుటచేతనే యీ రూపములు చేరి సంస్కృత ధాతువులను ద్రావిడ ధాతువులనుగాఁ జేయఁగల్గుచున్నవి. అట్లె ద్రావిడ ధాతువులను ప్రేరణార్థకములను గావింపఁగల్గుచున్నవి. ఉదా:— సంస్కృత ధాతువు-రక్ష్+ఇంచు=రక్షించు=(రక్షణమును జేయు) (సంస్కృత రక్ష్ ధాత్వర్థము రక్షణము. ఇట్లె కర్ణాట ధాతువు-రక్షిసు. తమిళ ధాతువు-పడి=(పఠించు). వీని ప్రేరణరూపములు:—తెలుఁగు-రక్షించు+ఇంచు=రక్షింపించు-(రక్షించునట్లు చేయు-రక్షింపఁ జేయు)-కన్న-మాడు+ఇసు-మాడిసు=(చేయించు). తమి-పడి+ప్పి = పడిప్పి = (పఠింపించు) కన్న-రక్షిసు+ఇసు=రక్షిసిసు=(రక్షింపించు).

౧౨౨. III విష:—"'పించు' లోని 'ప' కార మెట్లు వచ్చినది?—ఉదా:— తెల్గు-ధా-విడుచు-ప్రేర-విడిపించు. ధా-పిలుచు-ప్రేర-పిలిపించు. 'చు' వర్ణముతో ముగియు ధాతువులయొక్క ప్రేరణ రూపములందు 'పి' వర్ణము నియతమై యున్నది తుమర్థకరూపము తుదిని 'చ' అనునదిగాని 'ప' అనునదిగాని

నిల్చును. (రక్షించ-రక్షింప). ధాతువుపైని ప్రేరణార్థకమగు 'ఇ' కారము చేరినచో నట్టి ధాతువు తుది 'చ' కారము నియతముగా 'ప' కారమగును. ఉదా:—పిలుచు+ఇంచు=పిలిపించు. ఇట్లు 'చ' పరక 'చ' కారము శ్రుతి సుఖార్థముగ 'ప' కారమగును. ఇది యెట్లయినను దెలుఁగునఁ గృదంత రూపములలో మాత్రము 'ప' త్వము తఱుచుగా నగపడుచున్నది. ఉదా:— తెలుఁగు-ధా-మఱచు-కృదం-మఱపు. ధా-తెఱచు-కృ-తెఱప. (చూడు ౧-౨-౨ V విష). ద్విత్వమందును నీ 'ప' త్వము గలదు. ఉదా:—ధా-తెచ్చు-ప్రేర. తెప్పించు. తమిళ భాషయందు ఱకారమునకును ననుస్వారమునకును బరమందుఁ దప్పఁ దక్కిన యెల్లయెడలను 'ప' కారమునకు ద్విత్వము నచ్చును. (నడప్పి-మొ.). ఇట్టి 'ప' కార పరుషోచ్చారణము (ద్విరుక్త పకారోచ్చారణము) తెల్గున నరుదైనను (తెప్పించు) నది తమిళాంధ్రముల ప్రేరణరూపముల యభిన్నతను దెల్పఁజాలి యున్నది" (కాల్డు. ౪౫౮ పుట).

విమర్శము:—'పిలుచు + ఇంచు = పిలిపించు' మున్నగువానియందలి చకార పరక 'చ' కార మంతటను శ్రుతిసుఖార్థక 'ప' త్వము నందుచున్న దను దొరగారి వ్రాఁత సరికాదు. శ్రుతిసుఖార్థమె యగునపుడు 'ప' త్వమునె యందనేల? సన్నిహితమగు సకారాది రూపము నందరాదా? 'మఱచు-కృ-మఱపు' మున్నగుచోటులందు మాత్రము 'ప' త్వమె రానేల? సకారాది సన్నిహితరూప మేల కల్గరాదు? శబ్దతత్త్వ విచారమున నిట్టివి యుపపత్తులగునా? 'చ-ప' లకు స్థానాది సంబంధ మేమియు లేదే!

ప్రేరణ ప్రత్యయమందు 'ఇ' శబ్దమునకుఁ బరముగ 'ంచు-చు' అను శబ్ద విశేషభాగములు చేరునట్లె 'ంపు-పు' అను నర్థవిశేషబోధక శబ్దభాగము లును జేరుచున్నవని చెప్పుట యుక్తము. చకార పరక చకార ముచ్చారణాను కూలము కామింజేసి (రక్షించించు) యట్లు రూపాంతరము చేరె ననవచ్చును గాని యీ 'ప' త్వము 'రక్షించిన, రక్షించుచున్న-రక్షించుచు' మున్నగు రూపాంతరములందు చూపట్టమింజేసియుఁ గన్నడమందలి 'ఇసు' తో సంబంధము లేమిం జేసియు నిది సరికాదేమో యని తోఁచుచున్నది. కాన 'ఊనిక' మూర్పుచే 'రక్షించు+ఇంచు' మున్నగు చోట్ల మొదటి 'చ' కారము లోపింపఁగా నట్టి స్వర సంహితయందు 'వ' కారము వ్యవధాయక వర్ణముగా నిల్వవలసి యున్నను (రక్షించు+ఇంచు) బిందుపూర్వక స్థిరవర్ణ స్థితి యాంధ్రభాషా సంప్రదాయ విరుద్ధమగుటంజేసి 'వ' కార సన్నిహిత 'ప' కారము చేరెననియు దాని సామ్యము (Analogy) చొప్పున బిందువు లేనిచోటులందును (పిలుచు+ఇంచు=పిలిపించు) 'ప' త్వమె నిల్చుచు వచ్చెననియు గ్రహింపనగును. 'తమి-పడిప్పి=(పఠింపించు) నడప్పి=(నడపించు) మున్నగు తమిళ ప్రేరణ రూపములందువలెనె తెల్గున

నరుదుగనైనను 'తెప్పించు' మున్నగు ప్రేరణరూపములలో ద్విరుక్త 'ప' కారము వెలయుచుండుట తమిళాంధ్ర ప్రేరణరూపముల యభిన్నతను దెల్పఁజాలు ననెడి దొరగారి వ్రాఁతయు సరికాదు. తెల్గులోని 'తెచ్చు' ధాతువులో 'చ' కార ద్వయముండుటం జేసి దానిచోటఁ బయిని వ్రాసిన పద్ధతి చొప్పున 'ప' త్వము వచ్చుటలో దానికి ద్విరుక్తత గల్గెను. కావున నయ్యది తమిళ ప్రేరణ 'పి' వర్ణకానుకారి కానేరదు. తమిళమందలి యప్రేరణరూపములం (నడ-పడి-మొ.) దట్టి 'చ' కారద్వయస్థితి లేదు గదా. పఱగన్నడమందలి ప్రేరణ ప్రత్యయమగు 'ఇసు' అనుదాని కిట్టి సామ్యభ్రాంతిని జూపుటకేని ప్రసక్తి లేదు గదా. కావున 'ఇంచు-ఇసు-ఇ'=(వి-పి.) అను ప్రేరణ ప్రత్యయములకుఁ గల సామ్యము మాత్రమె పరిశీలింపఁదగినది. కాని తక్కినవి భ్రాంతి మూలకములు.

౧౨౨. IV విమ:—"తెల్గు ప్రేరణార్థకములలో 'ఇంచు' గంతములు కానట్టి 'ంచు-చు' 'ంపు-పు' వర్ణములు తుదిని గల్గు ధాతువులు వాస్తవముగాఁ బ్రేరణార్థకములు కావు. అవి కేవల సకర్మక క్రియా మాత్రము లనఁదగును. ఉదా:—వంచు-విడుచు - విడుపు- లేపు మొ. ఇవి ధాతువు తుది హల్లును బరుషముగాను ద్విరుక్తముగాను జేయుటచే నేర్పడినవే కాని ప్రేరణార్థకమగు 'ఇ'=(ఇంచు-ఇ-వి-పి) ప్రత్యయాంతములు కావు. అవి యకర్మకముల నుండి యేర్పడినవి. తెలుఁగు—'లేచు-ప్రేర-లేపు' అనుదానిని దమిళము—అకర్మ-'ఎఱుమ్బు-సకర్మ-ఎఱుప్పు' అనువానితో సరిపోల్చి చూడనగును. తెల్గులోని 'ధాతు-తీఱు-ప్రేర-తీర్చు=తీర్పించు' అనువానిలో 'తీర్చు' అనునది 'తీఱు' ధాతు సకర్మక రూపమాత్రమె యనియు, 'తీర్పించు' అనునది 'తీర్చు' అను సకర్మపుఁ బ్రేరణ రూపమనియుఁ దమిళ సంప్రదాయానుసారముగాఁ జెప్పుట సమంజసము. ప్రేరణ రూపములకు సకర్మక ధాతువులె మూలమనుట నా సిద్ధాంతము. ఉదా:—తెల్గు—కట్టు-ప్రేర-కట్టించు." (కాల్డు. ౭౫౮, ౭౫౯ పుటలు).

"కన్నడమునందును సకర్మకములకు 'ఇ+సు' అనునది చేరుటచేతఁ బ్రేరణ రూప మేర్పడును. ఉదా:—మాడు+ఇసు=మాడిసు=(చేయించు). తమిళమందలి 'ఇక్కు' అనుదానికి శబ్ద తత్వము చొప్పున నభిన్న మనఁదగు 'ఇచు' అనునది సానునాసికమై తెలుఁగున 'ఇంచు' అనునదిగా నేర్పడెనని యీవఱకె వ్రాసియున్నాను. 'త్స' అను నుచ్చారణము గల 'చు' తోఁ గూడిన 'ఇంచు' అనునది గ్రాంథిక కన్నడమున 'ఇచు' అనియు, వ్యావహారిక కన్నడమున 'ఇసు' అనియు నేర్పడుట సహజమై శబ్ద తత్వ శాస్త్రానుకూలమై యున్నది." (కాల్డు. ౭౫౯ పుట).

"తెల్గులోని 'ఇంచు' అనునదియుఁ గన్నడమందలి 'ఇసు' అనునదియు నభిన్నము లనుటకు 'రక్షి-జయి' మొదలగు తత్సమ క్రియలు ప్రబల నిదర్శనములు. ఉదా:—సంస్కృ-ధాతు. ధరి. తెల్గు—ధరించు. కన్న — ధరిసు. తమిళ తుమర్థకము (Infinitive)—తరిక్క=(ధరించన్). ఇవి ప్రేరణ రూపములు కావు. ఇట్టి క్రియలలోని 'ఇ' పూర్వకములగు 'ంచు=సు' అనునవి 'ఇంచు=ఇసు' అనువాని వాస్తవమగు నభిన్నతను, దమిళమందలి 'ఇక్క' అను దాని యభిన్నతను సాధింపఁ జాలును. సాధారణముగాఁ బ్రాచీనతరమగు కన్నడమందలి పరుష ధ్వని తమిళమందు సారళ్యమునందుట సహజము. ముఖ్యముగాఁ గన్నడమందలి 'క' కారము తమిళమందు సరళమగు 'స' కారముగను లేక 'చ' కారముగను (కన్న-గెయ్=తమి-చెయ్) మాఱుట ప్రసిద్ధము. కాని ప్రేరణ విషయమున నీ పద్ధతి విపర్యస్తమైనది. (కన్న—ఇసు—తమి-ఇక్క) సకర్మకత్వ ప్రేరణత్వముల వివేచన విషయముసఁ దమిళమందుఁగల జాగ్రత్త కన్నడాంధ్రములలో లేదు. వాస్తవిక తమిళ ప్రేరణ రూపము సకర్మక క్రియనుండియే యేర్పడును. కన్నడమున సకర్మకతా సాధక ప్రత్యయములున్నను (ధాతు—నెరి=నిండియుండు. ప్రేరణ—నెరహు=నింపు. ధాతు-తిరుగు-ప్రేర-తిరుపు=త్రిప్పు). గన్నడ ప్రేరణ రూపము లకర్మక ధాతువులనుండి యేర్పడుట లేకపోలేదు. ఉదా:—ఓడు=(పరుగెత్తు) ప్రేర—ఓడిసు=(పరుగెత్తించు). జపాను భాషలో ధాతువునకుఁ బరముగ 'శి' అనుదానిని జేర్చుటచేఁ బ్రేరణ రూప మేర్పడును" (కాల్డు. ౪౮౯ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు తమిళమునందు సకర్మక క్రియలపైని 'వి-పి-ప్పి' అను ప్రేరణ ప్రత్యయములు నిల్చుటచేత నేర్పడినవే ప్రేరణ రూపములనియుఁ దక్కినవెల్ల సకర్మక క్రియా మాత్రములనియుఁ జేసిన సిద్ధాంతమును దాని నిరసనమును నీవఱకు విపులముగాఁ (౧-౨౧-III-IV-V-VI విష. ౧-౨-౨ I విష) బ్రదర్శింపఁబడెను. అట్టి సిద్ధాంతమునె తెల్గునందును డా. కాల్డువెల్లుగారు నిరూపించుట కేవలము నసంగతము. అట్టి సిద్ధాంత మాంధ్ర సంప్రదాయ విరుద్ధము. తమిళమందువలెనె తెలుఁగునందును ధాతువు తుది సరళము పరుషమగుట ద్విరుక్తినందుట గలదను దొరగారి వ్రాఁత కేవలము నయథార్థము. ఇంచు గంతములు కానట్టి 'చు-పు' వర్ణాంత ధాతువు లకర్మక క్రియలనుండియే యేర్పడునను దొరగారి వ్రాఁత సాహస మూలకము. సకర్మక ధాతు—పూను-ప్రేర—పూనుచు. సకర్మక ధా—విను-ప్రేర-వినుచు. సక-ధా—చూచు-ప్రేర—చూపు. సక-ధా—నేరుచు-ప్రేర—నేరుపు. సక-ధా—మేయు-ప్రేర—మేపు మున్నగు నించుగంతములు కాని 'చు-పు'

వర్ణాంత ప్రేరణ క్రియలెల్ల సకర్మ ధాతువులనుండి యేర్పడినవె కదా. ఇంచు గంతములు కామింజేసి యివెల్లఁ బ్రేరణ రూపములు కాననియే కదా దొరగారి సిద్ధాంతము. 'మాను' (పుండు మాను) అను నకర్మక క్రియనుండి యేర్పడిన 'మానించు' అను నించుగంత రూపము సైతము ప్రేరణ రూపమె యని దొరగా రంగీకరింతురు గదా. 'అడఁగు-ప్రేర—అడఁగించు. ధా—మాయు-ప్రేర—మాయించు' మున్నగునవి సైతము పై రీతివె కదా. 'మానించు' అను దానికి రూపాంతరమె యగు 'మానుచు-మానుపు-మాన్పు' అనునవి ప్రేరణ రూపములు కావనియే కదా దొరగారి సిద్ధాంతము. ప్రేరణార్థ భాన ముండునపు డా ధాతువు ప్రేరణార్థకము కాదనుట సకల ప్రాచ్య వైయాకరణాభి ప్రాయ విరుద్ధము. 'ఇచు' అనునది ప్రాచీన కర్ణాట ప్రేరణ ప్రత్యయ మనెడి దొరగారి వ్రాఁత కేవలము నిరాధారమని యీావఱకే విశదీకరింపఁ బడెను. సంస్కృత 'ధృ' ధాతువు తెల్గులోనికి 'ధరి' అను రూపముతో వచ్చుననుటయు సంప్రదాయ విరుద్ధము. అది 'ధర్' అను రూపముతోఁ దెల్గునకు వచ్చును. అది పరిణతి ధాతువు.

"ఉపకృతి పరిణతి సంవృతి । భేదా త్రివిధా క్రియా పుమణ్వాదిః । ఉపకృతి రథ భూజ్యా దిః । పరిణతి రన్యా తు రక్షి వస్యా దిః. స్యా దుపకృతిః కృదన్తా । సా పరిణతి రయవ రన్వితైవ భవేత్ । సంవృతి రహతాకారా । జ్ఞేయా త్రివిధాసుచ క్రియా స్వేవమ్" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౩-౨౬ విష).

తమిటమందలి 'తరిక్క' అను రూపములోని 'ఇక్కు' అనునది తెల్గు నందలి 'ఇంచు' అనుదాని కభిన్నమనుట పొరపాటు. 'తరిక్క'=(ధరింపఁగా) అనుదానిలోని 'క' కారము భావ్యర్థక 'కు' ప్రత్యయ సంబంధి. 'ధృ' అను సంస్కృత ధాతువు తమిటములోనికి 'తరి' అను రూపముతో మాత్రమె వచ్చునుగాని 'తరిక్కు' అను రూపముతో రాదు. కాన నందలి 'ఇక్కు' అను నది తెల్గులోని 'ఇంచు' అనుదాని కభిన్న మనుకొనుట భ్రాంతి మూలకము. (చూడు ౬౦ XII విష).

౧-౨-౨. V విష:—"'వి' అనునది 'పి' అను పరుషత నంది ద్విరుక్తమై తమిటమునఁ బ్రేరణ రూపముల (వి. బి-పి-ప్పి). నందును. తమిటమునఁ గన్నడ మందువలె (తమి-వా=రమ్ము. కన్న. బా=రమ్ము) 'వ' కారము 'బ' కారము కానేరదు గానఁ బ్రేరణ ప్రథమ రూపము 'బ' కార మనియు నయ్యది సరళమై 'వ' కారముగను, బరుషమై 'ప' కారముగను మాఱి ద్విత్వమునందుననుతలంపున నా మొదటి ముద్రణమునందుఁ దమిట ప్రేరణ ప్రాచీన ప్రథమ రూపము 'బి' అనియు, నాంధ్ర కన్నడములలో 'ఇ' కారమె ప్రేరణ ప్రాచీన

రూపమనియు వ్రాసితిని. కాని పునర్విచారణమున నట్టి యభిప్రాయమును మార్చుకొంటిని. కాన ద్రావిడ భాష లన్నిటిలోను 'ఇ' అనునదే ప్రేరణ ప్రాచీన రూపము. దానికిఁ బూర్వమునఁ దమిళమందు వకార బకార పకార తద్విత్వములు వచ్చుటకుఁ దగిన యుపపత్తి చూపఁబడును" (కాల్డు. ౪౫౯, ౪౬౦ పుటలు).

"తమిళమందలి 'క్కు' అనునది తెల్గులోని 'ంచు' అనుదాని కభిన్నము. (చూడుము ౧_౨_౨ II విష). ఉదా:—తమి-నడక్కు = తెల్గు-నడుచు. తమి-నడప్పిక్కు = తెల్గు-నడిపించు. తమి-సెయ్విక్కు = తెల్గు-చేయించు. తమి-మఱక్కు = తెల్గు-మఱచు. గ్రాంథిక తమిళమున ద్విరుక్త 'క' కారము ద్విరుక్త 'ప' కారముగ విభాష నగును. (చూడుము ౧_౨_౧ III విష). ఉదా:—తమి-నడక్కు = నడప్పు = (తెల్గు - నడుచు). పయి సందర్భమునుబట్టి తుమర్థక చిహ్నము 'అ' అనునది మాత్రమె యనియు దానికి ముందుగ నున్న వర్ణములు (ప్పు = క్కు = ంచ్) ధాతువులోనివో, వాని సంబంధులో యనియు నవి యభిన్నములనియు నెఱుంగ నగును. తమిళాంధ్రములందు 'ఇ' కార పూర్వక పకారమునకు వ్యుత్పత్తియుఁ బ్రయోజనమును నభిన్నములె. ఈ 'పత్వము తెల్గునఁ గ్రియారూప సాధకమైనట్లె (౧_౨_౨ III విష). (చదివింపన్) తమిళ మందును గావలసియుండును. ఉదా:—తమి-నడప్పు =(నడవన్). 'ఇంచు' అనుదాని కభిన్నమగు 'ప్పి' అనుదానికిఁ బర్యాయములగు 'వ' కార-'బ' కార ముల వ్యుత్పత్తి యింకఁ బరిశీలింపవలసి యున్నది. తమిళ ప్రేరణ ప్రత్యయ ములలో 'వి' అనునది ప్రచురము. ఉదా:—వరువి=(రప్పించు). అంతకన్నఁ గొంత తక్కువగా 'ప్పి' అనునది యుండును. ఉదా:— పడిప్పి-(పఠింపించు). అంతకన్నను నల్పముగా 'బి' అనునది వాడఁబడును. ఉదా:—ఎన్బి=(అనిపించు). (ఎన్ ధాతువు). కాణ్బి=(చూపించు-కాణ్-ధాతువు). వీనిలోని 'వ' కార ద్విరుక్త 'ప' కార 'బ' కారము లుచ్చారణార్థము చేర్పఁబడిన వర్ణములు కావు. ఇవి హలంత ధాతువులందును జూపట్టుచున్నవి. ఉదా:—చెయ్వి= (చేయించు). వాల్వి=(వృద్ధి పొందించు). ఇవి కర్ణాటాంధ్రము లందువలెనె ధాతువునకుఁ బరమందె నిల్చుచున్నవి. ఉదా:—కన్న-గెయిసు. తెల్గు- చేయించు. 'వి' అనునది తమిళమున 'ఉ' కారమునకుఁ బరముగ నిల్చును. ఉదా:—కట్టువి=(కట్టించు). కొన్నియెడల 'ఉ' కారమునకుఁ బరముగ ద్విరుక్త పకారము వ్యాకరణము చొప్పున నిల్చును. అట్టి 'ఉ' కారమునకు ముందేక వ్యంజన పరక హ్రస్వ స్వర ముండును. ఉదా:—ఎడుప్పి=(మీఁదికెత్తించు)" (కాల్డు. ౪౬౦, ౪౬౧ పుటలు).

“కారణమేదియై యున్నను ప్రేరణార్థకమగు ‘ఇ’ ప్రత్యయము చేరు నపుడు తమిళమున భావిచిహ్నములును జేరును. ఉదా:—తమి-వరువేన్= (రాఁగలను) ప్రేర-వరువి=(రప్పించు). భావి-ఎడుప్పేన్=(ఎత్తఁగలను) ప్రేర-ఎడుప్పి=(మీఁది కెత్తించు). భావి-పడిప్పేన్=(పఠింపఁగలను=నేర్వఁగలను). ప్రేర-పడిప్పి=(పఠింపించు=నేర్పించు). హలంత ధాతువులందును నీ పద్ధతి గలదు. భావి-వార్ప్పేన్=(పోయఁగలను వర్ధిల్లఁ గలను) ప్రేర-వార్ప్పి= (పోయించు=వర్ధిల్లఁ జేయు). భావి-కాణ్బేన్=(చూడఁగలను) ప్రేర-కాణ్బి=(చూపించు). తమిళమందును ప్రేరణద్వయ రూపములు గలవు. అట్టియెడలను బైపద్ధతి చూపట్టుచున్నది. ప్రేరణ భావి-వరువిప్పేన్=(రప్పింపఁ గలను) పునః ప్రేరణ-వరువిప్పి=(రప్పింపఁ జేయు)” (కాల్డు. ౪౬౧ పుట).

“పయి విచిత్రమగు సామ్యమునకు యుక్తి యీ క్రింది విధమున నుండ వచ్చును. తమిళమున నాయా ధాతువుల భావార్థక క్రియా నామవాచక రూపములె వాని వాని భవిష్యత్కాలిక క్రియా రూపములకు మూలము లనియు నట్టివాని పయిని సార్వనామిక చిహ్నములు చేరుటచేత భావి క్రియా రూపము లేర్పడుననియుఁ దలంపనగును. అట్లె యట్టి భావార్థక నామవాచక రూపముల మీఁదనే ప్రేరణార్థకమగు ‘ఇ’ శబ్దము నిల్చుటచేతఁ బ్రేరణార్థక రూపమేర్పడుననియుఁ దలంపనగును. తెలుఁగు ప్రేరణ రూపములలోని ‘పించు’ అను దానికి నైత మిట్టి ప్రక్రియయే చాలవఱకు సంఘటిల్లి యుండ వచ్చును. ఈ విషయ మీ వఱకే పరిశీలించి యున్నాము. (కృదంత రూప ములలో ‘ప’ కారము గలదని) (చూడు ౧౨౨ III విష). (ఈ యభిప్రాయ ములను చాలవఱకు స్వీకరించి వికాసకర్తగారు కొంత వ్రాసిరి. చూడు ఆం. భా. వి. ౫౬౧ మొ. ౫౬౪ పుట). కర్ణాట భాషయందుఁ బ్రేరణార్థక ప్రత్య యము ధాతువునకుఁ బరమందె నిల్చుట ప్రాచీనతరమును సరళమును నగు ద్రావిడ భాషా సంప్రదాయమును విశదీకరించుచున్నది.

తుళు భాషలో ధాతువు తుదిని ‘ఇ’ అనుదానికి మాఱుగ ‘ఆ’ అను దానిని గొన్నియెడల ‘డు’ అనుదానిని జేర్చుటచేతఁ బ్రేరణ రూపము లేర్పడును. ఉదా:—తుళు-మళ్ప=(చేయు)-ప్రేర-మళ్పా-వు (చేయించు). తుళు-నడుపు= (నడుచు) ప్రేర-నడపుడు = (నడపించు). ఈ స్థితి హిందూస్థానీ భాషను బోలి యున్నది. ఉదా:—హిం-చల్‌నా=(నడచు) ప్రేర-చల్వానా=(నడపింపఁజేయు). ఈ భాషలోని ‘వా’ అనునది చాలవఱకు సంస్కృత మందలి ‘అయ-(లేక) పయ’ అనువానినుండి వచ్చియుండును. తుళు భాషలోని ‘ఆ’ అనునదియుఁ బైవాని మూలముననె వచ్చియుండును. గోండు భాషలో ‘హా-(లేక) హ్వా’

అనునవి ప్రేరణ ప్రత్యయములయి యున్నవి. ఈ ప్రత్యయములు సకర్మక క్రియల శత్రర్థక రూపములకుఁ బరముగఁ జేరునే కాని మూల ధాతువునకుఁ బరముగఁ జేరవు" (కాల్డు. ౭౬౧, ౭౬౨ పుటలు).

విమర్శము:—తమిళ తుమర్థకములగు 'నడక్క—నడప్పిక్క' మున్నగు వానిలోని 'క్క' కారము 'ఇంచు' క్చుకా రాభిన్నమను దొరగారి భ్రాంతి భ్రాంతి మూలకము. తమిళ తుమర్థకములలోని 'క' కారము భావ్యర్థక 'కు' ప్రత్యయ సంబంధియని యీవఱకు విశదీకరింపఁబడెను. (చూడు ౬౦ XII విష). (౧౨౧ III విష). "నడుచ-మఱచ - నడిపించ-చేయించ......" మున్నగు దొరగారి యుదాహృతులు సరికావు. ప్రాచీనాంధ్రమున 'నడవన్-మఱవన్-నడపింపన్-చేయింపన్' అని యుండును. 'నడపించన్ చేయించన్' అను 'ప' త్వాభావరూపము లర్వాచీనములు. తమిళాంధ్రముల ప్రాచీన సంబంధ పరిశీలన విషయమున నిట్టి యర్వాచీన రూపముల నుదాహరించుట యసంగతము. "తమిళమున 'నడక్క—నడప్ప' అనునవి తుమర్థకములు, పర్యాయములు. వీనికి 'నడవన్' అని యర్థము. 'నడప్పి' అనునది 'నడ' ధాతు ప్రేరణార్థకము. నడ ధాతువుపైని 'తు' మర్థకమగు 'అ' ప్రత్యయము నిల్వఁగా దానికి ముందు భావ్యర్థకములగు 'కు-ప్' అనునవి నిల్చుటచేత 'నడక్క-నడప్ప' అనునవి యేర్పడెను" (చూడు ౧౨౧ III విష. ౧౩౭ III విష. శ్రీ విద్వాన్ వే. వేంకట రాజులు రెడ్డిగారి జాబు).

పయి సందర్భమునుబట్టి 'క్క-ంచ్' అనునవి పర్యాయము లనరాదని విశదమగుచున్నది. అట్లే 'ంచ్-ప్పి' అనునవియు నభిన్నములు కావు. 'ంచ్' అనునది ప్రేరణార్థేంచుగాగమ సంబంధి. 'ప్పి' అనుదానిలోని 'ఇ' ప్రేరణార్థకము. దాని ముందటి పకారము భావ్యర్థకము. ఈ విషయము ముందు నిరూపింపఁబడును. తమిళ ప్రేరణార్థక రూపములలో భావ్యర్థకములగు 'ప-వ' లు వెలయుచున్నవను మాట నిజమె. తమిళ తుమర్థకములందు భావ్యర్థక 'కు' ప్రత్యయము నిల్చునట్లె తమిళ ప్రేరణార్థకములందు భావ్యర్థక 'ప-వ' లు చేరుట సహజమె. ప్రేరణార్థ భానమున భావ్యర్థము గర్భితమై యుండుట యనుభవ సిద్ధమె కదా. కాన నప్రేరణ ధాతువుపైని భావి చిహ్నమును దానిపైని ప్రేరణార్థకమగు 'ఇ' ప్రత్యయమును నిల్చుట సహజమగుచున్నది. ఇట్లగుట చేతనే కదా భావ్యర్థ గర్భిత తుమర్థక ధాతువుపైని 'ఇ' శబ్దార్థమె యనఁదగు 'చేయు' ధాతువు చేరుటచేతఁ (నడవఁజేయు=నడపించు) ప్రేరణార్థము భాసించుచున్నది. ప్రయోజక కర్త ప్రయోజ్య కర్తను భావిలో ధాత్వర్థీ భూత వ్యాపారమును జేయుమని ప్రేరించును గదా.

భావార్థక నామవాచకములనుండి భావ్యర్థక క్రియలును బ్రేరణార్థక క్రియలును నేర్పడుచున్నవనెడి కాల్డువెల్లుగారి యాశయము సరికాదు. భావార్థము భావ్యర్థ బోధకము కాదు. అది ప్రేరణార్థకమును గాదు. భావార్థ మనఁగా నామరూపమయిన ధాత్వర్థము. అట్టి భావార్థకము పయిని సార్వ నామిక (పురుషబోధక) ప్రత్యయములు నిల్చుటచేత భావ్యర్థ మెట్లు గల్గును? అట్టి వానిపైని 'ఇ' శబ్దము చేరుటచేత భావ్యర్థ గర్భిత ప్రేరణార్థ మెట్లు గల్గును? పరిశీలింపఁగా నట్టి 'చాపు కలపు-తెలుపు-మాపు-చింపు-పంపు.' (ఆం. భా. వి. ౫౬౨ పుట) మున్నగు భావార్థక నామములందుఁ బ్రేరణార్థ భానము వెలయు చుండుటచేత నట్టి రూపములు ప్రేరణార్థక ధాతువులనుండియే యేర్పడెనన నచ్చును. మఱియు దమిటు ప్రేరణార్థకములందెల్ల 'ప-వ' లు నిల్చునట్లుగ భావార్థకములెల్ల 'ప-వ' వర్ణాంతములు కావుగదా. మఱియు వికాస కర్తగారు కన్నడమందును 'పి-వి' అనునవి ప్రేరణ ప్రత్యయములని వ్రాయుట వింత. ప్రాచీన కర్ణాట వ్యాకరణములందెందును నట్టి ప్రత్యయముల విధి లేదు. ప్రాచీన వాఙ్మయమందును నట్టి ప్రయోగములు లేవు. హళాసగన్నడమందును లేవు. 'ఇసు' అనునది మాత్రమె విధింపఁబడియున్నది. కానఁ దమిటు కర్ణాటాంధ్రములందెల్ల నప్రేరణ <u>ధాతువుపైనె</u> ప్రేరణ ప్రత్యయము నిల్చుననియుఁ దమిటమున నట్టి ప్రేరణ ప్రత్యయమునకు ముందు భావ్యర్థక 'ప-వ' లు నిల్చుననియు గ్రహింపవలయును.

సంస్కృత భాషయందలి ప్రేరణ ప్రత్యయము 'ణిచ్' అనఁగా 'ఇ' అనునదె. అది సంధి వశమున 'అయ' అగును. ఉదా:—స్థా+ఇ=స్థా+ అయ్=స్థా+ప్+అయ్=స్థాపయతి. ఇట్లు 'ఆ' కారముమీఁది 'ణిచ్చు' పకారాగమ పూర్వకమగును. కావున సంస్కృతమందు 'ఇ' అనునది ప్రేరణార్థకము కాదనుకొనుట గాని యిట్టి ప్రేరణ రూపములను జూచి భ్రమించి తుళు ప్రేరణార్థకమగు 'ఆ' అనుదానికి సంస్కృత ప్రేరణ ప్రత్యయము మూలమనుట గాని యుక్తము కాదు. తుళులో 'ఆ' అనునది ప్రేరణ ప్రత్యయము. సంస్కృత ప్రేరణ రూపములలోని (స్థాపయతి మొ.) 'ఆ' అనునది ధాతుగతము.

"హేతుమతిచ. (3-౧-౨౬)-(వృత్తి)=ప్రయోజక వ్యాపారే ప్రేషణాదౌ వాచ్యే ధాతో ర్ణిచ్ స్యాత్. భవన్తం ప్రేరయతి=భావయతి. (భూ+ణిచ్ = ఇ = భావ్ + ఇ = భావ్+అయ్+అ+తి=భావయతి)" (సి. కౌ. ౨౫౭౬ సూ).

"అర్తి హ్రీ వ్లీ రీ క్నూ యీ క్ష్మా య్యాతాం పు గ్ణౌ" (౭-3-3౬)= (వృ. తి) ఏషాం పుక్ స్యాత్ ణౌ పరే. (సి. కౌ. ౨౫౭౧ సూ).

"౧౭౩౩ ధాతువు-జ్ఞా-నియోగే-ఆజ్ఞాపయతి" (సి. కౌ. ౨౫౭౧ సూ).

"ఆజ్ఞాపయతీతి:—ఆదన్తత్వాత్ పుక్" (బాలమనోరమా వ్యాఖ్య).

తుళు భాషలోని ప్రేరణ ప్రత్యయమగు 'ఆ' అనుదానిని హిందీ ప్రేరణ ప్రత్యయమగు 'వా' అనునది పోలుచున్నదనుట కంటె హిందీలోని ప్రథమ ప్రేరణ ప్రత్యయమగు 'ఆ' అనునది పోలుచున్నదనుట లెస్స.

హిందీ ప్రేరణరూపములు:—

| "అకర్మకము | సకర్మకము (ప్రథమ ప్రేరణము) | ప్రేరణార్థకము (ద్వితీ ప్రేరణము) |
|---|---|---|
| ఉఠ (లేచు) | ఉఠా (లేవనెత్తు) | ఉఠవా (ఎత్తించు) |
| గిర (పడు) | గిరా (పడఁగొట్టు) | గిరవా (పడఁగొట్టించు) |
| డర (భయపడు) | డరా (భయపడఁజేయు) | డరవా (భయపెట్టించు)" |

(హిందీ వ్యాకరణము ౭౮ సూ. ౧౧౮ పుట).

౧౨౨. VI విష:—"ద్రావిడ ప్రేరణార్థకమగు 'ఇ' ప్రత్యయపు చరిత్రము:—ఇండో యూరపియను భాషలందలి ప్రేరణ ప్రత్యయపు ప్రాచీనతమ రూపము సంస్కృతములోని 'అయ' (ఆకారాంతములమీఁద 'పయ') అనునదై యున్నది. 'అయ' అనునది ప్రాచీన శ్లవోనిక భాషయందు 'ఇ', అగును. ఇట్టి 'ఇ' అనుదానికిని ద్రావిడ ప్రేరణ ప్రత్యయమగు 'ఇ' అనుదానికిని గల పోలిక పరిశీలింపఁదగినదేకాని ద్రావిడ శబ్దములతోనె తృప్తికరమగు వ్యుత్పత్తి కుదురుపడునపుడు వేఱు కుటుంబములనుండి వ్యుత్పత్తి సరయుట యుక్తము కాదు. 'ఈ'=(ఇచ్చు) అను ద్రావిడ ధాతువునుండి యీ ప్రేరణార్థక ద్రావిడ ప్రత్యయ మేర్పడి యుండును. 'ఇచ్చు' మున్నగు తెల్గురూపములలో దీనికి హ్రస్వత కన్పట్టుచున్నది. దీనికిఁ దుమర్థాదులఁదు 'ఈవ-ఇవ్వ' అను ద్వైవిధ్యము గలదు. కన్నడమందలి 'ఈ' ధాతు ప్రేరణ రూపము 'ఈసు' అనునది. అయినను 'ఇసు' అను కన్నడ ప్రేరణ ప్రత్యయము 'ఇ' అను రూపమునుండియె యేర్పడి యుండును. ఈ ధాతువు నర్థమగు 'ఇచ్చు' అనునది ప్రేరణార్థకమగుట మిక్కిలి యొప్పిదముగా నున్నది. తెలుఁగున నీయది మఱియు ననుకూలముగ నున్నది. వేఱొక ధాతువుయొక్క తుమర్థముపై నిల్చి యిది యంగీకారార్థము నిచ్చును. ఉదా:—పోనీ=పోనిచ్చు. కన్న-పోగల్ + ఈస్=(పోనిచ్చు). 'ఇచ్చు' అనుదాని యర్థముగల 'కొడు' ధాతు యోగమందును గన్నడమున నిట్టి యంగీకారార్థము గల్గును. ఉదా:—కన్న-మాడకొడు=చేయనిమ్ము" (కాల్డు. ౪౬౨ పుట).

"స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫిలాలజీలో 'ఇంచు' అనునదే మొదటి ప్రధాన రూపమనియు నది 'ఇ' అను నచ్చునకుఁ బరముగా 'చు' అనునది చేరి సానునాసికమై యట్టి రూపము నందెననియు వ్రాయఁబడెను" (స్టడీ. ద్రవి. ౫౧ పుట).

"ప్రాచీన శాసనములయందు ఇది 'ఇచ్చు' అను రూపముతోఁగూడ నున్నది. కన్నడమున 'ఇసు' అనునాగమము ప్రాచీన భాషలో బహుళముగాఁ 'ప్రేరణార్థకముగా' వాడఁబడుచుండెను.

ఈ యాగమములలోని ముఖ్యభాగము (ఈ=ఇచ్చు, ఇంచు=ఇసు) 'ఈ' యను ధాతురూపమే. 'చేయనీ-చేయనిచ్చు-చేయించు' అనురూపములు మూఁడును కొంచె మించు మించుగా నొకే యర్థమునఁ బ్రయోగింపఁబడుచుండి నట్లును...... తెల్గునందలి ప్రేరణరూప నిర్మాణ ప్రక్రియలో 'చు-పు' వర్ణములు చేర్చుట మిక్కిలి ప్రాచీనము. 'ఇంచు' చేర్చుట తరువాతిది" (ఆం. భా. వి. ౫౬౩, ౫౬౪ పుటలు). (ఇందుఁ జాల భాగము కాల్డువెల్లుగారి గ్రంథము లోనిదె).

విమర్శము:—పయిరీతిని డా. కాల్డువెల్లుగారును దదనుయాయులు కొందఱును వ్రాయుచుండఁగాఁ దద్విలక్షణముగా స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫిలాలజీలో వ్రాయఁబడుట వింత! వర్ణమాత్రమగు 'ఇ' అను నచ్చునకుఁ బరముగ 'చు' అనునది యేల చేరవలెను? అర్థవంతముగానట్టి యా యక్షరము ప్రేరణాద్యర్థక మెట్లయ్యెను? దానికిఁ బరముగా ననుస్వార మేలవచ్చెను? ఆం. భా. వి. కర్తగారు తెల్గునందలి 'చు-పు' లు ప్రాచీనము లనుటచేత నవి 'ఇంచు' అనుదాని భాగము లనుట యెట్లు? 'చు-పు' లు నిర్మూలములా? వానికిఁ బ్రేరణార్థ బోధకతా శక్తి యెట్లు గల్గును? 'ఇంచు' అను దానిలోఁ గొంత భాగము లోపింపఁగా 'చు-పు' లు లుప్త శేషములై యేర్పడె ననుట యుక్తముకాదా? 'ఇంచు' అనునది 'చు-పు' ల కన్న నర్వాచీనముగా నేర్పడినదన్నచో బలగన్నడమందలి 'ఇసు' ప్రత్యయమంతకన్న నర్వాచీనమందురా? ప్రాచీన శాసనములలో 'ఇఱ్చు' అను నది చూపట్టుచున్నదే!

డా. కాల్డువెల్లుగా రిండో యూరపియను భాషలలోని 'ఇ' అను ప్రేరణ ప్రత్యయమునకు ద్రావిడ ప్రేరణ ప్రత్యయమగు 'ఇ' అనునది యభిన్నమను పక్షమును సులభముగా విడిచివేసిరిగాని యది యంత బలహీనపక్షము గాదు. సంస్కృత ప్రేరణ ప్రత్యయము 'అయ (లేక) పయ' అనిరిగాని వానిరూపము సంస్కృతమందును 'ఇ' అనునదే. సంధివశమున నయ్యది 'అయ్' మున్నగు రూపములనందుచున్నదని (చూడు ౧-౨-౨ V విష) యీావలికె నిరూపింపఁ

బడెను. ఆంధ్ర కర్ణాటములలో 'ఇంచు-ఇసు' అనురూపము లున్నను ప్రాచీనతమ మనఁబడుచున్న తమిఱమున 'ఇ' అనునదే యిండో యూరపియను భాషలందువలెనె - సంస్కృతమందువలెనె - ప్రేరణ ప్రత్యయమై యున్నది. సంస్కృత ధాతువులు తమిఱములోనికి వచ్చునపుడు వాని తుదిని 'ఇ' ప్రత్యయము స్వార్థికమై నిల్చును. ఉదా:—సంస్కృ:-"౩౩౦ ధాతువు-పఠ-వ్యక్తాయాంవాచి" (సి. కౌ.)=తమి-పడి=(పఠించు). సంస్కృతమందును చురాది ధాతువులకు స్వార్థమందు 'ణిచ్' వచ్చును. "......చురాదిభ్యోణిచ్" (౩-౧-౨౫) (సి. కౌ. ౨౫౬౩ సూ). ఉదా:—"౧౫౩౮ ధాతువు-చోరయతి"=(దొంగిలించుచున్నాఁడు). ప్రేరణార్థమందు సంస్కృతమున 'ఇ' ప్రత్యయము వచ్చునని పైని సూత్రోదాహరణ పూర్వకముగా నుదాహరింపఁబడెను. "భవన్తం ప్రేరయతి=భావయతి=(కావించుచున్నాఁడు)" (చూడు ౧-౨-౨ V విష).

అయినను సంస్కృత ప్రేరణ ప్రత్యయము 'అయా' ద్యాకారములతోనె వెలయుచుండుటచేతను, దమిఱ ప్రేరణ ప్రత్యయమగు 'ఇ' అనునది భావ్యర్థక 'వ-ప' పూర్వకముగనే వాడఁబడుచుండుటచేతను దమిఱమున 'వి-ప్పి' అనునవేకాక 'కు-చు-తు' మున్నగు ననేక ప్రేరణ ప్రత్యయములు వెలయుచుండుటచేతను (చూడు ౬౦ II, III విష) దమిటేతర ద్రావిడ భాషలలో 'ఇంచు-ఇసు' మున్నగు రూపములు వెలయుచుండుటచేతను, నందలి తెలుఁగు ప్రత్యయమగు 'ఇంచు' అనునదే తమిఱమందలి 'ఇ' ప్రత్యయముకన్నను బ్రాచీనమని దాని వ్యుత్పత్తినిబట్టి తోఁచుచుండుటచేతను, ('ఇంచు' నకు మూలము 'ఇన్+చు' శబ్దములని ముందు వివరింపఁబడును) 'ఇంచు' అనుదాని నుండియే 'ఇసు' అనునది యేర్పడెనని తోఁచుచుండుటచేతను 'ఇంచు' లోని వర్ణలోపాది వికృతులచే 'ంచు-చు-ంపు-పు-ఇ' అనురూపము లేర్పడి యుండునని తోఁచుచుండుటచేతను, ద్రావిడ ప్రేరణ ప్రత్యయమునకు ద్రావిడ శబ్దముతోనె తృప్తికరమగు వ్యుత్పత్తి కుదురువడునపుడు దానినే గ్రహించుట యుక్తమగుట చేతను సంస్కృత ప్రేరణ ప్రత్యయ సామ్యము నుపేక్షించుట సాహసము కాదని తోఁచుచున్నది.

డా. కాల్డువెల్లుగారు చూపిన వ్యుత్పత్తి చొప్పున 'ఈ'=(ఇచ్చు) అను ద్రావిడ ధాతువే ద్రావిడ ప్రేరణ ప్రత్యయమునకు మూలమనుట సంభావ్యమె యనఁదగును. కాని 'ఈ'=(ఇచ్చు) ధాతువు దీర్ఘ రూపమైయున్నది. ద్రావిడ భాషలందెల్ల హ్రస్వరూపమగు-'ఇంచు-ఇసు-ఇ' అనునదె ప్రేరణ ప్రత్యయమై యనాదిగఁ బ్రసిద్ధమైయున్నది. దీర్ఘ రూపము వచ్చునకేని ప్రేరణార్థకము లేదు. 'ఇచ్చు' అను నర్థమందును బ్రేరణార్థభానము గౌణముగనైనఁ దోఁపదు. మిక్కిలి

యనుకూలమని కాల్డువెల్లుగారు వచింతు రేకాని-'చేయఁనీ'-అను నంగీకారార్థము ప్రేరణార్థ బోధకము కాదు. మఱియు 'పోనీ' మున్నగువానిలోని 'ఈ' అను నది ధాతువుకాదు. అయ్యది ప్రార్థనాద్యర్థకైక వచన రూపము. రూప సామ్యము భ్రాంతిని గొల్పుచున్నది. 'పోనిమ్ము' అనుదాని వికృతి 'పోనీ' అనునది. 'పోనిమ్ము' అనునది 'పంపు' అను ప్రేరణార్థమునకుఁ గేవల విదూరము.

కాన 'తెలుఁగు-ఇంపు. కన్నడ-ఇంపు. తమి-ఇన్ పు'=(ఇష్టమైనది-రుచించునది)-అను శబ్దములోని 'ఇన్' అనుదానితో 'చు' అను శబ్దాంతర భాగము జోడింపఁబడఁగా నేర్పడినది 'ఇంచు' శబ్దమనియు దానికి 'ఇంపు పుట్టునట్లు చేయు' అనునర్థ వైశాల్యమును నందలి 'చు' అను శబ్దభాగము మూలమున లభించుట సహజమె యనియు నెన్నఁగును.

'సీ। కర్ణముఁలకు నించు నెట్లు కార్యవచనముల్' (భార. ఉద్యో. ౨. ఆ. ౨౮౭ ప.) ఇట్టి 'ఇంచు' శబ్దమె కన్నడమందలి 'ఇసు' అనుదానికిని దెల్లు నందలి 'ంచు-చు-ంపు-పు' అనువానికిని దమిళమందలి 'ఇ-చు-తు' మున్నగు వానికిని మూలమనఁదగును. భావ్యర్థక ప్రత్యయములగు 'వ-ప'లతోఁ గూడి 'ఇ' ప్రత్యయము 'వి-ప్పి' మున్నగు రూపముల నందుటయే దాని యర్థ విశేష బోధక శబ్దాంతరయోగరూ పార్వాచీనతకు నిదానమనఁదగును. తమిళ భాషకు వాఙ్మయ వత్త్వావస్థ గల్గుట ప్రాచీనతమమయినంత మాత్రముచే నందలి శబ్దములె ప్రాచీనము లనుటయు నవియే యితర ద్రావిడ శబ్దములకు మూల మనుటయు (చూడు ౧౨౦ I విష.) (ఆం. భా. వి. ౫౦౭ పుట) శబ్ద తత్వ విమర్శక సమ్మత విషయములు కావు. డా. కాల్డువెల్లుగారు కర్ణాటపు 'ఇసు' ప్రత్యయము ద్రావిడ ప్రేరణ ప్రత్యయములలోనికెల్లఁ బ్రాచీనతమ మను టకు వెనుదీయనివారగుటచేత దానికి మూలమనఁదగు 'ఇంచు' శబ్దము ప్రాచీనతమ మనుటకు విప్రతిపన్నులు కానేరరు.

౧౨౩. I విష:—(3) "ముహుర్ భృశార్థక క్రియలు:—ద్రావిడ భాష లందుఁ గొన్నియెడల ద్విరుక్తము లనఁబడుచున్న క్రియలశాఖ యొకటి గలదు. ఉదా:—తమి-'మినుమినుక్కు' (మిఱుమిట్లు గొల్పునట్లు ప్రకాశించు) అనునది 'మిన్'=(ప్రకాశించు) అనుదానినుండి వచ్చినది. 'వెళువెళుక్కు'=(తెల్లగాఁ జేయు) అనునది 'వెళుక్కు'=(తెల్లగానుండు) అనుదానినుండి వచ్చినది. ముఱ ముఱక్కు=(చిడిముడి పడు). ముణముణక్కు=(గొణుఁగు). కిరుకిఱుక్కు= (తల తిరుగు=దిమ్ముపట్టు). ఇట్టివాని కన్నిటికిని 'తిజ్ఞులు' చేరుటలో నేమియు నైలక్షణ్య మగపడదు. ధాతువును ద్విరుక్తము చేయుటవల్ల ద్రావిడ భాషలం

దితర భాషలందువలెనె యత్యాదరాద్యర్థములు గల్గును. లాటిను భాష లోని 'ముర్ మురొ-టిన్ టిన్నొ' అనువానితోఁ బోల్చి చూడనగును. తుళు భాషయందు నిజముగ భృశార్థకమనఁదగు క్రియారూప మొకటిగలదు. అట్టి క్రియలలో ధాతువునకును బురుష బోధక ప్రత్యయమునకును నడుమ 'ప' అను నది నిల్చును. ఉదా:—మళ్ పేవె=(మళ్ ప్+ప+వ్+ఎ)=మరలమరలఁ జేయు దును" (కాల్డు. ౪౬౨, ౪౬౩ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారొక్క తమిటియందు మాత్రమె యుదా హరించిరి. భృశార్థమందె కాక మఱికొన్ని యర్థ విశేషములందును ధాతు వులె కాక నామవాచకాదులును ద్విరుక్తములగును. దొరగారత్యాదరాద్యర్థ ములు గల్గునని వ్రాయుట సరికాదు. ద్విరుక్తివల్ల భృశాద్యర్థములు తోఁచును. ఆదరము కావచ్చు ననాదరమును గావచ్చును. అట్టి ద్విరుక్తపదముల సంధిలో లోపాదేశాగమాది వికారములు పెక్కు గల్గును. (చూడు 'వ్యా. సం.' ౧౦౨ మొ. ౧౦౪ విష). ఉదా:—తెల్గు-తళతళమను. గనగసని నిప్పులు. కట్టకడ. నానాఁటికి. రారమ్ము-వెనువెంటన్. ఎట్టయెదురు. అందదుకులు. చెల్లాచెదరు. మొ.

"వీప్సానుకర ణాభీక్ష్ణ్య క్రియాసమభిహార సామీప్య చాపలాదౌ పదస్య ద్విర్వచనమ్" (కర్ణా. భూ. ౧౯౨ సూ). ఉదా:—వీప్సా = ఊరూరన్ (ఊరూరు). అనుకరణ-భోర్భోరనె. ఘుల్ఘుల్లనె. గళగళనె. ఆభీక్ష్ణ్య-నోడి నోడి=(చూచి చూచి). క్రియా సమభిహార—"పౌనః పున్యం భృశార్థశ్చ క్రియాసమభిహార ఇత్యుక్తమ్." (సి. కౌ. ౨౭౨౫ సూ. బాలమనోరమా) నడెనడె యెందు నడదర్=(పొదపొదమని పోయిరి). సామీప్య-కెలకెలగె= (క్రిందుక్రిందు) చాపలసంభ్రమ-మాణ్ మాణ్=(మానుముమానము)...... కర్ణాట శబ్దానుశాసనమునం దీ విషయము ౩౭౫ సూ. మొ. ౪౦౦ సూ. వ. విస్తరింపఁబడెను. క్రియాసమభిహారమునందు సంస్కృతమున ధాతువు తుదిని 'యఙ్' ప్రత్యయము నిల్చును.

"ధాతో రేకాచో హలాదేః క్రియా సమభిహారే యఙ్" (౩-౧-౨౨). (వృత్తి)=పౌనః పున్యం భృశార్థశ్చ క్రియా సమభిహారః-తస్మిన్ద్యోత్యే యఙ్ స్యాత్... ..పున పున రతిశయేన వా భవతి = బోభూయతే = (మాటిమాటికి (లేదా) మిక్కిలి యగుచున్నాఁడు). దీనితోఁ దుళుభాషలోని 'ప' ప్రత్యయ మును సరిపోల్చి చూడనగును.

౧౨౩. II విష:—(౪) "తీవ్రతా బోధక క్రియలు=(Intensive verbs)— తీవ్రతా బోధక క్రియారూపములు సైతము తుళు భాషయందే కాన్పించును.

ఉదా.—తుళు-మల్పువె = (చేయుదును). తీవ్రతాబోధక:—మల్త్రువె = (పూనికతోఁ జేయుదును). కేణువె=(విందును)-తీవ్రతా:—కెణ్డువె=(పూనికతో విందును) బూరువె=(పడుదును). తీవ్రతా—బూర్డువె=(గట్టిగాఁ బడుదును)" (కాల్డు. ౪౬౩ పుట).

౧౨౩. III విష:—(౨) "ప్రారంభార్థక క్రియలు = (Inceptive verbs):—ఈ జాతిక్రియలు సంపూర్ణరూపము నందినవి గోండు భాషయందె కలవు. ఇవి వ్యక్తివాచక చిహ్నములను గాలిక చిహ్నములను ధాతువుల భావార్థక రూపమునకుఁ (Infinitive) బరముగఁ జేర్చుటవలన నేర్పడును." (కాల్డు. ౪౬౩ పుట) (చూడు ౧౨౦ II విష).

విమర్శము:—ఈ జాతి క్రియలను దొరగా రుదాహరింపలేదు. తెల్గునం దిట్టి క్రియల వాడుకగలదు. తెల్గు—"పండఁబాఱినపొల మెండఁబాఱె" (మనుచ. 3 ఆ. ౧౨౯ ప.) పండఁబాఱెన్=పండ నారంభించెను. ఎండఁబాఱెన్=ఎండ నారంభించెను. వీనియందుఁ గాల్డువెల్లుగారు చెప్పిన లక్షణములు పూర్ణముగా నగపడవు. అర్థ విశేష ఘటితములగుటచేత నిట్టి క్రియల నాంధ్ర వైయాకరణులు ఘటకక్రియ లందురు.

౧౨౪. I విష:—(౬) "కర్మార్థకము=(Passive voice):—ప్రాచీనములగు నిండో యూరపియను భాష లన్నిటియందును గర్మార్థక 'తిజ్' రూపములెల్ల వెలయుచున్నవి. 'యా' (పోవు) అను నర్థముగల ధాతువునుండి నిష్పన్నమైన 'య' అను ప్రత్యయమును ధాతువు తుదిని జేర్చి దానిపై నాత్మనే పద 'తిజ్' ప్రత్యయములను నిల్పుటవలన సంస్కృత కర్మార్థక రూపము లేర్పడును. సిథియను భాషలందును బ్రత్యయ యోగముచేతనే కర్మార్థక రూపము లేర్పడును. తుర్కీ భాషలో 'ఇల్-ఈల్' అను ప్రత్యయములను, ఫిన్నిషు భాషలో 'ఎల్' అను ప్రత్యయమును, హంగేరియను భాషయందు 'అత్-ఎత్-తెత్' అను ప్రత్యయములను, ధాతువు తుదిని జేర్చి వానిపైఁ బురుష బోధక ప్రత్యయములను నిల్పుటచేతఁ గర్మార్థక రూపము లేర్పడును. జపాను భాషలోఁ గర్త్రర్థక కర్మార్థక రూపము లేకవిధముననే యుండును. ద్రావిడ భాషలందెందును గర్మార్థక ప్రత్యయముగాని కర్మార్థమును బోధించు నామ విభక్తి పరివర్తనముగాని లేదు. ఇంకఁ గర్మార్థకము గోండు భాషేతర ద్రావిడ భాషలలో వేఱు విధముగ బోధింపఁబడును. ఉత్తర హిందూస్థాన భాషలందును నియతమగు కర్మార్థక ప్రత్యయము లేదు. అందును ద్రావిడ భాషలందువలెనె కర్మార్థము వేఱు విధముగ బోధ్యమగును" (కాల్డు. ౪౬౩ పుట).

(౧) "ఇంచుమించుగా జపాను భాషయందువలెనె తమిళమున నొకా నొక యకర్మక క్రియయొక్క ప్రయోగము మూలమునఁ గర్మార్థము బోధ్య మగును. ఉదా:—తమి—ఎన్నాల్ ఉడైన్దదు=(నాచేత (లేదా) నా మూల మున బ్రద్దలయినది). (ఉడై=బ్రద్దలగు). "నా మూలమున విఱుగఁ గొట్టఁ బడినది" అను కర్మార్థము పై వాక్యముచే బోధిత మగుచున్నది. పై రీతిని దృతీయా విభక్తితో నున్న గర్తను నిలుపుటచేత మఱింత విశదముగాఁ గర్మార్థము బోధ్యమగును" (కాల్డు. ౮౬౩, ౮౬౮ పుటలు).

విమర్శము:—'సార్వధాతుకే యక్' (3-౧-౬౭)=(వృత్తి)—"ధాతో ర్యక్ ప్రత్యయః స్యాత్ భావ కర్మవాచిని సార్వధాతుకే పరే." అను పాణినీయ విధి చొప్పున వచ్చు సంస్కృత కర్మార్థమందలి 'యక్' ప్రత్యయము 'యా=ప్రాపణే' (సి. కౌ. ౧౦౪౯ ధాతువు) అను ధాతువున కభిన్నమనెడి దొరగారి యాశయము యుక్తమై యున్నది. "కర్త్రర్థకము-దేవదత్తో మైత్రం రక్షతి=(దేవదత్తుఁడు మైత్రుని రక్షించుచున్నాఁడు). కర్మార్థకము-దేవదత్తేన మైత్రో రక్ష్యతే=(దేవ దత్తునిచేత మైత్రుఁడు రక్షింపఁ బడుచున్నాఁడు). ఈ రీతిగల స్థలములందు రెండవ వాక్యములోని పదములచేఁ గర్త్రర్థకత్వము లభింపదు. అందలి క్రియ కర్మము నాకాంక్షించుచున్నది. అనఁగాఁ గ్రియ మీఁది తిఙ్గుచే గర్మ మభిహిత మగుచున్నది. కర్తృ పదము తృతీయాంతమై యున్నది. కావునఁ దద్వాక్యగత పదములచేఁ గర్మార్థమే వాచ్యమగుచున్న దనక తీరదు. ఇట్లే దీనికి సరియగు 'దేవదత్తునిచే మైత్రుఁడు రక్షింపఁ బడుచున్నాఁడు' అను తెల్గు వాక్యమందును 'దేవదత్తునిచే' అను తృతీయయుఁ గర్మము నాకాంక్షించుచున్న క్రియయు దానికిఁ గర్త్రర్థకత్వము లేదనియుఁ గర్మార్థకత్వమే కలదనియు విశదీక రించుచున్నవి. కాని యీ రెండవ వాక్యమును శబ్దతత్వశాస్త్ర పద్ధతి ననుసరించి పరిశీలించినచో 'దేవదత్తునిచే రక్షను మైత్రుఁడు పొందుచున్నాఁడు' అను రీతి నీ వాక్యములోని శబ్దముల గణ మేర్పడెనని తోఁచును. అట్లె సంస్కృతమందలి 'యక్' ప్రత్యయము 'యా=ప్రాపణే' అను చొప్పున యా ధాతు సంబంధియే యనియు సంస్కృతపు పోలిక చొప్పుననే ద్రావిడ వాక్య మేర్పడి యుండుననియుఁ దోఁచును. ఇట్టి యర్థమున నిది కర్త్రర్థక వాక్యమె యనుటలో సందియముండదు. కాని యట్టి యర్థ మీ వాక్యములోని పదములచే గ్రహించు సంప్రదాయము లేదు. కాలక్రమమున వ్యవహార వశమున నందలి పదములు కర్మార్థకములుగానే గ్రహింపఁ బడుచున్నవి.

సంస్కృతమున సార్వ ధాతుకము లనఁగాఁ గొన్ని లకారములు పరమగు నపుడే 'యక్కు' వచ్చును. ద్రావిడ భాషలలో నంతటను 'పడు' అనునది

నిల్చును, 'కర్మ ణ్యనుబన్ధః స్యా । త్పతి ధాతుః కర్తృ వచ్చ తద్విధయః' (ఆం. చిం.) (చూడుఁడు. 'వ్యా. సం.' ౩౯౯ విష). "పడు......సకర్మక......౨ పొందు. ఇంత పడుదునె-భార. ఆరణ్య ౨ ఆ." (శబ్దరత్నాకర కోశము). ఇట్లే తమిళ కన్నడములందును 'పడు' ధాతువు కర్మార్థకమున నిల్చి వాడుక కెక్కినది.

డా. కాల్డువెల్లుగారు "ద్రావిడ భాషలం దెందును గర్మార్థక ప్రత్యయము గాని కర్మార్థమును బోధించు నామ విభక్తి పరివర్తనముగాని లేదు" అని వ్రాయుట సాహసము.

"మూన్రావదు" (తొల్కా. ౫౫౭ సూ.)='ఒడు' తృతీయా విభక్తి ప్రత్యయము. దీనికిఁ గర్తృ కరణాద్యర్థము లీ క్రింది రీతిని గలవు.

౫౫౮ సూత్రము:—I. "అదనిన్ ఇయటల్=(దానిచేతఁ జేయఁబడుట). ఉదా:—తేర్ తచ్చనాల్ చెయ్యప్పట్టదు=(రథము వడ్రంగిచేతఁ జేయఁబడినది).

II. అదఱ్ఱగు కిళవి=దానితోఁ దగిన శబ్దము.

III. అదన్ వినైప్పడుదల్=(దాని క్రియను బొందుట). ఉదా:—'నాయాల్ కడికప్పట్టాన్'=(కుక్కచేతఁ గఱవఁబడెను). (ఇందలి 'పడు' శబ్దమునకు 'పొందు' అనియే యర్థము).

పయి తొల్కాప్పియపు వాక్యములనుబట్టి తృతీయగల కర్మార్థక వాక్యముల నంగీకరింపక తీరదుగదా. తొల్కాప్పియపు కాలమున నిట్టి కర్మార్థక వాక్యము లుండకుండినచో నాయన పయిరీతిని సూత్రించి యుండునా? "నేఁటి గ్రాంథిక కర్మార్థక వాక్యమగు 'చో(సొ)ల్లప్పట్టదు'=(చెప్పఁబడెను) అనునది కఠోరముగను స్వభావ విరుద్ధముగను వినఁబడును" (కాల్డు. ౪౬౫ పుట ౪ పేరా) (౧౨౪ III, IV విష) అని కాల్డువెల్లుగారు వ్రాయుట యర్థము కాదు. వీరిని జూచి వీరి యనుయాయి వర్గ మెల్ల గతాను గతికముగా ద్రావిడ భాషలలోఁ గర్మార్థకము లేదని యొకరు నరుదని యింకొకరును వ్రాయసాగిరి. దొరగారు 'చో(సొ)ల్లప్పట్టదు' మున్నగు రీతిగల కర్మార్థక రూపములు నేఁటివనుట పొరపాటు (చూడుఁడు ౧౨౪ IV విష). ఇవి చిరకాలము క్రిందటి తొల్కాప్పియము నాఁటివి. అంతకన్నఁ బ్రాచీన ప్రబల నిదర్శనము వేఱొకటి యేముండును? కర్మార్థకములు ద్రావిడ ప్రాచీన శాసనములలో (వికాస కర్తగారు) నరుదననేల? సంస్కృతమందు మాత్రము సమాపక కర్త్రర్థక క్రియల యపేక్షను సమాపక కర్మార్థక క్రియ లెన్నివేల సంఖ్య తక్కువగా నుండునో లెక్కలు వేసిరా? ప్రాచీన కర్ణాటమందును గర్మార్థక 'పడు' శబ్ద ప్రయోగము ధారాళముగఁ గలదు.

"క. క్రియెయ పదం తాం కర్తృ। ప్రయుక్త మాగల్లి యేన కెంబి చ్చెయ నా। శ్రియిపుదు సకర్మక మద। ల్ప్రయుక్త పడు ధాతు సర్వధాతుగె యకుళ్ళం" (శబ్దమణి దర్పణము-౨౫౧ b).

పలుగన్నడ భాషావ్యాకర్తయగు కేశిరాజిట్లు సకల ధాతు సామాన్యముగాఁ గర్మార్థక 'పడు' శబ్ద ప్రయోగ ప్రసిద్ధిని సూత్రించి యున్నాఁడు. తదను సారియెయగు భట్టాకలంకుఁడును నీ క్రింది రీతిని సూత్రించెను. "కర్మణ్యాను పడుః" (కర్ణాటక శబ్దానుశాసనము ౫౩౦ సూ.)=(భాషా మంజరీ వృత్తి)= ధాతోః పడు ధాతు రనుప్రయుజ్యతే, కర్మణి విహితే తిజీ పరే. ప్రయోగః:— మాడల్పట్టుదు (మాడు+అల్+పడు+ద+ఉదు) ఘటం కుంబఱనిం=(కులాలునిచేఁ గుండ చేయఁబడెను). నోడల్పట్ట నరస నంగనెయిం=(స్త్రీచే రాజు చూడఁబడెను). పడు ధాతువునకు 'పొందు' అను నర్థము తమిళాంధ్రములలోఁ బ్రసిద్ధమని పైని జూపఁబడెను. కర్ణాట శబ్దమణి దర్పణ ధాతు పాఠమున 'పడు మరణే-శయనేచ' అని యున్నను బ్రాచీన ద్రావిడ 'పడు' ధాతువు ప్రాప్త్యర్థకమును నై యుండెడిదని గ్రహింపనగును.

"కోపము తపస్సును జెఱుపును=కోపముచేఁ దపస్సు చెఱుపఁబడును" అను రీతిని గర్త్రర్థక కర్మార్థక వాక్యములవలన నొక్క యభిప్రాయమే బోధ్యమగుననియు నట్టి యభిప్రాయమును వక్త కర్త్రర్థక వాక్యముచేఁ గాని కర్మార్థక వాక్యముచేఁ గాని 'వివక్షయా శబ్దప్రవృత్తిః' (కర్ణాట శబ్దాను శాసన మంజరీ మకరంద వ్యాఖ్య. ౫౩౦ సూ॥ వ్యాఖ్య.) అను న్యాయము చొప్పునఁ దెలుపవచ్చుననియు నెఱుంగనగును.

ద్రావిడ భాషలలోఁ గర్మార్థక 'పడు' శబ్ద ఘటిత ప్రయోగము లేదనియు నీ క్రింది రీతిగల కర్త్రర్థక వాక్యములచేఁ గర్మార్థము వాచ్యమగుననియుఁ జెప్పుచు నట్టి వాక్యములను గొన్నిటి నీ క్రింది రీతిని గాల్డువెల్లుగారు వివరించిరి. 'ఉడైన్దదు=(బ్రద్దలయినది)' అను వాక్యముచే 'కుండ నాచే బ్రద్దలు కొట్టఁబడెను' అను కర్మార్థము లభించుననిరి. ఇది సరియై యుండలేదు. బ్రద్దలు కొట్టఁబడకయె బ్రద్దలగుట సంభవింపదు గాన 'బ్రద్దలయినది' అను వాక్యమునకు 'బ్రద్దలు కొట్టఁబడెను' అను వాక్యము హేతు వాక్యము కావచ్చును. వాని పర్యవసితార్థ మభిన్నము కావచ్చును. వాక్యగత పదములకు లేని కర్మార్థ బోధకతాశక్తిని గల్పింపనగునా? 'కుండను బ్రద్దలు కొట్టితిని' అను వాక్యమునకు మాత్రమె 'కుండ బ్రద్దలు కొట్టఁబడెను' అను వాక్యము పర్యాయ మనఁదగును. ఈ విషయమున డా. కాల్డువెల్లుగారి

యాశయ మిచట వ్రాయఁబడకున్నను రానున్న విషయమున (౧-౨౮ II విష.) వచింపఁబడెను. కుండ మున్నగునది యచేతనమగుటంజేసి యది స్వయముగా బ్రద్దలగుటకు శక్తి గలది కాదుగాన 'బ్రద్దలైనది' అను దానికి 'బ్రద్దలు కొట్టఁబడినది' అను కర్మార్థమె ('ఉడైన్దదు' అను కర్త్రర్థక వాక్యము వలన) బోధ్యమగునని దొరగారి యాశయము. ఈ విషయము ౧-౨౮ II విషయమున విమర్శితమగును. 'ఆం. భా. చ.' కర్తగారు పై రీతిని వివరింపఁబడిన కాల్డువెల్లుగారి యాశయమును వివరింపకయే దొరగారి యుదాహృతిని మాత్రము స్వీకరించి చూపిరి. "అది నాచేత పగిలినది, అను రీతిగఁ గూడఁ గర్మార్థమును దెలుపవచ్చును." (ఆం. భా. చ. ౧-౨౫౧ పుట). 'పగులఁ గొట్టఁబడినది' అను వాక్యమున 'నాచేత' అనునది కర్త. భాషా చరిత్ర కర్తగారు సంగ్రహించిన వాక్యమందు 'నాచేత' అనునది హేతువు. వీరి రచనమునఁ గాల్డువెల్లుగారి యుపపత్తియేనియు బాలకులకు విశదము కాదు.

౧-౨౮. II విష:—(౨) 'అగు-ఉండు-పోవు ముగియు' అను నర్థములు గల యమహాత్కర్తృక ప్రథమ పురుషైక వచన క్రియారూపముతో వేఱొక యమహాత్కర్తృక క్రియాజన్య రూపమును జేర్చుటవలన సామాన్యముగాఁ గర్మార్థక రూపము నిష్పన్న మగును. ఉదా:—వెనుకటి మొదటి పద్ధతి యుదాహృతి:—ముడిన్దదు=(ముగిసినది=ముగింపఁబడినది). ప్రకృత ద్వితీయ పద్ధతి యుదాహృతి:—అది ముడిన్దు ఆయిట్రు=(అది ముగిసి యయినది=ముగింపఁబడినది). పయి రెండు వాక్యములకును నర్థభేదము లేదు. రెండును గర్మార్థమునె యిచ్చును. రెండవ వాక్యము పని ముగియుటను సైతము తెల్పును. సకర్మక క్రియలును (Active) నీ క్రిందిరీతిని గర్మార్థము నిచ్చును. ఉదా:—కోవిల్ కట్టి ఆయిట్రు=(కోవిలకట్టి యైనది=కోవిల కట్టఁబడినది) 'ఆయిట్రు' అనుచోట 'పోయిట్రు' అను దానిని, నిల్పినను నిల్పవచ్చును.

పయి చోటులందు 'అల్-దల్' అను ప్రత్యయములు తుదినిగల భావనామములను నిల్పినను నిల్పవచ్చును. ఉదా:—సె (చె) య్ద్ ఆయిట్రు=(చేసియైనది=చేయఁబడినది)=చె (సె) య్దల్ ఆయిట్రు=(చేయుట యైనది=చేయఁబడినది).

పయిరీతిని గర్మార్థమును బోధించు వాక్యమందలి సాకాంక్ష పదగణములో 'అగు' మున్నగు సహాయ క్రియయొక్క (Auxiliary) యమహాదర్థక ప్రథమ పురుషరూపము చేరవలసి యుండును. మహన్మహత్యర్థక క్రియారూపములవలనఁ గర్మార్థము బోధ్యము కానేరదు. వానియందుఁ గర్త్రర్థమే బోధ్య

మగును. 'ఇల్లు కట్టి యైనది' మున్నగు వాక్యములలో నిర్మాణాది వ్యాపారశక్తి యమహత్తులగు 'ఇల్లు' మున్నగు వానికి లేమింజేసి యట్టి వాక్యములందుఁ గర్మార్థమే గ్రాహ్యమగును. నిర్మాణాది వ్యాపార శక్తిగల మహాన్మహాతులు కర్త లగునపుడన్ననో కర్త్రర్థమే వాచ్యమగును" (కాల్డు, ౪౬౭, ౪౬౫ పుటలు).

విమర్శము:—వెనుక నుదాహరించిన (౧-౨౮ I విష). 'ఉడైన్దదు'=(బద్దలయినది) అను మొదటి విషయము నుదాహృతులకును "కోవిల్ కట్టి ఆయిట్రు (కోవిల కట్టియైనది), ముడిన్ద్ ఆయిట్రు=(ముగిసియైనది)." అను రీతి గల రెండవ విషయము నుదాహృతులకును శబ్దానుసంధాన భేదమే కాని మార్గ భేదము లేదు. ఇట్టి వాక్యములలోని 'కట్టి ఆయిట్రు' మున్నగు జంటలవలనఁ గర్మార్థక రూపములు నిష్పన్నములగు ననుట సరికాదు. అవి కర్మార్థక వాక్యములు కానేరవు. అవి కర్త్రర్థక వాక్యములె. నిర్మాణాది శక్తి, కర్తయగు నమహత్తునకు లేనపుడు దానినుండి కర్మార్థము బోధ్యమగుననెడి దొరగారి యాశయము సరికాదు. వాక్యగత శబ్దముల యర్థముచేత వక్తృ తాత్పర్య సిద్ధి కల్గుచుండఁగా గర్మార్థకత్వ కల్పనము సరికాదు. వీరి పక్షమున 'చెట్టు చచ్చెను' అను వాక్యము కర్త్రర్థకమనియు 'రావణుఁడు చచ్చెను' అను వాక్యము కర్మార్థకమనియు నసంగతముగఁ జెప్పవలసివచ్చును. వాక్యమందలి క్రియచేతఁ గర్త యభిహితమయినపు డా క్రియ కర్త్రర్థకమనియుఁ గర్మ మభిహితమయినపు డా క్రియ కర్మార్థకమనియుఁ జెప్పుట శాస్త్ర సంప్రదాయ సిద్ధము. 'చెట్టు చచ్చెను' అను వాక్యమునందలి 'చచ్చెను' అను క్రియకు 'చావును బొందెను' అని యర్థము. అట్లు చావును బొందుటకుఁ గారణము 'మనుష్యుఁడు నఱకుట' అనునది కావచ్చును. మనుష్యుఁడు నఱకుటచేతఁ జెట్టునకుఁ జావు ఘటిల్లె ననుటలో ననుభవ విరోధము లేదు గాన ముఖ్యార్థ బాధ కల్గనపుడు లక్షణకుఁ బ్రసక్తియే లేదు. ఇట్లె కోవిల కట్టియాయినదనుచో సయితము జనులు కోవిల కట్టుట యయినదని యర్థము గాన నచటఁ గర్మార్థ రూప లక్ష్యార్థ ప్రసక్తి యెంత మాత్రమును లేదు. వాక్య గత శబ్దముల శక్తిచేత లభించు కర్త్రర్థకత్వమునను వక్తృ తాత్పర్య సిద్ధి గల్గుచున్నది. 'ముడిన్దదు' అనుచోట సైతము జను లా పనిని ముగించిరని యర్థముగాన నచటఁ గర్మార్థకత్వాంగీకార ప్రసక్తి లేదు. 'కుడమ్ ఉడైన్దదు' అనుచోఁ గుండ నెవ్వఁడో బద్దలు చేసెనను కర్త్రర్థమే భాసిల్లును. కర్మార్థ భానము కావలెనను నిర్బంధ మేమున్నది? వాక్యగత శబ్దబోధ్య కర్త్రర్థముచే వక్తృ తాత్పర్య సిద్ధి కల్గలేదా?

పయి నుదాహరించిన 'కోవిల్ కట్టి ఆయిట్రు' అను రీతిగల తమిళ వాక్య పద్ధతి సంస్కృతాంధ్రములందును గలదు. ఉదా:—తెల్లు - దెబ్బతగిలి

పండు పడెను. రాహువు కంఠము తెగి దేహము ధరణిం బడెను. ఇట్టియెడల క్త్వార్థకమునకు సమాపక క్రియా సమాన కర్తృకతా భంగము గల్గెనని కొందఱు భ్రమింతురు. ఇట్టి చోటులందలి క్త్వాంత మధ్యాహార్యమగు 'ఉండు' ధాతు వుతో నన్వయించును. ఉదా:—దెబ్బ తగిలి పండుపడెను=దెబ్బ తగిలియున్న పండు పడెను. సంస్కృతమందును నిట్టి వాడుక గలదు.

"శ్లో. అనుభవతి శచీత్థం సా ఘృతాచీముఖాభి ।
ర్న సహ సహచరీభి ర్నస్దనానన్ద ముచ్చైః ।
ఇతి మతి రుదయాసీ త్పతిణః ప్రేక్ష్య భైమీం ।
విపినభువి సఖీభి స్సార్థ మాబద్ధఖేలామ్."

(నైషధము). "ప్రేక్ష్యేతి క్త్వా ప్రత్యయాన్తస్య........స్థితస్యేతి పత్రిణ ఇత్యస్య విశేషణ మధ్యాహార్యమ్" (జీవానంద వ్యాఖ్య) (చూడు 'వ్యా. సం.' ౩౧౧ విష).

పయిరీతిగల చిక్కులేకుండం బై కాల్డువెల్లుగారి యుదాహృతులను దెల్లున మార్చి యీ క్రింది రీతిని 'ఆం. భా. వి.' గ్రంథమున నుదాహరింపం బడెను. "II–క్రియయొక్క భావార్థకము గాని యమహ ద్రూపముగాని ఉపయోగించుట (కర్మార్థమును జెప్ప రెండవ పద్ధతియని యన్వయము) ఉదా:— పని అయినది. ఇల్లు కట్టడము ముగిసినది. విత్తనములు నేలలో పడినవి..." (ఆం. భా. వి. ౫౬౬ పుట). పైని వ్రాసిన రీతినే వీనివలనం గర్మార్థ భానము గల్గవలసిన ప్రసక్తిలేదు. అట్టి కర్త్రర్థక వాక్యములవలననే వక్తృతాత్పర్యబోధము గల్గుచున్నది. మఱియు 'అమహాత్తులకుం నిర్మాణాది వ్యాపారశక్తి లేమింజేసి కర్మార్థమె భాసింపవలయును' అను కాల్డువెల్లుగారు వివరించిన యుపపత్తి సైతము విశాసమున వచింపంబడమింజేసి పై కర్త్రర్థక వాక్యములవల్లం గర్మార్థమును గ్రహింపవలయు ననుట నిర్హేతుకమై యసంగతముగం దోంచును.

౧_౨౮. III విష:—"హిందూస్థానీ బెంగాలీ భాషలయందును గర్మార్థక రూపసాధనమున కించుమించుగా నిట్టి మార్గమే కలదు. ఉదా:—బెంగాలీ- 'జానా, యాయ్'=(తెలిసికొనుటకు లేదా తెలిసికొనంబడుటకు పోవుచున్నది)— తెలిసికొనంబడును. కొంద ఱీ 'జానా' అనుదానిని గ్రియా నామవాచక మనియు, మఱికొందఱు కర్మార్థబోధక ధాతుజ విశేషణమనియుం, జెప్పుదురు. ఏది యెట్లయినను నిది ద్రావిడ సంప్రదాయమునకుం గొంత భిన్నమె. పై వాక్యమునకు సరియగు తమిళరూపము – 'తెరిన్దు ఆయిట్రు' = (తెలిసికొని యయినది=తెలిసికొనంబడెను). 'తెరిన్దు పోయిట్రు'=(తెలిసికొని పోయినది=

తెలిసికొనఁబడెను) అనునది 'తెరిన్దు ఆయిట్రు' అనుదాని కభిన్నమె. పై రీతిని గర్మార్థమును బోధించుటలో 'పోవు' అను క్రియ యుపయోగింపఁబడుట మాత్రము రెండు కుటుంబముల భాషలందును సరిపోలి యున్నదని గుర్తింప వలెను" (కాల్డు. ౪౬౫ పుట).

"అకర్మకములగు సహాయక్రియలను జేర్చకుండఁగనే ద్రావిడ భాషలందుఁ గాదాచిత్కముగా సకర్మక కర్త్రర్థక క్రియలె కర్మార్థమున నుపయోగింపఁబడు చున్నవి. అట్టివి కర్త్రర్థక భూతార్థకధాతుజ విశేషణములె వైయుండును. ఉదా:- తమి-సొ (చొ) న్నదు పోదుమ్=(చెప్పినది చాలును=ఏది చెప్పఁబడినదో యది చాలును). 'సొన్నదు' అనునది కర్త్రర్థకమె యైనను భాషా సంప్రదాయమును సందర్భమునుబట్టి దానికి 'చెప్పఁబడినది' అను కర్మార్థమునే చెప్పక తీరదు. ఇది మిక్కిలి ప్రచుర ప్రసిద్ధిగల వాడుక యగుటచేత 'సొ (చొ) ల్లప్పట్టదు'=(చెప్పఁ బడినది) అను నేఁటి గ్రాంథిక కర్మార్థక వాక్యము కఠోరముగను స్వభావ విరుద్ధ ముగను వినఁబడును. 'సొన్నదు' అనుదానివంటిది మఱొక యుదాహృతి:— తమి-ఎన్ఱ = (అనినది = చెప్పినది = ఏది చెప్పఁబడినదో యది యను కర్మార్థము వాచ్యమగును). 'ఇయేసు ఎన్బవర్'=(యేసనువాఁడు=ఎవఁడు యేసనఁబడునో వాఁడు). (యకారాది పదమునకు మొదట 'ఇ' వర్ణము నిల్చుట తమిళ సంప్రదాయము) = అనుదానినుండి యేసనఁబడువాఁ డను కర్మార్థము వాచ్య మగును" (కాల్డు. ౪౬౫ పుట).

"తుళు భాషయందును గర్మార్థ బోధనప్రకార మిట్టిదియే. భూతార్థక కర్త్రర్థక విశేషణము కర్మార్థకముగ వాడఁబడును. కాని తచ్ఛబ్దార్థక సర్వ నామ మద్దాని తుదిని బునరుక్తముగ నిల్చును. ఉదా:—ఆయె నిన్దిస్ దినాయె ఆయె=(వాఁడు నీచదృష్టిని జూచినవాఁడు వాఁడు). దీనికి 'వానిచే నిరాకరణ దృష్టిని జూడఁబడినవాఁడు వాఁడు' అను నర్థము లభించును. దీనికి సరియగు తమిళ వాక్యము:—అవన్ నిన్దిత్తవన్ అవన్=(వాఁడు నిందించినవాఁడు వాఁడు)" (కాల్డు. ౪౬౬ పుట).

(3) "గోండు భాషయందును బైరీతినే కర్మార్థకరూప మేర్పడునుగాని యట్టి వాక్యమున 'నేను ఉన్నాను'=(I am) అను వాక్యము చేరును. అట్టిది యితర ద్రావిడ భాషలలోఁ గర్త్రర్థక భూతకాలిక వాక్యమై యుండును. ఉదా:—తమి-'నాన్ అడిత్తు ఇరుక్కిఱేన్' = (నేను గొట్టి ('ఉండుచు'న్నాను) ఉన్నాను=కొట్టి యున్నాను). గోండు:-అనజిసి ఐయాతొన = (నేను గొట్టి యున్నాను=కొట్టితిని). దీనిచే 'నేను గొట్టఁబడి యున్నాను' అను కర్మార్థము లభించును. ఇది యింగ్లీషులోని కర్మార్థక రచనను బోలియున్నది. నవీన

పెరిషియను భాషా ప్రయోగ మింతకంటెను సమీపతరమై యుండును. నవీన పెరిషియను భాషయందుఁ గ్రియారూప మితర క్రియతోఁ గూడినపుడు కర్త్రర్థక మగును. ఇతర క్రియారూపము (Substantive verb) పరమందున్నచో నా క్రియ కర్మార్థకమగును" (కాల్డు. ౪౬౬ పుట).

విమర్శము:—కర్మార్థ ప్రదర్శనమందు బెంగాలీ భాషలోను దమిళ భాషయందును 'పోవు' ధాతువు నిల్పుటే పోలిక యని దొరగారు వ్రాసిరి. హిందీ భాషా పద్ధతి యీ క్రింది రీతినున్నది. 'కర్తృవాచ్య (కర్త్రర్థక) క్రియయొక్క సామాన్య భూతకాలరూపమునకు 'జానా' అనుదానిని జేర్చుటచేత కర్మ 'వాచ్య' (కర్మార్థకము) మగును. ఉదా:—ఖాయాజానా=(తినఁబడుట)......" (హిందీ తెల్గు స్వబోధిని ౧౧౩ పుట ౭౦ సూ).

'జా' ధాతువునకు ('యా' ధాతుభవము) 'పోవు' అని యర్థము. 'ఖాయా' అనుదానికి 'తినెను' అని యర్థము.

"'ఆ' కార 'ఓ' కార 'ఏ' కారాంతములగు ధాతువులకుఁ జివర 'యా' చేర్చిన భూతకాల మేర్పడును. (ఉదా:—ఖాయా=తినెను)." (హిం-స్వబోధిని ౩౭ సూ. ౫౮ పుట).

యా ధాతుభవ మనఁదగు 'జా' ధాతురూపమైన 'జానా' అనునది సంస్కృత కర్మార్థక 'యక్' ప్రత్యయ సంబంధి యనఁదగి యుండుటచేత గౌడ భాషల యీ పద్ధతి ద్రావిడ భాషల పద్ధతిని బోలుచున్నదనుట విశ్వసనీయము కాదు.

ద్రావిడ భాషలందు ధాతుజ విశేషణ ప్రయోగ సందర్భమునఁ గర్మమునకుఁ బ్రాధాన్య వివక్షయందు మాత్రము కర్త్రర్థక విశేషణమునకుఁ గర్మార్థకత్వము పాక్షికముగఁ గన్పట్టుచున్నది. దీనికె కాల్డువెల్లుగా రుదాహరణములను గొన్నిటి నిచ్చియున్నారు. సంస్కృతమున విశేషణములు దఱచుగాఁ గర్మార్థక 'క్త' ప్రత్యయాంతములె ప్రయోగింపఁబడును. (ఉదా:—కార్యం త్వయా కృతమ్) కర్త్రర్థక విశేషణ ప్రయోగములు లేకపోలేదు. గఙ్గాం గతః సః. గఙ్గాం ప్రాప్తః సః." (సి. కౌ. ౩౦౮౬ సూ.) తమిళ 'సొన్నదు'=(చెప్పినది) అనుచోటి 'సొన్న' అను కర్త్రర్థక విశేషణముచోట సంస్కృతమున 'ఉక్త'=(పల్కఁబడిన) అనుకర్మార్థక 'క్త' ప్రత్యయాంత రూపమె వాడఁబడును. ద్రావిడ భాషలందు 'నేను బల్కిన మాట=నాచే బల్కఁబడిన మాట' అను ద్వివిధములగు ప్రయోగములును గలవు. సీ......పడయఁ బడిన। పుణ్యఫలము... (ఆది. ౧ ఆ. ౭౧ ప.), తే. గీ.......నియోగింపఁబడినదాని......(భార. ఆది. ౬ ఆ. ౩౬ ప.) (చూడు 'వ్యా. సం.' ౩౧౯ విష).

ద్రావిడ భాషలలోఁ గర్త్రర్థకమె కర్మార్థకమునకు వాచక మగునను దొరగారు తలంచు నియమము లేదు. 'నేను దేనిని జెప్పితినో 'యది' అను నర్థమున 'చెప్పినది' అను రీతిని వాడెడి సంప్రదాయము కలదు. అచటఁ గ్రియాపేక్షచేతఁ గర్మమునకుఁ బ్రాధాన్యము వక్తచే వివక్షింపఁబడెను గాన నట్టి వాక్యమేర్పడినది. అట్టి యెడ ఘుణాక్షరన్యాయమున 'నాచేఁ జెప్పఁబడినది' అను కర్మార్థము వాచ్యమయ్యెను. ఇట్టి స్థితి కర్మమునకుఁ బ్రాధాన్యము వివక్షించునపుడు మాత్రమె సంభవించును. 'వాలిని రాముఁడు చంపెను' అనుచోఁ గర్తకుఁ గ్రియాపేక్షచేతఁ బ్రాధాన్యమును వక్త వివక్షించినచో 'రాముఁడు చంపిన వాలి' అని కర్త్రర్థక రూపమె యేర్పడును. ఇట్టి చోట 'చంపిన' అనుచో 'చంపఁబడిన' అను కర్మార్థకత్వ మెంతమాత్రమును గల్గనేరదు.

ప్రాచీన ద్రావిడ భాషలలో 'ఏ' అను సర్వనామ శబ్దమునకు యచ్ఛబ్దార్థకత్వ (నన్నయ నాఁటికి వచ్చినది) మరుదగుటంజేసి యత్తచ్ఛబ్దాన్వయమును నరుదయ్యెను. (చూడు ౧౧౭ IV విష). అట్టి యర్థము ధాతుజ విశేషణములచే సిద్ధించుట ద్రావిడ భాషా సంప్రదాయమయ్యెను. అట్టి యెడలఁ గర్త్రర్థక వాక్యమందలి క్రియ ధాతుజ విశేషణముగను గారకము విశేష్యముగను నిల్చును, 'వాలి నెవఁడు చంపెనో వాఁడు' అనుచో 'వాలిని జంపిన వాఁడు' అను రీతిని వాఁడుట ద్రావిడ సంప్రదాయము. ఇందు 'చంపెను' అను క్రియ ధాతుజ విశేషణముగను 'వాఁడు' అను తచ్ఛబ్దార్థ రూప కర్తృ కారకము విశేష్యముగను నిల్చెను. ఈ విషయమునె "కర్మాదేః కర్తృత్వం। ప్రథమాచ 'న' వర్ణకశ్చ తద్వత్ స్యాత్" (ఆం. చిం.) (చూడు 'వ్యా. సం.' ౨౭౭ విష.) అను చింతామణి సూత్రము వచించుచున్నది. కర్త్రర్థక వాక్యమునఁ గ్రియాపేక్షచేత, నే 'కారక' మునకుఁ బ్రాధాన్యమును వక్త వివక్షించునో యట్టి కారకము విశేష్యమగును. ఆ క్రియ ధాతుజ విశేషణ ముగ నేర్పడును. ఉదా:—'రాముఁడు వాలిని జంపెను' అనుచోఁ గర్తకుఁ బ్రాధాన్యము వివక్షితమైనచో 'వాలిని జంపిన రాముఁడు' అని యేర్పడును. కర్మమునకుఁ బ్రాధాన్యము వివక్షితమైనచో 'రాముఁడు చంపిన వాలి' అని యేర్పడును. వీనిలో మొదటి కర్తృ ప్రాధాన్య వివక్ష గలచోటి ధాతుజ విశేషణము కర్మార్థము నెంతమాత్రము నీయనేరదు. కర్మ ప్రాధాన్య వివక్ష గల చోటి ధాతుజ విశేషణము కర్మార్థమునే యిచ్చును. అట్లయినను నట్టి విశేషణము కర్త్రర్థకముగ నుండుటయు (రాముఁడు చంపిన వాలి). ద్రావిడ భాషా సంప్రదాయము. అట్టియెడల 'రామునిచేఁ జంపఁబడిన వాలి' అని కర్మార్థకముగ నచటి ధాతుజ విశేషణమును వాడినను వాడవచ్చును. ఇట్టి

స్థలములను మాత్రమె (సొన్నదు పోదుమ్=చెప్పినది చాలును) దొరగా రుదాహరించిరి. ఇట్టి యెడలఁ గర్త్రర్థక విశేషణ మర్థవంతము కాదు. రాముఁడు చంపిన వాలి-ఇటఁ జంపినవాఁడు వాలి కాఁడు. రాముఁడు. అట్లయినను 'చంపిన' అనుదాని విశేష్యము 'వాలి' అనునదే. కాన నచటి విశేషణ మాభాస రూపము. "స్యాత్కర్మధార యాభాసః । కర్తృత్వే కారకాశ్రితే" (వికృ. వి. చూడు 'వ్యా. సం.' ౨౭౮ విష).

దొరగా రుదాహరించిన 'సొన్నదు పోదుమ్'=(సొన్న+అదు) (చెప్పినది చాలును') అను తమిళోదాహరణ స్థలముసైతము గర్మమునకుఁ బ్రాధాన్యము వివక్షించిన స్థలమె. నేను దానిని జెప్పితిని=నేను జెప్పినది=నేను దేనిని జెప్పితినో యది. దీనికిఁ గర్మార్థక రూపము నుండును. సొ (చొ) ల్లపట్టదు=(చెప్పఁబడినది).

పయిరీతినే కరణ సంప్రదానాది కారకముల ప్రాధాన్య వివక్షయందును కర్త్రర్థకములు గర్మార్థకములు నగు ధాతుజ విశేషణము లేర్పడును. కరణ ప్రాధాన్యము.—రాముఁడు కోలచే వాలిని జంపెను=రాముఁడు వాలిని జంపిన కోల=రామునిచే వాలి చంపఁబడిన కోల. అధికరణ ప్రాధాన్యము:—రాముఁడు విస్తరియం దన్నమును దినెను=రాముఁ డన్నమును దినిన విస్తరి=రామునిచే నన్నము తినఁబడిన విస్తరి. ఇట్టి స్థలములందెల్ల విశేషణ మాభాస రూపము. పై వాక్యమునఁ దినినది (లేదా) తినఁబడినది విస్తరికాదు. తినిన వాఁడు రాముఁడు. దొరగారు భూతార్థమందె యని వ్రాసిరిగాని యది సరి కాదు. ఉదా:—దేవుఁడు ప్రజలను రక్షించును=ప్రజలను రక్షించునట్టి దేవుఁడు. నన్నయనాఁటికి 'ఏ' అను సర్వనామమునకుఁ దెల్గున యచ్ఛబ్దార్థము తఱచయ్యెను. తన్కాలమున యత్తచ్ఛబ్దాన్వయముసైతము దెల్గున విస్తరించెను. క. ఏయది హృద్య మపూర్వం । బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం । బైయుండు నఘనిబర్హ్మా । మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్ (భార. ఆది. ౧ ఆ. ౩౦ ప).

ద్రావిడ భాషా సంప్రదాయములు పైరీతి నుండఁగా 'ఆం. భా. వి.' కర్తగారు "III. కర్త్రర్థరూపమునే వాడి సందర్భమునుబట్టి యర్థావగతి చేసికొనుట. (ఉదా)—నీవు చేసినపని=నీచే చేయఁబడినపని. (ఆం. భా. వి. ౫౬౬ పుట)." అని వ్రాసిరి. ఈ యర్థమున 'పనిని జేసిన నీవు' అను రీతిని వక్తృవివక్షావశమున వాక్య మేర్పడునపుడు 'పనిని జేయఁబడిన నీవు' అను రీతి నసంగతముగాఁ గర్మార్థము వాచ్యమగునని యంగీకరింతురా?

"పరిసామాన్యముగా ధాతుజ విశేషణముల మూలముననే కరణార్థము

(కర్మణ్యర్థమంట-ఏమి యీ యలుక్సమాసము! 'కర్తరి కర్మణి ప్రయోగములందు' అని ౧౨౫౦ పుటలోఁ బ్రయోగించిరి) తెలుఁగునఁ దెలుపఁబడుచున్నది. నేను చేయుచున్నపని=నాచే చేయఁబడుచున్నపని, నేను చెప్పినమాట=నాచేఁ జెప్పఁబడినమాట. అతఁడు చేయు కార్యము=అతనిచేఁ జేయఁబడు కార్యము. మొ" (ఆం. భా. చ. ౧౨౫౧ పుట). ఇట 'కార్యముచేయు నాతఁడు' అనుచో 'కార్యము చేయఁబడు నాతఁడు' అను రీతి నసంగతముగఁ గర్మార్థము చెప్పఁబడు నందురు కాఁబోలును?

పయిరీతిని గాల్డువెల్లుగారు తీసినదారినే పెక్కు రనుసరించిరి. కాని తొల్కాప్పియమునాఁటికే ద్రావిడభాషలలోఁ గర్మార్థకప్రయోగము విస్తరిల్లి యుండఁగా (చూడు ౧౨౮ I విష.) నిట్టి వ్రాఁతలు కేవలము సత్యవిదూరము లనుటకు సందియము లేదుగదా.

తుళు భాషయందును 'నిన్ను నీచదృష్టిని జూచినవాఁడు వాఁడు' అను కర్త్రర్థక వాక్యముచేతనే వక్తృతాత్పర్యసిద్ధి కల్గుచుండఁగా నట్టి వాక్యమందలి పదములకు దొరగారు లేనిశక్తిని గల్పించి కర్మార్థకత్వ కల్పనము చేయుటేలకో తెలియకున్నది.

౧౨౮. IV విష:—(౪)" 'తిను' అను నర్థముగల 'ఉణ్' అను సహాయ క్రియ చేరుటచేత ద్రావిడభాషలలోఁ గర్మార్థక రూప మేర్పడును. అట్టి క్రియ నామవాచకములకుఁ గాని ప్రాతిపదికములకుఁ గాని (Substantive) క్రియా నామములకుఁ గాని పరముగాఁ జేర్పఁబడును. క్రియారూపములకుఁ జేర్పఁ బడదు. ఉదా:—తమి:—అడి ఉణ్డాన్=(దెబ్బ తినెను=కొట్టఁబడెను). పడైప్పు ఉణ్డేన్=(సృష్టిని దింటిని=సృజింపఁబడితిని). గౌడభాషలందును నీ విచిత్ర సంప్రదాయము గలదు (చూడు ౧౨౮ III విష). కాని వానియందు 'తిను' అను నర్థమును దెల్పునది 'ఉణ్' ధాతు భిన్నము. అట్లయినను సంప్రదాయ మభిన్నము. చీనా భాషయందును నీ విచిత్రసంప్రదాయముగలదు. అందును దెబ్బ దినుట యనఁగా దెబ్బపడుటయె" (కాల్డు. ౪౬౬ పుట).

(౫) "సంస్కరింపఁబడిన ద్రావిడభాష లన్నిటిలోను (తుళు భాష యందుఁ దప్ప) దుమర్థక క్రియారూపమునకుఁ (Infinitive) బరముగా 'అనుభవించు' అను నర్థముగల 'పడు' అను సహాయక్రియ చేరుటవలనఁ గర్మార్థక రూప మేర్పడును. ఉదా:—తమి - కొల్లప్పట్టాన్=(చావు ననుభవించెను=చంపఁబడెను). ఈ పడు ధాతువు గుణనామ వాచకములకుఁ (లేదా-అవస్థార్థక ములకు) బరముగా సైతము చేర్పఁబడును. ఉదా:—వెట్కప్పట్టాన్=(సిగ్గు ననుభవించెను=సిగ్గు పడెను). కొన్ని యెడల భావార్థక (Infinitive) నామవాచక మునకు బదులుగా ధాతుమాత్రముపై 'పడు' ధాతు రూపములు చేర్చఁబడును.

ఉదా:—తమి:—'అడిక్క-ప్పట్టాన్' అనుదానికి బదులుగా 'అడిపట్టాన్'=(దెబ్బ యనుభవించెను=కొట్టఁబడెను) అని యుండును. ఇట్టియెడల భావార్థకఘటిత రూపముకంటె ధాతుమాత్ర ఘటితరూపమె సంప్రదాయ సిద్ధము" (కాల్డు. ౨౯౯, ౨౯౭ పుటలు).

"పయిరీతిని భావార్థక రూపముతోఁగాని (అడిక్క-ప్పట్టాన్=అడిపట్టాన్) గుణనామవాచక రూపముతోఁగాని (వెట్క-ప్పట్టాన్) కూడిన 'పడు' ధాతు సమాస రూపమును గర్మార్థక మనుటకంటె వాక్యఖండమనుటయె యుక్తము. గ్రాంథికభాషా విదు లిట్టివాని నరుదుగా వాడుదురేమో? సంప్రదాయ విదులు కర్మార్థబోధమున కితరమార్గముల నవలంబింతురు. తఱచుగా సకర్మక కర్త్రర్థక క్రియలకేకాక యమహత్క-ర్తృ కాకర్మకములకుఁ బరముగా సైతము 'పడు' ధాతువు చేర్పఁబడుట గలదు. కాని యకర్మకమె కర్మార్థమును బోధించు చుండఁగా (చూడు ౧-౨౮ I, II విభ.) మఱొక కర్మార్థబోధక సహాయక్రియను జేర్చుటలో విశేషమే ముండును? తమి-'తెరియుమ్'=(తోఁచును=తోఁచఁ గలదు) అను కర్త్రర్థకరూపమునకును 'తెరియప్పడుమ్'=(తోఁచఁబడును) అను దానికిని భేదములేదు. తెలుఁగునందును 'తెలుసును=తెలియఁబడును' అనునవి యభిన్నార్థకములె. వ్యవహారమున 'పడు' ధాతువు కర్మార్థబోధకమనుటకంటెఁ గ్రియయొక్క తాత్కాలిక వ్యాపార పరిసమాప్తిని దెల్పుననుట లెస్స. ఉదా:— తమి-'ఇరుక్కిఱు'=(ఉన్నది) అనుదానికి బదులుగా 'ఇరుక్క-పట్టు' అనునది గ్రామ్యభాషలో నుపయోగింపఁ బడుచున్నది. ద్రావిడభాషలలోఁ గర్మార్థకము లనఁదగినవి లేవు. కావుననే 'పడు' అనుదానిని విరివిగా నుపయోగించు పద్ధతి యాయా భాషలలో నొప్పిదమై యుండలేదు. కర్మార్థమున 'పడు' ధాతువును సహాయ క్రియగాఁ బ్రయోగించుట ద్రావిడ భాషలందాఱితేరిన వారికిఁ గర్ణ కఠోరముగా నుండును. నామములతోఁ గలసినపుడే దాని ప్రయోగము శ్రావ్యమైయుండును" (కాల్డు. ౨౯౭ పుట).

విమర్శము:—'ఉణ్=తిను'= (అనుభవించు) అను సహాయ క్రియలు 'పడు'=(పొందు) అనుదాని పోలిక నేర్పడినవే యనవచ్చును. ఇట్టి వాడుకలు ప్రాచీనములు కావు. అర్వాచీనపు తమిళ వ్యవహారగతములు. తమిళములో మాత్రములో వెలసియున్న యిట్టి వాడుకలు ద్రావిడ భాషలందెల్లఁ గలవని దొరగారు వ్రాయుట సత్యవిదూరము. ఇట్టి దొరగారి వ్రాఁతల నాధారముగాఁ గొని కావలయును 'ఆం. భా. చ.' కర్తగారును 'ఆం. భా. వి.' కర్తగారును నీ క్రింది రీతిని వ్రాయఁ గడంగిరి. 'దెబ్బలు తిను - దెబ్బలు పడు - మునిగి పోవు - చల్లనగు - మొదలగు పలుకుబడులవలనను కర్మణి ప్రయోగము (అప శబ్దము) వలన కలుగు నర్థము సిద్ధించును" (ఆం. భా. చ. ౧-౨౫౧ పుట).

"ద్రావిడ భాషలలో తెనుగున కర్మార్థమును జెప్పు పద్ధతులు:—

... ... ... ... ... ...

IV. కృదంతరూపములతో, 'అనుభవించు'తో సమానార్థకములగు క్రియలను బ్రయోగించుట. తిట్లు తింటివి. మాటలు పడితిని. 'శిక్ష' అనుభవించితిని" (ఆం. భా. వి. ౫౯౭ పుట). ఇట్టి వాక్యములవలనఁ గర్మార్థము వాచ్యమగుననుట వింతగ నున్నది. ఇందలి క్రియచేఁ గర్త యభిహితమగుచున్న దేకాని కర్మ మభిహితము కాలేదుగదా. ఇవి కర్మార్థక వాక్యము లెట్లగును? (చూడు ౧౨౮ I విష).

తమి-కాల్డువెల్లుగా రుదాహరించిన "అడిఉణ్డాన్=(దెబ్బతినెను) పశైప్పు ఉణ్డేన్=(సృష్టిని దింటిని)" అను వాక్యములు గర్మార్థమును జెప్పుచున్నవని యంగీకరింపనేల? అందును గ్రియచేఁ గర్తయే యభిహితమగుచున్నది. కర్త్రర్థక వాక్యముచేతనే వక్తృ తాత్పర్యసిద్ధి గల్గుచున్నది. 'ఉణ్డాన్-ఉణ్డేన్' అనుచోటి యభ్యవహారార్థకమగు 'ఉణ్' ధాతువు లక్షణాశక్తిచే 'ప్రాప్త్యర్థమును' లక్షింపఁ జేయునని యంగీకరించినం జాలును. 'కొల్లప్పట్టాన్' అనురీతి క్రియకు 'చావు ననుభవించెనని యర్థముకాదు. అట్టి యర్థము పర్యవసితమైన నగుఁగాక. దానికొక తృతీయాంత కర్తృపదముతో నన్వయము. ఉదా:— 'ఎన్నాల్ కొల్లపట్టాన్'=(నాచేఁ జంపఁబడెను). 'కొల్ల' అనునది తుమున్నంతము. నామవాచకము కాదు. 'అడిక్కప్పట్టాన్' అనుదానిలోని 'అడిక్క' అనునదియు నామవాచకము కాదు. అదియుఁ దుమున్నాద్యర్థకమె. ("కొల్లల్+పట్టాన్= కొల్లఱ్పట్టాన్=కొల్లపట్టాన్. అడిక్కల్+పట్టాన్" అని ప్రక్రియ సరయునది. 'శ్రీ రెడ్డిగారు') (చూడు ౯౦ XII, ౧౨౨ V విష). తుమున్నంతములలో 'తు' ప్రత్యయము చేరుటచే నది భావార్థక నామవాచక భ్రాంతిని గల్గించుచున్నది. (చూడు ౯౦ XII, విష. ౧౨౧ III విష. ౧౨౨ V విష). తుమున్నాద్యర్థక ఘటితకర్మార్థకవాక్యములలోఁ గర్త్రర్థకతాన్వయ మసంభవముగాన నట్టియెడల నచటి తుమున్నంతపూర్వక 'పడు' ధాతు వొక జంటగాఁ గర్మార్థక క్రియఁగా నంగీకరింపక తీరదు (చూడు ౧౨౮ I విష). అందలి కర్త తృతీయాంతమయియే యుండక తీరదు. అట్టి జంటయగు క్రియచేఁ గర్మమె యభిహితమగును గాని కర్త యభిహితము కాదు. 'వెట్కప్పట్టాన్'=(సిగ్గుపడెను) అనురీతి వాక్యములలోఁ బై పద్ధతి లేదుగాన నట్టివి కర్త్రర్థకములె యని కాల్డువెల్లుగారే యంగీకరించిరి.

కర్మార్థమున 'పడు' ధాతువు నుపయోగించుటకుఁ దొల్కాప్పియరే యిష్టపడెను. ఆతడు తమిళమునం దాటితేటినవాఁడగునో కాఁడో దొరగారే నిర్ణయింతురుగాక.

౧౨౫౫. విష.—"(౭) ఆత్మనేపదులు=(Middle voice)—ఏ ద్రావిడ భాషయందును నిజమగు 'ఆత్మనేపది' అనఁదగు ధాతువు లేదు. దాని యర్థమునందు, తమి-'కొళ్' అను ధాతువును, తెల్గు-'కొను' ధాతువును, తుళు-'కొణు-ఒణు' అను ధాతువును, నుపయోగింపఁబడును. ఉదా:—తమి-పణ్ణికొణ్డేన్=(చేసికొంటిని). (తమి-పణ్ణు=తెల్గు-పన్ను=చేయు. ధాతువు). దీనికి 'చేసితిని'=(కొంటిని) అనునది యధాశ్రుతార్థము. అన్యోన్యార్థమందును నీ క్రియకు వాడుక గలదు. ఉదా:—తమి:-పేసికొణ్డార్గళ్ = (పరస్పరమును మాటలాడుకొనిరి). అడిత్తుకొణ్డార్గళ్=(ఒండొరులను గొట్టికొనిరి). ఇట్లె తక్కిన ద్రావిడ భాషలందును దీని వాడుక కానుపించును" (కాల్డు. ౪౫౭ పుట).

విమర్శము:—తిఙ్ఙుల భేదముచే సంస్కృతమున నాత్మనేపది ధాతువుల భేదము విశదమగును. ఈ విషయము ౧౨౫౧ I విషయమున వివరింపఁబడుట చేత నిటఁ బునరుక్తము చేయలేదు.

౧౨౫౬. I విష:—"వ్యతిరేకార్థకములు=(Negative voice)-వ్యతిరేకార్థక చిహ్నమును జేర్చుట సిథియను భాషా స్వభావము. ఇది జపాను భాషయందును గలదు. ఇండో యూరపియను భాషలలో వ్యతిరేకార్థ మొక ప్రత్యేక శబ్దముచేతఁ దెల్పఁబడును. ఉదా:—స్వార్థము:—అస్తి = (కలదు) వ్యతిరేకార్థకము:—నాస్తి=(లేదు). 'టర్కి-షు-ఫిన్నిషు' మున్నగు సిథియను భాషలందువలెనె ద్రావిడ భాషలందును, గ్రియా రూపమునకును బురుష బోధక ప్రత్యయమునకును నడుమ వ్యతిరేకార్థక చిహ్నము చేర్పఁబడును. వేర్వేఱు భాషలందు వేర్వేఱు వ్యతిరేకార్థక ప్రత్యయములు చేర్పఁబడును. సాధారణముగా ద్రావిడ వ్యతిరేక క్రియలకుఁ గాల విశేష బోధక ప్రత్యయ యోగము లేదు. అవి తద్ధర్మార్థకములవలెనె కాలత్రయ బోధకము లగును. ఉదా:—తమి-పోగేన్. కన్నడ-పోగెం. తెల్గు-పోవను. దీని కాలత్రయ బోధము:—భూత-వ్యతి:—నేను బోలేదు. వర్త. వ్యతి:—నేను బోవుచుండుట లేదు. భావి-వ్యతి:—ఇఁక ముందు నేను బోవను. 'ఈ' భాషయందుఁ బైరీతిగల వ్యతిరేక రూపము లుండుటయేకాక భూత వ్యతిరేక రూపములు ప్రత్యేకముగఁ గలవు. తుళు గోండు భాషలందుఁ గాలత్రయ వ్యతిరేక క్రియా రూపములు వేర్వేఱుగఁ గలవు. మలయాళమందును గాలత్రయ బోధక వ్యతిరేక క్రియా రూపములు వేర్వేఱుగఁ గలవు. మల-ఉదా:—వర్త-వ్యతి:—పోగా(య్)+ఉన్న=(నేను బోవుచుండుట లేదు). భూత-వ్యతి:—పోగాఞ్ఞు = (పోలేదు). భావి-వ్యతి:—పోగా(య్)+ఉమ్ = (ఇఁక ముందుఁ బోవను). (పోగా=ఇఁకముందుఁ బోవను. "చూడు—కేరళపాణినీయ—౨౭౪, ౨౭౫ పుటలు. చెయ్యా=ముందుఁ జేయను"

శ్రీ రెడ్డిగారు). ద్రావిడ భాషలలో భావార్థకములును విధ్యాద్యర్థకములును శిష్ట గ్రంథములందుఁ గాన్పించును. అట్టి రూపములలో వ్యతిరేకార్థక క్రియా జన్య విశేషణాదికములకు వేఱొక ధాతువుయొక్క భావార్థకాది రూపముల మేళనముండును. ఉదా:—తమి. చెయ్యాదు ఇరు=చేయక యుండుము=చేయనివాఁడవై యుండుము=చేయకుము). తెలుఁగునందు వ్యతిరేక విధ్యాద్యర్థక రూపములు సామాన్యముగా వ్యవహారమందును (Colloquial) గలవు.

ఈ ద్రావిడ వ్యతిరేక క్రియా రూపములలో ధాతు రూపమందుఁ గాని పురుష బోధక ప్రత్యయ రూపములందుఁగాని స్వార్థబోధక రూపములకన్న మార్పేమియుఁ గల్గదు" (కాల్డు. ౪౬౮, ౪౬౯ పుటలు).

"తమిఱ కన్నడాంధ్రములు మూఁడిటియందును వ్యతిరేకార్థక క్రియలలోఁ గాల విశేష బోధక ప్రత్యయ మేదియుఁ జేరదు. తమిఱ కన్నడములలోఁ బురుష బోధక ప్రత్యయములు మాత్రము ధాతువు తుదిని నిల్చును. ఉదా:—తమి-'వాళ్'=(వృద్ధిపొందు-ధాతువు.) వాళేన్=(వాళ్+ఏన్=(ఉత్తమైకవచనము) దీనికిఁ గాలత్రయ వ్యతిరేకార్థములును గలవు. అనఁగా 'వాళ్న్దేన్ (భూత), వాళ్గిఱేన్-(వర్త), వాళ్వేన్-భావి' అను మూఁడు కాలముల వ్యతిరేకమును 'వాళేన్' అను రూపము తెల్పును. 'వృద్ధిపొందను' అని దీని యర్థము, కాలిక చిహ్నముల లేమిచే న్యాయముగా నిది "వృద్ధి పొందుదును" అను నర్థము నీయవలసి యుండును.

కాలిక చిహ్నము లెవ్వియు లేమింజేసి ధాత్వర్థ స్థితి దూరాపాస్తమగుటచేత దాని కభావార్థ మనఁగా వ్యతిరేకార్థము సంభవించె ననఁదగును. అట్లగుటచేత నచట వ్యతిరేకార్థ భానమునకుఁ బ్రత్యయాంతర మేళన మనావశ్యకమయ్యె ననఁదగును. తమిఱ కన్నడములలో వ్యతిరేక చిహ్నమే లేమింజేసి వాని విషయమునఁ బై యుక్తి సరిపడి యుండును. ఈ రెండు భాషలందు సైతము కొన్ని యసమాపక క్రియా రూపములందు 'అ' అను వ్యతిరేక చిహ్నము చూపట్టుచున్నను నింకేదేని విశ్వసనీయమగు నిదర్శనము లభించువఱకును 'అ' అనునది వ్యతిరేక ప్రత్యయ మనుటకు బలము చాలదు.

తమిఱ వ్యతిరేక క్రియలలోఁ బురుష బోధక ప్రత్యయములకు బూర్వముగ దీర్ఘాకారము గన్పట్టుచున్నది. ఉదా:—తమి-'వాళ్+అదు=వాళదు'=(వృద్ధిపొందదు) అని యుండవలసి యుండఁగా 'వాళాదు=వాళా' అను రూపములు ప్రసిద్ధమై యున్నవి. కాని యిట్టి దీర్ఘము శ్రుతి సౌకుమార్యమునకును గ్రియార్థ దార్ఢ్యమునకును వచ్చినదనుట సహజమును యుక్తమును ననవచ్చును. 'వాళాదు' అను తమిఱ రూపమునకు సరియగు కన్నడ రూపము 'బాళదు' (ఇది

హళెగన్నడ రూపము. పలగన్నడ రూపమన్ననో 'బాలదు' అనునది.) అని హ్రస్వ ఘటితముగనే యుండును. ఇట్టి స్థితి స్థలాంతరములందును గలదు:— కన్నడ-బాళదె=(వృద్ధిపొందక) (ఇది హళెగన్నడ రూపము. పలగన్నడ రూపమన్ననో 'బాలదు' అనునది). దీనికి సరియగు తమిళ రూపము 'వాళాదు= వాళామల్' అనునవి. క్రియా నామవాచకము—తమి:—వాళామై=(వృద్ధి లేమి). ధాతుజ విశేషణము-కన్నడ:—బాళద (ఇది హళెగన్నడ రూపము. పలగన్నడ రూపము 'బాలద' అనునది)=(వృద్ధిపొందిన=బ్రదికిన-బ్రదుకని). దీనికి సరియగు తమిళ రూపము:—వాళాద. పయి యుదాహృతుల వరయఁగాఁ గన్నడ రూపములలోని హ్రస్వమగు 'అ' కార ముచ్చారణార్థకము కాదనియుఁ (ఉచ్చారణార్థకమె యైనచో 'ఉ' కార ముండియుండును) దమిళ మలయాళ ములలోని దీర్ఘాకారము మాత్ర ముచ్చారణ సౌకర్యార్థకమనిన నవచ్చు ననియుఁ దోఁచును" (కాల్డు. ౪౬౯, ౪౭౦ పుటలు).

" 'అ' అనునది వ్యతిరేక చిహ్నమనుటకుఁ దెలుఁగు రూపములు ప్రబల నిదర్శనములై యున్నవి. తెల్గున వ్యతిరేకార్థక పురుష బోధక ప్రత్యయములును వర్తమానార్థక పురుష బోధక ప్రత్యయములును నభిన్నములు. తమిళ కన్నడ పురుష బోధక ప్రత్యయము లజాదులై యుండఁగాఁ దెలుఁగు ప్రత్యయములు హలాదులై యున్నవి. తెల్గు ధాతువులెల్ల 'ఉ' కారాంతములు. పై కారణముల చేత 'చేయను' మున్నగు తెల్గు వ్యతిరేక రూపములలో ధాతువునకుఁ బర ముగాఁ బురుష బోధక ప్రత్యయములు నిల్చునపుడు వాని నడుమ 'అ' అను వ్యతిరేకార్థక ప్రత్యయము నిల్చుచున్నదనక తీరదు. తెల్గునందలి "చేయను, చేయవు, చేయము, చేయరు" అనువానిని వరుసగాఁ దమిళమందలి "చె (సె) య్యేన్, చె (సె) య్యాయ్, చె (సె) య్యామ్, చె (సె) య్యార్" అను రూప ములతో సరిపోల్చి చూచినచోఁ బై విషయము స్పష్టమగును. తెల్గునందలి 'చేయక' అను వ్యతిరేకక్త్వార్థకము నందును, 'చేయని' అను వ్యతిరేకార్థక ధాతుజ విశేషణమునందును 'చేయమి' అను వ్యతిరేకార్థక క్రియా నామవాచ కము నందును గల వ్యతిరేకార్థకమగు 'అ' ప్రత్యయము కన్నడమందును గలదు, తమిళమున నిది శ్రుతి సుఖార్థకమగు 'ఆ' అను దీర్ఘ రూపముతో వెలయుచున్నది.

తెల్గున 'నేను బోను-నీవు పోవు' మున్నగు చోటులందు వ్యతిరేకార్థక మగు 'అ' ప్రత్యయము లేదనుట నిజమె కాని వాని యందలి 'అ' ప్రత్యయా భావ మాభాస రూపము. 'పోవను-పోవవు' అనెడి వాని గ్రాంధిక వ్యతిరేక రూపములందు 'అ' ప్రత్యయము వెలయుచునే యున్నది. అశ్లె (నేను) 'కాను'

అనునది తమిటమందలి 'ఆగేన్'=(అగను=అకను) అనుదానినుండి వర్ణ ప్రత్యయ పరిణామ పద్ధతి నేర్పడినది. కాన ద్రావిడ వ్యతిరేకార్థ ప్రత్యయము 'అ' అనునదే యని పర్యవసిత మగుచున్నది." (అనుబంధము).

"తెల్గునందలి వ్యతిరేకరూపము లన్నిటియందును దమిట కన్నడము లందలి ధాతుజరూపములందును గల పైస్థితినరయఁగా ద్రావిడభాష లన్నిటికిని 'అ' అనెడి వ్యతిరేకార్థక ప్రత్యయ మొకప్పుడు సమాన సంపదగా నుండెడిదని తోఁచును. తమిటమునం బురుషబోధక ప్రత్యయముల ముందటి వ్యతిరేక ప్రత్యయము శ్రుతిసుఖార్థముగ దీర్ఘాకారరూపమున నుండుట యిందులకు నిదర్శనమనవచ్చును. కన్నడమందలి పురుషబోధక ప్రత్యయాద్యచ్చులు వ్యతిరేకార్థమగు 'అ' ప్రత్యయస్థానమున నిల్చుటచేత నయ్యది యట్టి యచ్చు లందు లీనమైపోయినదని యెన్నగును" (కాల్డు ౪౭౦, ౪౭౧ పుటలు).

విమర్శము:—ద్రావిడభాషలందు వ్యతిరేకార్థక ప్రత్యయము 'అ' అనునదె యనియుఁ దమిట మలయాళములలో నయ్యది దీర్ఘాకారమున నుండు ననియుఁ గన్నడమున నట్టి 'అ' ప్రత్యయము పురుషబోధక ప్రత్యయాద్యచ్చుల సంధిలో లోపించినదనియు నలంతివాక్యములతోఁ జెప్పవలసిన యీ విషయము నూరకయె కాల్డువెల్లుగారు పెంచి మిక్కిలి గ్రంథవిస్తరము గావించిరి. తుది కెట్లును ద్రావిడభాషలందు 'అ' అనునదె వ్యతిరేకార్థకప్రత్యయమని యంగీక రించు దొరగా రట్టి వాదమునకు బలము చాలదనుచుఁ గొందలు ప్రాచ్య పండితుల శాస్త్రవాదమందువలెఁ బూర్వపక్షపు యుక్తుల నూరకయె పెంచుటేలొకో తెలియకున్నది. తమిటమున 'ఆ' అను దీర్ఘాకారరూపముగ వ్యతిరేకార్థక ప్రత్యయము గన్పట్టుచునేయున్నది. "తస్మాదమరయిరెనెవవో విభక్తయః" (కర్ణా. భూ. ౧౬౪ సూ.)="ధాతువునకుఁ బరముగ 'అమ్-అర్; అయ్-ఇర్;

అనుబంధము ౧౨౬ I విష:—"ప్రాచీన ధాతు రూపములపై 'అ' కారాగమము లేకయే వ్యతిరేకార్థక రూపము లేర్పడు ప్రణాళిక యుండెడిది" (ఆం. భా. వి. ౫౬౩ పుట).

"పయిరీతిని సరిచూచుటవలన నేర్పడిన సిద్ధాంతము:—I. తెనుఁగునందువలె 'అ' కారము వ్యతిరేకార్థమున ప్రాచీన ద్రావిడ భాషలో నుండినదియే.........

III. స్వార్థ వ్యతిరేకార్థములయందు రెంటను ఒకటే రీతిని రూపములు ఏర్పడుచుండుట కాలక్రమమున నశించినది. (ప్రాచీన కాలమున నుండెడిదని భావము) తెనుఁగున అల్పముగ కొన్ని రూపములు మాత్రము నిల్చినవి." (ఆం. భా. వి. ౫౬౪ పుట).

పయినున్న I. III. విషయములు పరస్పర విరుద్ధములు కావా! తెలుఁగునందు స్వార్థ వ్యతిరేకార్థకములు రెంటను నభిన్న రూప మొక్కటేని యెన్నఁడేని కలదా? 'ఈని-పోని-పోక' మున్నగు వ్యతిరేకార్థముల కెన్నఁడేని వ్యతిరేకత లేని స్వార్థము గలదా? అవి వ్యతిరేకార్థక మాత్రములు కావా? 'ఈయని-పోవని-పోవక' అను 'అ' ప్రత్యయ ఘటిత రూపములును గలవనియు నవి యెన్నడును స్వార్థ బోధకములు కావనియు నెఱుంగనగును.

ఎన్-ఎవు' అను పురుషబోధక ప్రత్యయములు నిల్చును'' అనుచెప్పునఁ గన్నడ మందుఁ దమిళమందునవలెనె యున్న యజాది పురుషబోధక ప్రత్యయములతోడి సంధిలో లోపించి యగపడనంతమాత్రమున నింత చర్చ చేయవలయునా? ఇట్లు సంధిలో వ్యతిరేకప్రత్యయ స్వరూపనాశనము గల్గు కారణముచేతనే కొన్ని యెడలనైన స్పష్టముగాఁ గనఁబడుటకుఁ గావలయుఁ దమిళమున దీర్ఘాకార రూపము బయల్వెడలెను. 'అ-ఆ' అనునవి రెండును నఞర్థకములె కదా (చూడుఁ ౨౯ IX విభ). కన్నడమునఁ గాల్డువెల్లుగారు శబ్ద తత్వశాస్త్రపద్ధతి చొప్పున, వ్యతిరేకార్థకమగు 'అ' ప్రత్యయస్థితి నంగీకరించి దానికి లోపము నూహించిరే కాని ప్రాచీన కర్ణాట వ్యాకర్తలు ''ఉన్నదన నేల? లోపమును విధింప నేల?'' అని ప్రక్రియా గౌరవమును సహింపక కన్నడమున వ్యతిరేకప్రత్యయమునే విధించుట మానిరి.

''నైవం నఞర్థే'' (కర్ణా. భూ. ౧౯౭ సూ.)—వ్యతిరేకార్థమునందుఁ బై రీతి గల యర్థ విశేషబోధక ప్రత్యయ మెద్దియు నిల్వదు. ధాతువుపైని గేవలముగఁ బురుషబోధక ప్రత్యయము మాత్రము నిల్చును. ఉదా:—కన్న.—మాడు= చేయు-(ధాతువు) ప్రథమపురుష-మాడం-మాడర్; మధ్య-మాడయ్-మాడిర్. ఉత్త-మాడెన్-మాడెవు. మొ.

పయిరీతిని వ్యాకర్తలు కన్నడమునన్న వ్యతిరేక ప్రత్యయమును విధింపమిచేతనే యమహాత్కర్తృక స్థలములందు ''మాడుదు-మాడువు'' అని సిద్ధించుచున్న యనిష్టరూపముల వారించుకొనుటకై క్రిందిరీతిని సూత్రింప వలసినవారైరి.

''ఓ రత్ ప్రతిషేధే'' (కర్ణాట శబ్దా-౨౬౦ సూ.)=''ధాతోః పరస్య 'ఉదు-ఉవు' ఇత్యేతయోః 'ఉ' కారస్య 'అ'కారాదేశోభవతి. ప్రతిషేధేగమ్య మానే'' ప్రయోగః:—పాడదు గిళి=(చిలుక పాడదు=పఠింపదు) పాడవు గిళి గళ్=(చిలుకలు పఠింపవు).

వ్యతిరేకేతర స్వార్థమందన్ననో ''పాడిదుదు=(అది పఠించినది.) పాడిదువు=(అవి పఠించినవి)'' అనురీతిని గన్నడామహాత్కర్తృక ప్రథమ పురుష బోధక ప్రత్యయములగు 'ఉదు-ఉవు' అనునవే నిల్చును.

''ఉదు ఉవు నపి'' (కర్ణా. భూ. ౨౦౫ సూ.)=అమహాత్కర్తృకత్వము నందుఁ బ్రథమపురుషైక వచనమున 'ఉదు' అనియు బహువచనమున 'ఉవు' అనియు నగును. ఉదా:—''ఆదుదు=(అయినది). ఆదువు=(అయినవి)''.

పయిరీతినె వ్యతిరేకస్వార్థక ప్రత్యయము 'ద్+ఉ=దు' అని యుండ వలసియుండఁగా వ్యతిరేకార్థకమగు 'అ' ప్రత్యయము పూర్వమందు నిల్చిన

'అదె' అను ప్రత్యయము వ్యతిరేక క్త్వా ప్రత్యయముగఁ గన్నడమున విధింపఁ బడినది.

'అదెత్ ప్రతిషేధే' (కర్ణాటక శబ్దా-౫౮౨ సూ.)=ఉత్తరకాలక్రియ యాసహ సమానకర్తృకాత్ పూర్వకాలే అర్థే వర్తమానా ద్ధాతోః 'అదెత్' ప్రత్యయోభవతి ప్రతిషేధే గమ్యమానే-ప్రయోగః-మాడదెపోదం=(చేయక పోయెను..................."

౧౨౬. II విష:—"తమిళమందలి 'ఇల్లై' అనుదానిని గన్నడ మలయాళములందలి 'ఇల్ల' అనుదానిని దుళుభాషలోని 'ఇజ్జి' అను వ్యతిరేకప్రత్యయము పోలుచున్నది. తుళుభాషలోని వ్యతిరేకార్థక సమాపకక్రియ లనేకములు, 'ఇజ్జి' అనుదాని సంక్షేప రూపమగు 'జ్' అనునది శ్రుతి సుఖకరాచ్చులతోఁ జేరి ధాతు రూపములను జేరుటవలన నేర్పడును. వ్యతిరేక భావ్యర్థకరూపము మాత్ర మితర భాషలందువలె 'అ' అను వ్యతిరేకప్రత్యయముతోఁ గూడి యుండును. ఉదా:—తుళు-మళ్పొజి = (నేను జేయను). మళ్త్దిజి= (నేను జేయలేదు.) మళ్పయె=(నేనిఁకముందుఁ జేయను). మళ్త్ద్వయె= (నేను జేయరాదు). గోండు భాషయందు 'హిల్లె-హల్లె' (ద్రావిడ-ఇల్లె-అల్లె) అను వ్యతిరేకరూపములు సంక్షేపింపఁబడకయె ధాతువునకును బురుషబోధక ప్రత్యయమునకును నడుమ నిల్చును. ఇట్టి మోటురూపములు మిక్కిలి ప్రాచీనములనుటకు సందియము లేదు. తమిళ కవులు 'అల్' అనుదాని నప్పు డప్పుడు వాడుచుందురు" (కాల్డు. ౪౭౧ పుట).

౧౨౬. III విష:—"తమిళమున 'ఆదు-ఆమల్' అనువానిని ధాతువు తుదిని జేర్చుటచేత వ్యతిరేకక్త్వార్థక రూపము లేర్పడుచున్నవి. ఉదా:— చె(సె)య్యాదు=చె(సె)య్యామల్=(చేయక). గ్రామ్య తమిళమందును గ్రాంథిక తమిళమందును 'మల్' అనుదానికి బదులుగా 'మై' అనునదియు వాడఁబడుచున్నది. ఉదా:—వటువామై=(జాఱక). ఇట్టియెడల లకారము నిర్హేతుకముగాఁ జేరినదనుటకంటె లోపించినదనుట యుక్తముగాన 'మల్' అను నదె 'మై' అనుదానికన్నఁ బ్రాచీనతరమనుట యుక్తమేమో? తెలుగునందలి వ్యతిరేక భావార్థకమగు 'మి' ప్రత్యయము తమిళ 'మై' ప్రత్యయమున కభిన్న మనఁదగును. తమిళమందును 'మై' ప్రత్యయము భావార్థమునందు నిల్చు టయుఁ గలదు. ఇది తమిళమునఁ గేవల ధాతువుల తుదిని, ధాతుజ విశేషణ ముల తుదిని గాన్పించుచుండును. ఉదా:—తమి:—తాల్మై=(అడఁకువ). ఇరుక్కి-న్ఱ(న్ద్ర)మై=(ఉండుట=స్థితి). తమిళమున 'దు' అనునది మఱొక వ్యతిరేక క్త్వా ప్రత్యయము. ఇదియును దమిళమున గుణవాచకములగు నమహా

న్నామవాచకరూపముల సాధనమునఁ గన్పట్టుచున్నది. తమిళ వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయమగు నీ 'దు' అనుదానికి సరియగు కన్నడ ప్రత్యయము 'దె' అనునది. ఈ తమిళ 'దు' ప్రత్యయముపైని 'ఏ' అనుదానిని జేర్చుటచేతఁ దమిళ వ్యతిరేక విధ్యర్థకరూప మేర్పడుచున్నది. ఉదా:—తమి-చె(సె)య్యాదే=(నీవు చేయకుము). ఇట్టి స్థితియే 'దు-దె' మున్నగు వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయములు వాస్తవముగఁ గ్రియానామవాచక ప్రత్యయములె యనుటకు సాధక మగుచున్నది. ఆంధ్రేతర ద్రావిడ భాషలందలి 'దు' అను వ్యతిరేకక్త్వా ప్రత్యయముమీఁది 'ఉ' కారమును దొలఁగించి దానిచోట యత్తత్సంబంధార్థక విశేషణ ప్రత్యయమగు 'అ' అనుదానిని నిల్చుటచేత వ్యతిరేకార్థక విశేషణ మేర్పడుచున్నది. ఉదా:—తమి—చె(సె)య్యాద=కన్నడ—గేయద=(చేయని యట్టి). తెలుఁగునందు మాత్రము వ్యతిరేకార్థకమగు 'అ' ప్రత్యయమునకు బరముగ యత్తత్సంబంధార్థక విశేషణ ప్రత్యయమగు 'అ' అనుదానికి బదులుగ 'ని' అనుదానిని నిల్పుటచేత నాంధ్ర వ్యతిరేకార్థక విశేషణ మేర్పడును. ఉదా:—చేయని. ఈ 'ని' ప్రత్యయము 'సుప్పుల' విస్తృతిలో నొకటి. దీనిని సముచ్చయార్థమునందును వాడుదురు. ఈ విషయము ధాతుజ విశేషణ ప్రకరణమున విస్తరింపబడును.

ఎ. డి. కాంప్‌బెల్ దొరగారు తన తెలుఁగు వ్యాకరణమున వ్యతిరేకేతర స్థలమగు తుమర్థకమునకు (Infinitive) 'క' అనుదానిని జేర్చుటచేత వ్యతిరేక క్త్వార్థకరూప మేర్పడుననిరి. అట్లె 'ము-మొ' అనువానికి ముందు 'కు-క' అను వానిని బైరీతిని తుమర్థకమునకుఁ బరముగా నిల్పుటవలన వ్యతిరేక విధ్యర్థక మేర్పడుననిరి. ('క' అనునది యిట్టి యర్థమున నుపయోగింపఁబడదు) డా. ప్టివెన్‌సన్ దొరగారును బై 'కాంప్‌బెల్' దొరగారి యభిప్రాయమునె యనుసరించి 'కు' అనునది తెల్గుప వ్యతిరేక చిహ్నమనుకొనిరి. కాని వీరి యిర్వురి మార్గమును బ్రామాదికమనియు 'క-కు' అనువానికి ముందటి 'అ' అనునది తుమర్థక ప్రత్యయము కాదనియు వ్యతిరేకార్థకమగు 'అ' ప్రత్యయమనియుఁ బైని నేను జూపిన యుదాహృతులెల్ల విశదపఱుపఁజాలును" (కాల్డు. ౪౭౧, ౪౭౨ పుటలు).

"తెల్గులోని 'చేయక-చేయకుము' అను వ్యతిరేకక్త్వార్థక వ్యతిరేక విధ్యర్థక రూపములందలి వ్యతిరేకచిహ్నమగు 'అ' ప్రత్యయమునకుఁ బరముగ నిల్చు 'క-కు' అనునవి తమిళమందలి 'దు-మై-మల్' అనువానికిని గన్నడమందలి 'దె' అనుదానికిని సరియైయున్నవి. అట్టి 'దు' ప్రభృతులు క్త్వార్థ చిహ్నములుగా నుపయోగింపఁబడుచున్నను నవి వాస్తవముగఁ గ్రియానామ వాచక ప్రత్యయములని తలంపనగును. తెల్గులోని 'క' అనునదియు నట్టి

చరిత్రము కలదె యనఁదగును. తెల్గున 'క' అనునది యెన్నియో కృదంతము లందుఁ గన్పట్టుచున్నది. ఉదా:—నమ్ము-నమ్మిక. కోరు-కోరిక. తమిళమున నిది 'క్కై' అనురూపముతో నున్నది. ఉదా:—నమ్బిక్కై=(నమ్మకము). కన్నడమున నిది 'గె-కె' అనురూపములతో నుండును. ఇట్టివె మఱికొన్ని కృత్తులును 'ద్-త్-బ్-ప్' అనునవి మొదటఁగలవి పెక్కుగలవు. తెల్గులోని 'క' కారాంతములగు వ్యతిరేకక్త్వార్థకములకును 'క' కారాంతములగు కృదంతములకును గల భిన్నార్థకత్వము 'క' కారమూలకము కాదు. ఉదా:—తెల్గు-తెలియిక-(తెలియుట) తెలియక=(తెలిసికొనక. వ్య-క్త్వా). 'తెలియక' అనుదానిలోని 'అ' అనెడి వ్యతిరేకార్థక ప్రత్యయమువల్ల వీని కర్థభేదము గల్గినది. కొన్ని స్థలములం దట్టి 'క' కారాంతములు కృదంతములందును వ్యతిరేకక్త్వార్థకములందును నభిన్నార్థకములై యేకాకారమున నుండును. అట్టి చోటులందు వ్యతిరేకార్థకమగు 'అ' అనునది ధాతువులోని 'ఆ' కారములో లీనమైపోవును. ఉదా:—రాక=(వచ్చుట). రాక=(వచ్చుట లేక ఇది వచ్చుధాతువ్యతిరేకక్త్వార్థకము.) ఇందు 'ర+అ+క' అని ఛేదమునెన్నునది" (కాల్డు. ౪౭౨, ౪౭3 పుటలు).

"నీలగిరి కొండలందలి కోతభాషలలోని వ్యతిరేకక్త్వార్థక రూపములందుఁ దెల్గులోని 'క' అనుదానికిఁ దమిళమందలి 'ద్' అనుదానికిని బదులుగా 'ప' కారము కన్పట్టుచున్నది. ఉదా:—కోత-హొగాపె=కన్నడ-హొగదె=తెల్గు-పోవక. ఇట్టి స్థితిచేతఁ గ్రియారూపములయు నామవాచకరూపములయు సాధనమున 'క-ప' లకుఁ బరస్పర పర్యాయస్థితి గలదను నియమము వ్యక్తమగుచున్నది."

"తమిళ-చె(సె)య్యాదే=(చేయకుము) (ఇది 'చెయ్యాది' అను దాని వికృతి. శ్రీ రెడ్డిగారు). అను గ్రామ్యరూపమందలి 'దే' అనునది 'చె(సె)య్యాదు' అను తమిళ వ్యతిరేకక్త్వార్థకమునందలి 'దు' అను దానికి భిన్నముకానట్లె తెల్గునందును 'చేయకుము' అనుదానిలోని 'కు' అనునది 'చేయక' అనుదానిలోని 'క' అనుదానికి భిన్నముకాదని నా యభిప్రాయము. ద్రావిడభాషలలోఁ గృదంతరూపముల నొత్తిపల్కుటచేత విధ్యర్థక రూపములేర్పడును. తమిళ విధ్యర్థకములలోని 'ఏ' అనునది యవధారణార్థకము."

"తెల్గులోని వ్యతిరేకవిధ్యర్థకమగు "చేయకుము" అనుదానిని బోలునది తమిళమందలి 'చె(సె)య్యఱ్క'=(చేయవద్దు) అనునది. ఇట్టి తమిళరూపము మూఁడు పురుషములందును (లింగ) రెండు వచనములందును నేకరీతిగనే యుండును. తెల్గునందలి వ్యతిరేకవిధ్యర్థకరూపము మధ్యమపురుషమునకే

నియతమగుట వ్యవహారవశమునఁ గల్గెనని నా తలంపు. తమిళరూపములందలి 'అక్క' అనునది "అల్+క" అనువాని యోగమున నేర్పడినది. అందలి 'అల్' అనునది వ్యతిరేకప్రత్యయమగు 'అ' అనుదానినుండి యేర్పడినదె. అందలి 'క' అనునది తమిళమందలి యాశీరాద్యర్థక 'క' ప్రత్యయము. ఇట్లు భావార్థకము, వ్యతిరేకక్త్వార్థకము, వ్యతిరేకవిధ్యర్థకము" అనువాని రూపములు మొదటఁ గృత్ప్రత్యయములెయై యుండునని తోఁచుచున్నది" (కాల్డు. ౪౭౩, ౪౭౪ పుటలు).

విమర్శము:—తమిళ వ్యతిరేకక్త్వార్థక రూపములలోని 'మల్-మై' అను ప్రత్యయములలో 'మల్' అనునది ప్రాచీనతరమను దొరగారి యాశయము సరికాదు. 'మై' అను క్త్వార్థక ప్రత్యయము తొల్కాప్పియమునఁ జేర్కొనఁ బడెను. (చూడు 'అన్మైయిన్......' తొల్కా. ౬౫౦ సూ.) 'మల్' అనునది తొల్కాప్పియమునాఁటికి లేదు. 'దు' అనునది తమిళ క్త్వార్థక రూపములందుఁ గన్పట్టుచున్నను సందలి 'ద్=త్' అనునది భూతార్థకము. దాని మీఁది 'ఉ' అనునది మాత్రమె క్త్వార్థకము. కన్నడమందును నిట్లె. కావునఁ దమిళ వ్యతిరేకక్త్వార్థకము 'దు' అనునది యను దొరగారివ్రాఁత సరికాదు. తమిళ కన్నడములందలి "కరిదు=(నల్లనిది) కడిదు=(కఠినమైనది)" మున్నగు గుణనామవాచకాదుల తుదినున్న 'అదు=దు' అనునది సర్వనామ శబ్దసంబంధి. ఇట్టి విభిన్నశబ్దముల నాకారసామ్యమున భ్రమించి యవి యభిన్నములనుచు దొరగారు వ్రాయుట కేవలము భ్రాంతిమూలకము. మఱియుఁ దమిళ వ్యతిరేకక్త్వార్థకము 'ఆ+దు=ఆదు' అనునది. 'దు' అనునదిమాత్రము కాదు. కన్నడ వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయము 'అదె' అనునది. (చూడు ౧-౨౬ I విష). ఇట్టి విభిన్నశబ్దమేళిత వ్యతిరేకక్త్వార్థక ములతోఁ గేవల భిన్నశబ్దమూలకమగు 'చెయ్యాదే' అను నాధునిక వ్యతిరేక విధ్యర్థకరూప మీమెదాకార సామ్యమునుబట్టి యభిన్నమని దొరగారు తలంచు టయు భ్రాంతిమూలకమె. తమిళ గ్రాంథిక విధ్యర్థకరూపము 'చెయ్‌ది'= (చేయుము) అనునది. దీని వ్యతిరేకరూపము 'చెయ్యాది'=(చేయకుము) అని యుండవలసియుండఁగా దీనిపై నవధారణార్థకమగు 'ఏ' కారము నిల్వఁగా 'చేయ్యాదే'=(చేయకుము) అను గ్రామ్యరూప మేర్పడియుండును. కావున దీనికి 'చెయ్యాదు+ఏ' అని ఛేదమును నంగీకరించి యిది వ్యతిరేకక్త్వార్థక రూపాభిన్న మనుకొనుట పొరపాటు.

"అవఱ్ఱుళ్......" (తొల్కా. ౭౦౭ సూ.)="వానిలో 'ఇ-ఐ-ఆయ్'- అనునవి తుదినిగల క్రియలు మహదమహన్మధ్యమపురుషైక వచనములు,

ఉదా:—చెయ్‌ది=(చెయ్+దు=ఇ)=(చేయుదువు-చేయుచున్నావు-చేయుము.)'' దీనిలోని 'తు=దు' అనునది భావ్యర్థకము. విధ్యర్థమున భావ్యర్థములీనమై యుండును. కాఁగా గ్రాంథికవిధ్యర్థక వ్యతిరేకైక వచనము ''చెయ్యాది''=(చెయ్+అ+దు+ఇ) అనునది. దీనినుండి ''చెయ్యాదే'' అనునది యేర్పడి యుండును.

తమిళ వ్యతిరేకక్త్వార్థకమగు 'చెయ్యాదు' అనురూపమునుండి వ్యతిరేకార్థక విశేషణమును సాధించుట సంప్రదాయ విరుద్ధము. విశేషణమునందు 'క్త్వా'ర్థమునకుఁ బ్రసక్తి యేమియులేదు. కాన చెయ్+(ధాతువు) అ+(వ్యతిరేకార్థకము) త్=ద్+(భూతార్థకము.) అ=(విశేషణ ప్రత్యయము.) చెయ్యాద=(చేయని). లేదా దీనియందలి 'త్' అను భూతచిహ్నముతో 'తు' అను వర్తమాన భావిచిహ్నమును నిల్పి ప్రక్రియచూపినను జూపవచ్చును. వ్యతిరేకక్రియ కాలత్రయ బోధకము గదా.

చేయని మున్నగు తెలుఁగు వ్యతిరేకార్థక విశేషణ రూపములలోని 'ని' అనునది సుప్పుల విస్మృతియనుట సరికాదు. అది సముచ్చయార్థక 'ను' శబ్ద సంబంధి యనుట కేవలము నసంగతము. 'చేయు+అన్+ఇ=చేయని' అని ఛేదము నెన్నునది. 'అన్' అనునది వ్యతిరేకార్థకము. 'ఇ' అనునది సంబంధార్థక విశేషణ ప్రత్యయము. అట్లె తెలుఁగు భాషయందలి 'చేయక' మున్నగువానియందలి 'క' అనునది, 'కోరిక' మున్నగువానిలోని 'క' అనుదానివలెనె కృత్ ప్రత్యయ సంబంధియను దొరగారివ్రాఁత సరికాదు. మఱియు ఘుణాక్షరన్యాయమున నేకాకారముననున్న 'రాక=(వచ్చుట)–రాక = (వచ్చుట లేక)' మున్నగు నలంతి శబ్దములను జూచి భ్రమించి కృత్ ప్రత్యయ 'క' కారమును వ్యతిరేకక్త్వార్థకాదులలోని 'క' కారమును నభిన్నములనుట కేవలము నసంగతము. వానికి రూపమందుఁగాని యర్థమందుఁగాని సంబంధము లేదు. ఉదా:—కోరు+ఇక=కోరిక. చేయు+అక=చేయక. మొ. 'తెలియిక=(తెలియుట)' అను శబ్దము తెల్గునఁ గలదనుట గగనారవిందమును స్మరింపఁజేయుచున్నది. తెలుఁగు నందలి వ్యతిరేకక్త్వార్థక వ్యతిరేకవిధ్యర్థకములందలి కకార మజ్ఞాతచరిత్రకమును ప్రాచీనతమమును నగు 'కు' అను ద్రావిడ శబ్దఖండమని గ్రహింపవలయును. ఈ 'కు' శబ్దము ద్రావిడ భాషలందెల్లఁ గొన్ని కొన్ని ధాతువుల తుది నిల్చును. ఉదా:—తమి-అడక్కు=కన్న-అడంగు=అడక్కు. తెల్గు-అడఁగు=అడంగు, మొ. ఇది తమిళ క్రియారూపములలో భావ్యర్థలందుఁ గాన్పించుచున్నది. కన్నడమునఁ గాలత్రయార్థబోధకమై ప్రథమ పురుషమునఁ బ్రయుక్తమగుచున్నది.

"అన్నైతామ్......" (తొల్కా. ౯౮౬ సూ.) " 'అమ్-ఆమ్ ఎమ్-ఏమ్-కుమ్-డుమ్-తుమ్-ఉమ్' అనునవి తుదినిగల క్రియ లుత్తమ పురుష బహువచనములు......" "క ట త అ......" (తొల్కా. ౯౮౭ సూ.)="కు టు-తు-ఉ" అనునవియును, "ఎన్-ఏన్-అల్" అనునవియును దుదినిగల క్రియ లుత్తమ పురుషైకవచనములు...'అల్-కు' భావిలో మాత్రము వచ్చును...."

"అమరో ర్గుమ్" (కర్ణాట శబ్దా. ౪౯౩ సూ.)=ధాతోః పరయోః 'సతి-భూతే భవిష్యతి' చ కాలే విహితయోః 'అమ్-అర్' ఇత్యేతయోః 'గు' మిత్యాదేశో వా భవతి పుంలిఙ్గే స్త్రీలిఙ్గే నపుంసక లిఙ్గే చ విషయే."

అట్టి 'కు' ప్రత్యయము తెల్గునందలి వ్యతిరేకక్త్వార్థక రూపములందును వ్యతిరేక విధ్యర్థకములందును నిల్చెనని తలంపనగును. వ్యతిరేకక్త్వార్థకము లందు వ్యతిరేక ప్రత్యయమగు 'అ' అనునది రెండుసార్లు నిల్చెనని యెఱుంగు నది. ఉదా:—చదువు+అ+కు+అ=చదువక ఇందలి 'కు' శబ్దము భూతార్థక మగుచున్నది. వ్యతిరేక విధ్యర్థకములందలి 'కు' ప్రత్యయము భావ్యర్థకమని యెఱుంగనగును. ఉదా:—చదువు+అ+కు+ము=చదువకుము. అయ్యది నిల్వనిచో "వ్య. క్త్వా-వండియు, వ్య. విధ్య-వండము" అను రీతి నర్థ సందేహా ద్యనుపపత్తులు గల్గును గదా.

౧౭౬. IV విష:—"గోందు భాషయందలి వ్యతిరేక విధ్యర్థక ప్రత్యయము 'మన్ని (లేక) మిన్ని' అనునదైయున్నది. ఇది ధాతువున కాదియందే నిల్చును. ఇట్టిది లోటెను భాషయందు 'నొలి' అనునది గలదు. ఈ గోందు ప్రత్యయము తమిళమందలి 'చె (సె) య్+(య్)+అన్+మిన్'=(మీరు చేయకుఁడు)" అనుదానిలోని 'మిన్' అనుదానిని బోలియున్నది. కాని యీ పోలిక కాకతాళీయము. చె (సె) య్యన్ మిన్" అనుదానిలోని 'అన్' అనునది 'అల్' అనుదానినుండి శ్రుతి సుఖార్థముగ నేర్పడినది. బెశ్చి దొర గారు 'మిన్' అనునది వ్యతిరేక ప్రత్యయమని తలంచిరి. అది ప్రామాదికము. 'మిన్' అనునది విధ్యాద్యర్థక మధ్యమ పురుష బహువచన ప్రత్యయము. కావుననె యిది వ్యతిరేకార్థమందును స్వార్థమందును విధ్యర్థకముగా వాడఁ బడును. ఉదా:—తిమి-పొఱుమిన్ = (ఓర్చు). మలయాళమున నిది 'విన్-పిన్' అను రూపముల నందినది. తమిళ కావ్యభాషయందును నరుదుగ 'అన్మిన్' అనుదానికి బదులుగా 'అఙ్పిన్' (అల్+పిన్) అని వాడఁబడును. బహువచన రూపము 'అఙ్పీర్' అనునది. గోందు భాషలోని వ్యతిరేక విధ్యర్థకమగు 'మన్ని' అనునది హిందుస్థానీ భాషలోని 'మత్' అనుదాని తోడను సంస్కృతమందలి 'మా' అనుదానితోడను సంబంధించుచున్నదన

వచ్చును. కాని యది ద్రావిడ వ్యతిరేక చిహ్నమగు 'అ' అనుదానివలెనె టర్కిషు భాషలోని 'మె=మ' అనుదానితో దూర సంబంధము గలదనఁదగును. 'మన్ని' అనునది బెహిస్తాను (దేశము) లోని సిథియను ఫలక భాషయందలి 'ఇన్ని' అను వ్యతిరేక చిహ్నమును బోలుచున్నది" (కాల్డు. ४౭४ పుట).

౧౨౩. V విష:—"ద్రావిడ వ్యతిరేక చిహ్నమగు 'అ' ప్రత్యయపు వ్యుత్పత్తి:—ద్రావిడ వ్యతిరేక చిహ్నమగు 'అ' ప్రత్యయమునకు 'బాప్' దొరగారి సిద్ధాంతము చొప్పున నిండోయూరపియను భాషలలోని 'న' ఇర్థక శబ్దముతో (Alpha privative) నేమేని సంబంధము గలదా యని తోఁచును. కాని గ్రీకు సంస్కృత భాషలలోని నఞర్థక శబ్దముగాని, (న-నో-నా-మొ.) దానికి సమానమగు నేదేని యాగమముగాని (అ-అన్-మొ.) ద్రావిడ భాషలలో నున్న జాడ యగపడదు. కాని వానికి బదులుగా 'అల్-ఇల్' అను వానినుండి యేర్పడిన కృత్తులుగాని సంబంధార్థక ధాతుజ విశేషణములు గాని పదాంతమున వచ్చుచుండును. ఉదా:—తమి - నేర్ =(తిన్నని) నేర్ + ఇన్మై=(ఇల్ + మై)= )తిన్నన లేమి)" (కాల్డు. ४౭४ పుట).

"ద్రావిడ వ్యతిరేక ప్రత్యయమగు 'అ' అనునది 'అల్-ఇల్' అను ద్రావిడ ప్రత్యేక శబ్దములకు సమానార్థకమనుటలో సందియము లేదు. తమిళ గ్రంథములలోఁ గొన్ని యెడల 'అ' ప్రత్యయము చోట 'అల్-ఇల్' శబ్దముల వాడుక కన్పట్టుచున్నది. ఉదా:—"అఱి+(గ్)+ఇల్-ఈర్ =(మీరు తెలియరు= మీరుఁ దెలియదు)" అనునది, యంతకన్నఁ బ్రచురమగు వాడుకగల 'అఱి+(య్)+ ఈర్' అనుదానికి బదులుగా వాడఁబడును. "నినై +(య్)+అల్ +ఆ=(తలంపమి)" అనునదియుఁ బరిశీలింపఁదగినదియె. 'చె (సె) య్ +(గ్)+అల్ - ఆదార్'=(చేయరు = చేయనివారు) అనునదియుఁ బరిశీలింపనగును. పయి వానిలో 'అల్' అనునది వ్యతిరేక ప్రత్యయమనుట స్పష్టము. 'అల్ +అన్= ఇల్ +అన్=(వాడు కాఁడు)' అనుదానినుండి యేర్పడిన వ్యతిరేక క్రియాజన్య విశేషణములందలి 'అల్' అనుదానికిఁగల వ్యతిరేకార్థ బోధన శక్తి నిర్వివాదము. ఉదా:—పేస్ +అల్ + ఏమ్=(మాటాడమము.) ఉణ్డ్ +ఇల్ +ఐ =(తినలేదు). తమిళ మలయాళములందలి 'మాఱ్ఱ (త్ర)లన్=మాత్రు+అల్+అన్' = (మా మాఱుగానుండువాఁడు-శత్రువు) అనుదానితో సరిచేసి చూచునది. డా. గుండర్టుగారు 'మాత్రా+ఉళ్ +అన్' అనుదానినుండి పయి రూపము వచ్చెననిరి. తమిళ మలయాళములందలి సామాన్య వ్యతిరేకరూపమగు 'మాఱ్ఱా(త్రా)న్' అను దానియందు 'అ' అను దానిచే వ్యతిరేకార్థము తెల్పఁబడుచున్నది. గోందు భాషయందు 'హల్లె-హిల్లె' అనువానిని జేర్చుటచేత వ్యతిరేకార్థక రూపము

లేర్పడును. 'అల్లె-ఇల్లె' అనునవె శ్రుతి సుఖార్థముగఁ బై రీతిని బరిణమించినవి. క్రొత్త భాషయందు 'ఇల్ల' అను శబ్దము నిట్టి యర్థమున వాడుదురు. తమిళ కావ్య భాషలో 'ఆల్-ఏల్-అల్' అను వ్యతిరేక విధ్యర్థకములు వాడఁబడు చున్నవి. ఉదా:—చె (సె) ల్+ఏల్=(పోవలదు) మునియేల్=(కోపింప వలదు) చె (సె) య్+(య్) అల్+క=చెయ్యఱ్క (అల్+క=అఱ్క)=(చేయ వలదు). చె (సె) య్+(య్) అన్+మిన్=(చేయకుఁడు) (అల్=అన్). తమిళ వ్యావహారిక భాషలోఁ దద్ధర్మ వ్యతిరేకమున స్వార్థిక క్రియయొక్క భావార్థక రూపము తుదిని 'ఇల్లె' ('ఇల్ల'కు మాఱుగా) అనునది చేర్పఁబడును. ఉదా:—వర+(వ్) ఇల్లె=(నేను-నీవు-వాఁడు-అది-మేము-మీరు-వారు-అది-రారు-రాలేదు) ఇది గ్రాంథిక రూపముకాదు. సమాస రూపములు కాల క్రమమున వ్యస్తములై నిల్చునపుడు గల్గు మార్పు నీ రూపము సూచించు చున్నది" (కాల్డు. ४८५ పుట).

"ద్రావిడ వ్యతిరేక ప్రత్యయమగు 'అ' అనునదియుఁ బ్రత్యేక ప్రయోగము గల 'అల్' అనునదియు నభిన్నములు. తుది లకారము లోపించుట కనేకోదా హృతులు గలవు గాన 'అల్' అనునదె ప్రాచీన తరమని స్థూల దృష్టికిఁ దోఁచును. ఉదా:—తమి-ముటిదల్=(విఱుగుట). కన్నడ-మురత. తమి-చె (సె) య్దల్=(చేయుట)=తెల్గు-చేత. తమిళ భావార్థకము 'అ' అనునది మాత్రమె. కన్నడమున 'అ-అల్' అను రెండును భావార్థకములె. తమిళ వ్యతిరేకార్థక క్రియా నామవాచక ప్రత్యయములు 'మల్-మై' అనునవి గలవని యీవఱకె చూపియున్నాను. కాని యింత మాత్రమున 'అల్' అనునది ప్రాచీన తరమని నిశ్చితముకాదు. 'మ్-న్-ర్' అనువాని వలెనె 'ల' కార మును స్పష్టతకై క్రియా నామవాచకముల తుదిని జేరుట పెక్కు చోట్లఁగలదు. ఇట్లు 'అ' ప్రత్యయమె ప్రాచీనతరమని నాయాశయము. వ్యతిరేక ప్రత్యయ ద్విరుచ్చారణమును స్పష్టతకై వెలసియున్నది. (ఇల్+(ల్)+అ=ఇల్ల=ఇల్లె).

ప్రాచీన తరమగు నీ వ్యతిరేకార్థకమైన 'అ' ప్రత్యయము ప్రాచీన ద్రావిడ ప్రథమ పురుష సర్వనామమును (అ=ఆ) బోలియున్నదనియు 'అల్' అను వ్యతి రేకార్థక నామవాచకము సైతము 'అమ్-అద్-అల్' అను ప్రథమ పురుష సర్వనామములను బోలుననియు నాయాశయము. ఇంక డా. గుండర్టుగారివలెనె సాహసించి మేమును వ్యతిరేకార్థము సైతము ప్రశ్నార్థము నుండియుఁ బిదపఁ బ్రథమ పురుష సర్వనామార్థములనుండియు నిష్పన్నమైనదని చెప్పుదుము. "ప్రథమ పురుష సర్వనామమగు 'అ' శబ్దమె వ్యతిరేక ప్రత్యయమగుచున్నదని నా నమ్మకము. ఆశ్చర్యార్థకమగు 'అ' అనునదియె ప్రశ్నార్థక మగుచున్న

దనియు నా యూహ. ప్రశ్నార్థమునుండియె వ్యతిరేకార్థము బయలుదేఱు ననుట స్పష్టము. ఉదా:—"అదువరుమ్+ఆ=(అది వచ్చునా=అది సంభవించునా=అది సంభవింపదు=కానేకాదు)" అని డా. గుండర్టుగారు నాకు జాబులో వ్రాసిరి. వ్యావహారిక తమిళమందును ప్రశ్నముచేతనే వ్యతిరేకార్థము వాచ్యమగుచున్నది. అదియే కావ్యమునకు సొగసు" (కాల్డు ౪౭౫, ౪౭౬ పుటలు).

"కాని 'అల్' అనునది ప్రత్యేకముగా వ్యతిరేకార్థకము కాదనియు దాని తుదిని 'అల్ల' అను రీతిని 'అ' అనునది చేరునపుడే 'అల్' అనునది వ్యతిరేకార్థకమగుననియుఁ జెప్పెడి గుండర్టుగారితో నే నేకీభవింపఁజాలను. 'అల్' అనునది మొదటఁ బ్రథమ పురుష సర్వనామముగ నుండెడిదనియు, సద్దానిని సమ్మతించినను సమ్మతింపకున్నను 'అల్-ఇల్' అనునవి సహాయాంత రాపేక్ష లేకయే తమంతటఁదామె వ్యతిరేకార్థమును బోధింపఁజాలుననియు వాని తుదిని జేర్పఁబడిన 'అ' మున్నగు నచ్చులు స్పష్టార్థకములనియు నా నిశ్చయము. ఉదా:—అల్+దు=అన్రు (అన్ఱు)=(అది లేదు=అదికాదు) – గ్రాంధిక కన్నడము-అల్లదు. తుళు-అత్‌త్. తమి-అల్‌మై=అన్మై=(లేమి=కాకుండుట) అల్+గు=(తగుట) అల్=(చీఁకటి). అల్‌వటి=(విభక్తి ప్రత్యయము లేమి.) ఇల్-ఇన్రు-(ఇన్ఱు)=అది లేదు. ఇల్+మై=ఇన్మై=(లేమి). ఇలి=(లేనివాఁడు). ఇల్ పొరుళ్=(లేని వస్తువు. సత్పదార్థము లేమి). (పొరుళ్=వస్తువు)" (కాల్డు. ౪౭౬ పుట).

" 'అ' అనుదానినుండి 'అల్' అనునది నిష్పన్నమయ్యెనను నా యూహ యెట్టిదైనను వ్యతిరేకార్థక విధ్యర్థకములగు 'అల్-ఆల్-ఏల్' అను వానికిఁగల పోలికలు పరిశీలింపఁదగినవి. సంస్కృతమందలి 'అలమ్' శబ్దమును బై వానితోఁ బోల్చిచూడనగును. 'కోల్' మాండలిక భాషయగు 'సొంతాలు' భాషయందు 'ఆలా' అనునది వ్యతిరేకార్థక శబ్దభాగము. ఫిన్నిషు భాషయందును నట్లె. ఓష్టియాకు భాషలో 'ఇలా' అనునది వ్యతిరేకార్థకము. హెబ్రు భాషయందును 'అల్' అనునది వ్యతిరేకార్థక ప్రత్యయము. చాల్డీ భాషయందు 'లా' అనునది వ్యతిరేకార్థకము" (కాల్డు. ౪౭౬, ౪౭౭ పుటలు).

విమర్శము:—ఇండో యూరపియను భాషలలోని నఞర్థక శబ్దములతో ద్రావిడ వ్యతిరేకార్థక శబ్దములకు సంబంధము లేదనుట సరికాదని యీావఱకె ౨౫ IX విషయమున విమర్శితమయ్యెను. అచ్చట వివరింపఁబడిన రీతిగ సంస్కృతమునందలి 'న-నా' శబ్దములను సంబంధించినవె యాంధ్ర కన్నడములందలి వ్యతి

రేకార్థకమగు 'అ' ప్రత్యయమును దమిళమందలి 'ఆ' అనునదియు నని యంగీకరింపనగును. సంస్కృతమున 'అ' అనెడి 'న' శబ్దరూపము క్రియలతో నడుకుట యరుదయినను నిందార్థములందెల్ల వెలయుచున్నది. "న + బ్రాహ్మణః = అబ్రాహ్మణః" అనురీతిని నామములతో నడుకుట యతివిస్తృతముగా నున్నది.

"నఞో నలోప స్తిజి క్షేపే" (వార్తి. ౩౯౮౪). 'అపచసి త్వం జాల్మ' (సి. కౌ. ౭౫౮ సూ. వివరణము) "నలోపో నఞఇతి సూత్రస్థ వార్తిక మిదమ్. నఞోనకారస్య లోపః స్యాత్-తిజిపరే, నిన్దాయామితి వక్తవ్య మిత్యర్థః. అపచసి త్వం జాల్మ= కుత్సితం పచసీత్యర్థః. అత్ర 'అ' ఇతి భిన్నం పదమ్ (నఞర్థకావ్యయమ్) తిజన్తేన సమాసాభావాత్......" (బాలమనోరమా వ్యాఖ్య).

'అల్' అనుదానిని సంబంధించు 'అన్' అనెడి నఞర్థక శబ్దమును సంస్కృతమునఁ గలదు. ఉదా:—న + ఏక = అనేక. మొ.

"నఞ్ (౨-౨-౬) = నఞ్ సుపా సమస్యతే." (సి. కౌ. ౭౫౬ సూ).

"న లోపో నఞః (౬-౩-౭౩) = నఞోనస్య లోపః స్యా దుత్తరపదే. న + బ్రాహ్మణః = అబ్రాహ్మణః" (సి. కౌ. ౭౫౭ సూ.).

"తస్మా న్నుడచి (౬-౩-౭౪) = లుప్తనకారా న్నఞ ఉత్తరపద స్యాజాదేః నుడాగమః స్యాత్. న + అశ్వః = అనశ్వః" (సి. కౌ. ౭౫౮ సూ).

'ఇమ్-అన్-ఇన్' అను నఞర్థక శబ్దము లాంగ్లమందును గలవు. ఉదా:— Improper = అక్రమమైనది. Inability = అశక్తి. Unable = శక్తిలేనిది. Un = వ్యతిరేకార్థకమగు నుపసర్గము.

ఇట్టి బలమగు నిండోయూరపియను సంబంధమును నిరాకరించి యర్థ సంబంధ మించుకేని లేని ద్రావిడ ప్రథమపురుష సర్వనామమగు 'అ' శబ్దముతో దొరగారు సరిపోల్చుట రూపసామ్య భ్రాంతికృతమె కాని వేఱుకాదు. ఇంకఁ బ్రశ్నార్థకమగు 'అ' శబ్దము మూలమనుటయు సరికాదు. స్వార్థిక క్రియమీఁది ప్రశ్నమున వ్యతిరేకార్థ బోధమును వ్యతిరేకార్థక క్రియమీఁది ప్రశ్నమున స్వార్థబోధమును గల్గించుట 'అ' మున్నగు స్వరముల కెల్లఁ బ్రసిద్ధమె. ఉదా:—చదువవే = చదువుము. చదువవా = చదువుము. చదువవో = చదువుము.

"రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా" (భాగ. ౮ స్కం).

సంప్రార్థనార్థ కా దీ । దే దాతౌ ప్రశ్నలక్షణౌ భవతః । ఏ దోతౌ వ్యతిరేకా । దపి సంప్రార్థన పరౌ క్రియాణాం స్తః" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౨౧౦ XII విమ.

పయిరీతిని గాకు స్వరములెల్ల వ్యతిరేకార్థక శబ్దములకు మూలమనుట యుక్తమా? ఇట్టి కాకువులు వ్యతిరేకార్థమునే కాక ప్రార్థనాది వివిధములగు నర్థములను వ్యక్తపఱుచును. అట్టివి వివిధార్థ వ్యంజకములే కాని తత్తదర్థక శబ్దములు కానేరవు. యుక్తిహీనమగు నే సంబంధమునైన నంగీకరించుచు సంస్కృత సంబంధము మాత్రము లేదనుట వీరికొక వ్రతమైయున్నది.

"న శబ్దము 'నకరోతి' 'అకృతమ్' మొదలైన రీతిని వాడఁబడు సంస్కృత మునకును ద్రావిడ వ్యతిరేకార్థకమునకును సంబంధము లేదనుటయు స్పష్టము. ......దీనికిఁ (ద్రావిడ కుటుంబమునకు) సంస్కృత ప్రాకృతములతో జన్య జనకభావ సంబంధముగాని సోదర భావముగాని లేనట్లును నిర్ణీతమైనది" (ఆం. భా. వి. ౫౭౦ పుట). అని తదనుయాయులును వ్రాయసాగిరి.

సంస్కృత ప్రాకృతములతో జన్య జనకభావమును సోదర భావమును లేకపోవుఁగాక-చిరకాలికమగు సహవాసముచేతఁ గల్గియున్న (౭, ౮ విష. చూడు.) పోలికలను లేవననేల?

'ఇల్లై' అను తమిళ శబ్దము గ్రాంథికము కాదనియుఁ గేవల వ్యావహారిక రూపమనియు డా. కాల్డువెల్డుగారు వ్రాయుట సాహసము, అయ్యది తొల్కాప్పియమందే ప్రయుక్తమై యున్నది.

"మున్నిలై......" (తొల్కా. ౭౦౬ సూ.)="మధ్యమ పురుష-క్రియలును నాశీరర్థక క్రియలును నసమాపక క్రియలును 'ఇల్లై' (లేదు) శబ్దమును 'వేఱు' (భిన్నము) శబ్దమును, 'చె (సె) య్మ్మనా' మున్నగు 'అ' తుదిని గల శబ్దములును 'ఉమ్' తుదినిగల క్రియలును, 'చె (సె) య్దు' మున్నగు ధాతుజ విశేషణములును (పెయరెచ్చమ్=నామమునకుఁ గొఱఁత) నను నెనిమిది విధము లగు శబ్దములును మహా దమహాత్తులు రెంటను నేకరీతిగనే యుండును."

౧౨౭. విష:-"విధేయ విశేషణ రూప క్రియలు:-(Appellative verbs) (లేదా) (Conjugated nouns):—ఉగ్రియన్ కుటుంబములోని కొన్ని భాషలయందు సార్వనామిక క్రియాప్రత్యయములు-క్రియల తుదినినిల్చు సర్వనామశబ్దఖండములు-నామవాచకముల తుదినినిల్చును. అట్టి నామములు విధేయ విశేషణక్రియ లనిపించుకొనును. ఉదా:—మార్డ్విన్‌భాష-(పాజ్ = ప్రభువు) "పాజ్ + అన్=(నేను ప్రభువను). 'పాజ్+అన్' అనునది షష్ఠ్యర్థకము. దీని విధేయ విశేషణ రూపము-'పాజ్+అన్+అన్ = (నేను ప్రభుని వాఁడను = ప్రభు సంబంధిని)" అను రీతిని విధేయ విశేషణ రూపము లేర్పడును. సామాన్యముగా సిథియను భాషలలోని విశేషణములెల్ల గుణనామవాచకములె కాన నామవాచక

నియమములెల్ల విశేషణముల కుండును. నవీన పరిషియను భాషయందు సిథియను భాషల ప్రభావముచేతఁ గావలయును 'తిఙ్జు' లతో సమసించిన నామవాచకములు విశేషణములును గలవు. ఉదా:—మెర్ద్ + ఎమ్=(నేను మానవుఁడనై యున్నాను). ఇందలి 'ఎమ్' అనునది 'ఉన్నాను' అను నర్థము గల క్రియయొక్క సంక్షేపరూపము. ఇట్టి సమాసములు సిథియను భాషల లోని (హంగేరియను భాషలో) (కాల్డు. ౩౦౭ పుట. ౯౦ II విష. చూడు) షష్ఠీసమాసములను బోలియున్నను వాని కభిన్నములు కావు. ద్రావిడ భాషలో నిట్టి సమాసములు కానరావు'' (కాల్డు. ౪౭౭ పుట).

''పయి నుదాహరించినరీతిని 'ఉగ్రియను' భాషలయు ద్రావిడ భాషలయు విధేయ విశేషణరూప క్రియా నిర్మాణ పద్ధతికిఁ గల సామ్యము పరిశీలింపఁదగినది. దీనిని 'అన్ఫల్వీ' దొరగారు పరిశీలించిరి కాని 'ఫిన్నోఉగ్రియను' భాషలకును ద్రావిడ భాషలకునుగల యితర విషయములందలి సామ్యముల నాయన పరిశీలింపఁజాలరైరి (చూడు ౧౦౫ I విష).

ప్రాచీన ద్రావిడభాషలన్నిటియందును నెల్ల నామములనుండియు నెల్ల విశేషణములనుండియుఁ గ్రియారూపములను సాధింపవచ్చును. మీఁద నుదాహరించిన 'మార్డ్వీన్' భాషయందువలెనె (సిథియను భాషలలోని 'ఉగ్రియను, కుటుంబములోనిది) తమిళ భాషయందును ప్రథమా విభక్త్యంత నామవాచకములు మాత్రమె క్రియలగుటగాక ప్రథమేతర విభక్తుల రూపములును (Oblique cases) ముఖ్యముగా షష్ఠీ రూపములును గ్రియలగుట గలదు. తమిళ వైయాకరణులు వీనిని 'వినైకుఱిప్పు'=(క్రియల చిహ్నములు గలవి) అని యందురు. తమిళ వ్యాకర్తయగు నొక యాంగ్లేయుఁడు వీనిని 'తిఙంత' నామవాచకములని వ్యవహరించెను. బెశ్చిదొరగారు చెప్పినట్లు వీనిని ''విధేయ. విశేషణరూప క్రియలు!'' (లేదా) 'తిఙంతములగు విధేయ విశేషణములు' అనుటయె యుక్తమని నాయభిప్రాయము'' (కాల్డు. ౪౭౭, ౪౭౮ పుటలు).

''ఈ విధేయ విశేషణ రూపక్రియలకుఁ గాలవిశేష బోధకత్వము లేదు ఉదా:—తమి-(కోన్ = రాజు-గోదావరి). కోన్ + ఎన్ =(నేను రాజను. కోన్ + ఐ=(నీవురాజవు). కోన్ + ఎమ్ =(మేము రాజులము). కోన్ + ఇర్ = (మీరు రాజులరు). ఇట్లే ప్రాతిపదికమునకుఁ బరముగాఁ బంచమి (లేదా) షష్ఠి యగు 'ఇన్' అను దానిని జేర్చి విధేయ విశేషణముగా వాడుటయుఁ గలదు. తమి-'కోన్ + ఇన్ + ఎన్'=(నేను రాజుయొక్క వాఁడను). 'కోన్ + ఇన్ + అన్'=(వాఁడు రాజును సంబంధించినవాఁడు). పయిచోటులందెల్ల 'రాజ సంబంధి యెవఁడో వాఁడు' అని సంబంధార్థమును గ్రహింపనగును. 'ఇన్'

ప్రత్యయమునుజేర్చి విధేయ విశేషణ క్రియారూపములను వాడుట గ్రాంథిక తమిళమందే కలదు. తెలుఁగునందు విధేయ విశేషణముల తుది స్వరమునుబట్టి సర్వనామఖండరూపప్రత్యయ స్వరము మాఱుచుండును. ఉదా:—నీవు సేవకుండవు. నీవు కవివి. మలయాళమున నేకవచనరూపములు 'అడియన్-అడియేన్'=(దాసుఁడను) అని తమిళమందువలెనె యుండును గాని బహువచనమున 'అడియఙ్ఞళ్' అనురీతి నపభ్రంశచిహ్నము లగపడుచున్నవి. 'ఎల్+ఆమ్=(మనమెల్లరము), ఎలీర్=(మీరెల్లరు)' అనునవి గ్రాంథిక తమిళరూపములు" (కాల్డు. ౪౭౮ పుట).

"తెలుఁగునఁ బ్రథమపురుషమం దమహత్త్వమున మాత్రమె విధేయ విశేషణ క్రియాకారమున విశేషణముండును. ఉదా:—అది మంచిది. అవి మంచివి. మొ. మహత్త్వమున-వాఁడుత్తముఁడు. వారుత్తములు. మొ. ఈ విషయమునఁ దమిళము సంపూర్ణమగు నభివృద్ధినందినది. అందలి విధేయ విశేషణములకు మహన్మహత్యమహత్త్వముల మాటలును వేర్వేఱు రూపవిశేషములుండును. ఉదా:—తమి-(నల్=మంచి) నల్+(ల్) అన్=(వాఁడు మంచివాఁడు) నల్-(ల్)+అళ్=(ఆమె మంచిది) నల్లదు. (లేదా) నన్ఱు=(నన్+దు=తు=నన్టు)=(అది మంచిది) నల్+(ల్) అర్=(వారు మంచివారు). ఇది మహన్మహతీ సామాన్యము=(Epicene). నల్+(ల్) అన=(లేదా) నల్+(ల్) అ=నల్ల=అవి మంచివి). విధేయ విశేషణ రూపక్రియ లిట్లు క్రియలుగానే కాక విశేషణ మాత్రములుగా సైతము వాడఁబడును. ఉదా:—ఇరుక్కి_అదు=(అది యున్నది. (లేదా) ఉన్నట్టి యది. (వర్తమానార్థక విశేషణము). ఇట్టి ద్వైవిధ్యము నసందర్భమే యర్థనిర్ణయము చేయును. సామాన్యముగ విధేయ విశేషణ రూపము గ్రాంథిక భాషయందుఁ గ్రియగను వ్యావహారిక భాషయందు విశేషణముగను వాడఁబడును గాని యిందుల కపవాదమును గలదు. 'నల్లదు' అనునది వ్యావహారిక భాషయందును బైనిజెప్పినట్లుగాక విధేయ విశేషణ రూపక్రియగను దఱచుగా వాడఁబడుచున్నది" (కాల్డు. ౪౭౮, ౪౭౯ పుటలు).

"ద్రావిడ భాషలలోని సామాన్య విశేషణములు గుణనామవాచక రూపములెకాన వానివాడుకలో విశేషణరూప నామభేదమే కాని వస్తుభేదము లేదు. ఉదా:—తమి-ఒళి+(య్) ఐ=(నీవు ప్రకాశించువాఁడవు) దీనికి 'నీవు ప్రకాశమవు' అనియే యథాశ్రుతార్థము. ఇని+(య్) ఐ=(నీవు మధురమైనవాఁడవు) దీనికి 'నీవు మాధుర్యమవు' అనియె యథాశ్రుతార్థము. అనాగరకములగు 'తు' మున్నగు ద్రావిడ భాషలందుసైత మిట్టి విధేయవిశేషణ రూప

క్రియల వాడుక గలదు. ఉదా:—'తు' భాష:—నెగ్గ్+ఆను=(నేను మంచి వాడ(ను). నెగ్గ్+ఆము=(మేము మంచివారము).''

''విధేయ విశేషణ క్రియా రూపములందును విశేషణ రూపములందును గొన్నియెడల 'ఇయ' అనునది నిల్చుటయుఁ గలదు. ఉదా:—తమి-క్రియ-కొడ్+ఇయ+న్=(వాఁడు క్రూరుఁడై యున్నాఁడు). నామ-(క్రూరుఁడైన వాఁడు). ఇట్లే-వల్+ఇయ+న్=(బల్లిదుఁడు=బలమైన వాఁడు). విధేయత లేని కేవల విశేషణరూప నిర్మాణమున 'ఇయ' అనునది మాత్రమె నిల్చును. ఉదా:—వల్+ఇయ=(బలముగల). పెర్+ఇయ=(పెద్ద). చి (సి)఼ఱియ=(చిన్న) ఇట్టివిస్సితము సంబంధార్థక విశేషణములె యని నేను దలంచెదను. 'ఇయ' లోని 'ఇ' అనునది భూతార్థకము. 'అ' అనునది సంబంధార్థక సర్వనామ ప్రత్యయము. అందలి 'య' కారము సంహితావ్యవధాయక వర్ణము. 'ఇ+య్+అ=ఇయ' అని యేర్పడుచున్నది. కాఁగా 'ఇయ' అనునది భూతార్థక సంబంధార్థక విశేషణ రూపమగుచున్నది. ఉదా:—వల్+ఇ+య్+అ=(బలమైనది) ''ఏది బలముగల్గిన యుండినదో యది'' అని దీని యథాశ్రుతార్థము. ఇట్టిది భూతార్థకమె యనఁదగి యున్నను దీనికట్టి కాలవిశేషబోధకత్వ మప్ర సిద్ధము. ఇదియు సంబంధార్థక ధాతుజ విశేషణమువలెనె తద్ధర్మార్థకమాత్ర మగుచున్నది'' (కాల్డు. ౪౭౯, ౪౮౦ పుటలు).

''కొన్నిచోట్ల 'ఇయ' లోని 'అ' అనుభాగము లోపించుటయుఁ గలదు. అపుడు మిగిలిన 'ఇ' అనుదానిపైనె సర్వనామఖండరూప క్రియాప్రత్యయములు నిల్చును. ఉదా:—పెరిదు=(పెద్దది). ఇది 'పెరియదు' అనుదానికి బదులుగ నేర్పడినది. కొన్నియెడల 'ఇయ' అనుదానిలోని 'ఇ' అనునది లోపించి 'అ' అనునదె నిల్చును. అట్టి 'అ' శబ్దఘటితరూపములలోని లింగబోధక ప్రత్యయ మును వీడఁగా నది సామాన్య విశేషణమగుచున్నది. ఉదా: ఉడైయన్-ఉడైయ. అట్టి ప్రక్రియనుబట్టి వానిని విధేయ విశేషణరూపక్రియలనుండి యేర్పడిన సంబంధార్థక సర్వనామ విశేషణము లనఁదగునని నా యభిప్రాయము. ఉదా:—ఉడైయ=(చేరిన=చెందిన) ఏదిచెందినదో యది యని యథాశ్రుతార్థము. మలైయ=(కొండలుగల). 'ఏదికొండయో యది' యని యథాశ్రుతార్థము. తీయ=(చెడ్డ) 'ఏది చెడుగో యది' యని యథాశ్రుతార్థము. 'ఉడైయన్' అను దాని కధిపతియని యర్థము. ఎవనికి స్వత్వముగలదో వాఁడని యర్థము. ఇది నిజముగా ధాతుజ విశేషణరూపనామమె యనఁదగును. దీనిని ''అవన్ ఉడైయన్-(వాఁడొడయఁడు)'' అని వాడినచో నది విధేయ విశేషణరూపక్రియ యనఁదగును'' (కాల్డు. ౪౮౦ పుట).

విమర్శము:—'ఇయ' ప్రత్యయములోని 'ఇ' అనునది భూతార్థక మనుట సరికాదు. వ్యాపారరూపక్రియార్థము లేని నామరూపధాతువుపైని గాలవిశేష బోధక-భూతార్థక-మగు 'ఇ' ప్రత్యయము నిల్చుట యసంభవము. ఇట్లులేని భూతార్థకత్వ మున్నదననేల? అది మఱుఁగుపడె ననేల? ఈ 'ఇ' ప్రత్యయము క్త్వార్థకమగు 'ఇ' ప్రత్యయమునకు భిన్నము గాదనియుఁ గాల్డువెల్లుగారు లోఁగడ వ్రాసిరి. ఇది సరికాదని యచట నీవఱకు విశదపఱుపఁబడెను. (చూడు ౯౧ VII, VIII విష.) ఉదా:—"పెర్+ఇయ+అదు=దు= పెరియదు = పెరిదు" అనుచోటి 'ఇయ' అనునది యొక తద్ధిత ప్రత్యయ మనఁదగును. అందలి 'ఇ' అనునది యస్త్యర్థకము. దానిమీఁది 'అ' అనునది విశేషణతాఘటక ప్రత్యయము. 'ఇ-అ' అనునవి వేర్వేఱుగ నస్త్యర్థక ప్రత్యయములును ననవచ్చును. ఉదా:—తమి-పెరియ=(పెద్దతనముగల) పెరియదు= పెరిదు =(పెద్దతనముగలది). పెరియన్=(పెద్దతనముగలవాఁడు). తెలుఁగున 'ఇ' అనునది శేషషష్ఠి లోపింపఁగా మిగిలిన యాపవిభక్తికమును గావచ్చును. ఉదా:—క్రిందు-క్రిందిచోటు=క్రిందిది. కూనివాఁడు. తమిళమందును 'అ-ఇ' అనునవి యస్త్యర్థక ప్రత్యయములు. నల్+మై+అ=నల్ల=(మంచితనముగల) నల్+మై=నన్మై=(మంచితనము), నన్మై+అన్=(మంచితనము గలవాఁడు) నన్మై+అదు=నల్లదు=(మంచితనము గలది). కుఱుమై+ఇ=కుట్టి (ట్టి)=(పొట్టి తనముగల) పచు-(ను)+మై+ఇ=పాచి (సి)=(నాచు=శైవలము=ఆకుపచ్చఁ దనముగలది). (చూడు నన్నూలు ౧౩౬ సూ.) ఉడై+అ=ఉడైయ= (స్వామ్యముగల) ఉడై+(య్) అన్=(స్వామ్యముగలవాఁడు). 'ఉడైయన్' మున్నగు విధేయ విశేషణములనుండి 'ఉడైయ' మున్నగు విశేషణము లేర్పడె ననేల?

౧౨౮. I విష:—"పురుష బోధక సర్వనామ శబ్ద ఖండములను జేర్చు పద్ధతి.—ధాతువులపై నిల్చిన కాలబోధక ప్రత్యయములకుఁ బరముగాఁ బురుష బోధక సర్వనామ రూపములను గాని నిర్దేశక సర్వనామ రూపములను గాని వాని వాని ఖండములనుగాని నిల్పుటవలన వివిధ పురుష లింగవచన బోధక ద్రావిడ క్రియా రూపము లేర్పడును. సర్వనామ శబ్ద ఖండములనఁగా ధాతువులపైని నిల్చు సర్వనామ శబ్దముల వికృతు లేయే రీతులనుండునో వెనుక సర్వనామ ప్రకరణమున వివరించియున్నాను. ఆ మార్పులలో ముఖ్యమైనది వాని వాని మొదటి హల్లు లోపించుట. 'నీవు' అను మధ్యమ పురుష సర్వనామమున మొదటి హల్లుగు నకారమును దానిమీఁద నున్న 'ఈ' అనునదియుఁ బోఁఖ

శ్రుతి సుఖార్థము చేరిన 'వు' అను భాగము మాత్రము తెల్గునఁ దిజ్ ప్రత్యయముగ నేర్పడినది.

ఇండో యూరపియను భాషలలో ధాతువులకుఁ బరముగనే పురుష బోధక ప్రత్యయములు నిల్చును. ఉచ్చారణ త్వర, సంధి ప్రియత్వము, శ్రుతి సుభగత్వాపేక్ష మున్నగు కారణములచేత వర్ణ వికృతి యధికమై యిండో యూరపియను భాషలలోని సర్వనామ ఖండములు ద్రావిడ ప్రత్యయములకంటె మిక్కిలి ప్రచ్ఛన్నములై యున్నవి. కొన్ని యెడలఁ గుటుంబ భాష లన్నిటియందును నొక్క భాషయె విభక్తి ప్రత్యయముల చరిత్రమును దెలుపఁ జాలియుండును. ప్రథమ పురుష బహువచన చిహ్నముగా నిండో యూరపియను భాషలు పెక్కిటిలో నగపడుచున్న 'ఉన్త్-అన్త్' అనుదాని వ్యుత్పత్తి 'వెల్షు' భాషలోని ప్రథమ పురుష సర్వనామ బహువచన రూపమగు 'హ్వాన్త్' అనుదాని నాశ్రయించి యున్నది. ఉదా.— పేరన్తి=(fer). భరన్తి మొ."

"ద్రావిడ సర్వనామములు పురుష బోధక ప్రత్యయములుగా మాఱునపుడు గల్గు రూప విశేషములు సర్వనామ ప్రకరణమున విశదీకరింపఁబడెను. అట్టి యెడలఁ గల్గు స్వరశక్త్యాది వికృతులు (Vowel harmony) ధ్వనిప్రకరణముచేఁ జూపఁబడెను".

"(1) పురుష బోధక సర్వనామ ప్రత్యయములు ద్రావిడ క్రియల కంత్యమందె నిల్చును. ప్రాచీన తురేనియన్ భాషలలోని (సిథియను కుటుంబము) క్రియలకుఁ బురుష బోధక ప్రత్యయ యోగమె లేనట్లు తోఁచుచున్నది. ఆ భాషలలో వేఱొక సర్వనామ శబ్దమె క్రియలకు మొదట నిల్చును. కాని మంగోలియను (సిథియను కుటుంబము) మాండలిక భాషయగు 'బొరియత్' భాషయందును 'తుంగుసియను' భాషలోని వ్యవహారమందును (ఈ భాష సైబీరియాలో వాడఁబడును) బురుష బోధక ప్రత్యయములు క్రొత్తగాఁ జేర్పఁబడినవి. (ప్రాచీన భాషలో లేవని భావము). ప్రాచీనములగు నిండో యూరపియను భాషలందువలెనె 'తుర్కిషు-ఫిన్నిషు-హంగేరి యను' (సిథియను కుటుంబము) భాషలందును సర్వనామములు తుట్టతుదిని గ్రియలతో సమాసమంది కాలక్రమమున నవి సర్వనామ ఖండరూప ప్రత్యయములుగా నేర్పడినవి. నేఁటి యిండో యూరపియను భాషలం దనేక స్థలములలోఁ బ్రాచీన కాలపు పురుష బోధక ప్రత్యయములు లోపించినవి. అట్లగుటంజేసి ప్రథమాంతములగు సర్వనామములె వేఱుగాఁ గ్రియలకు మొదట నిల్చుచున్నవి. ఉదా:—"love I"=

(ప్రేమించుచున్నాను నేను) అనునది ప్రాచీన రూపముగు 'అమ్ ఓ' (ఇండో యూరపియను)=(ప్రేమించుచున్నాను నేను) అనుదానికి సమాన రూపమై యున్నది. కాని యర్థ భేదము లేకుండునట్లుగ స్థానము మార్చి మొదటనే యట్టి సర్వనామ శబ్దమును 'I love' అను రీతిని జేర్చుచున్నాము. సెమిటిక భాషలలో నిట్లు చేర్చుటచేత వ్యాకరణ కార్య భేదములు గల్గుచున్నవి. సర్వనామముల యొక్కయు సర్వనామ ఖండముల యొక్కయు స్థానభేదములతో యాయా క్రియల కాలభేదములను నిర్ణయింపఁ జాలును. సర్వనామ శబ్దములు క్రియలకు మొదట నున్నచో నా క్రియలు తద్ధర్మార్థకములుగాను భవిష్యదర్థకములుగాను నుండును. అచటి క్రియార్థ మారబ్ధము కాలేదనియు నిఁక ముందు కాఁగలదనియు విశదమగును. అట్లుగాక సర్వనామములు క్రియలకుఁ దుదిని నిల్చినచో నా క్రియలు భూతార్థకము లగును. అనఁగా నచటి క్రియార్థము జరిగిపోయినదని విశదమగును'' (కాల్డు. ౪౭౧, ౪౭౨ పుటలు).

''ద్రావిడ భాషలలో నిట్టి విశేషము లేదు. తుర్కిష్-ఫిన్నిష్-భాషలందునవలెనె ధాతువులకుఁ బరముగఁ గాలబోధక ప్రత్యయములును వానికిఁ బరముగఁ బురుష బోధక ప్రత్యయములును నిల్చును. తమిళ భాషా వికృతి యగు మలయాళమున సుబ్విభక్తుల విషయము తమిళ పద్ధతినే వెలయుచున్నది. మలయాళ కావ్యములనుబట్టి సర్వనామములు మలయాళ క్రియలకును దుదిని దమిళమందువలెనె చేర్పఁబడు చుండెనని విశదమగును. ఇందులకు సిరియను క్రైస్తవులు యూధులును సంరక్షించియున్న శాసనములనుండియుఁ బ్రమాణములు చిక్కఁ గలవు. కాని నేఁటి మలయాళ భాషలోని క్రియలయందుఁ బురుష బోధక సర్వనామ చిహ్నమేదియుఁ గానరాదు. సర్వనామ చిహ్నముల తోడ లింగవచన బోధకములును నదృశ్యము లైనవి. ఇది కేవల ప్రాచీనతమ లక్షణమును విశదీకరించుచున్నది. ఈ విషయమున నియ్యది యేషియా పీఠభూములలోని 'మంగోలియా-మంచు' అనెడి ప్రాచీనములగు ననాగరక భాషలను బోలుచున్నది. పైరీతిని సర్వనామ ప్రత్యయములు లోపించుటచేత మలయాళమునఁ బ్రథమాంతములగు సర్వనామములు క్రియలకు ముందు వేఱుగఁ జేర్పనలసి వచ్చుచున్నది. అట్లు చేర్పనిచో నర్థ మసంపూర్ణమును సంధిగ్ధమును నగును. ఇట్లయినను మలయాళ క్రియలందుఁ గాలబోధక చిహ్నములు మాత్రము లోపించుట లేదు. మలయాళమందును గాలబోధక ప్రత్యయములు ధాతువునకుఁ బరముగ నిల్చును. ఆధుని కాంగ్ల భాషయందును గొన్ని యెడల ప్రాచీన పురుష బోధక చిహ్నములు నిల్చుట గలదు. ఉదా:— lovest-loveth=(నీవు ప్రేమించుచున్నావు). మలయాళమునం దిట్టి సర్వనామ

ఖండముల జాడ బొత్తిగా లోపించినది. మలయాళమున ధాతువు తుదిని క్త్వార్థక చిహ్నమగు 'చు' ('తు' అను తమిళ రూప పరిణామము) అనునది మాత్రము భూతార్థమునఁ జేరును. ఉదా:—ఞాన్-న్-అవన్-అడిచు=(నేను గొట్టితిని. నీవు గొట్టితివి. వాఁడు గొట్టెను). అనాగరకపు 'తుద' భాషయందును ననాగరకపు 'గోండులయు' 'కూసులయు' భాషలందును 'తిఙ్' ప్రత్యయ పద్ధతి మాత్రము విశాలముగను సంపూర్ణముగను నుండుట యాశ్చర్యకరము" (కాల్డు. ౮౪౨, ౮౪3 పుటలు).

విమర్శము:—"మంగోలియా-మంచు' అను ననాగరక భాషలలోఁ బురుష బోధక చిహ్నములు లేవనియు నక్కారణమునఁ బురుష బోధక చిహ్నములు లేకుండుట ప్రాచీనతా లక్షణమనియుఁ గాల్డువెల్లుగా రభిప్రాయపడిరి. అంత మాత్రమున నది ప్రాచీనతా లక్షణమనుట సరికాదు. వానియందు మాత్రము లోపింపఁ గూడదా? మఱియు మలయాళము తమిళ వికృతి యగుటచేతను దమిళమునఁ దొల్కాప్పియము నాఁటికే పురుష బోధక సర్వనామ ఖండములు పూర్తిగ వెలసియుండుటచేతను మలయాళ శాసనములలో సైత మవి కనఁబడు చున్నవని దొరగారె యంగీకరించి యుండుటచేతను మఱియు నందుఁ గాల బోధక చిహ్నము నేఁటికిని నిల్చియుండుటచేతను మలయాళమునఁ బ్రాచీనతమ కాలమునఁ బురుష బోధక చిహ్నములు లేవనియెడి తలంపు విశ్వాసనీయముగఁ దోఁపదు. ఇంతియకాక మలయాళమందలి 'అడిచు' మున్నగు వానిలోని 'చు' అనునది క్త్వార్థకమనుట సరికాదు. అయ్యది ద్రావిడ భూతార్థక 'త' కార పరిణామమనుట యుక్తము. క్త్వా ప్రత్యయమున కట్టి సమాపక క్రియార్థ ఘటనము సంభవింప నేరదు.

౧౨౮. II విష:—"(౨) కాలిక చిహ్నములు:—ధాతువులకును బురుష బోధక సర్వనామ ఖండములకును నడుమఁ గాలబోధక చిహ్నములు నిల్చుట యిండో యూరపియను భాషలలో లేదు. ఉదా:—'అమ్ ఓ'=(ప్రేమింతును నేను) అనుచో 'అమన్త్ ఓ' అని నిల్చుట కానరాదు. (చూఁడు ౧౨౮ I విష). కాని ద్రావిడ భాషలయం దట్లు నిల్చుటయే నియతము. ఇట్టి వైలక్షణ్యము 'టర్కిష్' భాషలందును గలదు. వీనిలో సైతము 'పగుది'=(ప్రకృతి)=(ధాతువు), దానిపైని 'ఇడైనిలై'=(మధ్య నిల్చునది)=(కాల బోధక ప్రత్యయము), దానికిఁ బరముగ 'విగుది'=(వికృతి)=(పురుష బోధక ప్రత్యయము) నిల్చును. ఉదా:—టర్కిష్ (సిథియను):—ఓల్=('ఉండు'-ఇది ధాతువు). దీని శత్రర్థక రూపము—'ఓలూర్'=(ఉండుచు). దీనిపైని మధ్యమ పురుషైకవచన ప్రత్యయమగు 'సెన్' అనునది చేరఁగా 'ఓలూర్ సెన్'=(నీ వున్నావు) అని

యేర్పడును. ప్రాచ్య టర్కిష్:—బోల్=(ఉండు), దీని శత్రర్థకము—'బోలా'— (ఉండుచు), దీనిపైని 'మెన్' అను నుత్తమ పురుషైకవచన ప్రత్యయము చేరఁగా 'బోలామెన్'=(ఉన్నాను)" (కాల్డు. ౪౭౩ పుట).

"ద్రావిడభాషలకును గౌడభాషలకునుగల భేదములు:—ఉత్తర హిందూస్థాన భాషలలో శత్రర్థకమునకు సహాయక్రియను జేర్చుటచేత వర్తమానార్థకరూపమేర్పడును. ఉదా:—బెంగాలీ:—'కరి+తే+ఆఛి=కరితేఛి=(చేయుచున్నాను.) (కరితే=చేయుచు, ఆఛి=ఉన్నాను). ఈ యుత్తర హిందూస్థాన భాషల ప్రభావముచేతఁ దెల్గునందును నిట్టివాడుక వెలయుచున్నది. (చేయుచున్నాను-వర్తమాన), కాని యీ మార్గమును వీడనగును. ఇతర ద్రావిడభాషల పద్ధతి ననుసరించిన ప్రాచీనమార్గము వేఱొకటికలదు. ('చదువుతాను' అనునది కాఁబోలును). తమిళకన్నడములలో వర్తమానార్థక క్రియలయందు సహాయ క్రియలను జేర్చు సంప్రదాయములేదు. కాని యట్లు సహాయక్రియలను జేర్చు సంప్రదాయము భూతభవిష్యదర్థక రూపములలోఁ దమిళకన్నడము లందును గలదు. (భూతమందు-'త్', భావియందు 'ప్=వ్' అనునవి కాఁబోలును). మలయాళమునఁ దెలుఁగునందునలెనె సహాయక్రియను నిల్పు సంప్రదాయము గలదు. కాని దాని యర్థమునం దించుక మార్పుగలదు. తెల్గువర్తమానరూపములు:—'నడచు+తు+ఉన్నాను'. ఇది 'నడచుతాను' అను దానికి సమానార్థకము. తమిళవర్తమానరూపములు:—నడక్కి-జేన్=(నడచుచున్నాను). కన్నడవర్తమాన:—నడెయుత్తేనే=(నడచుచున్నాను). మలయాళ వర్తమాన:—ఞాన్ నడక్కున్ను=(నేను నడచుచున్నాను). ఞాన్ నడక్కున్నుణ్డ =(నేను నడచుచునే యున్నాను). తమిళమున దీనికిఁ బూర్తిగా సరిపడురూపమొకటి గలదు" (కాల్డు. ౪౭౩, ౪౭౪ పుటలు).

విమర్శము:—గౌడభాషల ప్రభావముచేతఁ దెలుఁగు వర్తమానరూపములలో 'ఉండు' ధాతురూపములు చేర్చుట సంభవించెననుటకన్నఁ బ్రాచీనములగు ద్రావిడభాషల ప్రభావముచేతనే గౌడభాషల వర్తమాన క్రియలలో సహాయ క్రియల మేళనము సంభవించెననుట విశ్వసనీయమై యుండును. సంస్కృతమున వర్తమానక్రియలలో నిట్లు సహాయక్రియల మేళనము లేమింజేసి యీ పద్ధతి గౌడభాషలకుఁ ద్రావిడభాషలనుండియే కల్గెననుట యుక్తము. భూతార్థకములలో 'త=ద' లును భావ్యర్థమున 'వ=వ' లును ననెడి భూత భావ్యర్థక శబ్దఖండములు చేరునట్లె తమిళ వర్తమాన క్రియలలో 'కిన్రు=కిఱు' అనునవియుఁ బ్రాచీన కన్నడ వర్తమాన క్రియలలో 'దప' అనునదియుఁ జేరుచున్నవి. 'కిన్రు-దప' అనునవి సైతము వర్తమానార్థబోధన క్షమ శబ్దముల

ఖండములె యని విశ్వసింపసగును. తెలుఁగునందలి 'చు+ఉండు' అనువాని వలెనె తమిఴమందును 'కు+ఇన్ఱు=కిన్ఱు' అనునవి నిల్చుచున్నవి. తమిఴ మందలి 'ఇన్ఱు' శబ్దమునకు 'నేఁడు=ఇప్పుడు' అని యర్థముగాన నది వర్తమానార్థ బోధన క్షమ మగును. ఇట్లె వ్యాఖ్యాతల తలంపు. 'కిన్ఱు' అనుదానిలోని 'న'కారలోపమున నేర్పడినదే 'కిఱు' అనురూపమని గ్రహింపనగును. మార్గాంతరము:—అరయునరయఁ బలగన్నడ వర్తమాన రూపసాధన పద్ధత్యనురోధమునఁ దమిఴమందును భావ్యర్థకమగు 'కు' ప్రత్యయమును 'ఇప్పుడు' అను నర్థముగల 'ఇన్' శబ్దమును భూతార్థకమగు 'తు' ప్రత్యయమును మేళగించుటచేత 'కిన్ఱు' అను వర్తమానార్థక ప్రత్యయము మేర్పడుచున్నదని తోఁచుచున్నది. అద్యతన భూతభావి మేళనమేకదా వర్తమానము! 'చేయుచున్నాను' మున్నగుచోటు లందలి క్రియలు భూతమున నారబ్ధములై యింకను వర్తించుచుండును గదా. ప్రారబ్ధాపరిసమాప్తము వర్తమానము. పలుగన్నడమందలి 'దప' అను వర్తమాన ప్రత్యయమునందున్న 'ద' అనునది భూతార్థకము 'ప' అనునది కన్నడభావ్యర్థక 'వ'కారమునకుఁ బ్రకృతి. ఇట్లగుటచేత ''తమిఴ కన్నడ ములలో ''భూతభావ్యర్థములందు మాత్రమె సహాయ క్రియాయోగము గలదు. వర్తమానమున లేదు'' అను డా. కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదని గ్రహింపనగును. 'త'కారాభిన్నమగు 'ద'కారమును 'ప'కారాభిన్నమగు 'వ'కారమును భూతభావ్యర్థక శబ్దఖండములె యనఁదగును. 'ఇన్' అను సర్వనామ మద్యతనార్థకము. తెల్గునందలి 'నడచుతాను' అనునది 'నడచు తున్నాను=నడచుచున్నాను' అనుదానికి సమానార్థకమను దొరగారి వ్రాఁతయు సరికాదు. 'నడచుతాను' అనునది తద్ధర్మార్థకము. 'నడచెదను-నడతును' అనునవి దీని గ్రాంథికరూపములు. నడచుతున్నాను' అనునది వర్తమా నార్థకము. దీనికి 'నడచుచున్నవాఁడను=నడచుచున్నాఁడను=నడచుచున్నాను. అనునవి గ్రాంథికరూపములు. మలయాళమునందలి వర్తమానార్థక 'కు' ప్రత్యయము తెల్గులోని వర్తమానార్థక 'చు' ప్రత్యయమున కభిన్నము. ప్రాచీనకాలమున 'కు' ప్రత్యయము కాలత్రయ వాచకమై యుండెడిది. 'కు' వర్ణకము 'చు' వర్ణకముగాఁ బరిణమించుట సహజమె. తొల్కాప్పియము నాఁటికిఁ దమిఴమున వర్తమానార్థక 'కిన్ఱు' ప్రత్యయ ఘటితరూపములు లేవు' అర్వాచీనమగు నన్నూలున సాధితములయ్యెను.

''ఆనిన్ఱు......'' (నన్నూలు ౧౪౩ సూ.) 'ఆనిన్ఱు-కిన్ఱు-కిఱు' అనునవి వర్తమానార్థక ప్రత్యయములు .(ఆన్+ఇన్+తు). చెయ్+ఆనిన్ఱు+ఆన్=

(చేయుచున్నాఁడు) (చూడు ౧౩౦ IV విష.). దీని ప్రయోగ మరుదు. చెయ్‌కిన్ఱాన్ = చెయ్‌గిఱాన్ =(చేయుచున్నాఁడు).

"అవ్వోడు......" (నన్నూలు ౧౪౫ సూ.)=‘ఉ-తు’ భూతార్థక భావ్యర్థకైకవచన ప్రత్యయములు. ‘డు’ భూతార్థకము. ‘కు’ భావ్యర్థము ......ఉదా:—చెన్ఱు = (చనితిని). వన్దు = (వచ్చితిని). వరుదు = (వత్తును). కణ్డు = (చూచితిని). చెయ్‌కు = (చేయుదును = చేయఁగలను). (చూడు ౧౪౦ సూ.)

‘ఇన్’ అనునదియు భూతార్థకము. "తడఱ........." (నన్నూలు ౧౪౨ సూ.) = ......‘ఇన్’ భూతార్థకము. ఉదా:—పోయినాన్ = పో+ఇన్+ఆన్) = పోనాన్ = (పోయెను). (ఇన్=ఇప్పుడు—చూడు. ౧౧౬ III విష.) (౨౮ V విష. చూడు).

"ద-దప-వ-కారాద్యా స్తాభూతవతీ వర్తమాన భవిష్యన్త్యః" (కర్ణా. భూ. ౧౯౬ సూ.)=ఆ పురుషబోధక ప్రత్యయములు ‘ద’ పూర్వకములై భూతవతీ సంజ్ఞనందును. ‘దప’ పూర్వకములై వర్తమాన సంజ్ఞనందును. ‘వ’ పూర్వకములై భవిష్యన్తీ సంజ్ఞ నందును. ఇంక డా. కాల్డువెల్లుగా రుదాహరించిన ‘నడెయుత్తేనె’ (నడుచుచున్నాను) అనురీతిగల రూపములు హొసగన్నడమున వర్తమానార్థకములై యున్నమాట సత్యమె.

"ధాతువిగె వర్తమానకాలద అఖ్యాతప్రత్యయగళు సేరువాగ ధాతువిగూ ప్రత్యయక్కూ నడువె ఉత్త, భూత ప్రత్యయగళు సేరువాగ ‘ద’, భవిష్యత్ప్రత్యయగళు సేరువాగ, ‘ఉవ’ ఎంబ వికరణప్రత్యయగళు బరువవు. ఉదా:-వర్తమాన:-తిళియుత్తేనె = (తెలియుచున్నాను)" (శబ్దాదర్శ: — హొసగన్నడ వ్యాక. ౮౦ సూ).

పై రీతిగల రూపములలో వర్తమానార్థకములందు శత్రర్థకప్రత్యయముగు ‘ఉత్త’ అనునది యున్నను దానిపైని దమిళాంధ్రములందువలె నద్యతనార్థసూచకములగు ‘ఇన్ఱు’ మున్నగువానివంటి శబ్దములు లేమింజేసి యిట్టి సమ్మేళనము ప్రాచీన కర్ణాటమున వర్తమానసమాపక క్రియారూపసాధకముగా నంగీకరింపఁబడదయ్యె. ఇంకఁ దమిళుపద్ధతిని వర్తమానభావిమేళనరూప ‘దప’ ప్రత్యయఘటితములకె వర్తమానకాల సమాపకక్రియాత్వ మంగీకరింపఁబడెను. (చూడు-పై నుదాహరించిన మార్గాంతరము మొ.).

‘ఉత్త’ మున్నగు ప్రత్యయములు వర్తమానార్థకములుగఁ గృదంతరూపములందు మాత్రమె నిల్చునుగాని పళగన్నడ సమాపకక్రియలందు నిల్వనేరవు.

"అచ్ కర్తృ కర్మణోః"="ధాతోః అచ్ ప్రత్యయో భవతి కర్తరి, కర్మణిచ అభిధేయే" (కర్ణా. శబ్దా. ౫౪౩ సూ.).

"ఉతె దుత్తె దుతు ముత్తుమ్ స త్యచో వా"=ధాతోః పరస్య వర్తమాన కాలే విహితస్య అచః ('అచ్' అను పై సూత్రమున విధింపఁబడిన కృత్ ప్రత్యయము) 'ఉతెత్-ఉత్తెత్-ఉతుమ్-ఉత్తుమ్...' ఏతే ఆదేశా వా భవన్తి. ఉదా:— మాడుతె-మాడుత్తె. మాడుతుం-మాడుత్తుం-పక్షే-మాడిదపం=(చేయుచున్న వాఁడు). ......అచఇతికిమ్-మాడిదపయ్=(చేయుచున్నావు)......" (కర్ణా. శబ్దా. ౫౪౪ సూ.).

పయి ఉదాహరణములలోని 'అచ ఇతి కిమ్మను ప్రత్యుదాహరణమును బట్టి 'ఉత్తెత్' మున్నగునవి సంస్కృత శతృ ప్రత్యయార్థక కృద్రూపములందే నిల్చును గాని సమాపకక్రియా రూపములందు నిల్వనేరవని విశదమగుచున్నది. ఈ విషయము నీ క్రింది మకరంద వ్యాఖ్య విశదీకరించుచున్నది. "తత్ర వివక్షావశాత్ వర్తమానకాలే విహితస్య అచః ఉతె-ఉత్తె-ఇత్యాదయ శ్చత్వారోఽపి ఆదేశా విభాషయా భవన్తి. పక్షేతు అచ్ ప్రత్యయే పరే ధాతోః దపప్రత్యయో భవతి......ఆదేశా శ్చైతా శ్శతృశాన (సంస్కృత) సమానార్థా మన్తవ్యాః. మాడుతె=మాడుత్తె=(కుర్వన్నిత్యర్థః)......" (మంజరీ మకరంద వ్యాఖ్య ౫౪౪ సూ.).

'తు' ప్రత్యయము సైతము ప్రాచీనతమ ద్రావిడభాషలో భూతభావ్యర్థ బోధకముగా నుండెడిదనియు దానిపైని సైతము 'తు' ప్రత్యయము మీఁదవలెనె పురుషబోధక సర్వనామ ఖండములు నిల్వకయె యది భూతభావ్యర్థకమై మూఁడు పురుషములందును వ్యవహరింపఁబడుచుండెడిదనియు నయ్యదియె తమిలమున నుత్తమ పురుషమున 'తు-తుమ్' అను రూపములతో వరుసగ నేకవచన బహువచనములను భూతభావ్యర్థకమై ప్రాచీన కాలమున వాడఁబడెడిదనియు నయ్యదియె పలుగన్నడమందలి పైని వ్రాసిన "ఉతె-ఉత్తె-ఉతుమ్-ఉత్తుమ్" అను వర్తమాన ప్రత్యయములుగఁ (భూతభావి మేళనమె వర్తమానకాలము గాన) బరిణమించెననియుఁ గ్రహింపవలయును.. (చూడు పైనుదాహరించిన 'అవ్వాడు ......' అను ౧౭౫ నన్నూలు సూ. ౧_౨౮ IV విష.).

౧_౨౮. III విష:—"(3):—కాలపురుషాది బోధకప్రత్యయ రాహిత్యము:—"తెల్గున భూతతద్ధర్మార్థకముల ప్రథమ పురుషైకవచన రూపములందుఁ గాల పురుషలింగవచన బోధకప్రత్యయములు కానరావు. ఉదా:—"ఉండితిని

=(ఉత్తను పురుషైక వచనము.) ఉండితివి"=(మధ్యమ పురుషైక వచనము) అను వీనియందుఁ గాల పురుషవచన బోధకప్రత్యయములు గలవు. కాని 'ఉండెను' అనెడి ప్రథమ పురుషైక వచనమున నట్టి చిహ్నములు లేకుండుట యటుండఁగాఁ దుదికి భూతార్థబోధక 'తి' ప్రత్యయము సైతము కానరాదు. ఇట్లే తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనమునందును గాల పురుషవచన బోధక ప్రత్యయములు కానరావు. ఉదా:—ఉండును. ఈ రెండిటియందును దుది నున్న "ను" వర్ణకము తమిళమునందలి 'ఉమ్' అను చార్థకమువంటిది. కొన్ని యెడల వీనిలోని తద్ధర్మరూపములందలి 'ను' వర్ణకము సైతము లోపించి ధాతు రూపమె ప్రథమ పురుషైకవచన రూపముగ నిల్చును. ఉదా:—'పడును=పడు' అను రెండును దద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచన రూపములె. తమిళ కావ్య భాషాప్రయోగము లమహదేకవచన బహువచనములలోఁ దెల్గును బోలును. అందును ముఖ్యముగా వ్యతిరేక క్రియారూపములలో నట్టి పోలిక బలముగా వెలసియున్నది. ఉదా:—'చెయ్యా' (సెయ్యా)=(అది చేయదు) అనునది 'చెయ్యాదు'=(సెయ్యాదు) అనుదానికి బదులుగా వాడఁబడుచున్నది" (కాల్డు. ౪౮౪, ౪౮౫ పుటలు).

"ఇట్టి వాడుకలు కేవలము భిన్నములగు భాషలందును గన్పట్టుచున్నవి. న్యూ పెరిషియను భాషయందు భూతార్థక ప్రథమ పురుషైక వచనమున (దీనిని వైయాకరణులు సంక్షేప భావార్థక మందురు.) ధాతువే యనఁదగు క్రియారూపము నుపయోగింతురు. హెబ్రుభాషయందు భూతార్థక పుంలింగ ప్రథమ పురుషరూపమున సర్వనామ ప్రత్యయముచేరని క్రియానామవాచక ముపయోగింపఁబడును. ఇట్టి విశేషమే పెక్కు భాషలందలి వర్తమానకాలిక ప్రథమ పురుషరూపములలో నగపడుచున్నది. ఉదా:—టర్కిషు భాష:—వర్తమాన:—ఓలూరుమ్=(నేనున్నాను). ఓలూర్ సెన్=(నీవున్నావు.) ఓలూర్ =(వాఁడున్నాఁడు). (ఓల్=ఉండు. ఊర్=శతృప్రత్యయార్థకము. చూడు ౧-౨౮ II విష). ఆర్మొరికను భాష:—వర్తమాన:—కనన్న=(నేను 'పాడు చున్నాను') కనెజ్ (నీవు పాడుచున్నావు). కన్=(వాడు పాడుచున్నాఁడు). హంగేరియన్ భాష:—వర్తమాన:—ఇస్మెరెక్=(నేనెఱుఁగుదును). ఇస్మెర్సజ్= (నీవెఱుఁగుదువు). ఇస్మెర్=(వాడెఱుఁగును)" (కాల్డు. ౪౮౫ పుట).

విమర్శము:—భూత తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనరూపములు రెంటను దుదనుగల 'ను' అనునది సముచ్చయార్థక 'ను' శబ్దమనెడి దొరగారి వ్రాఁత సరికాదు. వాని తుది 'ను' వర్ణ మర్థవిశేషశూన్య ద్రుతరూపము. అది సముచ్చయార్థక 'ను' శబ్దముకాదు. అచట సముచ్చయార్థమునకుఁ

ప్రసక్తిలేదు. "ప్రథమైకవచన లోప। స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్" "ప్రథమైక స్యైర్ద్విచేచ్చ భూతార్థే" (చూడు వ్యా. సం.' ౭౯౬ I విష). "అన్యే ద్రుతప్రకృతయః" (వ్యా. సం. ౧౭ విష. చూడు).

మఱియు భూత తద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచనములు ప్రక్రియా లాఘవమునకై లోపించెనని వైయాకరణులు నయితము సూత్రించిరే కాని యట్లు లోపింపలేదు. భూతమందు 'ఎన్' అనియును దద్ధర్మమున 'ఉన్' అనియును పురుషబోధక ప్రత్యయములు చూపట్టుచునే యున్నవి. అందలి 'ఉన్' అనునది తమిళమందలి 'ఉమ్' అనెడి ప్రథమపురుష ప్రత్యయమున కభిన్నమనఁదగుననియు నది తెల్గున సంధివశమునఁ గానరాలేదనియు గ్రహింప నగును. తెల్గున 'తి' అనునదిమాత్రమె భూతార్థక ప్రత్యయము కాదు. 'ఇ+తి' అనునవి రెండును భూతార్థకములె. "క్త్వా భూతయోః క్రియాన్త్యస్యేత్" (ఆం. చిం. 'వ్యా. సం.' ౭౯౬—౩౧౧ విష. చూడు). తెల్గు క్రియల లోని ప్రథమ మధ్యమపురుష బహువచన రూపముల భేదమును దెల్పుటకై ప్రథమపురుషమున 'తి' ప్రత్యయము లోపించినను 'ఇ' అను భూతార్థక ప్రత్యయము నిల్చియేయున్నది. తద్ధర్మ ప్రథమపురుష బహువచనమున 'దు-ఎదు' అనునవి లోపింపనేలేదు. వింతయగు 'ఉమ్' ప్రత్యయము వచ్చుటచేత నేకవచనమున 'దు' లోపించినది. ఉదా:—భూత-కొనియెన్-కొనిరి. తద్ధ-వారు చదువుదురు. ఇంక భూత ప్రథమ పురుషైకవచనమున 'ఎన్' అను నదియుఁ దద్ధర్మ ప్రథమ పురుషైకవచనమున 'ఉన్' అనునదియు నజ్ఞాతచరిత్రక ప్రథమపురుష ప్రత్యయములు నిలుచుచున్నవి.

తద్ధర్మరూపమందలి 'ను' వర్ణక మంతటను లోపించుననెడి దొరగారి వ్రాఁతయు సరికాదు. హలవసానపరకత్వమున మాత్రము సంధివశమున నట్టి ద్రుతము లోపించును. అట్టి లోపము తద్ధర్మార్థకమందే యనుు దొరగారి యాశయము పొరపాటు. భూతార్థకరూపమందును గల్గును. "స్వరసరళ పరకత్వమున వానికి లోపము గలుగదు. ఉదా:—పడున్+ఎవ్వఁడు=పడు నెవ్వఁడు. "పడెవ్వఁడు" అను రీతి రూపమెన్నఁడును గల్గనేరదు. పడున్+ తండ్రి=పడుందండ్రి. పడెన్+తండ్రి=పడెందండ్రి. ఇచట "పడుతండ్రి. పడెతండ్రి" అను రూపములు గల్గనేరవు.

తమిళమునందలి 'చె (సె) య్యా' అనుదానికి 'చేయదు' అను నర్థము లేదు. 'చేయవు' అను బహువచనార్థము గలదు. అచటి దీర్ఘము 'ఆ' అనెడి ప్రథమపురుష బహువచనరూపము. అచటి పురుషబోధక ప్రత్యయము

లోపింపలేదు. కావునఁ దమిటమున వ్యతిరేక ప్రథమపురుషైకవచన ప్రత్యయము లోపించుననెడి దొరగారి యాశయము సరికాదు.

"అ-ఆ-వ......" (తొల్కా. ౭౦౦ సూ.)—'అ-ఆ-వ' అనునవి తుదిని గల క్రియ లమహత్ప్రథమపురుష బహువచనరూపములు. ఉదా:—చె (సె) య్దన=(అవి చేసెను) చె (సె) య్యా=(అవి చేయవు). చె (సె) య్కువ= (అవి చేయఁగలవు=అవి చేయును)."

౧-౨౭. IV విష:—తమిటమందలి 'తు-కు' ప్రత్యయములు:—"(౮) నాగరక తమిటమున నేఁడు భూతార్థమున వాడఁబడెడి "సెయ్దు" అను రూపమె యన్ని పురుషములందును భూతార్థక ప్రాచీనైక వచనరూపముగఁ బ్రాచీనకావ్యభాషయందు వాడఁబడును. అట్లె 'ఉమ్' అను బహువచన ప్రత్యయమును జేర్చిన "సెయ్దుమ్" అనునది భూతార్థమున నెల్ల పురుషము లందును బహువచనరూపముగఁ బ్రాచీన తమిటకావ్యములలోఁ బ్రయోగింపఁబడియున్నది. ఇట్లె "కు=గు" అనునది తుదినిగల ధాతురూపములు భావ్యర్థైకవచనరూపములుగ నుత్తమపురుషమునందుమాత్రము ప్రాచీన తమిటకావ్యములలో వాడఁబడియున్నవి. "కుమ్=గుమ్" అనునది తుదినిగల ధాతురూపములు భవిష్యదర్థకోత్తమపురుష బహువచనరూపములుగఁ బ్రాచీన తమిటకావ్యములలోఁ బ్రయుక్తములై యున్నవి. ఈ 'కు' ప్రత్యయాంతములు 'దు' ప్రత్యయాంతములవలె నెల్ల పురుషములందును వాడఁబడవు. 'కు' ప్రత్యయాంతము లుత్తమపురుషమందుమాత్రమె వాడఁబడును. దీనినిబట్టి 'కు' ప్రత్యయాంతముల ప్రథమ మధ్యమ పురుషరూపములు తమిటమున గ్రాంథికావస్థకుముందే నశించియుండునని తోఁచుచున్నది. ఆధునిక తమిటమందలి తద్ధర్మభావి ప్రత్యయమగు 'ఉమ్' అనునది, యమహత్క్రియలకే నియతమైయున్నది. దీని నేకత్వ బహుత్వములు రెంటను వాడవచ్చును. గ్రాంథిక తమిటమందలి యీ 'గు-గుమ్' అనువానికంటె గ్రాంథిక కన్నడమందలి 'గుమ్-కుమ్' అనునవి మిక్కిలి విరివిగా వాడఁబడియున్నవి. గ్రాంథిక తమిటమందలి యీ 'గు-గుమ్' అనునవి యుత్తమపురుషమందె నియతముగా వాడఁబడును. గ్రాంథిక కన్నడమందన్నో యెల్ల పురుషములందును వాడఁబడును. ఉదా:—కన్నడ:—అవర్ మాడుగుమ్=(వారు చేయుచున్నారు). కన్నడమున 'కు' అనుదాని వాడుక లోపింపలేదు. ఉదా:—కే(బే?)కు=(తమిట-వేణ్డుమ్)=వలయును=(Must). పయి సందర్భమునుబట్టి ప్రప్రథమావస్థలోఁ దమిటక్రియలకు 'తిజ్ఞులే' లేవనియు నట్లగుటనే మలయాళమున నంతత్వరగా తిజ్ఞులు లోపించుట సంభవించెననియు విశదమగుచున్నది. తమిటాది మాండ

లికభేదముల నందని మూల ద్రావిడభాష 'తిఙ్' ప్రత్యయరాహిత్యావస్థలో నుండెడి దనఁదగును. చీలిన తమిళాదులందెల్ల నేవో కొన్నిరూపములందు 'తిఙ్' విధానము గన్పట్టుచునేయున్నది. పై ద్రావిడభాషల స్థితి వాని ప్రాచీనతను వెల్లడించుచున్నది" (కాల్డు. ౪౮౫, ౪౮౬ పుటలు).

విమర్శము:—ప్రాచీన తమిళమున దొరగారు చెప్పినట్లు భూతమందే కాక భవిష్యదర్థమందును 'తు' అనునది (చూడు ౧౨ా II విష.) యుత్తమ పురుషైకవచనమందును, 'తుమ్' అనునది భూతభవిష్యదుత్తమపురుష బహువచనమందును బ్రయుక్తమగుచుండెడివి. సర్వనామఖండములు లేకయే యవి యుత్తమపురుషమును బోధించెడివి. అట్లె 'కు' అనునది యుత్తమపురుషైక వచనమునందును 'కుమ్' అనునది యుత్తమపురుష బహువచనమునందును భవిష్యదర్థమున ధాతువునకుఁ బరముగ నిల్చెడివి. ఉదా:—చెయ్దు=(చేసితిని-చేయుదును). చెయ్దుమ్=(చేసితిమి-చేయుదుము). చెయ్కు=(చేయఁగలను=చేయుదును). చెయ్కుమ్=(చేయఁగలము=చేయుదుము). 'తు-తుమ్' అనునవి భూతమందుమాత్రమె మూఁడు పురుషములందును వచ్చెడివనెడి దొరగారి వ్రాఁత నిజముకాదు. తమిళమున 'తు-కు' అనునవి యుత్తమపురుష మందుమాత్రమె వచ్చును. తొల్కాప్పియమున 'తు-కు' అనునవి యుత్తమ పురుషమందుమాత్రమె నిల్చునని యీ క్రిందిరీతిని జెప్పఁబడెను—నన్నూలు నందును దొల్కాప్పియవ్యాఖ్యలందును నట్లె వ్రాయఁబడెను. (చూడు ౧౨ా II విష. నన్నూలు ౧౪౦—౧౪౫ సూ.).

"క ట త అ......" (తొల్కా ౬౮౭ సూ.)="'కు, టు, తు, అు,' అనునవియును, 'ఎన్-ఏన్-అల్' అనునవియును దుదినిగల క్రియలుత్తమపురు షైకవచనములు."

"అమ్ ఆమ్......" (తొల్కా. ౬౮౬ సూ.)='అమ్—ఆమ్-ఎమ్-ఏమ్-కుమ్-డుమ్-తుమ్-అుమ్' అనునవి తుదినిగల క్రియలుత్తమ పురుష బహువచన రూపములు."

"కు-టు-అు-తు" అనునవె కాలమును (పురుషమును) సైతము దెల్పును గాన వీనిలో నొకటి నిల్చునపుడు వేఱు చిహ్నములు మఱి నిల్వనక్కఱలేదు (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు ౧౦-౧౨-౧౯౫౧ తేదీ జాబు).

"ప్రాచీనకాలమున సమాపక క్రియలయందు లింగవచన బోధక ప్రత్యయములు లేవు. కాలక్రమమున 'ఎన్-ఏన్' మొదలగు పురుషబోధక ప్రత్యయములు చేరినవి. ఇవి చేరని రూపములు:—'చెయ్కు-కణ్డు-చెయ్దు'

ఇవి సమాపక క్రియలె. పురుషబోధక ప్రత్యయములు చేరిన రూపములు:— చెయ్ కెన్-చెయ్ కేన్ =(చేయుదును) చెయ్ కువేన్ =(చేయఁగలను). భావి ప్రత్యయముపైని మరల భావిప్రత్యయము నిల్చెను. ఇట్టివానిలోని 'కు' అను దాని నిపుడు 'ఆగమ' మందురు......" (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారి ౯-౨-౧౯౫౨ తేదీ జాబు).

పటఁగన్నడమున 'మ' కార విరహిత 'కు-గు' ప్రత్యయములు నిల్వవు. 'కుమ్-గుమ్' అను 'మ' కారాంత ప్రత్యయములె యేకత్వబహుత్వములు రెంటను మూఁడుకాలములందును ప్రథమ పురుషమునఁ మాత్రము నిల్చును. భవిష్య త్కాలమందు మాత్రము ప్రథమ పురుషమున మాత్రము వచ్చునని ప్రాచీనుఁడగు నాగవర్మ సూత్రించెను. ఇవి కన్నడమున మూఁడు పురుషములందును వచ్చుననెడి కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదు.

"అ మరో ర్గుమ్" (కర్ణాటశబ్దా. ౪౯౩ సూ.)='ధాతోః పరయో స్సతి=(వర్తమానే) భూతే భవిష్యతి చ కాలే విహితయోః 'అమ్-అర్' ఇత్యేతయోః (ప్రథమాపురుషైకవచన బహువచనయోః) 'గుమ్' ఇత్యాదేశో వా భవతి పుంలిఙ్గే స్త్రీ లిఙ్గే నపుంసక లిఙ్గేచ విషయే."

"గుంకుమౌ భవిష్యన్త్యాః సర్వత్ర" (కర్ణా. భూ. ౨౧౯ సూ.)=భవిష్యత్ప్రథమ పురుషమున నన్ని లింగములందును నన్ని వచనములందును యథా ప్రయోగముగ 'గుమ్-కుమ్' అను నా దేశములు వచ్చును. ఉదా:—మీఱుగు మాతం=(అతఁ డతిక్రమింపఁగలఁడు=అతిక్రమించును). ఇర్కుమాతం=(అతఁ డుండఁగలఁడు=ఉండును-మొ.).

పయి నుదాహరించిన తమిళ కన్నడములందలి 'కు-కుమ్; గుమ్-కుమ్' ప్రత్యయముల నరయఁగాఁ గేవల ప్రాచీనకాలమందుఁ దమిళ కన్నడాంధ్రాదులు చీలకముందు మూల ద్రావిడభాషలో 'కు-తు' అనునవి ధాతువులపైని నిల్చుటచేతఁ గాల పురుషాదులు యథా సందర్భముగా వాచ్యము లగుచుండెననియుఁ గాలక్రమమునఁ దమిళాదిమాండలిక భేదము లేర్పడుటలో వానికట్టి వాడుక యడఁగి వానిపై మరలఁ గాలపురుషాదిబోధక ప్రత్యయములు నిల్చెననియు నక్కారణమున నట్టి 'కు-తు' అనునవి ధాతువు తుది నాగమములుగ నిల్చి 'కు-గు-చు-తు-టు-డు-ఉ' మున్నగు రూపములుగఁ బరిణమించెననియుఁ దోఁచుచున్నది.

'కు-తు' అనువానికంటెను వింతగ బ్రాచీన తమిళమున 'అన' అను ప్రత్యయ మొకటి పురుషబోధక ప్రత్యయయోగము లేకయె భావ్యర్థమునఁ

బ్రయుక్తమై యున్నది. ఉదా:—చెయ్మన = చేయుదును-చేయుదుము-చేయుదువు-చేయుదురు. ఇట్లె 'ఉమ్' అనునది భావిని బ్రథమపురుషమున వాడఁబడును. ఉదా:—చెయ్యుమ్ = అది చేయును. అవి చేయును-వాడు చేయును-ఆమె చేయును. ఇవి తొల్కాప్పియమునాఁటికి వెలసియుండెను. (౩౨ IV విష. చూడు).

'మున్నిలై......' (తొల్కా. ౨౦౬ సూ.) = 'మధ్యమపురుష క్రియలును, ససమాపక క్రియలును, ఇల్లై = (లేదు) శబ్దమును, వేఱు = (భిన్నము) శబ్దమును, చెయ్(సె)మ్మన మున్నగు 'అన' ప్రత్యయము తుదినిగల సమాపక క్రియలును 'ఉమ్' తుదినిగల క్రియలును, 'చె(సె)య్ద' మున్నగు ధాతుజ విశేషణములును' (పెయరెచ్చమ్ = నామమునకుఁ గొఱఁత = నామము లేక కొఱఁతపడినది) అనెడి యెనిమిది విధములగు శబ్దములును మహా దమహత్తులు రెంటను నేకరీతిగానే యుండును.'' ఉదా:—చెయ్మన = చేయుదును-చేయుదుము. ఇవి మూడు పురుషములందును నిట్లె యుండును. ఇట్లే తొల్కాప్పియము ౨౧౧ సూ.—'అన్న వెన్నుమ్...' అనుదానిలోను నీ 'అన' అనునది పేర్కొనఁబడెను. (చూడు 33 విష. ఎన్మనార్ = అందురు).

౧౨౮. V విష:—''(౫) ఇతర భాషలందువలెనె ద్రావిడభాషలందును 'తిఙ్లు' చేరుచున్నను నుత్తమ మధ్యమ పురుషములందు లింగవచన భేదములలో రూపభేదములు లేవు. ప్రథమ పురుషమునమాత్రము లింగ విషయక సూక్ష్మాతిసూక్ష్మ భేదములు గన్పట్టుచున్నవి. తమిటమున వేఱుగ సర్వనామములను జేర్ప నక్కఱలేకయే తిఙ్విశిష్టక్రియలవల్లనే యన్ని పురుషముల యర్థములను సంపాదింపవచ్చును. ఉదా:—వరుగిఱాన్ = (వాఁడు వచ్చుచున్నాఁడు) వరుగిఱాళ్ = (ఆమె వచ్చుచ్చున్నది.) వరుగిఱదు = (అది వచ్చుచున్నది) వరుగిఱార్ = (వారు వచ్చుచున్నారు) వరుగిఱార్గళ్ = (వారు వచ్చుచున్నారు.) వరుగిన్ద్రన = (వరుగిన్టన) = అవి వచ్చుచున్నవి'' (కాల్డు. ౪౮౬ పుట.)

విమర్శము:—సంస్కృతమునఁ బ్రథమ పురుషమందును రూపభేదములు లేవు. ఉదా:—రామః, సీతా, శైలః, అస్తి. (రాముఁడు-గలఁడు-సీతగలదు-శైలము గలదు). తమిటమందే యననేల? కన్నడమందును దమిటమందువలెనె యుండును. ఉదా:—కన్నడ-మాడు = (చేయు-ధాతువు):—ప్రథమ పురుషము-మాడిదం = (వాఁడు చేసెను) మాడిదళ్ = (ఆమె చేసెను) మాడిదుదు = ఆ వస్తువు చేసెను.) తెల్గునందును మహా దమహద్రూపములందుఁ బై పద్ధతి గలదు—వాఁడు-రాఁడు ఆమె-ఆ వస్తువు-రాదు-మొ.

"'అన్య యుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు" ఉదా:— వారును మీరును ధన్యులరు—మీరును మేమును ధన్యులము." (బాల వ్యాకరణ 3౯ సూ.) అనునది యూదిగాఁగలకార్యములును దమిళాదులందును వర్తించును. ఉదా:—తమి-చెయ్‌దోమ్=(వారును మీరును మేమును జేసితిమి).

౧౭౯. విష.—"కాలికరూప సాధనప్రక్రియ:—(క్త్వార్థకాదులగు క్రియాకాంక్షాసమాపకములు)—ద్రావిడ ధాతుజరూపములు రెండు విధములు I. ధాతుజ విశేషణములు=(Relative participles). II. క్రియాకాంక్షాసమాపకములు=(Verbal participles or Gerunds). ధాతుజ విశేషణములు ముందు వేఱుగ వివరింపఁబడును. ఇచటఁ గాలిక చిహ్నములతో నుండునట్టి క్రియాకాంక్షాసమాపకములను గుఱించి కొంత వివరించెదను. కాలిక చిహ్నములను వివరించు సందర్భమునందును మఱికొంత వివరింపఁబడును" (కాల్డు. ౪౮౯ పుట).

"క్రియాకాంక్షాసమాపకములు, వాని యర్థములును.=(Verbal participles their signification and force):— వ్యావహారిక తమిళమందును భూతకాలమును సంబంధించిన క్రియాకాంక్షాసమాపకరూప మొక్కటే కలదు. చెయ్‌దు=(చేసి-క్త్వార్థకము?). మలయాళమందును గ్రాంథిక తమిళమందును భవిష్యదర్థమును సూచించు క్రియాకాంక్షాసమాపక మొక్కటే కలదు చెయ=(చేయన్-తుమున్నాద్యర్థకము). ఆంధ్ర కన్నడములందు వర్తమాన భూతకాలములలో వేర్వేఱుగ రెండేసి క్రియాకాంక్షాసమాపకరూపములు గలవు. I. శత్రర్థకములు. II. క్త్వార్థకములు. తుళుభాషయందు వర్తమాన భావ్యర్థకముల కొకటియుఁ,బరోక్షభూతమున కొకటియు, నాసన్న భూతమున కొకటియు రూపములు గలవు. కాన నీ విషయమున వ్యావహారిక తమిళరూపము లల్ప సంఖ్యాపములైయున్నవి. ఇవి (శత్రర్థకములు) యిండో యూరపియను భాషలందువలె నెన్నఁడును విశేషణములు కానేరవు. కాన వీనిని 'పార్టిసిపిల్సు'=(Participles) అనరాదు. ఇవి సదా క్రియతోనె యన్వయించుచుఁ గాలమును హేతువును దెల్పును గాన వీనిని జరండు=(Gerunds) లనఁదగును. ఇండో యూరపియను భాషలలోని ధాతుజవిశేషణములు తమ విశేషణత్వమును గోల్పోకుండఁగనే క్రియాన్వయము గలవగును గాన వానిని క్రియాజన్య విశేషణము=(Verbal participles) లనవచ్చును గాని ద్రావిడ భాషలందు వానికట్టి విశేషణత్వము చెల్లదు గాన వాని నట్లనరాదు. 'Do' అనుదాని విషయమునమాత్రము లాటెను జరండులు ద్రావిడపు పార్టిసిపిల్సును (Participles) బోలియున్నవి" (కాల్డు. ౪౮౯,౪౮౭ పుటలు).

"ఈ క్రింది వాక్యములు ద్రావిడభాషలోని క్రియాకాంక్షాసమాపక ములశక్తిని బోధించును. I శత్రర్థకము:—శత్రర్థకము తమిళ మలయాళ ములలో లేనేలేదు. ఆంధ్ర కర్ణాటములలోఁ గలదు. ఉదా:—విక్రమార్కుఁడు దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచు రాజ్యపాలనము చేసెను. ఇందు 'శిక్షించుచు=(Punishing) రక్షించుచు=(Protecting)" అనునవి క్రియాన్వయముగల శత్రర్థకములు. (ఇట దొరగారు గన్నడాంధ్ర వాక్యముల నుదాహరింపలేదు.) ఆంగ్లమున 'Punishing' మున్నగువానిని విశేషణములుగను వాడవచ్చును. ద్రావిడ భాషలలో నట్టి వాడుకలు లేవు" (కాల్డు. ౪౮౭ పుట).

"II భూతార్థక క్రియాకాంక్షాసమాపకము:—ఉదా:—'శాలివాహనుఁడు విక్రమార్కుని జంపి పూర్ణాధికారము నొందెను.' అను వాక్యములోని 'చంపి' అనునది భూతార్థక క్రియాకాంక్షాసమాపకము=క్త్వార్థకము. దీని కింగ్లీషులో 'Having killed' అను సమస్తరూపమును వాడుదురు. 'చంపి' అనుదానికిఁ దమిళమున 'కొన్ద్రు' (కొన్ఱు) అనియుఁ గన్నడమున 'కొన్దు' అనియుఁ బర్యాయములు. వీని కాంగ్లమందును దమిళ కన్నడములందును విశేషణపు వాడుక లేదు. కాన నిట్టివానిని 'పార్టిసిపిల్సు' (Participles) అని వాడుచున్నను జరండులనుట (Gerunds) యుక్తము" (కాల్డు. ౪౮౭ పుట).

"పై వానిలో శత్రర్థకము విధేయ క్రియకు సమాన కాలమున జరుగు నప్రధాన క్రియయై యుండును. క్త్వార్థకము విధేయ క్రియకుఁ బూర్వ కాల వృత్తియగు నప్రధాన క్రియయై యుండును. తమిళమున నీ క్త్వార్థకము ముఖ్య క్రియకు సమాన కాలికమును బూర్వ వృత్తియునగు నప్రధాన క్రియయై యుండును. ఈ భూతకాలికాసమాపక క్రియకు వలసినపుడు వర్తమానార్థమును గల్గును. ద్రావిడ భాషలలో నీ క్త్వార్థకముల సమాపక క్రియా సమాన కర్తృకత్వము నియతమై యుండును" (కాల్డు. ౪౮౮ పుట).

"ఈ భూతార్థక ద్రావిడావ్యయములను సంస్కృత క్త్వార్థకములతోఁ బోల్పవచ్చును. ఉదా:—కృత్వా=(చేసి). ఈ రూప మవ్యయము. సముచ్చయార్థక శబ్ద ప్రయోగము లేకయే యివి క్రియా సముచ్చయమును బోధించును. ఉదా:—రాముఁడు వారధిగట్టి లంకకేగి రావణు వధించె. ద్రావిడ భాషలలో సముచ్చయార్థక శబ్దము విశేష్యములతో మేళగించునుగాని సమాపక క్రియలతో మేళవింపనేరదు. ప్రతి వాక్యమందును నొక్కొక్క సమాపక క్రియ ప్రధానమై యుండి వాక్య సమాప్తిని జేయుచుండును. తక్కిన యసమాపక

క్రియలన్నియు సమాపక క్రియచేయు వాక్య సమాప్తిని నిరీక్షించుచుండును. తమిళ వ్యాకర్త లిట్టి యసమాపకములను దుమున్నాద్యర్థకములు చేదర్థకములు మున్నగు జాతిలోఁ జేర్చి 'వినైయెచ్చమ్'=(సమాపక క్రియార్థ పూరకము) అని వ్యవహరింతురు" (కాల్డు. ౪౮౭ పుట).

"ధాతుజ విశేషణముల నీక్త్వార్థక ఘటిత స్థలములలోఁ బ్రయోగింపఁ దలఁచినపుడు తత్క్రియా పూర్వభావి క్త్వార్థక పరంపరను బ్రయోగించి కడపటి క్త్వార్థకమును ధాతుజ విశేషణముగా మార్పనగును. ఉదా:—రాముఁడు వారదిగట్టి లంక కేఁగి రావణుని జంపినవాఁడు. ఈ పద్ధతి సిథియను భాష లందును గలదు. తురేనియను భాషలోఁ గ్రియా పరంపరను జెప్పవలసినపుడు క్రియలను క్త్వార్థకములుగాఁ బ్రయోగించి (gerunds) వలసినచో విభక్తి ప్రత్యయమును జేర్తురని 'ఎడ్కిన్స్' దొరగారు చెప్పుచున్నారు. ఇట్టి స్థితి యీ రెండు కుటుంబములందును నుండుట నరయఁగాఁ జరిత్రమునందుఁ గ్రియాకాంతసమాపకములు (gerunds) క్రియా నామవాచకములై యుండి తీరవలయునని విశదమగుచున్నది" (కాల్డు. ౪౮౭ పుట).

విమర్శము:—తమిళమందే యననేల? కర్ణాటాంధ్రములందును భూతార్థక క్రియాకాంక్షాఽసమాపక మొక్కటే కదా. అట్లె భవిష్యదర్థ సూచకము తుమున్నాద్యర్థక మొక్కటే కదా కర్ణాటాంధ్రములందును గలదు.

డా. కాల్డువెల్లుగారు క్రియాకాంక్షాఽసమాపకములనుండి సమాపక క్రియా రూపములను సాధించు సిద్ధాంతము నవలంబించుట సరికాదు. క్త్వార్థకము నుండి భూతకాలిక సమాపక క్రియా రూపములను 'చేయుచున్' మున్నగు వర్తమానార్థక క్రియాకాంక్షాఽసమాపక రూపములనుండి వర్తమానార్థక సమాపక క్రియా రూపములను సాధించుట యుక్తము కాదు. క్రియాకాంక్షాఽసమాపకములకు సర్వనామములతో నన్వయ మసంభవము. కాన వానిపై సర్వనామ ఖండములు నిల్చెననుట పొసఁగనేరదు.

మఱియుఁ గన్నడమందలి 'మాడుతె-మాడుతుం' మున్నగునవి తెల్గులోని 'చేయుచున్' మున్నగు వానివంటివె యని డా. కాల్డువెల్లుగారు తలంచుచున్నారు. ఆకార సామ్యమున నదియే సరియను భ్రమగల్గుచున్నది. "కన్నడమున 'నగుతుం'=(నవ్వుచు=నవ్వుతూ) 'నొసుతుం' =(చూచుచు = చూస్తూ) అను రూపములు గలవు" (ఆం. భా. వి. ౫౭౪ పుట). అని వికాసకర్తగారు సైతము వ్రాసిరి.

"చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబు నందగు. ఉదా:—చూచుచుం బోవుచున్నాఁడు—చూచుచుం బోయెను. చూచుచుం బోవఁగలఁడు" (బాల వ్యా. క్రియా-౪౩ సూ.) అను చొప్పునఁ దెల్గునందలి 'చు' ప్రత్యయము క్రియాన్వయి యగు నవ్యయము. కావుననె తెల్గున దీనిపై 'ఉండు' ధాతు రూపములు నిల్చుట సంభవించుచున్నది. ఉదా:—చేయు చున్న - చేయుచున్న వాఁడు - చేయుచున్నాఁడు - మొ. కన్నడాదులం దెందును నిట్టి సంప్రదాయము లేదు. కావునఁ గన్నడమందలి 'ఉతె' మున్నగు వర్త మానార్థకములు సంస్కృత శతృశాన ప్రత్యయముల వంటివె యని యంగీకరింప వలసియున్నది. ఈ విషయమునె మకరంద వ్యాఖ్యాతయగు భట్టాకలంకుఁడు కంఠోక్తముగా వచించియున్నాఁడు.

"ఉతె దుత్తె దుతు ముత్తుం స త్యచో వా" (కర్ణాటక శబ్దా ౫౪౪ సూ). దీని భాషా మఞ్జరీ వృత్తి. "ధాతోః పరస్య వర్తమానకాలే విహితస్య అచః ('అచ్' అనునది కన్నడ కృత్ ప్రత్యయము) 'ఉతెత్-ఉత్తెత్-ఉతుం-ఉత్తుం' ఏతే ఆదేశా వా భవన్తి......". దీని మంజరీ మకరంద వ్యాఖ్యః—"పూర్వ యోగా ద్విహితః అచ్ ప్రత్యయః కాల విశేషానుపదేశాత్ సార్వకాలిక ఏవ. తత్ర వివక్షావశా ద్వర్తమానకాలే విహితస్య అచ్ ప్రత్యయస్య 'ఉతె' ఇత్యాదయ శ్చత్వార ఆదేశా విభాషయా భవన్తి. పక్షేతు 'అచ్' ప్రత్యయే పరే ధాతోః 'దప' ప్రత్యయో 'వ' ప్రత్యయో వా భవతి...... ఆదేశా శ్చైతే 'శతృ-శాన' సమానార్థా మన్తవ్యాః మాడుతె=కుర్వన్నిత్యర్థః' కూడుతె = యుఞ్జాన ఇత్యర్థః." (చూడు ౧౭౦ II విష) అని యిట్లు 'మాడుతె-కూడుతె' అనువానికి 'కుర్వన్-యుఞ్జానః' అని ప్రథమాంతములతో నర్థము నిచ్చియున్నాఁడు. దీనినిబట్టి 'మాడుతె' = (చేయుచున్న వాఁడు) 'కూడుతె'=(కూడుచున్న వాఁడు) అని వాని యర్థమును గ్రహింపవలయునే కాని 'చేయుచు-కూడుచు' అని యర్థమును గ్రహింపరాదుగదా.

శతృ-శాన ప్రత్యయాంతములు విధేయ విశేషణములగుచుఁ గ్రియా న్వయము నందుట సంస్కృతమందును బ్రసిద్ధమె. "శ్లో. తథాపి జిహ్మః స్స భవజ్జి గీషయా। తనోతి శుభ్రం గుణసంపదా యశః। సమున్నయన్ భూతిమ్......" (భారవి. ౧ సర్గ). ఏయి సందర్భమునుబట్టి కన్నడమందలి 'ఉతె-ఉతుం' ప్రభృ

తులు తెల్గులోని 'చు' వర్ణకము వంటి క్రియాఽకాంక్షా సమాపకము లనెడి డా. కాల్డువెల్లుగారి యాశయము సరికాదని విశదమగుచున్నది గదా.

భూతకాలికాఽసమాపక క్రియకు వలసినపుడు వర్తమానార్థము వచ్చునని దొరగారు వ్రాసిరే కాని యట్టి యుదాహృతుల నీయరైరి. 'రాముఁడు వారధిగట్టి లంకకేఁగి రావణుఁజంపి సీతం గైకొనెను' అను వాక్యమునందలి క్త్వార్థములతో వర్తమానార్థ మెంత మాత్రము పొసఁగనేరదు గదా.

క్త్వార్థమునకు సమాపక క్రియా సమాన కర్తృ కత్వము ద్రావిడ భాషలలో నియతమని దొరగారు వ్రాసిరి. కాని యట్టి నియమము లేదని కొందఱందురు "ఒకానొకచో భూతార్థకాఽసమాపక క్రియ హేత్వర్థ కంబు నగు" ఉదా:—"రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె" (భార. ఆది. ౨ ఆ. 'ప్రౌఢ. క్రియా. ౧౫ సూ.) ఇట్టి ప్రయోగములు సంస్కృతమందును గలవు. "ఇతి మతి రుదయాసీత్ పక్షిణః ప్రేక్ష్య భైమీమ్" (నైష. ౨ సర్గము). ఇట్టి యెడల "భైమీం ప్రేక్ష్య స్థితస్య (శేషపదమ్) పక్షిణః మతి రుదయాసీత్" అని మల్లినాథాదులు వ్యాఖ్యానించిరి. కావున క్త్వాంతమున కనంతర క్రియా సమాన కర్తృకత్వము నియతమె యననగును (చూడు 'వ్యా. సం.' ౩౧౧ విష). తొల్కాప్పియరును క్త్వాంతమున కనంతర క్రియా సమాన కర్తృకతా నియమమును సూత్రించెను.

"అవఱ్ఱుళ్......" (తొల్కా. ౭౧౮ సూ.)='చెయ్దు - చెయ్పు - చెయ్యూ' అనురీతిగల క్త్వార్థక క్రియలు సమాపక క్రియా సమాన కర్తృకములై యుండును. వీనికి సమాపక క్రియా భిన్న కర్తృకత్వమును విరివిగాఁ దమిళకవులు ప్రయోగించిరని వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఉదా:—పామ్బు కడిత్తు ఇఱన్దాన్=(పాము కఱచి చచ్చెను) కాని యిచట సైతము పాము కఱచియున్న వాఁడు చచ్చెనని యిట్లుగ నధ్యాహారము చేయుటచే నట్టి విరోధము వారించును.

సముచ్చయార్థక శబ్దము సమాపక క్రియలతో మేళగింపదను కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదు. "చ......ధర్మసూతి మె। త్తని పులి యెల్ల వారలు నధర్మము నీ పయిఁ బెట్టునంతకున్......వినఁడును గానఁడున్ మఱియు నీకును నాకు మరల్పవచ్చునే" (భార. ఉద్యో. ౨ ఆ. ౧౮ ప.) (చూడు 'వ్యా. సం.' ౬౮ I విష). క్త్వాంతములు మున్నగు జరండులు (gerunds) చరిత్రమునం గ్రియా నామవాచకములై యుండితీరవలెననెడి దొరగారి వ్రాఁతకుదాహృతులు లేవు.

౧౩౦. I విష:—"I వర్తమానకాలము:—ద్రావిడ సమాపక క్రియా రూపములు క్రియా కాంక్షాఽ సమాపక క్రియల పయిని బురుష బోధక సర్వనామ ఖండములు నిలుచుటచేత నేర్పడును. ఈ సామాన్యవిధి కపవాదములు:—

(౧) "తమిళ కావ్య భాషయం దొక్కొక్కప్పుడు ధాతుజ విశేషణముల పైని బురుష బోధక ప్రత్యయములు నిల్చుటవలన సమాపక క్రియా రూపము లేర్పడుట కలదు. ఉదా:—వ్యావహారిక తమిళ:—నడన్ద+(వ్)+అన్=నడన్ద+(న్)+అన్=(వాఁడు నడచెను)='నడచిన వాఁడు' అని దాని యథార్థశ్రుతార్థము. ఇచట ధాతుజ విశేషణ రూపమె సమాపక క్రియగ వాడఁబడెను. ఇట్లె తక్కిన భాషలందును నేర్పడుట వింతకాదు. "తమి-ఏక-నడన్ద+అదు=నడన్దదు=(నడచినది) బహు-నడన్ద+(న్)+అ=నడన్దన=(నడచినవి)." అనునవి వ్యావహారిక తమి ళామహత్కర్తృక ప్రథమ పురుష క్రియలుగ వాడఁబడుచున్నను జరిత్రమున నవి క్రియా నామవాచకములె. తమిళకావ్య భాషయందుఁ బ్రతి పురుషమునందును నిట్టి పద్ధతిగల రూపములు గలవు. ఉదా:—నడన్ద+(న్)+ఎన్=నడన్దనెన్=(నడచితిని). నడచిన 'నేను' అని యథార్థశ్రుతార్థము. నడన్ద+(న్) అమ్=(మనము నడచితిమి). నడన్ద+(న్)+ఎమ్=నడన్దనెమ్=(మేము నడచితిమి). ఇట్టి ధాతుజ విశేషణములును క్రియా నామవాచకములును దిజ్ఞులకుఁ బ్రకృతులుగా నిల్చు తమిళ సంప్రదాయము కృత్రిమము, నితర ద్రావిడభాషా విలక్షణము నై యున్నది" (కాల్డు. ౪౮౭, ౪౮౯ పుటలు).

(౨) "తమిళ మలయాళములలో వాస్తవముగా వర్తమానార్థ కావ్యయము లేదు. కాని వర్తమానార్థమును దెల్పు ప్రత్యయ మొకటి ధాతువుపై నిల్చును. దానినె శత్రర్థ కావ్యయమని తలంపనగును. దానిపైని బురుష బోధక ప్రత్యయములు నిల్చుటచేఁ దమిళ వర్తమానార్థక సమాపక క్రియా రూపము లేర్పడును. దీనినిబట్టి ప్రాచీనతమ కాలమునఁ బ్రత్యేక ప్రయోగార్హమగు వర్తమానార్థ కావ్యయ రూపము (తెల్గు 'చు' ప్రత్యయమువంటిది) తమిళ మలయాళములలో నుండెడిదనియు నేఁటికది సమాపక క్రియలందే నిల్చియున్నదనియు విశదమగుచున్నది" (కాల్డు. ౪౮౯ పుట).

(3) "వ్యావహారిక కన్నడమున వర్తమానార్థ కావ్యయమునుండియె వర్తమాన సమాపక క్రియా రూపము లేర్పడును. కాని పలగన్నడమున వర్తమానార్థ కావ్యయమునకును వర్తమానార్థక సమాపక క్రియకును సంబంధమే లేదు. పలగన్నడమందలి వర్తమానార్థక చిహ్నము 'ఉతె' అనునది. ఉదా:—బాళుతె=

(బ్రదుకుచు). వర్తమానార్థక సమాపక క్రియా రూపము–బాళ్‌దపెం=(బ్రదుకుచున్నాను'' (కాల్డు. ౪౮౯ పుట).

(౪) "తెల్గున వర్తమానార్థ కావ్యయమునకు 'ఉండు' ధాతుజ రూపముల యోగముచే సమాపక క్రియా రూపసాధన ప్రక్రియ నడుపఁబడును. ఇది సామాన్యవిధి కపవాదమనిపించు కొనదు. ఇట్లు చేర్చుట క్రియా రూపమున కలంకారము వంటిది. అది వర్తమాన సమాపక క్రియారూప నిర్మాణమున నంత యావశ్యకమును గాదు" (కాల్డు. ౪౮౯, ౪౯౦ పుటలు).

విమర్శము:—లాక్షణి కావ్యయము క్రియతో నన్వయించును గాని సర్వ నామములతోను వాని వికృతులతోను నన్వయింప నేరదనియు నట్లగుటంజేసి లాక్షణి కావ్యయములనుండి సమాపక క్రియారూప సాధనము కేవల మసంగత మనియు ౧౨౯ విషయమున వివరింపఁబడెను. కాన వర్తమానార్థ కావ్యయము నుండి వర్తమాన కాలిక సమాపక క్రియలను సాధించు కాల్డువెల్లుగారి పద్ధతి కేవలము సహజము. ధాతువులకుఁ బరముగ భూతాదికాల బోధక శబ్ద ఖండములు చేరుటయు వానిపైని బురుషబోధక సర్వనామ శబ్దఖండములు నిల్చుటయు ద్రావిడ సమాపక క్రియారూప నిర్మాణ సహజ పద్ధతులు. అట్టి ప్రక్రియచే నేర్పడెడి రూపములు ధాతుజ విధేయ విశేషణ రూపములకు ఘుణాక్షర న్యాయమున సభిన్నములయినం గావచ్చును. అట్లేర్పడినవె దొర గారు క్రుత్రిమము లనుచుఁ జూపిన భూతకాలిక రూపములు. అవి క్రుత్రిమ ములు కానేరవు. సహజములు.

ఇంతకును దమిట మలయాళములందే కాక పఱగన్నడమందును సంస్కృతమందువలెనె తెల్గులోని 'చు' ప్రత్యయాంతము వంటి లాక్షణి కావ్య యము లేదనియు "ఉతె-ఉత్తె-ఉతుం-ఉత్తుం" అను ప్రత్యయములు తెలుఁగు 'చు' ప్రత్యయమువంటివి కావనియు 'చున్న' ప్రత్యయార్థకములనియు నట్లగుటచే నవి చేరిన రూపము లవ్యయములు కావనియు విశేషణములనియు నీవఱకు ౧౨౯ విషయమునఁ గన్నడ ప్రామాణిక వ్యాకరణోదాహరణ పూర్వకముగ విశదపఱిచియున్నాను. మఱియుఁ దెలుఁగునందును 'చు' ప్రత్యయాంతము క్రియా కాంక్షాఽ సమాపకావ్యయమగుటంజేసి దానికి సర్వనామ ఖండరూప పురుష బోధక ప్రత్యయములతో నదుకుబడికై వానినడుమ 'ఉండు' ధాతురూపము నిల్చుట యత్యావశ్యకము గావున నది యనావశ్యకమనియు నలంకార భూత మనియు వ్రాసిన దొరగారి వ్రాఁత కేవలము నయథార్థము.

ప్రాచీన కర్ణాటమందలి దప ప్రత్యయమునకు వర్తమానకాల ప్రత్యయ ముతో సంబంధమే లేదనుట యుక్తము కాదు. పఱగన్నడమందలి 'దప'

ప్రత్యయము భూతభావి చిహ్నమేళన రూప వర్తమానార్థ బోధకమె యగుటం జేసి (చూడు ౧౭౮ II విభ.) దాని ప్రక్రియ శంకాస్పదము కాదు. 'మాడుత్తానె' (చేయుచున్నాఁడు) మున్నగు హొసగన్నడ వర్తమానార్థక రూపములలోని 'ఉత్త' అనునది పళగన్నడమందలి 'ఉతుం-ఉత్తుం-ఉత్తె' మున్నగువాని యపభ్రంశ రూపము. ఉతుంప్రభృతులు వర్తమానార్థక విశేషణములనియుఁ దెల్గు 'చు' ప్రత్యయమువంటి లాక్షణి కావ్యయ రూపములు కావనియు నీవఱకు విశదపఱచియే యున్నాను (చూడు ౧౭౯ విభ.). అవి లాక్షణి కావ్యయములె యగునెడల తెల్గునందువలెనె వాని పయిని పురుష బోధక సర్వనామ శబ్ద ఖండములు నిల్చుట కనువుగా 'ఉండు' ధాత్వర్థక రూపములు నిల్చియే యుండును. తమిళమందలి 'చెయ్‌కిన్ఱు' అనునది వర్తమానార్థక లాక్షణి కావ్యయ జన్యమనియు నేఁడు లేకున్నను ప్రత్యేక ప్రయోగార్హత్వగల లాక్షణికావ్యయము ప్రాచీనతమ కాలమున నుండి యుండెడిదనియు వ్రాసిన కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదు. తమిళ మందలి 'కిన్ఱు' అను వర్తమాన చిహ్నమునకుఁ గన్నడమందు వలెనె భూతభావి మేళన రూపముగ 'కు+ఇన్+తు' అను ఛేదమును (౧౭౮ II విభ. చూడు) గ్రహింపక యేదో యజ్ఞాత చరిత్రకమగు వర్తమాన ప్రత్యయమనుచుఁ గాల్డువెల్లుగారు వ్రాయుట యవిమర్శన మూలక మనఁదగును.

ఇంకఁ దెలుఁగునందు వాస్తవములగు వర్తమాన భావి సమాపక క్రియా రూపములు లేవు. "చేయుచున్న వాఁడను = చేయుచున్నాఁడను = చేయుచున్నాను" అనునవి వర్తమానార్థక విధేయ విశేషణ రూపములె యనఁదగును. వీనిలో 'చేయుచున్నవాఁడను' అనురీతివి మాత్రమె నన్నయకాలమున నగపడును. 'చేయుచున్నాఁడను' అనురీతివి నన్నయకు దర్వాతి రూపములు. 'చేయుచున్నాను' అనురీతివి కేవల మర్వాచీనములు. పదునాఱవ శతాబ్దము నాఁటికి గ్రాంధికావస్థ నందినవి. ఇట్లె "చేయఁగలవాఁడను చేయఁగలాఁడను-చేయఁగలను" అనునవి భావ్యర్థక విధేయ విశేషణ రూపములు. నన్నయనాఁడు తచ్ఛబ్ద వకార లోపము లేదు. తిక్కనాదుల నాఁడు వకార లోప రూపములు గ్రాంధికము లయ్యెను. "చేయఁగలఁడు" అనురీతివి సైత మెఱ్ఱాప్రెగడ భారతమునఁ గలవు. 'చేయఁగలాను' అనురీతిగల 'డ' కార లోప రూపముల వాడుక మహాకవి గ్రంథములలోని కెక్కి నట్లగపడదు. ఇట్టి విధేయ విశేషణ రూపములె కాని తెల్గున వర్తమాన భావి సమాపక క్రియా రూపములు వేఱుగా లేవు. ఇంకఁ దద్ధర్మాద్యర్థక సమాపక క్రియా రూపములు వేఱుగఁ గలవు. అవి తెల్గున వర్తమాన భావ్యర్థములలో వాడఁబడుట తఱచుగఁ గలదు. అట్టి యెడల వానికి వర్తమాన భావ్యర్థములను సందర్భమునుబట్టి కల్పించుకొనవలసి

నదె. (చూడు 'వ్యా. సం.' ౨౯౯, ౩౦౧, ౩౦౨ విష.) (చూడు చిం. వి. పరి. ౫౯ మొ. ౬౪ విష).

తెల్గునందలి 'చు' ప్రత్యయమునకు శత్రర్థక మను పేరు వాడఁబడు చున్నది గాని యది దానికిఁ గేవల మనురూపము కాదు. 'చు' ప్రత్యయాంతము వర్తమానార్థ కావ్యయము. శతృ ప్రత్యయాంతము వర్తమానార్థక విశేషణము. "శత్రర్థే తూత శ్చా నోః" అని నన్నయ వాడెను. (చూడు 'వ్యా. సం.' ౨౧౦ X విష).

౧౩౦. II విష:—"వర్తమానార్థక రూప నిర్మాణము:—వ్యావహారిక కన్నడ వర్తమాన కాలిక సమాపక క్రియలు 'ఉత్తే-ఉతుం' మున్నగు కన్నడ వర్తమానార్థక ప్రత్యయముల యోగమున నేర్పడునని యీ వఱకుఁ జెప్పఁబడెను. ఉదా:—హళగన్నడ-బాళ్ + ఉత=(బ్రదుకుచు). ఒన్ద్ + ఉత్త=(కలుపుచు) మాడుత్త=(చేయుచు). గ్రాంథిక కన్నడ-ఒద్ + ఉతె=(చదువుచు) ఎళియ్+ ఉత్తె=(దిగుచు) కట్టె + ఉత్తు=(బంధించుచు) గెయివం=గెయిత్తుం=(చేయుచు). వీని తుది స్వరము వివిధ రూపముల నుండును. ఈ తుది స్వరములలో నుచ్చారణార్థకమగు 'ఉ' కారమె ప్రాచీన మనఁదగును.

ఈ కన్నడ వర్తమానార్థకమగు 'ఉతు' ప్రత్యయము తమిళ కన్నడ ప్రసిద్ధమగు దూరసమీప మధ్యస్థవాచియైన 'ఉదు' అను సర్వనామమున కభిన్నమనెడి డా. కిట్టెలుగారి యాశయము యుక్తమె. తుళుభాషలో నిది సమీపవస్తు వాచియె. కన్నడమున 'ఊతం' అని దీని రూపాంతరము గలదు. ఇట్టిది సమీపవాచిగాన వర్తమానార్థకమగుట యుక్తమె. ఇట్లె భూతార్థకమగు 'ద్' అనునదియు దూరవాచియగు 'అదు' శబ్దాపభ్రంశము కానోపును. 'ఉతుమ్' అను దానిలోని 'ఉమ్' అనునది చార్థకము. ఇది కాలబోధనమున కూఁతగ నుండును" (కాల్డు. ౪౯౦ పుట).

"పలగన్నడ వర్తమానార్థక 'దప' ప్రత్యయపు వ్యుత్పత్తి:—డా. కిట్టెలు గారు నాకీ విషయమున దయతో వ్రాసిన జాబు:—"ద+అప=దప. ఇందలి 'అప' అనునది 'ఆగు' ధాతు వ్యావహారికరూపమగు 'ఆహు' అనుదానిని సంబంధించినది. ఈ ధాతువుయొక్క భావ్యర్థకమగు 'అహ' అనుదానికి 'అప' అనునది భిన్నముకాదు. 'దప' అనుదానిలోని దకారము భూతచిహ్నము. 'మాడు+ఇ+ద+అప+ఎం=మాడిదపెం' అనుదానికి 'చేసియుందును' అని యర్థము. ఇది భావ్యర్థకము. 'రమ్ము' అనుదానికి బదులుగా 'రాఁగలను' అని చెప్పవలసియుండఁగా 'ఇదెవచ్చితిని' అని చెప్పు సంప్రదాయము గలదు. దీని రీతినె 'చేసియుందును' అను భూతార్థము భావ్యర్థమును బోధించున దగుటచేత

'దప' అనునది భావ్యర్థకమగుచు వర్తమానార్థక మగుచున్నది. ఇట్లు దీని యర్థమంత సుగమముగా లేకుండుటచేతనె హాాసగన్నడమున వర్తమానార్థ కావ్యయమునుండి సరియగు వర్తమానార్థక సమాపక క్రియారూపమును గల్పించుకొనవలసివచ్చెను'' అని కిట్టెలుగారు వ్రాసిరి. ఈ కిట్టెలుగారి యూహ ప్రశంసనీయము. 'ఆనిన్తు' అను వర్తమానచిహ్నములోని 'ఆ' అనునది 'ఆగు' ధాతురూపమని ముందుఁ జూపఁబడును. (చూడు ౧౩౦ IV విష.) ఇంతియకాక యనేక ద్రావిడ వర్తమానరూపములు భవిష్యద్రూపములనుండి యేర్పడినవని నిరూపింపఁబడును. మఱియు నిపుడు భూతార్థకచిహ్నముగ నంగీకరింపఁబడు 'ద్' అనుదానికి భూతార్థమాత్రమెకాక యింకను విస్తృతమగు నర్థము గల్గియుండెడిదని ముందు చూపఁబడును'' (కాల్డు. ౪౫౦, ౪౫౧ పుటలు).

విమర్శము:—దూరసమీపవాచక సర్వనామ శబ్దములు (అదు-ఉదు) భూతవర్తమానార్థక ప్రత్యయములకు మూలమను నూహ యుక్తమెయైనను ''ఉదు'' అను సర్వనామము 'ఉతె' ప్రభృతి కన్నడ వర్తమానార్థక ప్రత్యయములకు మూలమనుట విశ్వసనీయము కాదు. కన్నడ సర్వనామ శబ్దాంతిమ వర్ణము తమిళమందువలెఁ గన్నడమందు 'త' కారఘటితము కాదు. కర్ణాటమున 'దు' అని దకారఘటితమె యేర్పడియున్నది. 'ఉతె' ప్రభృతుల 'త' కారము సార్వనామికమె యైనయెడల భూతార్థక 'ద' ప్రత్యయమువలెనె 'ఉదె' మున్నగు రీతిని 'ద' కారఘటితముగనె యేర్పడియుండును. ''ఆతం-ఈతం-ఊతం''=(అతఁడు-ఇతఁడు) అనువానివలెనె కేవల ప్రాచీనతమ కాలమందె 'ఉతె' ప్రభృతి తకారఘటితరూపము లేర్పడెననుట విశ్వాసార్హము కాదు. కన్నడమునఁ గేవల ప్రాచీన వర్తమానప్రత్యయము 'దప' రూపమె. 'ఉతె' ప్రభృతులు వైకల్పికములై దానితర్వాత నేర్పడినవి. తొల్కాప్పియ కాలమున నీ రూపములు లేవు. తెల్గు 'చు-తు' ప్రత్యయముల కభిన్నమైనది తొల్కాప్పియ కాలమున 'కు' ప్రత్యయము. మఱియు 'ఉతె' ప్రభృతి కన్నడ వర్తమాన ప్రత్యయములు 'ఉ' కారపూర్వకములే కావనియుఁ భూతభావ్యర్థకమగు 'తు' అను ప్రాచీన ద్రావిడ ప్రత్యయమున కభిన్నములనియు నయ్యవి ధాతువుల తుది నుచ్చారణాద్యర్థమైయుండు 'ఉ' వర్ణమునకుఁ బరముగా నిల్చుచుండుట ప్రచురమైయుండుటచేత 'ఉ' కారపూర్వకములుగానె వైయాకరణులచేత నుపదేశింపఁబడెననియుఁ దలంచుట విశ్వాసపాత్రము కాకపోదు. వర్తమాన మనునది భూతభావ్యర్థ మేళనరూపమె కాన భూతభావ్యర్థక ప్రాచీన ద్రావిడ 'తు' ప్రత్యయము ''ఉతుం-ఉత్తుం-ఉతె-ఉత్తె'' అను వర్తమానార్థక కన్నడ ప్రత్యయములకు మూలము కానోపును. ఇట్లె పటగన్నడ వర్తమానార్థక 'దప'

ప్రత్యయము సైతము భూతార్థక 'ద' కారముయొక్కయు భావ్యర్థక 'ప' ప్రత్య యముయొక్కయు మేళనమె గాన నది వర్తమానార్థక ప్రత్యయమగుట సహే తుకమైయున్నది. ఈ విషయము ౧౨౮ II విషయమున విశదీకరింపఁబడి యుండుటచేత నిటఁ బునరుక్తముగ విస్తరింపఁబడలేదు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులు యమ్మేగారు తమ స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫిలాలజీలో 'ఉతు'=(ఉండు) అనునది భావ్యర్థకమనియు భావ్యర్థక ములు వర్తమానార్థకములు కానోపును గాన నట్టి 'ఉతు' అనునది కన్నడ మందలి, 'ఉతు' మున్నగు వర్తమానార్థక ప్రత్యయములకు మూలమనఁదగు ననియుఁ దెలుఁగులోని వర్తమానార్థక 'చు-తు' ప్రత్యయములకును దద్ధర్మార్థక మగు 'ఉదు' ప్రత్యయమునకును నభిన్నమె యనియు 'ఉందు' అను తమిళా వ్యయము 'ఉమ్' అను తమిళ వర్తమానార్థకమునకు రూపాంతరమనియు (చూడు తొల్కా. అవ్యయ ప్రకరణ. ౨౨ సూ:-ఉమ్ ఉన్దాకుమ్...) వ్రాసిరి. కాని 'ఉండు' అను నర్థముగల 'ఉతు' శబ్ద మప్రసిద్ధము. కన్నడమందలి 'ఉతు' మున్నగు వర్తమానార్థక ప్రత్యయముల మొదటి 'ఉ' కార మాభాస రూపమని మీఁద నిరూపించియె యున్నాను. తెల్గులోని తద్ధర్మ ప్రత్యయము 'దు' ప్రత్యయమె కాని 'ఉదు' ప్రత్యయము కాదు. "దు తి వర్ణకౌ క్రమాత్ స్తో। నా ద్యస్యాదేః" అని నన్నయ సూత్రించి యున్నాడు. తమిళమందలి 'ఉమ్' ప్రత్యయమునకు రూపాంతరమగు 'ఉన్దు' శబ్దము స్థల వాచకావ్యయము సముచ్చయార్థకమును గాన దానిని గ్రియల కాల వివరణ సందర్భమునఁ జూపుట సరికాదు.

వర్తమానార్థక 'దప' ప్రత్యయాదులలో 'ఆగు' ధాతురూపము స్థితి నంగీకరించుట యప్రసక్తము. అచట 'ఆగు' ధాత్వర్థమునకుఁ బ్రసక్తి యేమున్నది? పతగన్నడ ప్రత్యయపుజంటలో 'ఆగు' ధాతువ్యావహారిక రూపమైన 'ఆహు' ధాతురూపము గలదనుట యొక యసంభవము. అట్టి 'ఆహు' అను వాడుక ధాతువులోని 'హ' కారమునకు 'ప' కారము వచ్చుట యింకొక యసంభవము. గన్నడ 'ప' కారము 'హ' కారమగుట ప్రసిద్ధము గాని 'హ' కారము 'ప' కారమగుట లేదుగదా. ఇంతియకాక యట్టి 'ద+అప' అను జంటయర్థము భూతార్థమై యుండ నది భావ్యర్థమై వర్తమా నార్థకమగుట వేఱొక యసంభవము. ఏదో సందర్భములోని 'ఇద్దె వచ్చితిని' అను వాడుక సర్వసామాన్య ప్రత్యయార్థములో వర్తించెననుట విశ్వసనీయము కానేరదు. ఇట్టి యనర్థాసంభవ పరంపరతో వ్యుత్పత్తి చెప్పి యది యసంభవము కావునన హళగన్నడములో సరియగు వ్యుత్పత్తిగల రూపము కల్పింపఁబడె ననుటకు శబ్దతత్వవేత్తలు వెనుదీయకుండుట వింత. ఇట్టి యీ యసంభవ

మార్గమె కొంత "స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫిలాలజీ"లో సైతము స్వీకరింపఁ బడినది. (స్టడీ. ద్రవి. 23 పుట).

డా. కాల్డువెల్లుగారి వ్రాఁతలఁ జాలవఱకు ననుసరించియె వికాసకర్తగా రీ క్రిందిరీతిని వ్రాసిరి. "కన్నడ-చెయ్‌దవేన్ (పెన్?) చెయ్‌దు+అప్ప+ఏన్"...... 'అప్ప' అనునది 'అగు' ధాతురూపము...... 'గు-చు-తు' అనునవి సమానార్థకములు. ఇవి మూఁడును భావార్థక ప్రత్యయములె. కన్నడమందలి 'ఉతు-ఉతె' అను భావార్థకములలోని 'త' వర్ణమును 'చెయ్‌దపెం' అను వర్తమాన క్రియారూపములోని 'దు' వర్ణమును తెనుఁగునందలి వ్యావహారిక వర్తమాన 'తు' వర్ణకమును అభిన్నములు. ఇవి 'అదు-అది' అనువానిలోని 'దు-ది' వర్ణములతో నభిన్నములు." (ఆం. భా. వి. ౫౩౮, ౫౩౫ పుటలు).

౧౩౦. III విష:—"తెలుఁగు వర్తమాన చిహ్నము:—తెలుఁగుభాషయందు సాధారణముగ 'తున్న' అను పలుకుబడిగల 'చు' అనుదానిని ధాతువునకుఁ బరముగాఁ జేర్చుటవలన వర్తమానరూపమేర్పడును. దీని వ్యావహారిక రూపము 'తు' అనునది. వీనిలో 'తు' అనునదే ప్రాచీనమని కన్నడమందలి 'ఉతె-ఉత్తుం,' మున్నగు వర్తమాన ప్రత్యయములవలన వ్యక్తమగుచున్నది. తెల్గు తద్ధర్మరూపములలోని 'దు' ప్రత్యయమును వీనికి భిన్నముకాదు. ఇంక "చేయుచున్నాను=చేయుతున్నాను" మున్నగువానిలోని 'ఉన్న' అనునది 'ఉండు' ధాతుజ విశేషణ మనఁదగును.

తుళుభాషలోని వర్తమానార్థకరూపము వర్తమానభావులు రెంటను వాడఁబడును. ఇది వ్యుత్పత్తిలో భావిరూపమె యనఁదగును. ఇందలి వర్తమానార్థక చిహ్నమగు 'వ' కారము తమిళ కన్నడములలోని భావ్యర్థక వకారమునకు భిన్నముకాదు" (కాల్డు. ౪౫౧-౪౫౨ పుటలు).

విమర్శము:—పై విషయములను గొన్నిటి నాంధ్రభాషా వికాసకర్తగారు స్వీకరించిరి. (ఆం. భా. వి. ౫౩౮, ౫౩౫ పుటలు). కర్ణాటపు 'ఉతె-ఉత్తె' మున్నగు వర్తమానార్థకములు ప్రాచీన ద్రావిడ భావ్యర్థక 'తు' ప్రత్యయమూలకములనఁదగును. తెలుఁగు 'చు' ప్రత్యయము భావ్యర్థక ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయమునుండి యేర్పడెననఁదగును. కాన నాంధ్రకర్ణాట వర్తమాన ప్రత్యయములకుఁ బరస్పరసంబంధము లేదననగును. మఱియుఁ గర్ణాట వ్యాకర్తలలో నాగవర్మ పండ్రెండవ శతాబ్దపువాఁడు. కేశిరాజు పదుమూఁడవ శతాబ్దమువాఁడు. ఆంధ్రవ్యావహారిక 'తు' ప్రత్యయము ప్రాచీనాంధ్రశాసనములయందుఁ గానరాదు. 'చు' ప్రత్యయ మన్ననో నన్నయకు ముందటి యెనిమిదవ శతాబ్దపు శాసనమునఁ జూపట్టుచున్నది. "రేనాణ్డు ఏఱువేల

ఏలుచున్తి" "(సత్యాదిత్యుని మాలెపాడు శాసనము. కడప మండలము. ఎపిగ్రా-ఇండి-పుట ౩౮౫. (౮ శతాబ్ది)" (ఆం. భా. వి. ౧౦౧ పుట).

"గ్రాంథిక శత్రర్థక 'చు' వర్ణకము ప్రాచీన 'కు-గు' వర్ణములతో సభిన్న మని తోఁచుచున్నది. తాలవ్యీకరణమును గుఱించి ముందు చెప్పితిని." (ఆం. భా. వి. ౫౩౮ పుట). అని వ్రాసియు వికాసకర్తగారు "'చేయుచు' వంటి రూపములు వర్తమానార్థకములు......వాడుకలో నేఁడు వర్తమానార్థకము 'తు' వర్ణకమనుట నిస్సంశయము.......రెండును మాతాపుత్రిక లైనచో 'త' వర్ణమె ప్రాచీన మనవలెను." (ఆం. భా. వి. ౫౩౩, ౫౩౮ పుటలు) అని వ్రాయుట వింతగ నున్నది. ఇట్టి వ్రాఁతలనుబట్టి ద్రావిడ ప్రాచీన 'కు' ప్రత్యయము నుండి యాంధ్ర వ్యావహారిక వర్తమానార్థక 'తు' ప్రత్యయ మవతరించిన పిదప దానినుండి యాంధ్ర గ్రాంథిక వర్తమానార్థక 'చు' ప్రత్యయ మవతరించెనని వీరు తలంచిన ట్లగపడుచున్నది. 'కు' ప్రత్యయమునుండి కకారముతో నించుకేని సంబంధములేని 'తు' ప్రత్యయ తకార మేర్పడుట ద్రావిడ భాషలలోఁ గానరాదు.

"స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫిలాలజీ"లో 'ఉతు' అనుదానినుండి యేర్పడిన 'ఉత్సు=ఉచు' అనునది తెల్గు వర్తమాన ప్రత్యయమనియు 'చు' అనునది కాదనియు వ్రాయఁబడెను. (స్టడీ. ద్రవి. ౭౨ పుట). తెల్గు 'చు' వర్ణకమునకుఁ బూర్వమున 'ఉ' వర్ణము గలదనుట యశ్రుతచరము. నిరాధారము. ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయ సంబంధము నరసినను నిది 'ఉ' కార పూర్వకమనుట పొసఁగ నేరదు. ఉకార పూర్వకత్వ మీవఱకు నిరసింపఁబడెను (చూడు ౧౩౦ II విష.) 'ఉతు' ధాతువునకు 'ఉండు' అని యర్థము వ్రాసి దాని పైని మరల 'ఉన్ను' అనెడి యుండు ధాతుజ విశేషణము నిల్చునని యీ గ్రంథమున వ్రాయఁబడినది. ఇట్లు 'ఉండు' ధాతువుల ద్విత్వకమున కెట్లు సంగతియో తెలియ కున్నది. 'ఉన్న' అని చెప్పక 'ఉన్ను' అనునది యుండు ధాతుజ విశేషణ మనుటకుఁ బ్రమాణమేమో తెలియరాకున్నది.

౧౩౦. IV విష:-"తమిలు (మలయాళ) వర్తమాన క్రియారూప నిర్మాణము:- "గిల్+ఉ=గిఱు, గిన్ద్ర్+ఉ=గిన్ద్రు," "అ+నిన్ద్ర్+ఉ=అనిన్ద్రు" అనువానిలో నేదోయొకటితోఁ గూడిన ధాతువుపైని బురుష బోధక ప్రత్యయములు నిల్చుట చేతఁ దమిలు వర్తమాన సమాపక క్రియ లేర్పడును. 'అనిన్ద్రు' అను సమస్త రూపము కాదా చిత్కముగా వాడఁబడును. 'అ+నిన్ద్రు' అనుదానికి "అగుట

నిల్చుచు" అని యర్థము. (అగు+నిల్చు), 'తాల్+ఆ+నిన్ద్ర్+ఆన్= తాటానిన్ద్రాన్=(నమ్రుఁడగుచున్నాఁడు=నమ్రుఁడగుట నిల్చుచు). ఒక తమిళ శాసనములో (౭౭౪ క్రీ. శ.) 'ఆయినిన్ద్రు' అని యున్నది. ఈ శాసనము మలబారులోని యొక సిరియన్ క్రైస్తవుని యొద్దనున్నది. నేఁటి తమిళములో సైతము "ఆగి=ఆయి=ఆయ్=ఆ" అని యగుచున్నది" (కాల్డు. ౪౯౨ పుట).

"ఇంక మిగిలిన 'గిఱు-గిన్ద్రు' అను రెండును బ్రచురముగనె వాడఁబడును. వానిలో 'గిన్ద్రు' అనునది మధురతరముగాఁ దలంపఁబడును. 'గిఱు' అను దానిలో ననునాసికము చేరవచ్చును. 'గిన్ద్రు' అనుదానిలో ననునాసికము లోపింపవచ్చును. శ్రుతి సుఖార్థముగ నవి 'క్కిఱు-కిన్ద్రు' అని మాఱుటయుఁ గలదు. ధాత్వవయవీభూతమై యనశ్వరమైన స్వరము తుదినిగల ద్విస్వర ధాతువులకు వ్యవహితపరములై నిల్చు 'గ-ద-బ'లు 'క-త-ప'లుగా మాఱి ద్విరుక్తములగును. కాన తమిళమున 'ఇరుగిఱేన్' అనుదానిని 'ఇరుక్కిఱేన్' అని వాడుదురు. అకర్మకక్రియలు సకర్మకములగునపుడును నిట్టి పారుష్య ద్విత్వములు గల్గును. శ్రవణ సుఖార్థమేకాక యిట్లు వ్యాకరణపద్ధతిచొప్పున సైతము పారుష్యద్విత్వములు గల్గును" (కాల్డు. ౪౯౨-౪౯౩ పుటలు).

విమర్శము:—'ఆనిన్ద్రు' అని వ్రాయుట కాల్డువెల్లుగారి వ్యావహారిక పద్ధతి. (చూడు ౧౭ XVI విష.) దీని నిజరూపము 'ఆనిన్ఱు' అనునది. (చూడు ౧౨౭ II విష). 'ఆగి=ఆయి=ఆయ్=ఆ+నిన్ద్రు' అని ఛేదము చూపుటయు 'అగుట+నిల్చుచు' అని యర్థము చెప్పుటయు సరికాదని తోఁచుచున్నది. వర్తమానార్థ బోధనవిషయమున 'ఆగు' ధాత్వర్థమునకుఁ బ్రసక్తి యించుకేని యగపడదు. వెనుకఁ బలుగన్నడ 'దప' ప్రత్యయ వ్యుత్పత్తి సందర్భము నందును నిట్లె యసంగతముగా 'ఆగు' ధాతు వ్యావహారికరూపము చొనుపఁ బడెను. (చూడు ౧౩౦ II విష.) "'నిన్ద్రు'=నిల్చుచు" అని యర్థము చూపుటయు సరికాదనవచ్చును. వర్తమానార్థక చిహ్నము చేరకయె 'నిన్ద్రు=నిల్చుచు' అను వర్తమానార్థ మెట్లు లభించును? ఇట్లైయైనచో నింకఁ దక్కిన ధాతువుల వర్తమానార్థక రూపములందు మాత్రము వర్తమానార్థక ప్రత్యయయోగమేల? మఱియు వర్తమానార్థబోధన విషయమున 'నిల్' ధాతువునకుఁ బ్రసక్తి యెట్లు? పరిశీలింపఁగా 'ఆన్+ఇన్+తు' అని 'ఆనిను' అను వరమానారక ప్రత్యయ

మునకు భేదము నంగీకరించుట యుక్తమని తోఁచును. 'ఆన్ =(అప్పుడు)' అను దూరవాచి సర్వనామశబ్దము భూతార్థవాచకమనియు, 'ఇన్ =(ఇప్పుడు)' అను సమీపవాచి సర్వనామశబ్ద మద్యతనార్థకమనియు 'తు' అను భూతభావ్యర్థక ప్రాచీన ద్రావిడ ప్రత్యయము భావ్యర్థకమనియు నిట్లు వీని యోగము ప్రారబ్ధాఽపరిసమాప్తిరూప వర్తమానార్థకము కానోపుననియు గ్రహించుట సహజమై యున్నది. 'ఆన్' శబ్దము దూరవాచి తచ్ఛబ్దరూపమనియు (౨౮ V విష.) 'ఇన్' శబ్ద మద్యతనార్థకమనియు (౧౧౬ III విష.) (చూడు ౧౨౮ II విష.) 'తు' అనునది భూతభావ్యర్థక ప్రాచీన ద్రావిడ ప్రత్యయమనియు (౧౨౮ II విష.) నీవఱకు వివరింపఁబడెను. "మన్నుమ్ చిన్నుమ్......" (తొల్కా. ౩౩౮ సూ.) = "మన్-చిన్-ఆన్-ఈన్-పిన్-మున్-శబ్దములు......". "అవ్వోడు......" (నన్నూలు ౧౪౫ సూ.)......ఉదా:—......వన్దు=వచ్చితిని-వరుదు= వత్తును. "తడఱ......" (నన్నూలు ౧౪౨ సూ.) = "......'ఇన్' భూతార్థకము......".

'ఆనిన్తు' అనుదానివలెనె 'కిన్తు' అనునది సాధురూపము. 'న్తు' అనుదాని యపభ్రంశరూపము 'న్దు' అనునది. ప్రాచీన తమిళమున సరళోచ్చారణమె లేదుగాన 'గిఱు-గిన్దు' అనువాని గకారమును 'క'కారముగ సాధించుట యసంగతము. (౧౭ XXIII విష.) (౧౭ XXIV విష.)

ఉచ్చారణార్థకముగ నిరర్థమగు ననునాసికాగమ మగు ననుట సరికాదు గాన (చూడు ౨౮ IV విష.) 'కిన్తు' అనుదానిలోని నకారము లోపించి 'కిఱు' అని యేర్పడెననుటయె యుక్తము. 'కిన్తు' అనునదె మూలరూపమని కాల్డువెల్లు గారును నంగీకరింతురు. (౧౩౦ V, VI విషయములు.)

౧౩౦. V విష:—"మలయాళ వర్తమానరూపములు:—మలయాళమున 'కిన్ద్రు' అనుదానినుండి యేర్పడిన "కున్ను=ఉన్ను" అనునవె వర్తమానార్థక ప్రత్యయములు. తమిళమందలి 'కిన్ద్ర్' అనుదానిలోని 'క'కారము లోపింపఁగా మిగిలిన 'ఇన్' అనునది 'ఇన్న్' అనునదిగా మాఱును. ఉదా:—మూన్ద్ర్= మూన్న్. ఒన్ద్ర్=ఒన్న్. మొ. ఈ రూపము వ్యతిరేకరూపములలో ముఖ్యముగాఁ జూపట్టును. ఉదా:—వరా (య్) ఇన్ను=(రాఁడు). కాన "గిన్దు=క్కిన్దు" అనునవి "గిన్ను=కిన్ను" అని పరిణమింపఁగా 'క'కార లోపముచేత 'ఇన్ను' అను రూప మేర్పడునని తలంపనగును. తమిళపదమధ్యగత 'క-గ' లు లుప్త.పా.య

ములై శ్వాసమాత్రములుఁగ వినఁబడుట ప్రసిద్ధము. తమిళ 'గ'కారము సంస్కృత 'హ'కార సదృశముగాఁ దలంపఁబడును. వ్యావహారిక తమిళమున నట్టి 'హ'కార శ్రుతియు లోపించును. ఉదా:—పోగిఱేన్ = పోఱ్న్ = (పోవు చున్నాను.) వరుగిఱాన్ = వరుఱాన్ = వాఱాన్ = (వచ్చుచున్నాఁడు). ఈ సంప్రదాయముచొప్పున "గిన్ద్రు = గిన్ను — ఇన్ను" అను పరిణామము గల్గెనని యూహింపనగును. తమిళమందలి 'ఇ'కారము గ్రామ్యమున 'ఉ'కారముగాఁ బలుకుట గలదు కాన 'ఇన్ను' అనునది 'ఉన్ను' అనునదిగా మాఱినది.

మలయాళమునఁ బురుషబోధక ప్రత్యయములు సాధారణముగా నిల్వ కున్నను, నొకొకప్పుడు వానిని నిల్పుట గలదు. అట్టియెడల "అడిక్కిన్ద్రాన్" = (అడి + కిన్ద్రు + ఆన్) అను తమిళరూపమునకు సరిగా "అడిక్కున్నాన్" అను మలయాళరూపము వెలయుచున్నది. (అడి + క్కున్ను + ఆన్). ఈ మలయాళపు "క్కున్ను = ఉన్ను" అనునవి "చున్ను-తున్ను" అను తెల్గురూపములకు సరి యని భ్రమింపరాదు. మలయాళములోని "ఇన్ను = ఉన్ను" అనునవి "గిన్ద్రు-క్కిన్ద్రు" అనువాని వికృతులు. తెల్గులోని "చున్ను-తున్ను" అనువాని లోని "ఉన్ను" అనునది 'ఉండు' ధాతుజ విశేషణరూపము. మలయాళ మందలి 'ఉండు' ధాతుజ విశేషణము, 'ఉణ్డ్' అని యుండును" (కాల్డు. ౭౬౩ పుట).

విమర్శము:—కకారమె శ్వాసము. గకారము నాదము. (చూడు ౧౨ VI విష). ప్రాచీన తమిళమున గకారోచ్చారణమె లేదు. కాన 'గిన్ద్రు-గిఱు' అనునవి యర్వాచీనరూపములు. "కిన్ఱు-కిఱు" అనునవి ప్రాచీనరూప ములు. 'కిన్ఱు' అనుదాని యపభ్రష్టోచ్చారణము "కిన్ద్రు" అనునదని, మలయాళమందలి 'క'కార లోపమును 'ఇన్ను' అను పరిణామమును విశదీక రించుచున్నవి. 'కిన్ద్రు' అనుదానినుండి 'ఇన్ను' అను పరిణామము గల్గెనుట సంప్రదాయము కాదు. "అనునాసికాది ప్రసరమ్" = "తమిళమందలి యను నాసిక తత్పురుషసంయోగము మలయాళమున ద్విరుక్తానునాసికమగును. ఉదా:—తమి-ఞ్జ = మల-ఞ్ఞ......తమి-న్ఱ = మల-న్న." అను కేరళ పాణినీయ పీఠికచొప్పున (చూడు ౧౫ II విష.) 'న్ఱు' అను తమిళరూపము మలయాళమున 'న్ను' అని యగునుగాని 'న్ద్రు' అను తమిళరూపము మల యాళమున 'న్ను' అని యగుననుట సంప్రదాయము కాదు.

ఈ మలయాళపరిణామమె తమిళమలయాళ విభాగకాలమున 'కిన్ద్రు' అను రూపమె యుండెడిదనియు 'కిఱు' అను రూప మర్వాచీనమనియు విశదీకరించుచున్నది. 'కిఱు' అనుదానినుండి 'కిన్ను' అనునది జనింపనేరదుగదా. కాన 'కిన్ద్రు' అనునదే మూలరూపమని యెన్నవగును. 'ఉన్ను' అనునది 'ఉండు' ధాతువి శేషణరూపము కాదు. 'ఉన్న' అనునది దాని విశేషణరూపము.

౧౩౦. VI విష:—"గిఱు-గిన్ద్రు లలో నేది మూలరూపము? తమిళమున అకారము శ్రుతిసుఖార్థముగ 'న్ద్ర' అని మాఱుట పెక్కు స్థలములలోఁగలదు. ఉదా:—కుఱు=(చిన్నదగు)=కున్ద్రు=చిన్నకొండ. ఈ 'కుఱు' శబ్దము పెక్కు-శబ్దములకు మూలరూపమైయున్నది. ఉదా:--కుఱ్ఱమ్ (ట్టమ్)=(పొరపాటు).

'న్ద్రు' అనునది 'అ' కారమగుట సులభముకాదు. కాని యట్టి మార్పుగలదని యూహించుట కవకాశ మున్నది. 'ఇన్ద్రు' అనుదానినుండి 'ఇఱు' అనున దేర్పడెననుటకు 'ఇల్+తై=ఇఱ్ఱై(ట్టై)=(నేఁటికి)' అనురీతిగల 'ఇన్ద్రు' శబ్దరూపాంతరములవంటివి గలవు. లకార తకార సంయోగము 'న్ద్రు' అని యగుటగలదు. కొన్ని కవి ప్రయోగములలో 'న్ద్రు' అనునది 'అ' కారమగుట కన్పట్టుచున్నది. ఉదా:—'సెల్+తల్=సేఅల్' (సెల్=పోవు) అని నన్నూలులో నున్నది. కాని యిందలి అకార పూర్వస్వరము దీర్ఘీకృతమైనది. "ఇల్+తు=ఇన్ద్రు"=(నేఁడు-ఇప్పుడు) అని యేర్పడినపిదపఁ గొంతకాలమునకు 'ఇల్+తు=ఇఱు' అని యేర్పడెనని యంగీకరించినచో నది 'గిన్ద్రు' అనుదానినుండి 'గిఱు' అనునది యేర్పడెననుటకు మంచి యుదాహృతియగుచున్నది.

డా. గ్రాలుదొరగారు తన తమిళ వ్యాకరణము (outlines of Tamil Grammar) నందుఁ గాఁబోలును దమిళకావ్యప్రసిద్ధ భావ్యర్థకమగు 'క్=గ్' అనుదానినుండియు 'ఇన్ద్రు'=(ఇప్పుడు) అనుదానినుండియుఁ దమిళవర్తమానకాలిక ప్రత్యయ మేర్పడెనని చెప్పిరి. దీనినిబట్టి "క్+ఇన్ద్రు=కిన్ద్రు" అనునది మూలరూపమనియు దానినుండి 'కిఱు' అనునది యేర్పడెననియుఁ దేలుచున్నది. డా. గుండర్టుగారును స్వయముగనో పరమతాంగీకారముననో యీ యభిప్రాయమునకే వచ్చిరి. మలయాళ వర్తమానకాలచిహ్నమగు 'ఇన్ను' అనునదియుఁ దమిళమునుండి మలయాళము వీడకముందు 'కిన్ద్రు' అనునదే యుండెడి

దని విశదీకరించుచున్నది. పై సందర్భము “క్+ఇన్ద్రు=కిన్ద్రు” అను మేళన మును నిర్ణయింపఁజాలకున్నను నట్టి యూహా కనుకూలమైయున్నది” (కాల్డు. ౪౯౪ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు “గిఱు-గిన్ద్రు” అనువానిలో నేది మూలరూపమని విచారింపఁగడఁగి ‘ఱు-న్ద్రు’ అనువాని పరిణామవిషయమున సందిగ్ధచరిత్రకములగు కొన్ని యుదాహృతులను జూపుచు గ్రంథవిస్తరముఁ జేసిరి. ‘క్+ఇన్టు’=(ఇప్పుడు) అను డా. గ్రాలుదొరగారి వ్యుత్పత్తియే ‘కిన్టు’ అనునది మూలరూపమని నిర్ణయింపఁజాలును. ‘కిన్టు=కిన్ను’ అను మలయాళ పరి ణామము సైతము ‘కిన్టు’ మూలరూపమని నిర్ణయింపఁజాలును. ‘కిఱు’ అను దానినుండి ‘కిన్ను’ అను వికృతి గల్గనేరదుగదా. ఈ విషయ మిట్లుండఁగా నీ సందర్భమందెల్ల ‘కిన్ద్రు’ అను రూపమునే దొరగారు వాడుట ప్రమాదమూలమై యున్నది. ‘కిన్టు’ అనునది మూలరూపము. దీని వికృతి ‘కిన్ద్రు’ అనునది. (చూడు ౧౭ XVI విమ). ‘కిన్ద్రు’ అను వికృతినుండి ‘కిన్టు’ అను ప్రకృతిని గాని దాని రూపాంతరమగు ‘కిఱు’ అనుదానినిగాని సాధింపఁగడంగుట ‘లచ్చి’ అను వికృతినుండి ‘లక్ష్మి’ అను ప్రకృతిని సాధించురీతిగ నున్నది. ‘కిన్టు’ లోని నకారలోపమున ‘కిఱు’ కావచ్చును. (చూడు—మూన్టు=మూఱు). “ఇల్+తు=ఇట్టు=ఇఱు. కు+ఇఱు=కిఱు” అను దొరగారి మార్గము సరి కాదు. “‘ఇఱు’ శబ్దమునకు ‘ఇప్పుడు’ అను నర్థములేదు. ఇఱు=వ్యాపించు” (శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారు 22—11—53 జాబు).

డా. గ్రాలు దొరగారు చెప్పిన వ్యుత్పత్తిగాని యిట నిర్ణయింపనున్న ‘కు+ఇన్+తు’ అను వ్యుత్పత్తిగాని ‘కిన్టు’ అనునదే ప్రాచీన మూలరూప మని సిద్ధాంతము చేయఁజాలును. డా. గ్రాలుదొరగారి వ్యుత్పత్తికన్న ‘కు+ఇన్+తు’ అను వ్యుత్పత్తి సహజముగను ‘దప’ ‘ఆ నిన్టు’ మున్నగు నితర వర్తమాన ప్రత్యయముల వ్యుత్పత్తికి సరియైనదిగను నుండుటచేత లెస్సయనఁ దగును. డా. కాల్డువెల్లుగారీ ‘కిన్టు=కిఱు’ అనువాని వ్యుత్పత్తి విషయమును స్మరింపనేలేదు. ‘కిన్టు=కిఱు’ అనునవి వ్యుత్పత్తి తెలియని ప్రత్యయములని భావించిరేమో? లేక డా. గ్రాలుగారి వ్యుత్పత్తితోఁ దృప్తినందిరో? కాని యా విషయమున నేమియు వ్రాయలేదు. డా. గ్రాలుదొరగారూహించిన వ్యుత్పత్తి తోనె తృప్తిగల్గినపు డట్టి యభిరుచినైనఁ దెల్పియుండరా? గ్రాలుదొరగారు భావి చిహ్న ‘క’ కారముయొక్కయు నద్యతనార్థకమగు ‘ఇన్టు=ఇప్పుడు’ శబ్దము

యొక్కయు మేళనమునె చూపిరిగాని వర్తమానార్థమున భాసించు ప్రారబ్ధాऽపరి సమాప్తిరూపములోని భూతార్థకశబ్దపు మేళనము చూపలేదు.

"కు+ఇన్+తు=కిన్తు" అను శబ్దముల మేళనరూపమగు వ్యుత్పత్తి యందున్ననో భావ్యర్థక 'కు' ప్రత్యయముయొక్కయు నద్యతనార్థకమగు 'ఇన్' శబ్దముయొక్కయు భావి భూతార్థకమగు 'తు' శబ్దముయొక్కయు మేళనము వెలయుచుండుటచేత నిది ప్రారబ్ధాऽపరిసమాప్తిరూప వర్తమానార్థకమనుట యెంతయు యుక్తమైయున్నది. ఇట్టి యర్థములుగల యీ శబ్దముల వివరణ మీవఱకు విశదీకరింపఁబడియె యున్నది. (చూడుఁ ౧౨౮ IV విష.) "కు-తు" అనునవి ప్రాచీన ద్రావిడ ప్రత్యయములు. (౧౨౮ II విష. ౧౩౦ I విష.) "వర్తమాన మనఁగా నప్పటికి ముగియకుండునది" అని సూరిగారు (బాల వ్యా. క్రియా. ౨ సూ.) వివరించిరి. అంతకుమునుపే ప్రారంభమయి యప్పటి కింకను ముగియలేదనుటచేత నట్టి వ్యాపారము భూతభావ్యద్యతనవర్తి యనుట స్పష్టమగుచున్నది. కన్నడ "వర్తమానార్థక 'దప' ప్రత్యయములో భూత భావ్యర్థబోధక ప్రత్యయములు వరుసగా మేళగించియుండ నిందు భావ్యద్యతన భూతార్థక శబ్దములు వరుసగా మేళిగించియున్నవి.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యపంతులు యమ్మేగారు తమిళ వర్తమాన ప్రత్యయ వ్యుత్పత్తి విషయమున నీ క్రింద రీతిని వ్రాసియున్నారు.

"ద్రావిడ వ్యాకర్తలు 'కుమ్-తుమ్' మున్నగునవి యర్థరహిత ప్రత్యయములని సంస్కృత వ్యాకరణ వాసనచేఁ దలంచుచు మనల నపమార్గమునఁ బెట్టిరి. తొల్కాప్పియ రీపదములను స్పృశించెనుగాని యివి కాలబోధకములని చెప్పలేదు.........పరిశీలింపఁగా నివి ప్రత్యేకకాలవాచకములు కావనియు వీనికిఁ బ్రకరణమునుబట్టి కాలనిర్ణయము చేయనగుననియుఁ దేలుచున్నది.... ......ఎల్ల ద్రావిడభాషలలోను బ్రసిద్ధములయి యున్న యీ 'గు' ప్రత్యయాంతములు కాలపురుషాది భావములు లేని కాలమునాఁటివనుట సిద్ధము. కాలక్రమమునఁ గల్గిన కాలవివక్షచేత వ్యవహర్త లీ 'గ్వ'ంతములకు "ఇరు= ఇన్ద్ర=ఇన్ఱ్"=(ఉండు) మున్నగు సహాయక్రియలను జేర్చిరి.........

ఉదా:—సెయ్‌గు+ఇరు (లేదా) ఇన్ఱ్=సెయ్‌గిరేన్—సెయ్‌గిన్ద్రేన్. 'సెయ్యా గిరేన్' అను ప్రాచీన రూపమునుబట్టి యందలి 'గు' అనునది 'ఆగు' ధాతు రూపమనుట స్పష్టము. ఇరుధాతువుతోనున్న యీ రూపములు ధాతువులకుఁ జేర్పఁబడుచు వర్తమానార్థకములుగఁ దొల్కాప్పియరునకుఁ జిరకాలముక్రిందటనే యేర్పడినవి.........తొల్కాప్పియరు "కు+ఇన్ఱ్" అనువానికిఁగల సంబంధ

మును గ్రహింపక 'సెయ్‌గిన్రేన్' అనుచో 'సెయ్ + కిన్రు (లేదా) కిరు + ఏన్' అని విభజించి మధ్యగతమగు 'కిన్రు' అనుదానికి వర్తమానద్యోతకత్వమును ఘటించెను. "ఇరు=(ఉండు)" అను తమిళ ధాతువు 'గ్వాం'తమును జేరి 'గిరు' రూపము నందియుండఁ దప్పువిభాగముఁజేసి 'కిర్-గిర్-గిరు' అనునది వర్తమానార్థకశబ్దమని తర్వాతి వ్యాకర్తలును వచించిరి." (స్టడీ. ద్రవి. ౫౪, ౫౫, ౫౬ పుటలు).

విమర్శము:—ప్రాచీన ప్రామాణికులను నిరసించినంగాని స్వోత్కర్షము వెల్లడికాదనెడి నేటి కొందఱి పొరపాటు తలంపుతో వీరు తమకుఁగల యేవగింపును సంస్కృతమందును బ్రాచీన ద్రావిడ వ్యాకర్తలందును జూపి వారు మనల నపమార్గమునఁ బెట్టిరని వ్రాసిరేకాని మనకుఁ గల జ్ఞానలేశమునకుఁ బ్రాచీన ప్రామాణిక ద్రావిడ వ్యాకర్తలును సంస్కృతమును బెట్టిన భిక్షమే యాధారమని కృతజ్ఞతను జూపకుండుట శోచనీయము. ఇంతకును బ్రాచీన ప్రామాణిక ద్రావిడ వ్యాకర్తలు చేసిన యపరాధ మేమున్నది? 'కుమ్-తుమ్' అనునవి యర్థరహిత ప్రత్యయములని వారు వచింపలేదు. తొల్కాప్పియమున 'కుమ్-తుమ్' అనునవి యుత్తమపురుష బహువచనార్థకములని చెప్పఁబడెను. నిరర్థకమని యెచ్చటను జెప్పఁబడలేదు. వ్యాఖ్యాతలు 'కు' భావ్యర్థకమనియు 'తు' భూతభావ్యర్థకమనియు దెల్పుచు నుదాహరించిరి. కర్ణాట వ్యాకర్తలు 'కుం-గుం' అనునవి కాలత్రయమందును బ్రథమపురుషార్థము నితర ప్రత్యయ సాహాయ్యములేకయే బోధించునని చెప్పియున్నారు. (చూడుఁ ౧౨౭ IV విష). వారు తమతమ కాలములలో నున్న స్థితులను దెల్పుటలో నపరాధ మేమున్నది. కాలక్రమమున జరుగు మార్పులకు వారు ప్రతిభువులు (పూట= పూఁచీదారు) కానేరరుగదా.

'కిరు-కిన్రు' అని యిట్లు రేఫఘటిత శబ్దముతో వర్తమానార్థక ప్రత్యయమును వీరు నిరూపించుట కేవలము తప్పు. 'కిఱు-కిన్ఱు' అనునవి వీని నిజ రూపములని తమిళ వాఙ్మయమునఁ బ్రసిద్ధమై యున్నది. 'ర-ఱ'లకు నేఁడు గల వ్యత్యాసము ప్రాచీనకాలమున నుండెడిదనుట పొరపాటు. విశేషించి తమిళమున నేటికిని బండితోచ్చారణమున వాని భేదము భాసించుచునే యున్నది. ప్రాచీనకాలమున ఱకారము 'టత' మధ్యస్థోచ్చారణము గలదని తొల్కాప్పియమున విశదీకరింపఁబడియున్నది. (చూడుఁ ౧౭ VI విష.) మఱియు దొల్కాప్పియమునకుఁ జిరకాలము పూర్వమందె కిన్రు, కిరు ('కిన్ఱు=కిఱు') అనునవి తమిళమునఁ బ్రసిద్ధములై యుండెడివనుట కేవలము నసత్యము. ఈ

రూపములను దొల్కాప్పియరు సాధించిరనుట యంతకన్న నసత్యమే. తొల్కాప్పియమందె కాక తమిళ ప్రాచీన వాఙ్మయమందెందును నీ రూపములు లేవు. తొల్కాప్పియమునఁ గాలములు మూఁడు గలవనుచుఁ బేర్కొనఁబడియెను. వర్తమాన కాలిక రూపములను వాడెడి పద్ధతు లీ క్రింది రీతిని నిరూపింపఁబడెను. అంతియకాని వర్తమానకాల బోధకములగు 'కిన్ఱు-కిఱు' ప్రత్యయములు సూత్రింపఁబడలేదు.

"ఇఱప్పిన్......" (తొల్కా. ౭౪౮ సూ.)=భూతవర్తమానభావులు మూఁడు కాలములును స్పష్టముగాను సూచనగాను గల గ్రియలు వెలయుచున్నవి.

"మున్నిలై......" (తొల్కా.౭౨౮ సూ.)=మూఁడుకాలములందును నుండెడి స్వభావముగల వ్యాపారమును జెప్పునపుడు వర్తమానవాచియుఁ ద్రికాలవాచియు నగు క్రియను వాడవలయును. ఉదా:—తిజ్గళ్ ఇయజ్గుమ్=(చంద్రుఁడు తిరుగును). మలై నిఱ్కుమ్=(కొండ సదా నిల్చియుండును).

"వారాక్కాలమ్......" (తొల్కా. ౭౨౯ సూ.)=భావికాలమందును వర్తమానకాలమందును వేగమును దెల్పుటకై భూతకాలక్రియ వాడఁబడును. ఉదా:—భుజించుచున్నవాఁడును భుజింపఁగలవాఁడును 'ఉణ్డేన్-వన్దేన్'=(ఇదె భుజించితి వచ్చితిని అని పల్కుట గలదు.

"మిక్కతన్......" తొల్కా. ౭౨౬ సూ.)=ఒక కార్యము బహుళముగా సహజ ధర్మముగా సంభవించుచుండు నలవాటునుబట్టి భావి వర్తమాన క్రియలను వాడవచ్చును. ఉదా:—తవమ్ సెయ్దవన్ సువర్కమ్ పుగుమ్=(తపము చేసినవాఁడు స్వర్గమును బ్రవేశించుచున్నాఁడు.)

౭౨౮, ౭౨౯, ౭౨౬ సూత్రములలోఁ దొల్కాప్పియరుగారు "నిగళ్కాలమ్=(వర్తమానకాలము) ఇఱన్దకాలమ్=(భూతకాలము) వరుజ్గాలమ్==(భవిష్యత్కాలము)" అని కాలత్రయమును బేర్కొనిరి. ఉదాహృతులెల్ల వ్యాఖ్యాతలవె కానఁ బైరీతిని మూఁడుకాలములకును వ్యాఖ్యాత లుదాహరించిరి. పయిరీతిని గాలత్రయమును దొల్కాప్పియరు బేర్కొనుటంబట్టి వర్తమాన కాలిక రూప మాయన కాలమున నుండెడిదని యంగీకరింపక తీరదు. అట్టి వర్తమానార్థకములుగ 'పుగుమ్' మున్నగు ఉమంత క్రియలుమాత్రమె వర్తమానకాలమునకు వ్యాఖ్యాతలచే నయిత ముదాహరింపఁబడెను. ఇంతియకాక "తొల్కాప్పియమందుఁగాని ప్రాచీనతమ తమిళ వాఙ్మయమునందుఁ గాని 'కిన్ఱు-కిఱు' ప్రత్య

యాంతములు వచ్చునకేని లేవు. "చెయ్యాగిఱేన్=(చేయుచున్నాను)" అను ప్రాచీనరూపము గలదని శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు వ్రాసినది నిజము కాదు. అట్టి రూపము తమిళమున లేనే లేదు.

తక్కిన భూతార్థకాది చిహ్నములగు దకారాదులకుఁ దొల్కాప్పియ మునఁ బ్రయోగములు గలవు. 'అళపిఅన్దన...' (తొల్కా. ౬౩౬ సూ.) 'కుఱిత్తన...' (తొల్కా. ౬౩౯ సూ.) 'ఆగుమ్...' (తొల్కా. ౬౪౦ సూ.) 'కొడుప్ప ఈయన్...' (తొల్కా. పొరుళ్ ౧౪౦ సూ.)

"చెయ్యాగిఱేన్' అను రూపము తమిళమున నెందును లేదు. 'చెయ్యా నిన్ఱేన్' అను రూపముగలదు. దీనిలోని 'ఆనిన్ఱేన్' అనునది వర్తమానకాల వాచియందురు." (విద్వాన్ శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు 10—12—1951-తేది.)

పయి సందర్భమునుబట్టి "తొల్కాప్పియరు 'చెయ్కిన్ఱేన్' అను-చోఁ దప్పు విభాగమును జేసి 'కిన్ఱు' అను రూపమును సాధించెను" అను శ్రీ కోరాడ వారి వ్రాఁత సాహసైక మూలకమనక తీరదు.

తెలుఁగున 'చేయుచు' అను వర్తమానరూపమునకుఁ బరముగా 'ఉండు' ధాతు వనుప్రయుక్త మగుచున్నట్లు (చేయుచున్నాఁడు) తమిళ మందును 'ఉండు' ధాత్వర్థకమగు 'ఇరు' అనునది తమిళ వర్తమానార్థమున నుండవలదాయని తలంచికావలయును వీరు 'కు+ఇరు=కిరు' అను రీతి రూప ముల నంగీకరించిరి. అది సరికాదు. తెల్గునందలి 'చు' అనునది వర్తమా నార్థ కావ్యయమగు క్రియాకాంక్షాఽసమాపక క్రియాప్రత్యయము. కావున నట్టి 'చు' ప్రత్యయమున కన్వయ సంపత్తికయి 'ఉండు' ధాత్వనుప్రయోగ మావశ్యకమయ్యెను. తమిళ కన్నడములలోఁ దెల్గు 'చు' ప్రత్యయాంతము వంటి (చేయుచున్) క్రియాకాంక్షాఽసమాపకక్రియయే లేదు. 'చెయ్కు' అను తమిళ రూపమునకుఁగాని 'మాడుతె మాడుతుం' అను కన్నడ రూపము లకుఁగాని 'చేయుచున్' అను నర్థములేదు. తమిళ 'కు' ప్రత్యయమును గన్నడ 'ఉతె' ప్రభృతులును దెల్గు 'చు' ప్రత్యయమువలె వర్తమానార్థకావ్యయరూప క్రియాకాంక్షాఽసమాపక క్రియాప్రత్యయములు కావు. (చూడు ౧౨౯ విమ. ౧౩౦ I విష). అట్లగుటంజేసి తమిళ కన్నడ వర్తమాన రూపములలో 'ఉండు' ధాత్వర్థక శబ్ద స్థితికిఁ బ్రసక్తిలేదు. కాన 'స్టడీ-ద్రవి' గ్రంథమునందలి 'చెయ్గు+ఇరు' అను రూపసాధనము సరియైయుండలేదు.

తమిళమున 'చెయ్‌గు' అనునది ధాతువనియు 'ఇరు' అనునది వర్తమానార్థక ప్రత్యయమనియుఁ జెప్పుట సరికాదు 'చెయ్‌గు' అనునది తమిళ ధాతువు కాదు. అట్లైయైనచో ''చెయ్‌దేన్'=(చేసితిని), 'చెయ్‌వేన్'=(చేయఁగలను)'' మున్నగు వర్తమానేతరరూప పరంపరయెల్ల విరోధించును. మఱియుఁ దమిళ ధాతువులెల్ల 'గు' ప్రత్యయాంతములు కావుగదా. ఇంక వర్తమానార్థక రూప సాధనమునమాత్రము ధాతువు గ్వంతరూప మనుట యసంగతము గదా.

'కుం-గుం' అనునవి సర్వకాలపురుష సాధారణములని కేశిరాజు వ్రాసె ననుట పరమసాహసము. అవి ప్రథమ పురుషమందు మాత్రము సర్వకాలము లందును నిల్చునని యాతఁడు సూత్రించి యున్నాఁడు,

క. నవనాగి భూతదొళ్ లిం। గవచనదొళ్ తళ్తు వర్తమాన భవిష్య ద్వ్యవహృతిగళ గుం కుం న। ల్పువుతా వనైౖకవచనదొళ్ నెల సిద్ధం ॥ (శబ్ద మణిదర్పణము ౨౨౬ ప).

వృత్తి:—భూత కాల వెన్నదె లింగత్రయ వచనత్రయ వెన్నదె వర్తమాన భవిష్యత్కాలంగళొళ్ వర్తిసువ గుం కుం ఎంబివు ప్రథమ దేకవచనక్కె మాదేశ మప్పువు.

''There are two other affixes for the 3rd person గుం and కుం...... ......'' (ఆంగ్లవృత్తి).

''అమరోర్గుమ్'' (కర్ణాట శబ్దానుశాసనము ౪౬౩ సూ.) = వృత్తిః—ధాతోః పరయోః సతి భూతే భవిష్యతి చ కాలే విహితయోః 'అమ్-అర్'' ఇత్యేతయోః 'గుం' ఇత్యాదేశో వా భవతి పుంలిఙ్గే స్త్రీలిఙ్గే నపుంసక లిఙ్గేచ విషయే''.

౧౩౦. VII విష:—''తమిళ కావ్య భాషయందు వర్తమానకాల రూపముల వాడుక మిక్కిలి యరుదు. శాసనములం దట్టి రూపములు కన్పట్టనే లేదు. భూత భావి రూపములు ధారాళముగాఁ బ్రయుక్తములై యున్నవి. ఇంక నేఁటి వాడుకయందు వర్తమానకాల రూపములును విరివిగా వాడఁబడు చున్నవి గాని వానియందు వర్తమాన చిహ్నములగు 'గిఱు' మున్నగునవి లుప్త ప్రాయము లగుచున్నవి. ఉదా:—'వేగుగిఱదు=(కాలుచున్నది)' అనుటకు బదులుగా నేఁడు 'వేగుదు' అని వాడఁబడుచున్నది. దీనినిబట్టి తమిళమున వర్తమాన కాలిక తిఙంత రూపములు స్థిరపడలేదని తేలుచున్నది'' (కాల్డు. ౪౯౪ పుట).

"తుద భాషయందు భావి వర్తమాన రూపము లభిన్నములు. కాలిక చిహ్నము 'క్=గ్' అనునది. ఉదా:—పొకెని=(నేను బోవుచున్నాను-నేను బోవఁగలను). పొకెమి=(మేము పోవుచున్నాము-పోవఁగలము). ఎర్ష్+క్+ఎన్-(నేనున్నాను) ఎర్ష్+క్+ఇమ్-(మేమున్నాము:-ఉండఁగలము) రేఫమునకు మాఱుగ నిందు 'ర్ష్' అనునది వాడఁబడును. కోత భాషయందు 'క' కారమునకు బదులుగా 'ప' కారము వచ్చుచున్నది. ఉదా:—పొొగపె=(నేను బోవు దును.) హొోగ పేమె=(మేము పోవుచున్నాము) ప్రథమ పురుషమునందు మాత్రము 'క' కారమె నిల్చుచున్నది. ఉదా:—హోోగకో=(వాఁడు పోవు చున్నాడు. వారు పోవుచున్నారు)" (కాల్డు. ౪౯౪, ౪౯౭ పుటలు).

"తుద భాషలో నుత్తమపురుషము నందలి 'క' కారమును 'కోత' భాష యందలి ప్రథమపురుష కకారమును బరస్పర సంబంధు లగుటయేకాక ప్రాచీన తమిళమందలి 'గు' అనుదానితోడను బ్రాచీన కన్నడ తద్ధర్మార్థకము లగు 'కుమ్-గుమ్' అనువానితోడను సంబంధము కలిగియున్నవి. ఉదా:— ప్రాచీన తమిళ-సెయ్గు=(నేను జేయుచున్నాను. చేయఁగలను). ప్రాచీన కన్నడ:—మాడుగుమ్=(నేను జేయుచున్నాను) (అతఁడు, వారు-చేయుదురు). కోత భాషలోని వర్తమాన కాలిక 'ప' కారము ప్రాచీన కన్నడ వర్తమాన కాలిక 'దప్' ప్రత్యయముతోడను నంతకన్న సన్నిహితముగఁ దమిళ మలయాళ కన్నడ భావి చిహ్న నకార బకార పకారములతోడను సంబం ధించుచున్నది. తుద భాషయందుఁ బలెనె కోత భాషయందలి కొన్ని క్రియ లలో 'క' కారము వర్తమాన చిహ్నముగ నగపడుచున్నది. ఉదా:—విన్డ్+క్+ఎనె=విన్డ్కెనె=(నే నడుగుచున్నాను) విన్డ్కెమె=మే మడుగుచున్నాము). కొన్నిటియందు రెండిటి మిశ్రణమును వెలయుచున్నది. ఉదా:—ఎత్తకెపె= (నేను లేవఁదీయుచున్నాను-లేదా-నే నిల్లు కట్టుచున్నాను). దీని భూతార్థక రూపము-ఎత్తిపె" (కాల్డు. ౪౯౭ పుట).

విమర్శము:—"తమిళ కావ్య భాషయందు వర్తమానకాల రూపము లరుదు" అనుటలో 'కిన్ఱు-కిఱు-ఆనిన్ఱు' అను ప్రత్యయములుగల రూపము లరుదని మాత్రమే దొరగారి యాశయము. ఇచటి కావ్య భాషయనఁగా నర్వాచీన కావ్య భాషయని తాత్పర్యము. కేవల ప్రాచీన కావ్య భాషయం దనఁగాఁ దొల్కాప్పియము నాఁటి భాషయందన్ననో యా 'కిన్ఱు-కిఱు-ఆనిన్ఱు' ప్రత్యయాంతములు వచ్చునకేని లేవని యెఱుఁగునది. అపుడు 'ఉమంత' ము లగు వర్తమాన రూపములు మాత్రమె ప్రయుక్తము లగుచుండెడివి.

కోత భాషలో 'క' కారముచోట 'వ' కారము నిల్చు నననేల? అచట (మధ్యమోత్తమ పురుషములలో) భావ్యర్థక 'వ' కారమె వర్తమానార్థకముగ వాడఁబడెననుట యుక్తముకాదా? మఱియు నీ కోత భాషలోని 'హోగకో'= (వాఁడు పోవుచున్నాఁడు వారు పోవుచున్నారు) అను దాని వైఖరి చూడఁగా నది కన్నడమందలి 'కుం గుం' ప్రత్యయముల సంబంధి యనియుఁ దోఁచు చున్నది.

'మాడుగుం' అను కన్నడ రూపమునకు దొరగారు 'నేను జేయుచున్నాను' అని యర్థము వ్రాయుట పొరపాటు. కన్నడ 'గుం' ప్రత్యయమునకుఁ బ్రథమ పురుష మాత్రమందె ప్రయోగము సమ్మతము. (చూడు ౧౩౦ VI విభ).

౧౩౧. I విభ:—"(౧) భూతకాలము (Preterite tense):—సెమిటికు భాషలలో ధాతువున కిరుప్రక్కలను బురుష బోధక ప్రత్యయములు నిల్చు స్థానము వలన గ్రియల భూత భావికాలము లేర్పడును. (చూడు ౧౨౮ I విభ). ఇండో యూరపియను భాషలలోఁ గొన్నియెడల ధాతువుయొక్క ద్విరుక్తివలన భూతకాలము తెలుపఁబడును. (ఉదా:—బభూవ?). ఈ ద్విరుక్తిలోఁ గొన్ని మార్పులును గల్గును. ఇండో యూరపియను భాషలలోఁ గొన్నియెడల ధాతువునకుఁ బూర్వ భాగమున నొకానొక కాలిక చిహ్నమును జేర్చుటవలన భూతకాలము తెల్పఁబడును. (ఉదా:—అభవత్-అభూత్-మొ). ఇట్టి కాలిక చిహ్నమును 'బాపు' దొరగారు 'ఆల్ఫా ప్రైవటివ్' (Alpha privative) న కభిన్నమని తలంచిరి. (ఆల్ఫా ప్రైవటివ్=నఞర్థకము. చూడు ౧౨౬ V విభ). కాని మేయరు దొరగారు దీనిని నేఁటికిని 'కెల్టికు' భాషలందు భూతకాల చిహ్నముగ ధాతువులకుఁ బూర్వ భాగమునఁ జేర్పఁబడుచున్న సంస్కృ 'అస్'=తెల్గు-'కల్గు' అను నర్థముగల సహాయ క్రియయొక్క జీర్ణ శిష్టమగు 'అ' అనుదాని కభిన్నమని తలంచిరి. ఆధునిక ట్యుటానికు భాషలం దనేక క్రియలందును, నాధునిక పెరిషియను భాషలందును, ఫిన్నిషు-టర్కిషు భాషా కుటుంబము లందును నుత్తర హిందూస్థాన భాషలందును ద్రావిడ భాషలు పెక్కిటియందును ధాతువునకుఁ బరముగ నచ్చో హల్లో భూతకాల వాచకముగఁ జేర్పఁబడును." (కాల్డు. ౪౯౫ పుట).

"ద్రావిడ భాషలందు సాధారణముగ వర్తమాన రూపములవలెనె భూతార్థక రూపములును భూతార్థక ధాతుజ విశేషణమునకుఁ బురుష బోధక ప్రత్యయ యోగమున సమాపక క్రియా రూప సిద్ధి నందుచున్నవి. (చూడు ౧౩౦ I విభ). అట్టి భూతార్థ మా ధాతుజ విశేషణమందె యుండును. తక్కిన మార్పు లుచ్చారణ సౌకర్యార్థకములె యనఁదగును. మలయాళమునందును (ఇందుఁ బురుష బోధక ప్రత్యయ యోగముండదు) భూతార్థక ధాతుజ

విశేషణములకు సరిపడియుండు రూపమె చాలియుండును. తమిళమున శత్రర్థకము లేమింజేసి యట్టి యర్థమున భూతార్థకమె వాడఁబడును. శత్రర్థక భూతార్థ కావ్యయ రూపములు వేర్వేఱుగ నున్న భాషలలో (తెల్గు-మొ.) నితర శత్రర్థక రూపములు సమాన కాలిక క్రియలను, భూతార్థ కావ్యయములు క్రియల పౌర్వా పర్యమును, దెల్పును". (కాల్డు. ౪౯౬ పుట).

"ద్రావిడ భాషలందలి భూతార్థక క్రియలు రెండు విధములు.

I. ధాతువు దుది హల్లు ద్విరుక్తమగుట.

II. ధాతువు పైని భూతార్థక ప్రత్యయము చేరుట.

I. ధాతువు తుది హల్లు ద్విరుక్తమగుట:—ద్రావిడ భాష లన్నిటియందును నీ విధమునఁ గొన్ని క్రియలు భూతార్థకము లగుచున్నవి. ఇండో యూరపి యను భాషలందు ధాతువో, ధాతువుయొక్క మొదటి భాగమో, ద్విరుక్త మగుచుండఁగా ద్రావిడ భాషలందు ధాతువుయొక్క తుది హల్లు ద్విత్వము నందును. ఏక హ్రస్వ పూర్వకములగు 'డు-గు-ఱు' అనునవి తుదినిగల ధాతువులు మాత్రమె పై రీతిని భూతార్థమును బోధించును. ఉదా:—పడు+ ఏన్=పట్టేన్=(అనుభవించితిని) పుగు+ఏన్=పుక్కేన్=(ప్రవేశించితిని) పెఱు+ ఏన్=పెత్త్రేన్ (ట్టేన్) (పొందితిని). ద్విరుక్తి గల్గునపుడు సరళము పరుషమగుట తమిళ సంప్రదాయము. నేటి వ్యావహారిక తమిళమున వానికె భూతార్థక చిహ్న మేళనము గల్గును.) ఉదా:—పుగున్దేన్=(ప్రవేశించితిని). నగై_త్తేన్=(నవ్వితిని). కన్నడ మిట్టి క్రియల విషయమున గ్రాంథిక తమిళమునే పోలుచున్నది. ఉదా:—నగు-నక్కను = (నవ్వెను). తెల్గున నిట్టి నియమము నియతముగా లేకున్నను నట్టి జాడ కన్పట్టుచున్నది. (పడ్డవాఁడను=పడ్డాను. విన్న వాఁడను= విన్నాను-మొ.) ఇండో యూరపియను భాషలకును ద్రావిడ భాషలకును ద్విత్వ విషయమునఁ బైని జూపిన భేదమున్నను ద్రావిడ ద్విరుక్తి యిండో యూరపియను ద్విరుక్తి సిద్ధాంతమునుండియే యేర్పడెననియు నిట్టి సామ్య మీ రెండు కుటుంబములను సంబంధించిన యొక గ్రహింపఁదగిన విషయమనియు నెన్న నగును." (కాల్డు. ౪౯౬, ౪౯౭ పుటలు).

విమర్శము:—తమిళమున శత్రర్థకము లేమింజేసి దానికి బదులుగా భూతార్థక ధాతుజ విశేషణమె వాడఁబడుననుట సరికాదు. 'సెయ్‌దేన్=(చేసితిని)' అనుదానికి వర్తమానార్థము గలదని భ్రమింపరాదు. ఇంక 'తు' అను ప్రాచీన ద్రావిడ భూతార్థక ప్రత్యయాంతరము భావ్యర్థమును సైత మిచ్చునని గ్రహింప నగును. ఉదా:—సెయ్‌దు=చేసితిని—చేయఁగలను) (చూడు నన్నూలు ౧౪౦ సూ. ౧౨౭ II విష. చూడు).

ఇండో యూరపియను భాషలలో భూతార్థమున ధాతువుగాని ధాతువు మొదటి భాగముగాని ద్విత్వమునందు నట్లె ద్రావిడ భాషలలో ధాతువు తుది వర్ణము ద్విత్వమందునను దొరగారి వ్రాత భ్రాంతి మూలకము. ద్రావిడ భాషలలో నియ్యది ద్విత్వాభాసమె కాని ద్విత్వము కాదు.

"పరోక్షే లిట్". (౩—౨—౧౧౫)="భూతానద్యతన పరోక్షార్థ వృత్తే ర్ధాతోః లిట్ స్యాత్." (సంస్కృతమున భూతమందు 'లిట్' అగును).

"భువో వుగ్ లుఙ్ లిటోః" (౬-౪-౮౮)="భువో వుగాగమః స్యా ల్లుఙ్ లిటో రచి." (భూధాతువు తుదిని లిట్టునందు వు గాగమము నిల్చును).

"లిటి ధాతో రనభ్యాసస్య" (౬-౧-౮)="లిటి పరే అనభ్యాస ధాత్వ వయవస్య ఏకాచః ప్రథమస్య ద్వే స్తః. ఆది భూతా దచః పరస్యతు ద్వితీయస్య." (లిట్టు పరమాచుండఁగా ధాతువు మొదటి వర్ణము ద్విత్వమందును) (విస్తర భీతిచే నిచటి ప్రక్రియ సూత్రముల నెల్ల నుదాహరింపలేదు). అనునవి మొదలగు సూత్రముల చొప్పున "భూ+భూ+వ్+అ=బభూవ=(ఆయెను.)" అను రూప మేర్పడును. ఇట్లె తక్కిన పురుష వచనములందలి రూపముల ప్రక్రియ నరయునది. ధాతువున కిట్టి ద్విరుక్తి యిండో యూరపియను భాషలలో - సంస్కృతమున - వెలయుచున్నది. ఇంక ద్రావిడ భాషలలో ధాతువు తుది హల్లునకును నిట్లె ద్విత్వము గల్గుననుచు డా. కాల్డువెల్లుగా రుదాహరించిన "పడు-పట్టేన్. పుగు-పుక్కేన్" మున్నగు చోటులందలి ద్విత్వము పై సంస్కృతములోని ద్విత్వమువంటి దెంత మాత్రమును గాదు. ఇది ద్విత్వాభాసము. 'పడు' మున్నగువాని తుది హల్లు ప్రాచీనకాలమున 'టు' మున్నగు రీతిని బరుషరూపమునన యుండెడిది. దాని సరళస్థితి యర్వాచీనము. అట్టి పరుషమునకుఁ బరముగా భూతార్థక 'త' ప్రత్యయము చేరుటలోఁ గల్గిన సంధిమూలమున 'త' కారమునకుఁ బూర్వ స్థితి పరుషరూపము గల్గి యట్టి ద్విత్వము భాసిల్లుచున్నది. (Assimilation)= వర్ణసమీకరణము). భూతార్థక ప్రత్యయ యోగమునందు సంధి వశమున గల్గిన యీ ద్విత్వమును సంస్కృత భూతార్థక ద్విత్వము వంటిదనుట కేవల భ్రాంతి మూలకము. వెనుక ప్రేరణ ప్రత్యయ యోగమున నకర్మక ధాతువుల తుది సరళములకుఁ గల్గు ద్విత్వము విషయమునందును గాల్డువెల్లుగా రిట్లె యపమార్గము ద్రొక్కిరి. (చూడు ౬౦ III విష. ౧౨౧ II విష). "పట్+త్+ఏన్=పట్టేన్. పుక్+త్+ఏన్=పుక్కేన్. పెట్+త్+ఏన్=పెట్టేన్ (పెట్టేన్)" మున్నగు భూతార్థకముల రూపములు తొల్కాప్పియమున సాధింపఁబడలేదు. భూతాద్యర్థక ప్రత్యయాది విధానమె తొల్కాప్పియమున లేదు.

దొరగారు వ్రాసినట్లు ప్రాచీన కర్ణాట మీ విషయమునఁ జాలవఱకుఁ దమిళ పద్ధతినె యుండును గాన నట్టి ప్రక్రియ యిటఁ బ్రదర్శింపఁబడుచున్నది.

"తృతీయానాం వ్యఞ్జనాదౌ ప్రథమత్వమ్" (కర్ణా. భూ. ౨౨౮ సూ.)= వ్యంజనాది ప్రత్యయము పరమగుచుండఁగా వర్గ తృతీయములు వర్గ ప్రథమము లగును.

"కచటతపేభ్యో దస్య పూర్వరూపమ్" (కర్ణా. భూ. ౨౩౮ సూ.)= కచటతపలకుఁ బరమగు 'ద' కారము వరుసగా 'క-చ-ట-త-ప' ల రూపము నందును. ఉదా:—నగ్ + ద్ + అన్ = నక్కన్ = నక్కం = (నవ్వెను) దొరగా రుదాహరించిన 'నక్కను' మున్నగునవెల్ల హాసగన్నడ రూపములు. పైరీతినె 'పుగు-పొక్కం. పడు-పట్టం' మున్నగు వానిని సాధింపనగును.

ప్రాచీనకాలమున 'ట-త' మధ్యస్థోచ్చారణముగల 'ఱ' కారము ద్విత్వమున 'త్త' కారముగఁ బలుగన్నడమున మాఱును. (చూడు ౧౭ XII విష.) (చూడు ౧౭ XIII విష).

"అడయో స్తటౌ" (కర్ణా. భూ. ౨౨౯ సూ.)=హలాది ప్రత్యయము పరమగుచుండఁగా 'ఱ' కారము 'త' కారమును 'డ' కారము 'ట' కారమును నగును.

"కచటత పేభ్యోదస్య పూర్వరూపమ్" (కర్ణా. భూ. ౨౩౮). (మీఁద వివరింపఁబడెను). ఉదా:—పెఱు + ద + అన్ = పెత్ + త్ + అన్ = పెత్తం = (ప్రసవించెను. పొందెను) ('పెఱు ఉపలబ్ధౌ-ప్రసూతేచ'-శబ్దమణి దర్పణ ధాతు పాఠము).

తెలుఁగునందును భూతార్థక ద్విత్వపు జాడగలదనుటలో 'విన్నాను - పడ్డాను' మున్నగువానిని దొరగా రుద్దేశించి యుందురు. 'విన్నాను' మున్నగు వానికి 'వినినాను' మున్నగునవియు, 'పడ్డాను' మున్నగువానికి 'పడినాను' మున్నగునవియు రూపాంతరములై యుండుటచేత నచట భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయము స్పష్టముగ వెలయుచునే యున్నది.

"పడ్వాదుల నవర్ణంబున కత్వంబును గడ హల్లునకు ద్విత్వంబును విభాష నగు. ఉదా:—పడ్డ=పడిన. పడ్డన్ =పడినన్. పడు-ఇడు-చెడు-తగు-అను-కను-కొను-తిను-మను-విను-చను ఇవి పడ్వాదులు." (బాల వ్యా. క్రియా. ౫౧ సూ.).

'పడిన-వినిన' మున్నగు పాక్షిక రూపములనుబట్టి 'పడ్డ-విన్న' మున్నగు వానిలోని 'ఇ' అనునది లోపించి సంధింపఁగా "పడ్ + న్ + అ = పడ్డ. విన్ +

న్ + అ = విన్న" అను రీతిగల రూపము లేర్పడుననియు వీనియందు భూతార్థక ప్రత్యయమే గలదనియు భూతార్థక ద్విత్వము లేదనియు విశదమగును గదా. ఇట్టి ద్విత్వాభాసములతో సంబంధ మించుకేని లేని సంస్కృతమందలి నిజమయిన భూతార్థక ద్విత్వమును సరిపోల్చుట కేవలమును నవిమర్శన మూలకమనుటకు సందియము లేదు. ఇట్టి దొరగారి భూతార్థక ద్విత్వాభాసము నిజమైన దను కొని యాంధ్రభాషా చరిత్రకారులు సంస్కృత ద్రావిడ భాషల సంబంధముల పట్టికలో నిట్లుదాహరించిరి. "......భూతార్థక 'త' ప్రత్యయము, భూతార్థ క్రియలయం దామ్రేడితము (ద్విరుక్తి) భూతార్థకములగు 'ఇ-ద' ప్రత్యయములు ......" (ఆం. భా. చ. ౬౪ పుట).

౧౩౧. II విష:—II "భూతకాలిక ప్రత్యయ యోగమున భూతార్థక క్రియారూప సాధనము:—('త-ద-ఇన్' అనునవి ద్రావిడ భూతార్థక ప్రత్యయములు. వీనిలో రెండుజాతు లొక్క-చోటనే నిల్చునపుడు దొరగారు వానిలో నొకటి శ్రుతిసుఖార్థకమనుచుఁ బొరపాటుగా నిందు వ్రాయుచుందురు).

I. కన్నడము:—'దు' అనునదిగా మాఱిన 'ద' కారము ధాతువు తుదిని శ్రుతిసుఖార్థముగఁ జేర్చుటచేత సహజముగఁ గన్నడ భూతకాలరూప మేర్పడును. ఉదా:—కన్నడ-ఇళిదు=(దిగి). నుడిదు=(పలికి). ఈ రూపములకుఁ బరముగఁ బురుషబోధక సర్వనామ ప్రత్యయములను జేర్చుటవలనఁ గన్నడ భూతార్థక సమాపక క్రియారూపము లేర్పడును. ఉదా:—కన్న-ఇళిదు+ఎను= ఇళిదెను=(దిగితిని) నుడిదు+ఇ=నుడిది=(నీవు చెప్పితివి). 'ఇ-ఎ' అనునవి తుదినిగల ధాతువులును 'ఉ' కారాంతములు పెక్కు- ధాతువులును బై రీతిగల రూపసిద్ధి నందును. పైని వివరించిన భూతార్థక 'ద' ప్రత్యయము చేరుటలోఁ బెక్కు- పరిణామములు గల్గును. ఒకప్పుడీ 'ద' కారము 'త' కారమగును. ఉదా:—'అఱిదను' = (ఎఱిఁగెను) అనుటకు బదులుగా 'అఱితను' అని యేర్పడును. దీనికి సరియగు తమిళ రూపము-'అఱిన్దాన్' అనునది. కొన్ని యెడల నీ భూతార్థక దకార యోగమునఁ గన్నడమందు 'ద్ద' అని కాని 'త్త' అనికాని యేర్పడును. ఉదా:—ఇరు+దను=ఇద్దను=(ఉండెను). దీనికి సరియగు తమిళరూపము-'ఇరున్దాన్' అనునది. కన్న-ఎళుదు=ఎద్దు=(లేచి). "ఎఴున్దు అనునది దీనికి సరియగు తమిళరూపము. కన్న-ఉళుదు=ఉత్తు=(దున్ని)= తమిళ ఉఴుదు. కన్న-నిలుదు=నింతు=(నిలిచి)=తమి-నిన్ద్రు" కాల్డు. ౪౯౭, ౪౯౮ పుటలు).

"కన్నడమున ధాతువు తుదిని 'ఇ' ప్రత్యయము నిల్చుటచేత భూతార్థక రూపమేర్పడును. ఉదా:—మాడు+ఇ = మాడి = (చేసి). ఇట్టి దానికిని

బురుష బోధక ప్రత్యయమునకును నడుమ 'ద' ప్రత్యయము నిల్చును. ఉదా:—మాడిదెను=(చేసితిని) బాళిదను=(జీవించెను). ఆధునిక కన్నడము నందలి 'ఉ' కారాంతములలో నిట్లు తెలుచుగ రూపసిద్ధి గల్గును. ఇట్లు ధాతువుల తుది 'ఉ' కారము శ్రుతిసుఖార్థము చేరినదగుటచేత 'ఇ' ప్రత్యయము చేరునపు డయ్యది లోపించును. ఇట్టి 'ఇ' ప్రత్యయమునకుఁ బరముగ నిల్చు 'ద' ప్రత్యయము చరిత్రమునుబట్టి భూతార్థకమె యైనను నిట్టి ధాతువులందు శ్రుతిసుఖార్థకమె యనఁదగును" (కాల్డు. ౪౭౨ పుట).

"ఉకారాంతములగు నకర్మక ధాతువులు భూతార్థమునందుఁ బఱగన్నడ ముః 'ద' ప్రత్యయముతో నుండఁగా హళసగన్నడమున 'ఇ' ప్రత్యయముతోఁ గూడియుండును. ఉదా:—పఱగన్నడ- బాళ్ + ద్ + ఉ = బాళ్దు = (బ్రదికి). హళసగన్నడ-బాళి=(బ్రదికి). ఇందుఁ బ్రాచీన కర్ణాటరూపమె ప్రమాణతర మనఁదగును. పయి కన్నడ రూపములకు సరియగు తమిబరూపము వాళ్న్ద + ఉ=వాళ్న్దు =(వృద్ధినొంది). సమాపక క్రియలందును నిట్టి స్థితియె కలదు. పఱగన్నడ-బాళ్దెన్ =(బ్రదికితిని)=హళసగన్నడ=బాళిదెను. వీనికి సరియగు తమిబరూపము:—వాళ్న్దేన్ =(వృద్ధినొందితిని). భూతార్థక విశేషణములలో మాత్రము పఱగన్నడమందును బాహుళకముగ 'ఇ-ద' అను రెండును హళస గన్నడమందువలెనె చూపట్టుచున్నవి. ఉదా:—బాళిద=బాళ్ద=(బ్రదికిన). వీనికి సరియగు తమిబరూపము-వాళ్న్ద. పైని జూపిన రూపములనుబట్టి కన్నడ ధాతువునకును భూతార్థక 'ద' ప్రత్యయమునకును నడుమ 'ఇ' కారము శ్రుతిసుఖార్థముగఁ జేరె ననఁదగును."

"తమిబ కన్నడములు రెండిటియందలి భావ్యర్థకరూపములలో సంహితా వ్యవధాయకముగ 'ఉ' కారము చేరుటయుఁ బై యభిప్రాయమును బలపఱుచు చున్నది. ఉదా:—పఱగన్నడ-బాళ్వెన్. హళసగన్నడ-బాళువెను. తమిబ-వాళ్వేన్. కాని భూతార్థకములందలి 'ఇ' ప్రత్యయ మీ భావ్యర్థకము లందలి 'ఉ' కారమువంటిదికాదు. 'ఇ' ప్రత్యయము తమిబ కన్నడాంధ్ర ములలో భూతార్థకత్వమున మిక్కిలి ప్రాముఖ్యమును వహించి యున్నది. తెల్గు భూతార్థక విశేషణములలో 'ఇ' ప్రత్యయమునకును 'అ' అను విశేషణ ప్రత్యయమునకును నడుమ మఱొక వర్ణము (న్) చేరుచున్నది. మలయాళమునఁ బురుషబోధక ప్రత్యయముల లేమిచేత 'ఇ' కారమె భూతార్థములనెల్ల బోధించుచున్నది. ఉదా:—పాడి=(పాడితిని-పాడెను-పాడి-మొ). ఇట్లగుట చేత 'ఇ' కార ముచ్చారణార్థక మాత్రమనుటకు వీలులేదు. 'ఇ-ద' అను

రెండును భూతార్థక ప్రత్యయములె యని తలంపనగును" (కాల్డు. ౪౯౮, ౪౯౯ పుటలు).

"'ఇ-ద' అనువానిలో 'ద' ప్రత్యయమె ప్రాచీనతరమని చెప్పఁజాలకున్నను మిక్కిలి ప్రచురమగు వాడుకగలదనినైన సంగీకరింపక తీరదు. వ్యావహారిక కన్నడమున 'ఇ' ప్రత్యయము వాడఁబడుచోటులందు గ్రాంథిక కన్నడ తమిటములందు 'ద' ప్రత్యయమె నిల్చుచుండుట పై నుదాహరింపఁబడియె యున్నది. ప్రాచీన తమిట కన్నడములందలి 'ఇ' ప్రత్యయస్థితినిబట్టి యది తెల్గునుండి యెరవు తేఁబడినదన వీలులేదు. తెల్గునందు భూతార్థమున 'ఇ' ప్రత్యయము ప్రచురమై యున్నను 'ద=త=తి' ప్రత్యయమును గలదు (చదివితిని. మొ). 'ఇ' ప్రత్యయము తెల్గు గోండు భాషలలో వెలయుచుండుట నరయఁగా నది మిక్కిలి ప్రాచీనమని తెలియుచున్నది" (కాల్డు. ౪౯౯, ౫౦౦ పుటలు).

"ఇండోయూరపియను భాషలందును భూతార్థక చిహ్నములం దిట్టి స్థితులు గలవు. జర్మను తిజ్ ప్రత్యయములలో 'వీక్' (Weak) క్రియల పద్ధతి 'స్ట్రాంగ్' (Strong) క్రియల పద్ధతిని జాల చోటులం దణఁచి వేసె ననఁదగును" (కాల్డు. ౫౦౦ పుట).

"కన్నడ క్రియలందలి 'మాడి+ద్+ఎను = మాడిదెను=(చేసితిని)' 'మాడి+ద్+అ=మాడిద=(చేసినట్టి)' మున్నగు చోటులందు 'ద' కారము వెనుక వ్రాసిన రీతిని సంహితా వ్యవధాయక వర్ణముగాఁ దోఁచును. కాని క్రియలయందలి యీ 'ద' ప్రత్యయమునుగాని 'మర+ద్+అ=మరద=(చెట్టు యొక్క)' మున్నగు నామములందలి 'ద' వర్ణమునుగాని సంహితా వ్యవధాయక వర్ణ మనరాదు. (చూడు ౧౨ IV విష.). నామములందలి 'ద' కారమమహన్నిర్దేశక సర్వనామఖండమని వ్రాసియున్నాను. క్రియలయందలి 'ద' కారము సయితము భూతార్థక ప్రత్యయమె యని పైని నిరూపింపఁబడెను. కాన 'మాడి+ఎను'='మాడి+అ'=అను రీతిగల స్థలములయందు సంహితా వ్యవధాయకవర్ణ మావశ్యకమైయుండఁగా నప్పటి కింకను లోపింపక నిల్చియున్న యీ భూతార్థక 'ద' ప్రత్యయమునె కన్నడము వ్యవధాయకముగా వాడుకొనెనని తలంపనగును. కాన నీ 'ద' కారమేదో క్రొత్త సంహితా వ్యవధాయక వర్ణముకాదు. క్రొత్త ప్రయోజనమున వాడఁబడినదని గ్రహింపనగును" (కాల్డు. ౫౦౦ పుట).

విమర్శము:—"ఇళిదు=(దిగి) బాళిదెను=(బ్రదికితిని) ఎళుదు=ఎద్దు=(లేచి)" మున్నగు దొరగా రుదాహరించిన కన్నడో దాహృతులెల్ల హళగన్నడ రూపములు. ఇటిదు-బాల్ దెం - ఎల్ దు"=మున్నగునవి వానికి సరియగు పటగన్నడ రూపములు. క్త్వార్థకరూపములనుండి సమాపక క్రియలను సాధించుట యనన్వయ దుష్టమార్గమగుటచేత నది గ్రాహ్యము కాదనియు ధాతువుపైని భూతార్థక ప్రత్యయమును దాని పైని బురుషబోధక ప్రత్యయమును నిల్చుటచే సమాపక క్రియారూప మేర్పడుట సహజమనియు నీ వఱకె వివరింపఁబడెను. (చూడు ౧౩౦ I విష.). డా. కాల్డువెల్లుగారు ధాతువుపైని గాల పురుష బోధక ప్రత్యయములు వరుసగా నిల్చునని చెప్పి (చూడు ౧౨౭ I విష.) యిపుడు క్త్వార్థకాదులనుండి రూపసాధన ప్రక్రియను జూపుట (చూడు ౧౩౧ I విష.) వింత! ఈ విషయమున దొరగారూరకయె గ్రంథవిస్తృతి గావించిరి. చెప్పవలసినది చెప్పఁజాలరైరి. "ఇన్-(ఇ) త=ద" అనునవి ద్రావిడ భూతార్థక ప్రత్యయములు. వానిలో నేదోయొక దానిని మాత్రము చేర్పక కొన్ని యెడల నొక ప్రత్యయము చేరియుండుటను మఱచి కావలయును మఱొక భూతార్థక ప్రత్యయమును జనులు చేర్చుట సంభవించి యుండును. అట్లు తలంపక 'ఇ' ప్రత్యయమునకుఁ బరముగ నిల్చియున్న 'ద' ప్రత్యయము స్వర సంహితావ్యవధాయకవర్ణ మనియుఁ, గొన్నియెడల 'ద' ప్రత్యయమునకుఁ బూర్వమున నిల్చియున్న 'ఇ' ప్రత్యయ ముచ్చారణ సౌకర్యార్థకమనియు వ్రాయుచు దొరగారు మిక్కిలి గ్రంథవిస్తృతిని గావించిరి. కాని తెల్గులోని 'చూచితిని' మున్నగు చోటులందట్టి కల్పనముల కవకాశము లేమింజేసి యట్టియెడల రెండు భూతార్థక ప్రత్యయములును నిల్చెనని యంగీకరింపక తీరదు గదా.

'స్టడీ-ద్రవి' గ్రంథకర్తగారీ విషయమున నీ క్రిందిరీతిని వ్రాసిరి.

"ఒకసారి దకారమును మఱొకసారి నకారమును నింకొకసారి 'ఇ' కారమును నుచ్చారణార్థకములనుగా (కాల్డువెల్లుగారు) భావించుచు వచ్చిరి. . . . . . ." (స్టడీ-ద్రవి. ౬౫ పుట).

"పరిశీలింపఁగా 'ఇ' శబ్దమును 'త=ద' అను దానిని విడఁదీయుట సరికాదనియు 'ఇతు' అనునది భూతచిహ్నమనియుఁ జెప్పుట యుక్తము. . . . . . ." (స్టడీ-ద్రవి. ౫౯ పుట).

" 'ఈ=(ఇచ్చు)' అను ధాతువే యీ భూతార్థక చిహ్నమగు 'ఇతు' అను దానికి మూలము. ఇచ్చుట జరిగినపు డాక్షణముననే భూతార్థము ద్యోత్యమగును" (స్టడీ-ద్రవి. ౬౨ పుట).

"తమిళ కన్నడములలో 'ఇతు' లోని 'ఇ' వర్ణము తఱుచుగా లోపించు చుండును. తెల్గున మాత్రము పూర్తిగా నిల్చియున్నది. కాలక్రమమునఁ దమిళాంధ్రములలోని 'త' కారము 'న' కారముగా మాఱి నూతనరూపము లేర్పడెను. తెల్గు క్త్వార్థకములలో 'ఇతు' లోని తువర్ణము లోపించుటచేత 'ఇ' అనునదియే తుదివర్ణమయ్యెను" (స్టడీ-ద్రవి. ౬౬ పుట).

విమర్శము:—తమిళమున 'ఇ' వచ్చుచోట 'త' లేదు. 'త' వచ్చుచోట 'ఇ' లేదు. ఉదా:—పాడినేన్=(పాడితిని) చెయ్‌దేన్=(చేసితిని). కన్నడమున 'ఉ' కారాంత ధాతువులకు మాత్రమె 'ద' కారాది ప్రత్యయ పరకత్వమున బహుళముగా 'ఇ' అనునది (ఇ+ద=ఇద) వచ్చును.

"దాదా విదాగమో బహుళమ్" (కర్ణా. భూ. ౨౧౦ సూ.) ఉదా:—మెచ్చిదం=(మెచ్చెను)......పడెదం=(పొందెను). తెల్గుక్త్వార్థకములందు 'ఇ' మాత్రమె నిల్చును. ఉదా:—చూచు+ఇ=చూచి. మొ. ఇట్టి స్థితిలో 'ఇతు' అను నఖండ ప్రత్యయకల్పనము సరికాదు గదా. "ఈ భూతార్థక చిహ్నములను దెలుఁగునుండి తమిళ కన్నడములు గ్రహించినవని చెప్పరా కున్నను నివి మూల ద్రావిడ భాషనుండి వచ్చినవనఁదగును" (స్టడీ-ద్రవి. ౬౧ పుట). అను 'స్టడీ-ద్రవి.' గ్రంథకర్తగారి వాక్యము చొప్పున 'ఇతు' అనుదానికి "ఇచ్చు=ఇత్సు=ఇతు" అను తెల్గుధాతువు మూల మనరాదు గదా. ఇంక 'ఈ' అను మూలద్రావిడ ధాతువునుండి 'ఇతు' అను 'త' కార ఘటిత రూపమె ట్లేర్పడె ననఁదగును? ఇట్లసంభవమగు 'తు' వర్ణమునుజేర్చి కొన్ని యెడల 'ఇ' లోపించెననియుఁ గొన్ని యెడల 'తు' లోపించెననియుఁ జెప్పుట యర్హమా? ఇంత కన్న 'ఇ-తు' అనునవి వేర్వేఱు భూత ప్రత్యయములనుట సమంజసము కాదా? ఇంక 'ఇచ్చు' అను నర్థముగల 'ఈ' ధాతువునుండి భూతార్థము ద్యోత్యమగుట కేవలము నసంభవము. "ఇచ్చుట జరిగినపు డాక్షణముననె భూతార్థము ద్యోత్యమగును" అను 'స్టడీ-ద్రవి' గ్రంథకర్తగారి వాక్యమున కర్థము లేదు. ఇంతకన్న పరోక్షవిదూరస్థవస్తువాచియగు 'అదు' శబ్దము భూతార్థక 'త=ద' అను దానికి మూలమని చెప్పిన 'కిట్టెలు' దొరగారి వ్యుత్పత్తి (చూడు ౧౩౦ II విభ.) విశ్వసనీయము కాదా? "'ఇతు' అనునదె కాలక్రమమున 'ఇను' అని మాఱెననెడి 'స్టడీ-ద్రవి' గ్రంథకర్తగారి వచన మసంభవము. (స్టడీ-ద్రవి. ౬౬ పుట). నకారముతోఁగూడిన తకారము 'న్న' కారమగుట గలదు (చూడు ౧౫ II విభ). గాని కేవల 'త' కారము 'న' కారముగా మాఱుట యెందును లేదు గదా. ఇట్టి స్థితిలో 'చదివిన' మున్నగు తెలుఁగు భూతార్థక విశేషణ రూపములందును, దత్సమానార్థకములగు "చొల్లిన=చొన్న=(చెప్పిన) పోయి

నాన్—పోనాన్=(పోయెను)—పాడినాన్=(పాడెను)-కాట్టిన=(చూపిన) మున్నగు (చూడు ౩౨ VII విమ.) తమిళ భూతార్థక రూపములందును గల 'న' కారములు 'స్టడీ-ద్రవి' గ్రంథకర్తగారి 'ఇతు' ప్రత్యయ పక్షమున నసిద్ధములె యగును. మఱియు నీ 'న' శబ్దఘటిత రూపములు కాలక్రమమునఁ గల్గిన యర్వాచీన రూపములనుట సాహసము. ఇంతియకాక 'నడన్దాన్'=(నడచెను) మున్నగు ననేక తమిళరూపముల సాధనము విషయమునఁ గాల్డువెల్లుగారి మత మందువలెనె వీరి మతమందును నసంభవమగు ననునాసికీకరణపద్ధతియే కదా (చూడు ౨౮ IV విమ.) గతి కావలయును. కావున 'స్టడీ-ద్రవి' గ్రంథ పద్ధతియు గ్రాహ్యము కాదు.

ఇంక-"ఇన్=ఇ=న్=త్=ద్=తి" అనునవె భూతార్థకములనియుఁ గొన్నియెడల వానిలో నొక్కటియే భూతార్థకముగా నిల్చుచుండుననియు మఱి కొన్నియెడల భూతార్థదార్ఢ్యమును గోరియో లేక యట్టి భూతార్థకము గలదను విషయము మఱచియో యింకొక భూతార్థక ప్రత్యయము నిల్చుట సంభవింప నగుననియు నంగీకరించుటయె యుక్తము.

'ఇన్' అనుదానిలోని 'న' కారము లోపించుటచేత 'ఇ' అను భూతార్థక ప్రత్యయ మేర్పడెననియు, నందలి 'ఇ' అనునది లోపించుటచే 'న్' అనునది 'నడన్దాన్' 'చొన్న' మున్నగు చోటులందు భూతార్థకమై నిల్చుట (చూడు ౩౨ VII విమ.) సంభవించెననియు నట్టి నకారము భూతార్థక శబ్దఖండ మను విషయ మును మఱచుటచేతనో భూతార్థదార్ఢ్యాపేక్షచేతనో దానిపైని మరల 'త్' అను భూతార్థక ప్రత్యయము నిల్చుటచేత 'నడన్దాన్' మున్నగు రూపము లేర్పడె ననియు గ్రహింపనగును.

"తడఱ......" (నన్నూలు ౧౪౨ సూ.)='త్-ట్-ఱ్-ఇన్' అనునవి భూతార్థక ప్రత్యయములు ......ఇన్:—పో + ఇన్ + ఆన్ = పోయినాన్= పోనాన్=(పోయెను)" 'పోనాన్' అనురూపము 'ఇన్' అనుదానిలోని 'ఇ' లోపింపఁగా మిగిలిన 'న' కారముతోఁ గూడిన రూపము.

పయి నన్నూలు సూత్ర మీ క్రింది తొల్కాప్పియ సూత్రముచే సమూలమగుచున్నది.

"చెయ్దు......" (తొల్కా. ౭౧౨ సూ.)="చెయ్దు-చెయ్యూ-చెయ్పు-చెయ్దెన-చెయ్యియర్-చెయ్యియ-చెయిన్-చెయ-చెయక్కు" అను రీతిగల తొమ్మిది విధములగు రూపములును నెల్ల క్రియలయొక్కయు నసమాపకరూపములై యుండును. ఉదా:—చెయ్దు=(చేసి)......చెయిన్= (చేసినన్)......".

ఇంక ద్రావిడ పండితుల మఱికొన్ని యాశయములు విమర్శింపఁబడు చున్నవి.

"పఱగన్నడమున (గ్రాంథిక) భూతార్థక ప్రత్యయము 'ద' కారమై యుండఁగా హొసగన్నడమున భూతార్థకము 'ఇ' కారమైయున్నది" (స్టడీ-ద్రవి. ౬౧ పుట).

వ్యావహారిక కన్నడమందు మాత్రము 'ద' అనుభూతార్థకము లేదా?

"ధాతువిగె......భూత ప్రత్యయగళు సేరువాగ 'ద'......ఉదా:— కరెదను=(కరె+ద+అను)=(సమీపించెను)......" (హొసగన్నడ వ్యా. శబ్దాదర్శ. ౮౦ సూ.).

"ధాతుజ విశేషణములకె పురుషబోధక ప్రత్యయములను జేర్చుటచేత భూతార్థక సమాపకక్రియారూపములు ద్రావిడభాషలలో నేర్పడును. ఉదా:— తెల్గు-చేసినవాఁడు=చేసినాఁడు. తమి-సెయ్‌దవన్ = సెయ్‌దాన్-కన్న-మాడిదను" ('స్టడీ-ద్రవి' ౬౬, ౬౭ పుటలు). తెల్గునందలి ప్రాచీన భూతరూపములు 'చేసినవాఁడను-చేసితిని' అనునవె. 'చేసినాఁడు' అనుదాని వంటివి తిక్కన కాలము వఱకును గానరావు. ఇట్టి యర్వాచీన రూపములను 'సెయ్‌దాన్' మున్నగు తొల్కాప్పియము నాఁటి రూపములతో సరిగ నుదాహరింపరాదు.

"ఈ=ఇచ్చు=ఇత్తు=ఇతు" అను ప్రక్రియ కుదురుటకై 'స్టడీ-ద్రవి' గ్రంథకర్తగారు 'ఇతు=దు' అనురీతిని 'ఉ' కారాంతముగా భూతార్థక ప్రత్యయమును వ్రాయుచుందురు. కాని 'త' కారము ప్రాచీన తమిళమందును 'ద' కారము కన్నడమందును భూతార్థక ప్రత్యయములై యున్నవి. వాని పయిని క్త్వార్థమున 'ఉ' కారముచేరఁగా 'దు' అను కన్నడక్త్వార్థక రూపమేర్పడును. కాన 'దు' అనునది క్త్వార్థకము. దకారము కన్నడ భూతార్థక ప్రత్యయము.

"ద-దప-వకారాద్యా స్తా భూతవతీ వర్తమానా భవిష్యన్త్యః" (కర్ణా. భూ. ౧౯౬ సూ.).

"పూర్వకాల క్రియాయా మి దుతౌ యథా లక్ష్యమ్". (కర్ణా. భూ. ౨౨౪ సూ.) కన్నడమున క్త్వార్థమందు ధాతువునకుఁ బరముగాఁ బ్రయోగానుసారముగా 'ఇత్-ఉత్' అను ప్రత్యయము లగును. 'ఇ' వచ్చుచోట 'ద' ప్రత్యయము నిల్వదు. 'ఉ' ప్రత్యయము వచ్చునపుడు మాత్రము దానికి ముందు భూతార్థక దకారము నిల్చును. ఉదా:—నోడి పోదం=(చూచి పోయెను). బందు కండం=(వచ్చి చూచెను).

"సంధి నాపుటకు 'న' కారమే కాక 'య' కారము సయితమాగమము రావచ్చును. కాఁబట్టి 'చేసియవాఁడు-కొట్టియువాఁడు' వంటి రూపములు

పూర్వకాలమున వాడుకలో నుండి యుండవచ్చును. అట్టివానినుండి యేర్పడిన 'చేస్త్యాఁడు-కొట్ట్యాఁడు' మొదలయిన వ్యావహారిక రూపములు నిజాము రాష్ట్రమున వినవచ్చు"నని ఆంధ్ర భాషా చరిత్రకారులు వ్రాసిరి. (చూడు 'ఆం. భా. చ.' ౧_౨౭౭ పుట). అని యిట్లాంధ్రభాషావికాసకర్తగా రామోదించుచు వ్రాసిరి (ఆం. భా. వి. ౫౩౬ పుట). ప్రాచీన కాలమునఁ దెలుఁగున 'చేసియాఁడు' మున్నగువానివంటి ప్రయోగము లుండియుండ వచ్చుననుచు నిరాధారముగా వ్రాయుట సాహసము. అట్టి ప్రయోగము లెన్నఁడును దెల్గున లేవనియు 'కొట్టినాఁడు' మున్నగువానిలోని 'న' కార లోపమున నేర్పడియున్న 'కొట్టాఁడు' అనువానివంటి తాల వ్యాకార ఘటితాధునిక (చేసినాను=చేశాను) రూపములనుండి 'కొట్ట్యాఁడు' మున్నగువానివంటి యపభ్రంశ రూపము లేర్పడి యుండుననియు నూహించుట విశ్వసనీయమయి యుండును. ఇట్టి వీరిర్వుర యూహలకుఁ దమిటమందలి "కాట్టిన=కాట్టియ=(చూపిన)" అను కాల్డువెల్లు గారుదాహరించిన (చూడు ౩_౨ I విష.) రూపములు మూలమై యుండును. ఇందలి 'కాట్టిన' అను రూపములోని 'న' కారము సంహితా వ్యవధాయక వర్ణము కాదు. అది భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయముయొక్క యవయవము. అట్టి నకారపు లోపమునఁ గల్గిన సంహితలో నిల్చిన 'య' అనునది సంహితా వ్యవధాయక వర్ణము. (చూడు ౩_౨ VII విష.) తమిటమున 'కాట్టిన' అనుచోట 'కాట్టియ' అని నిల్చియున్నది గానఁ దెల్గునందును 'కొట్టినాఁడు' అనుచో 'కొట్టియాఁడు' అను దానివంటి యకార ఘటిత రూపములు ప్రాచీన కాలమున నిల్చియుండు నను నూహ కేవలము నసంగతము.

౧౩౧. III విష:—"II తమిటు భూతకాలము:—తమిటమందును గన్నడమందు వలెనె భూతార్థమున 'ఇ-ద' అను రెండు ప్రత్యయములును జేర్పఁబడును. తమిటమందును 'ద' ప్రత్యయము ధాతువుపైని నిల్చునపుడు పెక్కువిధములగు మార్పులు గల్గును. (చూడు-కన్నడపు మార్పులు ౧౩౧ II విష.) అట్టి మార్పులు లేక కేవల 'ద' కారము నిల్చు రూపములు మిక్కిలి యరుదు. అట్టివి కొన్ని మార్పులు:—లాంత ధాతువులు:—పోల్=(పోలు). పోల్+దు=పోన్దు=(క్త్వార్థకము) 'పోల్దు' అని కానేరదు. కొన్నియెడల ద్విరుక్త టకటము నిల్చును. ఉదా:—కల్=(నేర్చు). కల్+దు=కఱ్ఱు (కట్టు) ('కల్దు' అని కానేరదు). దీనికి సరియగు కన్నడ రూపము:—కలిదు. తమిటమున 'ద' ప్రత్యయ యోగమున ళకారము 'ణ్డ' అనునదిగా మాఱును. ఉదా:—మాళ్+దు=మాణ్డు=(చచ్చి). కొన్నియెడల ద్విరుక్త టకారమగును. ఉదా._కేళ్+దు=కేట్టు=(విని). కొన్నియెడల నిట్టి మార్పేదియుఁ గల్గదు. ఉదా:—ఉటు+దు=

ఉటుదు=(దున్ని). ఈ దకారము మూర్ధన్య డకార మగుటయుఁ గలదు. ఉదా:—కాణ్+దు=కణ్డు=(చూచి)" (కాల్డు. ౫౦౦, ౫౦౧ పుటలు).

విమర్శము:—తమిళ భూతార్థకము 'త' ప్రత్యయము. కాలక్రమమున నద్దానికి సరళోచ్చారణము గల్గెను. (చూడు ౧౭ XXII, ౧౭ XXIII. విష.) కన్నడ భూతార్థకము 'ద' ప్రత్యయము. తమిళమందే కాక పెక్కు ద్రావిడ భాషలలో 'ఇన్-ఇ-న్' అను మఱొక భూతార్థక ప్రత్యయము గలదు. తమిళాంధ్రములలో 'ఇన్-ఇ-న్' అను రూపము లాయా యెడల వేర్వేఱుగా నిల్చును. కన్నడమున 'ఇ' కార పూర్వక 'ద' ప్రత్యయమును గేవల 'ద' ప్రత్యయమును నాయా చోటులందు నిల్చును. కన్నడమున 'ఇ' ప్రత్యయమునకుఁ బ్రత్యేక స్థితి భూతార్థమునఁ గానరాదు.

"దాదా విదాగమో బహుళమ్" (కర్ణా. భూ. ౨౧౦ సూ.) ఉదా:— మెచ్చిదం=(మెచ్చెను). మెచ్చిదపం=(మెచ్చుచున్నాఁడు) మెచ్చిదర్=(మెచ్చిరి). కన్నడమందును ధాతువుపైని 'ద' ప్రత్యయము నిల్చునపుడు పెక్కు విధములగు మార్పులు గల్గును. అట్టి మార్పులు కొన్ని హళగన్నడములోనివి దొరగారే వెనుక వివరించిరి. (చూడు ౧౩౧ II విష.) పలుగన్నడమున నిట్టి మార్పులు మిక్కిలి విరివిగాఁ జూపఁబడెను.

"హింసాగత్యర్థయో ర్లో నః" (కర్ణా. భూ. ౨౩౨ సూ.) హలాది ప్రత్యయ పరకత్వమున హింసార్థక గత్యర్థక ధాతువుల 'ల' కారము 'న' కార మగును. ఉదా:—కొల్+దం=కొన్దం=(కొట్టెను) సల్+దం=సన్దం=(చేరెను).

"ఆనయ నాగమ నార్థ వర్తినో రేఫస్య" (కర్ణా. భూ. ౨౩౪ సూ.)= హలాది ప్రత్యయము పరమగుచుండఁగా నానయనార్థ కాగమనార్థక ధాతువుల తుది రేఫము నకారమగును. ఉదా:—తర్+దం=తన్దం=(తెచ్చెను) బర్+దం=బన్దం=(వచ్చెను). ళకార దకారములకు వరుసగా ణకార డకారములగును. ఉదా:—కొళ్+దం=కొణ్డం = (కొనెను) ఉణ్+దం = ఉణ్డం = (భుజించెను).

"ధాతో రిదుతో రుపాన్త్యయో రేదోతౌ ప్రాయః" (కర్ణా. భూ. ౨౨౬ సూ.)=దకారాది ప్రత్యయము పరమగుచుండఁగా ధాతువుయొక్క యుపాంత్యములగు 'ఇ-ఉ' అను వానిచోట వరుసగా 'ఎ-ఒ' అనునవి నిల్చును. ఉదా:— ఇసు+దం=ఎచ్చం=(బాణ ప్రయోగము చేసెను). తుడు+దం=తొట్టం= (బాణమును సంధించెను). ఇందలి 'ఇసు' ధాతు సకారము 'చ' కారమగుటకు

తుడు ధాతు 'డ' కారము టకారమగుటకును సూత్రములు:—'సస్యచః' (కర్ణా. భూ. ౨౩౫ సూ.)=ఉదా:—ఇసు+దం=ఎచ్చం=(బాణ ప్రయోగము చేసెను).

"తృతీయానాం వ్యఞ్జనాదౌ ప్రథమత్వమ్" (కర్ణా. భూ. ౨౨౮ సూ.)=హలాది ప్రత్యయ పరకత్వమున వర్గ తృతీయములకు వర్గ ప్రథమము లాదేశ మగును.

"క చ ట త పేభ్యో దస్య పూర్వరూపమ్" (కర్ణా. భూ. ౨౩౮ సూ.)=ఉదా:—తుడు=తొట్టం=(బాణము సంధించెను).

ఇట్టి విధులు పెక్కు గలవు.

౧౩౧. IV విష:—"'ద' కారము తమిళ భాషయందుఁ దఱుచుగ సహజముగ 'న' కార (న్ద్) పూర్వక మగును. ఇది సంధి వశమునఁ గల్గినది కాదు. ఇది తమిళమందు సామాన్యముగాను దెలుఁగునందును నలవాటు పడియున్న 'సానునాసికీకరణ' (Nasalization) పద్ధతిచేఁ గల్గినదె. ఈ పద్ధతి చేతనే 'గు-దు-బు' అనునవి 'ఙ్గు-న్దు-మ్బు' అను రూపముల నందును. స్వరపూర్వక మైనట్టియు 'య ల ళ వ' పూర్వక మైనట్టియు భూతార్థక 'ద' ప్రత్యయ మొకప్పుడు కేవలముగనే యుండి కాలక్రమమున సానునాసికీకరణ పద్ధతి చొప్పున 'న్ద' అను రూపము నందును. కన్నడమం దిట్టి సానునాసికీకరణ పద్ధతి లేదు. ఉదా:—తమి-ఇరు+ద+ఏన్=ఇరున్దేన్=(ఉంటిని). కన్న-ఇరు+ద+ఎను=ఇరుదెను=ఇద్దెను=(ఉంటిని). తమి-వాళ్+ద+ఆన్=వాళ్న్దాన్ = (వృద్ధినందెను) దీనికి సరియగు కన్నడ రూపము=బాళ్ద. తమిళ శిష్ట వ్యవహారమందును, దమిళ గ్రాంథిక భాషయందును 'న' కారాగమము లేకుండుటయుఁ గలదు. ఉదా:—తమిళ-విఴు = (పడు)—విఴున్దు = (పడి. క్త్వా.) దీనికి 'వీట్డు' ('వీట్న్దు' శ్రీ రెడ్డిగారు) అను వాడుకయుఁ గవిప్రయోగములలోఁ గలదు. 'విఴు=వీళ్' అనునవి శబ్దతత్వశాస్త్ర పద్ధతి చొప్పునఁ దుల్యములె. వీనికిఁ గన్నడ-బిళ్దు=బిద్దు. తమిళ శిష్ట వ్యవహారము 'వీట్డు'. ('వీట్న్దు' శ్రీ రెడ్డిగారు) ఆధునిక తమిళ వ్యవహారము 'విఴున్దు'. మలయాళము—'వీణు'. వీని నెల్లఁ బోల్చి చూచునపుడు సానునాసికీకరణ పద్ధతి చరిత్రము వింతగొల్పుచుండును" (కాల్డు. ౫౦౧ పుట).

"'న్ద' అనుదానిలోని సరళము పరుషమై 'న' కార లోపము రాఁగాఁ బరుష ద్విత్వము గల్గును. ఈ మార్పు 'ద' కారమునుండియే సద్రుత 'ద' కారము పుట్టినదని స్థిరపఱుచుచున్నది. 'ఙ్గ=క్క; మ్బ=ప్ప' అగునట్లె 'న్ద' అనునది 'త్త' అనునదిగా మాఱును. కొన్ని యెడల నీ మార్పు శ్రుతిసుఖార్థమె కల్గును. ఉదా:—'పడుదేన్=పడున్దేన్' అను రూపము లేర్పడక

'పడుత్తేన్' అను రూప మేర్పడును. ఇట్టివి మిక్కిలి యరుదు. అకర్మక క్రియల నుండి సకర్మక క్రియ లేర్పడునపుడును నిట్టి ద్విత్వము కల్గును. ఉదా:— తాల్న్దేన్=(తగ్గితిని)=తాల్త్తేన్=(తగ్గించితిని.) ఈ విషయమున నితోధిక వివరణము 'క్రియల వర్గీకరణము' (Classification of the verbs) అను ప్రకరణ మునఁ జూడఁదగును. (చూడు II ప్రక. ౬౦ విష.)" (కాల్డు. ౫౦౧, ౫౦౨ పుటలు).

విమర్శము:—"ఇరున్దేన్-వాల్న్దాన్" మున్నగు తమిళ శబ్దములలోని 'న్ద్' అనుచోటి 'న' కారము సానునాసికీకరణ పద్ధతి సిద్ధమనుట సరికాదు. అట్టి 'న' కారము భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయపు 'ఇ' కారము లోపింపఁగా మిగిలిన భూతార్థక శబ్ద ఖండము. ఈ విషయ మీవఱకు ౧౩౧ II విషయ మున నిరూపింపఁబడెను. అట్లు మిగిలిన 'న' కారమును విస్మరించిన వ్యావహర్తలు భూతార్థ వ్యక్తికై మరల నచట భూతార్థక 'త=ద' కారమును వాడుటచేత 'న్ద్' అను రూప మేర్పడియుండును. ఇట్లు 'ఇన్' అను భూతార్థకములోని 'ఇ' కార లోపము "చొల్లిన=చొన్న-పోయినాన్=పోనాన్-ఆగినాన్=ఆనాన్" మున్నగు ననేక స్థలములందును స్పష్టముగాఁ జూపట్టుచునేయున్నది. 'ఇన్' అను భూతార్థక ప్రత్యయము ద్రావిడ భాషలలో-"తమి-పాడినాన్-చొల్లిన-పోయినాన్-తెల్గు-చదివిన-చదివినవాఁడను-చదివినన్." మున్నగు రీతిని ననం తముగా వెలసియున్నది. దాని నకార లోప రూపములు-"తమి-చొన్న-పోనాన్-ఆనాన్-కన్నడ-మాడిదం-మెచ్చిదం-మాడిదు-తెల్గు-చదివి." (క్త్వా) మున్నగురీతి ననేకములు గలవు. ఇట్టి త్రివిధ రూపములను బ్రాచీన ద్రావిడ వ్యాకర్తలు గ్రహించి సూత్రించియు నున్నారు (చూడు ౧౩౧ II విష). ఇట్టి 'ఇన్-న్' అను నీ ప్రత్యయములను ద్రోసిపుచ్చి యట్టి 'న' కారము సానునాసికీ కరణ పద్ధతి చొప్పున నూరకయె శ్రుతిసుఖార్థముగాఁ జేరినదని దొరగారు వాదించుట వింతగొలుపుచున్నది. ఏమి చిత్రమో కాని డా. కాల్డు వెల్లుగారు భాషా పరిశోధన విషయమున నుండరాని పట్టుదలతో యనునాసికీ కరణ విషయమున వ్రాయుచున్నారా? యని తోఁచుచున్నది. 'ఇన్=న్' అను సంబంధము స్ఫురింపకుండునట్లుగ (చూడు ౧౩౧ V విష.) 'ఇ' ప్రత్య యము "శ్రుతిసుఖార్థము చేరినది. కల్పితము-అస్వాభావికము" అనుచు దానినె యున్మూలింపఁ గడంగుచున్నారు. అనునాసికాగమము నిర్హేతుకముగా రానేరదని యీవఱకు విపుల విమర్శన పూర్వకముగా ధ్వని ప్రకరణమున వివ రించియున్నాను. (చూడు ౨౭ IV విష. మొ). ప్రాచీన తమిళమున సరళోచ్చారణమే లేమింజేసి యర్వాచీనముగ వచ్చిన యీ సరళోచ్చారణము

లోని సరళములెల్లఁ బ్రాచీన తమిళమునఁ బరుషములె యనుచు భావింపవలయు ననియు నట్టి యెడల నుండు 'స్వానునాసిక పరుష సంయోగము ద్విరుక్త పరుష ముగా మాఱుట సహజమె యనియు నీవఱకు (చూడు ౨౫ విషయమెల్ల) విపులముగాఁ బ్రదర్శించియున్నాను. ౧౩౧ V విషయమున నీ విషయము మరల విమర్శితమగును. అకర్మకములు సకర్మకము లగునపు డనుట యప్రయోజక మనియు నవి యెల్లఁ బ్రేరణార్థక స్థలములెయనియుఁ బ్రేరణార్థ బోధక ప్రత్యయము ధాతువుతో సంధించునపు డట్టి ద్విత్వము భాసించుననియు నీవఱకు విపులముగఁ బ్రదర్శించియున్నాను. (చూడు ౬౦ III విష).

౧౩౧. V విష:—"కన్నడమందు వలెనె తమిళమందును భూతార్థమున 'ఇ' ప్రత్యయము చేరుటయుఁ గలదు. ఉచ్చారణార్థకమగు 'ఉ' కారము తుదిని గల యేకదీర్ఘవర్ణయుక్తములు, దీర్ఘవర్ణద్వయాత్మకములు, హ్రస్వవర్ణద్వ యాత్మకములు, నగువాని కిట్టి 'ఇ' ప్రత్యయము నిల్చును. అట్టి దీర్ఘము సహజమైనదో (లేక) యాయా చోటులందలి స్థితిగతులచేఁ గల్గినదో? యై యుండును. ఉదా:—సహజ దీర్ఘమునకు:—పాడు=(పాటపాడు) (పాడినేన్= పాడితిని). తత్రత్య స్థితిచేఁ గల్గిన దానికి:—పణ్ణు=(చేయు) (దీర్ఘమనఁగా గుర్వక్షర మని యిచటి తాత్పర్యము). హ్రస్వ:—ఎటుదు=(వ్రాయు) ఒకటి హ్రస్వము నొకటి దీర్ఘమునైన దానికి:—తిరుప్పు (త్రిప్పు). "ల్–ళ్–ర్–ట్" అనునవి తుదిని గల ధాతువులందుఁ బై లక్షణములున్నను భూతార్థమున 'ద' ప్రత్యయమె వచ్చును" (కాల్డు. ౫౦౨ పుట).

"'ఇ' కారము భూతార్థమున వచ్చు తమిట క్రియలయందును బ్రాచీన కాలమున 'ద' కారమున్న జాడలు కన్పట్టుచున్నవి. తమి–పో (లేక) పోవు. (గు?) దీని 'ఇ' ప్రత్యయ ఘటిత రూపము–పోగిన. పోనాయ్=(పోయితివి). దీనికిఁ బర్యాయముగఁ గవి ప్రయోగమున 'పోది' అనునది క్వాచిత్కముగఁ గన్పట్టు చున్నది. ఇట్లె-ధాతువు-'ఆగు'.-ఆగినాయ్=ఆనాయ్=(అయితివి). ఇది కవి ప్రయోగములలో 'ఆది' అని యున్నది. ఈ స్థలములందు వ్యావహారిక కన్నడ మున "పోది–ఆది" అను రూపములు గన్పట్టుచున్నవి. తమిట కావ్యములం దొకొ క్కప్పుడు 'న్ద' అనుదానికి బదులుగా 'ద్' అనునది యగపడుచున్నది. 'వరుది'= ('నీవు వచ్చితివి. వచ్చెదవు—వత్తువు'?) అనునది "వరు ('రు లేదు'. శ్రీ రెడ్డిగారు) న్దాయ్ – వన్దాయ్=(వచ్చితివి)" అనుదానికి మాఱుగా వాడఁబడుచున్నది. ఈ 'వరుది' అనునది 'పోది–ఆది' అనువానిని బోలుచున్నది" (కాల్డు. ౫౦౨ పుట).

"ఇట్లు తమిట కన్నడములలో నగపడుచున్న 'ఇ' ప్రత్యయము కల్పిత మనియు, 'ద' ప్రత్యయమువంటి స్వాభావికత లేనిదనియుఁ జెప్పుట కవకాశము

గల్గుచున్నది. కన్నడమందు 'ద' ప్రత్యయమువలెనె తమిళమందును 'న' కారము దాని చరిత్ర మెట్టిదయినను శ్రుతిసుఖార్థముగఁ జేరుచున్న దన వచ్చును. ఉదా:—పాడు+ఇ+న్+ఏన్=పాడినేన్=(పాడితిని), పాడు+ఇ+న్+ఆయ్ = పాడినాయ్ = (పాడితివి). పాడు+ఇ+న్+ఆన్=పాడినాన్=(పాడెను). పాడు+ఇ+న్+అ=పాడిన=(పాడినట్టి). ఇట్టి రూపములందు 'పాడి' అను క్త్వార్థక రూపమునకుఁ బరముగఁ దమిళమున శ్రుతిసుఖార్థముగ 'న' కారము చేరుచున్నది. తమిళ ధాతుజ విశేషణములగు 'పాడిన' మున్నగు వానికి 'పాడియ' మున్నగునవి యందముగల రూపాంతరములై యుండుటయె యందలి 'న' కారము 'య' కారమువలె స్వరసంహితా వ్యవధాయక వర్ణమని స్థిరపఱుచుచున్నది. ఇందలి 'య' కారము ద్రుతముకన్నఁ బ్రాచీనతరము: (చూడుము ధ్వనిప్రకరణము). ఈ విధముననే ద్రుతము తుర్కి-షు భాషలందు వాడఁబడుచున్నది. అందుఁ దుమర్థకములందును గర్మార్థకములందును బ్రత్యయమునకును ధాతువునకును నడుమ నుచ్చారణార్థము న కారము చేరుట గలదు. ద్రావిడ భాషలం దెల్లెడలను దమిళ క్రియలం దధిక భాగమునను 'న' కారము స్వరసంహితా వ్యవధాయకమై నిల్చుచుండుటయె దాని యుచ్చారణార్థకతను నిర్ణయించుచున్నది. గ్రాంథిక తమిళమున నమహత్కర్తృక వర్తమాన బహువచన రూపమగు "వరుగిన్ద్రన"=(అవివచ్చుచున్నవి), మున్నగువానిలోని 'అన' అను దాని 'న' కారము "అవై =అవ" అను నమహద్బహువచన రూపమందలి 'వ' కారమున కభిన్నమనుటకు సందేహములేదు. "అ+న్+అ=అన. అ+వ్+అ=అవ" అనువానిలోని మొదటి 'అ' కారము నిర్దేశక సర్వనామ రూపమగు 'అ' శబ్దము. రెండవ 'అ' కార మమహద్బహువచన ప్రత్యయము. వీనిలోని 'న' కారము 'వ' కారమువలెనె కేవల ముచ్చారణార్థకము. ఇట్టి స్థితిలోఁ దమిళ దేశీయ వైయాకరణులు 'ఇ' కారము కాక 'ఇన్' అనుదానిని భూత కాలిక చిహ్నముగఁ జెప్పుదురు. క్త్వార్థక ప్రత్యయమున నెన్నఁడును నెచ్చటను 'ఇన్' అనునది లేకుండ 'ఇ' అనునది మాత్రమె యుండుటచేత 'న' కారము శ్రుతిసుఖార్థకమె యనియు నట్టిదానికి వైయాకరణులు లేనిపోని ప్రాముఖ్యము నొసంగిరనియు నిశ్చయింపనగును" (కాల్డ్వె. ౫౦౨, ౫౦౩ పుటలు).

"కన్నడ 'ద' ప్రత్యయము తమిళాంధ్రములలో 'న' కారము వచ్చు చోటులందెల్లఁ గన్పట్టుచున్నదని యీవలకుఁ బ్రదర్శించి యున్నాను. ఉదా:- కన్న-మాడిదెను=(చేసితిని). తమిళ పద్ధతి నిది 'మాడినెను' అని కావలసి యుండును. కన్నడ-మాడిద=(చేసిన). తమిళ పద్ధతి నిది 'మాడిన' అని కావల యును. ఇట్టి స్థలములందలి 'ద' కారము నేఁడుచ్చారణ మాత్రార్థకమే యైనను

(దానికి ముందు 'ఇ' అను భూతార్థక ప్రత్యయాంతరమున్నది గాన) ప్రాచీన కాలమున భూతార్థక ప్రత్యయమై యుండెడిదని నిరూపించియున్నాను (చూడు ౧౩౧ II విష). ఈ నా యూహ సరియైనదె యైనయెడలఁ దమిళ 'న' కారము కన్నడ 'ద' కార సమాన చరిత్రకమనియు నేఁడు కన్నడ 'ద' కారమువలెనె తమిళ 'న' కారమును నుచ్చారణార్థక మాత్రమె యనియు నిశ్చితము కాఁగలదు. ఇట్టి కన్నడ 'ద' కార, తమిళ 'న' కారముల సమాన చరిత్రకత్వముచేతఁ బ్రాచీనకాలమున 'న' కారాభిన్నమగు 'ద' ప్రత్యయమె వాడఁబడుచుండెడిదని నిరూపితమగుచున్నది. (అట్టి 'ద' ప్రత్యయమె కాలక్రమమున 'న' కారముగ మాఱెనని భావము) ఇట్లు భూతార్థక విశేషణములందును భూతార్థక సమాపక క్రియలందును గల 'ద' కారము 'న' కారముగా ద్రావిడ భాషలయందు మాఱుట, యిండో యూరపియను భాషలందు ముఖ్యముగా జర్మను భాషలోని ధాతుజ విశేషణములందలి 'త-ద' లు నకారముగా మాఱుటను బోలుచున్నది. ఇండో యూరపియను భాషలలోని 'త-ద' లు నకారముగా మాఱెడి యిట్టి పద్ధతిచేతనే యింగ్లీషున భూతకాలిక ధాతుజ విశేషణములలోని 'న' కారము నిష్పన్నమై యుండును. ఉదా:—ఫాల్ =(Fall) ఫాలెన్ =(Fallen)=(పడిన)" (కాల్డు. ౨౦౩, ౨౦౪ పుటలు).

విమర్శము:—పోగిన - పోయినాన్ - పోనాన్ మున్నగుచోటులయందలి 'ఇన్' అనుదానిలోని తమిళ 'న' కార ముచ్చారణార్థకమనియు నది యర్వాచీనముగాఁ జేరినదనియు దానిచోట 'ద' ప్రత్యయమె ప్రాచీనకాలమున నుండెడిదనియు నట్టి 'ద' కారము కాలక్రమమున 'న' కారముగఁ బరిణమించెననియు నీ విషయమున దొరగారు నిర్ణయింప యత్నింతురు. పయిరీతిని 'న' కారముచ్చారణార్థము చేరినదని చెప్పఁదలఁచి యుండుటచేతనే ద ప్రత్యయ నకారములు సమాన చరిత్రకములనియుఁ బ్రాచీనకాలమున 'ద' ప్రత్యయము భూతార్థకమై యున్నను నేఁడు దాని నుచ్చారణార్థకముగాఁ దలఁపవలయుననియు నిరూపింతురు.

పయిరీతిగల యూహలతో నుండుటచేతనే దొరగారు తమి-"పోయినాయ్=పోనాయ్=(పోయితివి)" అనుదానికి 'పోది' అనియు, "ఆగినాయ్=ఆనాయ్=(అయితివి)" అను దానికి 'ఆది' అనియు, "వన్దాయ్" అనుదానికి 'వరుది'=(వచ్చితివి. వత్తువు) అనియుఁ బ్రాచీనరూపములనుచు వ్రాసిరి. కాని యిట్టి వ్రాఁత ప్రామాదికమనక తీరదు. తమిళమున 'పోనాయ్' మున్నగునవి భూతార్థక మధ్యమ పురుషైకవచనములు. 'పోది' మున్నగునవి విధ్యర్థక మధ్యమ పురుషైకవచనములు. విధ్యర్థకములు భావిని దెల్పినఁ

దెల్పునేకాని భూతార్థకము నెన్నఁడును దెల్పనేరవు. (చూడు "అవ్వాడు... ..." (నన్నూలు ౧౪౫ సూ). 'ది' అనునది విధ్యర్థకము. విధ్యర్థకము భావ్యర్థకమయినం గావచ్చును. కాని 'ది' అనుదానిలోని 'న' కారమును బట్టి యది భూతార్థకమని దొరగారు భ్రమించి యుందురు. 'ది' అను దానిలో 'ద' కారము భావ్యర్థక 'దు' ప్రత్యయ సంబంధి.

భూతార్థకమగు 'ఇ' పత్యయము కల్పితము, నస్వాభావికము నను దొర గారి యాశయము సరికాదు. ఒకసారి 'ఇ' ప్రత్యయము సహజముకాని యుచ్చారణార్థకమనియు (చూడు ౧౩౧ II విష.) నొకసారి 'ద' ప్రత్యయ ముచ్చారణార్థకమనియు (చూడు ౧౩౧ II విష.) వ్రాయుట పూర్వోత్తర సందర్భరాహిత్య దుష్టమగునని దొరగారు తలంపకుండుట వింత. (చూడు ౧౩౧ II విష).

'పాడిన' అనుదానికి 'పాడియ' (పాటపాడినట్టి) అనునది పర్యాయము గాన 'య' కారమువలెనె 'న' కారమును స్వరసంహితా వ్యవధాయకవర్ణ మనునది దొరగారికి బలమైన యుక్తిగఁ దోఁచినది. 'పాడిన' అనుదానిలోని 'న' కార లోపమునఁ గల్గిన స్వరసంహితలో 'య' కారము నిల్చినంతమాత్ర మున 'న' కారము 'య'కారమువంటి దెట్లగును? 'య' కారము మఱి కొన్ని చోట్ల ప్రాచీనమయిన నగుఁగాక. ఇచట 'న' కార లోపమున నవతరించిన 'య' కార మట్టి 'న' కారముకన్నఁ బ్రాచీనతర మెట్లగును? 'పాడినేన్' అనుచో 'పాడియేన్' అనురూపము లేదుగదా. ఇట్టి 'న-య' ల విషయమిూవఱకు విశదముగా విమర్శిత మయ్యెను (చూడు ౩౨ VII విష).

తుమర్థకాది ప్రత్యయపరకత్వమున నిట్లి నకారము నిల్చునని వ్రాసిరే కాని దొరగా రట్టి యుదాహృతులను జూపరైరి. ద్రావిడభాషలం దెల్లెడలను భూతార్థకాది స్థలములలోఁ దత్తదర్థ బోధక 'న' కారము నిల్చుట దాని యుచ్చారణార్థకతకు నిదర్శన మను వ్రాఁత కేవలము నసంగతము.

'వరుగిన్దు+అ+న్+అ=వరుగిన్దన=(వచ్చుచున్నవి). 'వరుగిన్దు+అ+ వ్+అ=వరుగిన్దవ = (వచ్చుచున్నవి)' అనురీతి విభాగము గలచోటులందలి 'అన=అవ' అనువానిలోని 'న-వ' లభిన్నములు గాన నందలి 'వ' కారము వలెనె 'న' కారమును స్వరసంహితా వ్యవధాయక వర్ణమనఁ దగునని దొర గారింకొక యుక్తిని జూపుచున్నారు. 'వరుగిన్దవ' అనునది యర్వాచీనరూపము. 'అన' ప్రత్యయాంతము మిక్కిలి ప్రాచీనరూపము. ప్రాచీనతమ తమిళమున "కు - తు" అనువానివలెనె 'అన' అనునది ధాతువు తుదిని నిల్చుట

చేతఁ బురుషబోధక ప్రత్యయములేకయె సమాపక క్రియ యేర్పడును. (చూడు ౧_౭౨ IV విష.) (౩_౨ IV విష). కాలక్రమమున 'కు-తు' అనువానిమీఁదవలెనె 'అన' ప్రత్యయాంతముమీఁద సైతము పురుష బోధక ప్రత్యయములు నిల్వసాగెను. చెయ్దన+ఎన్=చెయ్దనెన్=(చేసితిని) అన ప్రత్యయము లేకున్నను చెయ్ద+ఏన్=చెయ్దేన్=(చేసితిని). ఇట్లె చెయ్దనెమ్=చెయ్దేమ్=(చేసితిమి). ఈ పద్ధతినె "వరుగిన్ద్రు+అన్+అ=వరుగిన్ద్రన=(వచ్చుచున్నవి)" అనురూప మమహత్ప్రథమ పురుషబహువచన ప్రత్యయమగు 'అ' ప్రత్యయము పరమగునపుడును సిద్ధించెనని యెఱుంగ నగును. ఇట్లగుటచేత నిందలి 'అన' అనుచోటి 'న' కారము సంహితా వ్యవధాయక వర్ణము కానేరదు. (చూడు ౩_౨ IV విష). ఇంక "వరుగిన్ద్రు+అ+వ్+అ=వరుగిన్ద్రవ=(వచ్చుచున్నవి)" అనుచోటి యర్వాచీన వకారము స్వరసంహితా వ్యవధాయకవర్ణము కావచ్చును. పైరీతి నీ 'న' కార 'వ' కార ఘటితములగు రెండురూపములును (వరుగిన్ద్రన-వరుగిన్ద్రవ) విజాతీయములగుటచేత 'వ' కార సామ్యమున 'న' కారమును స్వరసంహితా వ్యవధాయకవర్ణ మనుట పొసఁగదు. 'వరుగిన్ద్రన' అనుచోటి 'అన' అనుదానిలోని 'న' కారము 'అన' అనెడి ప్రాచీన ద్రావిడ ప్రత్యయ సంబంధియగుటచేత నుచ్చారణమాత్రార్థక మనుట పొరపాటు.

పై స్థలములందును స్థలాంతరములందును దొరగారు 'న్ద్రు' అనియే వ్రాయుచుందురు గాన నేనును నట్లె వ్రాసి విమర్శించితిని. నిజముగ నది 'న్ద్రు' కాదు. దాని నిజరూపము 'న్ఱు' అనునది. (చూడు ౧౭ XVI విష). (చూడు ౧౩౦ VI విష).

పైరీతినె కాల్డువెల్లుగారు లోఁగడ నయితము "వరు+వ్+అ=వరువ=వరు+న్+అ=వరున=(రాఁగలవి)" అనుచోట సైతము 'వ' కారముచోట 'న' కారము నిల్చెనని వ్రాసిరి. 'వరువ' అనుచోటి 'వ' కారము భావ్యర్థక మనియు 'వరున' అనుచోటి 'న' కారము 'ఉన్' శబ్దసంబంధియనియు దొరగారి వ్రాఁత సరికాదనియు నచట విమర్శితమయ్యెను. (చూడు ౩_౨ VI విష.).

క్త్వార్థకమగు 'ఇ' కారము తుదిని 'న' కారము లేదు గాన 'న' కార ఘటితమగు 'ఇన్' ప్రత్యయము భూతార్థకరూపము కాదను దొరగారి వ్రాఁత కేవలము నసంగతము. 'పాడినేన్' మున్నగు తమిళ క్రియలయందును

“పాడిన-పాడుచుండిన-పాడుచున్న-పాడినన్” మున్నగు తెలుఁగు క్రియలందును సర్వతోముఖముగ ‘ఇన్’ అను ‘న’ కారం ఘటితరూపము వెలయుచున్నది గాన ద్రావిడ భూతార్థక ప్రత్యయము ‘ఇన్’ అనునదెయనియు నందలి వర్ణలోపమున ‘ఇ-న్’ అనునవియు వెలసినవనియు గ్రహింపనగును.

తమిఴక్రియలందు ‘న’ కారమున్న చోటులందెల్లఁ గన్నడమున ‘ద’ ప్రత్యయము నిల్చును గాన, ‘న’ ప్రత్యయము ‘ద’ ప్రత్యయ జన్యమనుటయు “త-ద” లనుండి ‘న’ కార మేర్పడుట ‘జర్మను’ భాషలోఁ గలదనుటయు నసంగతములు. అట్టి మార్పు ద్రావిడ శబ్దపరిణామ సంప్రదాయసిద్ధముకాదు. కేవల తకార దకారములనుండి ‘న’ కారము ద్రావిడభాషలలో నేర్పడనేరదు. కన్నడమందలి ‘ద’ ప్రత్యయమును దమిఴమందలి ‘త’ ప్రత్యయమును నభిన్నములు. భూతార్థకములు. ‘ఇన్’ అనునది వేఱొక ద్రావిడ భూతార్థక ప్రత్యయము. కన్నడమునఁ గొన్నియెడల ‘ద’ ప్రత్యయము ‘ఇన్’ ప్రత్యయ ఖండమగు ‘ఇ’ ప్రత్యయము పూర్వమునఁ గలదై నిల్చునట్లె తమిఴమునందును ‘త’ ప్రత్యయము కొన్నియెడల ‘ఇన్’ ప్రత్యయఖండమగు ‘న’ కారముతోఁ గూడి నిల్చుచుండును. (చూడు ౧౩౧, II, III, IV విష).

౧౩౧. VI విష:—“మలయాళ భూతకాలము:—మలయాళమునఁ బురుష బోధక ప్రత్యయములు క్రియలపై నిల్వకుండుటయె తమిఴమునకన్న భేదము. ద్రావిడభాష లన్నిటియందును నేకవిధమగు భూతకాలిక ప్రత్యయమే నిల్చును. ఆయా భాషలందలి ధ్వని సిద్ధాంత పద్ధతులచొప్పునఁ గల్గు పరిణామములె భేదించును. తమిఴ క్త్వార్థకరూపమె మలయాళ సమాపక క్రియారూపమగును. ఉదా:—తమిఴ క్త్వార్థకము—నడన్దు = మలయా—నడన్ను = (నడచెను మొ.) కొన్ని మలయాళ గ్రంథములలో ‘నడన్న’ అని క్త్వార్థకరూపము ప్రయోగింపఁబడెను. తమిఴ భూతకాలిక ధాతుజ విశేషణము ‘నడన్ద’; దీని మలయాళరూపము—నడన్న. ఇంక మలయాళ గ్రంథస్థ క్త్వార్థకరూపమగు ‘నడన్న’ అనుదానియందలి తుది ‘అ’ కారము మొదటఁ దమిఴ ‘నడన్దు’ అను దానికి సరిగ ‘ఉ’ కారమైయె యుండవలెను. లేదా మిక్కిలి పొట్టి ‘అ’ కారమైనను గావలెను. ఉత్తర మలబారులో నియ్యది ‘నడన్న్’ అనియే వ్రాయఁబడును. డా. గుండర్టుగారి కోశ, వ్యాకరణములలో ‘లీప్సియస్’ దొరగారి రోమను లిపి లేఖనపద్ధతుల చొప్పున హ్రస్వ ‘ఉ’ కారము ‘ŭ’ అని వ్రాయఁబడి యున్నది. ఈ వ్రాఁత బ్రిగ్గెల్ దొరగారి తుళు వ్యాకరణము ననుసరించి యున్నది. కాన మలయాళమందలి లేఖన దోషము త్వరలోఁ జక్కఁబడునని యాశించుచున్నాను” (కాల్డు. ౫౦౮ పుట).

విమర్శము:—ద్రావిడ సమాపక క్రియలు క్రియాజన్యావ్యయములనుండి యేర్పడునని వ్రాసియుఁ గొన్నియెడల నపవాదముగ ధాతుజ విశేషణముల నుండి యేర్పడుననుచుఁ దమిళోదాహృతి నిచ్చి దొరగారు వ్రాసియున్నారు. (చూడుము ౧౩౦ I విమ.) (౧౨౯ విమ. చూడుము). అచట 'నడన్ద' అను ధాతుజ విశేషణముపైని బురుషబోధక ప్రత్యయముల నిల్పి ప్రక్రియ నడపియు నిచట 'నడన్దు' అను క్త్వార్థకరూపమునె మలయాళ సమాపక క్రియగాఁ జూపిరి. క్త్వాంతమునుండి సమాపక క్రియారూప సాధన మనన్వయదోషదూషిత మగును గాన ధాతువుపైనె భూతార్థక ప్రత్యయమగు 'న్ద్' అనుదానిని నిల్పి యుచ్చారణార్థకమగు 'ఉ' కారమును జేర్చి దానిని మలయాళ సమాపక క్రియగాఁ జూపుట యుక్తము. 'న్దు' అనునది 'న్ను' అని మలయాళమున మాఱును. (చూడుము ౧౫ II విమ).

౧౩౧. VII విమ:—"(౪) తెలుఁగు భూతకాలము:—తెలుఁగున ధాతువుపైని 'ఇ' ప్రత్యయమును నిల్పుటచేత క్త్వార్థకరూప మేర్పడును. తమిళ కన్నడ మలయాళములలో ధాతువుపైని 'ద' కారమునో, దాని వికృతిరూపమునో, చేర్చుటచేత క్త్వార్థకరూప మేర్పడును. ఉదా:—తమి-కన్న-కొణ్డు=తెల్గు—కొని. తమి-కన్న-కణ్డు=తెల్గు—కని. తెల్గున నిట్లు 'ఇ' కార మేళనము సార్వత్రిక ముగానున్నను నితర ద్రావిడ భాషలందలి 'ద' కారమునకు సరియగు ప్రత్యయము తెల్గున నుపయోగింపఁబడు జాడలు కనఁబడుచున్నవి. కొన్ని తెలుఁగు సమాపకక్రియలయందు మధ్యమోత్తమ పురుషములలో క్త్వార్థకమునకును బురుషబోధక ప్రత్యయమునకును నడుమ 'తి' అనునది నిల్చుచున్నది. ఉదా:—'ఆడి' అనునది కన్నడాంధ్ర క్త్వార్థకరూపము. దీని భూతకాలికోత్తమ పురుషైకవచనము—కన్న-ఆడిదెను=తెల్గు-ఆడితిని. కన్నడమున 'ఆడిదెను' మున్నగువానిలోని 'ద' కారము నేఁడుచ్చారణార్థకమెయైనను బ్రాచీనకాలమున నది భూతార్థకమె యని వెనుకఁ దెల్పి యున్నాను. స్వరసంహితా వ్యవధాయకమనుట కవకాశమేలేని తెలుఁగు 'తి' ప్రత్యయము కన్నడ దకారము యొక్క ప్రాచీన భూతార్థకత్వమును స్థిరపఱుచుచున్నది. ప్రథమపురుషమున దీని వాడుక లేకున్నను నీ 'తి' అనునది భూతార్థకమె యనుటకు సందేహము లేదు. దీనినిబట్టి తెల్గునందును నొకప్పుడితర ద్రావిడభాషలందువలెనె 'త' కారమో, దకారమో, భూతార్థకమై యుండెడిదని విశదమగుచున్నది. కొన్ని తెల్గు క్రియలయందీ 'తి' ప్రత్యయము ధాతువు తుది హల్లుతో నేకీభవించుటయు నిది తమిళ 'ద' ప్రత్యయమున కభిన్నమని విశదపఱుచును. ఉదా:—తమి-కొణ్డేన్=తెల్గు-కొంటిని. తమి-చె (సె) య్దేన్=తెల్గు-చేసితిని=చేస్తిని.

తమిటమందలి 'అల్' అనుదానికి సమానమగు తెలుఁగు చేదాద్యర్థకమైన 'ఏ' (తే) అనునది తెల్గు భూతార్థక ధాతువునకుఁ జేర్పఁబడుటయుఁ బ్రాచీనమగు తెల్గు భూతచిహ్నము 'ఇ' అనునది కాదనియు 'తి' అనునదో, లేక 'త' కారమో కానోపుననియు విశదీకరించుచున్నది. ఉదా:—తెల్గు-చేసితే=చేస్తే=తమి-చె (సె) య్‌దాల్. మంగోలియను భాషలో 'జు' అనునదిగా మాఱి వ్యవహారమున 'జ' అని మాఱిన 'దు' అను తుమర్థక (Gerund) మీ సందర్భమున మిక్కిలి వింతగొలుపు పోలికగలదై యున్నది" (కాల్డు. ౫౦౪, ౫౦౫, ౫౦౬ పుటలు).

"కన్నడమున క్త్వార్థకమునకును బురుషబోధక ప్రత్యయమునకును నడుమ 'ద' కారము నిల్చు పెక్కు స్థలములందుఁ దమిటమున 'న' కార ముపయోగింపఁ బడునని యీవఱకుఁ దెల్పితిని. వ్యావహారికాంధ్రమున నిట్టియెడల 'న' అనునదె చేర్పఁబడును. ఉదా:— తెల్గు-ఆడినాను = తమి-ఆడినేన్ = కన్న-ఆడిదెను. ప్రాచీనమగు నందమైన తెల్గురూపము 'ఆడితిని' అనునది. తెల్గు-అయినాను=తమి-(ఆగినేన్)=ఆనేన్=కన్న-ఆదెను (ఆగిదెను). పైవానిని బోల్చి చూచు నపుడు తెలుఁగున నేఁడు 'ఇ' అనునది క్త్వార్థకముగా వాడఁబడుచున్నను బ్రాచీనకాలమున నిందును నితర ద్రావిడభాషలయందువలెనె 'ద' కారమో, 'త' కారమో, భూతకాలికచిహ్నముగ నుండియుండె ననఁదగును" (కాల్డు. ౫౦౬ పుట).

"తెలుఁగు క్త్వార్థకము 'వైచి' అనుదానికిని, తమిటమందలి 'వైత్తు' అనుదాని గ్రామ్యరూపమగు 'వైచి' అనుదానికిని సంబంధముగలదేమో యని భ్రమింపరాదు. అట్టి సంబంధమె యున్నయెడలఁ దమిట క్త్వార్థకమగు 'వైత్తు' అనుదానియందువలెనె తెల్గు క్త్వార్థకమందును తకారము చేరి యుండదా? కావున నీ రెండు 'వైచి' శబ్దములకును గల సామ్యము ఘుణాక్షర న్యాయమునఁ గల్గిన యాభాసరూపమె. మఱియుఁ దెలుఁగు 'వైచి' శబ్దము లోని 'చ' కారము తమిట 'వైత్తు' శబ్దమందలి 'త' కారముతోనే కాక పెక్కు తమిట నామములందును క్రియలందును గల ద్విరుక్త 'క' కారములతో సంబంధించి యున్నది. ఉదా:—తెల్గు-వైచ = తమి-వైక్క. (ఇది తమిట తుమర్థకరూపము.) (Infinitive). దక్షిణదేశపు తమిట గ్రామ్యమున ద్విరుక్త 'క' కారము 'చ' కారముగఁ బల్కఁబడును. ఈ యాచారమె తెల్గున సర్వతో ముఖముగ వ్యాపించినది. తమిటమందు 'వై' (ధాతువు) అనుదానికి 'చు' అనుదానిని జేర్చుటచేతఁ దమిట ధాతురూపమునకు సమానమగుచున్నది. తమిటమున 'వైచు' అనునది ధాతువును, విధ్యర్థకమునునై యున్నది. ('ఇది

సరికాదు. తమిళ విధ్యాద్యర్థకము 'వైక్క' అనునది' శ్రీ రెడ్డిగారు) అట్లు చేర్చిన 'చు' అనునది పై నుదాహరించిన రీతిని 'క్క' అనుదానికిఁ దుల్యమె కదా. తమిళ క్త్వార్థకరూపము తెల్గు 'వైచి' అనుదానివంటిదే యగునేనిఁ బైరీతిని 'వైక్కి' అని యేర్పడునే కాని 'వైత్తు' అని యేర్పడనేరదుగదా. (కావున ద్విరుక్త క కారము చ కారమగుట తమిళ గ్రామ్యపద్ధతియె యని భావము). ఇట నొక్క యుదాహృతి గమనింపఁదగినది. తమిళ-తూక్కు = తెల్గు-తూచు. తమిళ-తూక్కి = తెల్గు-తూచి" (కాల్డు. ౨౦౬, ౨౦౭ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారీ విషయమున నూరకయె గ్రంథవిస్తరము గావించిరి. "తెల్గులోని క్త్వార్థక మిపుడు 'ఇ' ప్రత్యయమెయై యున్నను ప్రాచీన కాలమున నితర ద్రావిడభాషలందువలెనె 'త' కారమెయై యుండి యుండును" అనెడి యొక సిద్ధాంతమును స్థాపింప యత్నించిరేకాని యందులకు సరియగు నుపపత్తులను జూపఁజాలరైరి. 'చదివితివి' మున్నగు చోటులందలి 'తి' అనునది భూతార్థకమెయని స్థాపించుచు మఱికొంత గ్రంథమును బెంచిరి. 'తి' ప్రత్యయము తెల్గున భూతార్థకముకాదని యెవ్వరందురు? 'ఇ' అనునది తెల్గున భూతార్థకమున్నచో 'తి' అనునది మఱేల నిల్చునని భావించి 'తి' అను దానికి భూతార్థకత్వమును స్థాపించి 'ఇ' ప్రత్యయము, నుస్మాలింపఁ గడంగిరి. మఱియుఁ దమ సిద్ధాంతము చొప్పునఁ గ్రియాకాంక్షాసమాపకమగు క్త్వార్థకమునుండియే సమాపక క్రియారూపము లననన్వితముగ సాధించుచువచ్చిరి. (చూడు ౧౨౯ విష. ౧౩౦ I విష). తెల్గున "ఇన్ = ఇ = తి" అను మూఁడును భూతార్థకములె. ఉదా:—చదివిన్ + అ = చదివిన, చదివినన్, చదివి, చదివితిని. 'ఇ' ప్రత్యయచరిత్రమును విస్మరించిరియో? భూతార్థదార్ఢ్యమును గోరిరియో? 'చదివితిని' మున్నగు చోటులందు 'ఇ' కారముండఁగా 'తి' అనునదియు వ్యవహర్తలచేఁ బ్రయుక్తమగుచువచ్చెనని గ్రహింపనగును. ఇట్లె కన్నడమందలి "మాడిదెను" మున్నగు చోటులందును—'ఇ + ద' అను భూతార్థక ప్రత్యయ ద్వయము వెలసెనని గ్రహింపనగును. (చూడు ౧౩౧ II విష.) 'తి' అనునది కొన్ని తెల్గుభూతార్థక సమాపకక్రియారూపములందు నిల్చునని దొరగారు వ్రాయుట సరికాదు. ప్రథమ మధ్యమపురుష బహువచన రూపముల భేదమును జూపుటకుఁ గావలయుఁ బ్రథమపురుష బహువచన రూపములందు (చదివిరి.) 'తి' చేర్పఁబడలేదుగాని తెల్గు సమాపకక్రియలందెల్ల నయ్యది వెలసియే యున్నది. భూతప్రథమ పురుషైకవచనము వింతయగు నపవాద విశేషరూపము. అందు 'ఇ' అనునదియుఁ జేరలేదు. "చదివినవాఁడను = చదివినాఁడను = చదివినాను = చదివాను" అనునవి భూతార్థక విధేయవిశేషణ రూప

ములె కాని సమాపక క్రియారూపములు కావు. ఏయిరీతిని బురాతనాధునాతన రూపములన్నిటియందును వెలసియున్న ‘ఇ’ ప్రత్యయము నుస్మాలించుటయు నది తెల్గునకు సహజమెకాదనియుఁ గల్పితమనియు దొరగారు వ్రాయుటయు భూతకాలిక సమాపక క్రియారూపములందు సర్వతోముఖముగానున్న ‘తి’ అనునది క్వాచిత్కమనుటయు సరికావు. క్త్వార్థకరూపములందు ‘తి=త’ ప్రత్యయము నాఁడును నేఁడును లేదు—ఎన్నఁడును లేదు. క్త్వార్థకములందే కాక భూతార్థక విశేషణములందును ‘చేసినన్’ మున్నగు చేదాద్యర్థక రూపములందును భూతార్థక ‘త’ ప్రత్యయ మెన్నఁడును లేదు. భూతార్థక సమాపక క్రియతో ‘ఏని’ శబ్దమును గూర్చుటచేత నా జంట చేదాద్యర్థక మగుచున్నది. (చేసిననాఁడు-చేసినయెడల మున్నగు జంటలవలెనె). “చేసితివి=చేసితి+ఏని=చేసితేని=చేసితేన్=చేసితే=చేస్తే” అను రీతిని వెలయుచున్న రూపములను బట్టి ప్రాచీన కాలమున ‘ఇ’ ప్రత్యయము భూతార్థకము కాదనియు ‘త’ ప్రత్యయమె యుండెడిదనియు నూహించుట యపరిశీలనమూలకము. “చేసితే=చేస్తే” అను రూపములయందు ‘తి’ అనునదే కాక ‘ఇ’ ప్రత్యయమును వెలయుచునే యున్నది. ఇంతియ కాక ‘చేసినన్’ మున్నగు చేదాద్యర్థక రూపములందును ‘ఇన్’ అను భూతార్థక ప్రత్యయము వెలయుచునే యున్నది. వానియందు ‘తి’ ప్రత్యయము లేదు. తమిళమందలి ‘పాడినేన్’=(పాడితిని) మున్నగు చోటులందలి ‘న’ కారము కన్నడ ‘ద’ ప్రత్యయజన్యమను నొక యసంభావ్య కల్పనమును జేసినట్లె (చూడు ౧౩౧ V విష.) తెలుఁగులోని ‘చేసినాను’ మున్నగు చోటులందలి నకారమును దొరగారు ‘ద’ ప్రత్యయజన్యమె యందురు కాఁబోలును. కాఁబోలుననన నేల? “తమి-ఆడినేన్=తెల్గు-ఆడినాను=కన్న-ఆడిదెను. తమి-ఆనేన్=(ఆగినేన్)=తెల్గు-అయినాను=కన్న-ఆదెను=(ఆగిదెను)” అను వాని ప్రక్రియనుజూపి యట్లె వచించిరి. ఇట్టి యుదాహరణములు ప్రాచీన కాలమునఁ దెల్గున ‘ఇ’ అను భూతార్థకము లేదనియు ‘ద’ ప్రత్యయమె యుండెడిదనియు నెట్లు విశదపఱుచునని డా. కాల్డువెల్లుగారు తలంచిరో తెలియకున్నది. ఆడు+ఇన్+అ=ఆడిన+వాఁడు+ను=ఆడినవాఁడను=ఆడినాఁడను =ఆడినాను” అని యిట్లు వాని పరిణామక్రమము. ఇట్టి ‘ఆడినాను’ అను దానికి ‘ఆడిదెను’ అను కన్నడ శబ్దము మూలమనుట కేవలము నసంగతము!

గ్రాంథిక తమిళ క్త్వా-వైత్తు=దాక్షిణాత్య తమిళ గ్రామ్య క్త్వా-వైచి =తెల్గు-క్త్వా-వైచి. ఈ రెండు ‘వైచి’ శబ్దములయొక్కయు, గ్రాంథిక ‘తమి-వైక్క=తెల్గు-వైచ’ అను తుమర్థకములయొక్కయుఁ బ్రదర్శనమున కిచట నంతగాఁ బ్రసక్తి యగపడదు. ఏదో వింతయగు “తమి. తూక్కు=తెలు.

తూచు" అను స్థలమందువలె 'వైచు' అను తెలుఁగు ధాతువునకు బదులుగా గ్రామ్యతమిళమునందైనను "వైక్క" అను ధాతువు లేదుగదా. ఇంక 'క్క' అను తమిళ రూపము 'చు' అని యగునని యెట్లు చెప్పనగును. 'వైత్తు'=(వైచి) అను తమిళ రూపమందలి 'తు' అనునది తమిళ క్త్వార్థక ప్రత్యయము. 'వైచి' అను తెల్గు రూపములోని క్త్వార్థకము 'ఇ' ప్రత్యయము. "వైక్క" అను తుమున్నాద్యర్థక తమిళ రూపమందలి 'క' కారము భావార్థక 'కు' ప్రత్యయ సంబంధి. (చూడు ౬౦ XII విష.) అందలి తుమున్నాద్యర్థక 'క' ప్రత్యయము సైతము తెల్గునందువలెనె "అన్-అ" అనునది తుదినిగలదె. ప్రాచీన ద్రావిడ ధాతువు 'వై' అనునది కావచ్చును. తెల్గునను మఱికొన్ని ధాతువుల తుదినివలెనె 'చు' అను నాగమము చేరియుండును. ఈ 'చు' వర్ణము ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయ సంబంధికావచ్చును. 'త' కారము 'చ' కారముగఁ బరిణమించుట సహజమె కాన 'వైత్తు' అను ప్రాచీన తమిళ క్త్వార్థకరూపము గ్రామ్యాఅవమున 'వైచి' అనురూపము నందియున్నది. అట్లె 'క' కారము 'చ' కారమగుటయు సహజమె కాన 'వైక్క' అను ప్రాచీన తమిళ తుమున్నాద్యర్థక రూపమునుండి గ్రామ్యాఅవమున "వైచ్చ-వెచ్చ" మున్నగు రూపము లేర్పడియున్నవి. (చూడు ౨౧ IV విష.) (౨౧ X విష. చూడు). తెల్గునఁ బ్రాచీన తుమున్నాద్యర్థకరూపము 'వైవన్' అనునది. 'వైచన్' అనునది తెల్గు వాడుకరూపము. అర్వాచీనరూపము.

౧౩౧. VIII విష:—"(౫) తుళు భాషలోని భూతకాలము:—గోండు భాషయందువలెనె తుళుభాషయందును భూతకాలికరూపములు ద్వివిధములు. I. అనద్యతనము = (Imperfect). అద్యతనము = (Perfect). ఈ రెండిటికిని వేర్వేఱుగఁ బ్రత్యయ విశిష్టరూపములు గలవు. ధాతువునకు "త-ద" లు గాని యంతకన్నఁ దఱుచుగా 'ఇ' కారముగాని చేర్చుటవలన ననద్యతనభూతమేర్పడును. ఉదా:—తుళు-ఇత్తె-(ఉంటిని)-కన్న-ఇద్దెను=తమి-ఇరున్దేన్. తుళు-కేణ్డే=('కేళ్' అనుదానిచో సంధివశమున 'కేణ్' అనునది నిల్చెను)=తమి-కేట్టేన్ = (కేళ్ + తేన్) = (వింటిని) = కన్నడ-కేళిదెను. తుళు-బూరియె=(పడితిని) (ఇందు 'ఇ' కారము నిల్చినది)—(తుళు 'బూరు'=తమి-విళు=వీళ్). అనద్యతనభూత 'ద' ప్రత్యయాంతముపైని మఱొక 'ద' ప్రత్యయము నిల్చినచో నది యద్యతన భూతరూపమగును. ఉదా:—తుళు-ఇత్తె = (ఉంటిని) ఇత్తదె=(నేనిప్పుడే యుంటిని.)=(I have been)" (కాల్డు. ౨౦౭ పుట).

౧౩౧. IX విష:—"ఇతర ద్రావిడ భాషలలోని భూతకాలము:—
తుద:—ఆడ్కెన్=(నృత్యము చేయుచున్నాను). ఆడ్ఫ్‌బిని=(నేను నృత్యము

చేసితిని). 'మెడ్స్' దొరగారీ ధకారమును 'ఛ' కారముగా వ్రాసిరి. బిన్ద్ఛ్‌పిని=(అడిగితిని). వీరి యభిప్రాయము చొప్పున భూతవర్తమానములలో నుత్తమేతర పురుషములలో నీ 'ఛ' కారము కనఁబడుచున్నది. డా. పోప్ దొరగారు భూతకాలమున 'ఛ' కారమునకు ముందు 'ధ' కారమును నిల్పుచున్నారు. ఉదా:—ఆడ్ధ్ఛి=(నృత్యము చేసెను). కోతభాషలో 'సి' అనునది భూత చిహ్నము. ఉదా:—హోగపె=(నేను బోవుచున్నాను). హోసిపె=(వెళ్ళితిని). ఈ 'సి' ప్రత్యయము గోండుభాషయందును గలదు. 'తి' ప్రత్యయమె సాంకర్యమందు 'సి' అనునదిగాఁగాని 'జి' అనునదిగాఁగాని మాఱి గోండు భాషలో క్త్వార్థకమగుచున్నది. గోండు భాషలో ద్విరుక్త 'త' కారము చేర్చుటవలన నద్యతనభూతరూప మేర్పడుచున్నది. ఉదా:—గోండు-కెత్తాన్=(నేనిప్పుడే పిలిచితిని). కెసి=(పిలిచి). సియోనీ గోండు భాషలో క్త్వార్థక చిహ్నము 'సి' అనునదె. ఉదా.—వంక్‌సి=(పలికి). ఇందలి భూతార్థక విశేషణము-వంక్‌తూర్=(పలికిన). భూతార్థమున 'త' కారము చేరును. ఉదా.—వంక్‌తన్=(పలికితిని). వంక్‌తి=(పలికితివి). అనద్యతన భూతకాలికరూపము=(Progressive)=భూతవర్తమానము) 'ఉన్ద్=న్ద్' అనునవి చేర్చుటవలన నేర్పడును.

పయి యుదాహృతులన్నిటివల్లను 'ద' కారమో? దాని వికారమో? కేవల ద్రావిడ భూతకాల ప్రత్యయమనియు మఱికొన్ని యుండిన నుండుఁగాక యనియు విశదమగుచున్నది" (కాల్డు. ౫౦౭ పుట).

౧౩౧. VIII, IX విషయముల విమర్శము:—౧౩౦ VIII విషయములోని తుళు భాషయందలి భూతచిహ్నము 'త' కారమె కాక 'ఇ' ప్రత్యయమును వెలయుచున్నది. సియోనీ గోండు భాషలోని భూతవర్తమానకాలపు (Progressive) చిహ్నము 'న్ద్' అనునది తమిళభూతచిహ్నమగు 'న్ద్' (నడన్దాన్=నడచెను) అనుదానిని బోలియున్నది. కాన ద్రావిడభూతచిహ్నము 'త' కారమాత్రమే కాక "ఇన్-ఇ-న్" మున్నగునవి సైతము వెలయుచున్నవనఁదగును.

ద్రావిడభాషలలోఁ బ్రాచీన విశాల వాఙ్మయము గలవి తమిళ కర్ణాటాంధ్రములు మాత్రమె యనఁదగును. మలయాళమునకు విశాల వాఙ్మయమున్నను నదియుఁ దమిళమునుండి వీడిన యర్వాచీన భాషారూపమె. ఇంకఁ దక్కిన తుళు ప్రభృతులు తఱచుగాఁ బై మూఁడిటిని సంబంధించి యుండును. వాని ప్రాచీన చరిత్రమును దెల్పు ప్రామాణిక ప్రాచీన వాఙ్మయములేదు. వాని స్వరూపస్వభావముల విషయమున నాధునికులగు దొరలు సంపాదించి ప్రచురించిన వ్యాసములె యాధారము. అట్టివానినెల్ల డా. కాల్డువెల్లుగారు చాలవఱకు సంపాదించి చూపిరి. ఆ విషయములందు డా. కాల్డువెల్లుగారి

వ్రాతలె ప్రమాణము. కాని తమిళాంధ్ర కన్నడేతరభాషలలోని విషయములు ప్రాచీన చరిత్ర పరిశీలన విషయమున నంతగా నుపచరింపవు.

౧౩౧. X విష:—"ద్రావిడభూతకాల ప్రత్యయ చరిత్రము:—ఇకారము మొట్టమొదట సముచ్చయార్థక స్వరమై యున్నది. నిజముగా భూతార్థకమగు "ద-(లేక) దు" అను దానిని ధాతువుతో శ్రుతిసుఖముగఁ జేర్చుటకై యీ 'ఇ' కార ముపయోగింపఁబడుచు వచ్చెననగును. ద్రావిడ శబ్దముల కలవాటు పడిన చెవికి "బాళ్‌దెన్=(బ్రదికితిని)" అనునది కఠోరముగను "బాళిదెను" అనునది శ్రుతిహితముగను వినఁబడును గదా. ఇట్టిరీతి లాటిను సంస్కృత భాషలందును గలదు. లాటిన్-డమ్‌టస్ = (మచ్చికపడిన) = డమిటస్. సంస్కృ-పీడ్+తః = పీడితః = (పీడింపఁబడిన). కాలక్రమమున భూతార్థక 'ద' కారము ద్రావిడభాషలలోఁ గొన్నియెడల లోపింపఁగా శ్రుతిసుఖార్థము చేరిన 'ఇ' కారమె భూతచిహ్నముగ నిలఁబడుట సంభవించెను. 'నీవు' అను దానిలోని ప్రధానభాగమగు 'నీ' అనునది లోపింపఁగా దాని వెనుకనుచ్చారణార్థము చేరిన 'వు' అనునదె పురుషబోధక ప్రత్యయముగ నేర్పడినది కాదా?"

"చెయ్‌ద=(చేసిన), చెయ్‌దేన్ = (చేసితిని), వాళ్‌న్‌దాన్ =(వృద్ధినొందెను), బాళ్‌దెన్=బాళిదెను=(బ్రదికితిని) మాడిదెన్=(చేసితిని)" మున్నగు రూపములను బరిశీలించునపుడు 'ఇ' కార ముచ్చారణార్థమాత్రమె చేరినదని చెప్పుటకన్నఁ బ్రయోజనాంతర మగపడదు. తెలుఁగు భూతకాలికరూపముల లోని 'ఇ' కారము, (చదివితిని) 'తి' అను భూత-చిహ్నమును ధాతువునుండి వేఱు పఱుచు పద్ధతియె దాని యుచ్చారణార్థకతను నిరూపించును" (కాల్డు. ౨౦౭, ౨౦౮ పుటలు).

"ద్రావిడభూతకాలిక 'త'కారమునకును నిండో యూరపియను సిథియను భాషలలోని భూతార్థకములగు "త-త్-న" అను ప్రత్యయములకును విచిత్రములగు పోలికలుగలవు. ఈ సామ్యము యాదృచ్ఛికము. సహజముకాదు. ఉదా:— సంస్కృత-జ్ఞాతః=(తెలియఁబడిన)=గ్రీకు-గ్నోటస్=లాటిను-గ్నోటస్. సంస్కృ-భుగ్నస్=(వంచఁబడిన)=గాథికు-బుగన్ (అ) స్. గాథికు భాషలోని యీ ప్రత్యయము 'ద' కారమో? తకారమో? యైయుండును. న్యూపెరిషియను భాషలో నియతముగ 'ద' కారమె యగును. సంస్కృత భూతార్థక 'త' ప్రత్యయము సామాన్యముగాఁ గర్మార్థకమై యుండునుగాని కొన్ని యకర్మక క్రియలందుఁ గర్త్రర్థకమునునై యుండును. ఉదా:—గతస్=(వెళ్ళినవాఁడు). భూతస్=(అయినది). ఇట్టి కర్మార్థబోధక 'త' ప్రత్యయమునుండి యేర్పడిన 'క్తవతు' ప్రత్యయము కర్త్రర్థక మగును. ఉదా:—కృతవత్=(చేసినది). కృత

వాన్=(చేసినవాఁడు). ఇట్లే క్త్వార్థకమందును (Gerund) 'త' కారముగలదు. ఉదా:—సంస్కృ-కృత్వా=(చేసి).

పైరీతిని రెండు కుటుంబముల ప్రత్యయములకును విదూరసంబంధము కనఁబడుచున్నను ద్రావిడభాషల ప్రత్యయములు ప్రధానములు సహజములు నగుటచేత నివి సంస్కృతమునుండి యెరవుతెచ్చికొనఁబడినవనుట సరికాదు" (కాల్డు. ౫౦౮, ౫౦౯ పుటలు).

"బెంగాలీ భాషయందలి భూతచిహ్నమగు 'ల' కారము సంస్కృత 'క్త' ప్రత్యయమునుండి యేర్పడినదె యని ప్రొఫెసరు మాక్సుముల్లరుగారును, ప్రొఫెసరు బాపు దొరగారును నభిప్రాయపడిరి. ఉదా:—సంస్కృ-కారిత=బెంగాలీ-కరిలామ్. (ఇందలి 'ఆమ్' అనునది పురుషబోధక ప్రత్యయము) 'కర్దెమ్' అను న్యూపెరిషియను పదము దీనిని సరిపోలియుండుటచేత వీరి యూహ బలపడుచున్నది. మహారాష్ట్రీ భాషయందును దీనిపోలిక గలదు. మహారాష్ట్రీ-మీకెలోమ్=(నేను జేసితిని) మిన్‌గేలోన్=(నేను వెళ్ళితిని). 'డ-ల' లకుఁ బరస్పర పరిణామము గలదుగాన సంస్కృత భూతార్థక 'త' కారము 'ద' కార 'డ' కారములుగా మాఱియుండెనేమో? కాని శ్లవోనికు భాషలో 'డ' కార మధ్యస్థితిలేకయే 'త-ద' లు 'ల' కారముగాఁ బరిణమించుట గలదు. ఉదా:—శ్లవో-బైల్ = (ఉండెను) = పరిషియన్-బూద్ = సంస్కృ-భూతస్" (కాల్డు. ౫౦౯ పుట).

"న్యూపెరిషియను భాషలో నియతముగా భూతకాలచిహ్నము 'ద' కారమై యున్నది. ఉదా:—బూదెమ్=(ఉంటిని). బుర్దెమ్=(వహించితిని). పెరిషియను భాషలోఁ గర్త్రర్థకము, కర్మార్థకము నని రెండు భూతార్థకరూపములు గలవు. ఉదా:—న్యూపెరిషియను-బుర్దెహ్=(మోపిన-మోయఁబడిన). ఈ పెరిషియను భాషయందలి భూతార్థకరూపము కర్మార్థ బోధక భూతక్రియా జన్యవిశేషణమునుండి యేర్పడినది. గాథికు భాషయందును నేఁటి ట్యుటానికు భాషలందును జాలక్రియలలో 'ద' కారము భూతార్థ బోధకమై యున్నది. కాని యీ దకారము 'డు' (Do) అను ధాతువు యొక్క ద్విరుక్తి రూపమగు 'డిడ్' (did) అనుదాని లుప్తశేష భాగమై యున్నది. కావున 'లౌడ్'=(Loved)=(ప్రేమించిన) అను దానిలోని 'ద' కారమునకును సంస్కృత పెరిషియను భాషలలోని 'ద' కారమునకును సంబంధములేదు. ఇంక ద్రావిడ భూతార్థక దకారముతో నెట్టిసంబంధమును లేదు" (కాల్డు. ౫౧౦ పుట).

"ఉగ్రియను-తుర్కిష్షు" భాషలందును 'ద' కారము భూతార్థక ప్రత్యయమై యున్నది. ఉదా:—తుర్కిషు-సెవెరిమ్=(ప్రేమించుచున్నాను).

సెవెర్దిమ్=(ప్రేమించితిని). ఈమ్=(ఉన్నాను). ఈదుమ్=(ఉంటిని). ప్రాచ్య తుర్కి-షు-బోల్డిమ్=(ఉంటిని). ఫిన్నిషు భాషయందును 'త' కారమె భూతార్థక ప్రత్యయము. ఇందద్యతనభూతమును నిర్మించు క్త్వార్థకము 'ఉత్-య్త్-ఎత్' అనువానితో ముగియును. ఉదా:—ఒల్=ఉండు. ఒల్లుత్=(ఉండి). హంగేరియనుభాష:—లెన్ని = (అగు). దీని క్త్వార్థకము:—లెత్త్ = (ఉండి). ఇందలి యద్యతన భూతము-లెత్తెమ్=(నేనిప్పుడే నైతిని). పయి నుదాహరించిన 'తుర్కి-షు-ఫిన్నిషు-హంగేరియను భాషలలోని భూతకాల చిహ్నములకుఁ గర్త్రార్థ బోధతో సంబంధము లేదు. వీనియందీ ప్రత్యయములు సకర్మకాకర్మక క్రియలు రెండిటికిని వచ్చును. కర్త్రార్థమీ భూతక్రియలకు వలయునేని కర్త్రార్థక ప్రత్యయము వేఱుగఁ జేరుచుండును. ఈ విషయమున ద్రావిడభాష లిండో యూరపియను భాషలకంటె 'టర్కి-షు-ఉగ్రియను' భాషలతో స్పష్టతరమును సమీపతరమును నగు సంబంధమును గల్గియున్నవి. ఇంక వీని చరిత్రమెట్టి దయినను నివి యెల్ల మొత్తముమీఁద నభిన్నము లనవచ్చును" (కాల్డు. ౫౧౦ పుట).

"ద్రావిడ భాషలు చాల పురాతన కాలమునుండియు వాడఁబడు చుండుటచేతను జక్కఁగ సంస్కరింపఁబడి మంచి స్థితిలో నుండుటచేతను వీని విభక్త్యాది ప్రత్యయములు భాషాంతరములనుండి యెరవు తెచ్చుకొనఁబడిన వనుటకంటె వీనియందలి శబ్దములతోనె వ్యుత్పత్తిని వెదకుట యుక్తము" (కాల్డు. ౫౧౦, ౫౧౧ పుటలు).

"డా. గ్రాలు దొరగారు వారి తమిళ వ్యాకరణములో (out lines of Tamil Grammar ౪౨ పుట) నిట్లు వ్రాసిరి. " 'సెయ్‌దు=(సెయ్+అదు)=(చేయుధాత్వర్థ విశిష్ట వస్తువు)' అను చొప్పున 'దు' అనునది సమాపక క్రియారూపము లన్నిటను నేకవచన బహువచన భేదము లేకుండ నుపయోగింపఁబడుచుండెడిది. ఉదా:—నాన్ సెయ్‌దు=(నేను జేయుచు (ట)) నీ సెయ్‌దు=(నీవు చేయుచు (ట)) సెయ్‌దు+ఉమ్=సెయ్‌దుమ్-నామ్-సెయ్‌దుమ్=నీఙ్గళ్ సెయ్‌దుమ్. (మేము (లేదా) మీరు-చేయుచు (ట). ('చేసియున్' అని యర్థము. శ్రీ రెడ్డిగారు) ప్రాచీన భాషయందు 'నేను జేసితిని. మేము చేసితిమి' అను నర్థములందును 'సెయ్‌దు-సెయ్‌దుమ్' అనునవి కాన్పించుచున్నవి. ('ఇవి సమాపకములు కావు.' శ్రీ రెడ్డిగారు) పురుష బోధక ప్రత్యయములు పిదపఁ జేర్పఁబడెను. ఉదా:—సెయ్‌దు+ఏన్=సెయ్‌దేన్=(చేసితిని). మలయాళ గద్యమున నేఁటికిని బురుష బోధక ప్రత్యయముల వాడుక లేదు." అని యిట్లు గ్రాలు దొరగారు చెప్పిరి. ప్రాచీన మలయాళ శాసనములలోఁ

బురుష బోధక ప్రత్యయముల వాడుక చూపట్టుచుండుటచేతఁ గాలక్రమమున నందుఁ బురుష బోధక ప్రత్యయముల వాడుక లుప్తమయ్యె ననఁదగును. క్వాచిత్కముగఁ దమిళ కవులచేతను బ్రత్యయ రహితముగ వాడఁబడెననుట నిజము. 'సెయ్‌దు' అను దానికి భూతభావ్యర్థములు రెండిటను వాడుకగలదు. కాని నేఁడు సెయ్‌దు-సెయ్‌దుమ్' అనునవి యుత్తమ పురుషమందు మాత్రమె వాడఁబడుచున్నవి. ఉదా:—సెయ్‌దు=(చేసితిని. చేయఁగలను=చేయుదును). సెయ్‌దుమ్=(చేసితిమి-చేయఁగలము=చేయుదుము). "అదు-ఇదు" అను వానిలోని 'ద' కారమును భూతార్థక దకారమును నభిన్నములని వ్రాసిన గ్రాలు దొరగారి ప్రతిభా విశేషము ప్రశంసింపదగినది. క్రియానామవాచక నిర్మాణమునందీ 'ద' కారము తఱుచుగా నుపయోగింపఁబడుచున్నది. ఈ 'దు' ప్రత్యయమును వర్తమాన భావ్యర్థములందు వాడఁబడుట సుజ్ఞేయము. కాని ముఖ్యమగు భూతకాలమును దెల్పుననుటకుఁ గారణము సులభముగాఁ దెలియదు. తమిళ చేదాద్యర్థకమగు 'సెయ్‌దాల్' అనుదానియందలి 'సెయ్‌దు' అనుదానికిఁ గాలాపేక్షలేని 'చేయుట'యే యర్థము. కొన్ని యెడల నీ చేదాద్యర్థక రూపము భూతార్థమును సంబంధించు ననుటయు నుచితమె. (చూడు చేదాద్యర్థక ప్రకరణము=(Conditional). ఈ ప్రత్యయము 'దు' అనునది కాదనియు నిర్దేశక సర్వనామమగు 'అదు' శబ్దభాగమనియు నంగీకరించుట చేతఁ జాల చిక్కులు తొలఁగును. కన్నడ వర్తమాన చిహ్నమగు 'ఉతె-ఉత్' అనునది 'ఇదు' అను సమీపవస్తు వాచిసంబంధి యనియు భూతార్థక 'ద' ప్రత్యయము పరోక్ష విదూరవస్తువాచియగు 'అదు' శబ్దమును సంబంధించున దనియు నట్టి 'అదు' అనుదాని 'అ' కారస్థితి కారణములు విస్మృతము లగుటచేత (వ్యవహర్తలచే) నయ్యది లోపించెననియుఁ జెప్పుట మిక్కిలి యుక్తమె కాని యిందులకొక ప్రతిబంధము గన్పట్టుచున్నది. భూతార్థక ప్రత్యయమునఁ బైరీతిని లోపించిన 'అ' కారముచోట 'ఇ' కారము నిల్చుటయుఁ గన్నడ భూతార్థక 'ద' ప్రత్యయ ముచ్చారణార్థకమగు 'ఇ' కారము పూర్వమందుఁ గలదగుటయుఁ దమిళ మలయాళాంధ్రములందు స్వతంత్రముగ 'ఇ' కారమె భూతార్థకప్రత్యయమగుటయు భూతార్థక 'ద' ప్రత్యయము 'అదు' శబ్ద సంబంధి కాక 'ఇదు' శబ్ద సంబంధి యనుటను స్థిరపఱుచుచున్నవి. సమీపవస్తు వాచి యగు 'ఇదు' శబ్దము మూలమనుట యసంభవ మగుచున్నది. కాన ద్రావిడ భూతార్థక 'ద' కార మమహత్కృ్త్రైకవచనరూప నిర్మాణోపయోగియగు ప్రత్యయ విశేషమనియు, దానిని జేర్చుటచేతఁ గ్రియ విభక్తి ప్రత్యయ యోగ యోగ్యమగు క్రియానామవాచకముగ నేర్పడుననియు ('చేయఁగల-చేయఁబోవు'

మున్నగు చోటులందలి 'చేయన్' అనుదానివంటి శబ్దము కాదని భావము) నట్టి యెడలఁ గ్రియార్థము సంక్షిప్తమై నిబద్ధమగుననియు గ్రహించుట యుక్తము. ఇట్లంగీకరించునపుడు ద్రావిడ భాషలకును సంస్కృత, పరిషియను భాషలకును గొంతవఱకు సంబంధము కన్పట్టును. రెండు కుటుంబములందును నీ నిర్దేశక వర్ణమో లేక ప్రత్యయ విశేషమో యేకవిధ ప్రయోజనమునె కలిగియుండును. అదియొకట (ద్రావిడభాషల పక్షమున) భూతార్థమాత్ర బోధకము. మఱొకటఁ (సంస్కృతమున) కర్త్రార్థక భూతార్థ బోధకము.''

''టర్కిషు భాషలోని 'సెవెద్దిమ్=(ప్రేమించితిని)' అను దానియందలి 'ది' అనునది షష్ఠీ ప్రత్యయ లుప్త శేషమని ప్రొఫెసరు 'మాక్సు ముల్లరు' గారభిప్రాయపడిరి. (చూడు. లెక్చర్లు ౩౨౮ పుట). ఉదా:—ఇచ్చుట నాది=ఇచ్చితిని=ఇచ్చుటను నేను గల్గియున్నాను. తమిళ భూతార్థక 'ద' కారము సయితమిట్టిదే కావచ్చును. 'అదు' శబ్దము నిర్దేశ సర్వనామమే యైనను దానికి సంబంధ షష్ఠీ విభక్త్యర్థమును గలదు. ఉదా:—అదు ఎనదు=(అది నాది). ఈ తమిళ భూతార్థక రూపములలో సంబంధార్థ మేమియు లేదు. నిర్దేశార్థ మాత్రమె భాసించుచున్నది'' (కాల్డు. ౫౧౧, ౫౧౨ పుటలు).

''మంగోలియను భాషయందు భూతార్థక దప్రత్యయమును జేర్చుటచేత నేర్పడు నసమాపక క్రియలు గలవు. (Gerunds) ఉదా:-ఒనిహు=(స్వారిచేయు). ఒనద్=(స్వారిచేయుట). సంస్కృత ద్రావిడాది 'త-ద' లతో దీనికి సంబంధ మున్నను లేకున్నను 'టర్కిషు' భాషలోని 'ది' అనుదానితో దీనికేదేని సంబంధ ముండి యుండును. మంగోలియను భాషలోని మఱొక యసమాపక క్రియలోని (Gerund) 'జి' అనునది 'ద' ప్రత్యయమునుండి నిష్పన్నమైనదే యని 'ఎడ్కిన్సు' దొరగారు చెప్పిరి. ఇట్లె తమిళముందలి 'దు' అనునది తెల్గులోని 'సి' అగుచున్నది. జపాను భాషలోని యసమాపక క్రియయందలి 'తె' అనునది రూపమందును వాడుకయందును మంగోలియను 'ద' ప్రత్యయమును బోలుచున్నది. ఉదా:—జపాను—అఘె = (లేవనెత్తు). అఘెతె=(లేవనెత్తుట). జపాను భాషయందలి భూతకాలిక రూపము ధాతువునకు 'త' ప్రత్యయమును జేర్చుటచేత నేర్పడును. ఉదా:—మి=(చూచు). మిత=(చూచెను)'' (కాల్డు. ౫౧౨, ౫౧౩ పుటలు).

విమర్శము.—డా. కాల్డువెల్లుగా రొకసారి 'ఇ' కారము (చూడు ౧౩౧ II విష.) ను మఱొకసారి 'ద' కారమును స్వరసంహితా వ్యవధాయక వర్ణములె యని వ్రాసినను నిచట 'ద' కారము నిజమగు భూతార్థక ప్రత్యయమనియు 'ఇ' కార ముచ్చారణార్థక మనియు నిశ్చయించి వ్రాయుచున్నారు.

"ద్రావిడ ధ్వనుల కలవాటుపడిన చెవికి బాళ్దెన్ (కన్నడ-బ్రదికితిని) మున్నగు రూపములు కఠోరములై యుండును గాన నట్టి కఠోరత లేకుండఁ జేయుటకై శ్రుతిసుఖముగ నుండునట్లు 'ఇ' కారము చేర్పఁబడెను" అని దొరగారు వ్రాయుట సరికాదు. 'బాళ్దెం' అనునది పలగన్నడ రూపము. 'బాళిదెను' హొసగన్నడ రూపము. 'ఇ' ప్రత్యయ మర్వాచీనమని (హొసగన్నడము నాఁటి దని) సమర్థించినపుడు గదా పయి వీరి యూహ సయుక్తికమగును. పలగన్నడ వ్యాకర్తలగు నాగవర్మ కేశిరాజ ప్రభృతులె 'ద' కారముతో పాటుగ 'ఇ' ప్రత్యయమును భూతార్థకముగ సూత్రించి యున్నారు. ఇది తెల్గున 'చేసి-చేసిన' మున్నగు స్థలములందెల్ల సర్వతోముఖముగ 'త' ప్రత్యయ సహాకారము లేని-చోటులందును భూతార్థ బోధకమై ప్రసిద్ధమై యున్నది. ప్రాచీన తమిబ మందును 'ఆడినేన్-పాడినేన్' మున్నగు భూతార్థకములగు 'ఇ' ప్రత్యయాంత రూపములు 'త' ప్రత్యయ విరహితముగా వెలసియున్నవి. నన్నూలు కర్త 'ఇన్' భూతార్థ మని సూత్రించి యున్నాఁడు. (చూడు ౧౮౨ సూ..... 'ఇన్' భూతార్థకము. పోన్+ఇన్ + ఆన్ = పోయినాన్......') ఇంత యేల? తొల్కాప్పియమందే 'ఇన్' అను భూతార్థక ప్రత్యయము పేర్కొనఁబడెను.

"చెయ్దు......" (తొల్కా. ౭౧౨ సూ.) = 'చెయ్దు-చెయ్యా-చెయ్పు-చెయ్దెన-చెయ్యియర్-చెయ్యియ-చెయిన్-చెయ - చెయక్కు' అను రీతిగల తొమ్మిది విధముల రూపములును నెల్ల క్రియల యొక్కయు నసమాపక రూపములై యుండును. ఉదా:—చెయ్దు=(చేసి)......చెయిన్=(చేసినన్)......" ఇట్టి భూతార్థకమగు 'ఇ=ఇన్' అను ద్రావిడ ప్రత్యయ మర్వాచీన మని వీరెట్లు వచింపఁగలరు?. తమి-వాల్న్దేన్=(వృద్ధి పొందితిని) మున్నగు తొల్కాప్పియము నాఁటి ప్రాచీన భూతార్థక రూపములును 'బాళ్దెం' మున్నగు నాగవర్మ కేశిరాజాది సాధిత కన్నడ రూపములును గర్ణకఠోరము లనుట యెట్లు పొసఁగును? అప్పటి ద్రావిడ వ్యవహర్తల చెవుల కవి యింపుగనె యుండెడి వనుట సహజము. 'వాల్న్దేన్'-బాళ్దెం' మున్నగు రూపములను బ్రయోగించిన కవులచెవులును వానిని సాధించిన తొల్కాప్పియరు నాగవర్మమున్నగు వారి చెవులును ద్రావిడపు చెవులె కావా? వారు వైదేశికులు కారుగదా.

కావున ౧౩౧ II, ౧౩౧ IV విషయములలో నేను వ్రాసినట్లుగ 'ఇన్=ఇ=న్=త్=ద్=న్ద్' అనునవెల్ల భూతార్థక ప్రత్యయములె యనియు వీనిలో నేదియు నుచ్చారణ మాత్రార్థకము కాదనియు గ్రహింపవలయును. 'ఇ' ప్రత్యయ ముచ్చారణ మాత్రార్థకమని యవిమర్శితముగ నిశ్చయించుకొనియు డా. కాల్డువెల్లుగారు భూతార్థక 'ద' ప్రత్యయము పరోక్ష విదూరస్థ వస్తువాచి

యగు 'అదు' శబ్దపు ఖండమనెడి వ్యుత్పత్తి నెట్లు బాధితమనుచు నిరసించిరో తెలియకున్నది. ప్రాచీన కాలమున 'ఇ' ప్రత్యయ ముచ్చారణార్థక మాత్ర మని కదా దొరగారి యాశయము. 'ద' ప్రత్యయము 'అదు' శబ్ద ఖండ మనెడి వ్యుత్పత్తి యీ క్రింది రీతిని నిర్బాధమగుచున్నది. 'ఇ' ప్రత్యయ మజ్ఞాతచరిత్రకమగు భూతార్థక ప్రాచీన శబ్ద ఖండమగుటచేత నయ్యది వేఱగు భూతార్థక ప్రత్యయమనియు 'ద' ప్రత్యయము 'అదు' శబ్ద ఖండమగు వేఱొక భూతార్థక ప్రత్యయమనియు నప్పటి వ్యవహర్త లచటి 'ఇ' కారము భూతార్థక మనుటను విస్మరించుటచేత 'అదు' అను పరోక్ష వస్తువాచి శబ్దపు ఖండమగు 'దు' అనుదానిని భూతార్థకముగా వాడియుందురనియు నచట నేర్పడు 'ఇ+దు' అనునది యఖండ శబ్దమను బుద్ధికల్గుటకే యవకాశము లేకనియుఁ దలంచునపుడు (౧౩౧ II-IV విష.) భూతార్థక 'ద' ప్రత్యయము పరోక్ష దూర వస్తువాచియగు 'అదు' అను నిర్దేశ సర్వనామ ఖండమనుటలో బాధ యెట్టిదియు సోఁక నేరదుగదా. డా. కిట్టెలు దొరగారును భూతార్థక 'ద' ప్రత్యయమున కిట్టి వ్యుత్పత్తినే వచించిరని డా. కాల్డువెల్లుగారే వెనుక వ్రాసి యామోదించి యున్నారు. (చూడు ౧౩౦ II విష. కాల్డు. ౪౯౦ పుట). 'త=ద' ప్రత్యయ విషయమున నిండో యూరపియను ద్రావిడ భాషల పోలి కలు డా. కాల్డువెల్లుగారు చెప్పినట్లు యాదృచ్ఛికములు కావు. ద్రావిడ భూతార్థక 'త' ప్రత్యయమునకే కాక 'ఇ' ప్రత్యయమునకు సైతము సంస్కృత క్త్వార్థక రూపములలోఁ గొంత పోలిక యగపడుచున్నది. 'భూత్వా' మున్నగు రీతిని క్త్వా ప్రత్యయము 'త' కార ఘటితమె యైనను ధాతు వవ్యయపూర్వక మగునపుడు 'ఇ' ప్రత్యయ సంబంధి యనఁదగు 'య' కారము (ల్యప్ ప్రత్య యము) క్త్వా ప్రత్యయమునకు బదులుగా నిల్చును. ఉదా:—భూత్వా—అను భూయ. ఈ 'య' కారము తెల్గు క్త్వార్థకమగు 'ఇ' ప్రత్యయమును సంబంధించు చున్నదన నగును. 'పీడ్+ఇ+తః=పీడితః' మున్నగు చోటులందలి ఇకార పూర్వక తకారము కన్నడమందలి 'మాడిద' మున్నగు చోటులలోని 'ఇ+ద' అను స్థలమునకు సరియని తోఁచుచున్నను నట్టి పోలిక యాభాస రూప మాత్రమె. 'పీడ్+ఇ+త' మున్నగు చోటులందలి సంస్కృతములోని 'ఇ' డాగమము భూతార్థ బోధకము కాదు. 'భవితా-భవిష్యతి' మున్నగు భావ్యర్థములందును నయ్యది ప్రసిద్ధమె యున్నది.

ద్రావిడ భూతార్థక 'త' ప్రత్యయము 'అదు' శబ్ద ఖండమని యంగీక రించుటలో సైతము సంస్కృత ద్రావిడభాషల పోలిక సహజమెయని చెప్ప వచ్చును. ద్రావిడ నిర్దేశ సర్వనామములగు 'అదు' మున్నగునవి సంస్కృత

మందలి 'తద్' మున్నగువానివంటివె యని (చూడు ౭౫ V విష. ౧౧౦ III విష.) యీ వఱకు విశదీకరింపఁబడియె యున్నది. ద్రావిడ భూతార్థక 'త' ప్రత్యయము ద్రావిడశబ్దమగు 'అతు' శబ్దపు ఖండమగుచుండఁగా సంస్కృత భూతార్థక 'క్త' ప్రత్యయము సంస్కృతి 'తద్' శబ్దము ఖండమగు చున్నదనఁదగునుగదా. ఇట్టి స్థితిలో నీ వ్యుత్పత్తి బాధితమనుచు విడుచుకొని యేదో యజ్ఞాత చారిత్రకమగు 'త' ప్రత్యయము నంగీకరించుటలోఁ గల యర్థ మేమో? తెలియకున్నది.

డా. గ్రాలు దొరగారు భూతభావి వాచకమును నజ్ఞాతచరిత్రకమును నగు ప్రాచీన ద్రావిడ 'తు' ప్రత్యయమును (చూడు ౧౨౦ IV విష.) సైతము పయిరీతిని భూతార్థ మాత్రబోధనక్షమముగ నిరూపించిన 'అదు' శబ్దఖండమగు 'ద' ప్రత్యయముగఁ బ్రదర్శించుట ప్రామాదిక మనఁదగును. ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయమువలెనె యీ భూతభావ్యర్థక ప్రాచీన ద్రావిడ 'తు=దు' ప్రత్యయము నయిత మజ్ఞాత చరిత్రకమె యనఁదగును. లేదా సంస్కృత త్యదాది సంపర్కమునఁ బరో క్షాపరోక్ష దూరాదూర వస్తు వాచక సాధారణముగా నిల్చు 'తు' ప్రత్యయమున (చూడు ౭౫ V విష. ౧౧౦ III విష.) కీ భూతభావ్యర్థక 'తు' ప్రత్యయ మభిన్నమనియైనఁ జెప్పఁనగును. మఱియు 'నీజ్గళ్ సెయ్‌దు-నీ సెయ్‌దు' అను రీతిని మధ్యమ పురుషమందును నీ భూతభావ్యర్థక 'తు' ప్రత్యయమునకుఁ బ్రయోగము గలదనుచు డా. గ్రాలు దొరగా రుదాహరించుటయు సరికాదు. ప్రాచీన ద్రావిడ-'తు-తుమ్' ప్రత్యయములు భూతభావికాలములం దుత్తమపురుష వచనద్వయమునందు మాత్రమె ప్రయోగింపఁబడును. నన్నూలుకర్త యట్లె సూత్రించెను. ఇంతియకాక 'నాన్ సెయ్‌దు-నామ్ సెయ్‌దుమ్' అనువానికి 'చేయుట-చేయుచు'=(doing) అని గ్రాలు దొరగారర్థము వ్రాయుటయు సరికాదు. "నాన్ సెయ్‌దు=నేను జేసితిని-నేను జేయఁగలను=చేయుదును. నామ్‌సెయ్‌దుమ్=మేము చేసితిమి. మేము చేయఁగలము=చేయుదుము" అని యర్థము వ్రాయవలయును. అసమాపక క్రియా పక్షమునఁ బురుషవచన భేదము లేకుండుటలో వింత యేమున్నది? మఱియు నీ ప్రాచీన ద్రావిడ 'తు' ప్రత్యయమునకుఁ బ్రాచీన కాల మునఁ బురుషత్రయమునందును వాడుకయుండెడిదని నిరాధారముగ గ్రాలు దొరగారు వ్రాసిరి. అట్టితలంపుననె కాఁబోలును "నేఁ డుత్తమ పురుషమందు మాత్రమె వాడఁబడుచున్నది" అని కాల్డువెల్లు దొరగారును వ్రాసిరి. తొల్కాప్పియము నాఁడు సైతమీ భూతభావ్యర్థక 'తు' ప్రత్యయ ముత్తమ పురుషమందు మాత్రమె వాడఁబడుట సమ్మతము. 'తు-తుమ్' ప్రత్యయము

లుత్తమ పురుషమందు మాత్రమె నిల్చునని సూత్రింపఁబడెను. ఇవి ప్రథమ మధ్యమ పురుష ప్రత్యయములుగా సూత్రింపఁబడలేదు.

"క-ట-త-అ......" (తొల్కా. ౬౮౭ సూ.)="'కు-టు తు-ఉ' అనునవియును 'ఎన్-ఏన్-అల్' అనునవియును దుదిని గల క్రియ లుత్తమ పురుషైక వచనములు."

"అమ్వైతామ్......" (తొల్కా. ౬౮౬ సూ.)="అమ్-ఆమ్-ఎమ్-ఏమ్-కుమ్-టుమ్-తుమ్-ఉమ్" అనునవి తుదిని గల క్రియ లుత్తమ పురుష బహు వచన రూపములు."

పయిని వివరించిన చరిత్రముగల భూత భావ్యర్థక ప్రాచీన ద్రావిడ 'తు' ప్రత్యయము 'అదు' శబ్దఖండమగు ద్రావిడ భూతార్థమాత్రబోధక 'త' ప్రత్యయమున కభిన్నమని రూపసామ్యకృత భ్రాంతిచే డా. గ్రాలు దొరగారు వ్రాయుట పొరపాటు. మఱియు నట్టి భూత భావ్యర్థక ప్రాచీన ద్రావిడ 'తు' ప్రత్యయముపైని బురుషబోధక ప్రత్యయములు నిల్చుటచేతఁ దమిళ భూత సమాపక క్రియారూపము లేర్పడుననెడి డా. గ్రాలుదొరగారి వ్రాఁత మిక్కిలి ప్రామాదికము. (చూడు ౧౨౮ IV విష. విమర్శ) భూతార్థ మాత్ర బోధక 'త' ప్రత్యయముపైని బురుష బోధక ప్రత్యయములు నిల్చుటచేతఁ దమిళ భూతార్థక సమాపక క్రియా రూపము లేర్పడునని గ్రహింపనగును.

౧౩౨. I విష:—3. భవిష్యత్కాలము: — "ద్రావిడ భూతకాలరూపములు క్త్వార్థకములనుండి యేర్పడునని చెప్పియున్నాను. భవిష్యత్కాల రూపము లట్లేర్పడ నేరవు. ధాతువునకు భావ్యర్థక చిహ్నమును జేర్చి పురుష బోధక ప్రత్యయమును నిల్పుటచేత భవిష్యత్కాల రూపమేర్పడును. ద్రావిడ భాషలందు భావ్యర్థక క్రియాజన్య విశేషణములు లేవు. ఇందులకు మలయాళమునను గ్రాంథిక తమిళమునను రెండపవాదములు గలవు. (చూడు ౧౩౨ II విష). ఈ రెండు భాషలందును "వాన్=ప్పాన్" అను భావ్యర్థక విశేషణము గలదు. తుళు భాషయందు వర్తమానమునఁగాని భావినిగాని యుపయోగింపఁదగు నొక క్రియాజన్య విశేషణ సాధక ప్రత్యయముగలదు."

"ద్రావిడభాషలందు భావికాల రూపములు రెండు విధములు గలవు. I. కన్నడ వైయాకరణులు చెప్పినట్లు చేదర్థక భావ్యర్థక మొకటి. ఇది యాంధ్ర కన్నడములందు మాత్రము గలదు. II. రెండవది యనిశ్చిత కాలికము. దీనియందు భావ్యర్థము కొంత భాసించును. దీని నాంధ్ర వైయాకరణులు తద్ధర్మార్థకమనిరి. ఇందలి ప్రత్యయములు వర్తమాన భావులు రెండి

టను వాడఁబడును. భావ్యర్థమునకు బదులుగా వర్తమానార్థమును వాడుట ద్రావిడభాషలన్నిటను గలదు."

"ద్రావిడ క్రియాకాలములలో నీ భావికాల మంత స్పష్టమైనదికాదు. దీనిని వర్తమానార్థమందును భూతార్థమందును దాచ్ఛీల్యాద్యర్థములందును వాడుదురు. ఆయాచోటులందలి సందర్భములు వానివాని కాలనిర్ణయము చేయును. భావిని దెల్పు ప్రత్యయములన్నియు మొదట భావార్థక క్రియానామవాచకములై యని నా యభిప్రాయము. ఇది సరియగునేని దీని కాల నిర్దేశాభావమునకుఁ గారణము విశదమగును" (కాల్డ్వె. ౨౧౩ పుట).

"తమిళ భావిరూపముల నేర్పఱచు పద్ధతులు పెక్కువిధములు. వానిలో నొక్కొకటి ద్రావిడభాషలలో నొక్కొకదానిని బోలుచుండును. కావ్యములలో నరుదుగఁ గానిపించు భావి ప్రత్యయ ముచ్చారణార్థకమగు 'ఉ' కారముతోఁగూడిన 'క' కార 'గ' కారరూపము (కు=గు). ఉదా:— చెయ్‌గు = (చేయఁగలను = చేయుదును). చెయ్‌గుమ్ = (చేయఁగలము = చేయుదుము). "చెయ్‌గుమ్ పన్దేమ్ = (చేయవచ్చితిమి)" అనియుఁ గలదు. ఇందలి 'చెయ్‌గుమ్' అనుదాని కసమాపక క్రియార్థ బోధనశక్తియుఁ గలదు. ('అసమాపక మనరాదని వ్యాకర్తలు'. శ్రీ రెడ్డిగారు) గ్రాంథిక కన్నడములోని "కుమ్=గుమ్" అనువాని చరిత్రము పై తమిళ రూపములవలన విశదము కాఁగలదు. ఇందలి 'గ' కారము భావిచిహ్నము. 'ఉమ్' అనునది స్వభావము చేత సముచ్చయార్థకమె యైనను నిందు నర్థసువ్యక్తికిని గొన్నియెడల బహుత్వ బోధమునకును నుపయోగించును. తమిళమందలి పై 'గు' ప్రత్యయముపైని బురుషబోధక ప్రత్యయములు నిల్చుట సమాపక క్రియల రెండవ యవస్థ. ఉదా:—సెయ్‌గు+ఏన్=సెయ్‌గేన్ = (చేయఁగలను = చేయుదును). కొన్నిచోట్ల నిది ద్విరుక్త 'క' కారముగ నిల్చును. ఉదా:—అడైక్కేన్ =(పొందఁగలను =పొందుదును). ('ఈ యర్థమున ద్విత్వమురాదు' శ్రీ రెడ్డిగారు) వ్యావహారిక భాషలో నట్టి 'గ' కారమునకు బదులుగా 'వ' కారము నిల్చును. ఈ 'గ' కార ద్విరుక్త 'క' కారములు భావ్యర్థ ప్రయుక్తములైనను ధాత్వర్థరూప భావార్థమందును నకర్మక క్రియల భావ్యర్థమునందును (కృత్తులలో) గానిపించెడి 'గ' కార ద్విరుక్త క కారములను సంబంధించును" (కాల్డ్వె. ౨౧౩, ౨౧౪ పుటలు).

"తమిళ కావ్యములందును వ్యావహారిక తమిళమందును ధాతువునకు 'వ'కార 'బ'కార ద్విరుక్త 'ప' కారములను (వీనిలో నేదేని యుచ్చారణానుకూలముగ నిల్చును) జేర్చుటచేత (చూడు ౧-౨-౨ II, III విష.) భావ్యర్థక రూపము లేర్పడును. 'య్-ర్-ల్-ఴ్-ళ్' అను నక్షరములకుఁ బరముగ సాధా

రణముగా 'వ' కారము నిల్చును. ఉదా:—చె(సె)య్ వేన్=(చేయఁగలను=చేయుదును). చా(సా)ర్ వేన్=(వంగఁగలను=వంగుదును). ('ఆశ్రయింతునని యర్థము' శ్రీ రెడ్డిగారు) చొ(సొ)ల్ వేన్=(చెప్పఁగలను=చెప్పుదును). వాల్ వేన్=(వర్థిల్లఁగలను=వర్థిల్లుదును). మాళ్ వేన్=(నశింపఁగలను=నశింతును). లకార ళకారాంతములయందు సంధివశమునఁ గొన్ని మార్పులు గల్గును. ఉదా:—(కల్=అభ్యసించు) కఱ్ పేన్=(కల్ ప్పేన్)=నేర్చుకొనఁగలను=(నేర్చుకొందును). (కేళ్=విను) కేళ్ పేన్=(కేళ్ ప్పేన్)=(వినఁగలను = విందును). దీర్ఘపూర్వకోదంతములగు ధాతువులపైని సయితము వకారమె నిల్చును. ఉదా:—(పాడు = గానముచేయు) పాడు వేన్ = (పాడఁగలను = పాడుదును). (అనుప్పు=పంపు). అనుప్పు వేన్ = (పంపఁగలను = పంపుదును). అనునాసికములగు 'న-ణ' లకుఁ బరముగా 'బ' కారము నిల్చును. ఉదా:—(ఎన్=అను). ఎన్ బేన్=(అనఁగలను=అందును). (ఉణ్=భుజించు). ఉణ్ బేన్ = (తినఁగలను=తిందును). కావ్యములం దీ బకారము చోట మకారము నిల్చుటయుఁ గలదు. 'ఎణ్ బర్=(అందురు)' అనుటకు బదులుగా 'ఎన్మర్' అని నిల్చును. 'ఎన్మనార్' అనుదాని నంతకన్నను నాదరముతోఁ బ్రాచీన కవులు ప్రయోగింతురు. చూడు (Epicene plural—౨౮-౨ పుట. కాల్డు.) రెండు 'వ' కారము లుండవలసిన భావ్యర్థక విశేషణమందలి పూర్వ 'వ' కారము చోట 'బ' కారము వచ్చుటగలదు. ఉదా:—'వరువవన్' అని కాక 'వరుబవన్'=(రాఁగలయతఁడు) అని యగును. ఈ తరగతి తమిళ సమాపక క్రియలన్నియు ద్విరుక్త 'ప' కార మేళితములగును. అట్లగుటలోఁ గొన్ని యప్రధానములగు నపవాదములు గలవు. ఉదా:—ఇరుప్పేన్=(ఉండఁగలను=ఉందును). నడప్పేన్=(నడవఁగలను=నడతును). కడిప్పేన్ = (కఱవఁగలను = కఱతును). ఇట్టి స్థలములుతప్పఁ దక్కిన యన్నిటను భావ్యర్థమునఁ దమిళమున 'వ' కారమె యగును. ఈ 'వ' కారమె వ్యావహారిక కన్నడమున నియతముగను గ్రాంథిక కన్నడమునఁ బ్రాయికముగను వచ్చును. స్వభావముచే భావిరూపమగు తుళు భాషావర్తమాన శబ్దమందును వకారమె వచ్చును."

"పయి 'వ' కారములెల్లఁ గ్రియానామవాచక రూపనిర్మాణోపయోగి ప్రత్యయములె యని నా యభిప్రాయము. ఈ యూహాప్రకారము ప్రాచీన తమిళ భావిరూపమగు 'గ' కారము తమిళ వకార బకారములను సంబంధించును. క్రియానామ వాచకములందలి 'గ-వ-బ-ప' లకు స్పష్టార్థముగ 'ఉ' కారము సాధారణముగఁ జేర్పఁబడును. భావికాలిక రూపముల (గ-వ-బ-ప) పైని పురుషబోధక ప్రత్యయములు నిల్చును. ఇంతే యీ రెండిటికిని గల

భేదము. ఉదా:—ధాతు-కడు=చుఱుకుగానుండు=తీక్ష్ణముగానుండు. నామ-కడుగు=ఆవాలు. (ధా)-కుఱు=కుఱుచగానుండు. నామ-కుఱుక్కు=(అడ్డముగా నుండుట=అడ్డమగుట). ధాతు-అఱి=(ఎఱుఁగు). నామ-అఱివు=(తెలివి). ధా-చా(సా)ర్=(ఊనుకొను=చేరు). నామ-సార్బు=(ఊనిక). ధా-తిఱ=(తెఱుచు) నామ-తిఱప్పు=(తెఱపి). 'ఉమ్-ఉ' అను ద్వితీయ భావిప్రత్యయాంతములను బరిశీలించినచో భావికాలిక ప్రత్యయములు స్వభావముచే మొదటఁ గ్రియానామ వాచకములుగనె యుండెడివని విశదమగును" (కాల్డు. ౫౧౪, ౫౧౫ పుటలు).

"'వ'కార-'బ'కార ద్విరుక్త 'ప' కారములచే నేర్పడిన తమిళ భవిష్యత్కాల రూపములనుండి ధాతుజవిశేషణము లేర్పడవు. 'ఉ' మంత భావ్యర్థక తద్ధర్మవిశేషణ రూపమె వాడఁబడుచుండును. ఈ 'ఉ' మంతరూపమె యమహత్కర్తృక భావ్యర్థక ప్రథమ పురుషైకవచనరూపము. ఇరుప్పాన్=(అతఁడుండఁగలఁడు=ఉండును). అమహత్కర్తృక రూపమన్ననో—ఇరుక్కుమ్=(అది యుండఁగలదు). 'ఇరుప్పదు' అని యుండనేరదు. ('కలదు. ఉండెడిది యని యర్థము' శ్రీ రెడ్డిగారు) కన్నడ భాషయందు భావ్యర్థ కామహత్కర్తృక ప్రథమ పురుషైక వచనము—'ఇరువదు' అని యుండును. "వరున=(రాఁగలవి)" అనునది యట్టి తమిళ గ్రాంథిక భావ్యర్థక విశేషణము" (కాల్డు. ౫౧౫ పుట).

విమర్శము:—భూతకాల సమాపకక్రియను సైతము క్త్వాంతమునుండి సాధించుట సహజము కాదనియు ననన్వయదుష్టమనియు నీ భవిష్యత్కాల రూపములనువలెనె ధాతువునుండియె సాధించుట యుక్తమనియు నీవఱకు వ్రాయఁబడెను. (చూడు ౧౩౦ I విమ.) ద్రావిడ భాషలందు భావ్యర్థకక్రియా జన్యవిశేషణములు సాధారణముగా లేవనుచుఁ దమిళ వ్యావహారిక భాషా వాసనచే దొరగారు వ్రాయుట సరికాదు. గ్రాంథిక తమిళ మలయాళము లలో నట్టివి గలవని దొరగారే వ్రాసిరిగదా. ఇరున్దాన్=(ఉండినవాఁడు). ఇరుప్పాన్=(ఉండఁగలవాఁడు). తెల్గున భావ్యర్థక 'కల'నుబంధము సుప్రసిద్ధము. "కాఁగల కార్యము గంధర్వులు చేసిరి. కొనఁగల గేదెకుఁ బెట్టఁగల బచ్చలి" మున్నగు తెనుఁగు భావ్యర్థక విశేషణ ఘటిత లోకోక్తులును గలవు. 'వ' ప్రత్యయ ఘటిత కన్నడ భావ్యర్థకవిశేషణములు గలవని దొరగారే ముందు సందర్భాంతర మున వచింతురు. (చూడు ౧౩౭-౨ II విమ.) కన్నడమునను భావ్యర్థక విశేషణములు వివిధములు గలవని యీ క్రింది కర్ణాట శబ్దానుశాసన సూత్రములు విశదీకరించుచున్నవి.

"అచ్ కర్తృ కర్మణోః" (కర్ణాటక శబ్దా. ౫౪౩ సూ.) = (భాషామంజరీ వృత్తి) ధాతోః అచ్ ప్రత్యయో భవతి కర్తరి కర్మణిచ అభిధేయే......"

"ధాతు ప్రకృతికం పదం ద్వివిధం తిఙన్తం కృదన్తం, చేతి ఉక్తం ప్రాక్. తత్ర తిఙన్తం సప్రపఞ్చం నిరూప్య ఇదానీం కృదన్తం నిరూపయితు మారభతే. 'అచ్ కర్తృ కర్మణో రితి'......" (మంజరీ మకరంద వ్యాఖ్య).

"అచి" (కర్ణాటక శబ్దా. ౪౪౭ సూ.)=(భా-వృత్తిః) "సతి=(వర్తమానే) భూతే భావినిచ కాలే వివక్షితే యథాక్రమం ధాతోః 'దప-ద-వ' ఇత్యేతే ప్రత్యయా భవన్తి అచిపరే. ప్రయోగః:—నోడిదపనం=(చూచుచున్నవానిని) నోడిదనం=(చూచినవానిని) నోడువనం=(చూడఁగలవానిని)........."

"సతి వో వా" (కర్ణాటక శబ్దా. ౪౪౮ సూ.)=(భా-వృత్తిః) వర్తమాన కాలే వివక్షితే ధాతోః 'వ' ప్రత్యయో వా భవతి-అచి పరే. ప్రయోగః:— నోడువనం=నోడిదపనం=(చూచుచున్నవానిని)......" (వర్తమానమున 'ఉతె' ప్రభృతులును నగును. చూడు ౧౨౯ విష).

"అచి పరతః సతి వర్తమానే పూర్వస్మా ద్దపస్యైవ ప్రాప్తౌ అనేన 'వ' ప్రత్యయో విభావ్యతే. తిఙన్తభ్రాన్తి వ్యుదాసార్థం ఉదాహృతౌ ద్వితీయాది ప్రదర్శనమ్" (మఞ్జరీమకరంద వ్యాఖ్య).

భవిష్యత్కాలరూప విభాగము దొరగారు వ్రాసినది సరిగా నుండలేదు. వారు చూపిన భేదముల నన్నిటిని స్పృశింపలేదు. "I చేదర్థక భావ్యర్థకము. II అనిశ్చిత భావ్యర్థకము=తద్ధర్మార్థకము" అని విభజించిరి. ఈ విభాగము సాకల్యావగాహి కాదుగదా. "కు=గు-వ-బ-ప్ప" అను భావిప్రత్యయములు చేరు ప్రథమ భావ్యర్థకము లీ విభాగమునఁ జేరలేదు. కావున నీ క్రింది రీతిని విభజింపనగును.

I. (a) 'గు-వా' ది ప్రత్యయఘటిత స్పష్టతమ భావ్యర్థకము. ప్రథమ భావ్యర్థకము. (b) చేదర్థక భావ్యర్థకము

| | |
|---|---|
| II. ౧-ఉమం తాస్పష్ట భావ్యర్థకము................ | తద్ధర్మార్థకము. |
| II. ౨-'దు' ప్రభృతి ప్రత్యయ ఘటి తాస్పష్ట భావ్యర్థము. | |
| II. ౩-సంభావనార్థక స్పష్టతర భావ్యర్థకము........... | |

డా. కాల్డువెల్లుగారు ప్రాచీన ద్రావిడ భావ్యర్థక 'కు' ప్రత్యయము 'గ' కారమై తమిళ వ్యావహారిక భాషలో 'వ' కారముగాఁ బరిణమించుచున్నదని వ్రాసిరి. కాని 'కు' ప్రత్యయము భావ్యర్థక 'వ-బ-ప్ప' ప్రత్యయములకు మూలమని వ్రాయలేదు. మఱియు 'చెయ్‌వేన్' అనుదానినుండి 'చెయ్‌గేన్'

అనునది యేర్పడెనని వెనుక వ్రాసియుయున్నారు (చూడుము ౨౧ XVIII విభ.) ఈ వ్రాఁత యచట విమర్శితమయ్యెను. 'స్టడీ-ద్రవి' కర్తగారు 'ఆగు' ధాతు 'గ' కారమునుండి భావ్యర్థక 'వ-ప' ప్రత్యయము లేర్పడెనని వ్రాసిరి. (స్టడీ-ద్రవి. ౬౮ పుట). తొల్కాప్పియము నాఁటికే 'వ-ప'లు భావిచిహ్నములుగఁ బ్రయుక్తములయి ప్రసిద్ధములై యున్నవి. తొల్కాప్పియము నాఁటికి 'గ' కార రూప సరళమే లేదు అప్పటికి 'ఆకు' అనియె 'ఆగు' ధాతువు ప్రసిద్ధమై యుండెను. 'క' కారము వకారమయ్యెనని యెవ్వరును జెప్ప సాహసింపరు గదా! 'ఆగు' ధాతు 'గ' కారము భావ్యర్థకమగుట యసంగతము. ఇట్లు వీరి యీ కల్పనము కేవలము నసంభవమని యీవఱకె సువిస్తరముగా విశదీకరింపఁబడెను. (చూడు ౨౧ II విభ).

డా. కాల్డువెల్లుగా రుదాహరించిన 'ఎన్నర్' శబ్దవిషయము నీ వఱకు విపులముగా విమర్శించి యున్నాను. (చూడు 33 విభ.) (౭౭ II విభ).

'వరున' శబ్దవిభాగవిషయమున డా. కాల్డువెల్లుగారు వెనుక వ్రాసిన విషయము విమర్శితమయియే యున్నది. (చూడు 3౨ VI విభ).

భావ్యర్థక ప్రత్యయములును మొదట భావార్థక క్రియానామవాచక నిర్మాణోపయోగి ప్రత్యయములెయై యుండెడివను డా. కాల్డువెల్లుగారి వ్రాఁతయు సరికాదు. దొరగారట్లు వ్రాయుదురే కాని భావార్థక ప్రత్యయములయు భావ్యర్థక ప్రత్యయములయు నభిన్నత స్పష్టపడునట్లు ద్వివిధ రూపముల యైక్యము నొక్కట నైనఁ జూపియుండలేదు. మఱియు నట్టివి భావార్థకములని యూహింప వలయునె కాని సిద్ధార్థము కాదనియు వానికి భావార్థకములుగాఁ బ్రత్యేక ప్రయోగమే లేదనియు డా. కాల్డువెల్లుగారు స్థలాంతరములందుఁ గంఠోక్తముగా వచించి (చూడు కాల్డు. ౫౧౩ పుట ౪ పేరా ౫౧౯ పుట ౨ పేరా) యున్నారు. మఱియు భావార్థ మనఁగా ధాత్వర్థము. ధాత్వర్థక ప్రత్యయాంతముపైని బురుష బోధక ప్రత్యయములు నిల్పుటచేత భావ్యర్థ బోధ మెట్లు కల్గును? 'కు' మున్నగువానిపైని బురుష బోధక ప్రత్యయములు నిల్చు నవస్థ సంభవించిన పిదప నచటి 'కు' మున్నగునవి ధాత్వవయవములుగ నేర్పడుట చేత నట్టి ధాతు రూపములు క్రియానామవాచక ప్రత్యయాంతములకు మూల ములై (చూడు ౧౩౭ II విభ.) దొరగారి యిట్టి భ్రాంత కల్పనమునకు మూలము కావచ్చును. ఎందేని ద్వివిధ ప్రత్యయములకు యాదృచ్ఛికమగు పోలిక యుండిన నుండవచ్చును. భావ్యర్థక ప్రత్యయాంతములు నియతముగాఁ గ్రియానామవాచక రూపములు కావు గదా. దొరగారిట్టి కల్పనమును ప్రేరణ ప్రత్యయ విషయమునందును గావించిరి. అచ్చట సైతము భావ్యర్థక ప్రత్యయ

ములును ప్రేరణార్థక ప్రత్యయములును క్రియానామవాచక ప్రత్యయములై యుండనోపునని వ్రాసియున్నారు. అచ్చట సైతము పై రీతినె వొరగారి మతము నిరసింపఁ బడినది (చూడు ౧-౨-౨ V విభ).

౧౩-౨. II విభ:—"ద్వితీయాస్పష్టభావ్యర్థకము=ఉమంత తద్ధర్మార్థకము:—'వ' ప్రత్యయాది ఘటిత ప్రథమభావ్యర్థకముచేత బోధింపఁబడినంత స్పష్టముగా నిందు భావ్యర్థము బోధింపఁబడదు. ఇందలి భావ్యర్థబోధ మస్పష్టముగా నుండును. మఱియు నిది యమహత్కర్తృక ప్రథమ పురుషైక వచనములకును ధాతుజ విశేషణములకును మాత్రమె యుపయోగించును. ధాతువునకు 'ఉమ్' ప్రత్యయమును జేర్చుటవలన నీ తద్ధర్మార్థభేద మేర్పడును. ఉదా:-తమి.-పోగుమ్=(పోఁగలదు). వరుమ్=(రాఁగలదు). ఇరుక్కుమ్=(ఉండఁగలదు) తమిళు వైయాకరణు లీ 'ఉమ్' అనునది భావ్యర్థక వకారము యొక్క భాగమనిరి. అది సరికాదు. మలయాళమున భావిరూపములలో నీ 'ఉమ్' అనునది ప్రత్యేకముగా వాఁడబడును. ఉదా:—మలయా:—నాన్ ఎఴుదుమ్=(నేను వ్రాయఁగలను.) నీ ఎఴుదుమ్=(నీవు వ్రాయఁగలవు). మలయాళమున 'ఉ' మంతము నామముతో నన్వయించును. ఉదా:—ఆవు+ఓళమ్=(అవునంతవఱకు)=ఆగుమోళమ్=ఆవుమోళమ్. తమిళ గద్యలందును వ్యవహారమందును నమహత్కర్తృక ప్రథమ పురుషైకవచన భావ్యర్థమందె 'ఉమ్' అనునది వాడఁబడును. కావ్యభాష యందట్లు కాక మలయాళమందు వలెనె విరివిగాఁ బుంస్త్రీ కర్తృక బహువచనములందును 'ఉ' మంతము వాడఁబడును. ధాతుజ విశేషణమందలి 'ఉమ్' అనుదానికిని సమాపక క్రియలందలి 'ఉమ్' అనుదానికిని భేదములేదు. ఉదా:—పోగుమ్=(పోఁగలదు-పోఁగల)" (కాల్డు. ౫౧౫, ౫౧౬ పుటలు).

"'ఉమ్' అనునది ధాతువుయొక్క మూలరూపమునకుఁ జేర్పఁబడదు. ఇంకఁ బురుష బోధక ప్రత్యయములను జేర్చుట కర్హమైన క్రియాంగమునకుఁ బరముగఁ జేర్పఁబడును. క్రియానామవాచకమునకు (లేక) భావార్థక రూపమునకు (Infinitive) మూలమైన యంగ మనఁదగు క్రియాంగమునకె 'ఉమ్' ప్రత్యయము చేర్పఁబడును. కాన నట్టి క్రియాంగమె క్రియానామవాచక రూపమని యూహింపనగును. అట్టి క్రియానామవాచక రూపమునకుఁ దమిళమున, బ్రత్యేక ప్రయోగము లేదు. (చూడు ౧౩-౨ I విభ.) (చూడు కాల్డు. ౫౧౩ పుట). కాని తమిళ భావార్థకమునకును 'ఉ' మంత తద్ధర్మార్థకములకును గల సంబంధ మీ క్రింది యుదాహృతుల వలన

విశదము కాఁగలదు. ఉదా:—పోగ్+అ=(పోవుట) పోగ్+ఉమ్=(పోఁగలదు). క్రియాంగము 'పోగు' అనునది. పోక్కు+అ=(పోవఁజేయుట=పంపుట). పోక్కు+ఉమ్=(పంపఁగలదు). క్రియాంగము 'పోక్కు' అనునది. ఇరుక్క=(ఉండుట). ఇరుక్కుమ్=(ఉండఁగలదు). 'ఇరుక్కు' అనునది మూలరూపము. వళర్+అ=(పెరుఁగుట). వళర్+అ+ఉమ్=(పెరుఁగఁగలదు). వళర్+క్కు+అ=(పెంచుట) వళర్క్కు+ఉమ్=వళర్కుమ్=(పెంచఁగలదు) (ఇట్టి క్రియానామవాచక రూపములె లేవని ౧౩౨ I విష. వ్రాయఁబడును). 'వళర్క్కు' అనునది మూలరూపము. పయి యుదాహృతుల పరిశీలనమువలన 'గ' కార 'క' కారములకు భావ్యర్థకత్వము లేదనియు నచటి 'క-గ'లు రూపనిర్మాణోపయోగులే కాని భావ్యర్థకములు కావనియు భావార్థక రూపములును భవిష్యదర్థక తద్ధర్మార్థక రూపములును నిట్టి యేక క్రియాంగమునుండి యేర్పడినవె యనియుఁ దమిళములోని భావ్యర్థక రూపములెల్ల మొదటఁ గ్రియానామవాచకములె <u>నై</u> యుండెడివనియు వానికి భావ్యర్థబోధము <u>వాడుకవల్ల</u> వచ్చినదనియు విశదమగుచున్నది. ఇందలి 'కు' అనుదానికి సరిగఁ దెలుఁగున 'చు' అనునది క్రియాజన్య రూపము లన్నిటను గన్పట్టుచుండును" (కాల్డు. ౫౧౬ పుట).

"'ఉమ్' అను భావ్యర్థకమునకుఁ బురుష బోధక ప్రత్యయ మేళనము లేదు. కావుననె యది ధాతుజ విశేషణముగ వాడఁబడుట కనుకూలముగా నున్నది. ధాతుజ విశేషణములకును బురుషలింగ వచనాది భేదములులేవు. తమిళ తద్ధర్మ రూపమగు 'ఉమ్' అనుదానికిని తెల్గు తద్ధర్మ ప్రత్యయమగు 'ను' అనుదానికిని భేదములేదు. తమిళ మందలి 'ఉమ్' అనుదానిలోని 'ఉ' అనునదే మూలరూపము. అది తెల్గులోని 'ను' అనుదానికి సరిపడును. 'ను' అనుదానిలోని 'న' కార ముచ్చారణార్థకము. తెల్గునందును దమిళమందును గల యీ 'ఉ' శబ్దమునకు సముచ్చయమె యర్థము. ఇది <u>భావిభూతవర్తమానములను సముచ్చితములను</u> గావించును గాన నీ 'ఉ' ప్రత్యయము <u>కాలత్రయ వాచక</u>మగును. (చూడు ౧౩౬ III విష.) అట్లయినను దీనియందు భావ్యర్థబోధము విశేషించి లేకపోలేదు. 'మాడు పుల్ తిన్నుమ్'=(ఎద్దు గడ్డి తినును). ఇందలి 'తిన్నుమ్' అనునది భావ్యర్థకము కానేరదు. నిరంతరము నెద్దు గడ్డి తినుననియె యర్థము" (కాల్డు. ౫౧౬, ౫౧౭ పుటలు).

"ఈ భావ్యర్థక తద్ధర్మ విశేషణము భూతార్థక సమాపక క్రియతో నన్వయించునపుడు భూతార్థకమగును. ఉదా:—నాన్ వరుమ్ పొలుదు పోరై కణ్డేన్=నేను వచ్చునపుడు యుద్ధమును జూచితిని. ఇందలి 'వచ్చునపుడు'

అనుదానికి "రాఁగలయపుడు" అని యథాశ్రుతార్థము. అయినను నది 'వచ్చినపుడు' అను భూతార్థమునె బోధించుచున్నది. ఇట్లు భావ్యర్థము భూత ముగా మాఱుట సెమిటిక భాషలను బోలియున్నది."

"గ్రాంథిక తమిళాంధ్ర మలయాళములలో నీ భావ్యర్థక ప్రత్యయము 'ఉమ్' అను రూపముగలదే కాక 'ఉ' అనునదయ్యునున్నది. ఉదా:—తమి-వరు= (రాఁగల). ఉణ్ణు (ణ్ణు?)=(తినఁగల). ప(ర?)ప్పు=(వ్యాపింపఁగల). ఈ యుదాహృతు లవలన 'ఉమ్' అనుదానివలెనె 'ఉ' అనునదియుఁ గ్రియాంగమునకుఁ జేరు ననఁగాఁ బ్రాచీన క్రియా నామవాచకమునకుఁ జేర్పఁబడునని విశదమగుచున్నది. తమిళ వైయాకరణు లీ విశేషణమును 'అల్వాలి'=(ప్రత్యయ రహితము) అని చెప్పు దురు. 'ఉ' కారము సైత మప్పుడప్పుడు లోపించుటచేత వారి కట్టి యభి ప్రాయము కల్గి యుండును. కాని మూలరూపము ధాతు మాత్రముకాక 'ఉ' ప్రత్యయ ఘటితమె యనఁదగును. ఇది మలయాళమందలి యుచ్చారణార్థక మగు 'ఉ' కారమువంటిది కాదు. ఇది 'ఉమ్' ప్రత్యయపు భాగము. 'ఉమ్= ఉ' అను రెండును నభిన్నార్థకములు" (కాల్డు. ౫౧౭ పుట).

"తమిళ భవిష్యదర్థక విశేషణము:—క్రియకుఁ గాని క్రియాంగమునకుఁ గాని 'వాన్-బాన్-ప్పాన్' అనువానిని జేర్చుటచేత నేర్పడు భావ్యర్థక విశే షణము వేఱొకటి. (చూడు ౧౩-౨ I విష). తమిళమందును నంతకన్న విరివిగా మలయాళమందును నియ్యది వెలయుచున్నది. 'పాక్కు' అను నింకొక రూపము తమిళమందు మాత్ర మరుదుగాఁ గలదు. 'వాన్- బాన్-ప్పాన్' ప్రత్యయ ఘటిత వాక్యము తుమర్థక ప్రత్యయ ఘటిత వాక్య మేమో యన్నట్లు తోఁచును గాని యట్లుకాదు. ఉదా:—తమి:—తుమర్థక- కొల్ల ఎలున్దాన్=(చంపుటకు లేచెను)-కొల్వాన్ ఎలున్దాన్=(చంపఁగలవాఁడై లేచెను). 'వాన్-బాన్-ప్పాన్' అనువానిలో నేదోయొకటి యాయా శబ్దముల స్థితినిబట్టి నిల్చును. వెనుకఁ జెప్పిన (౧౩-౨ I విష.) భావ్యర్థక 'వ-బాది' ప్రత్యయముల స్థితిలో వలెనె వీని స్థితిలోని వ్యవస్థ నరయనగును. ఉదా:— వరువాన్=(రాఁగల). ఉణ్ బాన్=(తినఁగల). నడప్పాన్=(నడవఁగల). అను నాసికముమీఁది 'బ' కారము 'మ' కారమగుట యిందుఁ గన్పట్టలేదు. వెనుకఁ జెప్పిన 'వ-బా' ది ప్రత్యయ స్థలమునఁ (చూడు ౧౩-౨ I విష.) గలదు. ఉదా:—ఎన్ బార్=ఎన్మా(న్న?)ర్=(అందురు). ఇట్టి మార్పు మలయాళమునందలి 'బాన్' ప్రత్యయ పరకత్వమునఁ గలదు. తమి - ఉణ్ బాన్=(తినఁగల) మలయా-ఉణ్మాన్. మలయాళమున నిందలి 'వ' కార లోపమును గలదు. ఉదా:—వరువాన్=వరు+అన్=(రాఁగల). 'వాన్-బాన్-ప్పాన్' అను వాని

లోని 'అన్' అనునది మహద్వాచక ప్రత్యయమని సామాన్యముగాఁ దోఁచును. కాని యది యమహద్వాచకము. 'అదు' శబ్ద పర్యాయములగు 'అద్-అమ్-అన్' అనువానిలోని 'అన్' అనునది యుచ్చారణార్థక దీర్ఘమునందఁగా 'ఆన్' అని యేర్పడును. తమిళ కావ్య భాషలోని 'పాన్' అనునది 'పత్తు-పన్' అనువానినుండి యేర్పడినట్లే యిదియు నేర్పడియుండునని గ్రహింపనగును. (చూడు ౧౦౨ I విష). (చూడు సంఖ్యావాచకములు; పది సంఖ్య). కానఁ దమిళమున 'ఇరుప్పాన్'=(ఉండఁగల) అనునది 'ఇరువ్వదు'=(ఉండఁగలది). అనుదానికి సమానార్థకమగు నమహద్వాచి కానోపునని తలంపనగును. కన్నడ-ఇరువదు=(ఉండఁగలది)" (కాల్డు. ౫౧౭, ౫౧౮ పుటలు).

"క్రియాంగమునకును బురుష బోధక ప్రత్యయమునకును నడుమఁ గన్నడ భావిరూపములందును దుళు వర్తమాన రూపములందును 'వ' కారము నిల్చును. ఇవి తమిళ ప్రథమ భావ్యర్థ రూపములను బోలును. తమిళ మందువలెనె కన్నడమందును భావిరూపమున ననిశ్చిత కాలమగు తద్ధర్మార్థ బోధయు గలదు. హాసగన్నడమున నట్లుగాక 'వ' అనునది నియతమగు భావి చిహ్నము. అది బకార ద్విరుక్త పకార రూపముల నందదు. భావ్యర్థకా మహత్ కర్తృక ప్రథమ పురుషైక వచనమున 'ఉమ్' అనుదానిని దమిళ మెరవు తెచ్చికొన్నట్లు కన్నడ భాష తెచ్చికొనదు. ఉదా:—కన్నడ-ఇరువదు=(ఉండఁగలదు). కన్నడమున భావ్యర్థ 'వ' కార ఘటిత మహత్కర్తృక ధాతుజ విశేషణములును గలవు. ఉదా:—బాళువ = బాళ్వ=(బ్రదుకఁ గలవాఁడు) కావుననే కన్నడము తక్కిన ద్రావిడ భాషలకన్న విశాలమైన దనిపించుకొనెను. తుళు భాషయందుఁ బురుష బోధక ప్రత్యయములను జేర్చిన క్రియా నామ వాచకమె భావిరూపము" (కాల్డు. ౫౧౮, ౫౧౯ పుటలు).

"తమిళ కన్నడములందువలెనె తెల్గునందును భావ్యర్థ బోధక తద్ధర్మార్థ రూప మొకటి గలదు. ఆంగ్ల వ్యాకర్తలు దీనిని దద్ధర్మార్థకమె యందురు. ప్రథమ పురుషైక వచనేతర స్థలములలోఁ దెల్గు తద్ధర్మమున 'దు' ప్రత్యయము నిల్చును. ప్రథమ పురుషైక వచనమున 'ను' ప్రత్యయము నిల్చును. ఇది తమిళమందలి 'ఉమ్' అనుదానిని బోలియుండును. ఉదా:—తమి-ఆగుమ్= తెల్గు-అగును=అవును. ఈ తెల్గు 'దు' ప్రత్యయము వర్తమానములోని 'తు' ప్రత్యయమును సంబంధించి యుండవచ్చును. గోండు భాషలోఁ బ్రథమేతర పురుషములందు భావిచిహ్నముగ 'క' కారము చేర్పఁబడును. ఉదా:—ఉన్కీ-క =(పలుకఁగలను). నాగరక తమిళమున నొకప్పుడు గల్గు భావ్యర్థక

మగు 'గ' కార ద్విరుక్త 'క' కారములతో దీనిని బోల్చి చూడనగును" (కాల్డు. ౫౧౯ పుట).

విమర్శము:—ఉమంత సమాపక క్రియా రూపములు తమిళమున సమ హత్కర్తృక ప్రథమ పురుషైక వచనమందు మాత్రమె ప్రయుక్తములగునను దొరగారి వ్రాఁత సరికాదు. మహత్ప్రథమ పురుషైక వచనమునందును వానికిఁ బ్రయోగము గలదని తొల్కాప్పియమందె చెప్పఁబడినది. "తమిళ ప్రామాణిక వైయాకరణు లెవ్వరును 'ఉమ్' ప్రత్యయము భావ్యర్థక 'స' ప్రత్యయ భాగమని చెప్పియుండలేదు" (విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు ౨౨-౧౧-౫౩ జాబు).

మఱియు డా. కాల్డువెల్లుగారు మలయాళమున "నాన్ ఎళుదుమ్=(నేను వ్రాయఁగలను), నీ ఎళుదుమ్=(నీవు వ్రాయఁగలవు)" అని యుండవచ్చునని వ్రాసిరి. "తమిళ కావ్య భాషయందు మలయాళమందువలెనె విరివిగాఁ బుం స్త్రీలింగ కర్తృక బహువచన స్థలములందును 'ఉ' మంత క్రియలకుఁ బ్రయోగము గలదని వ్రాయుట కేవలము పొరపాటు. అట్టి ప్రయోగము తొల్కాప్పియ విరుద్ధము. తుదికి మలయాళమందును మధ్యమ పురుషమున రాదు" (విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు ౨౨-౧౧-౫౩ జాబు).

"పల్లోర్......" (తొల్కా. ౭౧౧ సూ.)=ఉమంత సమాపక క్రియ మధ్యమోత్తమ పురుషములందును మహత్ప్రథమ పురుష బహువచనమునందును బ్రయుక్తము కానేరదు. అనఁగా నమహత్ప్రథమ పురుషైక వచన బహువచనములందును మహత్ప్రథమ పురుషైక వచనమునందును మాత్రమె ప్రయుక్తము కావచ్చునని భావము. ఉదా:—అవన్-(లేక) అవళ్ (లేక) అదు-(లేక) అవై వరుమ్=(వాఁడు వచ్చును-అది వచ్చును-అవి వచ్చును) మొ."

"దేవా నీవు ప్రజలను సృజింతువు=దెయ్వామే నీ ప్రజైగళై చ్చిరుష్టిప్పాయ్; నేను ప్రజలను సృజింతునని చెప్పుదువు=నాన్ ప్రజైగళై చ్చిరుష్టిప్పేన్ ఎన్ఱు చొల్లువాయ్" (శ్రీ. విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు. ౨-౧౨-౧౯౫౩ జాబునకు జవాబు) అనియె యుండును గాని విధ్యర్థకేతర మధ్యమోత్తమ పురుషములందు 'ఉమ్' ప్రత్యయము తమిళ కావ్య భాషలో నుండనేరదు.

"అవఱ్ఱో (ట్రో) డు......" (తొల్కా. ౭౧౯ సూ.)=ఉమంతములు విశేషణములుగా నుండునప్పు డంతటను బ్రయుక్తములు కావచ్చును. ఉదా:—

యాన్ ఉణ్ణుమ్ ఊణ్ =(నేను భుజించు భోజనము). యాన్ చేయ్యుమ్ వేళై =(నేను జేయుపని). యామ్ చెయ్యుమ్ పణి=(మేము చేయు పని).

భావ్యర్థక ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయాంత సమాపక క్రియా రూపముల పైని గాలక్రమమున నందలి సమాపక క్రియార్థ విస్మృతిచే వ్యవహర్తలు పురుషబోధక ప్రత్యయములను నిల్పుట సమాపక క్రియల ద్వితీయావస్థ యని దొరగారును నంగీకరించి వ్రాసియున్నారు (చూడు ౧౩_౨ I విమ.). అట్టియెడల 'కు' ప్రత్యయమునకుఁ గల భావ్యర్థ బోధకతా ప్రసిద్ధి మాసిపోవుటచేత నది ధాత్వవయవముగా నెన్నఁబడుచు వచ్చియుండును. అట్లగుటంజేసి కొన్ని 'కు' ప్రత్యయాంత ఘటితములగు వర్తమాన భావికాల సమాపక క్రియా రూపములును నట్టి 'కు' ప్రత్యయ ఘటిత భావార్థకాది కృదంత రూపములును నవతరించి యుండును. ఇట్టి స్థితిలో నట్టి 'క-గ' ఘటిత క్రియా నామవాచకముల నొక కొన్నిటిని జూపి భావ్యర్థక సమాపక క్రియలెల్ల మొట్టమొదటఁ గ్రియా నామవాచకములె యైయుండునను నపసిద్ధాంతమును దొరగారు గల్పించుట కేవలము నన్యాయ్యము కాదా? ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయ సంబంధి 'క' కార మలంతి క్రియా నామవాచకములలోమాత్ర ముండును. వర్తమాన భావ్యర్థక సమాపక క్రియలన్ననో యన్నిటను నతిప్రచురముగ సర్వధాతు సామాన్యముగా నిల్చును. అట్టి స్థితిలో నేవో యలంతి భావార్థకములందున్న 'క' కారములను జూపి భావ్యర్థక సమాపకము లెల్లఁ గ్రియా నామవాచకముల నుండియే యేర్పడెననుట కేవలము నసంగతము. 'వ-బ' మున్నగు భావ్యర్థక క్రియలలోని ప్రత్యయములు క్రియా నామవాచకములలో నిల్చుట మఱియు నసంభవము. కావుననే కదా యట్టి ప్రాచీన క్రియా నామవాచకముల కెచ్చటను బ్రత్యేక ప్రయోగము లేదని దొరగారు వ్రాసికొనవలసెను. ఇట్టి స్థితిలో భావ్యర్థక సమాపక క్రియలెల్ల మొదటఁ గ్రియా నామవాచకములెయై యుండెడివనుట యెట్లు పొసఁగును? మఱియుఁ గ్రియా నామవాచకము పైని బురుషబోధక ప్రత్యయములు నిల్చుటచేత భావ్యర్థ బోధ మెట్లు లభించును? (చూడు ౧౩_౨ I విమ. ౧_౨_౨ V విమ).

దొరగారు ముందు భావార్థక ప్రత్యయము 'అ' అనునదె యని సిద్ధాంతీకరింపఁ దలఁచి యున్నారు గాన (౧౩౭ I విమ. చూడు) "పోగ=(పోవుట) పోక్క=(పంపుట) ఇరుక్క =(ఉండుట) వళర్క్క = (పెంచుట)" మున్నగునవి భావార్థక రూపములని వ్రాయుదురే కాని నిజమున కట్టి భావార్థక రూపముల కును బ్రయోగములు ప్రాచీన తమిళ వాఙ్మయమందుఁ గాని తొల్కాప్పియ మందుఁగాని లేవు. ఇంకనట్టివి ప్రాచీనతమ కాలమున నుండెడివని యూహింప

వలయునందు రేమో? అట్లూహించునపుడు నిజముగాఁ బ్రాచీన వాఙ్మయమున నగపడుచున్న 'పోకై (గై)' మున్నగు రూపములె ప్రాచీనతమ కాలమున నుండెడివని యేల యూహింపరాదు.

ఈ సందర్భమున శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారీ క్రింది రీతిని వ్రాసియున్నారు.

"పోగై=పోగుగై=(పోవుట). పోక్కుగై=(పంపుట). ఇరుక్కై=(ఉండుట)" ఇట్టి రూపములు గలవు. ఇట్టివి వ్యవహారమున సాధారణముగా లేవనవచ్చును" (౨౨-౧౧-౧౯౫౩ తేదీ జాబునకు జవాబు).

తెల్గున 'చు' ప్రత్యయము క్రియాజన్య రూపములం దనఁగాఁ గ్రియా జన్య నామములందు వచ్చునకేని చూపట్టదు. కావుననేకదా దొరగా రట్టి యుదాహృతులఁ జూప యత్నింపరైరి.

'ఉమ్' ప్రత్యయము క్రియకుఁగాక క్రియాంగమునకుఁ బరముగా నిల్చు నందురు కాని పయి నుదాహరించినరీతిని బ్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయము నకు మాత్రమె పరమందు నిల్చును, తక్కిన యంతటను ధాతువుపైనె నిల్చును. డా. కాల్డువెల్లుగారు చూపిన వ్యుత్పత్తి చొప్పున సముచ్చయార్థకమగు 'ఉమ్' ప్రత్యయము తద్ధర్మ తచ్ఛీల సాతత్యాదులగు నలంతిస్థలములందుఁ గాలత్ర యమును సముచ్చితము గావించుచున్నను దక్కినయంతటను సామాన్యముగా భావితో వర్తమానమును మాత్రమె సముచ్చితము గావించుచున్నది. భావి వర్తమానములకు సాంకర్యము సహజమె కదా. కావుననె 'ఉ' మంతముల స్పష్ట భావ్యర్థకము లనిపించుకొనుచున్నవి.

తమిఴమందలి 'ఉమ్' ప్రత్యయమునకుఁ దెల్గులోని 'ను' ప్రత్యయ మభిన్నమను దొరగారి యాశయము సరికాదు. అట్టి స్థలములందలిది 'ను' కాదనియు 'ఉన్' ప్రత్యయమనియు నయ్యది తమిఴమందలి 'ఉమ్' ప్రత్యయ మున కభిన్నమనియుఁ జెప్పినచో నర్థసామ్యమేకాక యాకార సామ్యమును, గల్గునుగాన మిక్కిలి యుక్తమై యుండును. మఱియు నందలి నకార ముచ్చార ణార్థక మను నపసిద్ధాంతమును నాశ్రయింప నక్కఱలేదు. (చూడు ౨౮ IV విష). ౨౮ IV మొ. ౨౫ VIII విష. వఱకుఁగల గ్రంథమెల్లఁ దమిఴ 'మ' కారము తెల్గులోని ద్రుతమువంటిదని నిరూపించునదె యైయున్నది. తమిఴ మందలి పరపరుషద్విత్వానునాసికాగమాది సంధికార్యములెల్లఁ దమిఴ పదాం తిమ 'మ' కారము దెల్గు ద్రుతమున కభిన్నమనియె నిరూపించును.

తెలుగుధాతువులెల్ల సాధారణముగా 'ఉ' కారాంతములై యగుటచేత నీ 'ఉన్' ప్రత్యయముయొక్క 'ఉ' కార మట్టిధాతువు తుది 'ఉ' కారములో సంధివశమున లీనమగుటచేత నయ్యది 'ను' ప్రత్యయమను భ్రాంతి దొరగారికిఁ గల్గియుండును. 'ఉమ్' ప్రత్యయభాగమగు 'మ్' అనునది 'ఉమ్' ప్రత్యయార్థకమె. క్రియా సమాసమున 'ఉమ్' ప్రత్యయము సాకల్యముగా లోపించినను నచటి సమాసశక్తిచేత (వినై త్తొగై = క్రియా సమాసము) నచట 'ఉమ్' ప్రత్యయార్థము భాసించుచుండును.

"అవట్రు (ట్రు) ళ్......" (తొల్కా. ౭౨౨ సూ.)=అట్టి క్రియాజన్య విశేషణములలోని 'ఉ' మంతముల యుపధాభూతమగు 'ఉ' కారము లోపించుట యరుదుగఁ గలదు. ఉదా:—వావుమ్ పురవి=వామ్ పురవి=(వాఁటునట్టి గుఱ్ఱము). ఆగుమ్ కాలమ్=అక్కాలమ్=(వృద్ధి గల్గు కాలము) (ఆగు=వృద్ధియగు).

" 'చెయ్యుమ్ పణి=(చేయునట్టి పని)' అనునది సమాసమున (వినై త్తొగై = క్రియా సమాసము) 'చెయ్‌పణి' అనియు 'ఉమ్' ప్రత్యయలోపమున నేర్పడ వచ్చును" (తొల్కాప్పి. వాఖ్య) (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు).

"మున్నిలై......" (తొల్కా. ౭౨౮ సూ.)=మూఁడుకాలములందును నుండెడి స్వభావముగల వస్తువులను జెప్పునపుడు వర్తమానవాచియుఁ ద్రికాలవాచియు నగు 'ఉ' మంతక్రియను వాడవలయును. ఉదా:—తిజ్గళ్ ఇయజ్గుమ్=(చంద్రుఁడు తిరుగును). మలై నిఱ్కుమ్=(కొండ నిల్చి యుండును). నిగళ్ కాలమ్=(వర్తమానకాలము). ఇఱన్దకాలమ్=(భూతకాలము). వరుక్కాలమ్=(భావికాలము).

"నాన్ వరుమ్ పొలుదు పోరై క్కణ్డేన్=(నేను వచ్చునపుడు యుద్ధమును జూచితిని)". అనుచోట 'నేను వచ్చినపుడు' అని భూతార్థక విశేషణమును వాడినను వాడవచ్చును. ఇంతకన్నను విచిత్రములగు ప్రయోగములు తొల్కాప్పియమునఁ జూపఁబడెను.

"చెయ్‌దు......" (తొల్కా. ౭౨౩ సూ.) = 'చెయ్‌దు' అనురీతిగల క్త్వార్థక క్రియ భావియందు వచ్చుటయుఁ గలదు. ఉదా:—ఉణ్డు వా=భుజించి రమ్ము. ఇఁకముందు భుజించి రమ్మని యర్థము.

"ఇఱప్పే......" (తొల్కా. ౭౩౧ సూ.)=భూతమున భావియు భావిని భూతమును వచ్చును. ఉదా:—భూతమున భావి:—ఇవర్ పణ్డు ఇచ్చో లైయిల్ విళై యాడువర్=(వీరు మునుపీ యుద్యానమందుఁ గ్రీడించెడివారు). భావిని భూతము:—నాళై అవన్ వాళోడు వన్దాన్; నీ ఎన్ సెయ్‌వాయ్=(రేపు వాఁడు కత్తితో వచ్చె (అనుకొమ్ము); నీవేమి చేయఁగలవు).

"గ్రాంథిక తమిళ మలయాళాంధ్రములలో నీ భావ్యర్థక ప్రత్యయము 'ఉమ్' అనునది కాక 'ఉ' అనునదై యున్నది. ఉదా:—వరుమ్=వరు. ఇట్టి 'వరు' అనుదానివంటివానిని 'అల్వాటి' అని తమిళ వ్యాకర్తలు వ్యవహరింతు" రనెడి దొరగారి వ్రాతసరికాదు. 'ఉమ్' ప్రత్యయములో 'మ' కార లోప మెచ్చటను వచింపఁబడలేదు. అట్టి ప్రయోగములును లేవు. 'వర్+ఉమ్+కాలమ్=వరుఙ్గాలమ్' అని యగును. దీనికి సమాసమందు (వినైత్తొగై = క్రియాసమాసము) 'ఉమ్' ప్రత్యయమునకు సామాసిక లోపము కల్గఁగా 'వర్+కాలమ్' అనురూపము సిద్ధించును. 'తమిళమున హ్రస్వముమీఁద 'ర్-ల్' అను పొల్లులు నిల్వవుగాన 'వరు' అనురూపము నిల్చును. కన్నడ మున 'వర్' అనియే నిల్చును. విభక్తి సాకల్యముగా లోపించుటచేతనే వైయాకరణులు దానిని 'అల్వాటి సంధి (విభక్తీతర సమాస సంధి) యందురు. షష్ఠీసమాస సంధికి 'వేట్రు (ట్టు) మై' సంధి యనియుఁ దద్భిన్నములకు 'అల్వాటి' సంధి యనియుఁ దమిళ వ్యాకర్తల వ్యవహారము. "'అవన్ నాళై వరుమ్'=(వాఁడు రేపు రాఁగలఁడు)" అనుచోట గ్రియాసమాసము లేదుగాన "అవన్ నాళై వరు" అనుట తప్పు. "ఉమ్" అనుదానికి 'ఉ' అనురూపాంతరము లేదు. 'వరు' అని న్యస్తరూపములేదు." (౨-౧-౨-౧౯౫౩ తేదీ శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారి జవాబు).

తెల్గునందలి తద్ధర్మార్థకమగు "ఉన్=(తమి-ఉమ్)" ప్రత్యయము సమాపక క్రియలలోఁ బ్రథమ పురుషైకవచనమున మహ దమహత్సాధారణముగా నిల్చును. అమహద్బహువచనమునందును నిల్చును. ఇంతవఱకుఁ దమిళ పద్ధతికి భేదము లేదు. ఇంకఁ దెల్గున సమాపక క్రియలందు సంధిలో ద్రుత లోపము హల్పరకత్వమునఁ గొన్నియెడల సంభవించును. ఉదా:—వాఁడు వచ్చున్—అది వచ్చున్-అవి వచ్చున్. వాఁడు వచ్చు నెప్పుడు-వాఁడు వచ్చుఁ గదా. వాఁడు వచ్చు వేగముగా. వాఁడు వచ్చున్ వేగముగా. ఇంకఁ దద్ధర్మార్థక విశేషణములకుఁ దెల్గున సమాసము నిత్యముగాన 'ఉన్' ప్రత్యయ మునకు సామాసికలోపము గల్గును. విశేష్య మజాదియై యున్నను 'ఉన్' ప్రత్యయము లోపించుననుట యుక్తము. కాని సంధిలో నచట 'ఉన్' నిల్చి యున్నదేమో యను భ్రాంతి కల్గునట్లు 'న' కారము స్పష్టార్థ ప్రతిపత్తికయి భాసించును. ఉదా:—వచ్చునతఁడు=వచ్చువాఁడు.

ప్రాచీనాంధ్ర వ్యాకర్తయగు నన్నయ 'ఉన్' అనుదాని స్థితిని దెల్పు సాధారములు తోఁపమింజేసి యట్లు నిరూపింపలేదు. ప్రక్రియా లాఘవమున కయి "ప్రథమైక వచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్" అని

ప్రథమ పురుషైకవచన లోపమును విధించి యా రూపము ధ్రుతప్రకృతిక మని వచించెను.

డా. కాల్డువెల్లుగారు కన్నడమందలి 'గుమ్' ప్రత్యయమును మనసున నుద్దేశించి కావలయును పలుగన్నడమందును దద్ధర్మార్థకము కలదని వచించిరి. (చూడుము ౧౨౮ IV విభ). కన్నడ 'గుమ్' ప్రత్యయము తమిళాంధ్రము లందువలెఁ గాక కన్నడమున మహ న్మహ త్త్యమహత్సాధారణముగాఁ బ్రథమ పురుష వచనద్వయమునందును వర్తించుట విశేషము.

కన్నడమున భావ్యర్థక ధాతుజ విశేషణరూపము లేదని వెనుక వ్రాసియు నయ్యది కలదనుచు నిట 'బాళువ-బాళ్వ' అను భావ్యర్థక ధాతుజ విశేషణముల దొరగా రుదాహరించుట వింత!

తెలుఁగు తద్ధర్మార్థక సమాపక క్రియారూపములలోఁ బ్రథమ పురుషైక వచనేతర స్థలములందు 'దు' ప్రత్యయము నిల్చునని యథార్థముగనే వ్రాసి దొరగా రయ్యది వర్తమానార్థమందలి 'తు' ప్రత్యయమును సంబంధించుచున్న దని వ్రాయుట సరికాదు. "చదువుతున్న" మున్నగువానిలోని 'తు' ప్రత్య యము ప్రాచీన ద్రావిడ 'కు' ప్రత్యయమూలక 'చు' ప్రత్యయమునుండి యేర్పడినది. తద్ధర్మార్థక 'దు' ప్రత్యయమన్ననో ప్రాచీన ద్రావిడ భూత భావ్యర్థక 'తు=దు' ప్రత్యయమూలకము. (చూడుము ౧౩౦ III విభ).

తమిళమందలి "'వాన్-బాన్-ప్పాన్' అనువానిలోని 'ఆన్' అనునది మహద్వాచక ప్రత్యయమని సామాన్యముగాఁ దోఁచునుగాని యది యమహ ద్వాచకము......ఇరుప్పాన్ = ఇరుప్పదు=(ఉండఁగలదు)" అని (కాల్డు. ౫౧౭-౫౧౮ పుటలు) దొరగారు వ్రాయుట సరికాదు. తమిళ గ్రాంథిక భాషలో మహద్వాచక భావ్యర్థక విశేషణములు గలవని యపవాదముగా దొరగా రంగీకరించిరిగదా (చూడుము ౧౩౨ I విభ).

"ఇరున్దాన్=(ఉండినవాఁడు)......'ఇరుప్పాన్' అను 'పాన్' తుదినిగల శబ్దమునకు 'ఉండన్' అనియే యర్థము. 'ఉండఁగలదు' అను నర్థము లేదు" (విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు ౨-౧౨-౧౯౫౩ తేది జాబునకు జవాబు).

౧౩౨. III విభ:—"స్పష్టతర భావ్యర్థకము:—హాళెగన్నడమున నిది ద్వితీయ భావ్యర్థక మనఁ దగియున్నది. స్పష్టతమ భావ్యర్థక మనఁబడెడి ప్రథమ భేదరూపములకున్న ప్రయోగప్రాచుర్యము వీనికి లేదు. క్రియాంగమునకును బురుషబోధక ప్రత్యయమునకును నడుమ "ఇయ్, ఈ-ద్" అనునవి నిల్వఁగా నవ్యవహిత పరస్వరమునకు దీర్ఘము వచ్చుటచేత నీరూపములేర్పడును. ఉదా:—

కన్న - మాడ్+ఇయ్+ఎను=మాడ్+ఇయ్+ఏను=మాడియేను=(చేయఁ గలను). ఇట్లే-నుడిదేను=(పలుకఁగలను). 'ఇయ్, ఈ-ద్' అను కన్నడ ప్రత్యయములకు మాఱుగాఁ దెల్గునందును రెండు భావిప్రత్యయములు గలవు. I. చేయు+ఏ+ను=చేసేను (నేను). II. చేయు+ఈ+ని=చేసీని=(అవి చేయఁగలవు). 'ఎద' అనుదానిని జేర్చుటవలనఁ దెల్గున రెండవ భావిరూప మేర్పడును. కాని దీని ప్రయోగము మిక్కిలి యరుదు. ఉదా:—చేసెదను. మహత్ ప్రథమ పురుషైకవచనమునందును నమహత్ప్రథమ పురుషైక వచన బహువచనములందును 'ఎద'కు మాఱుగా 'ఎడి' నిల్చును. ఉదా:— చేసెడిని=(చేయఁగలడు-చేయఁగలదు-అవి చేయఁగలవు.)" (కాల్డు. ౫౧౯ పుట).

విమర్శము:—హళగన్నడ వ్యాకరణమున సంభావనార్థకముల నెడి రూపములు వివరింపఁబడినవి. దొరగారు వానిని సరిగ నిరూపింపఁ జాలరైరి. అట్లే తెల్గులోని రూపద్వయ ప్రదర్శనమునందును బ్రమాదపడిరి.

౮౮. సూ:—"ధాతువినమేలె సంభావనార్థద ఆఖ్యాత ప్రత్యయగళు సేరిదరె సంభావనారూప క్రియాపదగళాగువవు." (సంభావనె యందరె క్రియె నడెయు వదరల్లి స్వల్ప సంశయ తోరువదు......మాడ్యాను-కొట్టేను-మొద లాదువుగళన్ను ఇదరంతెయె తిళియతక్కద్దు).

౮౯. సూ:—"ధాతుగళిగె సంభావనాప్రత్యయగళు సేరువాగ నడువె 'ద' ఎంబ వికరణప్రత్యయ బరువదు" (హళగన్నడ వ్యాకరణ. శబ్దాదర్శ).

ఉత్తమ పురుషములగు "ఏను-ఏవు" మున్నగు సంభావనార్థక ప్రత్యయములు ధాతువులకుఁ బరముగఁ జేరునపుడు వాని నడుమ 'ద' ప్రత్యయము నిల్చును. (సంభావనార్థ మనఁగాఁ గ్రియార్థభానమున నించుక సంశయము తోఁచుట)......మాడ్యాను = (చేసేను - నేను) మున్నగునవియును నిందుఁ దెలియనగును" అని పై కన్నడ సూత్రాదులకుఁ దాత్పర్యము:—

"ఉత్తమపురుషము—(ఏ) నుడిదేను. (బ) నుడిదేవు (నుడి=పలుకు) మధ్యమ పురుషము—(ఏ) నుడిదీయె. (బ) నుడిదీరి. ప్రథమ పురుషము—(ఏ) నుడిదాను. (బ) నుడిదారు" (హళగన్నడ వ్యాకరణ శబ్దాదర్శ. ౮౯ సూ. ఉదాహృతులు ౩౯, ౪౦ పుటలు). ఇవి తెల్గులోని 'పల్కుతాను-పల్కుతాము' మున్నగు వ్యావహారిక రూపములకు సరియగు రూపములనఁ దగును.

దొరగా రుదాహరించిన 'నుడిదేను' అనునది పై రూపములలోని 'నుడిదేను' అను నుత్తమ పురుషైకవచన రూపమె. ఇంక దొరగారి "మాడి

యేను" అను నుదాహృతి పై నుదాహరించిన 'మాడ్యాను' అనుదాని పూర్వ రూప మనఁదగును. దొరగారు కన్నడ వ్యవహార రూపములను సరిగాఁ దెలిసి కొనక పై రీతి నేదోయొక విధముగ వ్రాసిరని కన్నడ దేశీయ పండిత రచిత మగు పై హళాసగన్నడ వ్యాకరణ గ్రంథమునుబట్టి విశదమగుచున్నది. మఱియు "నుడిదేను-మాడియేను" అను రూపములను దొరగారు భావ్యర్థకము లనిరి గాని యవి తద్ధర్మార్థభేద సంభావనార్థకములనుట యర్థము.

ఇంక దొరగారు చూపిన తెల్గులోని "చేసేను-చేసీని" అను రూప ద్వయము వారన్న రీతిగఁ బై హళాసగన్నడ సంభావనారూపములకు సరియగు నది కాదు. వీని విషయమున డా. కాల్డువెల్లుగారు బొత్తిగాఁ బ్రమాదపడిరి. వీనిని సైతము దొరగారు భావిరూపములె యందురు గాని వీనిని సైతము తద్ధర్మార్థకము లనుటయె యర్థము. వీనిలోని 'చేసేను' అనునది తెల్గు గ్రాంథిక రూపమగు 'చేసెడున్' అనుదాని వికృతి యనఁదగునుగాని యది తెల్గు వ్యవ హారమునఁ బ్రథమ పురుషరూపమై యున్నది. కాల్డువెల్లుగారు దానికి 'I will do' అని యుత్తమ పురుషార్థమును జూపియున్నారు. 'చేసేను' అను నుత్తమ పురుషరూపము తెల్గు వ్యవహారమునఁ గలదు గాని యది "చేసినాఁ డను=చేసినాను=చేశాను=చేసేను" అను పరిణామక్రమము గలదగుటచేత నది దొరగారు వ్రాసిన రీతిని భావ్యర్థక మనికాని తద్ధర్మార్థక మనికాని చెప్పుట తప్పు. ఇంతియకాక కాల్డువెల్లుగారు 'చేసెడిని' అనుదానిని మాత్రమె భావ్యర్థ కముగా 'ఎద' రూపవివరణ సందర్భమున నుదాహరించుట నరయఁగా వీరు 'చేసెడున్' అను గ్రాంథిక రూపమున్నదని తలంపలేదనియే తోఁచకమానదు.

'చేసీని' అనుదాని ప్రకృతియనఁదగు 'చేసెడిన్' అనుదానికి "అవి చేయును=అవి చేయఁగలవు=They will do" అను నర్థము ప్రచురమై యున్నను దాని వికృతియనఁదగు 'చేసీని' అనునది మున్నగునవి యీ క్రింది రీతిని దెల్గున వాడఁబడుచున్నవి. "వాడేపాటి చేసేను=చేసీని, వీడి కేపాటి లాభించేను=లాభించీని. ఆ గురు వేపాటి చెప్పేను=చెప్పీని, ఈ శిష్యున కేపాటి వచ్చేను=వచ్చీని." మొ.

డా. కాల్డువెల్లుగారు "దు" ప్రత్యయాంత తద్ధర్మార్థక రూపములను 'ఉమంత' తమిట రూపసందర్భములోను, 'ఎద' ప్రత్యయాంతాంధ్ర తద్ధర్మరూప ములను హళాసగన్నడ సంభావనార్థక రూపప్రదర్శన సందర్భములోను (స్పష్ట తరభావిరూప) వివరించుటలో వారి యభిప్రాయమేమో తెలియకున్నది. కాని తెల్గున "ఎద" ప్రత్యయాంతములును 'దు' ప్రత్యయాంతములును దద్ధర్మార్థకము లనియే వైయాకరణ సిద్ధాంతము. 'ఎద' ప్రత్యయాంతములయు 'దు' ప్రత్య

యాంతములయు నర్థవివరణ విషయమున నాంధ్రభాషా భూషణకర్తయగు మూల ఘటిక కేతనామాత్యుఁడే ప్రమాదపడియుండ వైదేశికులగు కాల్డువెల్డుగారు తడఁబడుటలో వింత యేమున్నది? (చూడు 'చిం. పరి' ౫౮ మొ. ౬౪ విష. "వ్యా. సం." ౩౦_౨ విష.)

"ఎద-ఎడి-ఎడు-దు-ఉను" అను ప్రత్యయములు తుదినిగల పదములు తద్ధర్మార్థకము లనుటయే తెల్గు సంప్రదాయము. అందు 'దు' ప్రత్యయము ప్రాచీన ద్రావిడ 'దు' ప్రత్యయమును సంబంధించునదై యున్నది. 'ఎద' ప్రత్యయ చరిత్రమును డా. కాల్డువెల్లుగారు స్పృశింపలేదు. అదియుఁ బ్రాచీన ద్రావిడ 'దు' ప్రత్యయసంబంధియే యని తోఁచును. 'చేస్తాను-చేస్తాము' మున్నగు వ్యావహారికాంధ్ర రూపములు దీనినుండి యేర్పడినవే యేమో? లేదా యవి యాత్మార్థక 'తా' శబ్దసంబంధులో? హాసగన్నడమందలి మాడు త్తేనే = (చేయుచున్నాను) మున్నగువాని 'త్తే' అనునది "ఉతుం - ఉత్తుం" మున్నగు కన్నడ వర్తమాన ప్రత్యయమూలక మనఁదగును. తెల్గులోని "చేసెదను=చేయుదును" అను ద్వివిధరూపములును సమానార్థకము లనఁగాఁ దద్ధర్మార్థకములె.

చ-ఇదె ప్రళయాగ్నివోలె దెసలెల్లను గప్పుచు విస్ఫులింగముల్ । వద లక వాయుసారథి జవంబున దానిట వచ్చె నేమి సే । యుదు సుతులార యీ బిలము నొయ్యన పోయి చొరుండు దీనిఁ గ । ప్పెద ఘనపాంసు జాలమున భీమశిఖావళి దాఁకకుండఁగన్. (భార. ఆది. ౮. ఆ. ౩౦౫ ప.)

'ఎద' రూపమునుండియే 'ఎడి-ఎడు' అనునవి యేర్పడి యుండుననియుఁ దోఁచును. పై రీతి నీ తద్ధర్మార్థక రూపములు ద్వివిధములు.

I. 'దు' ప్రత్యయాంతములు—

| | ఏక. | బహు. |
|---|---|---|
| ఉత్త. | చదువుదున్. | చదువుదుము. |
| మధ్య. | చదువుదువు. | చదువుదురు. |
| ప్రథ. | చదువున్<br>చదివెడున్<br>చదివెడిన్ | చదువుదురు—మహత్ కర్తృక.<br>చదువున్<br>చదివెడున్<br>చదివెడిన్ } అమహత్కర్తృక. |

II. 'ఎద' ప్రత్యయాంతములు—

| | ఏక. | బహు. |
|---|---|---|
| ఉత్త. | చదివెదన్. | చదివెదము. |
| మధ్య. | చదివెదవు. | చదివెదరు. |
| ప్రథ. | చదువున్ | చదివెదరు—మహాత్క ర్తృక. |
| | చదివెడున్ | చదువున్ |
| | చదివెడిన్ | చదివెడున్ } అమహాత్క ర్తృక. |
| | | చదివెడిన్ |

౧౩౭. IV విష:—"ద్రావిడ భావికాల చిహ్నములకు భాషాంతరముల సంబంధములు:—ద్రావిడభాషలలో సన్నిటికంటెను విరివిగా వాడఁబడు తమిలు కన్నడ తుళు భాషలలోని భావిచిహ్నము 'వ' కారమె. కొన్ని గౌడభాషలలో 'బ' కారమువంటి యుచ్చారణముగల 'వ' కారమె భావిచిహ్నమగుట వింత. ఉదా:—బెంగాలీ-రాకిబ=(రక్షింపఁగలను)=ఉరియా-రాకిబి=భోజపురీ హిందీ-రాఖబ్. మీాక్స్‌ముల్లరు దొరగారు లాటిను చిహ్నములగు 'బ్-బొ' అను వానితోఁ బయి గౌడభాషల 'బ' కారమును ముడిఁబెట్టిరి. కాని లాటిను భాషలోని 'బొ' అనునది యస్త్యర్థబోధకమగు నొక ప్రాచీన క్రియయొక్క లుప్త శేషరూపము. ద్రావిడ భూతార్థక 'ద' కారమునకును నిండో యూరపి యను భాషలలోని భూతార్థక 'త' కారమునకును సంబంధము గలదన్నట్లె వీనికిని సంబంధముండిన నుండవచ్చునేమో కాని నాకుమాత్ర మట్లు సంబంధ మున్నట్లు తోఁచదు. ఈ ద్రావిడ 'వ' కారమునకు 'ఉగ్రియను' భాషల 'వ' కారముతో సన్నిహిత సంబంధ ముండవచ్చును. ఫిన్నిషు భాషలో 'వ' కారము భావ్యర్థక విశేషణ చిహ్నము. దానిని భావికాలపు సమాపక క్రియల రూపనిర్మాణమున సహాయక్రియగా నుపయోగింతురు. ఉదా:—ఫిన్నిషు-ఒలెవ=(ఉండఁగల). ఒలివన్=(ఉండఁగల్గి యుండుట). ఇది భావ్యర్థక భావార్థకరూపము. దీనిని దమిల భావ్యర్థక విశేషణమగు 'వాన్' అను దానితో సరిపోల్చి చూడఁగును. (చూడు ౧౩౭ II విష.). హంగేరియను భాషలో 'వో' అనునది భావ్యర్థక క్రియాజన్య విశేషణ ప్రత్యయము. ఉదా:—లేవో=(ఉండఁగల). ఫిన్నిషు భాషలోని 'ఒలెవ' అనుదానిని దీనితో సరిపోల్చి చూడనగును. 'వ-బ-ప' లచే బోధ్యములగు ద్రావిడ భావిరూప ములు నేననుకొనుచున్నట్లు క్రియా నామవాచకములై యగుటయు నట్టి 'వ-బ' లు రూపనిర్మాణోపయోగమాత్ర ప్రయోజనిక ప్రత్యయవిశేషములై యగుటయు నిజమైనయెడల నిండో యూరపియను సిథియను భాషలయు నిండో

యూరపియను ద్రావిడభాషలయొుఁ బోలికలు కేవలము యాదృచ్ఛికములై యనక తీరదు" (కాల్డు. ౫౧౯, ౫౨౦ పుటలు).

విమర్శము:—ప్రాచీనతమకాల సంబంధవశమున ద్రావిడ భూత 'త' కారముతో నిండో యూరపియను భూత 'త' కారమునకు సంబంధమున్నట్లె యీ భావి ప్రత్యయములకును సంబంధముండిన నుండవచ్చునని చెప్పిరేకాని యట్టి సంబంధముగలదని నాకుఁ దోఁచదనుట యేమి యుక్తి? ఇండో యూరపియను భాషల పోలికలు సిధియను భాషలకును ద్రావిడ భాషలకును నుండిన నుండుఁగాక. వాని నంగీకరింపకుండుటేల? భావి క్రియలు క్రియా నామ వాచక మూలకములను లేనిపోని సిద్ధాంతము నిట్లు సాకుచెప్పుటకే దొరగా రంగీకరించిరని తోఁచుచున్నది. ఆ పక్షమునమాత్రము వాని పోలికలు తప్పవుగదా. ఇంక నూరకయె యవి యాదృచ్ఛికములనుటకంటె గతి యేమున్నది?

౧౩౩. విష.—"కాలముల సమ్మేళనము:—సకర్మకక్రియల రూపముల మీఁద "ఉండు" ధాతురూపములను జేర్చుటచేతఁ గ్రియా కాలసమ్మేళనము గల్గును. ఉదా:—చేయుచుంటిని. కాపాడుచుంటిని. చేసియుంటిని. చేసి యుందును. ఈ కడపటి రెండు రూపములును 'దుళు-గోండు' భాషలలో సైత మిట్లే యేర్పడును" (కాల్డు. ౫౨౦ పుట).

"పయిరీతిని ద్రావిడభాషలలో నెన్నియేని సహాయక్రియలు ముఖ్య క్రియలయొక్క 'తు' మర్థక రూపములతోను నితరములగు సమాపక క్రియా రూపములతోను గలసి ప్రయోగింపఁబడుచుండును. అట్టి సమ్మేళన మాయా భాషల వాడుకలను సంబంధించి యుండును" (కాల్డు. ౫౨౦ పుట).

౧౩౪. I విష : — ధాతుజ విశేషణములు : — "ద్రావిడభాషలలో సంబంధార్థక సర్వనామములు లేమింజేసి వానిచోట నెల్ల ధాతుజ విశేషణములై వాడఁబడును. అట్టి ధాతుజ విశేషణములు విశేష్యపరకములయియే యుండును. అట్టి విశేషణమునకు ముందుఁ దత్క్రియాసంబంధివాచక ముండును" (కాల్డు. ౫౨౦, ౫౨౧ పుటలు). (నేను జదివిన పుస్తకము మున్నగుచోటు లందుఁ బై నియమములను సమన్వయించుకొనునది. ఏ పుస్తకమును నేను జదివితినో యా పుస్తకమని యీ వాక్యమున సంబంధార్థము నరయునది).

"గౌడభాషలలో సంబంధార్థక యచ్ఛబ్దజన్యరూపములు గలవుగాని వాని వాడుక యరుదు. ఇందులకు ద్రావిడభాషల పరోక్ష సంబంధప్రభావమో? మఱికొన్ని వాడుకభాషల ప్రభావమో? కారణమై యుండును. గౌడభాషలలో సంబంధార్థక విశేషణఘటిత వాక్యములు రెండు ఖండములై యుండును.

ఉదా:—“నిన్న నే మనుష్యుఁడు వచ్చెనో వాఁడు మరల నేఁడు వచ్చెను” అను నర్థముగల వాక్యము గౌడభాషలలో “నిన్న నొక మనుష్యుఁడు వచ్చెను. వాఁడు నేఁడు మరల వచ్చెను” అను రీతిగ నుండును. ద్రావిడభాషలలో సైత మిట్టివాడుక గలదుగాని యది శీఘ్రసంభాషణములో మాత్రము గన్పట్టును. ద్రావిడభాషలలో ధాతుజ విశేషణములందు సంబంధ సర్వనామార్థబోధకతాశక్తిగల నిర్దేశక సర్వనామాంశ ముండును. (చదువు+ఇన్+అ = చదివిన). కావున నీ భాషలలో నిండో యూరపియను భాషలందువలె సంబంధ సర్వనామ ఘటితవాక్యమునకుఁ (యత్తచ్ఛబ్దాన్వయ వాక్యమునకు) బ్రసక్తియే లేదు. ఉదా:- తమి-భూత-వన్ద ఆళ్ =(వచ్చిన స్త్రీ=ఎవతె వచ్చెనో యామె.) వర్త-వరుగిఱాళ్= (ఎవతె వచ్చుచున్నదో యామె.) భవిష్య-వరుమ్+ఆళ్=(ఎవతె రాఁగలదో యామె).”

“ఇట్టి ధాతుజ విశేషణములకుఁ దమిళమున “పెయరెచ్చమ్” అని పేరు. పేరునకుఁ గొఱఁత=లేదా-పేరిని బూర్తి చేయుట యని దానికర్థము. ఇతర విశేషణములకువలెనె వీనికిని లింగవచనభేదము లుండవు. ఇందు విశేషణాంశమును గ్రియాంశమును నుండును. ఇవి పూర్వాపరస్థిత విశేష్యములతో నన్వయించుటకు సరిగానుండును. ఉదా:—నూలై ఎలుదిన పులవన్=(గ్రంథమును వ్రాసిన కవి) “కాట్టిల్ తిరిగిఱ యానై =(అడవియందుఁ దిరుగుచున్న యేనుఁగు” (కాల్డు. ౫౨౧ పుట).

విమర్శము:—“ద్రావిడభాషలలో సంబంధార్థక సర్వనామములు లేవు. యత్తచ్ఛబ్దాన్వయము లేదు” అను పాశ్చాత్య పండితులయుఁ దదను యాయులయు నభిప్రాయములు సరికావు. తొల్కాప్పియమందే యట్టి యత్తచ్ఛబ్దాన్వయార్థక ప్రయోగములు గలవని యీవఱకె సోదాహరణముగా విశదీకరింపఁబడెను. (చూడు ౧౧౮ IV విష). అంతకుముందటి ప్రయోగములు లేవనుటకేమి యాధారము? ద్రావిడభాషలలో ధాతుజ విశేషణములున్నవి గాన వానియందు సంబంధార్థక సర్వనామము లేదనుట కేవలము నసంగతము. యత్తచ్ఛబ్దాన్వయము సంస్కృతమందుఁ గలదని దొరగా రంగీకరించుచున్నారు గదా యందు మాత్రము ధాతుజ విశేషణములు లేవా? ఉదా:—గతకాలః=(ఏ కాలము గతించినదో యా కాలము). కృతకార్యమ్=(ఏ కార్యము చేయఁబడెనో యా కార్యము) ఇట్టివి సంస్కృతమున ననంతముగాఁ గలవనుట కెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరుగదా. ఇంక ద్రావిడభాషలలో యత్తచ్ఛబ్దాన్వయ వాక్యములకన్న ధాతుజ విశేషణ ఘటితవాక్యముల సంఖ్య యధిక మనిన ననవచ్చునేమో? యత్తచ్ఛబ్దాన్వయ వాక్యములచేత బోధ్యమగు నర్థము ధాతుజ

విశేషణ ఘటితవాక్యములవల్ల లభించునంతమాత్రమున సంబంధార్థబోధక సర్వనామములు ద్రావిడభాషలలో లేవని వ్రాయుట సాహసము కాదా?

౧౩౮. II విష:—"ద్రావిడ ధాతుజ విశేషణములలోని ప్రత్యయము తఱచుగా 'అ' కార రూపము. ఈ 'అ' కారమును క్త్వార్థకరూపముపైని (Gerund) లేక క్రియాకాంక్షాఽసమాపకముపైని నిలుపుటచేత ధాతుజ విశేషణ మేర్పడును. (చూడు ౧౨౯ విష). ఉదా:—తమి-(ధాతు-ఉఴు = దున్ను) దీని వర్తమానార్థక రూపము—ఉఴుగిఱ్+అ=ఉఴుగిఱ=(దున్నుచున్న). దీని క్త్వార్థకరూపము—ఉఴుదు=(దున్ని)=ఉఴుద్ (తుది 'ఉ' కారముచ్చారణార్థకము)+అ=ఉఴుద-(దున్నిన). ఇట్టి క్త్వార్థక ప్రత్యయ మొకానొకచో 'ఇ' కారముగ నిల్చునపుడు దానికిని 'అ' ప్రత్యయమునకును నడుమ 'న' కారము గాని యంతకన్న నందముగా 'య' కారము గాని నిల్చును. ఉదా:—ఎఴుది=(వ్రాసి). ఎఴుది+న్+అ=ఎఴుదిన=ఎఴుది+య్+అ=ఎఴుదియ=(వ్రాసిన). పై విషయములలోఁ దమిఴ మలయాళములకు భేదములేదు.

తమిఴ మలయాళములలో భావ్యర్థక విశేషణము 'ఉ' మంతమె కాన దానిపైని 'అ' ప్రత్యయము నిల్వనేరదు" (వరుమ్ + ఆళ్ = రాఁగలస్త్రీ). (కాల్డు. ౫౨౧, ౫౨౨ పుటలు).

"కన్నడమున భావ్యర్థక ధాతుజ విశేషణము సైతము 'అ' ప్రత్యయాంతము గలదు. ఉదా:—మాడు+వ్+అ = మాడువ = (చేయఁగలట్టి). బాళ్వ=బాళువ=(బ్రదుకఁగలయట్టి)=(ఏది బ్రదుకఁ గలదో యది). కన్నడ వర్తమానార్థక ధాతుజ విశేషణ నిర్మాణమున వేఱొక భావ్యర్థక ధాతుజ విశేషణ రూపము సహాయ క్రియగాఁ జేర్పఁబడును. ఉదా:—కన్న-బాళుత్తిరువ=(బ్రదుకుచున్న)=(ఏది బ్రదుకుచున్నదో యది) 'ఏది బ్రదుకఁ గలదో యది' అని దాని యథార్థశ్రుతార్థము. కన్నడ భూతార్థక ధాతుజ విశేషణము తమిఴమందువలెనె 'అ' ప్రత్యయ మేళనము చేతనే యేర్పడును. క్త్వార్థక 'ఇ' కారమునకును 'అ' ప్రత్యయమునకును నడుమ 'న్-య్' అను వానిలో నొకటి తమిఴమున నిల్చుచుండఁగాఁ గన్నడమున 'ద' కారము నిల్చును. ఉదా:—కన్న-మాడి=(చేసి). మాడిద=(చేసిన). తెలుఁగు భూతార్థక వర్తమానార్థక ధాతుజ విశేషణములు తమిఴమందువలెనె 'అ' ప్రత్యయ మేళనముననే యేర్పడును. తమిఴమందువలెనె 'ఇ' ప్రత్యయమునకును 'అ' ప్రత్యయమునకును నడుమ 'న' కారము నిల్చును. ఉదా:—తెల్గు-వర్తమాన—అవుతున్ను. దీని ధాతుజ విశేషణము-అవుతున్న. క్త్వార్థకము-అయి+న్+అ=అయిన=

(ఇది తెల్గుభూతార్థక విశేషణము). తమిళ కన్నడములలో వ్యతిరేకార్థక ధాతుజ విశేషణ ప్రత్యయము 'అ' అనునదియె. తెల్గున మాత్రము 'ఇ' కారము. కావున ధాతుజ విశేషణ ప్రత్యయము 'అ' అనునది యనుట కీ క్రిందివి యపవాదము లగుచున్నవి. I. తెల్గు వ్యతిరేకార్థక ధాతుజ విశేషణ ప్రత్యయము 'ని' అనునది. II. అనేక భాషలలోని భావ్యర్థక తద్ధర్మార్థక ధాతుజ విశేషణ చిహ్నములు:—అనఁగా 'తు' భాషలోని 'ని' అనునదియుఁ, దమిళములోని 'ఉమ్' అనునదియుఁ, దెలుఁగులోని "ఎడు-ఎడి-ఎ-ఏటి" (వచ్చెడు - వచ్చెడి - వచ్చే — వచ్చేటి) అనునవియు. III. తుభాషలోని భూతార్థక ధాతుజ విశేషణ ప్రత్యయమగు 'తి' అనునదియు, నపవాదములు. తుళు భాషయందన్ననో సంబంధార్థధాతుజ విశేషణములకును లాక్షణికాన్వయ ములకును భేదమే లేదు" (కాల్డు. ౫౨౨ పుట).

విమర్శము: — క్రియాకాంక్షాసమాపకములనుండి సమాపక క్రియా రూపములను సాధించిన యపమార్గముననే (చూడు ౧౨౯, ౧౩౦ I, ౧౩౧ VI. విషయములు). డా. కాల్డువెల్లుగారు ధాతుజ విశేషణములను సైతము సాధింపఁ గడంగుచున్నారు. క్త్వార్థక రూపమునుండి భూతకాల సమాపక క్రియగాని భూతార్థక ధాతుజ విశేషణముగాని సిద్ధింపనేరదు. ధాతువు పయిని భూతాదికాల బోధక ప్రత్యయము నిల్వఁగా దానిపైని ధాతుజ విశేషణ నిష్పాదక ప్రత్యయమగు 'అ' అనునది నిల్చుటచేత భూతార్థకాది ధాతుజ విశేషణ రూప మేర్పడును. ఉదా:—(ఉఱు=దున్ను)-ఉఱు+ద్+అ=ఉఱుద= (దున్నిన) వర్తమాన—ఉఱు+గిఱు+అ=ఉఱుగిఱ=(దున్నుచున్న). 'ఎఱుది+ న్+అ' అని విభాగించి క్త్వార్థకమును సంహితా నకారమును నంగీకరించుట సరికాదు. 'ఎఱుదు+ఇన్+అ'=(వ్రాసిన) అని విభాగించి 'ఇన్' అను భూతార్థక ప్రత్యయమును జూపుట యుక్తము. (చూడు ౧౩౧ II విష). పై రూపమున 'న' కారము వ్యవహారవశమున లోపింపఁగా సంహితా 'య' కారము నిల్చుటచే 'ఎఱుదియ' అను రూపము సిద్ధించు ననఁదగును. (చూడు ౩౨ VII విష).

ప్రాచీన కర్ణాటమున వర్తమానార్థక విశేషణము 'బాళుత్తిరువ' అనునది కానరాదు. 'బాఱు' అనునది పలగన్నడ ధాతువు. 'బాళ్=జీవనే' అని శబ్దమణిదర్పణ ధాతు పాఠము. కాన 'బాళు' అను ధాతువు హళాసగన్నడ రూపము. 'బాఱుత్తిరువ' అనునదియు వర్తమానార్థక విశేషణము కాదు. "బాఱుత్తె-బాఱుతె-బాఱుత్తుం - బాఱుతుం - బాఱిదపం - బాఱువ" అనునవి మాత్రమె పలగన్నడ వర్తమానార్థక విశేషణ రూపములు. (చూడు

౧౨౮ II విష.) (౧౩౨ I విష. చూడు). తుదికి హళగన్నడమందును 'బాళుత్తిరువ' అను 'ఇరు' ధాతు ఘటిత రూపము కానరాదు.

౧౨౩. సూ:—"కారక కృదంత ప్రకృతిగళిగె విభక్తి ప్రత్యయగళు పరవాదాగ నడువె పుంలింగైకవచనదల్లి 'వను', స్త్రీలింగైకవచనదల్లి - 'వళు,' నపుంస లింగైకవచనదల్లి-'అదు', ఎంబ ఆగమగళు బందు కృన్నామగళాగు వవు. ఉదాహరణె.

| | | భూతరూప | భవిష్యద్వర్తమానరూప | నిషేధరూప |
|---|---|---|---|---|
| పుం. | — | మాడిదవను | మాడువవను | మాడదవను |
| స్త్రీ. | — | మాడిదవళు | మాడువవళు | మాడదవళు |
| న. | — | మాడిద్దు | మాడువదు | మాడద్దు" |

(శబ్దాదర్శ, హళగన్నడ వ్యాకరణ)

పయి సూత్రోదాహరణములనుబట్టి హళగన్నడ వర్తమాన విశేషణ రూపము 'బాళువ' అనునది మాత్రమె. తెలుఁగునందలి 'చదువుచున్న' (చదువు+చు+ఉండు+ఇన) అనుదాని రీతిని 'ఉండు' ధాతువునకు సరియగు 'ఇరు' అను కన్నడ ధాతువుతోను, 'ఉత్త' అను కన్నడ వర్తమాన చిహ్నము తోను జేర్చి 'బాళు+ఉత్త+ఇరు+వ' అనురీతిని గల్పింపఁబడినదేమో?

క్రియా కాండమునఁ సమాపకముల నుండియే సమాపక క్రియలును ధాతుజ విశేషణములును నేర్పడుననను నపసిద్ధాంతము దొరగారి మనసున నాటు కొని యుండుటచేతఁ "తమిళమందువలెనె కన్నడమందును క్త్వార్థక 'ఇ' కార మునకును ధాతుజ విశేషణ ప్రత్యయమగు 'అ' అనుదానికిని నడుమఁ దమిళ మందు 'న' కారమువలెనె కన్నడమందు 'ద' కారము నిల్చును" అను నొక యసత్య కల్పనము గావించిరి. వండితిని మున్నగు తెనుఁగు క్రియలందువలెనె కన్నడమందును ననేక క్త్వార్థకములకు భిన్నములగు భూతార్థక క్రియలందు 'ఇకార దకార'ములు రెండును నిల్చుట నిజమె. "దాదా విదాగమో బహుళమ్" (కర్ణా. భూష. ౨౧౦ సూ.)=భూతార్థక ద ప్రత్యయ పరకత్వమున 'ఇ' కారాగమము బహుళముగా నగును. ఉదా:—మాడిదం = (వాఁడుచేసెను) మాడిద=(చేసిన). కాని పెక్కు క్త్వార్థములందు ద కారము రానేరాదు. 'ఇ' కారము మాత్రమె నిల్చును. ఇట్టి స్థితిలో నిట్టి క్త్వార్థకములు భూతార్థక సమాపక క్రియలకుఁ బ్రకృతులని యెట్లు చెప్పనగును? "ఇదుతోఽల ఘ్వాది ద్విస్వరాత్" (కర్ణా. శబ్దాను. ౫౮౧ సూ.)=లఘ్వాది ద్విస్వరకములు కాని 'ఉ'

కారాంత ధాతువులకుఁ బరముగ క్త్వార్థమున ‘ఇ’ కార మాత్రమె యగును. ఉదా:—నోడిపోదం=(చూచిపోయెను.) మొ. మఱియు క్త్వార్థకమునుండి విశేషణ మేర్పడుట మిక్కిలి యసంభవము. ఇచ్చటనే కాక విశేషణ ప్రకరణమందును నిట్టి యభిప్రాయమునె దొరగారు స్పష్టముగా వచించిరి.

“ ‘కింది’ మున్నగు విశేషణముల తుది ‘ఇ’ కారమును ‘అయి’ మున్నగు చోటులందలి భూతార్థకమగు ‘ఇ’ కారమును నభిన్నములె యని యూహింప వచ్చును” (చూడుము ౯౧ VI విష.). (కాల్డు. ౩౧౨ పుట).

“కొన్ని ధాతువులకు ‘ఇయ’ అను ప్రత్యయమును జేర్చుటచేత విశేషణ రూపము లేర్పడును. ‘ఇయ’ అనుదానిలోని ‘ఇ’ అనునది భూతార్థకము. ‘అ’ అనునది సంబంధార్థ కాసమాపక క్రియాజన్య విశేషణ నిష్పాదక ప్రత్యయము. య కారము సంహితా వ్యవధాయక వర్ణము. తెల్గున ‘అ’ ప్రత్యయముతోఁ గూడకయె ‘ఇ’ ప్రత్యయ మాత్రమె విశేషణతా ద్యోతక మగుచున్నది. ఉదా:—కింద-కింది......” (౯౧ VII విష.). (కాల్డు. ౩౧౩, ౩౧౪ పుటలు).

“కొన్నియెడల భూతార్థకమగు ‘ఇ’ ప్రత్యయమును జేర్పకుండఁగనే సంబంధార్థకమగు ‘అ’ ప్రత్యయమును జేర్చుటచేతనే విశేషణ రూప మేర్పడును. ఉదా:—తమి-నల్ల=(మంచి). కన్నడ-దొడ్డ. తెలుఁగు-పెద్ద” (చూడుము ౯౧ VIII విష.). (కాల్డు. ౩౨౬ పుట).

పయి విషయములలోని యసంగతు లాయా స్థలములయందె విమర్శితము లగుటచే నిట మరల విమర్శింపలేదు.

పయి సందర్భమునుబట్టి ‘అ’ ప్రత్యయమువలెనె ‘ఇ’ ప్రత్యయమును దద్వృత్తార్థ బోధకమగు విశేషణతా నిష్పాదక ప్రత్యయమని విశదమగుచున్నది. చరిత్ర విస్మృతిచే ‘ఇ+అ’ అను రెండిటి మేళనము కొన్నియెడల గల్గుట వింత కాదు. తద్ధర్మార్థకమగు ‘ఎడు’ ప్రత్యయముపైని ‘ఇ’ ప్రత్యయము నిల్వఁగా ‘ద-డ’ ల మార్పు కల్గుటచేత (హృదయ=ఎద=ఎడ.) ‘చదివెడి-చదివేటి’ మున్నగు రూపము లేర్పడి యుండుననియు నట్టి ‘డి’ వర్ణ లోపముచేత “చదివేవాఁడు” అనురీతి రూపము లేర్పడియుండుననియు నూహింపనగును.

౧౩౮. III విష:—“పెక్కు ధాతుజ విశేషణములె కాక పెక్కు గుణ విశేషణములును ‘అ’ ప్రత్యయమును జేర్చుటచేత నేర్పడుచున్నవి. గుణ నామవాచకము లేమార్పును లేకయే విశేషణములుగ వాడఁబడును. ఉదా:—

పెరు=(పెద్ద.) సిఱు=(చిన్న). మొ. వీనినె యొక విధమగు సంబంధార్థక విశేషణములనుగా వాడవచ్చును. ఉదా:—సిఱి+య్+అ=సిఱియ=(చిన్న). పెరి + య్ + అ=పెరియ=(పెద్ద). కొన్ని యసాధారణ క్రియలయొక్క భూతార్థక సంబంధార్థక ధాతుజ విశేషణములు సైతము సామాన్య విశేషణ ములుగ వాడఁబడుటయుఁ గలదు. ఉదా:—ఉయర్+న్ద్+అ=(ఎత్తయిన). 'ఏది యెత్తయినదో యది' అని దీని యధార్థశ్రుతార్థము. తాళ్+న్ద్+అ=(క్రిందయిన). 'ఏది క్రిందైనదో యది' అని దీని యధార్థశ్రుతార్థము. 'పెరియ' మున్నగు తమిళ విశేషణములు భూతార్థక సంబంధార్థక విశేషణములగు 'పణ్ణియ'=(చేసిన) మున్నగువానిని మిక్కిలి పోలియున్నవి. దీనినిబట్టి యివి (పెరియ మున్నగునవి) యాకారమున భూతార్థక సంబంధార్థక విశేషణములుగ నున్నవనియు నిజముగా వీనికి భూతాదికాల సంబంధము లేదనియు నిట్టి క్రియకుఁ జేర్చెడి ప్రత్యయము చేరికచేత నేర్పడినవనియు నివి నామవాచకమునుండి యేర్పడిన సంబంధార్థక విశేషణములనియుఁ జెప్పనగును" (కాల్డు. ౫౨౨ పుట).

"తమిళమున మఱొక తెగ విశేషణములు భావ్యర్థక తద్ధర్మార్థక ధాతుజ విశేషణ ప్రత్యయమును 'ఉమ్' అనుదానిని జేర్చుటవలన నేర్పడును. గుణ నామవాచకములకు 'ఇయ' అనుదానిని జేర్చునట్లె యీ తెగ శబ్దములకుఁ బర ముగ 'ఉమ్' అనునది చేర్పఁబడును. పెర్+ఉమ్=పెరుమ్=(పెద్దది) పస్+ఉమ్=పసుమ్—(ఆకు పచ్చనిది). ఈ రెండు తెగలకును నర్థభేదము లేదు. 'ఇయ' అనుదానికంటె 'ఉమ్' అనునదియె మనోజ్ఞమై యుండును (చూడుడు విశేషణ ప్రకరణము ౯౧ IX విష.)" (కాల్డు. ౫౨౨, ౫౨౩ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు 'పెరియ' మున్నగువానిలోని 'ఇ' అనునది భూతార్థకమనియు 'అ' అనునది ధాతుజ విశేషణ ప్రత్యయమనియు 'కింది' మున్నగువాని తుది 'ఇ' కారము సైతము భూతార్థకమున కభిన్నమె యనియు వెనుక విశేషణ ప్రకరణమున స్పష్టముగ వ్రాసిరి. (చూడుడు ౯౧ VI, VII, VIII విష). అట్టి దొరగారి వ్రాఁతలను దిక్ ప్రదర్శనముగ ౧౨౭ II విషయమునఁ జూపియున్నాను. అట్టి యభిప్రాయము పూర్తిగ నిట మాఱి పోయినది. "పెరియ మున్నగు తమిళ విశేషణములు భూతార్థక సంబం ధార్థక విశేషణములగు 'పణ్ణియ' మున్నగువానిని మిక్కిలి పోలియున్నవి. ఇవి యాకారమున భూతార్థక సంబంధార్థక విశేషణములుగ నున్నవి. నిజముగా వీనికి భూతకాల సంబంధము లేదు" అని యిట్లు వింతగ వ్రాయుచున్నారు. (చూడుడు కాల్డు. ౫౨౨, ౫౨౩ పుటలు).

"పెరియ" అనుదానిలోని 'ఇ' కారమునకు భూతార్థసంబంధము లేదని యిట వ్రాసిరిగదా 'పెరు' అనుదానినుండి "పెరి+య్+అ=పెరియ" అని వీరు చూపిన విభాగములోని 'పెరి' అనుచోటి 'ఇ' కారము వీరికెట్లు వచ్చినదో తెలుపవలదా? దానికోసమె కదా వీరచట దానికి క్త్వార్థకతాంగీకారము గావించిరి.

'పెరియ' మున్నగు నామములలోని 'ఇ' కారము భూతార్థకమనుట యెట్లసంభవమో, 'పెరుమ్' మున్నగు నామములలోని 'ఉమ్' ప్రత్యయము తద్ధర్మార్థకమనుటయు నట్లె యసంభవము. భూత తద్ధర్మాద్యర్థక ప్రత్యయములు క్రియావాచి ధాతువులపైనె నిల్చునుగాని నామములపై నెన్నఁడును నిల్వ నేరవు. తద్ధర్మాద్యర్థములలోని సాతత్యాద్యర్థములు భూతాదికాల వాచకములు కావని వెనుక దొరగారు వ్రాసిరి కాని సాతత్య మనఁగాఁ ద్రికాల వృత్తిత్వమే కదా. అది క్రియార్థధర్మము కాదనుట యెట్లు? 'పెరుమ్' మున్నగువానిలోని 'ఉమ్' అనునది కర్మధారయ సమాసములో వచ్చు నాగమ విశేషమని యీ వఱకె నిరూపింపఁబడెను. (చూడు ౬౬ II, ౯౧ IX విష). కర్మధారయ మున సహజమైయుండెడి సమానాధికరణ ధర్మద్వయ మచటి సముచ్చయార్థక మగు 'ఉమ్' శబ్దముచేత సముచ్చిత మగును గాన నచట 'చా' ర్థకాగమము సహజము. (నీలంచ త దుత్పలం చ=నీలోత్పలమ్).

౧౩౮. IV విష:—"ధాతుజ విశేషణ=(సంబంధార్థక విశేషణ) ప్రత్యయ చరిత్రము:—తమిఴుమందలి భావ్యర్థక తద్ధర్మార్థకమగు 'ఉమ్' అనునది సముచ్చయార్థకమగు 'ఉమ్' అనుదానికి భిన్నము కాదని యీవఱకు విశదపఱిచి యున్నాను. సంబంధార్థక ధాతుజ విశేషణ ప్రత్యయము లెల్లఁ జరిత్రమందు మొట్టమొదట విభక్తి ప్రత్యయములె యనియు ముఖ్యముగా శేషషష్ఠీ ప్రత్యయములె యనియు నవి 'కల-కల్గియున్న' అను నర్థము గలవనియు నా యభిప్రాయము. ప్రాచీన సిథియను భాషలలో ద్రావిడభాషలందువలెనె సంబంధార్థక సర్వనామములకు బదులుగ సంబంధార్థక విశేషణములను వాడుకచేయుట సంప్రదాయము. జపానుభాషలో సైతము సంబంధార్థక సర్వనామము లేదు. సిథియను భాషలలోవలెనె సంబంధార్థక సర్వనామముచోట సంబంధార్థక ధాతుజ విశేషణమును వాడుటయే సంప్రదాయము. సంబంధార్థక ధాతుజ విశేషణ ప్రత్యయమునకును శేషషష్ఠీ ప్రత్యయమునకును భేదములేదు. మంచు భాషలో (సిథియన్) 'న్గ' అనునది లేదా 'నిన్గ' అనునది (ఇది టర్కీ భాషలోని 'నిన్గ' అనుదానిని బోలియున్నది) ధాతుజ విశేషణ ప్రత్యయము. శేషషష్ఠీ ప్రత్యయమును నిదియె. వీనిని జేర్చుటచేత నసమాపకక్రియ ధాతుజ విశేషణ

మగుచున్నది. ఈ విషయము తమిళ కన్నడములను జాలుగఁ బోలి యున్నది. ఉదా:—మంచుభాష:—అరచ = (వ్రాయఁబడిన). ఇది 'అర' అను ధాతువుయొక్క యసమాపక క్రియారూపము. దీనినుండి 'అరచస్గై' = (వ్రాసినది) అను సంబంధార్థక విశేషణ మేర్పడుచున్నది. 'వ్రాయుటను గలది' అని దీని యథాశ్రుతార్థము. మంగోలియను భాషలో "బి ఒమ్సిహు నె బిఛిగ్ =(నేను జదువుచున్న పుస్తకము). ఇందలి 'నె' అనునది తమిళ మందలి శేషషష్ఠియగు 'అ' అనుదానికి సమానార్థకము. అందలి 'బి' అను దానికి 'నేను' అనియు 'బిఛిగ్' అనుదానికి 'పుస్తకము' అనియు నర్థములు. కావునఁ బై మంగోలియా వాక్యమునకును "నాన్ వాసిక్కిన్ద్ర నూల్" అను తమిళ వాక్యమునకును 'నేను జదువుట గల పుస్తకము' అనియే యథాశ్రుతార్థము. చీనా భాషయందును నిట్టి రచనయె కలదు. ఉదా:—వోనీన్తి షు =(నేను జదువుచున్న పుస్తకము). ఇందలి 'తి' అనునది శేషషష్ఠీ ప్రత్యయము. ఇది 'నీన్ =(చదువు)' అను ధాతువునకుఁ బరముగఁ జేర్పఁబడినది. ఈ భాషలలోఁ గ్రియయొక్క షష్ఠీరూపమె సంబంధార్థక విశేషణ రూపమగుచున్నది. పై రీతిని గ్రియపైని షష్ఠీ ప్రత్యయమును నిల్పుటచేతఁ గ్రియను నామవాచకముగ వాడెడివారని తేలుచున్నది. ఎడ్కిన్సు దొరగారు 'తురేనియనులు క్రియలను నామవాచకములనుగా వాడుదురు' "ప్రతిక్రియయుఁ బ్రాతిపదికముగా వాడఁ బడును" అని చెప్పియున్నారు. ఈ మాట చాలవఱకు ద్రావిడభాషలకు వర్తించుచున్నది. ద్రావిడ సంబంధార్థక విశేషణము క్రియానామవాచకముగా వ్యవహరింపఁబడునని యీావఱకుఁ జూపియేయున్నాను. అసమాపకక్రియలను నామవాచకములనుగాఁ దలంపనిచో శేషషష్ఠీ ప్రత్యయమును జేర్చుటయు వానిని సంబంధార్థక క్రియాజన్య విశేషణములనుటయు నెట్లు పొసఁగును?" (కాల్డు. ౫౨౩, ౫౨౮ పుటలు).

విమర్శము:—క్రియావాచకమగు ధాతువుపైని కాలబోధక ప్రత్యయములు నిల్చిన యసమాపకక్రియ మొదటఁ గ్రియానామవాచకమే యనియు దానిపైని బురుషబోధక ప్రత్యయములు నిల్చుచో నది సమాపకక్రియ యగు ననియు సంబంధార్థక శేషషష్ఠీ ప్రత్యయ మట్టి యసమాపకక్రియపై నిల్చినచో నది సంబంధార్థక ధాతుజ విశేషణమగుననియు డా. కాల్డువెల్లుగారి సిద్ధాంతము. పై స్థలద్వయమందలి సంబంధశబ్దము విభిన్నవిషయకము. శేషషష్ఠ్యర్థమగు సంబంధము స్వస్వామిభావాది రూపసంబంధము. ఉదా: — రాజుయొక్క పురుషుఁడు. మొ. సంబంధార్థక విశేషణ మనుచోటి సంబంధము యత్తచ్ఛబ్దాన్వయరూపము. ఉదా:—ఎవ్వఁడు విద్వాంసుఁడో వాఁడు పూజ్యుఁడు. మొ.

ఇట్లు విజాతీయములగు సంబంధశబ్దములను శబ్దసామ్య భ్రమచే నభిన్నము లనుగా డా. కాల్డువెల్లుగారు తలంచుట సరికాదు. సంబంధార్థక శేషషష్ఠీ ప్రత్యయముచేత యత్తచ్ఛబ్దాన్వయ రూపసంబంధము బోధ్యమగుననుట కేవలము నసంగతము. అసంభవము. ఇట్టి యసంగతాసంభవ విషయము నాధారముగాఁజేసికొని షష్ఠీవిభక్తి నామవాచకముపైనే నిల్చునుగాన ధాతుజ విశేషణ ప్రత్యయమునిల్చు క్రియాంగము భావార్థకక్రియా నామవాచకము కాకతీరదను నొక యపసిద్ధాంతమును దొరగారు నెలకొల్పుట భ్రాంతిమూలకము. (చూడు ౧౩౭ I విష, ౧౩౭ II విష). ధాతువుపైని భావార్థక ప్రత్యయము నిల్చిన పై నయ్యది సుప్పులు నిల్చుట కర్హమగు కృదంతమగునే కాని పురుషబోధక ప్రత్యయయోగ యోగ్యము కానేరదు. అట్టి భావార్థక ప్రత్యయమునకు భవిష్యదాది కాలభేదబోధకతాశక్తి యెట్లు గల్గును?

తొల్కాప్పియమునాఁటికే ప్రసిద్ధమైయున్న యత్తచ్ఛబ్దాన్వయమును నట్టి యర్థముగల సర్వనామమును ద్రావిడభాషలలో లేవని దొరగారు పలుమాఱును వ్రాయుచుండుటయు, 'అదు' అనునది తమిళమున తొల్కాప్పియము నాఁటికి శేషషష్ఠీ ప్రత్యయమై యుండఁగా 'అ' అనునది ('అ' నన్నూలున నున్నది యర్వాచీనము). తమిళ శేషషష్ఠీ ప్రత్యయమనుచు మాటిమాటికిని వ్రాయు చుండుటయు నట్టి 'అ' ప్రత్యయము (శేషషష్ఠీ.) ధాతుజ విశేషణతా నిష్పాదకమగు 'అ' ప్రత్యయమునకు భిన్నముకాదనెడి స్వవాదమునుఁ బాఠకుల మనసుల కెక్కించుటకుఁ జేయు నసత్య ప్రసంగములనుట సాహసము కాదు. (చూడు ౮౭ VII విష.). 'అదు' అను తచ్ఛబ్దనపుంసక ప్రథమైక వచనరూపమె తమిళ శేషషష్ఠీ ప్రత్యయము. అది మాత్రమె తొల్కాప్పియమునఁ జేర్కొనఁ బడినది. (చూడు ౮౭ V, VI విష.). కన్నడ శేషషష్ఠీ 'అ' ప్రత్యయము. భూతాది కాలద్యోతక ప్రత్యయ విశిష్టమగు క్రియాంగముపై నిల్చు 'అ' అను ధాతుజ విశేషణతా నిష్పాదకప్రత్యయము "అ" అను నిర్దేశక సర్వనామ ప్రకృతికి భిన్నము కాదు. ఈ విషయమును డా. గుండర్టుగారు వచించినను నద్దానిని దాము యుక్తిహీనముగా నంగీకరింపఁజాలమని దొరగారు వ్రాయుట కేవలము నన్యాయ్యము. (చూడు ౧౩౭ V విష.)

౧౩౭. V విష:—"'ఎడ్కిన్సు' దొరగారు ద్రావిడ భాషలయందువలెనె యిండోయూరపియను భాషలందును నొక్క శబ్దమునె భూతార్థక విశేషణము గాను, శేషషష్ఠీరూప విశేషణముగాను నుపయోగింపవచ్చునని యిట్లుదాహరించిరి. ఉదా:—horned (కొమ్ముగల?). కాని యిందలి 'ed' అనునది శేష షష్ఠీప్రత్యయము కాదు.

బెహిస్తను ఫలకముల శాసనములలోని మంగోలియను భాషయందలి 'కి' అనుదానిని బోలిన 'షి' అనునది సంబంధార్థక ప్రత్యయము. ఇది ద్రావిడ భాషలయందువలెనె సంబంధార్థక విశేషణనిర్మాణమున ధాతువుపైని జేర్పఁబడును" (కాల్డు. ౫౨౮ పుట).

"ద్రావిడ భాషలకును సిథియను భాషలకును సంబంధములను సామ్యములనుఁ బరిశీలింపఁగా సంబంధార్థకమగు 'అ' అనెడి ద్రావిడ ప్రత్యయము ద్రావిడ ప్రాచీన శేషషష్ఠీప్రత్యయమగు 'అ' అనుదానికి భిన్నముకాదని తెలియుచున్నది".

"డా. గుండర్టు దొరగారు సంబంధార్థక విశేషణ ప్రత్యయమగు 'అ' అనునది నిర్దేశక సర్వనామశబ్దమగు 'అ' అనుదాని కభిన్నమనిరి. కాని నిర్దేశక ప్రత్యయమగు 'అ' అనునది యప్రధానార్థమున శేషషష్ఠీప్రత్యయమగు 'అ' అనునదిగ వాడఁబడుచున్నదని నిర్ణయించువఱకు నట్టి యూహను నేనంతగా నంగీకరింపఁజాలను" (కాల్డు. ౫౨౮ పుట).

"'తు' భాషయందలి తద్ధర్మార్థక సంబంధార్థక విశేషణప్రత్యయమగు 'ని' అనునది శేషషష్ఠీప్రత్యయమగు 'ని' అనుదానికి భిన్నముకాదు. తెల్గుభాషయందలి వ్యతిరేకార్థక సంబంధార్థక విశేషణప్రత్యయమగు 'ని' అనునది తెల్గు విభక్తులలోని 'ని' అనుదానితో సంబంధించుచున్నది. 'తు' భాషయందలి భూతార్థక సంబంధార్థక విశేషణ ప్రత్యయమగు 'తి' అనునది తెల్గులోని యాపవిభక్తిక 'తి' ప్రత్యయముతో సంబంధించుచున్నది. తెల్గు సంబంధార్థక తద్ధర్మార్థక విశేషణప్రత్యయములు తెలుఁగు విశేషణరూప రూపనిర్మాణమునఁ గనఁబడుచున్నవి. (వచ్చేటివాఁడు = నేఁటివాఁడు - ఏటిసీరు - మొ.)" (కాల్డు. ౫౨౮, ౫౨౫ పుటలు).

విమర్శము:—ధాతుజవిశేషణ ప్రత్యయములకును శేషషష్ఠీప్రత్యయములకును నేదేని సంబంధముగలదని తోఁచునట్లుఁగ నిట డా. కాల్డువెల్లుగారు వాని పోలికలను జూపసాగిరి. బలమగు యుక్తి చూపకయె డా. గుండర్టుగారి విశ్వసనీయమగు నూహను దామంగీకరింపఁ జాలమనిరి. శేషషష్ఠీప్రత్యయములకును ధాతుజవిశేష ప్రత్యయములకును బోలికలను జూపుటలోఁ గొన్నిట నుదాహృతులనైనఁ జూపక దాఁటిపోవుచు వచ్చిరి. మఱియు నెందైన శేషషష్ఠీ ప్రత్యయమును ధాతుజవిశేషణ ప్రత్యయమును యాదృచ్ఛికమగు పోలికను గల్గియున్నంత మాత్రమున విభిన్నవిషయకములగు నా రెండును నభిన్నములనుట శబ్దతత్త్వశాస్త్ర సంప్రదాయ సమ్మతము కాదు గదా. ఆ రెండు సంబంధ శబ్దములును విభిన్నవిషయకములనియు శబ్దసామ్యమున నవి యభిన్నములని భ్రమింప

రాదనియు నీపఱకు విశదపఱచియే యున్నాను. (౧౩౮ IV విష.) "భవతి" శబ్దములో 'తి' యున్నది. 'నేతి' శబ్దములో 'తి' యున్నది—'రామస్య' అను దాని తుదిని 'స్య' అని యున్నది. 'విశ్వస్య' అనుదాని తుదిని 'స్య' అని యున్నది. ఇట్టి యాదృచ్ఛికములగు పోలికలను మూలముగాఁ గొని వాని కభిన్నతను గల్పించుట సరియా? వెదకినచో నిట్టి పోలికలు భాషాసముద్రము లలో వేనవేలు నత్తగుల్లలవలె లభింపకపోవు.

డా. గుండర్టుగారు ధాతుజవిశేషణ ప్రత్యయమగు 'అ' అనునది నిర్దేశక సర్వనామ ప్రకృతియగు 'అ' శబ్దమున కభిన్నమని యూహించిన యూహ మెంతయు విశ్వసనీయమును సుసంగతమును సుసంభవమును ననుటకు సందేహములేదు. బలమైన యుక్తి చూపకయే దాని నంగీకరింపఁజాలమని దొరగారు వ్రాయుట న్యాయ్యముకాదు. నిర్దేశక సర్వనామ శబ్దమగు 'అ' అనుదాని నుండి యేర్పడిన 'అదు' శబ్దమె తమిళ శేషషష్ఠీప్రత్యయమని వెనుక దొరగారే నిర్ణయించి వ్రాసిరి. ఇంక నద్దానిని నిర్ణయించుటకుఁ దామంతఁగా నంగీ కరింపఁ జాలమనుట సరియా? (చూడు ౮౭ V, VI విష).

౧౩౮. VI విష:—"సంబంధార్థక సర్వనామములకుఁ బదులుగా సంబంధార్థక ధాతుజ విశేషణములను వాడుట సిద్ధియను భాషలకు సహజమె యైనను "టర్కి-షు-ఫిన్నిషు" భాషలు రెండిటియందును సంబంధార్థక సర్వనామము వేఱుగఁ గలదు. కాని యట్టి సర్వనామమును వాడుట యా భాషల వ్యాకరణ సంప్రదాయమునకు విలక్షణమై యుండో యూరపియను భాషలలోని వాడుకల యనుకరణమని తోఁచించును. టర్కిషు భాషపైని 'పరిషియను' భాషా ప్రభావ మావేశించిన దనుట నిశ్చయము. 'ప్రాచ్య టర్కిషు' భాష పరిషి యను భాషనుండి సంబంధార్థక సర్వనామ మొకటి నెరవుతెచ్చికొన్నను దాని వాడుక యా భాషయందు దరుదు" (కాల్డు. ౫౨౫ పుట).

విమర్శము:—సంబంధార్థక సర్వనామము (యచ్ఛబ్దార్థకము) ద్రావిడ భాషలలో లేదనుకొని కావలయును దొరగారీ యపసిద్ధాంతములనుఁ గల్పించిన వారైరి. తొల్కాప్పియమునాఁటికే తమిళమున సంబంధార్థక సర్వనామ ప్రయోగమును యత్తచ్ఛబ్దాన్వయ ప్రయోగమును గలవని యీపఱకె సోదాహరణముగాఁ జూపఁబడెను (చూడు ౧౧౮ IV విష. ౧౩౮ I విష). అంతకన్నఁ బ్రాచీన గ్రంథ మే ద్రావిడ భాషలలో నున్నది? ఇట్టి స్థితిలో ద్రావిడ భాష లందు సంబంధార్థక సర్వనామము లేదను నీ వాదమును దొరగా రెట్లు లేవఁ దీసిరో తెలియకున్నది.

"అవ్వాటి....." (తొల్కా. ౬౮౬ సూ.) =

"అవన్-ఇవన్-ఉవన్
అవళ్-ఇవళ్-ఉవళ్
అవర్-ఇవర్-ఉవర్
యాన్-యామ్-నామ్
యావన్-యావళ్-యావర్"

అను పదునైదు శబ్దములును మహన్మహతీ వాచములు".

అని మాత్రమె తొల్కాప్పియ సూత్రము. 'అవన్' మున్నగువానికివలెనె 'యావన్' మున్నగువానికిని సూత్రకర్త యర్థ వివరణము చేయలేదు. తెల్గునందలి 'ఎవఁడు' మున్నగునవివలెనె తమిళమందలి 'యావన్' మున్నగు శబ్దములును గన్నడమందలి 'ఆవం' మున్నగు శబ్దములును యత్కిమర్థకము లనుటలో విరోధ మేమున్నది? తొల్కాప్పియమునందె 'యా' శబ్దము యచ్ఛబ్దార్థకముగఁ బ్రయుక్తమై యున్నది గదా? ధాతుజ విశేషణములు ద్రావిడ భాషలలో నున్నవందురా? అవి సంస్కృతమందును గలదే. ఇంక నిట్టి వాదమునకుఁ బ్రసక్తి యేమున్నది?

౧౩౫. I విష:—"I. చేదర్థకము = (Subjunctive mood) 'si—if' అను నాంగ్లపదములకు సమానార్థకములగు ప్రత్యయములనుగాని 'అవు' ధాతు చేదాద్యర్థక రూపమునుగాని క్రియయొక్క వివిధరూపములపైని నిల్పుట చేతఁ జేదాద్యర్థక రూపమేర్పడును" (కాల్డు. ౫—౨౫ పుట).

"కన్నడ భాషలో 'రె' అనునది చేదర్థక ప్రత్యయము. ఇది 'ఆరె' అనుదాని సంక్షేపరూపమని డా. గుండర్టుగారు తలంచిరి. తమిళ భాషయందు 'ఆఱు=త్రోవ'. "బన్దరె=వచ్చినప్పుడు" అనుదానిని మలయాళమందలి "వన్న+వ్+ఆఱె=వన్నవాఱె=(చూడు ౧౫ II విష.) వచ్చి యున్న త్రోవలో=వచ్చినచో" అనుదానితోఁ బోల్చిరి. (పయి మలయాళశబ్దము తఱచుగా 'వన్ను ఆఱె' అని పల్కఁబడును). ఈ మలయాళ రూపమునకు సరియగు తమిళ గ్రాంథికరూపము "వన్ద+వ్+ఆఱు=వన్దవాఱు" అనునది. కర్ణాట చేదర్థక ప్రత్యయమగు 'రె' అనునది భూతార్థక ధాతుజ విశేషణముపైని నిల్చును. ఉదా:—మాడిద+రె=మాడిదరె=(నేను-నీవు-వాఁడు-అది-చేసినచో). విశేషణము విశేష్యముతో నన్వయింపవలయును గాన 'మాడిద' మున్నగు భూతార్థక విశేషణము పైనిల్చు నీ 'రె' ప్రత్యయము నామవాచకమె యనఁదగును. కాన, 'మాడిదరె' అనుదానికిఁ 'చేసినచోట' అను నర్థము సరిపడియున్నది. ఈ కన్నడ చేదర్థకరూపము 'అప్య'ర్థకమగునపుడు ధాతుజ విశేషణముపైని "రూ—(లేదా) ఆగ్యూ" అనునది చేర్పఁబడును. 'రూ=రె+ఊ' అని ఛేదము.

'ఆగ్యూ' అనుదానికి "ఆగి=(అయి)+ఊ" అని ఛేదము. ఇవి తమిళమందలి "ఆగిల్+ఉమ్=ఆగిలుమ్" అనుదానికి సరిపడియుండును" (కాల్డు. ౫౦౫, ౫౦౬ పుటలు).

విమర్శము:—పటిగన్నడ వ్యాకరణములలో నిందులకు మూల మగపడదు. పయి కాల్డువెల్లుగారి విషయములెల్ల "స్టడీ-ద్రవి" గ్రంథములో సరిగా సంగ్రహింపఁబడినవి. (చూడు స్టడీ-ద్రవి ౭౭, ౭౮ పుటలు). "రూ-ఆగ్యూ" అను సప్తమ్యర్థక ప్రత్యయములలోని 'ఊ' అనునది హళెగన్నడమందలి సముచ్చయార్థకశబ్ద మని తోఁచును. 'ఆగు+ఇ+ఊ=ఆగ్యూ' అని ఛేదము సరయునది. 'ఇ' అనునది తమిళమందలి 'ఇన్' అను చేదర్థకమును సంబంధించినది కానోపును. (చూడు ౧౩౫ III. ౧౩౫ IV విష).

౧౩౫. II విష:—"తుళుభాషలోని చేదర్థకరూపములు:—ఇవి రెండు విధములని 'బ్రిగెల్' దొరగారు చెప్పిరి. I కండిషనల్ రూపము. II సబ్జంగ్టీవురూపము=(ఇది చేదర్థకము).

I. కండిషనల్‌రూపము:—ఇది భూతార్థకముపైని భవిష్యత్సామాన్య వర్తమానార్థక 'వ' ప్రత్యయము నిల్చుటచేత నేర్పడును. దీనిని 'తవ్య' ప్రత్యయార్థక మనఁదగును. ఉదా:—మాళ్‌త్ద్వె=చేయవలసి యున్నది. (భూతార్థకము - మాళ్‌త్దె = చేసియున్నాను). వ్యతిరేకార్థకమగు కండిషనల్ రూపము. ఉదా:—మాళ్‌త్ద్‌వ్+అ+య్+ఎ=మాళ్‌త్ద్వయె=(చేయరాదు). (ఇందలి 'అ' అనునది వ్యతిరేకార్థకము).

II. సబ్జంగ్‌టీవు రూపము=(చేదర్థకము). 'డ' ప్రత్యయయోగమున నిది యేర్పడును. ఇది తమిళ మలయాళములలోని 'ఇల్-ఆల్' అనువానికి సమానార్థకమగు సప్తమ్యర్థకము. తుళు:—మాళ్‌పువెడ = (చేయునెడల) (మాళ్పువె=చేయుదును). తుళులోని వ్యతిరేకార్థకమగు 'ఇజ్జి' అనుదాని సంక్షేపమగు "జ్" అనుదాని చేరికచేత వ్యతిరేకార్థకరూప మేర్పడును. ఉదా:—తుళు-మాళ్‌పుజెడ=(చేయనియెడల) (ఇది వ్యతిరేక చేదర్థకము)" (కాల్డు. ౫౦౬ పుట).

విమర్శము:—ఇందలి 'కండిషనల్ రూపమునందుఁ జేదర్థభానములేదు. సబ్జంగ్‌టీవు రూపమె చేదర్థము. సప్తమ్యర్థకమునకును జేదర్థకమునకును సంబంధము కానరాదు.

౧౩౫. III విష:—"తెల్గు చేదాద్యర్థకరూపములు:—ధాతు రూపమునకు 'ఇష' అనుదానిని జేర్చుటవలనఁ దెలుగునం దత్యంత ప్రాచీనమును ముఖ్య

మును నగు చేదాద్యర్థక రూప మేర్పడును. ఉదా:—చూచిన. 'ఇన' అనునది తమిళమందలి 'సందర్భమున' అను నర్థముగల 'ఇన్' అను సప్తమ్యర్థకమునకు భిన్నముకాదు. 'ఇన్=ని=న' అనునవి సప్తమ్యర్థకములు.

తెనుఁగులో నుపయోగింపఁబడు చేదాద్యర్థకములన్నియుఁ దఱచుగా 'అగు' ధాతు రూపములె. 'అగుచో' అను నర్థము గలవి. ఇందు 'ఏని' అనెడి 'అవు' ధాతు సంబంధి చేదాద్యర్థక రూపము శిష్టవ్యవహారమున వెలయు చుండును. ఈ 'ఏని' అనునది తమిళమందలి 'అగు సందర్భమున' అను నర్థము గల 'ఆయిన్' అనుదాని కభిన్నము. ఈ 'ఏని' ప్రత్యయము ధాతుజ విశేష ణమునకుఁ బరముగఁ జేర్పఁబడక సమాపక క్రియలకుఁ బరముగఁ జేర్పఁబడును. దీనిని జేర్పఁగనే క్రియ చెప్పెడి కాలమేది యైనను దద్ధర్మార్థకముగా మాఱును. ఇది తమిళమందలి 'ఆయిల్=ఆగిన్=ఆయిన్=ఆనాల్' అనువానికి సమా నార్థకముగా వాడఁబడును. ఉదా:— తెల్గు:—చేసితిన్+ఏని=చేసితినేని=తమి:- చేయ్‌దేన్+ఆయిన్. తెల్గు:—చేసితిమ్+ఏని=తమి:—చేయ్‌దోమ్+ఆయిన్.

కొందఱు వైయాకరణులు 'ఏని' అనునది 'ఏమి' అను ప్రశ్నార్థకమున కభిన్నమని తలంచిరి. కాని వాడుకయందును ధ్వనియందును గల 'ఆయిన్' శబ్దపు పోలిక పై యాశయమును ద్రోసివేయుచున్నది'' (కాల్డు. ౫౨౬, ౫౨౭ పుటలు).

'' 'ఏ' అనునది తెల్గు వ్యవహారమున నింకొక చేదర్థక రూపము. ఇది 'ఏని' శబ్దమువలె సమాపక క్రియకుఁ బరముగఁజేర్పఁబడదు. ఇంక నిది భూతార్థక సమాపక క్రియాంగమునకుఁ బరముగఁ జేర్పఁబడును. ఉదా:— చేసితే=చేస్తే. 'క్లై' దొరగారీ 'ఏ' ప్రత్యయము ప్రశ్నార్థకమున కభిన్నమని తలంచిరి. ఉదా:—వాఁడు చేసెనే=(వాఁడు చేసినచో).

కన్నడ మందువలెనే తెలుఁగునందును ధాతుజ విశేషణమునకుఁ బరముగాఁ జేర్పఁబడిన 'అట్టయితే-అట్టాయెనా' అనునవి యింకొక విధమగు చేదర్థకములగుచున్నవి. వీనిలోని మొదటి 'అట్టు' అనునది సంబంధార్థకమై 'అట్లు' అను నర్థము నిచ్చును. పురుషబోధక ప్రత్యయము చేరని 'అయితి' అను భూతార్థక క్రియను 'ఊని' పల్కఁగా 'అవు' ధాతువుయొక్క చేదాద్యర్థక రూపమగు 'అయితే' అనునది యేర్పడును. 'అవు' ధాతువుయొక్క భూతార్థక మగు 'ఆయెను' అనుదాని ప్రశ్నార్థక రూపమె 'ఆయెనా' అనునది.

అప్యర్థము వాచ్యమగుటకుఁ దమిళమందువలెనె తెల్గునందును 'ఇన' అనుదానికి 'ఉ' అను సముచ్చయార్థకము చేర్పఁబడును. ఉదా:— తెల్గు—

చేసిన + న్ + ఉ = చేసినను = (చేసినప్పటికిని). తమి - చెయ్‌ద్ + ఇన్ + ఉమ్ = చెయ్యిన్ + ఉమ్ = చెయ్యినుమ్ = (చేసినప్పటికిని)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము.—'సెయ్‌దక్కాల్' = (చేసిన నాఁడు = చేసినప్పుడు) అను రూపమునుబట్టి కొవలయును డా. కాల్డువెల్లుగారు చేదర్థక ప్రత్యయమగు 'ఇనన్' అనునది సప్తమ్యర్థక మనుచు నొక సిద్ధాంతమును చేసిరి. 'ఇన' అనుదాని యొక్క ప్రత్యయ వికృతిచేఁ గావలయు 'ని-న' అను తెల్గు సప్తమ్యర్థక ప్రత్యయ మేర్పడునని సూచించిరి. ఈ ప్రసంగమునుబట్టి 'ఏని' శబ్దము 'అగు' ధాతు జన్యమనుటకుఁ బ్రక్రియ నిట్లు చూపిరాయని యాలోచింపవలసియున్నది. అగు ధాతువులోని 'ఆ' కారము 'ఏని' శబ్దములోని 'ఏ' కారమనియు దానికిఁ బర మందున్న 'ని' అనునది తమిళ సప్తమ్యర్థకమగు 'ఇన్' ("'ఇన్' లేదు. 'ఇల్' గలదు" శ్రీ రెడ్డిగారు) ప్రత్యయమున కభిన్నమనియు వీరు దలంచిరి. సమాపక క్రియలపై నిల్చు చేదర్థమును బోధించు 'ఏని' శబ్దము సప్తమ్యంతమనుట కేవలము నసంభవము. మఱియు 'ఆగు' ధాతు రూపముపైని సప్తమ్యర్థకమగు 'ని' ప్రత్యయము నిల్చెననుట యంతకన్నను నసంభవము.

తెల్గు 'వపోసినాఁడు = (పోవని యెడల)' (భార. ఆది. ౧౧౫ ప.) తమి- 'సెయ్‌దక్కాల్' = (చేసిన కాలమున = చేసిన నాఁడు) అను తమిళాంధ్రముల వాడుకలు గలవనుట నిజమె కాని వానిలోని సప్తమ్యంత దేశకాల వాచక శబ్దములు చేదర్థ ద్యోతకములగుచున్నవనుట యుక్తముగాని సప్తమీ విభక్తి చేదర్థద్యోతక మనుట యుక్తము కాదు. మఱియుఁ దెల్గులోని 'ఇనన్' అను చేదర్థక ప్రత్యయము సప్తమ్యర్థకమనుట సరికాదు. దీనిని బోలెడి తమిళభాష యందలి 'ఇన్' ప్రత్యయమునకు స్థలాంతరమునను సప్తమ్యర్థము లేదు. ఈ చేదాద్యర్థకరూప సందర్భమున 'ఇనన్' అను తెల్గు ప్రత్యయమును 'ఇన్' అను తమిళ ప్రత్యయమును భూతార్థకములనుటయె యుక్తము. 'ఇన్' అనునది ద్రావిడ భూతార్థక ప్రత్యయమని యీ వఱకు విశదపఱిచి యున్నాను (చూడు ౧౩౧ II విభ.) ఇంతియకాక చేదాద్యర్థకములందలి 'ఇన్' అనుదానికి 'ఆ కాలమున-ఆ సందర్భమున' అనునర్థములు దుర్ఘటములు. 'తెలుఁగు-చదివినన్-తమి-చెయిన్-చెయ్యిన్' అను చేదర్థక స్థలములందు ధాతు రూపములమీఁద సప్తమీ విభక్తి నిల్చుట కేవలము నసంభవము.

తెల్గు చేదాద్యర్థకమగు 'ఇనన్' ప్రత్యయమున కీ క్రిందిరీతిని జరిత్రము నూహించుట యర్హము. 'ఇన్' అనునది భూతార్థకము. 'అ' అనునది విశేషణ తానిష్పాదక ప్రత్యయము. కాఁగా 'చేసిన' అను ధాతుజ విశేషణరూప మేర్పడుచున్నది. దీనిపైని 'ఏని' శబ్దపు సంక్షేప రూప మనఁదగు 'న' కారము

నిల్చుటచేత ఇనన్' అనెడిచేదర్థక రూపమేర్పడుచున్నది. దొరగారు దెల్గులోని కళాద్రుత ప్రకృతికముల స్వరూపము గ్రహింపలేదు. వారికి నకారము వలసినచో వచ్చును. అక్కఱలేనిచోఁ బోవును. "ఇన భూతార్థక విశేష ణము-'ఇన' చేదర్థకము" అనుటలో వారికించుకేని సంకోచము లేదు-ద్రుత ప్రకృతిక నకారము శబ్దావయ మను నభిప్రాయమే వారికి లేదు. 'స్టడీ-ద్రవి' గ్రంథకర్తగారు 'చేసిన+అన్=చేసినన్' అని చేదర్థక ప్రత్యయమును విభజించిరి. "చేయఁబడుటయొక్క స్థలమందు 'అన్' సప్తమీ ప్రత్యయము" అని వ్రాసిరి (చూడు ౨౮ పుట 'స్టడీ-ద్రవి'). 'చేసిన' అను విశేషణము పైని సప్తమీ ప్రత్యయము నిలుచుటెట్లో? తెలియకున్నది. 'చేసిన' అనుదానికిఁ జేయఁబడుటయొక్క యను నర్థ మెట్లు గల్గును? 'చేసినన్' అనుదానిలోని 'న' కారము 'ఏని' శబ్దసంబంధి యనుటయె యుక్తమనఁదగును. 'ఇనన్-ఏని' అనునవి ప్రాచీనతమ చేదర్థక ప్రత్యయములు. చూడు 'కళరేని=కలరేని= కల్గినచో' "నిల్పినమ్ పుణ్యమ్ము=నిల్పినంబుణ్యంబు=నిల్పినచోఁ బుణ్యము" (ఆం. భా. వి. ౧౦౧ పుట. నన్నయకు ముందటి తెల్గు శాసనములు).

'ఇనన్' అను చేదర్థకము తెల్గు ధాతువుపై నిల్చును. ఏని శబ్దమన్ననో తెల్గు సమాపక క్రియాదులపై నిల్చి చేదర్థమును బోధించును. ఒకప్పుడు తెల్గు చేదర్థకముమీఁద 'అగు' ధాతు చేదర్థకము నిల్చినను ముఖ్యధాతు చేదర్థమే ద్యోత్యమగును. ఉదా:—చేసిన నైనన్=చేసినచో. అంతియకాని 'అగు' ధాతు చేదర్థక రూపము 'ఏని' శబ్దమువలె సమాపక క్రియపై నిల్చుట తెల్గు సంప్రదాయము కాదు.

క. సారథియు రథియునై యొక । తేరం గృష్ణు లతిఘోర తేజస్స్ఫార । స్ఫారతఁ దోఁచిన నైనన్ । ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే. (భార. ఉద్యో. ౨ ఆ. ౧౫౨)

పై రీతినుండునే కాని తమిళమందువలెఁ దెల్గున నగు ధాతు సంబంధి చేదర్థక రూపము సమాపక క్రియపైని నిల్చుట సంప్రదాయము కాదు. 'ఏని' శబ్దము 'అయిన్' అను తమిళ శబ్దమును సంబంధించుననియు నయ్యది 'అవు' ధాతుజన్య రూపమేయనియు వ్రాసిన దొరగారి వ్రాఁత యథార్థము కాదు. ఏని శబ్దము పక్షాంతర వాచకమగు ప్రత్యేకావ్యయ శబ్దము. అగు ధాతుజన్య రూపముకాదు. అయ్యది చేదర్థక ప్రత్యయమునకుఁ జాలవఱకు సమానార్థకము. కావుననే 'అయినన్' అనుదానికి 'అగునేని' అనునది పర్యాయ రూపమగు చున్నది.

"తే॥ గీ॥......గర్వితుఁ డగు నేని శాప। హవ్యవాహ ఫలంబు వీఁ డనుభవించు" (భార. అర. ౧ ఆ. ౧౦౩ ప). ఇట్టి ప్రయోగములనుబట్టి యెందేని 'ఏని' శబ్దము సుబంతముపై నిల్చినను నచట సందర్భయోగ్య తిజంత రూపము లోపించెనని యెఱుంగనగును.

ఆ. వె. నాకువిహిత భక్షణం బిది యిప్పుడిఁ। బూని కావ నీకు బుద్ధి యేని......(భార. అర. ౩ ఆ. ౨౩౪ ప). ఇందు "బుద్ధియేని=బుద్ధి కల దేని=బుద్ధి గల్గుచో" అని 'కలదు' అను తిజంత మధ్యాహార్యమని యెఱుంగ నగును.

ఏని శబ్దము పక్షాంతరమును దెల్పు సంస్కృత 'చేత్' శబ్దము నంటిది.

"ఏని దే. అవ్య. పక్షాంతరమును దెల్పెడిని......" (శ. ర.)

"చేత్-అవ్య. (చిత్+విచ్) యద్యర్థే-పక్షాంతరే......" (శబ్దస్తో).

సంస్కృతమున "చేత్" అను నవ్యయము సమాపక క్రియపై నిల్చు నట్లె తెల్గున 'ఏని' శబ్దమును సమాపక క్రియపై నిల్చును. ఉదా:—గచ్ఛసి చేత్=వెళ్లితివేని. మొ.

" 'ఏని' శబ్దమువేఱు. 'ఏ' శబ్దమువేఱు" అని దొరగారు తలంచుట పొరపాటు. 'ఏని' శబ్దమువలె నిది సమాపక క్రియపైని నిల్వదనుట యింకొక పొరపాటు. "లిఙ్గాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు" అను బాల వ్యాకరణ సూత్రము చెప్పునఁ (చూడు 'వ్యా. సం.' ౩౦౩, ౩౦౩ I విష.) బాక్షిక 'వ' కార లోపము కల్గఁగా మిగిలిన (చెప్పితివి)='చెప్పితి' అను రూపము క్రియాంగమని దొరగారు వ్రాయుట కేవలము నవిమర్శన మూలకము.

క. ఆయతభుజ నీవు తాల్చి తభిషిక్తుఁడవై (భార. ఆది. ౨ ఆ. ౨౦౨). (తాల్చితివి=తాల్చితి) (చూడు 'వ్యా. సం.' ౩౦౩ I విష.) 'చేసితే-చేస్తే' అను దొరగారి యుదాహృతులును సమాపక క్రియలె) "చేసితివి=చేసితి+ఏ= చేసితే=చేస్తే" అను చెప్పున వీనిలోని 'చేసితి' అను రూపము తిజంతమే కాని క్రియాంగము కాదు. అట్టి తిజంతముమీఁదనే 'ఏని' శబ్ద సంక్షేప రూపముగు 'ఏ' అనునది నిల్చినది. "నీవు చేసితివేని=నీవు చేసితేని=నీవు చేసితే=నీవుచేస్తే" అని యేర్పడెను. అవెల్ల నభిన్నములె. 'నీవు చదివితే' మున్నగు నీ రూపములు మధ్యమ పురుషమునందే సాధువులు. "నేను జదివితిన్+ఏని=నేను జదివితినేని" అని యగునే కాని "నేను జదివితేని= నేను జదివితే" అను రీతిని నేర్పడ నేరవు. నకార ముచ్చారణ మాత్రార్థక మనెడి కాల్డువెల్లుగారి యాంధ్ర సంప్రదాయ విరుద్ధ పద్ధతిని సిద్ధించిన సిద్ధించు

నేమో. తెల్గు సంప్రదాయము చొప్పున "నేను జదివితే—మేము చదివితే-మీరు చదివితే-వాఁడు చదివితే-వారు చదివితే-అది చదివితే-అవి చదివితే" అనురీతి గల రూపములెల్ల నసాధువులె. 'నీవు చదివితే' అను దాని ప్రభావమున సామ్య సిద్ధాంతముచొప్పున (Analogy) నట్టి రూపములు తెల్గు వ్యవహారమున విస్తరించినవి. వైదేశికులగు దొరగార్ల కవియేవో విభిన్నములుగాఁ దోఁచెను. దొరగారి 'ఏ' ప్రత్యయము సమాపక క్రియపైని నిల్వక సమాపక క్రియాంగముపై నిల్చుననుచున్నారు గదా! 'వారు చదివి+రి' మున్నగు చోటులందలి 'చదివి' మున్నగు క్రియాంగములపై నిల్చు ననుటకు సాహసింతురా? ఆ పక్షమున 'వారు చదివితే' అనునది యేర్పడక 'వారు చదివే' అను రీతిగల యనిష్ట రూపములు గల్గునుగదా. 'చదివినన్' అను దానిమీఁదనేకాక 'చదివితేని' అను రీతిగల చేదర్థకములపైని సయితము సముచ్చయార్థకములగు "ఉన్–నున్–(ఉమ్)" అనునవి నిల్చినపుడును నవి 'అప్యర్థ' కములగును.

తే॥ గీ॥ హితములగు నాదు వచనంబు లిపుడు వినని । వాఁడవైతేని నప్పుడు వారు పడిరి । వీరు పడిరను పలుకులు విందుగాక । ......(ఉద్యో. ౨ ఆ. ౧౫౫). (విననివాఁడవైతేనిన్=విననివాఁడవైతేని+నున్=విననివాఁడవైనప్పటికిని).

'క్లై' దొరగారి యాశయమును సంప్రదాయ విరుద్ధమె. 'వాఁడు చేసెనే' అను కళా శబ్దమునకు 'వాఁడు చేసినాఁడా' అను నర్థమె తెల్గునఁ గలదు గాని 'వాఁడు చేసెనేని' అను చేదర్థములేదు. 'వాఁడు చేసెనా' అను ప్రశ్నార్థకమునకు వలయునేని 'చేసెనేని' అనియు 'చేసినాఁడా' అనియు నర్థములు లభించును. కాని 'క్లై' దొరగారి వాక్య మచటి సందర్భమునుబట్టి చేదర్థక విషయకమె యని తోఁచును.

దొరగారు వివరించిన 'అట్లైతే' అనునది పైని వివరించిన 'తే' ప్రత్యయాంతముల వంటిదే కాని యది పురుషబోధక ప్రత్యయము చేరని రూపము కాదు. 'అయితివి+ఏని = అయితివేని = అయితివే = అయితే' అని దాని ప్రక్రియ నరయునది. 'అట్టాయెనా?' అనునది పైని వివరించిన 'చేసెనా' అను దాని రీతినే చేదర్థకము సైతము కావచ్చును. 'అట్టయితే-అట్టాయెనా' అను వానిలోని 'అట్టు'=(ఆ విధము) అనునది 'అట్లు' అనుదానివలెనె ప్రథమాంత విశేష్యమగుటచేత నవి సమాపక క్రియపై నిల్వనేరక ధాతుజ విశేషణముపై నిల్చున వగుచున్నవి. ఉదా:—నీవు చేసినట్టయితే. నీవు చేసినట్టాయెనా నాకు మేలుకల్గును. మొ.

నన్నయ కాలమున కవతరింపని "వాఁడయితే" మున్నగువానిని జేదర్థక ములనుగా నంగీకరించి యుదాహరించిన దొరగారు నన్నయ పెక్కు-సార్లు వాడిన 'నాఁడు' మున్నగువానిని జేదర్థకములనుగా నుదాహరింపకుండుట వింత.

ఉ......అట్లు కానినాఁ। జేలగ్నృహస్థ వృత్తి......(భార. ఆది. ౬ ఆ. ౨౨౦). (కానినాఁడు=కానిచో) ఇట్టివి పెక్కు-గలవు. ఇట్టి వానినిబట్టి "అప్పుడు-ఎడల-చో" మున్నగు రూపములును వెలసినవి. ఉదా:—నీవు రానప్పుడు=నీవు రానినాఁడు. రానియెడ-రానియెడల-రానిచో మొ. ఇవెల్ల విశేష్యములుగాన ధాతుజ విశేషణముల పైనే నిల్చును. ఉదా:—నీవు వచ్చిన యెడల. మొ. ఇట్లు సప్తమ్యంతములగు దేశవాచకములును గాల వాచకములును జేదర్థ బోధమునఁ బ్రయుక్తములగుట తెల్గున సంప్రదాయమై యున్నది.

'స్టడీ-ద్రవి' గ్రంథమునఁ బయి కాల్డువెల్లు విషయముల నెక్కు-ంచుటలోఁ గాల్డువెల్లుగారి చొప్పుననే తెల్గున 'అగు' ధాతురూపమగు 'అయితే' అనునది చేర్చుటచేత నైకము చేదర్థకరూప మేర్పడుననియు వ్రాయఁబడెను. 'అయితే' అనునదే యననేల? 'చదివితే-చేసితే' మున్నగునవెల్లఁ జేదర్థక రూపములె. అట్టియెడల 'ఏని' శబ్దముగాని దాని ఖండముగాని సమాపకక్రియపై నిల్చుట చేతఁ జేదర్థము ద్యోత్యమగుచున్నదని వ్రాయుట యుక్తము. డా. కాల్డువెల్లు గారు వ్రాసినట్లు తెల్గునఁ దమిళమందువలె 'అగు' ధాతు చేదర్థకరూపములు చేదర్థక ప్రత్యయములగుననుట సత్యముకాదని పయిని విశదీకరించియే యున్నాను.

౧౩౫. IV విష:—"తమిళ చేదర్థకములు:—తమిళములోని సప్తమ్యర్థక ప్రత్యయములగు 'ఇల్-ఇన్' అనువానిని బ్రత్యయములు చేరఁదగిన క్రియాం గముపైని నిల్పఁగాఁ జేదర్థకరూపమేర్పడును. అట్టి క్రియాంగము భావార్థక, భావ్యర్థక తద్ధర్మార్థక సాధారణమె. ఉదా:—'పోగు=(పోవు)' అనుదానినుండి, 'పోగ' అను భావార్థకమును, 'పోగున్' అను భావ్యర్థక తద్ధర్మార్థకమును, 'పోగిల్=పోగిన్' అను చేదర్థకరూపమును నేర్పడుచున్నవి. ఇట్లె 'వరు'=(వచ్చు) అను క్రియాంగమునుండి 'వర' అను భావార్థకమును 'వరుమ్' అను భావ్యర్థక తద్ధర్మార్థకమును, 'వరిల్=వరిన్' అను చేదర్థకరూపములును నేర్పడును. ఈ రీతినె 'ఆగు=(అగు)' అను క్రియాంగమునుండి 'ఆగ' అను భావార్థకమును, 'ఆగుమ్' అను భావ్యర్థక తద్ధర్మార్థకమును 'ఆగిల్=ఆగిన్' అను చేదర్థకరూప మును నేర్పడుచున్నవి. 'ఆగిన్' అను రూపము సారళ్యమునంది 'ఆయిన్' అని యేర్పడుచున్నది. ఇది చరిత్రమందును నర్థమునందును దెల్గులోని 'ఏని' శబ్ద మున కభిన్నమై దానివలెనె పురుషబోధక ప్రత్యయములపైని నిల్చును.

'ఆయిన్' శబ్దమందలి 'ఇన్' సప్తమ్యర్థకము. 'ఇన్' అనుదాని కభిన్నమగు 'ని' అనునది తెల్గున సప్తమ్యర్థకము. కాఁగా "ఆగిల్ = ఆయిన్ = ఏని" అనునవి 'అయినచోన్' అను చేదర్థముగలవై సమాపకక్రియలమీఁద వేర్వేఱ నిల్చును" (కాల్డు. ౫౭౮ా పుట).

(తమిళమున "ఆగిన్ = ఆయిన్ = (అయినచోన్)" అని యాగుధాతు చేదర్థకరూపము లేర్పడినట్లె తెలుఁగున 'అగు' ధాతువునుండి 'ఏని' అను చేదర్థక మేర్పడెనని దొరగారి యాశయము. ఇది సరికాదని ౧౩౫ III విషయమున విశదీకరింపఁబడెను).

"పైని వివరించిన 'ఆగిల్ = ఆయిన్ = ఆనాల్' అను 'ఆగు' ధాతువు యొక్క చేదర్థకరూపములను దెల్గునందలి 'ఏని' శబ్దమునువలెనె యితర సమాపక క్రియారూపములపైని నిల్పినచోఁ దమిళమందలి రెండవ విధమగు చేదర్థకరూపముల నిర్మాణ మేర్పడును. ఉదా:—సెయ్దేన్ ఆగిల్ = (చేసినచో = చేసినవాఁడ నయినచో) చెయ్వేన్ ఆగిల్ = (చేయుచో = చేయువాఁడ నయినచో). ఈ ద్వితీయపద్ధతి చేదర్థకముల వాడుక గ్రాంథిక తమిళమునఁ బ్రాయికముగాను వ్యవహారమున నరుదుగాను గద్యరచనమున నింపుగాను నుండును" (కాల్డు. ౫౭౮ా పుట).

"క్రియయొక్క భూతార్థక ధాతుజవిశేషణముపైని 'కాల్' అను శబ్దభాగము ననఁగా నామవాచకమును నిల్పుటచేత మఱొక విధమగు చేదర్థకరూపము తమిళమునవేర్పడును. ఉదా:—సెయ్ద + క్ + కాల్ = సెయ్దక్కాల్ = (చేసినచో = చేసిననాఁడు). ఉవరి ఒలిత్త + క్ + కాల్ = (సముద్రము గర్జించినచో), తమిళ వ్యవహారమున దీని యపభ్రంశములగు "సెయ్దక్కా = (లేదా) సెయ్దాక్కి =" అనునవి తఱచుగా వాడఁబడును. 'కు' భాషయందును 'క్క' అనుదానిని జేర్చుటచేతఁ జేదర్థకరూప మేర్పడును. 'కాల్' అనునది ధాతుజవిశేషణముపైని నిల్చుటనుబట్టి యది విశేష్య మనఁదగును. అయ్యది సంస్కృత కాలశబ్దవికృతి యనదగును. మలయాళమున నిది యింకను వికృతమై 'కల్' అను రూపముతో నున్నది. స్థానార్థకములు తఱచుగాఁ గాలవాచకములగుచుండును. "కాల్ = (చోటు)" అనునది (స్థలవాచి సప్తమీ ప్రత్యయమని భావము). "ఎప్పుడు" అను నర్థముగలదై (యత్తచ్ఛబ్దసంబంధము చేత 'అప్పుడు' అని యర్థము). "ఇల్ = ఇన్" అను వానితోపాటుగాఁ గ్రియాంగముపై నిల్చి చేదర్థక మగుచున్నది. ఇట్టి కాలవాచికి సందర్భమునుబట్టి చేదర్థము లభించును. ఉదా:—తమిళ పద్యార్థము:—"ఎవరికొఱకైనను నీవు మంచి పనిని జేసినపుడు నాకును నట్టి మంచిపని నెపుడు చేయుదు రనుకొన

కుము" ఇందు "నీవు చేసినప్పుడు" అనుదానికి (సెయ్‌దకాల్?) "నీవు చేసినన్" అను చేదర్థము గల్గుచున్నది. ఈ 'కాల్' శబ్దమును భావ్యర్థక ధాతుజవిశేషణ సందర్భమున వాడుదురు. ఉదా:—సెయ్యుఙ్గాల్ =(చేయునప్పుడు). ఇందు 'కాల్' అనుదాని కాలవాచిత్వము స్పష్టమగుచున్నది. ఏ కాలమందుఁ జేయుదునో యా కాలమందని యర్థము" (కాల్డు. ౫౨౮, ౫౨౯ పుటలు).

"భూతార్థక విశేషణముపైని 'ఆల్' శబ్దమును జేర్చుటచేత నింకొక విధమగు చేదర్థకము తమిళమున నేర్పడును. ఉదా:—సెయ్‌దాల్ = (చేసినచో) ఇట్టి చోటులందు క్త్వార్థకముపైని (సెయ్‌దు+ఆల్' అని భేదము కాదని దొరగారు నిరూపించుచున్నారు) 'ఆల్' ప్రత్యయము నిల్చెననియుఁ దలంపవచ్చును. ఇది తెల్గులోని "చేసితే=చేస్తే" అనుదానికి సరిపడును. కాని 'న' కారముతో ముగియు ధాతుజవిశేషణములను బరిశీలించునపుడు 'ఆల్' ప్రత్యయము భూతార్థక విశేషణములపై నిల్చుచున్నదే (సెయ్‌ద+ఆల్ అనియే) కాని క్త్వార్థకములపై నిల్వలేదని విశదమగును. ఉదా:—ఆగు ధాతు చేదాద్యర్థకము—"ఆనాల్ =(ఆన్+అ+ఆల్)" అని యేర్పడునేకాని "ఆగియాల్" అని యేర్పడదు. (ఆగిన=ఆయిన)=ఆన+ఆల్=ఆనాల్ = (అయినచో). మఱియు క్త్వార్థకము క్రియతో నన్వయించును. 'ఆనాల్' అను చోటి 'ఆన' అను ధాతుజవిశేషణముతో 'ఆల్' ప్రత్యయ మన్వయించుచున్నది. 'ఆన' అనునది 'ఆగు' ధాతుజవిశేషణమే కాని క్త్వార్థకముకాదు.

'ఆల్' ప్రత్యయము తమిళ వ్యవహారమునఁ బురుషబోధక ప్రత్యయము నిల్వని క్రియాంగముపైనే నిల్చును. కాని శిష్టవ్యవహారములోఁ గాలము లన్నిటి యందును బురుషబోధక ప్రత్యయములపైనె 'ఆల్' అనునదే కాక తత్సదృశమగు 'ఏల్' అనునదియు నిల్చును. ఉదా:—చెయ్‌దనై (య్)+ఏల్ =(నీవు చేసినచో). చెయ్‌గువేన్+ఏల్ =(నేను జేయుదునేని). ఇవి (ఆల్=ఏల్) ధాతుజవిశేషణములపైని సయితము నిల్చును. ఉదా:—సామాన్య తమిళము —సెయ్‌గిన్ద్ర+వ్+ఆల్ = (నేను (లేదా) నీవు చేయుచున్నచో) సెయ్‌ద+వ్ +ఆల్ =(నేను (లేదా) నీవు చేయుచో). ఉత్తమ వ్యవహారమున నున్న "సెయ్‌దవాల్ ('ఇట్లులేదు'. శ్రీ రెడ్డిగారు)" అనుదానికన్న వ్యావహారికమగు 'సెయ్‌దాల్' అనునది దాని చరిత్రమును విశదీకరించుచున్నది" (కాల్డు. ౫౨౯ పుట).

"ఈ చేదాద్యర్థకమగు 'ఆల్' ప్రత్యయము తమిళములోని కరణకారక ప్రత్యయమగు 'ఆల్' అనుదానికి భిన్నముకాదు. ఈ ప్రత్యయము 'ఆగు' ధాతువునుండి యేర్పడిన 'ఆగల్' = (ఎప్పుడో అప్పుడు) అను కన్నడ క్రియా

నామ వాచకమునకు సమానార్థకమని డా. గుండర్టుగా రుత్తమోత్తమమైన యూహమును గావించిరి. 'ఆగల్' అను కన్నడ శబ్దము తమిళమున 'ఆల్' అని యగుట సులభము. తమి. 'ఆగు' ధాతుమూలరూపము 'ఆ' అను నదేకదా. ఉత్తమ తమిళ వ్యవహారమున 'ఆల్' అనుదానికన్న 'కాల్' అను దాని వాడుకయె తఱుచు" (కాల్డు. ౫౨౯, ౫౩౦ పుటలు).

"చేదాద్యర్థకము రెండు విధములు. I చేదర్థకము. II అప్యర్థకము. చేదర్థకముపైని సముచ్చయార్థక శబ్దమును నిల్పినచో నది యప్యర్థక మగును. ఉదా:—సెయ్వాల్ =(చేసినచో)—సెయ్దాలుమ్ = (చేసినప్పటికిని). 'ఉమ్' అనుదానికి సముచ్చయార్థమును నప్యర్థమును గలవు. 'నేను జేసినచో సైతము' అను రీతి నప్యర్థకత్వమున యథాశ్రుతార్థము నరయునది. భూతార్థబోధము వలసినపు డీ 'ఉమ్' ప్రత్యయమును క్త్వార్థకముమీఁద నిల్పుటయుఁ గలదు. ఉదా:—సెయ్దుమ్=(చేసినప్పటికిని=చేసియు)" (కాల్డు. ౫౩౦ పుట).

విమర్శము:—'ఇల్ =ఇన్' అను సప్తమ్యర్థకములు క్రియాంగముపై నిల్చుటచేత 'చేదర్థక' రూపమేర్పడుట యసంభవము. సప్తమ్యర్థక ప్రత్యయములు క్రియాంగముపై నిల్చుటయు నసంభవమె. సప్తమ్యర్థమునకును జేదర్థమునకును నించుకేని సంబంధము లేదు. సప్తమ్యంతములగు దేశకాలవాచకములు చేదర్థకములగుట సహజము. ఉదా:—తెల్గు—నీవు చేయనినాఁడు=నీవు చేయనిచో, తమి-సెయ్దక్కాల్ = చేసినప్పుడు = చేసినచో. "కణ్-కాల్" (తొల్కా. ౫౬౬ సూ.) అను తొల్కాప్పియ సూత్రము చెప్పిన దేశకాల వాచక శబ్దములు సప్తమ్యర్థకములు కావచ్చును. అట్టియెడల నున్న "కణ్-కాల్" మున్నగువానికి 'అందు' అను నధికరణమాత్రమె యర్థము. ఉదా:—విళవత్తుక్కణ్ =వెలగచెట్టునందు. ఇట్టియెడల 'కాల్' మున్నగువానికిఁ దమిళమున "కాలమందు" అను నర్థములేదు. "చేదర్థము నిచ్చు 'కాల్' అనుదానికి 'కాలమందు' అనియే యర్థము. అట్టి యర్థము గల్గునపుడే దానికిఁ జేదర్థము లభించును. చెయ్దక్కాల్ = చేసినకాలమందు = చేసిననాఁడు = చేసినచోన్.

మఱియు 'ఇన్' ప్రత్యయము స్థలాంతరములందు సప్తమ్యర్థక మననగు నేమో కాని చేదర్థసందర్భమున నయ్యది భూతార్థకము. (చూడు ౧౩౫ III విష). 'ఇన్' అనుదానికిని భూతార్థకత్వము గలదని ౧౩౧ II విషయమున వ్యాకరణ సూత్రోదాహరణ పూర్వకముగా విశదీకరింపఁబడెను.

"చెయ్దు......" (తొల్కా. ౨౧౨ సూ.)=చెయ్దు=చెయ్యా=చెయ్పు=(చేసి) చెయ్దెన=(చేసినదానన్)-చెయ్యియర్-చెయ్యియ-చెయిన్=

(చెసినన్)-చెయ=(చేయఁగా) చెయఉఙ్కు=(చేయన్)" ఇట్టి రీతిరూపములతో నున్న తొమ్మిదివిధముల రూపములును నెల్లక్రియలకును నసమాపక క్రియలుగ నేర్పడును. ఉదా:—చెయిన్=(చేసినన్) దీనిచేత 'ఇన్' ప్రత్యయము దొరగారు చెప్పినట్లు క్రియాంగముమీఁదనే కాక ధాతురూపముపైని సైతము నిల్చునని విశదమగుచున్నది.

"పిన్-మున్......" (తొల్కా. ౭౧౩ సూ.)—"'పిన్-మున్-కాల్-కడై-వఴి-ఇడత్తు' ఇవి తుదినిగలవై కాలమును దెలుపు శబ్దములెల్ల నసమాపక క్రియలె. పోనపిన్=(పోయినవెనుక=పోయినన్). మున్-చెయ్యామున్=(చేయకముందు)-కాల్-చెయ్దక్కాల్=చెయ్దకడై=చెయ్దవఴి=చెయ్దవిడత్తు=(చేసిననాఁడు=చేసినన్) (ఇవి చేదర్థకములు)......".

తెల్గునందలి 'ఏని' శబ్దము తమిఴమందలి 'ఆయిన్' అనుదాని కభిన్నమనియు 'ఆగు' ధాతుజన్య రూపమనియు వ్రాసిన దొరగారి వ్రాఁత సరికాదని యీవఱకు విశదపఱిచి యున్నాను (చూడు ౧౩౫ III విష).

తమిఴమందలి 'సెయ్దక్కాల్' మున్నగునవి తెల్గునందలి 'చేసిననాఁడు' మున్నగువానికి సమానార్థకములు. 'ఆల్' ప్రత్యయము కన్నడమందలి "ఆగల్=(ఆల్) అప్పుడు" శబ్దసంబంధి యనుట విశ్వసనీయము కాదు. కర్ణాట వ్యాకరణములలో నామవాచక నిష్పాదకమగు 'అల్' ప్రత్యయము కానరాదు. 'అల్' అనునది తుమున్నాద్యర్థకముగా సూత్రింపఁబడి యున్నది. కావున 'ఆగల్' అనునది ప్రాచీన శబ్దమని తోఁచదు. పరిశీలింపఁగా 'ఆన్=ఆల్' అనెడి తచ్ఛబ్దరూప నిర్దేశక సర్వనామశబ్దము దీనికి ('ఆల్' ప్రత్యయమునకు) మూలమనుట యుక్తము. తొల్కాప్పియమునందే 'ఆన్' = శబ్దము పేర్కొనఁబడినది. (చూడు ౨౮ V విష).

౧౩౬. I విష:—"విధ్యాద్యర్థకము:—ద్రావిడ భాషలలో మధ్యమ పురుషైకవచన విధ్యాద్యర్థకము సామాన్యముగ ధాతువునకు భిన్నముకాని యాకారముతో నుండును. దీని ప్రాయికత్వ మియ్యది యీ భాషలకు నైజమని నిరూపింపఁజాలి యున్నది. కొన్నియెడలఁ జిన్నమార్పులున్నను నవి పైపద్ధతి కపవాదము లనఁదగినవి కావు. ఉదా:—తమి-ధాతు:—వరు=(వచ్చు). దీని విధ్యాద్యర్థకము:—వా=(రమ్ము)=తెల్గు-రా. తమిఴ బహువచనము:—వమ్మిన్ = (వరు+మిన్?) = తెలుఁగు:—రమ్ము. పూజ్యతా బహువచనము నందును నిట్లె రూపసిద్ధి నరయునది" (కాల్డు. ౫౩౦ పుట).

"అకర్మకధాతువులమీఁది కాలిక చిహ్నము ద్విరుక్త మగుటచేత సకర్మక ధాతు వేర్పడునని యీవఱకుఁ దెల్పితిని (౧౨౧ IV విష. చూడు). అట్టి

సకర్మకములందును వైరీతినె రూపసిద్ధి గల్గును. తమి-అకర్మక-కెడు=(చెడు). దీని విధ్యర్థక-కెడు=(చెడుము). దీనిసకర్మక-కెడుక్కు ('కెడు' అనియె. శ్రీ రెడ్డి గారు) = (చెఱుచుము). భావార్థక-కెడ ('కెడల్' శ్రీ రెడ్డిగారు)=(చెడుట). కెడక్క ('కెడుక్కై' శ్రీ రెడ్డిగారు)=(చెఱుచుట). తెల్గునం దకర్మక సకర్మకధాతు విధ్యాద్యర్థక రూపములందు భేదములు చూపట్టును. ఉదా:—తెల్గు-అకర్మక-చెడు=(చెడుము). సకర్మక (చెడుచు)=చెఱుచు=(చెఱుపుము). తెల్గు క్రియలు పెక్కిటియందుఁ గ్రియా ప్రత్యయములు చేరఁదగిన రూపము కేవల ధాతువు కాదు. ధాతువు తుదిని 'చు-పు-ంపు' అనువానిలో నేదేని దుదినిగల యొక జాతి క్రియానామవాచక రూపమనఁదగి యుండును. 'చెఱుచు' అను తెలుఁగు రూపమునకు సరియగు తమిళరూపము 'కెడుక్క' అనునది. ఇట్టిది సకర్మక భావార్థక రూపముయొక్క మూలరూపముగను, భావ్యర్థమునందలి యమహత్కర్తృక ప్రథమ పురుషైక వచనముయొక్క మూలరూపముగను నుండును. ఉదా:—కెడుక్క+అ = కెడుక్క = (చెఱుచుట). కెడుక్కుమ్=(చెఱుచును-చెఱుపఁగలదు = పాడుచేయును). తమిళమునఁ దక్కిన మఱికొన్నిచోట్ల ధాతువే క్రియా ప్రత్యయము చేరఁదగిన యంగమై యుండును. వాని యందును నొకొక్కప్పుడు రూపనిర్మాణోపయోగి ప్రత్యయ మేదేని యుండిన నుండవచ్చును. ఎట్లయినను దెలుఁగుకన్న సులువుగాఁ దమిళమున ధాతువు యొక్క ప్రాచీనతమరూపమును దెలిసికొనవచ్చును" (కాల్డు. ౫౩౦, ౫౩౧ పుటలు).

"తెల్గు విధ్యాద్యర్థకైక వచనరూప నిర్మాణమున "ము-మీ" అను ప్రత్యయములు వికల్పముగాఁ జేర్పఁబడును. (చెప్పు-చెప్పుము - చెప్పుమీ). ఇట్టి యలవాటే 'కు' భాషయందును గలదు. గ్రాంథిక తమిళమందును నొకానొకప్పుడు విధ్యాద్యర్థకైకవచన రూపమున 'మో' అనునది చేర్పఁబడును. తెలుఁగు 'ము-(లేక) మీ' అను నేదోయొక ధాతువుయొక్క లుప్తశేషము సైతము తమిళమందలి 'ఏన్' అనుదానివలెనె క్రియాతీవ్రతను దెల్పును. ఉదా:—తమి-కేళేన్ = (వినుమీ).—తెల్గున విధ్యాద్యర్థక మధ్యమ పురుష బహువచనమునఁ జేర్పఁబడెడి 'అండి' అనునది యేదో యొక నామవాచక సంబోధనపు లుప్తశేషరూపము. 'అండి' అనఁగా 'అయ్యలారా' అని యర్థము. ఇంకఁ దెల్గుక్రియలలో వచ్చు 'డి-ఉడి-ఉడు-డు' అనునవి 'అండి' అనుదాని సంక్షిప్తరూపములె యని యెఱుంగనగును" (కాల్డు. ౫౩౧ పుట).

విమర్శము:—తమిళ విధ్యర్థక బహువచనరూపమగు 'వమ్మిన్' అను దానికిఁ బర్యాయముగ దొరగారిచేతఁ దెల్గున 'రమ్ము' అనునది చూపఁబడుట మిక్కిలి పొరపాటు. (చూడు ౧౧౩ V విష). తెల్గున 'రమ్ము' అనునది

'రా' అనుదానికి మూలరూపము. 'రండు' అనునది దాని బహువచన రూపము. "ఏకత్వేధ బహుత్వే । 'ము-డు జొ' సంప్రార్థనార్థకేషు స్తః" (ఆం. చిం. చూడు 'వ్యా. సం.' ౧౮౯—౩౦౫ విష).

సమాపక క్రియలు క్రియా నామవాచక మూలకములెయను దొరగారి సిద్ధాంత మిచటను సప్రసక్తముగఁ బ్రదర్శితమయ్యెను. ఇది యీావఱకె నిరసింపఁ బడియున్నది. (చూడు ౧౩౭ I, II విష). 'చెలుచు' మున్నగు రూపములు తెలుఁగున నెన్నఁడును దొరగారు వ్రాసినట్లు క్రియా నామవాచకములు కానేరవు. తమిలమున 'కేళేన్' (వినుమీా) మున్నగుచోటులందలి 'ఏన్' అనునది కేవలము నవ్యము. ఇది నవీన కావ్యములందైన నెక్కలేదు. ఇంక 'కేళ్ మో'=(వినుము) మున్నగువానియందలి 'మో' అనునది మధ్యమ పురుషములందుఁ జేరెడి నిరర్థకశబ్దమని వైయాకరణులు చెప్పుదురు. ఇది తొల్కాప్పియమందే గలదు. ఇది మధ్యమ పురుష ప్రత్యయముగాఁ జెప్పఁ బడలేదు.

" 'ఏన్' (కేళేన్) అను రూపము వ్యావహారికమే. నవీనకాలపు కావ్యములందును నెక్కలేదు. 'మో'=(కేళ్ మో) కావ్యములందే కలదు. 'మో' నిరర్థకశబ్దమని వ్యాకరణములు చెప్పుచున్నవి. తొల్కా. ఇడై ఇయల్—(అవ్యయప్రకరణము) ౨౬ సూత్రమున 'మో' మధ్యమ పురుషమునందు నిరర్థకముగా వచ్చునని చెప్పఁబడి యున్నది.......దీనినిగుఱించి 'పరణర్' అను విమర్శన గ్రంథమందును, ద్రావిడ సర్వనామములు (Dravidic pronouns) అను గ్రంథమందును విపులముగా వ్రాసియున్నాఁడను" (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు ౨౦—౧౨—౫౩ తేదీ జాబు).

తెలుఁగు విధ్యాద్యర్థక ప్రత్యయములగు 'ము-డు' జు లేవో శబ్దముల లుప్తశేషములనియు నందలి, 'డు—డి' మున్నగునవి యేదో నామవాచక సంబోధనరూప లుప్తశేషమగు 'అండి' అనుదాని సంక్షేపరూపములనియు దొరగారు మిక్కిలి యవిమర్శితముగా వ్రాసిరి. 'ము' అనునది 'ఉమ్' అను తమిలు బహువచన ప్రత్యయఖండమనియు నది పూజ్యార్థకముగ నేకత్వవిషయమున వాడఁబడుననియు నీవఱకు డా. కాల్డువెల్లుగారు వ్రాసియున్నారు. (చూడు ౧౧౦ I విష. ౧౧౩ V విష). పరిశీలింపఁగాఁ దెల్గునందలి విధ్యర్థకైక వచన 'ము' ప్రత్యయము 'నీవు' అను సర్వనామశబ్దపు ఖండమగు 'వు' అనుదాని పరిణామమని తోఁచును. దొరగారుదాహరించిన తమిలు మధ్యమ పురుషమందుఁ జూపట్టు (౧౩౬ I విష). 'మో' అనుదాని వికృతి యేమోయని సందేహింపవచ్చునుగాని యది తొల్కాప్పియమున నేదో వ్యర్థపదముగా

వివరింపఁబడుటంబట్టియుఁ గన్నడమున దాని జాడ చూపట్టమింబట్టియుఁ దెల్గు 'ము' ప్రత్యయము 'వు' అను సర్వనామఖండము మూలముగాఁ గల దనుటయె యుక్తమని చెప్పనగును.

విధ్యర్థక బహువచన ప్రత్యయము దొరగారు వ్రాసినట్లు 'అండి' శబ్దపు సంక్షేపరూపము కాదు. 'అండి' శబ్దములోని 'డి' వర్ణము సైతము "డి-ఉడి-డు-ఉడు" అను దొరగారు వ్రాసిన విధ్యర్థక బహువచన ప్రత్యయములవంటిదె. 'డు-ఉడు' అను దొరగారు వ్రాసిన ప్రత్యయములు బిందుపూర్వకములు. అవి కేవలములు కావు. వానిమీఁద 'ఇ' అను స్వరము నిల్చినవె దొరగారు వ్రాసిన 'డి-ఉడి' అనునవి. ఉదా:—చదువుఁడు=చదువుండు=చదువుఁడి=చదువుండి. మొ. వీనిలోని 'చదువుండి' అనుదానివంటిదె 'అండి' అను దొరగారు వ్రాసిన శబ్దము. అది "అనుఁడి=అనుండి=అనండి=అండి" అను రీతిని బరిణమించిన 'అను' ధాతు విధ్యర్థక బహువచనరూపము. మఱియు "ము-డుజ్" అను విధ్యర్థక ప్రత్యయములమీఁద 'ఇ-ఈ' అనునవి మాత్రమె నిల్చు నననేల? 'ఆ-అయ్యా' మున్నగు శబ్దములును నిల్చుట ప్రసిద్ధము.

ఉ॥......నిర్ధారణ సేయుఁడా, హితము......(భార. ఉద్యో. ౮ ఆ. ౯౦ ప.)

చ॥......ఈ। ధరణి సురాన్వయోత్తముఁడు ధర్మవిధిం జెపుడయ్యా.........(భార. ఆది. ౭ ఆ. ౨౦౭ ప.)

క॥......। <u>మ</u>నకొక్కటి నిశ్చయింపు<u>మా</u> తగుబుద్ధిన్. (భార. ఆర. ౭ ఆ. ౮౮ ప.)

చ॥ అమలచరిత్రయేల చెపుమయ్యా....(భార-ఆది. ౧ ఆ. ౧౨౮ ప.)

"సంప్రార్థనార్థకా దీ। చ్చోదాతౌ........." (ఆం. చిం.) ('వ్యా. సం.' ౩౦౮ విభ).

పయిరీతిని 'అనుఁడి' శబ్దమునుండి పరిణమించిన 'అండి' శబ్దము కాల క్రమమున విచిత్రములగు వాడుకలలో వెలయుచున్నది. ఉదా:—ఏమండీ మీరు వత్తురా? ఎప్పుడండీ మీరు వచ్చెదరు. ఇది మీకుఁ దగునండీ. అదేమి టండీ యట్లు చెప్పెదరు? పై సందర్భమునుబట్టి 'అండీ' శబ్దమునకు 'అయ్యలారా' అను దొరగారు వ్రాసినది యర్థము. కాదని విశదమగుచున్నదిగదా. 'డుజ్జు' నామములందును గ్రియలందును గన్పట్టుచున్నది. అందు "రాముఁడు-వాఁడు-చదువఁడు-రాఁగలఁడు" మున్నగుచోటులందలి 'డుజ్జు' అభిన్నము. దాని చరిత్ర మీవలను విమర్శితమయ్యెను. (చూడు ౧౮ IX విభ. ౭౩ V విభ.)

అట్టి 'డుజు' నకు విధ్యర్థక బహువచనపు 'డుజు' కేవలము విభిన్నము. అయినను వాని పుట్టుకలోఁ గొంత సామ్యము భాసిల్లును. తెలుఁగు విధ్యర్థక మధ్యమ పురుష బహువచన ప్రత్యయమగు 'డుజు' పలుగన్నడ ప్రసిద్ధ విధ్యర్థక మధ్యమ పురుష బహువచన ప్రత్యయమగు 'ఇమ్' అనునది మూలముగాఁ గలదనఁ దగును. ఈ 'ఇమ్' ప్రత్యయము పలుగన్నడ ప్రసిద్ధమగు 'నీమ్' అను మధ్యమ పురుష సర్వనామ బహువచనశబ్దపు పరిణామమె. పలుగన్నడ విధ్యర్థకమగు 'ఇమ్' ప్రత్యయమె 'ఇన్' అను రూపముతోఁ దమిళ బహువచన 'మ్' ప్రత్యయముపై నిల్చి 'మిన్' అను తమిళ విధ్యర్థక బహువచన ప్రత్యయముగాఁ బ్రసిద్ధమగుచున్నది. ఇట్టి ద్రావిడ "ఇమ్=ఇన్" ప్రత్యయపు చరిత్రమును విస్తరించుటచేతఁ దెలుఁగున దానిమీఁద మరల 'రు' అను బహువచన ప్రత్యయము (చూడు ౧౩౬ III విష. కాల్డు. మినీర్.) చేరి వ్యవహారవశమునఁ బరిణామముల నందఁగా విధ్యర్థక 'డుజ్' ప్రత్యయ మేర్పడియుండును. ఉదా:— 'చదువు + ఇన్ + రు = చదివిన్ద్రు = చదివిన్డ్రు = చదివిండు = చదువుండు = చదువుఁడు' అను రీతిని దత్పరిణామక్రమము నరయునది. తెల్గున "పది= పన్+రెండు=పన్రెండు=పండ్రెండు" అను రీతి పరిణామము ప్రసిద్ధమె కాన నకార రేఫ సంయోగము నడుమ 'డ' కార ముత్పన్నమగుట వింతకాదు. అట్లె డకారరేఫ సంయోగములోని రేఫలోపమును సహజమె. (చూడు క్రింద= కింద-తండ్రి=తండి-మొ.).

౧౩౬. II విష:—"కన్నడ విధ్యాద్యర్థకము:—హళగన్నడమందలి మధ్యమపురుష బహువచన విధ్యర్థక రూపము భావ్యర్థక మధ్యమ బహువచన రూపమున కభిన్నమైయున్నది. విధ్యర్థకైక వచనరూపము ద్వివిధ కన్నడము లందును దమిళమందువలెనె ధాతురూపమున కభిన్నమైయుండునని యీవల కె వ్రాయఁబడెను. ఉదా: — హళగన్నడ:—విధ్యర్థకబహు—మాడిరి=మాడు విరి=మాడీరి=(మీరు చేయుఁడు. మీరు చేయఁగలరు) ఇట్లె "అది చేయఁ గలదు-అది చేయఁదగిన వస్తువు" అను నర్థములుగల భావ్యర్థ కామహాత్క-ర్తృక క్రియాజన్య నామవాచకరూపము (మాడువుదు) విధ్యర్థకైక వచన బహువచన ములలో వైకల్పికముగ హళగన్నడమున వాడఁబడును.

గ్రాంధిక కన్నడమందు మధ్యమ పురుష సర్వనామ బహువచనరూప మగు 'నీమ్' అనుదాని సంక్షేపరూపమగు 'ఇమ్' అనునది ప్రాయికముగ విధ్యర్థక బహువచన ప్రత్యయముగ వాడఁబడును. ఉదా:—బాళ్+ఇమ్= బాళిం=(మీరు బ్రదుకుఁడు) ఇళి+(య్)+ఇమ్=ఇళియిమ్=(మీరు దిగుఁడు). తుళు భాషయందు విధ్యర్థకముల రెండు వచనములును వరుసగా భావిరూప

ముల యేకవచనములకు 'ల' అనుదానిని బహువచనములకు 'లె' అనుదానిని జేర్చుటచేత నేర్పడును. ఉదా:—మాళ్ పుల=(నీవు చేయుము) మాళ్ పులె=(మీరు చేయుఁడు) డా. గుండర్టుగారీ తుళు 'ల' కారము తమిళమందలి సముచ్చయార్థకమగు 'ఉమ్' అనుదానికి సమానార్థకమగు 'లా' అను తుళు సముచ్చయ శబ్దమున కభిన్నమనిరి" (కాల్డు. ౫౩౧ పుట).

విమర్శము:—హళగన్నడ విధ్యాద్యర్థక బహుపచనరూప మందలి భావ్యర్థక మధ్యమపురుష బహువచనరూపమున కభిన్నమనెడి దొరగారి వ్రాఁత సరికాదు. ద్వివిధ స్థలములందును 'ఇరి' ప్రత్యయము యాదృచ్ఛికముగ నొక్కటె యైనను భావిరూపములలో భావ్యర్థక 'వ' కార చిహ్నము చేరును. విధ్యర్థకములలో 'వ' కార చిహ్న ముండదు. కావున భావ్యర్థకమగు 'మాడువిరి'=(మీరు చేయఁగలరు) అను రూపము విధ్యర్థమందును గలదని దొరగారు వ్రాయుట కేవలము నయథార్థ ప్రదర్శనము. విధ్యర్థమున 'మాడిరి'=(మీరు చేయుఁడు) అని మాత్రమె యుండును.

"౮౭ సూ:—ధాతుగళమేలె విధ్యాద్యర్థద ఆఖ్యాత ప్రత్యయగళు సేరిదరె విధ్యాదిరూప క్రియాపదగళు ఆగువవు......మధ్యమపురుష-ఏక-ఉవుదు. బహు-ఇరి. ఉదా:—మాడువుదు=(చేయుము) మాడిరి=చేయుఁడు)" (శబ్దాదర్శ. హళగన్నడ వ్యాకరణము 32 పుట).

"౮౦ సూ:—ధాతువిగె......భవిష్యత్ప్రత్యయగళు సేరువాగ 'ఉవ' ఎంబ వికరణప్రత్యయ......ఉదా:—......భవిష్యత్కాలక్కె—మాడువను=(చేయఁగలను). మాడువిరి=(మీరు చేయఁగలరు)" (శబ్దాదర్శ. హళగన్నడ వ్యాకరణము 3౫ పుట).

౮౧ సూత్రపు పట్టికయందును భవిష్యదర్థక మధ్యమపురుష బహువచన రూపము 'మాడువిరి' అనియె స్పష్టముగాఁ జూపఁబడెను. కాన 'మాడువిరి' అనుదానిని విధ్యర్థకముగాను 'మాడిరి' అనుదానిని భావ్యర్థకముగాను డాక్టరు కాల్డువెల్లుగా రుదాహరించి యవి యభిన్నములనుట కేవలము నయథార్థ ప్రసంగము. ఈ 'రి' ప్రత్యయము సంభావనార్థక బహువచన ప్రత్యయముగ శబ్దాదర్శమున నుదాహరింపఁబడెనే కాని భావ్యర్థక విధ్యర్థకములలో నుదాహరింపఁబడలేదు. (చూడు శబ్దాదర్శ. ౮౯ సూ. ౪౦ పుట). నుడిదీరి=పల్కియుందురు) (చూడు ౧౩౭ III విష.)

పటగన్నడ విధ్యర్థకములనుచు "బాళిం=(బ్రదుకుఁడు), ఇళియిమ్=(దిగుడు)" అని డా. కాల్డువెల్లుగా రుదాహరించుట సరికాదు. అవి టకారాంత

ధాతువులు. 'బాటిం......ఇటియిం' అని యుదాహరింపవలయును. "బాట్=జీవనే. ఇటి=నిమ్నావతరణే" అని శబ్దమణిదర్పణ ధాతుపాఠము. 'ఇమ్' అనునది విధ్యాద్యర్థక బహువచన ప్రత్యయము.

"ద్విత్వ బహుత్వయో రిమ్." (కర్ణా. భూ. ౨౧౫ సూ.)=మధ్యమ పురుషమునందు ద్విత్వ బహుత్వములలో 'ఇమ్' ప్రత్యయ మగును. ఉదా:—నుడియిం = (పలుకుఁడు). నోడిం = (చూడుఁడు). ఏకవచనము తఱుచుగా లోపించును. "మధ్యమైకవచన స్యై దు దేతః ప్రాయో లోపశ్చ" (కర్ణా. భూ. ౨౧౬ సూ.) ఉదా:—మాడు=(చేయుము.)

౧౩౬. III విష:—"తమిళ విధ్యర్థక రూపములు:—వ్యావహారిక తమిళ విధ్యర్థకమగు 'ఉమ్' ప్రత్యయము భావ్యర్థక తద్ధర్మార్థకమగు 'ఉమ్' ప్రత్యయమునకు భిన్నము కాదు. ఉదా:—సెయ్+(య్)+ఉమ్=అది చేయఁగలదు. సెయ్+(య్)+ఉమ్ = సెయ్యుమ్ = (మీరు చేయుఁడు). వాఴుమ్ = (అది పెరుఁగఁగలదు)=వాఴుమ్=(మీరు పెరుఁగుఁడు). గౌరవార్థక బహుత్వమందును నిట్లే. ఇట్లే విధ్యర్థక 'ఉమ్' ప్రత్యయము భావ్యర్థకమగు 'ఉమ్' ప్రత్యయమునుండి యేర్పడినట్లె కన్పట్టుచున్నను వీనికిఁ గొంత భేదము వెలయుచున్నది. గ్రాంథిక తమిళమున నొకప్పుడు విధ్యర్థకములెల్ల నిజముగ భావ్యర్థకములై యుండెడి వనుటకు సందియము లేదు గాని నేఁటి వాడుకలో వానికి భేదము లేదనుటకు వలనుపడదు. విధ్యర్థకమగు 'ఉమ్' ప్రత్యయము మధ్యమ బహువచనమందుమాత్రమె వచ్చును. భావ్యర్థకమగు 'ఉమ్' ప్రత్యయమన్ననో వచనద్వయమందును బ్రథమపురుషమున వచ్చును. భావ్యర్థకమగు 'ఉమ్' ప్రత్యయము క్రియాంగముపై నిల్చుచున్నట్లు పెక్కుస్థలములు నిదర్శనములై యున్నవి. విధ్యర్థకమగు 'ఉమ్' ప్రత్యయమన్ననో యంతటను ధాతువుపైనె నిల్చును. ఉదా:—ఇరుక్కుమ్=(అది యుండఁగలదు). ఇరుమ్=(మీరుండుఁడు). కెడుక్కుమ్=(అది చెఱుపును=చెఱుపఁగలదు). కెడుమ్=(మీరు చెఱుపుఁడు). (చూడు ౧౩౨ II విష.) కాన "సముచ్చయార్థకమగు 'ఉమ్' ప్రత్యయము విధ్యర్థకములందును సర్వనామములందును బహుత్వమును బోధించు ననఁగా వ్యక్తిద్వయమును సముచ్చితము గావించును. భవిష్యదర్థకమగు 'ఉమ్' ప్రత్యయము భూత వర్తమాన భావికాలములను సముచ్చితములను గావించును." అని గ్రహింపవలయును. (చూడు ౧౩౨ II విష.) (౧౧౩ V విష.) (౧౧౦ I విష.) (౧౨౮ II విష.)" (కాల్డ్వె. ౫౩౨ పుట).

"గ్రాంథిక తమిళమున విధ్యర్థక బహువచన ప్రత్యయము 'మిన్' అనునది. ఒకొక్కప్పుడిది మఱొక బహువచన ప్రత్యయముతోఁ గూడియు

నుండును. ఉదా:—మిన్ + ఈర్ = మినీర్. ఈ క్రింది యుదాహృతులను బట్టి ముఖ్యముగా మలయాళోదాహృతులనుబట్టి విధ్యర్థక రూపనిర్మాణము భావ్యర్థకరూప మూలకమని విశదమగుచున్నది. ఉదా:—తమి-భావి-వరు వాన్ = (రానున్న) = మలయాళ విధ్యర్థకము-వరువిన్ = (మీరు రండు). తమి-భావి-కాణ్ మా(పా?)న్ (పా ?) = (చూడఁగల) ('మల. కాణ్ మాన్' శ్రీ రెడ్డిగారు) మలయాళ విధ్యర్థక-కాణ్ మిన్ = (చూడుఁడు). తమి-భావి-కేళ్ పాన్ = (విన నున్న) = మలయాళ విధ్యర్థక-కేళ్ పిన్ = (వినుఁడు). తమిళకవు లరుదుగ వాడెడి వ్యతిరేక విధ్యర్థకమగు "(అల్ పీర్) = అల్ పీర్ ('ఈ రూపము లేదు' శ్రీ రెడ్డిగారు) = (ఉండకుము)" అనుదానియందును 'ప' కారము కన్పట్టు చున్నది. పయి యుదాహృతులలో 'ఆన్' అనునది 'ఇన్' అని మాఱుట మాత్రమె భేదము కన్పట్టుచున్నది. 'అల్ పీర్' అనుదానిలోని 'ఈర్' అను దానికి సమానమగు 'ఇన్' అనునది కన్నడ విధ్యర్థక మధ్యమపురుష బహు వచన ప్రత్యయమగు 'ఇమ్' అనుదానిని సంబంధించుచున్నది. మలయాళము లోని 'ఇన్' అనునదియు గ్రాంథిక కన్నడమునందలి 'ఇమ్' అనునదియు నభిన్నములు" (కాల్డు. ౫౩౨, ౫౩౩ పుటలు).

"విధ్యాద్యర్థక రూపములకు భావ్యర్థక రూపములు మూలమనుట నీ క్రింది హెబ్రు భాషలోని యుదాహృతులనుబట్టి దృఢపఱుపనగును. 'జెసినియస్' అను హెబ్రు వ్యాకరణ మిట్లు వచించుచున్నది. విధ్యర్థకము యొక్క ముఖ్యరూపమును భావ్యర్థక మూలరూపమును నొక్కటియె. ఈ రెండిటిని భావార్థకములని గణించినచో రెండును సమానముగనే నామవాచక ములను సంబంధించును" (కాల్డు. ౫౩౩ పుట).

విమర్శము:—దొరగారు వచించిన 'ఉమ్' ప్రత్యయార్థ వివరణము సముచితముగ నున్నది. కాని విధ్యర్థక రూపముల నిర్మాణము భావ్యర్థక రూప మూలక మనుట విశ్వసనీయముకాదు. తమిళ విధ్యర్థక 'మిన్' ప్రత్య యమె మలయాళమునఁ గొన్నియెడల 'మిన్' రూపముతో నిల్చియు మఱికొన్ని యెడల "విన్-పిన్" రూపములుగఁ బరిణమించియు నున్నదనుట యుక్తము. 'వరువాన్' మున్నగు భావిరూపములు 'వరువిన్' అను రీతిని విధ్యర్థకములుగాఁ బరిణమించెననుట యసంగతము. 'ఆన్' అనునదెక్కడ? 'ఇన్' అనునదెక్కడ? విధ్యర్థకములకు మూలమనఁబడుచున్న భావ్యర్థకములు క్రియా నామవాచక రూపములెయను డా. కాల్డువెల్లుగారి యూహ సరికాదని యీపఱికె విశదీక రింపఁబడెను. (చూడు ౧౩౬ I, II విష.)

౧౩౭. I విష:—"భావార్థకము:—(Infinitive) ద్రావిడ వ్యాకరణములలో ముఖ్యముగాఁ దెల్గున వీనిని క్రియా నామవాచకములందురు. తెల్గున వీని

తుదిని 'ఉట-అడము-ఏది' అనునవి నిల్చును. చదువుట = చదవడము = చదివేది=(చదివెడిది). వీనిలో 'ఉట-అడము' అనునవి తుదినిగలవి క్రియా నామవాచకములు. 'ఏది' అనునది తుదినిగలది ధాతుజ విశేషణజన్య నామ వాచకము. వీనిపైని సుబ్విభక్తులు వచనద్వయమునందును నిల్చును. తెల్గు నందును దమిళమందును 'అ' ప్రత్యయమె భావార్థకము: "పడ్=(అనుభ వించు=పొందు)+అ=పడ" అనునదే నిజమయిన భావార్థకము. తెలుఁగు నందలి పడుట అనునదియుఁ దమిళమునందలి 'పడుదల్' అనునదియు నభిన్నములు."

"చరిత్రమందు నిజమగు భావార్థక మనునది క్రియానామవాచక మనఁ బడును. సిథియను భాషలందును నిట్లె కలదు. వ్యాకరణ పారిభాషిక శబ్దముల యొక్క తత్వమునుబట్టి సుప్ ప్రత్యయమేళనయోగ్యతను బోఁగొట్టుకొని నట్టియు బహువచనరూపములు లేనట్టియుఁ బ్రత్యేక ప్రయోగార్హత గల్గు నట్టియుఁ గ్రియానామవాచకములనె భావార్థకము లనఁదగును. (ఇంగ్లీషు లోని 'To do' అనుదానివంటిదె భావార్థకము = క్రియానామవాచకమును నని పించుకొనునని దొరగారి యాశయము)" (కాల్డు. ౫33 పుట).

"గ్రాంథిక తమిళమునందువలెనె మలయాళ భావ్యర్థక ధాతుజ విశేషణ ములలో నుండు 'వాన్-మాన్ (లేక) పాన్' అనునవి వాడుకలో భావార్థక మును మిక్కిలిగఁ బోలుచున్నవి. (ఎట్లో యుదాహరింపరైరి. 'ఆన్' అను నది 'అ' అను భావార్థకమును బోలుచున్నదని కాఁబోలు దొరగారి యాశ యము). తమిళభావార్థకమున కభిన్నమగు ("తల్' ప్రత్యయమున కభిన్న మగు" అని కావలయు దొరగారి తలంపు) 'అ' అనుదానికి నిజమైన భావార్థ కత్వము గలదు. కాని యట్టి ('అ' ప్రత్యయమునకు) దానివాడుక క్వాచిత్కము. క్రియాంగమునకు 'అ' అనుదానిని జేర్చుటచేత నిజమైన ద్రావిడభావార్థక మేర్పడును. ఉదా:—తెల్గు-చేయ. (ఈ తెలుఁగు నుదాహృతికి—'చేయఁగా' అనునర్థము దొరగారు వివక్షించి యుందురు).

సామాన్యముగఁ దమిళ కన్నడములందును నిట్లె యేర్పడును. కాని కన్నడమున నింతకన్నఁ ('అ' అనుదానికన్న) బ్రాచుర్యముగ వేఱొకరూపము వాడఁబడును. అది క్రియానామవాచకమునకుఁ జతుర్థీ విభక్తి ప్రత్యయమును బ్రత్యక్షముగనో యూహ్యముగనో చేర్చుటచేత నేర్పడును. ఉదా:—"మాడ= (చేయుట)" అనుటకు బదులుగాఁ గర్ణాటులు 'మాడ+అల్+కె=మాడల్కె' అనియు వ్యవహార భాషలో 'మాడ+అలి+క్కె = మాడలిక్కె' = (చేయుట

కొఱకు) అనియు విభక్తి ప్రత్యయ విరహితముగా "మాడల్ (లేక)=మాడలు" అనియు వాడుదురు. గ్రాంథిక తమిళమందును నిట్టి రచనగల భావార్థక రూపములు నిజమైన భావార్థక రూపముల స్థానమున వాడఁబడును. "సొల్ల=(చెప్పుట)" అనుదానికి బదులుగా 'సొల్లక్కు'=(సొల్లలుకు)='(చెప్పుటకొఱకు)' అనునదియు నూహ్యామగు చతుర్థీవిభక్తిగల "సొల్లల్"=(చెప్పుట) అనునదియు వాడఁబడును.

ఉత్తమ తమిళమునందును మలయాళమునందును మిక్కిలి తఱుచుగా "గ-(లేక) య=(ఇయ)" అనువానితో నంతమగు రూపము లనఁగా నాదరార్థక విధ్యర్థక రూపములును గలవు. ఉదా:—అఱి+గ=(తెలియుటకు (లేక)=నీవు తెలిసికొందువు గాక). వాఴియ=(మీరు వర్ధిల్లుదురు గాక). ఇట్టి యప వాదము లల్పముగ నున్నను "తుళు–గోండు" భాషలు తప్పఁ దక్షిణ ద్రావిడ భాషలందెల్ల నియతమును నత్యంత ప్రాచీనమును నగు భావార్థకము 'అ' ప్రత్యయమె యైయున్నది" (కాల్డు. ౫౩౩, ౫౩౪ పుటలు).

"ధాతువునకు 'ఆల్లె-ఇల్లె' అనువానిని జేర్చుటవలన గోండు భాషలో భావార్థక రూపము లేర్పడును. ఉదా:—హన్ద్+ఆల్లె=(పోవుట). కె+ఇల్లె=(పిలుచుట). ఈ భావార్థకములు 'అల్' అను గ్రాంథిక తమిళకన్నడ భావార్థక ప్రత్యయమునకు భిన్నములు కావు. తమిళమున 'అల్' తుదినిగలవే కాక 'ఇల్' అనునది తుదినిగల క్రియానామవాచకములును గలవు. ఉదా:—వెయ్=(కాల్చు)–వెయిల్=(ఎండ). దీని యథాశ్రుతార్థము 'మండుట' అనునది. సంఖ్యయందును భావార్థక రూపభేదములందును రూప నిర్మాణమందును వాడఁబడు ప్రత్యయముల విషయమున 'తుళు' భాష ప్రత్యేకరీతిగ నున్నది. తుళు భాషలో I మొదటి భావార్థక రూపమునందు వర్తమాన కాలికరూపమును, నద్యతన భూతరూపమును ననద్యతన భూతరూపమును గలవు. ఇవెల్లఁ గ్రియాజన్య విశేషణములకు 'ని' అనుదానిని జేర్చుటవల్ల నేర్పడును. II ఇఁక రెండవ విధమగు భావార్థకరూపము క్రియాజన్య విశేషణములకు 'ఎరె' అను దానిని జేర్చుటచేత నేర్పడును. ఉదా:—I మొదటి విధము:—బూరుని=(పడుట). బూరిని=(పడుచుండి యుండుట). బూరుదిని=(పడియుండుట). II రెండవ విధము:—బూరియెరె=(పడుట). దీనికి వ్యతిరేకరూపములును గలవు. అవి వ్యతిరేకార్థ క్రియాజన్య విశేషణమున కర్త్రర్థక ధాతువుయొక్క భావార్థకరూపము సహాయ క్రియగఁ జేర్పఁబడుటవలన నేర్పడును. ఉదా:—బూరన్దె = (పడుచుండి యుండని). ఈ వ్యతిరేకార్థక విశేషణమునుండి–

'బూరన్‌దె ఇత్తిని'=(పడుచుండి యుండకుండుట) అను వ్యతిరేక భావార్థక రూప మేర్పడును" (కాల్డు. ౫౩౩, ౫౩౪ పుటలు.)

విమర్శము:—డా. కాల్డువెల్లుగా రింగ్లీషులోని 'to do' అనురీతిగల భావార్థకమును (Infinitive) మనసున నిడికొని ద్రావిడ భావార్థక లక్షణమును నిర్వచించినారు. 'to do' = (చేయుట) అనుదానికి 'చేయుట' అని యర్థము గాన దానికి 'భావార్థముండ వలయునని తలంచిరి. 'to do' అనుదాని కితర సుబ్విభక్తిమేళనము లేదు. ఇంక బహువచన స్థితిలేదనుట సిద్ధమెకదా. కావున భావార్థకమున కితర సుబ్విభక్తిమేళనార్హత లేకుండుట లక్షణ మనిరి. దానికిఁ బ్రత్యేక ప్రయోగార్హత గలదు గానఁ బ్రత్యేక ప్రయోగార్హత భావార్థకపు లక్షణ మనిరి. మఱియు 'to do' అనుదానికి 'చేయుట' అను నర్థమే కాక "చేయుట నిమిత్తము—చేయుటకు" అను తుమర్థమును గలదు గాన (Infinitive of purpose) సమానాకారకములగు తుమర్థ భావలక్షణార్థములును నీ భావార్థకమున కుండవలయునని తలంచిరి. కావుననె భావప్రత్యయాంతముల వాడుకలను జూపునపు (౧౩౬ V విప. చూడు) డట్టి యర్థముల నుదాహరించిరి. ఇట్టి లక్షణములు 'అ' ప్రత్యయమునకుఁ గలవని నిరూపింపసాగిరి.

"చెయ్‌దు........." (తొల్కా. ౭౧౨ సూ.)=చెయ్‌దు-చెయ్యా-చేయ్‌పు=(చేసి-క్త్వా), చెయ్‌దెన=(చేసినదానివలన), చెయ్యియర్-చెయ్యియ-చెయఌ = (చేయన్ = తుమర్థకములు) చెయిన్=(చేసినన్-చేదాద్యర్థకము) చెయ=(చేయుచుండఁగా-భావలక్షణార్థకము). ఇట్టి యాకారములతో నున్న తొమ్మిది విధముల రూపము లెల్లక్రియలకును నసమాపక క్రియారూపములై యుండును" అను తొల్కాప్పియ సూత్రము చొప్పున 'చెయ్+అ=చెయ' అను రీతిగల 'అ' ప్రత్యయము భావలక్షణార్థకమనియు, 'చెయఌ' అనుచోటి 'అల్' ప్రత్యయము తుమర్థకమనియుఁ జెప్పవచ్చును. 'మాడలె=(చేయన్)' అనుచోటి యందువలెనె 'చెయఌ' అనుచోటను సైతము 'అల్' ప్రత్యయమె తుమర్థకమనఁదగును. 'అల్' ప్రత్యయము 'అ' ప్రత్యయమూలకమని దొరగారి యూహ (చూడు ౧౩౬ IV–VI విప). ఈరీతిని 'అ' ప్రత్యయమునకు భావార్థక లక్షణములు గలవని దొరగారు తలంచి యుందురు. 'అవ్యయ కృతో భావే' అను చొప్పునఁ (సి. కౌ. ౩౧౭౫ సూ. బాలమనోరమా వ్యాఖ్య) దుమర్థక భావలక్షణార్థకములు భావార్థకములనుట యుక్తమె కదా. ఇవి యవ్యయములగుటచేత దీనికి సుబ్విభక్తిమేళన ముండనేరదు గాన 'to do' అనుదానికిఁగల మీఁద వివరించిన దొరగారి భావార్థలక్షణములు సుసంభవములై యున్నవి. ఇంక ముఖ్యమగు క్రియానామవాచకార్థము ('చేయుట' అనుదాని

వంటిది) దీనికిఁగలదనియు నట్టి యర్థమున దీని వాడుక క్వాచిత్కమనియుఁ జెప్పుటచేత 'అ' ప్రత్యయమునకు దొరగారు వివరించిన భావార్థ లక్షణములు పూర్తిగాఁ గల్గినవి. క్రియానామవాచకార్థము 'చేయుట' అనుదానివంటిది దీనికి నిజముగా లేమింజేసియే యట్టి యర్థమందలి వాడుక క్వాచిత్కమనిరని గ్రహింపనగును.

తమిళమున క్రియానామవాచక రూపార్థము 'అ' ప్రత్యయమునకుఁ గలదని మాత్రము పెక్కుచోటులందు వచించుచు వచ్చిరి. అట్టి యర్థముగల యా రూపములు ప్రాచీనకాలమున నుండి యుండునని కాఁబోలును దొరగారి యాశయము.

"అట్టి క్రియా నామవాచక రూపమునకుఁ దమిళమునఁ బ్రత్యేక ప్రయోగము లేదు" (కాల్డు. ౫౧౬ పుట).

"నిజమగు భావార్థకత్వము 'అ' ప్రత్యయమునకుఁ గలదుగాని యట్టి వాడుక క్వాచిత్కము" (కాల్డు. ౫33 పుట, ౪-వ పేరా). (౧౩౭ I విష. చూడు). "'పడ్=(పొందు) + అ=పడ=(పొందుట).' అనునదే నిజమైన భావార్థకము". (కాల్డు. ౫33 పుట, 3-వ పేరా.) (౧౩౭ I విష. చూడు).

"వేని రూపనిష్పత్తియందు 'గు' అనునది తుదిని నిల్చునో యట్టి క్రియాంగములయొక్క భావార్థకరూపములందే తుదిని 'గ్+అ=గ' అనునది భావార్థమున వచ్చును.........నోగ=నోవ=(బాధపడుట)......నడక్క= నడప్ప=(నడచుట) తమిళాంధ్రములు రెండిటియందును 'అ' కారమే భావార్థక చిహ్నము" (కాల్డు. ౫3౪ పుట, ౨-వ పేరా.) (౧౩౭ II విష. చూడు).

"'పో' ధాతు క్రియాంగము 'పోగు'......దీని భావార్థకము-పోగ= (పోవుట), దీని సకర్మక క్రియాంగము-'పోక్కు=(పంపు)'......దీని భావార్థకము-'పోక్క=(పంపుట)'......వళర్+అ=వళర=(పెరుగుట), వళర్క్క= (పెంచుట),........భావార్థమున 'అ' ప్రత్యయమె నిల్చును. ఉదా:— వాట్ + అ = వాట = (వృద్ధినొందుట), కాణ = (చూచుట), తాక్త్త = (దించుట)" (కాల్డు. ౫3౫ పుట, 3-వ పేరా). (౫3౬ పుట ౧-వ పేరా). (చూడు ౧౩౭ II విష).

తమిళమున 'అ' ప్రత్యయమునకు భావార్థకతా స్థాపనమునకే క్రియానామవాచకము లాశీర్వాదార్థకములగునను నొక యపసిద్ధాంతమును నెలకొల్పిరి.

"అఱిగ=(ఎఱుఁగుట) చెయ్గ=(చేయుట)........" అను రీతివి యాశీర్వాదాద్యర్థములందు ముఖ్యముగ వాడఁబడుచున్నవి. ఉదా:—నీ యఱిగ=

(నీ వెఱుఁగుదువు గాక). దీనినిబట్టి 'గ' అనునది మొదట విధ్యాద్యర్థక మె
యని తలంపరాదు. భావార్థకమగు 'అ' ప్రత్యయమునె కవులును సామాన్య
జనులును నాశీరర్థమున వాడుదురు. ఈ యాశీరర్థక 'గ' కారము క్రియా
నామవాచకముల తుది 'గ' కారమునకు భిన్నము కాదని నా నమ్మకము....
......ఇందలి 'గ' కారమును (గ్+అ) గవు లుచ్చారణ సౌకర్యార్థముగ
వాడుదురు." (కాల్డు. ౫౩౯ పుట, ౨-వ పేరా. ౫౩౭ పుట, ౧-వ పేరా). (చూడు
౧౩౭ III విష.) (౧౩౭ III విషయమున దొరగారి యీ యపసిద్ధాంతము
నిరాకృతమయినది).

"క్రియా నామవాచకమునకు (లేక) భావార్థక రూపమునకు (Infinitive)
మూలమైన యంగమనఁదగు క్రియాంగముపైనె 'ఉమ్' ప్రత్యయము చేర్పఁ
బడును. కాన నట్టి క్రియాంగమె క్రియా నామవాచకరూపమని యూహింప
నగును. అట్టి క్రియానామవాచకరూపమునకుఁ దమిళమునఁ బ్రత్యేక
ప్రయోగము లేదు.........ఉదా:—పోగ్+అ=పోగ=(పోవుట). పోగ్+
ఉమ్=పోగుమ్=(పోఁగలదు).......పోక్క్+అ=పోక్క=(పంపుట).......
ఇరుక్క=(ఉండుట)......వళర్+అ=వళర=(పెరుఁగుట)" (కాల్డు. ౫౧౯
పుట). (చూడు ౧౩౨ II విష).

పయిరీతిని బెక్కు స్థలములందు 'అ' ప్రత్యయము 'తమిళ' భావార్థకమని
దొరగారు వక్కాణించిరి. కాని 'అ' ప్రత్యయాంత క్రియా నామవాచక
శబ్దముల వాడుక తమిళమున శశవిషాణ ప్రాయముగ లేనేలేదు. ఇంకఁ
బ్రాచీనతమకాలమున నట్టి 'అ' ప్రత్యయాంతము లుండెడివందు రేమో?
ప్రాచీనతమ తమిళ వాఙ్మయమున నెందును నెంతమాత్రమును లేని యీ
రూపములుండెడివనుట కాధారమేమున్నది? దొరగారు వీనిని క్రియా
నామవాచకము లనుచున్నారుగదా. 'to do' అను భావార్థకమునకువలె
(Infinitive) దీనికి సువ్విభక్తి మేళన రాహిత్యము నెట్లు నిర్వహింతురు? ఆ
విషయము నెచ్చటను దొరగారు స్మరింపరేల? గగనారవిందమునకు సౌరభ్యము
గలదా? లేదా? యని యెవరు ప్రశ్నింతురని కాఁబోలును?

ఈ విషయమున శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారిట్లు వ్రాసిరి.
"'నడవన్' అను నర్థమున 'నడక్క=నడప్ప' అను రెండు రూపములు నున్నవి.
(చూడు ద్రావి. పరి. ౧౨౧ III విష. ౧౨౨ V విష.) 'నడక్క' అనుదానికి
భావార్థకత్వము తమిళమున లేదు.......'నడప్ప' అనునది భావనామము
కాదు......'వ-బ-ప్ప' అనునవి తుదినిగలవి భావనామములు కావు.......
'క్క-క-గ' అనునవి తుదినిగలవియును భావనామములు కావు." (౨౯-౮-౫౩ తే.

జాబునకు జబాబు) " 'పోగ-పోగుగ' మున్నగువానికి మలయాళమున భావార్థకత్వము గలదు. అఱవమున నాశీర్విధ్యర్థములు మాత్రము గలవు. భావార్థము లేదు. అఱవమున 'పోగై-పోగుగై' అని భావరూపములుండును. అఱవమునందలి 'ఐ' కారాంత శబ్దములు తెల్గున మలయాళమునను 'అ' కారాంతములుగ నుండును.........'చెయ' అనుదానికిఁ దమిళమున 'చేయన్-చేయఁగాన్' అను నర్థములె కాని 'చేయుట' అను భావార్థ మెచ్చటను లేదు. (౮—౧—౧౯౩౭ తేదీ జాబునకు జబాబు).

కన్నడమున 'మాడు=(చేయు)+అ=మాడ=(చేయుట)' అను రీతి రూపముగలదనియు దానికి బదులుగా నంతకన్నఁ బ్రచురముగా 'మాడలెక్కె=మాడల్' అను రూపములు వాడఁబడుననియు నీ రీతినె తమిళమందును 'సొల్ల=(చెప్పుట)' అను రూపము గలదనియు దొరగారు మిక్కిలి ప్రామాదికముగా వ్రాసిరి. కర్ణాటమున 'మాడ=(చేయుట)' అను రూపమే లేదు. మఱియు "మాడల్-మాడలెక్కె" అనునవి దొరగారి 'అ' ప్రత్యయమునకు బదులుగా నిల్చు ధాత్వర్థకము లెంతమాత్రమును గావు. అవి కన్నడమునఁ దుమర్థకములు భావలక్షణార్థకములు మాత్రమె.

"క్రియాయాం క్రియార్థాయాం" (కర్ణాటకశబ్దా. ౫౮౬ సూ.)=ధాతోః అల్ ప్రత్యయో భవతి క్రియాంతరార్థాయాం క్రియాయా మభిధీయమానాయామ్. ఉదా:—ఉణల్ బందం=(భుజింపన్ వచ్చెను) పాడల్ బందం=(పాడుట నిమిత్తము వచ్చెను=పాడన్ వచ్చెను). ఇది సంస్కృత 'తుమ్' ప్రత్యయమునకు సరియగునది.

"తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్." (3-3-౧౦)=క్రియార్థాయాం క్రియాయా ముపపదే భవిష్యత్యర్థే ధాతో రేతౌ స్తః - కృష్ణం ద్రష్టుం యాతి=(కృష్ణుని దర్శింప వెళ్ళుచున్నాఁడు............." (సి. కౌ. ఉత్తరకృత్ ౩౧౭౫ సూ.)

"యో భావో భావలక్షకః" (కర్ణాటకశబ్దా-౫౮౭ సూ.)=భావః=క్రియా, యా క్రియా క్రియాంతరస్య జ్ఞాపికా భవతి తత్ర వర్తమానా ద్ధాతోః 'అల్' ప్రత్యయో భవతి. ప్రయోగః-గాయకం పాడ లరసం కేళ్దం=(గాయకుఁడు పాడఁగా రాజు వినెను).

ఇట్టి యర్థద్వయమందును 'అల్' ప్రత్యయము పైని "కె. ఒడనె-ఒడం" అనునవి నిల్చుటయుఁ గలదు.

"కెగ్ అలః" (కర్ణాటకశబ్దా. ౫౯౧ సూ.)='ధాతోః పరస్య అలః కెగాగమో వా భవతి. వర్తమానే భవిష్యతి చ కాలే గమ్యమానే. ప్రయోగః:— మాడలెకె-బందం=మాడల్ బందం=(చేయన్ వచ్చెను).

"ఒడనె దొడ మలోఽను" (కర్ణాటకశబ్దా ౫౯౨ సూ.)='ఒడనెత్-ఒడం' ఇత్యేతౌ అలో వా అను ప్రయుజ్యేతే. ప్రయోగః:—పాడలొడనె మెచ్చిదం=పాడలొడం మెచ్చిదం = పాడల్కె మెచ్చిదం=పాడల్ మెచ్చిదం =(పాడన్ మెచ్చెను) = పయిరీతిని 'కె' అనునది 'అల్' ప్రత్యయమున కాగమమనుట సంప్రదాయముగాని యది చతుర్థీప్రత్యయమనుట సంప్రదాయము కాదు. చరిత్రానభిజ్ఞత మూలమున 'కె' అను చతుర్థి నిల్చిన నిల్చుఁగాక. అవ్యయమగు 'అల్' ప్రత్యయాంత తుమర్థకముపైని జతుర్థీప్రత్యయము నిల్చుట కేవలము నసంభవము. మఱియుఁ బై సందర్భమునుబట్టి 'అల్' ప్రత్యయము కన్నడమున 'తుమ'ర్థకమె కాని క్రియానామవాచక మెంతమాత్రమును గాదనుటకు సందియము లేదుగదా. ఇట్టి తుమర్థకములకుఁ బర్యాయముగాఁ జతుర్థ్యంత నామవాచకములు ప్రయుక్తములగుట ద్రావిడభాషలందుఁ బ్రసిద్ధమైయున్నది. ఉదా:—తెల్గు-చూడన్వచ్చెను=చూచుటకొఱకు వచ్చెను-భుజింపన్ వచ్చెను= భుజించుటకొఱకు వచ్చెను. (చూడు 'వ్యా. సం.' 3౧3 విభ. ౧౪౫౭ పుట.) ఇట్టి పద్ధతి సంస్కృతమందును గలదు.

"తుమర్థాచ్చ భావ వచనాత్" (౨-3-౧౫)......యాగాయ యాతి= యష్టుం యాతీత్యర్థః=(యాగముకొఱకు వెళ్ళుచున్నాఁడు = యాగముచేయన్ వెళ్ళుచున్నాఁడు.) (సి. కౌ. ౫౭౨ సూ.)

దొరగారు చూచుకొని యుదాహరింపలేదు గాని పఱగన్నడమున భావార్థకమగు 'అ' ప్రత్యయ మరుదుగ నిల్చుట లేకపోలేదు.

"క్రియార్థా దత్" (కర్ణా. భూ. ౧౮౦)=క్రియావాచకములకు భావార్థమున 'అత్' ప్రత్యయమగును."

"అతి టః" (కర్ణా. భూ. ౧౨౦ సూ.)='అత్' ప్రత్యయము (౧౮౦ సూ. చూడు) పరమగునపుడు 'డ'కారము 'ట'కారమగును. ఉదా:—ఆడు+అ= ఆటం=(ఆట). నోడు+అ=నోటం=(చూచుట). మాడు+అ=మాటం= (చేయుట). 'బిడు విసర్జనే.' (శబ్దమణి దర్పణ ధాతుపాఠము) బిడు+అ= బేటం=(విరహము.) కూడు+అ=కూటం=(కలయిక) ఊడు+అ=ఊటం= (భోజనము) కాడు+అ=కాటం=(పీడనము) పాడు+అ = పాటం = (పాట). ఓడు+అ=ఓటం = (ధావనము = పరుగెత్తుట). సోల్+అ = సోలం=(పరాజయము). సాల్+అ=సాలం=(చాలుట).

ఇట్టి 'అ' ప్రత్యయాంతముల పయిని సుబ్విభక్తులెల్ల ధారాళముగా నిల్చును. కావున దొరగారి భావార్థలక్షణమున కిది గుఱి కానేరదు. కానఁ దత్సజాతీయులు దీనినిబట్టి 'అ' ప్రత్యయము కన్నడమందుఁ గలదుగాన నది దొరగారి 'అ' ప్రత్యయమునకు మూలమని తలంపరాదు.

క్రియాంగమునకు 'అ' ప్రత్యయమును జేర్చుటచేత నిజమైన ద్రావిడ భావార్థకరూప మేర్పడునని వ్రాసి దొరగారు దానికి 'చేయ' అనుదాని నుదాహరించిరి. వలయ్వాదియోగ రహితముగఁ బ్రత్యేకముగఁ బ్రయోగింపఁబడిన యీ 'చేయ' శబ్దము భావార్థకమగు 'అ' ప్రత్యయమునకు లక్ష్యము కాఁజాలదు. ఇయ్యది 'చేయుట నిమిత్తము' అను తుమర్థము గలదియు 'చేయఁ గాన్' అను భావలక్షణార్థముగలదియుఁ గావచ్చును. 'చేయన్' అని యుదాహరింపవలసియుండఁగా 'చేయ' అని యుదాహరించుట సరియాయని శంకింప నక్కఱలేదు—దొరగారి పక్షమునఁ బదాంత నకారము రమ్మనిన వచ్చును-పొమ్మనినఁ బోవును. అనునాసికీకరణ పద్ధతి (Nasalization) గలదుగదా. 'అన్' ప్రత్యయమునకుఁ దెల్గునఁ దుమర్థ భావలక్షణార్థములు తెలుచు. భావార్థమును నరుదుగ వలయ్వాదియోగమునఁ గలదు.

"తుమర్థభావ లక్షణంబులందు 'నుఁజ' యగు (౮౦ సూ.) భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ....తుమర్థంబు—చైత్రుండు వండను బోయెను......భావలక్షణము — చైత్రుండు వండ నతిథి వచ్చెను......" (బాల వ్యా. క్రియా. ౮౦ సూ.)

"వలయ్వాదిక్రియలకుం గర్తయగు భావంబునందు నుజ యగు" ఉదా:— వాఁడు చూడవలయు......(బాల వ్యా. క్రియా. ౧౨౨ సూ.) ('చూచుట' వలయునని యర్థము.)

సంస్కృతమున భావలక్షణార్థము సతిసప్తమిచే బోధ్య మగును.

"యస్య చ భావేన భావలక్షణమ్" (౨-3-3౭) = యస్య క్రియయా క్రియాంతరం లక్ష్యతే తతః సప్తమీ స్యాత్ - గోషు దుహ్యమానాసు గతః= (గోవులు పిదుకఁబడుచుండఁగా వెళ్ళినాఁడు)" (సి. కౌ. ౬౩౭ సూ.)

ఇంగ్లీషునందలి ('Infinitive') అనుదానినిబట్టి ద్రావిడభావార్థ లక్షణమును వివరించుట కేవలము నసంగతము. ఇట్టి యసంగత లక్షణములను బట్టియే 'తల్-అల్-త—ట' మున్నగు నిజమైన ద్రావిడ భావార్థక ప్రత్యయముల నీ సందర్భములోఁ జేర్పక దొరగారు క్రియార్థస్ఫూర్తిగల కృదంతము లనుచు వేఱుప్రకరణమున వివరించినవారైరి. కాన నిచట సంప్రదాయ సిద్ధమగు లక్ష్యానుకూల ద్రావిడ భావార్థ లక్షణము వివరింపఁబడుచున్నది.

భావ మనఁగా వ్యాపారాత్మకమగు ధాతువుయొక్క యర్థము. "భావ శ్శబ్దో ధాత్వర్థః" (కర్ణాటక శబ్దానుశాసనమందలి ౫౮౯ సూత్రపు భాషామంజరీ వృత్తి.)

"శాబ్దికసమయే భావో హి ద్వివిధః.........తత్రాద్య స్తద్ధితవాచ్య ఏవ. ద్వితీయస్తు......భాషాయాం (అచ్చకర్ణాట భాషాయామ్) కృద్వాచ్య ఏవ." (మంజరీ మకరందవ్యాఖ్య) (తద్ధితవాచ్య భావము ముందు వివరింపఁబడును (చూడు ౧౩౮ I విష.).

"ఫలోత్పత్త్యనుకూల వ్యాపారాత్మికా క్రియా ధాత్వర్థః" ('సార్వధాతుకే యక్' (౩-౧-౬౭) సి. కౌ. ౨౭౫౬ సూ. బాలమనోరమావ్యాఖ్య) =పచ్యాది ధాతువులకుఁ బాకాదికము ఫలము. అట్టి ఫలము గల్గుట కనుకూలమగు పచనాది క్రియ ధాత్వర్థము.

పై లక్షణముల చొప్పున 'ఇచ్చు+ట=ఇచ్చుట' మున్నగు క్రియార్థభానముగల భావార్థక సర్వధాతుసామాన్య 'ట' ప్రత్యయాంతాది ధాత్వర్థక కృదంతములు మాత్రమె క్రియానామవాచకములనియుఁ దక్కిన 'ఎండు+అ=(ఎండించునది=సూర్యాతపము)=ఎండ.' 'చేయు+ఇ=(పనులను జేయునది-హస్తము) చేయి' మున్నగు కర్త్రర్థకాదులు క్రియానామవాచకము లనిపించుకొనక కృదంతమాత్రము లగుననియు నెఱుంగనగును. వీనియందు ధాత్వర్థభానము మాసి యుండును. చేయుట మున్నగు 'ట' ప్రత్యయాంతాది భిన్నములగు కొన్ని కృదంతములు సైతము తాదృశ'ట' ప్రత్యయ సమానార్థకములగుచుఁ గ్రియానామవాచకము లనిపించుకొనుటయుఁ గలదు. "ఉ. శత్రులనాజి నోర్చుటయు.........కాచుటయున్......పాత్రులకర్థమీగియును......। క్షత్త్రియధర్మముల్......(భార. అర. ౧ ఆ. ౨౮౭ ప.) (చూడు 'వ్యా. సం.' విస్తర I. ౩౦౯ విష.)"

ఇందలి 'ఈగి' అనుదానికి 'త్యాగము=దానము=వరము' అని యర్థము కాదు. 'ఇచ్చుట' అని యర్థము. కాన నది క్రియానామవాచకము. కొన్ని కృదంతములయందు ధాత్వర్థరూప వ్యాపారభానము మాసియుండును. అట్టివి క్రియానామవాచకము లనిపించుకొనవు. అవి కృదంతమాత్రములె. ఉదా:— కలుగు+ఇమి=కలిమి=(సంపద). వేలుచు+ఇమి=(హోమము). చేయు+తజ్=చేఁత=(కృత్యము=పని). తప్రత్యయాంతాదు లకర్మకధాతువులనుండియు నేర్పడవచ్చును. ఉదా:—అలయు—అలఁత=(శ్రమ). కూయు—కూఁత=(ధ్వని). మ్రోయు—మ్రోఁత=(ధ్వని). అడఁగు=అడఁకువ=(వినయము). ఓడు-ఓట=(పరాజయము). మండు-మంట=(అగ్నిజ్వాల) మొ. వయివానిలో

సకర్మకజములు కర్మార్థకములు. అకర్మకధాతుజములు భావార్థకములు, ఇట్లు భావశబ్దమున కనేకార్థములు పయిని వ్రాసిన రీతిని గలవు. ఎల్ల కృత్తులందలి భావార్థమును లింగవచనాన్వయవత్త్వారూపమె. "కృదభిహితో భావో ద్రవ్యవత్ ప్రకాశతే" (మహాభాష్యము)=ద్రవ్యవ ల్లింగ సంఖ్యాన్వయం లభతే ఇత్యర్థః." (సి. కౌ. ౨౭౫౯ సూ. బాల మనో. వ్యాఖ్య). సంస్కృతమాత్ర ప్రసిద్ధమగు (రామేణ రామైః భూయతే) తిఙ్వాచ్యభావము ద్రావిడభాషలలో లేదు. 'క్త్వా-తుము'న్నంతాదులగు నవ్యయకృత్తులకు లింగవచనాది రూపభేద ముండ దనియు నవియు భావార్థకములె యనిపించుకొనుననియు వానికిని గారకాన్వయ ముండుననియు నెఱుంగునది. 'అవ్యయకృతో భావే' ఇతివచనాత్ భావే తుమున్" (సి. కౌ. ౩౧౭౫ సూ. బాల మనో. వ్యాఖ్య). ఇట్లు చెప్పఁబడుట చేత నవ్యయకృత్తులకు వాచనికమగు భావార్థకత్వము గలదని యెఱుంగునది.

౧౩౭. II విష:—"పెక్కు తమిళ భావార్థకములకుఁ దుదిని 'క'కార ముండుటను జూచి ప్రొఫెసరు మాక్సుముల్లెరుగారు హిందీలోని ద్వితీయా చతుర్థీవిభక్తి ప్రత్యయమగు 'కో' అనుదాని కయ్యది యభిన్నమని తలఁచి ద్రావిడ భావార్థకరూప మేదేని క్రియానామవాచకముయొక్క ద్వితీయావిభక్తి రూపమె యను సిద్ధాంతమునకు వచ్చిరి. సంస్కృత లాటిను భాషలలోని భావార్థక మగు 'తుమ్' ప్రత్యయము ద్వితీయావిభక్తిరూపమని తలంచుట యుక్తమె. అట్లె యింగ్లీషు భాషయందలి భావార్థకము క్రియానామవాచకముయొక్క చతుర్థ్యంత మని తలంచుట యుక్తమె. (To do). ద్రావిడ భావార్థక రూపములును జరిత్ర యందుఁ గ్రియానామవాచకములనియు వానికిఁగల యీ స్వభావ మెప్పుడును బూర్తిగా లోపింపఁదనియుఁ జెప్పుటసైతము యుక్తమె. కాని తమిళ భావార్థక ములలోని 'క'కారము ద్రావిడ చతుర్థీ ప్రత్యయమగు 'కు' అనుదానితోడను, హిందీ భాషలోని ద్వితీయా చతుర్థీప్రత్యయమగు 'కో' అనుదానితోడను నే విధముననైన సంబంధించునదనుట యంగీకరింపరాదు. వేర్వేఱు తెగల క్రియలను వేర్వేఱు తెగల భాషలను బోల్చి చూచునపుడు తమిళ భావార్థక 'క'కారము వేఱు విధముగ వచ్చినదని స్పష్టముగఁ దెలియఁగలదు" (కాల్డు. ౫౩౭, ౫౩౫ పుటలు).

"వేని ధాతురూప నిష్పత్తియందు 'గు' (గ్+ఉ) అనునది తుదిని నిల్చునో యట్టి క్రియాంగములయొక్క భావార్థక రూపములందే తుదిని (గ్+అ)='గ' అనునది వచ్చును. (చూడు ౧౩౦ I విష.) ఇట్లు తమిళ వ్యవహార భాషయందుఁ గ్రియాంగమందును భావార్థకరూపమందును 'గ' కారము వచ్చునట్టి యనేకోదాహరణములలోఁ గావ్యభాషయందు 'గ'కార

స్థానమున 'వ'కారము వచ్చును. గ్రాంథిక భాషయందు 'నోవ' అనుదాని యంత తఱచుగ 'నోగ'=(బాధపడుట) అనునది రాదు. ఉత్తమ తమిటమున 'క్క' అనుదానికి బదులుగ 'ప్ప' అనునది నిల్చును. ఉదా:—నడక్క=నడప్ప=(నడచుట). తమిళాంధ్రములు రెండిటియందును 'అ' కారమే భావార్థక చిహ్నము. 'గు' అనునది తుదినిగల క్రియ లకర్మకములు. అవి సకర్మకము లగునపుడు వాని తుదిని 'క్కు' అనునది నిల్చును. (చూడు. ౧౨౧ II విష)" (కాల్డు. ౫౩౫ పుట.)

"కాఁగా 'పో' ధాతు క్రియాంగమగు 'పోగు' అనుదాని నుండి యేర్పడిన భావ్యర్థక తద్ధర్మార్థక రూపము 'పోగుమ్' అనునది. దాని క్రియా నామవాచకము 'పోగల్'. దాని భావార్థకము 'పోగ'. దాని సకర్మక క్రియాంగము 'పోక్కు'=(పంపు-తఱిమివేయు). దాని తద్ధర్మార్థక రూపము-పోక్కుమ్. దాని భావార్థకము 'పోక్క'. ధాతువుల తుదిని 'గు' అనునది లేని చోటులందుఁ గాలిక చిహ్నముల మొదటి వర్ణము సకర్మకత్వమున ద్విత్వమునందును. (చూడు ౧౨౧ IV విష.) ఇట్టి ధాతువులకును సకర్మకత్వమున భావార్థకాదులు పరమగునపుడు 'క్క' అనునది చేరును. ఉదా:—వళర్+అ=వళర=(పెరుఁగుట). వళర్క్క=(పెంచుట). వళర్క్కుమ్=(పెంచును). పెక్కు తమిట ధాతువుల తుదిని ధాతు రూప నిర్మాణోపయోగి ప్రత్యయము లేకుండుటయుఁ గలదు. అట్టి యెడలను భావార్థమున 'అ' ప్రత్యయమె నిల్చును. ఉదా:—వాల=(వృద్ధి నొందుట). కాణ=(చూచుట) తాట్త్తు+అ=తాట్త్త=(దించుట). 'ఇ-ఐ' అనునవి తుదినిగల ధాతువులకును 'అ' ప్రత్యయమునకును నడుమ యకార ముచ్చారణార్థకము నిల్చును. ఉదా:—అఱి+య్+అ=అఱియ=(ఎఱుఁగుట). అడై+య్+అ=అడైయ=(పొందుట)" (కాల్డు. ౫౩౫, ౫౩౬ పుటలు).

విమర్శము:—ప్రొఫెసరు మాక్సుముల్లెరు దొరగారి హిందీ ద్వితీయా చతుర్థీ విభక్తివాదము సరికాదనెడి కాల్డువెల్లుగారి సిద్ధాంతము యుక్తముగనె యున్నది. ద్వితీయా చతుర్థీ విభక్తులగు 'కో-కు' అనువానికి సంభవింపని పెక్కు మార్పులు క్రియా నామవాచకముల తుది 'క' కారములకుఁ గల్గుచుండుట నిజమె: కావున ద్రావిడ భావార్థకము లనఁబడుచున్నవాని తుదిని గన్పట్టు 'క-గ' లు 'అడఙ్గు' మున్నగు ధాతువుల తుదిని నిల్చు 'కు-గు' ప్రత్యయ సంబంధులె యనుటకు సందియము లేదు. కాని "నోగ=నోవ=(నొచ్చుట). నోవిక్క=(నొప్పించుట), నడక్క=నడప్ప=(నడచుట), పోగ=(పోవుట), పోక్క=(పంపుట), వళర=(పెరుఁగుట), వళర్క్క=(పెంచుట) వాల=(వృద్ధి నొందుట), కాణ=(చూచుట)" మున్నగు రీతిని 'అ' ప్రత్యయాంత భావార్థక (ధాత్వర్థక)

రూపములు తమిళమునఁ గలవనుట కేవలము నయథార్థము. ఈ విషయ మీవఱకు ౧౩౭ I విషయమున సువిస్తరముగ విశదీకరింపఁబడుటచే నిట విస్తరింప లేదు. ఇట్టివెల్ల భావలక్షణార్థక తుమర్థకము లనుటలో విప్రతిపత్తిలేదు-ఇంగ్లీషునందలి 'to do' మున్నగు భావార్థకములకుఁ (Infinitives) క్రియా నామవాచకార్థమును దుమర్థమును గల్గినఁ గల్గుఁగాక. అట్లె ద్రావిడ భాష లందలి 'అ' ప్రత్యయమునకును దుమర్థ భావలక్షణార్థములతో పాటుగఁ క్రియానామవాచకార్థమును గలదనుట కేవలము ప్రమాద మనుటలో సందియము లేదు. 'క్క' అనుదానిచో 'ప్ప' అనునది నిల్చుననుచు 'నడక్క=నడప్ప' అనునవి క్రియా నామవాచకము లనుట పొరపాటు. 'నడక్క = నడప్ప' అనువానికి 'నడవన్' అని యర్థమే కాని 'నడచుట' అను నర్థము లేదు. (చూడు ౧౩౭ I విష.). అచట 'క్క' అనుదానిచో 'ప్ప' అనున దాదేశము కాలేదు. 'నడక్క' అను దానిలోని 'క' కారము భావ్యర్థక 'కు' ప్రత్యయ సంబంధి. 'నడప్ప' అనుదానిలోని 'ప' కారము భావ్యర్థక 'ప' కార సంబంధి. (చూడు ౧౨౧ III విష. ౧౨౨ V విష.) తమిళ భావార్థకములలో 'క' కారాంతములు "పోగై=పోగుగై=(పోవుట) పోక్కై (పంపుట) ఇరుక్కై= (ఉండుట) చెయ్గై=(చేయుట) నడక్కై=(నడచుట)." అను రీతి నుండునే కాని 'పోగ-పోక్క' మున్నగు రీతిని 'అ' ప్రత్యయాంతములై యుండవు. (చూడు ౧౩౨ II విష.)

౧౩౭. III విష:—"అఱి+గ=అఱిగ=(ఎఱుఁగుట), చెయ్గ=(చేయుట) వ్యావ-చెయ్య = (చేయుట). వీనిలో 'అఱిగ-చెయ్గ' అను రీతి గలవి యాశీర్వాదార్థమున ముఖ్యముగ వాడఁబడుచున్నవి. ఉదా:—నీ అఱిగ-(నీవు ఎఱుఁగుదువు గాక). దీనినిబట్టి 'గ' అనునది మొదట విధ్యాద్యర్థకమె యని తలంపరాదు. భావార్థకమగు 'అ' ప్రత్యయమును గవులును సామాన్య జనులును నాశీరర్థమున వాడుదురు. ఈ యాశీరర్థక గకారము క్రియా నామ వాచక 'గ' కారమునకు భిన్నము కాదని నా నమ్మకము. గ్వంత క్రియలందలి (అడజ్గు. మొ.) 'గ' కారమునె స్థలాంతరములందును గవు లుచ్చారణ సౌకర్య మునకై వాడుదురు. ఉదా:—'అఱి+య్+అ' అనుదానికి బదులుగ 'అఱిగ'= (తెలిసికొనుట=ఎఱుఁగుట) అనియు, 'అఱి+య్+ఇల్+ఇర్=అఱియిలిర్' 'అఱి+య్+ఈర్'='అఱియీర్' అనువానికి బదులుగ 'అఱి+గ్+ఇల్+ఇర్=అఱిగిలిర్'=(మీరు ఎఱుఁగరు) అనియు, 'సెయ్+య్+అ' అనుదానికి బదులుగా 'సెయ్+గ్+అ'=సెయ్గ=(చేయుట) అనియు, 'సెయ్+వ్+వన్' అనుదానికి బదులుగా 'సెయ్+గు+వ్+వన్' = (చేయఁగలను) అనియు

వాడుదురు. ఈ యుదాహృతు లన్నిటియందును గానిపించు 'గ' కారము చరిత్రమందు రూపసాధనోపయోగియగు 'గు' అనునదియే యని రెండువ యుదాహరణము వల్ల (అఱిగిలిర్) స్పష్టమగుచున్నది. ఈ గకారపు వాడుకకు శ్రుతి సుఖార్థకతమె కారణము. అట్టి 'గ' కారము శ్రుతి సుఖార్థకత యావశ్యక మగునపుడును ఛందః ప్రతి బంధమును వారించునపుడును మాత్రమె యెల్ల ధాతువులకును జేర్పఁబడును. ఈ 'గ' కార చరిత్ర మీఁ క్రింది మలయాళోదాహృతులవల్ల స్థిరపడును. తమిటమందలి 'గ్గై' అనుదాని చోట మలయాళమున 'గ' అనునది వాడఁబడును. ఉదా:—మల-చెయ్‌గ= (చేఁత-కృత్యము). ఈ రూప మాశీరర్థమందును వాడఁబడును. ఉదా:— మల-నీ చెయ్‌గ=(నీవు చేయుదువు గాక). ఇచటఁ గ్రియా నామవాచకమె యాశీరాద్యర్థకముగా వాడఁబడెను. ఒక భాషయందలి భావార్థకము మఱొక భాషయందుఁ గృదంతముగ వాడఁబడును. మలయాళపు 'చెయ్‌గ' శబ్దమునకు సరియగు 'చెయ్‌గ్గై' అను తమిట కృదంతము తమిటమునఁ గృదంతముగ వాడఁబడక 'చెయ్‌గ' అను రూపముతో నాశీరాద్యర్థకముగ వాడఁబడుచున్నది. మలయాళమందలి 'చెయ్‌గ' అనుదానితోడ నీ రెండిటికిని గల పోలిక పరిశీలించునది. దీనిచేత నివి యెల్లఁ జరిత్రమునఁ గృదంతములె యని స్పష్టపడుచున్నది. మలయాళమందలి 'చెయ్‌గ' అనుదానికి సుబ్విభక్తులు చేరుచుండును. ఉదా:— చెయ్‌గ+య్+ఆల్=(చేయుటచేత). పై సందర్భమును బట్టి తమిటమున నిజమైన భావార్థక ప్రత్యయము 'గ' కారము కాదనియు 'అ' అనునదే యనియు స్పష్టపడుచున్నది'' (కాల్డు. ౫౩౬, ౫౩౭ పుటలు).

''తెలుఁగును బరిశీలించినచో నందు భావార్థక చిహ్నము 'అ' ప్రత్యయమొక్కటే యని స్పష్టపడును. తమిట క్రియాంగ రూప సాధనోపయోగి 'గు=గ్' ప్రత్యయము తెల్గున 'చు=చ్' అనునదిగా సంతతను నిల్చును. తెల్గున విధ్యాద్యర్థకమునకును భావార్థకమునకును భేద మత్యల్పమై యుండును. విధ్యర్థమున స్పష్టార్థమై వచ్చు 'ఉ' కారము చోట భావార్థకమగు 'అ' ప్రత్యయము నిల్చుటే భేదము. ఉదా:—తమి—తిఱి=(తెలుచుము)-తిఱక్క్+అ= (భావార్థకము). తెల్గు-తెలుచ్+అ=(తెలుచుట)-తెలుచ్+ఉ=(తెలుచుము). తెల్గునందును జతుర్థీ ప్రత్యయ 'క' (కు) కార మిట్లు 'చ' కారముగ మాఱనేరదు. కానఁ దెలుఁగు భావార్థకమునకును జతుర్థీ ప్రత్యయమునకును సంబంధమును (మాక్స్‌ముల్లెరుగా రన్నట్లు) గల్పింపరాదు. తెల్గునందును నీ రూపసాధనోపయోగి 'చ' కారమునకు బదులుగాఁ దఱుచుగా ముఖ్యముగా విధ్యాద్యర్థక రూపములలోను భావార్థక రూపములలోను 'ప' కారము నిల్చు

చుండును. ఉదా:—నడుప్+అ=(నడచుట). ఇది ‘నడుచ’ అనుదానికి బదులుగా నిల్చినది. దీనికి సరియగు వ్యావహారిక తమిఴ రూపము ‘నడక్క’ అనునది. గ్రాంథిక తమిఴ రూపము ‘నడప్ప్+అ’ అనునది. తమిఴ విధ్యర్థకము ‘నడ’ అనునదె. పై సందర్భమును బట్టి తెల్గు ‘చ’ కార ‘ప’ కారములు తమిఴ ‘గ’ కార ద్విరుక్త ‘క’ కారములును రూపసాధనోపయోగి ప్రత్యయములు మాత్రమె యనియు ‘అ’ అను భావార్థకముతో వాని కెట్టి సంబంధమును లేదనియు స్పష్టపడుచున్నది. తెల్గునందలి ‘చ-ప’ లు ‘ఇ’ కార పూర్వకములగునపుడు వాని నడుమ బిందువు నిల్చును. కన్నడమునఁ బెక్కు చోట్ల రూపసాధనోపయోగి ప్రత్యయములు రానేరావు. ‘అ’ అనునదె మూల ధాతువును జేరును. ఉదా:—తమిఴమున ‘ఇరుక్క+అ=’ (ఉండుట) అనునది భావార్థకమై యుండఁగాఁ గన్నడమున నంతకన్న సులభముగను స్పష్టతరముగను ప్రాచీనతరముగను ‘ఇర్+అ=ఇర’ అనునది భావార్థక మగుచున్నది” (కాల్డు. ౫౩౭ పుట.).

విమర్శము:—తమిఴమున ధాత్వర్థకత్వమున ‘పోగ’=(పోవుట) మున్నగునవి లేనట్లె ‘అఴిగ’=(ఎఴుఁగుట) మున్నగు భావార్థక శబ్దములును లేవు. స్వవాద స్థాపనార్థమై యట్టి యర్థము వానికిఁ గలదనుచు నయథార్థమును దొరగారు వ్రాయుచున్నారు. వాని కాశీరాద్యర్థకత్వము తమిఴమునఁ బ్రసిద్ధమై యున్నది. ఉదా:—అఴిగ=(ఎఴుఁగుతన్). దొరగారును వాని కాశీరర్థకత్వము గలదని వ్రాసిరి గాని యవి భావార్థకమగు ‘అ’ ప్రత్యయాంతములె యనియు, వానిలోని ‘గ’ కార ముచ్చారణ సౌకర్యార్థక మనియు భావార్థకము లాశీరర్థమున వాడఁబడుట సంప్రదాయమనియు నిట్లు స్వవాదమును నిలఁబెట్టుకొనుటకయి తమిఴమున లేని విషయములను నిరాధారముగ వ్రాసిరి. భావార్థమాశీరర్థక మగునని కాని ‘అ’ ప్రత్యయము భావార్థకమని కాని తమిఴ వ్యాకరణములం దెందును లేదు. ‘అ’ ప్రత్యయమున కాశీరర్థముండిన నుండుఁగాక. వాఴ్+అ=వాఴ=జీవించుఁగాక. “భావార్థ మాశీరర్థ మెట్లగును?

“‘నడవన్’ అను నర్థమున ‘నడక్క—నడప్ప’ అను రెండు రూపములును గలవు. ‘నడక్క’ అనుదానికి భావార్థకత్వము తమిఴమున లేదు ‘నడప్ప’ అనునది భావనామము కాదు. ‘వ-బ-ప్ప’ అనునవి తుదినిగలవి భావనామములు కావు......‘క్క-క-గ’ అనునవి తుదిని గలవియును భావనామములు లేవు.” (శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు ౨౭—౮—౫౩ జబాబు).

"'ఈయర్-ఉదా:—చెలీయర్=(చనుదురుగాక) (పురుషత్రయసాధారణము). 'క':—చెల్క=(చనుదురు గాక). (పురుషత్రయసాధారణము) 'య':—(వాటియ=జీవింతురు గాక) (వాట్=జీవించు)." (నన్నూలు ౧౮౦ సూ.)

'నడక్క' మున్నగు 'అ' ప్రత్యయాంతములు భావార్థకములు కావనియు 'ఈయర్-(ఇ) య' అనునవియును 'క' ప్రత్యయమువలెనె యాశీరర్థకములనియుఁ బయి యుదాహృతుల వలన విశదమగుచున్నది.

తక్కిన స్థలములందువలెనె 'చెయ్గై-చెయ్గ' అను స్థలములందును దమిళ శబ్దాంత స్థితమగు 'ఐ'='అయ్' కారము మలయాళమున 'అ' కారముగఁ బరిణమించినది. మలయాళమునందును 'క=గ' అనునదే యాశీరర్థక మగుట చేత 'చెయ్గ' అనుదానికి ఘుణాక్షర న్యాయముగ భావార్థకత్వము నాశీరర్థకత్వమును గల్గినఁ గల్గుఁగాక, అంతమాత్రమున మలయాళము తమిళ 'క-గ' ల చరిత్ర విషయమునఁ దెల్పెడి విశేష మేమున్నది?

ఆశీరర్థకమగు నీ 'క' ప్రత్యయ మఖండ రూపము. దానికి 'క్ + అ' అని పదచ్ఛేదము చేయుటగాని యందలి కకార ముచ్చారణ సౌకర్యార్థము చేరిన దనికాని చెప్పుట పొసఁగనేరదు. దీనికి సరియగు నాశీరాద్యర్థక పటిగన్నడ ప్రత్యయము 'కె-గె' అనునదై యున్నది.

"'గె-కె' వా ప్రథమ స్యాశిషి విధ్యాదిషుచ" (కర్ణా. భా. ౨౧౫ సూ.)=ప్రథమ పురుష తిఙ్విభక్తిస్థానమున నాశీర్విధ్యా ద్యర్థములందు 'గె-కె' అను ప్రత్యయములు పర్యాయముగ నగును. ఉదా:—ఆయుమం సిరిమం మాడుగె=(ఆయువును సిరిని జేయుఁగాక). ఆయుం సిరియు మక్కె=(ఆయువును సిరియు నగుఁ గాక)".

"క. సొగయిపువు 'గె-కె' గళనో । త్తిగె విధ్యర్థక్కె......(శబ్దమణి దర్పణము. ౨౭౯ ప)."

"భాషామంజరీ వృత్తి:—ప్రథమ పురుష దేకవచనక్కం బహువచనక్కం విధ్యాద్యర్థదొళ్ 'గె' ఎందుం 'కె' ఎందుం అక్కుం."

తెల్గున "ట=డు=అటము=అడము=ఇంపు" మున్నగు ధాత్వర్థక ప్రత్యయములును, 'త-టు-కు-వ' మున్నగు ననేక భావార్థక కృత్ ప్రత్యయములు వెలయుచుండఁగా (చూడు బాల వ్యా. క్రియా. ౩౫ సూ. కృదంత పరిచ్ఛేదము. ప్రౌఢ. వ్యా. కృదంత) "తెల్గున 'అ' ప్రత్యయ మొక్కటే భావార్థక ప్రత్యయము" అని దొరగారు వ్రాయుట వింత. దొరగారు చెప్పిన లక్షణములు గల భావార్థక (ధాత్వర్థ=Infinitive) ప్రత్యయము ద్రావిడభాషలందు—ముఖ్యముగాఁ-దమిళమందు మచ్చునకేని లేదు.

"భావే ట వర్ణకోస్తే । సర్వేషాం చ క్రియా పదానాం స్యాత్."
(ఆం. చిం. వ్యా. సం. ౩౯౯ విష).

కొన్నియెడల 'డు' అను క్రియా నామవాచక భావ ప్రత్యయము వచ్చుటయుఁ దెల్గునఁ గలదు.

"క. పడరత్ని ధనుర్ధరుఁ డె । య్యెడ సజితుఁడు గాన వాని హీనుంగాఁ జే । యుడు నాకుఁ జతుర్వర్గము । వడయుట యని పృషతసుతుఁడు ప్రార్థించె మునిన్. (భార. ఆది. ౭ ఆ. ౧౬౬ ప). (చేయుడు=చేయుట. డువర్ణకము భావార్థకము. ప్రాసగతము)" (చూడు వ్యా. సం. ౩౯౯ విష).

"ప్రతిక్రియ మడాంతత్వం । ప్రతీతం తు న గీయతే । క్వచి దింప్వంతతాం కేచి । దూచిరే నహి మే రుచిః" (వికృ. 'వ్యా. సం.' ౩౯౯ విష.) అను నధర్వణ వచనము చొప్పున 'అడము'=(కేరడము) 'ఇంపు'=(ఆరగింపు) అనునవి తుదిని గల భావార్థకములును క్రియానామవాచకములు కానోపును. గోదావర్యాది మండలములలో 'పోవటము-రావటము' మున్నగు రీతిని 'అటము' అనునది తుదిని గల భావార్థకములును క్రియానామవాచకములుఁగ వాడుక కెక్కియున్నవి.

తెలుచుఁ (గా)-'తెలుచుము' మున్నగు చకార ఘటితరూపములు తెల్గున నర్వాచీన వ్యావహారిక రూపములు. 'ప' కార ఘటితములె, గ్రాంథికములు. 'తిలుక్క'=(తెలుచుట) 'నడక్క=నడప్ప'=(నడచుట) 'ఇరుక్క'=(ఉండుట) అను భావార్థక రూపములు తమిటము లేనేలేవనియు 'నడ్క్కై-ఇరుక్కై' మున్నగునవి తమిట భావార్థకములనియుఁ బయిని వివరింపఁబడెను. 'ఇర=(ఉండుట)' అను భావార్థకము కన్నడమున నెంత మాత్రమును లేదు. ఇర=(ఉండక) 'ఇర=(ఉండుము)' అనురూపములు మాత్రమె కలవు.

"వాక్చేరః" (కర్ణాటక శబ్దా. ౫౮౩ సూ.)=(వృత్తి) "ఉత్తరకాల క్రియయా సహ సమానకర్తృకాత్ పూర్వకాలేఽర్థే వర్తమానాత్ 'ఇర్' ఇత్యస్మా ద్ధాతోః 'అదెత్' 'ప్రత్యయో భవతి' అగాగమశ్చ వా భవతి. ప్రతిషేధేగమ్యమానే".

"ప్రతిషేధవిషయే 'ఇర్' ధాతోః అగాగమో విశేషః........"
(మంజరీ మకరంద వ్యాఖ్య).

"ఉ చ్చేరః" (కర్ణాటకశబ్దా. ౭౬౯ సూ.)=(వృత్తి)='ఇర్' ఇత్యస్మా ద్ధాతోః పరస్య 'అయః' (మధ్యమ పురుషైక వచనస్య) 'అ'కారః-లోపః-ఉకారశ్చ ఆదేశా భవన్తి విధ్యాదివిషయే. ఉదా:—నీం ఇర=నీం ఇర్=నీం ఇరు=(నీ వుండుము).

౧౩౭. IV విమ:—"భావార్థకమగు 'అ' ప్రత్యయ చరిత్ర:—ఈ 'అ' శబ్దము నిశ్చయముగ నిర్దేశాత్మక సర్వనామమని చెప్పవచ్చును. ఒకొ్కొకప్పుడు 'అ+న్' అనునదియు, 'అమ్' అనునదియు, 'అల్' అనునదియు నీ తెగలో ముఖ్యముగాఁ జేరుచున్నవి. (చూడు ౧౧౯ III విమ. ౧౧౭ I విమ). 'అల్'—(అది) అనునదియు 'అల్' (లేదు) అనునదియు 'అ' శబ్దమునుండి యేర్పడినవె యనుట సునిర్వాహమైనను గాకున్నను భావార్థక ప్రత్యయగు 'అ' శబ్దము తొలుత నిర్దేశక సర్వనామమున కభిన్నమనుటకు విప్రతిపత్తిలేదు. భావార్థమున నప్పుడప్పుడు కనఁబడు 'అల్' అనునదియు భావార్థకమగు 'అ' ప్రత్యయమును సంబంధించిన గౌణరూపమనుటకు సందియము లేదు" (కాల్డ్వె. ౫౩౭, ౫౩౮ పుటలు).

విమర్శము:—'అ' ప్రత్యయము కాల్డువెల్లుగారి సిద్ధాంతము చొప్పున తమిళ క్రియా నామవాచక ప్రత్యయము కాకున్నను గన్నడాంధ్రములలోఁ గొన్నియెడల 'ట' ప్రత్యయ సమానార్థకమై యున్న మాట నిజమె. (చూడు ౧౩౭ I విమ).

'అల్' అనునది కన్నడమున తుమర్థకము భావలక్షణార్థకమును; దమిళమున నయ్యది భావార్థకము. తుమర్థకత్వము 'చెయఱ్కు' మున్నగు వానిని బట్టి యూహింపనగును. తెల్గున 'అన్' ప్రత్యయము తుమర్థకము భావలక్షణార్థకమును; వలయ్వాదియోగమున భావార్థమందు ధాతువుపైని 'అన్' నిల్చును. ఇట్టి 'అల్-అ-అన్' అను వానికిని నిర్దేశక సర్వనామములగు 'అ-అన్-అల్' అను వానితో నాకార సామ్య మున్నమాట వాస్తవమె. కాని యర్థసామ్య మించుకేని కానరాదు. నిర్దేశార్థమునకును భావార్థాదులకును సంబంధ మేమియు లేదు. కావున 'అల్-అన్-అ-త-ట' అనునవి మొదలగు భావార్థకాది ప్రత్యయములు 'తల్-అల్' అను ద్రావిడ ప్రత్యయముల పరిణామము లనుట యుక్తమన నగును. 'తల్' ప్రత్యయము తమిళమున భావార్థక మనఁగా ధాత్వర్థకము. 'అల్' ప్రత్యయము తమిళమున భావార్థకమెకాక "చెయఱ్కు=చెయల్కు=చెయల్" అనురీతిని (చూడు ౧౩౭ I విమ). దుమున్నాద్యర్థకమునునై యున్నది. పళగన్నడమున 'అల్' ప్రత్యయము తుమర్థకమును భావలక్షణార్థకమును. పళగన్నడమున దీనికి భావార్థకత్వము లేదు. (చూడు ౧౩౭ II విమ). తెల్గున 'అన్' అనునది తుమర్థకము భావలక్షణార్థకమును భావార్థకమును నై యున్నది. (౧౩౭ I విమ).

తొల్కాప్పియమునఁ జేర్కొనఁబడిన 'తల్-అల్' అను భావార్థకములు:-

"కాప్పు=(రక్షించుట), ఒప్పు=(పోలుట) (ఒ—ధా). ఊర్ తి=(ఆరోహించుట), పెఱల్=(పొందుట), చెఱల్=(చెఱుచుట), ఉవత్తల్=(సంతసించుట), కఱ్పు=(అభ్యసించుట), అఱుత్తల్=(కోయుట), కుఱైత్తల్=(నఱకుట-తగ్గించుట.) తొకుత్తల్=(చేర్చుట), పిరిత్తల్=(విడఁదీయుట), నిఱుత్తల్=(తూఁచుట), చార్దల్=(ఆశ్రయించుట), కన్రల్=(అలవాటున స్థిరపడుట), నోక్కల్=(చూచుట), (నోక్కు-ధాతు), అఞ్జల్=(భీతిల్లుట)" (తొల్కా. ౫౫౬ సూ. చూడు).

౧౩౭. V విష:—"భావార్థక రూపముల వాడుక":—"భావార్థకమగు 'అ' ప్రత్యయముతోఁ గూడినరూపమును దమిళ వైయాకరణులు మూఁడు కాలములందును సమానమగు నసమాపక క్రియగ నిరూపించి యున్నారు. కాని దీని ప్రయోగపురీతిని బరిశీలించినచో నిది కృదంతమనియో? ధాతుజ విశేషణ జన్యనామవాచకమనియో తోఁచును. దీని నితరభాషలందువలె నుద్దేశమును (లేక) బ్రయోజనమును దెల్పుట కుపయోగింతురు. ఉదా:—వర్+అ+(చ్) చొల్లు = (వచ్చుట చెప్పుము = రమ్మని చెప్పుము). ('వచ్చునట్లు చెప్పు' అని భావలక్షణార్థమె చెప్పనగును). దీని వాడుకలు:—

I. ద్రావిడ క్రియావిశేషణములం దధిక సంఖ్య గలవి యకర్మక క్రియలయొక్క భావార్థక రూపములై యున్నవి. ఉదా:—తెల్లు - పడఁగొట్టెను = తమి-విఴ+(త్)+తళ్ళినాన్. (విఴ = క్రిందపడునట్లని యర్థము) ఈ సంప్రదాయము చొప్పునని 'ఆగ్+అ'=(కాన్-గాన్) అనుదానిని గుణ నామవాచకముల పైని నిల్పుటచేత నవి క్రియావిశేషణము లగుచున్నవి. ఉదా:—నన్ఱ్+ఆగ=(మంచిదిగా= బాగుగా)-'నన్ఱు'=(నన్ఱు) (మంచిది).

II. ఆశీరాద్యర్థకములందు సొంపునకయి యీ భావార్థకమును వాడుదురు. ఉదా:—"నీ వాళ్ + అ =" అనుదానికన్న "నీ వాళ్ + గ్ + అ" అనియు "నీ వాఴి+య్+అ" అనియుఁ దఱుచుగా వాడుదురు. "నీవు వర్ధిల్లుదువు గాక" అని యర్థము. సెయ్‌వాయ్+ఆగ=(చేయుదువు గాక). "సెయ్‌వాయ్=(చేయుదువు=చేయఁగలవు, "ఆగ=అగుట" అని యథాశ్రుతార్థము).

III. తమి—పొఱుదు విడిన్ఱ్ + ఇరుక్క + అ + ఏన్, తూఞ్జుగిఱాయ్=(ప్రొద్దుపొడిచి యుండఁగా నేల నిద్రించుచున్నావు) ఇందు 'విడిన్ఱ్+ఇరుక్క+అ' = (పొడిచియుండుట) అనునది యద్యతన భూతకాలమందున్నది. కాని 'ఇరుక్క' అనునది భూతకాలిక భావార్థకము కాదు. అది 'ఇరు' అను ధాతువు యొక్క సామాన్యమగు (లేక) తద్ధర్మార్థకమగు భావార్థక రూపమై యున్నది.

IV. లాటిన్ భాషయందువలె ముఖ్యక్రియతోఁడ సమానకాలికములైన పెక్కులగు నముఖ్యక్రియలను దెల్పుటలో సొంపునకై తఱుచుగా నీ భావార్థకములగు 'అ' ప్రత్యయాంతములు వరుసగా వాడఁబడును. ఉదా:—ముగిల్ ఎఱుమ్ప = (మేఘములు లేచుచుండఁగా), వానమ్ ఇరుళ్ + అ = (ఆకాశము చీకటులు క్రమ్ముచుండఁగా) మళై పొట్టిన్దు పెయ్+య్+అ=(వర్షము ధారలు కట్టి కురియుచుండఁగా) ఊరార్ తిరువిలా నడత్తినార్గళ్ = (గ్రామస్థులు పవిత్రమైన యుత్సవమును నడపినారు).

V. భావార్థకముల నామ్రేడితముగా లాటిన్ భాషయందలి క్రియా విశేషణములనువలెనె (Gerund in do) వాడుదురు. ఉదా:—తమి-'పోగ్ + అ-పోగ్ + అ, బలన్ కొళ్ళుమ్'=(దగ్గఱకుఁ బోఁగాఁ బోగా బలము కల్గును) (తమి-పోగ-పోగ=('పోవుట-పోవుట' అని యథా శ్రుతార్థము). లాటిన్ వాడుక-(వైర్స్ ఎక్వైరిట్ ఎఉన్డు)=Vires acquirit eundo" (కాల్డు. ౫౩౭, ౫౩౯ పుటలు).

"ఈ యుదాహరణములవలన ద్రావిడ భావార్థకమునకుఁ గ్రియా విశేషణార్థము, (gerund) ధాతుజ విశేషణార్థము,=(verbal participle) కృదంతార్థమును=(verbal noun) మఱియు నిజమైన క్రియా నామవాచకార్థమును (Infinitive) గలవని విశదమగుచున్నది" (కాల్డు. ౫౩౯ పుట).

విమర్శము:—ఎన్నెన్నో యర్థములుగలవని దొరగారు వ్రాయుదురే కాని యైదు విధముల యుదాహృతులలోను గ్రియా విశేషణార్థకత్వ మనఁగా భావలక్షణార్థము మాత్రమె కన్పట్టుచున్నది. 'క్రియా నామవాచకార్థకము 'అ' ప్రత్యయము' దమిళమున లేనేలేదని యీవఱకు విశదీకరించి యున్నాను (౧౩౭ I–II విష). 'వాట్గ-వాటియ' మున్నగు నాశీరర్థకములు క్రియా నామవాచకములె యనియు నందలి 'గ' కార ముచ్చారణార్థకమనియు వ్రాసిన దొరగారి వ్రాఁత '౧౩౭ III విషయమున' నిరసింపఁబడియె యున్నది. 'I–III–IV–V' విషయములుగ వేఱుపఱిచి యుదాహరించిరేకాని యవెల్ల భావలక్షణార్థక రూపములె యై యున్నవి.

౧౩౭. VI విష:—"తమిళమందు 'దల్' అనునది తుదినిగల ధాతుజ విశేషణజన్యనామవాచకము (లేక) కృదంతము గలదు. ఉదా:—అలైదల్= (తిరుగుట). (అలై =తిరుగు-ధాతువు) ముఱిదల్=(విఱుగుట). (ముఱి-ధాతువు). కన్నడమున దీని తుదిని లకారము కాన్పింపదు. ఉదా:—అలె+త=(తిరుగుట). మురి+త=(పగులుట-పగులఁగొట్టుట) ('మురత' తప్పు - 'ముఱిత' సాధువు). తెల్గున-మేత్ + అ = మేత. చేత్ + అ = చేత. (ఇవి 'అ' ప్రత్యయాంతములని

దొరగారి యాశయము). వీనిని దమిళమందలి 'మేయ్+త్+తల్' (మేఁత) 'సెయ్+దల్'=(చేఁత) అనువానితోఁ బోల్చి చూచునది. అట్లె తెల్గు-నడత-తమి-నడ+త్+తల్=నడత్తె=మలయాళ-నడత్తు" (కాల్డు. ౫౩౯ పుట).

"అలంతమగు కృదంతము చతుర్థి 'కె' ప్రత్యయముతోఁ గూడియుఁ గూడకయుఁ గన్నడమున నిల్చునని చెప్పియున్నాను (చూడు ౧౩౭ I విష). గోండు భాషయందు 'అల్' అను దానినుండి యేర్పడి విస్తరించిన 'ఆల్లె' అనునది భావార్థక చిహ్నములలో నొకటి యనియు నీవఱకుఁ జెప్పియున్నాను. (౧౩౭ I విష.) ఉదా:—అయ్యాల్లె=(ఉండుట). ఇది 'ఆగల్'=(ఉనికి) అను తమిళ కృదంతమున కభిన్నము. ఈ రూప ముత్తమ తమిళ గ్రాంథిక భాషయందు భావార్థకముగ వాడుదురు. ద్రావిడ భావార్థమున ధాతుజ విశేషణజన్య నామ వాచకముయొక్కయుఁ గృదంతము యొక్కయు స్వభావములు మిశ్రితములై యుండుటవల్లను, నీ భావార్థక రూపమును దమిళ వైయాకరణులు మూఁడు కాలములయందును సమానమైన యసమాపక క్రియగ (Gerund) (లేక) ధాతుజ విశేషణముగ నిరూపించుటవల్లను, నీ భావార్థకము 'అలంత' కృదంతముతోఁ జాల సంబంధించి యుండుటవల్లను (గృదంతముల తుదిని 'అల్' అనునది యుండుట తమిళ స్వభావము. దీనిచేత భావార్థమేకాక క్రియయే వాచ్యమగును) నితర సందర్భము లందీ 'అల్' అనునది 'అ' అనుదానినుండి యేర్పడినదని నిర్ధారిత మగుటవల్లను భావార్థక ప్రత్యయమగు 'అ' శబ్దము 'అల్' అను కృదంతమునకు మూల మనియు 'ఆగ్+అ'=(ఉండుట) అనునది 'ఆగ్+అల్'=(ఉనికి) అను దానియొక్క ప్రాచీనతర నిర్దుష్ట రూపమనియుఁ జెప్పుట యుక్తమని మాకుఁ దోఁచుచున్నది" (కాల్డు. ౫౩౯ పుట).

"ద్రావిడ భావార్థకములందలి 'అల్' అనుదానికి 'ఆర్మీనియన్' భాషయందలి భావార్థక 'ల' ప్రత్యయముతో మిక్కిలి పోలిక గన్పట్టుచున్నది. ఇది కాకతాళీయమైనం గావచ్చును. ఉదా:—ఆర్మీ-బెర్+ఎ+ల్=(మోయుట) తమి-పొల్+అల్ ('ఈ శబ్దమే తమిళమున లేదు.' శ్రీ రెడ్డిగారు)=(మోఁత). ఆర్మీ-త+ల్=(ఇచ్చుట) తమి-త+(ర్) అల్=(ఇచ్చుట). దీని విధ్యర్థకము 'తా' అనునది" (కాల్డు. ౫౩౯ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగా రింగ్లీమునందలి 'to do'=(చేయుట) అను దానికి సరిగ ద్రావిడ భాషలందు శశవిషాణప్రాయమగు (౧౩౭ I విష. చూడు) 'అ' ప్రత్యయాంతములు గలవని స్థాపించినవారగుటచేత నిజమైన ద్రావిడ క్రియానామవాచక ప్రత్యయములగు 'తల్=అల్=త—ట' మున్నగునవి కృదంతములని వ్రాసికొనవలసి వచ్చినది. కావుననె 'పోగ' మున్నగువాని

'to go' అను రీతిని 'పోదల్' మున్నగువానికి 'going' అను రీతిని నర్థము వ్రాయు చుందురు.

'తల్-అల్-త-ట' మున్నగునవి ద్రావిడ భాషలందు నిజమైన క్రియా నామవాచక ప్రత్యయములు. అవి శుద్ధ ధాత్వర్థకములు. 'అల్-త-ట-అన్' మున్నగునవి 'తల్' అను ద్రావిడ క్రియానామవాచక ప్రత్యయ పరిణామ ములె యనఁదగును. 'ట-త' మున్నగునవి 'తల్' ప్రత్యయపు పరిణామములు 'అన్-అ' మున్నగునవి 'అల్' ప్రత్యయపు పరిణామములు ననఁదగును. (చూడు ౧౩౭ IV విష.) శశవిషాణ ప్రాయమగు తమిళ 'అ' ప్రత్యయమునుండి 'అల్' ప్రత్యయ మేర్పడె నను కాల్డువెల్లుగారి వ్రాఁత కేవలమున సహజమగుట చేత విశ్వసింపరానిది. ఈ విషయమున దొరగారు వ్రాసిన బలహీనములగు హేతువులు హేత్వాభాసములు. లకార లోపమున 'అల్' 'అన్' అనువాని నుండి 'అ' ప్రత్యయ మేర్పడెననుట యెంతయు సహజము. మఱియు నట్టి 'అ' ప్రత్యయము సైతము లోపించుట కన్నడమునఁ బ్రసిద్ధమై యున్నది.

"అద్ భావే" (కర్ణాటకశబ్దా. ౫౮౯ సూ.)=భావ శ్శుద్ధో ధాత్వర్థః. తస్మి న్నభిధేయే ధాతోః 'అత్' ప్రత్యయో భవతి.

"లుప్ తస్య" (కర్ణాటశబ్దా. ౫౫౬ సూ.)="భావే విహితస్య 'అత్' ప్రత్యస్య లోపో భవతి. ప్రయోగః. 'పూ=' (పుష్పించుట).

"'అత్' ప్రత్యయోహి కార్యార్థం స్వాయ మాగత్య తిఙుత్పత్త్యర్హాణాం క్రియావాచినాం ధాతూనాం సుబుత్పత్త్యర్హ ద్రవ్య వాచివత్ నామత్వా పాదన లక్షణం స్వకార్యం కృత్వా స్వయం నిర్గచ్ఛతి, యథా సంస్కృతే క్విబా దివత్" (భట్టాకలంకదేవకృత. మంజరీ మకరంద వ్యాఖ్యా. ౫౫౬ సూ.).

ఇట్టి క్రియానామవాచక ప్రత్యయ సాకల్యలోపమే కాక 'వుదు' ప్రత్యయము కన్నడమున సర్వధాతు సామాన్య క్రియా నామవాచక ప్రత్యయ మయి నిల్చుటయుఁ గలదు. 'ధాతో ర్వుదుః' (కర్ణాటకశబ్దా. ౫౭౯ సూ.)= సర్వేభ్యో ధాతుభ్యో భావేఽర్థే 'వుదు' ప్రత్యయో భవతి. ప్రయోగః- మాల్పుదు=(చేయుట). నోల్పుదు=(చూచుట). (౫౧౫ సూత్రము చొప్పున 'వుదు' ప్రత్యయ వకారము 'ప' కార మగును). తమిళమున సర్వధాతు సామాన్య క్రియా నామవాచక ప్రత్యయము 'తల్' అనునదియుఁ (చూడు ౧౩౭ IV విష.) దెల్గున 'ట' అనునదియు నై యున్నవి. (చూడు ౧౩౭ III విష.) తమిళమునందు 'తల్-అల్' అను ప్రత్యయములె కాక మఱికొన్ని క్రియా నామవాచక ప్రత్యయములును గలవు. "పోగై=పోగుగై=(పోవుట) ఇరుక్కై=

(ఉండుట) చెయ్‌గై =(చేయుట) నడక్కై =(నడచుట)-నడప్పు = (నడచుట) ఇరుప్పు=(ఉండుట) కాప్పు=(రక్షించుట) మొ.'' 'త' ప్రత్యయాదులగు కృదంతములును 'తల్' ప్రత్యయ పరిణామములు పెక్కు గలవు. తద్భిన్నములగు పెక్కు కృదంతములును గలవు.

"మణ్యాదిభ్యః" (కర్ణాటకశబ్దా ౫౫౮ సూ.)=మణ్యాదిభ్యో ధాతుభ్యో భావేర్థే 'త' ప్రత్యయో భవతి. ప్రయోగః-మణితం=(అడఁకువ అడఁగుట) మొ.

''తజ్వర్ణకంబు చేయ్యాదుల కగు'' చేయు+త=చేఁత=(పని-కృత్యము=మేఁత-వ్రాఁత-కోఁత. మొ.) 'కో+త్+అ' అను దొరగారి పదచ్ఛేదము కేవలము నసంగతము, (౮౩౮ పుట). 'తల్' ప్రత్యయ పరిణామములు కాని కృదంతములు పెక్కు తమిళ కన్నడాంధ్రములలోఁ గలవు. అట్టివి ముందు వివరింపఁబడును.

అల్ ప్రత్యయము క్రియా నామవాచక మగుటయేకాక తుమర్థక భావలక్షణార్థక మగుటయుఁ దమిళమునఁ దొల్కాప్పియము నాఁటికే ప్రసిద్ధము (చూడు ౧౩౭ I—౧౩౭ IV విభ). పలగన్నడమున దానికి భావార్థకత్వము లేదు. తుమర్థ భావలక్షణార్థములు మాత్రమె కలవు. అది కన్నడమున భావార్థక మను దొరగారి వ్రాఁత భ్రాంతి మూలకము. తెల్గున 'అల్' ప్రత్యయమున కభిన్న మనఁదగు 'అన్' ప్రత్యయము గలదు. అది వలయ్యాది యోగమున మాత్రమె భావార్థకము. తక్కిన యెడల నది తుమర్థ భావలక్షణార్థములందుఁ దఱచుగా వర్తించును.

౧౩౭. I విభ:—"కృద్రూప నిష్పత్తిః—ద్రావిడ కృదంతములు రెండు విధములు. I క్రియాజన్య విశేషణ నామవాచకములు=అనఁగా సంబంధార్థక ధాతుజ విశేషణ జన్య నామవాచకములు ఉదా:—ఇరుక్కిన్ద్రవన్. మొ. (Participial nouns). II కృదంతములు. (అనఁగాఁ గ్రియార్థ స్ఫూర్తిగల కృదంతములు. ఉదా:—చేయుట. మొ.) (Verbal nouns). ఇందు మొదటి తెగవి మూఁడుకాలములను దెలుపునట్టి సంబంధార్థక విశేషణములనుండి యేర్పడి కాలిక చిహ్నములతోఁ గూడి యుండును. రెండవ తెగవి క్రియాంగము నుండియే యేర్పడి కాల విశేష బోధ లేకయే (క్రియార్థ స్ఫూర్తి గల్గి) యుండును'' (కాల్డు. ౫౮౦ పుట).

I. ''సంబంధార్థక ధాతుజ విశేషణజన్య నామవాచకములు:—ఈ తెగలోని నామవాచకములు, వర్తమానార్థక భూతార్థకములగు సంబంధార్థక ధాతుజ విశేషణములకు నిర్దేశక సర్వనామములనో వాని తుదిభాగములనో చేర్చుటచేత

నేర్పడును. ఉదా:—వర్తమానార్థక—‘చెయ్‌గిఱ’=(చేయుచున్న) అను వర్తమానార్థక విశేషణమునుండి ‘చెయ్‌గిఱ+వ్+అన్=చెయ్‌గిఱవన్’=(చేయుచున్నవాఁడు) అను వర్తమానార్థక ధాతుజ విశేషణజన్య నామవాచక మేర్పడును. ఇట్లె ‘చెయ్‌గిఱవళ్’=(చేయుచున్నయామె) మున్నగునవియు నేర్పడును. ఇట్లు తత్తదర్థములగు సర్వనామ ఖండములనుఁ జేర్చుటచేతఁ బ్రథమపురుషము నందలి తత్తత్క్రియాజన్య సంబంధార్థక విశేషణజన్య నామవాచకము లేర్పడు చుండును. భావ్యర్థమున ‘వకార పకారములు’ తుదినిగల భావి క్రియలనుండి సంబంధార్థక మహాద్ విశేషణము లేర్పడవు. (చూడు ౧౩౬ I విష). (౧౩౬ II విష). (కన్నడమున నట్టివి యేర్పడును). కాన నట్టి తమిఴ సంబంధార్థక భావ్యర్థక విశేషణజన్య నామవాచకములు సంభవింపనేరవు. అట్లయి నను వేఱువిధములగు భావ్యర్థక క్రియాజన్య విశేషణ నామవాచకము లేర్పడ వచ్చును. ఉదా:—ఓదువాన్=(చదివెడివాఁడు) కాణ్బ+వ్+అన్=(ఎవఁడు చూచునో వాఁడు). ‘ఉమ్’ అనునది సహజముగ సంబంధార్థకము కాక సముచ్చయార్థకమగుటచేత (చూడు ౧౩౬ II విష.) నయ్యది తుదినిగల తద్ధర్మార్థక భావ్యర్థక రూపమునుండి ధాతుజ విశేషణజన్య నామవాచక మేర్పడనేరదు. వ్యతిరేకార్థక క్రియాజన్య విశేషణములనుండి యేర్పడిన నామవాచకము లెల్ల లింగవచనములందును నేర్పడును. ధాతుజ విశేషణజన్య నామవాచకములన్నిటికిని సుబ్విభక్తి మేళనము ధారాళముగ నుండును. ఉదా:—వీట్టై+క్+కట్టినవన్+ఉక్కు=(ఇంటిని గట్టినవానికి). పై విషయములెల్ల నెల్లద్రావిడభాషలందును దుల్యముగనే యుండును” (కాల్డు. ౫౪౦ పుట).

“అమహాదర్థకరూపముల విషయమున మూఁడువిధములు గలవు. I. అమహాత్కర్తృక ప్రథమపురుషరూప నామవాచకములు. ఉదా:—సెయ్‌గిఱదు=(చేయుచున్నది). II. అమహాదర్థక సంబంధార్థక విశేషణ జన్యనామవాచకములు. ఉదా:—సెయ్‌గిన్ద్రదు = (చేయుచున్నది). (“I. II. వీని కర్థభేదము చెప్పుట లేదు” శ్రీ రెడ్డిగారు) III. క్రియా జన్య విశేషణ నామవాచకములు=(భావార్థకమువంటి ధాత్వర్థస్ఫూర్తి గల కృదంతములు) ఉదా:—చెయ్‌దల్=చెయ్‌గై=(చేయుట) (doing—to do). ఈ మూఁడవవిధమగు రూపములందుఁ గాలవిశేషబోధ ముండదు. ఇవి కృత్తులై యైనను జరిత్రమున వీనియందుఁ గ్రియాజన్య విశేషణముల శక్తి గలదు. అమహాత్కర్తృక ప్రథమపురుషరూపమును గ్రియాజన్యవిశేషణ నామవాచకముగ వాడునపుడు తమిఴమునఁ గాలత్రయమునందును మూఁడు వేర్వేఱు రూపము లుండును. వర్తమాన—సెయ్‌గిఱదు=(చేయుచున్నది). భూత—సెయ్‌దదు=

(చేసినది) — సెయ్‌వదు = (చేయనున్నది). వీనికి వాడుక ననుసరించి బహువచన రూపము లుండును. ఇట్టి యమహత్కర్తృక ప్రథమ పురుషరూప నామవాచకములకును సంబంధార్థక ధాతుజ విశేషణజన్య నామవాచకముల కును మాత్రమె బహువచన రూపములుండును. క్రియాజన్య విశేషణ నామ వాచకములకు (Verbal participial noun) (to do—doing) బహువచనరూప ముండనేరదు. భావి క్రియారూపములనుండి యేర్పడిన విశేషణ నామవాచక రూపములె కన్నడమునఁ దఱచుగఁ గృదంతములుగా వాడఁబడును. ఉదా:— ఇళి=(దిగు. ధాతు) ఇళియు+వ్+అదు=ఇళియువదు=ఇళివు+దు=ఇళివుదు= (దిగుట)" (కాల్డు. ౫౪౦, ౫౪౧ పుటలు).

"అమహత్కర్తృక ప్రథమ పురుషరూప నామవాచకము లొక్కొక్క ప్పుడు భావార్థకము లనిపించుకొనును. వీని నింగ్లీషులోని కనువదించునపు డింగ్లీషులోని భావార్థకములె వాడఁబడును. ఉదా:—అప్పడి సెయ్‌గిఱదు సరి (య్) అల్ల=(It is) not right to do so=(అట్లు చేయుట సరికాదు). ఇట్టివి చతుర్థ్యంతములగునపుడు భావార్థకరూపములకు మఱింత సన్నిహితము లగును. ఉదా:—సెయ్‌గిఱదుక్కు=(for the doing=to do.). వాక్యనిర్మాణమున 'అదు' అనునది 'అదన్' అనిమై శ్రుతిసుఖార్థతకై 'సెయ్‌గిఱదఱ్కు' అని యేర్పడును. ఈ రూపమె యెక్కువ యింపైనదని తమిళుల మతము." (కాల్డు. ౫౪౧ పుట).

"తమిళ మలయాళములందలి ధర్మవాచక భావార్థక ప్రత్యయము:— తమి—'మై', మలయా—'మ' అనునది కలదు. దీనిపయిని సుబ్విభక్తులు నిల్చును. ఇది వర్తమానార్థక భూతార్థకములగు సంబంధార్థక ధాతుజ విశేషణములపైఁ జేర్పఁబడును. ఇది ధర్మవాచక భావార్థక ప్రత్యయము. ఉదా:—ఇరుక్కిన్ద్ర+అ+మై=ఇరుక్కిన్ద్రమై = (ఉన్నదాని తనము). ఇట్టివి తమిళ గ్రాంథికభాషయందె కన్పట్టును. ఇట్టి ప్రత్యయము వ్యతిరేకార్థక విశేషణములపైని సైతము నిల్చును. ఉదా:—ఇరామై=(ఇర్+ఆ+మై)= (ఉండనిదాని తనము). ఇట్టి వ్యతిరేకార్థక నామవాచక రూపములు తమిళ మందును మలయాళాంధ్రములందును నధికముగా వాడఁబడును. (తెల్గు— ఓర్వలేనితనము=ఓర్వలేనిదాని తనము. బుద్ధిలేనితనము మొ.). ధాతువు యొక్క మూలరూపముపైని 'మై' అనుదానిని జేర్చుటవలన నేర్పడెడి ధర్మవాచక భావార్థక రూపములు=(Abstract appellative nouns) తమిళమున వ్యావహారిక భాషయందు సైతము వాడఁబడుచున్నవి. ఉదా:—పొఱు+మై = (ఓర్పు). ఇట్టివి మలయాళమందును నితరభాషలందును స్వల్పములగు మార్పులతో వాడఁబడుచున్నవి. మై ప్రత్యయాంత సంబంధార్థక ధాతుజ విశేషణ నామ

వాచకములకు సుబ్విభక్తి యోగయోగ్యతయుఁ గ్రియార్థభానమును గలవు. కాని ధర్మవాచక భావార్థక నామవాచకములయందుఁ (Abstract appellative nouns) గ్రియార్థభానముండదు. సుబ్విభక్తి యోగయోగ్యతమాత్రమె యుండును" (కాల్డు. ౫౪౧, ౫౪౨ పుటలు).

"తమి—'మై' మలయా—'మ' కన్నడ—'మె' తెల్గు—'మి'" అనురూపములతో నీ ధర్మవాచక ప్రత్యయము వెలసియున్నది. ఫిన్నిషు భాషయందు 'మ' లేక 'మా' అనునది క్రియాజన్య విశేషణ నామవాచక ప్రత్యయము. (భావార్థకము). ఇస్తోనియన్ భాషయందు 'మ' అనునది భావార్థక చిహ్నము. ఫిన్నిషుభాషయందు 'మన్' అను రూపమును జేర్చుటచేత 'సుమైనలు' అను రూపము లేర్పడును. తుర్కిషు భాషలో 'మక్ = మెక్' అనునవి భావార్థక ప్రత్యయములు. ఇవి ద్రావిడభాషలోని 'మై-మె' అను వానితోఁ బోల్పనగును. 'మెన్' అనునది ప్రాచీన గ్రీకు భావార్థక చిహ్నము. ఉదా:—పాయేమ-డెన్ మన్-షిన్ మె" (కాల్డు. ౫౪౨ పుట).

విమర్శము:—"కృ దతిఙ్ (3-౧-౯3) = సన్నిహితే ధాత్వధికారే 'తిఙ్ భిన్నః ప్రత్యయః 'కృత్' సంజ్ఞః స్యాత్." (సి. కౌ. 3౭౪ సూ). "ధాతువునకు విహితంబగు 'డుఙ్' భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు" (బాల వ్యా. కృదం. ౧ సూ. వివృతి) అను చొప్పున ధాతువు పైని విధింపఁబడిన పురుషబోధక ప్రత్యయభిన్నములగు ప్రత్యయములు 'కృత్' సంజ్ఞ గలవగును. కాని యట్టి కృత్తులందు శుద్ధమగు ధాత్వర్థీ భూత వ్యాపారమును దెల్పు "తమి—తల్-అల్; తెల్గు—ట" మున్నగు వానిని భావార్థకము లనఁగాఁ గ్రియా నామవాచక ప్రత్యయములనియుఁ దక్కిన భావ కర్తృ కర్మాద్యర్థకములగు ప్రత్యయములను సామాన్యముగా 'కృత్' ప్రత్యయములనియుఁ జెప్పుట సంస్కృత ద్రావిడ వైయాకరణ సంప్రదాయము. ఆంగ్ల విద్వాంసులగు డా. కాల్డువెల్లుగా రింగ్లీషునందలి "(Infinitive) = ఇన్‌ఫినిటీవు" అనఁబడెడి "to do = (చేయుట)" అను రీతిగల యొక తెగ రూపములను మనసుననిడికొని ద్రావిడ భావార్థక లక్షణమును నిరూపింప సాగిరి. 'to do' అను దానికి 'చేయుట' అను ధాత్వర్థమే కాక 'చేయుట నిమిత్తము' అను తుమర్థము సైతము గలదు. అట్టి యర్థములు గలదె ద్రావిడ భాషలలో 'Infinitive' = ఇన్‌ఫినిటీ వనఁగా భావార్థకము కావలయునని తలంచి ద్రావిడ భాషలలో 'అ' ప్రత్యయము భావార్థకమనియు దానికట్టి యర్థములు గలవనియు సిద్ధాంతీకరించిరి. (చూడు ౧3౭ I మొదలు ౧3౭ VI వఱకు). అట్లగుటచేత ద్రావిడ భాషా ప్రసిద్ధ క్రియా నామవాచక ప్రత్యయములగు 'తల్-ట' మున్నగు వానిని గ్రియార్థ స్ఫూర్తిగల కృదంతములని వ్యవహరింప

వలసిన వారైరి. పైని వివరించిన 'కృత్' సంజ్ఞానిర్వచనము చొప్పున వీనిని గృత్తు లనుటలో విరోధము లేదు గాని యిట్టివే కృత్తులనియు 'ఎండ-చేయి' మున్నగునవి కృదంతములు కావనియు 'తల్-టు' మున్నగునవి భావార్థకములు కావనియుఁ జెప్పుట కేవలము సంప్రదాయ విరుద్ధము. శశవిషాణప్రాయమగు 'అ' ప్రత్యయము భావార్థక మనఁగా ధాత్వర్థక ప్రత్యయ మనుచు నిజమైన భావార్థకముల నట్టివి కావని సంప్రదాయ విరుద్ధముగను బ్రసిద్ధి విరుద్ధముగను వచించుట యుక్తము కాదు. కృచ్ఛబ్దమున కీవఱకంతటను బ్రసిద్ధమైయున్న యర్థమును మార్చుటయుఁ దమిటమున నెంతమాత్రము లేని 'అ' ప్రత్యయము భావార్థక మనఁగా ధాత్వర్థకమని వచించుటయుఁ గేవలము నకృత్యములు. "చెయ్గిఅదు-చెయ్గిన్ద్రదు" మున్నగు వానికి 'చేయుచున్నది' అని యథాశ్రుతార్థము. అట్లగుటచేత వానికి విభక్తివివక్షచే నవి విధేయవిశేషణము లనఁదగును. అవి యాభాసకర్మధారయములు. (చూడు ౯౧ X విమ).

అమహాత్ముఁడుమునందలి మూఁడవయుదాహృతియగు "Infinitive = ఇన్ఫినిటీవు" అను దానిని క్రియాజన్య విశేషణ నామవాచకమనుట సరికాదు. అది విశేషణము కాదు. దాని కాంగ్లమునందలి 'to do=doing' అను నుదాహృతుల యర్థములు గల శబ్దమొక్కటి ద్రావిడభాషలలో లేదు. 'చేయుట' మున్నగు వానికి సుబ్విభక్తి మేళనము సుప్రసిద్ధము. 'to do' అను నాంగ్లపదము నకు సుబ్విభక్తిమేళము లేదు. 'చేయుట' మున్నగు వాని కాంగ్లశబ్దమునకువలెఁ దుమర్థకత్వము లేదు. 'to do' అను దానిని జతుర్థ్యంత మనరాదు. దానికి సరియగునవి ద్రావిడభాషలలోఁ దుమున్నాద్యర్థకము లనఁబడును. దొరగా రుదాహరించిన 'ఇళివుదు' అనునది హళెగన్నడ రూపము. 'ఇటివుదు' అను నది పటగన్నడరూపము. 'ఇటి నిమ్నావతరణే' అని శబ్దమణి దర్పణ ధాతు పాఠము. 'ఇటివుదు' అనుదానిలోని 'వ' కారము భావ్యర్థకము కాదు. 'వుదు' అనునది కన్నడభావ ప్రత్యయము. (చూడు ౧౩౨ VI విమ).

'చెయ్గిఅదఱ్కు' (చెయ్గిఅ+అదఱ్కు) అను నుదాహృతిలోని 'అదఱ్కు' అనుదానిలోని అకారముచ్చారణార్థకము కాదు. "అదు+అన్+కు=అదఱ్కు" అనురీతిని సంధివశమున సహజముగా నచటి తుది మూర్ధన్య తమిట 'న' కారము 'ఱ' కారముగాఁ బరిణమించుచున్నది. (చూడు ౮౨ IV విమ.).

" Appellative verbs " అను శబ్దము నీవఱకు విధేయ విశేషణ (Conjugated nouns.) మను నర్థమున వాడియున్నారు. ఉదా:—"కోన్+ఎన్=(నేను=రాజను) (చూడు ౧౨౭ విమ). ఇచట "Abstract appellative noun" అనునది "ధర్మవాచక కృదంతము" అను నర్థమున వాడఁబడెను. ఉదా:—పొఱు+మై=

(ఓర్మి). తమిళమందలి 'మై' ప్రత్యయము తెల్గునందలి 'తన' ప్రత్యయ సమానార్థకమగు తద్ధిత ప్రత్యయము. ఉదా:—"తణ్మై=(శైత్యము). వెమ్మై=(వేఁడిమి). నన్మై=(మంచితనము) పెరుమై=(పెద్దతనము) వన్మై=(బల్మి=సామర్థ్యము) మెన్మై=(మార్దవము). కటుమై=(కాఠిన్యము) ఇళమై=(లేఁతతనము" (చూడు తొల్కా. ౫౬_౨ సూ). ఇట్టి తద్ధితములు తఱచు. "అన్మై=(కామి) ఉళ్మై=(ఉండుట) పోఱుమై=(ఓర్మి)" ఇట్టి కృత్తు లరుదు. దొరగా రుదాహరించిన "ఇరుక్కిన్ద్రమై=(ఉన్నదానితనము.) ఇరామై=(లేనిదానితనము.)" ఇట్టివి తొల్కాప్పియమునఁ గానరావు. (కుఱళ్ అను గ్రంథములోని 'పొయ్యామై-చెల్లామై'-౯౯౭—౧౧౫౧ పద్యములలోఁ బ్రయుక్తములు. శ్రీ 'విద్వాన్ వే. వేంకట రాజులు రెడ్డిగారు ౮-౧-౧౯౫౪ తేది జాబు). కన్నడమందలి 'మె' అనునది 'వారా'ర్థకము. 'సంఖ్యా యా మె ద్వారే' (కర్ణాటకశబ్దా. ౪౩౩ సూ.) ఉదా:—ఒర్మె=(ఒకసారి). ఇర్మె=రెండు పర్యాయములు. భావార్థకత్వమునఁ దెల్గునందువలెనె యరుదు. ఉదా:—కన్న-బమ్మె=తెల్గు-బల్మి. కన్న-కూర్మె=తెల్గు-కూర్మి. కన్న-నన్మె=తెల్గు=మంచితనము. తెల్గున వ్యతిరేకభావార్థకమగు 'మిజి' తఱచు.

౧౩౮. II విభ:—"II కృదంతములు = (Verbal nouns). ద్రావిడ కృద్రూపములందుఁ గాలవివక్షలేదు. ఇవి క్రియాజన్య విశేషణములనుండి యేర్పడవు. 'చెయ్‌గిఱదు-చెయ్‌గిన్ద్రదు' (౧౩౮ I విభ.) అనువానివంటివి కావు. క్రియనుండియో క్రియాంగమునుండియో యేర్పడును. వీనిచేత నొక వ్యాపారము బోధ్యమగును. వీనియందుఁ దక్కిన కృదంతములందువలె ("Verbal derivatives" చూడు ౧౩౯ I) ధాత్వర్థము మాసిపోదు. తమిళ వైయాకరణులు వీనిని "తొటిల్ పెయర్" అని వ్యవహరింతురు (వ్యాపార బోధక నామములని యర్థము). ఇవి ధాతువులనుండి పుట్టిన ప్రాతిపదికముల వలెఁ (చూడు ౧౩౯ I విభ.) గ్రియార్థస్ఫూర్తిని గోల్పోవు. కొందఱు పాశ్చాత్య పండితులు "నడై=నడప్పు"=(షికారు-షైరు=వినోద సంచారము-వాహ్యాళి) అనురీతిగలవానిని "నడక్కుదల్=నడక్కై=(నడచుట)" మున్నగువాని పట్టికలోఁ జేర్చుట యుక్తము కాదు. 'నడై-నడప్పు' అనువానికిని 'నడక' యని యర్థము చెప్పవచ్చును గాని యవి నామవాచకమాత్రములు. వానియందలి విశేషమును జెప్పవలసినపు డట్టి విశేషణములు నిల్చును. 'నడక్కుదల్' మున్నగువానికన్ననో క్రియలకువలెఁ గ్రియావిశేషణములు నిల్చును. ఉదా:—నీది (య్) ఆయ్ నడక్కుదల్=(నీతిగా నడచుట). "నడై-నడప్పు" అనువాని

విషయమున ‘నీదియాన’=(నీతియైన) మున్నగు విశేషణములనే నిల్పవలయును” (కాల్డు. ౨౮౨, ౨౮౩ పుటలు).

“తమిళమున “గై—క్కై” అనునవి తుదినిగల కృద్రూపములు గలవు. ఉదా:—ఇరుక్కై=(ఉనికి). సెయ్గై=(చేఁత). వీని నిట్లు కృద్రూపములుఁగా వాడినను (అప్పడి ఇరుక్కై (య్) ఆల్=అట్టి యునికిచేత) వీనికన్నఁ దఱచుగా ‘అల్’ ప్రత్యయాంతములగు కృదంతములె వాడఁబడును. అట్టి ‘అల్’ ప్రత్యయాంతములనె నిజమైన కృద్రూపము లనఁదగును. ఉదా:—సెయ్ (య్) అల్ = సెయ్దల్ = (చేయుట). నడక్కల్=నడక్కుదల్=(నడచుట). ఇట్టి “దల్=అల్” అను ప్రత్యయములు కేవల ధాతువుపైని నిల్వక క్రియాంగము పైని నిల్చును. అనఁగా భావార్థకరూపములకును భావ్యర్థకరూపములకును నెయ్యది క్రియాంగమగునో యదియే దీనికిని క్రియాంగ మగును. ‘నడక్కల్= నడక్కుదల్’ (నడుచుట) అనవలెనే కాని “నడల్”=అనరాదు. కాని కొన్ని యెడల నీ “దల్=అల్” అనునవి కేవల ధాతువుపైని సయితము నిల్చును. ఉదా:—“ఆగల్ = ఆగుదల్ =(అగుట).” అని యుండుటే కాక “ఆదల్” (అగుట) అనియు నుండును. ఇట్లె “పోగల్=పోగుదల్” (పోవుట) అని యుండుటే కాక ‘పోదల్’ అనియు నుండును. పరిశీలింపఁగా నిట్టియెడల వాని లోని ‘గ’ కారము కాలక్రమమున లోపించిన దనఁదగును. ‘దల్’ అను దానిలోని ‘ద’ కారము చరిత్రమందును బ్రయోగరీతియందును ‘గై=క్కై’ అను వానిలోని ‘గ’ కారముయొక్క పోలిక గల్గియున్నది. కావుననె యట్టి ‘దల్’ ప్రత్యయపు ‘ద’ కారము సకర్మకత్వమందును శ్రుతి సౌకర్యము వలయునపుడును ‘త’ కారమై ద్విరుక్తమందును. ఉదా:—కుఱైదల్=(తగ్గుట-అకర్మకము) కుఱైత్తల్=(తగ్గించుట. సకర్మకము). (చూడు ౬౦ II-III విష). ఈ దకారము భూతార్థద్యోతక ప్రత్యయ సంబంధికాదు. ‘గై-క్కై’ అనువానివలెనె ‘అల్=దల్’ అనునవియుఁ గాలబోధ విషయమున నుదాసీనములై యుండును. వీనికి సమానార్థకములగు తెల్గు ప్రత్యయములు “ట=డమ్+ఉ” అనునవి. ‘అల్’ ప్రత్యయము తుదినిగల కృదంతములకును ధాతుజములగు నితర నామవాచకములకును గల భేదమే ‘అల్’ అనునది భావార్థకమగు ‘అ’ ప్రత్యయపు గౌణరూపమని విశదీకరించుచున్నది.

మంగోలియన్ భాషయందు ‘ల’ కారము లేక ‘అల్’ అనునది కృద్రూప సాధనోపయోగిగ వాడఁబడుచుండుట పరిశీలింపఁదగినది. ఉదా:—‘చిదల్’=

(సామర్థ్యము) అనునది “చిదవాు”=(సమర్థుఁడగుట) అనుదానినుండి యేర్పడి నది” (కాల్డు. ౫౮౩ పుట).

విమర్శము:—శశవిషాణప్రాయమగు భావార్థకపు ‘అ’ ప్రత్యయము యొక్క కల్పనము చేత (చూడు ౧౩౭ I విష.) నిజమైన భావార్థకము లనఁగా ధాత్వర్థకములగు “తమి-తల్ = అల్-తెల్గు - ట=అడము” మున్నగువానిని గ్రియానామవాచకము లనక దొరగారు క్రియార్థస్ఫూర్తిగల కృదంతము లని పేరు పెట్టుకొనవలసినవారైరి. మఱియు ౧౩౯ విషయమునఁ జెప్పఁబడెడి ప్రత్యయములు కృదంతములలోఁ జేరనేరవనియు నవి ధాతువులనుండి పుట్టిన ప్రాతిపదిక విశేషములనియు నీ ౧౩౮ II విషయమున వివరింపఁబడిన “తల్= అల్-ట=అడము” మున్నగునవి మాత్రమె కృదంతములనియు నిట్లు సంప్ర దాయ విరుద్ధములగు ప్రసంగములు చేయవలసినవారైరి. “నడక్కల్=నడక్కు దల్” (నడచుట) అనువానివలెనె “నడై=నడప్పు” అనునవియును గృదంత ములె యనుట శాస్త్రసిద్ధము కాదా? “ధాతువునకు” విహితంబయిన “డుఙ్” భిన్నప్రత్యయము “కృ”త్తనుటలో విప్రతిపత్తి యేమున్నది? “కృ దతిఙ్” అని కదా కృత్సంజ్ఞకు లక్షణము. (చూడు ౧౩౮ I విషయపు విమర్శము) అట్టి కృత్సంజ్ఞనే వాడుచు విపరీత లక్షణము చేయుట యుక్తమా? ధాత్వర్థీభూత వ్యాపారార్థస్ఫూర్తిగల కృదంతములకుఁ గ్రియలకువలెనె క్రియావిశేషణములతో నన్వయము గల్గును. వ్యాపారార్థము మాసిపోయిన కృదంతములకు “ఎండ - చేయి” మున్నగువానికిఁ గ్రియార్థస్ఫూర్తి లేమింజేసి వానితోఁ గ్రియావిశేషణ ముల కన్వయము లేకపోవచ్చును. అంతమాత్రమున నవి కృదంతములు కావన నగునా?

డా. కాల్డువెల్లుగారంతటను ‘దల్’ అని సరళాదిగనె వ్యవహరించు చున్నారు. అది మొదట ‘దల్’ కాదు. ‘తల్’ ప్రత్యయము. కన్నడమందలి ‘త’ మున్నగునవియుఁ దెలుఁగునందలి “తజ్-త-ట” మున్నగునవియు దాని పరిణామములగుటయె పై విషయమును నిరూపించుచున్నది. ప్రాచీనతమ మగు వాఙ్మయముగల తమిళమున సరళోచ్చారణమే లేదని ప్రాచీనతమమగు తొల్కాప్పియమువలన విశదమగుచున్నది. తొల్కాప్పియమునాఁటికి సరళో చ్చారణమే లేమింజేసి తమిళ వర్ణసమామ్నాయమున సరళవర్ణములు పేర్కొనఁ బడలేదు. (చూడు ౧౭ XXIII, XXIV విష.) ‘దల్’ అని సరళమె మొదట నుండుటేమి? అది ద్విరుక్తినందునపుడు పరుషమగు ‘త’ కారముగా మాఱుటేమి? సరళోచ్చారణ మర్వాచీనమనియు నొక్కి-వక్కాణబడు ద్విరుక్తిలో నట్టి సరళోచ్చా రణము రానేరదయ్యెననియు గ్రహించుట విశ్వసనీయము కాదా?

తమిళు భావ్యర్థకములు తాము సృజించిన 'అ' ప్రత్యయరూప భావార్థక ములనుండి యేర్పడినవను సిద్ధాంతము గలవారగుటచేత దొరగా రిచట సైతము తమిళు భావ్యర్థకములకును 'తల్-అల్' అను కృదంతములకును, క్రియాంగ ముక్కలే యని విశదపఱిచిరి. ఇట్టి దొరగారి సిద్ధాంత మీమాంసకుఁ బలు సారులు సవిమర్శముగ నిరసింపఁబడెను. (చూడు ౧౩౨ I, II విమ.) 'కు' అను ప్రాచీన భావ్యర్థక ద్రావిడ ప్రత్యయము కాలక్రమమున ధాత్వవయవముగ నేర్పడుటచేతఁ గొన్ని క్రియారూపములం దట్టి 'క' కారము చూపట్టుచున్నదని గ్రహింపవలెను.

అకర్మకధాతువులతుది వర్ణము సకర్మకత్వమున ద్విరుక్తినందును డా. కాల్డు వెల్లుగారి సిద్ధాంతము సైతము సరికాదనియు నచటఁ బ్రేరణప్రత్యయ 'తు' వర్ణముచేత నట్టి ద్విత్వము సంధివశమునఁ గల్గుచున్నదనియు నీవఱకు సవిమర్శ ముగ విశదీకరింపఁబడియున్నది. ఉదా:—కుఱై+తు+తల్=కుఱైత్తల్= (తగ్గించుట). (చూడు ౬౦ II, III విమ.) (౧౨౧ II విమ.)

౧౩౯. I విమ:—"ధాతుజ విశేష్యములు=(Verbal derivative nouns):- ఇట ధాతుజ రూపసాధనోపయోగి ప్రత్యయ విషయకపరిశీలన మనావశ్యక మనఁ దగును. ధాతుజములగు ప్రాతిపదికముల విషయమునను నట్లె యనఁదగును. వీనియందలి రూపసాధనోపయోగి ప్రత్యయములు కేవల శ్రుతిసుఖార్థము చేరినవె. తమిళమున నివి యత్యధికముగ నుండుటచేత నయితము వీని పరిశీలన మనావశ్యకమని తోఁచును. (అశక్యమనుట లెస్స.) కావున నిట్టి నామవాచ కము లేర్పడుటలోని కొన్ని స్వాభావికములగు మార్గములను జూపుటమాత్రమె యావశ్యకము" (కాల్డు. ౫౭౭ పుట).

"I - మొదటితెగ ధాతుజ నామవాచకములు క్రియాంగమునే పోలి యుండును. ఉదా:—తమి. కట్ట్+ఉ=కట్టు=(బంధము-ముడి). ఇది 'కట్టు' (ముడివేయు) ధాతువుతో సరిపోల్చి చూడఁదగును. (ధాతురూపమువలెనె ప్రాతిపదిక ముండునని తాత్పర్యము)" (కాల్డు. ౫౭౭ పుట).

"II - కొన్ని ధాతువులతుది సరళములు పరుషములై ద్విరుక్తము లగుట చేత నామవాచకములగును. ఉదా:—తమి. పాడ్+ఉ=పాట్టు=('పాడు+తు=పాట్టు' శ్రీ రెడ్డిగారు) (పాట) తమి. ధాతు-ఎఴుద్+ఉ=(వ్రాయు)- ఎఴుత్త్+ఉ=(అక్షరము). ఈ పద్ధతి తమిళమున ముఖ్యమై యున్నది. తెల్గు. ధాతు - పాడ్+ఉ - విశేష్య - పాట. ఇందుఁ దుదివర్ణమునకు ద్విత్వములేదు. ధాతువు తుది 'ఉ' కారము స్పష్టార్థమై 'అ' కారముగ మాఱుటమాత్రమె

విశేషము. తమి. ధాతు - ఆడ్ + ఉ=నామ వా - ఆట్ట్ + ఉ=(క్రీడ=ఆట). తెల్గు. 'ఆట్ + అ' అనియే యేర్పడును. తమిటమున ద్విత్వము కల్గునపుడు సరళము పరుషముగా మాఱును. ద్విత్వము గల్గనియపుడు సరళమె నిల్చుట సంప్రదాయము" (కాల్డు. ౫౪౪ పుట).

"ధాతువు తుది వ్యంజనము ద్విరుక్తమగు స్థలములు:— ౧. ప్రాతి పదికములు విశేష్యములకు విశేషణములగుట. ౨. అకర్మకములు సకర్మకము లగుట. ౩. భావార్థకరూప విశేష మేర్పడుట. ౪. ధాతుజ విశేష్యము లేర్పడుట" (కాల్డు. ౫౪౪ పుట).

"III - ఏకాచ్క ధాతువుల స్వరమును దీర్ఘము చేయుటచేత ధాతుజ విశేష్య మేర్పడును. ఉదా:—తమి. పడ్ + ఉ=(అనుభవించు=పొందు)-పాడ్ + ఉ=(అనుభవము). తమి. ధా-మిన్=(ప్రకాశించు). నామ-మీన్=(నక్షత్రము). ఈ సంప్రదాయము గ్రాంథిక భాషయందే కాక యంతటను గలదు. ఉదా:—తమి. ధా-నక్కు + ఉ=(నాకు) - విశేష్య - నాక్కు + ఉ=(నాలుక). తెలుఁగు కన్నడములలో నిట్లు దీర్ఘము వచ్చునపుడు తుది హల్లు పారుష్యము నందును. ఉదా:— తెల్గు. ధా-పడ్ + ఉ=విశేష్య-పాట్ + ఉ=(పాటు=పడుట). (చూడు ధాతుప్రకరణము)" (కాల్డు. ౫౪౪, ౫౪౫ పుటలు).

"IV - క్రియాంగమునకు 'మై' ప్రత్యయమును జేర్చుటచేత గుణనామ వాచక మేర్పడును. ఉదా:—తమి. పోఱు + మై=(ఓర్పు). (పోఱు-ధాతు-పోఱు=ఓర్చు=మోయు). ఈ ప్రత్యయమునె గుణనామ వాచకములకును సంబంధార్థక ధాతుజ విశేషణములకును సర్వనామములకును జేర్చుటచేత వాని భావార్థకరూపము (ధర్మవాచక తద్ధితరూపములు) లేర్పడును. ఉదా:—తమి. పెరుమై=(పెద్దతనము). తన్మై=(స్వభావము). ('తన్'=(తాను) అను సర్వనామ శబ్దమునుండి యేర్పడినది). ఈ 'మై' ప్రత్యయము తెల్గున 'మి' ప్రత్యయముగా మాఱును. ఉదా:— తెల్గు. ధా-కలుగు + మి=కలిమి=(సంపద)" (కాల్డు. ౫౪౫ పుట).

V. "తమిటమందలి క్రియలకు 'అమ్' ప్రత్యయము చేర్చుటచేత ధాతుజ విశేష్యము లేర్పడును. అట్టియెడలఁ దుదిహల్లునకు ద్విత్వపారుష్యములు గల్గును. ఉదా:—ఙ్గ్=గ్=క్=క్కు:—తమి—తూఙ్గ్ + ఉ=(నిద్రించు)—తూక్కు + అమ్=(నిద్ర). న్ద్=ద్=త్=త్త్:—తమి—తిరున్ద్ + ఉ = (చక్కఁబడు)—విశేష్య:—తిరుత్త్ + అమ్ = (దిద్దుపాటు). ణ్డ్ = డ్ = ట్ = ట్ట్—తమి—తోణ్డ్ + ఉ=(త్రవ్వు) తోట్ట్ + అమ్=(తోఁట). మ్బ్=బ్=ప్=ప్ప్—తమి—విరుమ్బ్ + ఉ=(కోరు)—విరుప్ప్ + అమ్=(కోరిక).

తెలుఁగున ననేకస్థలములలోను, గన్నడమున నెల్లయెడలను మకారము లోపించును. ఉదా:—తమి—తూక్కమ్=తెల్గు—తూఁగు.

తమిఌ శబ్దముల తుది హల్లు గదబలలో నేదేని యగునపుడు తమిఌ మలయాళములలో 'అమ్' ప్రత్యయము చేరుటకు ముందుగఁ దుదిహల్లు ద్విత్వపారుష్యముల నందును. ఇతర హల్లులు తుది నుండునపుడు 'అమ్' ప్రత్యయమాత్రమే చేరును. ఉదా:—తమి—ధా-ఉయర్ = (ఎత్తుగ నుండు) విశేష్య-ఉయర్ + అమ్ = (ఎత్తు). ఆల్ =(లోఁతుగ నుండు)-ఆల్ + అమ్ = (లోఁతు). ఎడ్కిన్సు దొరగా రీ మకారమునకును హెబ్రు భాషలోని క్రియాజన్య విశేషణ నామవాచకములను గ్రియలనుండి యేర్పఱచుటకుఁ జేర్చునట్టి 'మ' కారమునకును సంబంధమును గల్పించిరి. ఉదా:—షాప్‌హాత్ = (తీర్పు చేయు). మిష్‌పత్ =(తీర్పు). (చూడు సుబ్విభక్తులు ద్వితీయావిభక్తి)" (కాల్డు. ౨౮౨ పుట).

VI. "ద్రావిడభాషలన్నిటియందును బెక్కు ధాతుజ రూపములు వేర్వేఱు స్వరములతో నున్న 'గ-ద-బ' లను వేర్వేఱు పరిణామములతోఁ గ్రియాంగములకుఁ జేర్చుటచేత నేర్పడును.

VI. ౧-గ్-తమిఌమున రూపసాధనోపయోగి 'గ' కారము 'గయ్' (ei) అని యేర్పడును. ఉదా:—సెయ్‌గయ్ (గై)=(పని=కృత్యము=చేఁత). దీనిని సానునాసికము చేసినచో 'జ్గై' అని యేర్పడును. తమి-ధా-కాయ్=(కాల్చు)— కా + జ్ + గై = కాజ్గై = (వేఁడిమి). ఒకానొకప్పుడిది ద్విత్వపారుష్యముల నొందును. ఉదా:—పడ్ + ఉ =(పరుండు)-పడుక్కై =(పడుక). వీనికి సమానార్థకములగు కన్నడరూప సాధనోపయోగి ప్రత్యయములు 'కె-గె' అనునవి. వీనికిఁ బూర్వమునఁ దఱచుగా 'ఇ' అనునది శ్రుతి సుఖార్థముగఁ జేరును. తెలుఁగున 'క-కి' అనునవి నిల్చును. ఉదా:—ఏలిక =(ప్రభువు-ఏలు-ధా.) ఉనికి=(స్థితి-ఉండు-ధా.)" (కాల్డు. ౨౮౨ పుట).

VI. "౨. ద్. రూపసాధనోపయోగి 'ద' కారము తమిఌమున 'ది' అను రూపముతో నిల్చును. ఉదా:—కెడు=(చెడఁగొట్టు). కెడు + ది = (నాశనము). ఇది పారుష్య ద్విత్వముల నందునపుడు 'త్తి' అని యగును. ఉదా:—తమి-ధా-ఉణర్ =(పొందు) ఉణర్త్తి =(అనుభవము లేక తెలివి). ఈ "త్తి" అనునది 'చి' అనియు నగును. ఉదా:—తమి-ధా-పుగల్ =(పొగడు)- నామవా-పుగల్చి=('పుగల్‌త్తి' అనుదానికి బదులు) (పొగడ్త). మలయా- పుగల్చి=(పొగడ్త). ఆంధ్ర కన్నడములం దీ ప్రత్యయము 'ద' కార రూప

మునఁ గాక 'త' కార రూపముతో నుండును. ఇది కన్నడమున 'త-తె' అను రూపములతో నుండును. ఉదా:—కన్న-ధా-హొగళ్ = (తమి-పుగళ్). కన్న-నామ-హొగళ్తె = (పొగడ్త). కన్న-ధా-కాయ్ = (పండు). నామవా-కాయ్ + త = (కాపు). తెలుఁగున నిది "త-ట-తి-టి" అను రూపములతో నుండును. ఉదా:—ధా-అలయ్ + ఉ = (అలసు) అలసత. తెల్గు-ధా-'తిన్'. నామ-తిణ్డి + ఇ = (భోజనము). తె-ధా:—మూ + య్ + ఉ = మూయు—నామ-మూఁత = (కప్పు) తె-ధా:—నడు + చు—నామ-నడితి = (నడత)" (కాల్డు. ౫౮౫, ౫౮౬ పుటలు).

VI. "3. బ్. తమిళమున రూపసాధనోపయోగి 'బ'కారము సాధారణముగా 'వ'కారరూప సారళ్యమును జెంది 'వి-వు' అను రూపములతో నిల్చును. ఉదా:—తమి-ధా:—కేళ్ = (విను). నామవా—కేళ్వి = (వినికి). తమి-ధా—మఱై = (దాఁచు) నామవా-మఱైవు = (దాపటికము). కొన్నియెడల నీ 'బ'కారము 'మ్బ-మ్బు' అను రూపముల నందును. ఉదా:—తమి. ధా-వే + య్-(నీడగా నుండు) నామవా-వేమ్బు = (వేఁపచెట్టు). ధా:-పా + య్ = (ఎగురు = త్రుళ్ళు). నామవా — పామ్బు = (పాము). (చూడు-౬౦-XIV విష). స్వరమునకు ముందటి 'బ'కారమునకు సహజమగు నుచ్చారణము నిల్వ నేరదు. ఒంటరిగా నుండునపుడా 'బ'కారము 'వ'కారముగనో, 'మ్బ'కారముగనో మాఱిపోవును. ఎల్ల ద్రావిడభాషలందును దఱచుగా వచ్చు రూప సాధనోపయోగి 'వు' ప్రత్యయము చాలవఱకు 'బు' అనుదాని సరళరూపమయియే యుండును. ఏలయనఁగా 'బ'కారము ద్విత్వమందునపుడు 'ప్ప'కారమగును. ఉదా:—నడప్పు = (నడక). ఇరుప్పు = (ఉనికి). మూప్పు = (ముదిమి). తెల్గునఁ బై ప్రత్యయములకు మాఱుగ 'వు-వి-పు' అనునవి నిల్చును. ఉదా:—చా + వు = (మృతి). (తమిళ కన్నడరూపము 'సావు'). తెలుఁగు-ధా-దిగ్ + ఉ = నామవా-దిగువు = (క్రిందిభాగము). ధా-తెలియు-నామవా-తెలివి. ధా-చేర్ + ఉ = నామవా-చేరువు = (సమీపము). ధా-ఏడుచు-నామవా-ఏడుపు = (రోదనము). తమిళ-అఱప్పు = అఱుగై = (రోదనము). ఇట్టియెడలఁ గన్నడమున 'వు' అనునది నిల్చును. తమి. ఇరుప్పు = కన్నడ-ఇర + వు = (ఉనికి). కన్నడమున నిట్టియెడల 'పు' అనునది నిల్చును. ఉదా:—బిడువు = బిడుపు = (విడుచు స్థలము = బీడుభూమి)" (కాల్డు. ౫౮౬ పుట).

"VII తమిళ మలయాళములందుఁ గొన్ని ధాతుజనామ వాచకములు (Verbal derivative nouns) తొలుత స్వతంత్రనామవాచకము లయియుండి యిపుడు ప్రత్యయములవలె వాడఁబడుచున్న కొన్ని శబ్ద భాగములను జేర్చుటవలన

నేర్పడుచున్నవి. ఇట్టి జంటలో రెండవ శబ్దముయొక్క యర్థము చాలవఱకు లుప్తమగుటచేత నది యొక సమానపదముగ నెన్నఁబడుచున్నది. తమిఱమున 'కన్ను' అను నర్థముగల 'కణ్' (దీనికి 'చోటు' అను నర్థము సైతము గలదు. ఇది సప్తమీ విభక్తిగ సైతము వాడఁబడుచున్నది) అనుదానిని జేర్చుటచే నొక సమానపద మేర్పడుచున్నది. ఉదా:—ఇడ్ + ఉ=(ఒత్తు. ధా)+క్ + కణ్ = (ఒత్తిడి=అణఁచుట). ఉఱు=(బాధపడు)-ఉఱుకణ్ =(బీదఱికము). ఇట్టి శబ్దములు కేవలము గ్రాంథికములు. వ్యావహారిక భాషయందును నిట్టి శబ్దములు గలవు. ఉదా:—పడ్ + ఉ=(అనుభవించు) నామవా-పాడు=(పాటు) మాన్ + ఉ=(పోలు) నామవా-మానమ్=(చాలవఱకు 'పోలిక' అని యర్థము). ఈ రెండు శబ్దములును నెట్టి స్వతంత్రార్థమును లేక కేవల రూప సాధనోపయోగి ప్రత్యయములుగ వాడఁబడుచున్నవి. ఉదా:—తమి-కట్టు=(బంధించు. ధా)+ప్ + పాడు = (కట్టుపాటు). చే(సే)ర్ = (కలియు-ధా)+మానమ్ = (కూడిక — చేరిక). కట్టు = (ఇల్లుకట్టు — ధా.) + మానమ్ = (కట్టడము=Building). ఇట్లె 'అగమ్'=(ఇల్లు-చోటు) అను శబ్దము తుదినిగల జంటలును గలవు. 'వాన్=(ఆకాశము)+అగమ్'=(లేదా)-'వాన్+అమ్'-వై + అగమ్=వైయగమ్=(ఇల్లు-చోటు) (వై =భూమి). వీనిలోని 'గ'కార ముచ్చారణార్థము చేరినదని నా సందేహము. వాడుకలో నిట్టి స్థితిగలదు. ఉదా:—అన్రాడమ్=(ప్రతిదినము)=అన్రాడగమ్. 'లంచము' అను తెలుఁగు నుండి వచ్చిన 'లఞ్జమ్' అనునది 'లఞ్జగమ్' అనియు వాడఁబడుచున్నది. ఈ 'అగమ్' అనుదాని నాధారముగాఁ గొని డా. గుండర్టుగారు 'నారగమ్'=(నారింజ) అను మలయాళ పదమును సాధించిరి. తమిఱ మలయాళములలో 'నాఱ్ + ఉ'=(సువాసన గల్గియుండు) అను ధాతువు గలదు. దీని సంస్కృత శబ్దము 'నారఙ్గ' అనునది" (కాల్డు. ౫౪౬, ౫౪౭ పుటలు).

విమర్శము:—V. విషయమున 'అమ్' ప్రత్యయ మకార లోపము గల రూపముల నుదాహరించుటలోఁ దెల్గున 'తూఁగు' శబ్దమును మాత్ర ముదాహరించిరి. ఇది 'అమ్' ప్రత్యయ 'మ' కార లోపముగల రూపముకాదు. కన్నడమున నెల్లయెడలను దుది మకారము లోపించునని వచించిరే కాని దొరగా రొక్క యుదాహృతినే నియ్యలేదు. 'కన్న-తోట-తెల్గు-తోఁట' మున్నగు వాని నుదాహరించిన బాగుగ నుండును.

VI. విషయమున "చెయ్గై =(పని) పడుక్కై=(పడుక) కాఞ్జై= (వేఁడిమి)" మున్నగు వానికి సమానార్థకములగునవి కన్నడమున 'కె-గె' అను

నవి యని దొరగారు చెప్పిరే కాని యట్టి యుదాహృతుల నియ్యలేదు. 'కాణ్కె' మున్నగు వానిని జూపిన బాగుగనుండును. కన్ను-కాణ్కె=(కానుక-దృష్టి).

"న ల ర ణ ఉభ్యః" (కర్ణాటకశబ్దా. ౨౨౭ సూ.) (వృత్తి) నకార లకార రేఫ ణకారాన్తేభ్యః 'ఉ' శబ్దాన్తేభ్యశ్చ ధాతుభ్యో భావేఽర్థే 'కెత్' ప్రత్యయో భవతి. ప్రయోగః-కాణ్కె=(కానుక-దృష్టి).

తెల్గు 'త' ప్రత్యయాంతముల నుదాహరించుటలో 'అలయు=అలసు' అను ధాతువునుండి 'అలసత' అనునది యేర్పడెనని దొరగారు వ్రాయుట పొర పాటు. 'అలసత' అనునది 'అలసతా' అను సంస్కృత శబ్దపు తత్సమ రూపము. దానికి సరియగు నచ్చాంధ్రపదము 'అలఁత' అనునది. (చూడు 'శ-ర' కోశము). 'తి-టి' ప్రత్యయాంత ధాతుజ నామవాచకములు తెలుఁగునఁ గలవనుచు 'నడితి'=(నడత) అను నవశబ్దము నుదాహరించిరి. 'నడితి' శబ్దము తెల్గున నే కోశమునను లేదు. 'టి' ప్రత్యయాంతము గలదని వచించిరే కాని దొరగా రుదాహరింపలేదు.

౧౩౯. II విమ:—"ఈ క్రింద నుదాహరింపఁబడు పట్టికయందు రూప సాధనోపయోగి ప్రత్యయ మేళనమువలన నేర్పడిన తమిళ ధాతుజ విశేష్యము లెల్ల నుదాహరింపఁబడినవని నా నమ్మకము. ఈ పట్టికయందు ధాతుజములగు ప్రాతిపదికములనుండి యేర్పడిన నామవాచకములె యుదాహరింపఁబడును. వ్యాపార బోధములేని ధాతువులనుండి పుట్టిన నామవాచకములను జూపుట కిందుఁ బ్రాధాన్య మొసంగితిని. ప్రాచీన నామవాచకములకు రూప సాధనోపయోగి ప్రత్యయ మేళనమున నేర్పడెడి నామవాచకముల ప్రదర్శనమున కిందధిక ప్రాధాన్య మీయఁబడెను.

వ్యాపార బోధక క్రియనుండి పుట్టిన నామవాచకములను, ధర్మవాచక క్రియా నామవాచకములను, (Appellatives) కృదంతరూపములగు నామ వాచకములను, 'త్ర' ర్థక నామవాచకములను, గ్రియా నామవాచకములను నీ పట్టికయందుఁ జూపఁ దలంపలేదు. I. వ్యాపారార్థకధాతు రూపమే నామ వాచకమగునట్టి వానిని, II. ధాతువు తుదిహల్లును ద్విరుక్తము చేయుటవలన నేర్పడెడి నామవాచకములను, III. ధాతువునందలి హ్రస్వాచ్చును దీర్ఘము చేయుట వలన నేర్పడెడి నామవాచకములను, నీ పట్టికయందుఁ జూపఁ దలంప లేదు" (కాల్డు. ౨౮౭ పుట).

౧౩౯. II విష:—రూప సాధనోపయోగి ప్రత్యయ మేళనమున నేర్పడిన తమిఴ ధాతుజ నామవాచకములు:—(Derivative nouns).

| రూప సాధనోపయోగి ప్రత్యయములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కానట్టి ధాతువులు తఱచు. | విమర్శము |
|---|---|---|---|
| అ | మగ్ + అ = (బిడ్డ) | మగ్-దీని బహు-మక్కళ్ | ——— |
| „ | చె (సె) య్ + య్ + అ = (చేయుట). భావార్థకము. ఒకప్పుడు ప్రాచీన కృదంతముగా (Verbal noun) నుండి యుండవచ్చును. Type of infinitive). | చెయ్ (సెయ్)-(చేయు) | ఇట్టి నామవాచకము తమిఴమున లేదనియు దొరగారి వ్రాఁత సరికాదనియు నీవఱకు విమర్శింపఁబడెను. (చూడుఁ ౧౩౮ I, II, III విషయములు). |
| ఆ | సుఱ్ + ఆ = (చోఱు అనఁబడు మత్స్య విశేషము). | సుఱ్ + ఉ = 'త్వర' అని యర్థము కావచ్చును | తమిఴమున 'స' కారమే లేదు. 'చుఱ్' అనఁదగును. సకారోచ్చారణ మర్వాచీనము. |
| „ | విఴ్ + ఆ = (పండుగ నుత్సవము) | విఴ్ + ఇ = (మేల్కొని యుండు) | ——— |
| ఇ | కర్ + ఇ = (బొగ్గు) | కర్ + ఉ = (నలుపు) | |
| „ | సేర్ (చేర్) + ఇ = (గ్రామము) | సేర్ = (చేరు, కలియు) | తమిఴమం దిట్టి 'స' కారోచ్చారణ మర్వాచీనము. |
| ఐ | పిఱ్ + ఐ = (వృద్ధిక్షయములనందు చంద్రుఁడు) | పిఱ్ = (పిదప - ఇతరము). పిఱ్ = (పుట్టు) | 'ఐ' అనుదానిని గాల్డువెల్లుగారు 'ei = ఎయ్' అని పల్కవలెనందురు. |
| „ | తొల్ + ల్ + ఐ = (ఇక్కట్టు) | తొల్ = (ముదుసలి—ప్రాచీనము) | |
| గు | నన్ + గు = (మంచితనము) | నల్ = (నన్) = (మంచి) | |
| „ | పిఱ + గు = (పిదప) | పిఱ్ + అ = (పిన్) (పిదప) | { ఱ కారానునాసికము మూర్ధన్య న కారము. |
| ఙ్గు | కిఴ + ఙ్గు = (వృక్షమూలము-వేఱు) | కిఴ్ + అ = (కీఴ్ = క్రింద) | ('ఙ్కు' ప్రత్యయ మనవలెను. చూడుఁ ౧౮ XXIII విష.) |
| „ | తీ + ఙ్గు = (చెడుగు) | తీ = (చెడ్డ) | |
| క్కు | కిఱు + క్కు = (పిచ్చకోరిక) | కిఱు + కిఱు = (తల దిమ్ముపట్టు) | |
| „ | కొడు + క్కు = (కాటు-కుట్టుట) | కొడ్ + ఉ = ('కుటిలమగు' అని చెప్పవచ్చును) | |

| రూప సాధనోప యోగి ప్రత్యయములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కానట్టి ధాతువులు తెఱచు. | విమర్శము |
|---|---|---|---|
| గై | పణ్డి + గై =(పండుగు) | పణ్డు =తమి - ప్రాచీనమగు. తెల్గు-పక్వమగు. (మూలధాతు. పట్ + ఉ= ప్రాచీనము-ముదుసలి) | కాల్డు-తెల్గున 'పణ్డు' అని వ్రాయుట సరికాదు. 'పండు' అనవలెను. తెల్గున వర్గపంచమాదేశము లేదు. |
| ,, | తిరి + గై =(మిల్లు-తిరుగలి) | తిరి=(తిరుగు). | కాల్డు. 'ఐ' అని దానిని 'ei=ఎయ్' అని వ్రాయుదురు. (చూడు ౧౦ II విష). 'జై' అనవలెను. (చూడు ౧౭ XXIII విష). |
| జై | కా + జై=(వేడిమి) | కాయ్ =(దగ్ధమగు) | |
| కై | పరు + కై = (చిన్నజాయి, బియ్యపుగింజె) | పర్ + ఉ = (పెద్దదగు) (పెర్ + ఉ). | |
| ,, | వాల్ + కై = (అనుకూల్యము) (ఇల్ + వాల్ + కై)=(గృహజీవనము) (ఇల్ =ఇల్లు). | వాల్ =(వృద్ధినొందు) | |
| సి (చి) | పా + సి=(నాచు) | పా + వు=(వ్యాపించు అలముకొను) | ప్రాచీన తమిళమున సకారము లేదు. (౧౭ XXII విష. చూడు). (చూ. ౧౭ XXIII విష.) |
| ఙ్జి | కొలుఙ్జి=(పొద) | కొల్ + ఉ=(కోమలమగు) కొలు+న్దు=(లేఁగొమ్మ) | |
| చ్చి | ఇరై + చ్చి (మాంసము) | ఇరై =(ప్రవహించు-వెలువడు) | తెల్గు-ఎఱచి=(మాంసము). |
| సు | తరి + సు=(బీడు భూమి) | తరి=(నిరుపయోగముగనుండిపోవు. ("ఈ యర్థము లేదు" శ్రీ రెడ్డిగారు) | తరిచు-ప్రాచీన తమిళము. (చూడు ౧౭ XXII విష). |
| చ్చు | అమై + చ్చు=(మంత్రిపదవి) | అమై = (తీర్పుచేయు-నిర్ణయించు) | 'అమాత్య'=(మంత్రి) సంస్కృతము. |
| (కాల్డు. ౫౪౦ పుట) | | | |
| సై | పొలి + సై=(వడ్డి) | పొలి=(వృద్ధినందు) | పొలిచై. సకారమర్వాచీన తమిళోచ్చారణము. (చూడు ౧౭ XXII విష. 'ఐ - ei' కాల్డు. ౧౦ II విష చూడు). |
| డి | పద + డి=(ఊఁక పొట్టు) | పదర్ =(ఊఁక పొట్టు) | (టి-చూడు ౧౭ XXII విష.) |

| రూప సాధనోపయోగి ప్రత్యయములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కాని ధాతువులు (తెలుగు) | విమర్శము |
|---|---|---|---|
| ణ్డి | కఱు + ణ్డి=(గరిటె) | కఱు + ణ్టై=(గరిటె) | (ప్రా. తమి. కఱణ్టి (చూడు ౧౭ XXIII విష.) సంస్కృ. కరణ్డ. |
| డు | కుఱు+డు=(గోరుగొండి) | కుఱు + ణ్డు = (వంకరగానుండు) ('కుఱ్ + ఉ'=(కుఱుచ) అను దానినుండి వచ్చినది) | {కుఱటు-ప్రాచీ. తమి. (చూడు ౧౭ XXII వి.) |
| ,, | కురు+డు=(గ్రుడ్డితనము) | కుర్ + ఉ = (కోమలమగు) | కురుటు (ప్రా. తమి.) (౧౭ XXII విష. చూ.) దృష్టిబలము చాలదని భావము. |
| ది | ఉఱు + ది=(బలము) | ఉఱ్ + ఉ=(బలముగల్గు) | ఉఱుతి-(ప్రా. తమి.) (చూ. ౧౭ XXII విష ) |
| న్ది | ఓన్ది=(బల్లి-తొండ) | ఓది=(బల్లి) | ఓన్తి=ఓతి (ప్రా. తమి.) (చూడు ౧౭ XXII, ౧౭ XXIII విష.) |
| త్తి | పరు + త్తి=(ప్రత్తి) | పర్ + ఉ=(విరివియగు) | తెల్గు-ప్రత్తి. |
| దు | పఱు + దు=(ప్రయోజనము లేనిది.) | పఱ్ + ఉ = (ప్రాచీనము, ముదుసలి) | పఱుతు (ప్రా. తమి ) (చూ. ౧౭ XXII విష.) |
| న్దు | మరు + న్దు=(ఔషధము) | మర్ + ఉ = (సువాసన గల్గియుండు) | 'మరమ్' అనునది మూలమనుటలెస్స-తెల్గు-మందు. "మందో-మాకో" (ప్రా. తమి. మరున్తు. చూడు ౧౭ XXIII విష.) |
| త్తు | కురు + త్తు = (తాటిలేఁతమోవు) | కురు=(కోమలము) | |
| దై | ఇఱుదై=(అసత్యము) | ఇఱ్ + ఉ=(తొలఁగు=చ్యుతమగు) | ఇఱుతై =(ప్రా. తమి.) (చూడు ౧౭ XXII విష.) (కాల్డు. ఇఱుదెయ్-చూ. ౧౮ II విష.) |
| న్దై | కుఱు + న్దై=(శిశువు) | కుఱ్ + అ=(పసిది=లేఁతది) | కుఱున్తై=(ప్రా. తమి.) (౧౭ XXIII విష. ౧౮ II విష.) |

## వ్యంజనముమీఁది 'డి-దు-డై' అనువానికిఁ గల్గు నుచ్చారణార్థకములగు మార్పులు

| రూప సాధనోపయోగి ప్రత్యయములు | ధాతుజములగు నామవాచకములు | చాలవఱకు వ్యాపారార్థకములు కాని ధాతువులు | విమర్శము |
|---|---|---|---|
| | | | ప్రాచీన తమిళమున సరళోచ్చారణము లేదు. కాన 'తి-తు-తై' అనుట యుక్తము. 'త' కారము 'చ' కార మగును గాని 'ద' కారము 'చ' కారము కానేరదు. |
| డి | కాట్ + చి = (కాణ్ + డి) = (దృశ్యము) | కాణ్ = (చూచు) | 'కాణ్ + తి' అని ఛేదము |
| ,, | తేర్ + చ్చి = (తేర్ + డి = తెలివి) | తేర్ = (తెలిసికొను) | 'తేర్ + తి' అని ఛేదము |
| ,, | ఉటల్ + చ్చి = (ఉటల్ + డి) = (సుడి) | ఉటల్ = (సుడియుట) | 'ఉటల్ + తి' అనిఛేదము |
| ,, | నన్ + ద్రి = (నల్ + డి) = (లాభము) | నల్ = (మంచిదగు) | 'నల్ + తి = నన్ఱి' అని వ్రాయనగును. (చూడు ౧౭ XXII విష. ౧౭ XVI విష) |
| ,, | వెల్ + టి = (వెల్ + డి) = (జయము) | వెల్ = (జయించు) | 'వెల్ + తి' అని ఛేదము |
| ,, | పుగట్ + చ్చి = (పుగల్ + డి) = (పొగడ్త) | పుగల్ = (పొగడు) | 'పుకల్ + తి' అని ఛేదము. (చూడు ౧౭ XXII విష.) |
| ,, | ఆత్ + చి = (ఆళ్ + డి) = (ఆధిపత్యము) | ఆళ్ = (కల్గియుండు-ఏలు) | "ఆళ్ + తి" అని ఛేదము |
| ,, | ఆట్ + టి = (ఆళ్ + డి) = (స్త్రీ) | ఆళ్ = (వ్యక్తి-స్త్రీ) | 'ఆళ్ + తి' అని ఛేదము |
| దు | తొణ్ + దు = (తొల్ + దు) ప్రాచీనత | తొల్ = (ప్రాత) | 'తొల్ + తు' అని ఛేదము (చూడు ౧౭ XXII విష.) |
| ,, | తొన్ + ద్రు = (తొల్ + దు) (ప్రాచీనత) | తొల్ = (ప్రాత) | 'తొల్ + తు' అని ఛేదము. (చూడు ౧౭ XXII, ౧౭ XVI విష.) 'తొన్ఱు' (ప్రా. తమి.) |

| రూప సాధనోపయోగి ప్రత్యయములు | ధాతుజములగు నామవాచకములు | చాలవఱకు వ్యాపారార్థకములు కాని ధాతువులు | విమర్శము |
|---|---|---|---|
| దై (సెర్ల. కాల్డు.) | పెట్ + దై=(పెణ్ + దై)=(పెట్టె) | పెణ్=(ఆఁడుది) | 'పెణ్ + తై' అని ఛేదము. (చూడు ౧౭ XXII విష.) కాల్డు. ఐ= ei ఎయ్ =చూడు ౧౦ II విష. |
| ,, | పరట్ + తై=(పరణ్ట్ + దై)=బొచ్చు గల్గియుండు) | పరణ్ణు=(గోకికొను) | 'పరణ్ట్ + తై' అని ఛేదము |
| ,, | తొణ్ + డై=(తొళ్ + దై)=(కుత్తుక) | తొళ్=(రంధ్రముచేయు) | 'తొళ్ + తై' అని ఛేదము. తెల్గు-తొల్చు=(రంధ్రముచేయు). |
| ,, | ఊత్ + తై=(ఊన్ + దై)=(అపరిశుద్ధత) | ఊన్=(మాంసము కండ) | 'ఊన్ + తై' అని ఛేదము. (చూడు ౧౭ XXII విష.) |
| న్ | కడ్ + అన్=(అప్పు=ఋణము) (కడ్ + అమ్) | కడ్ + ఉ=(కఠినము) కడ్ + అ=(దాఁటిపోవు) | 'కట్' అనునది ప్రాచీన తమిళ రూపము (చూడు ౧౭ XXII విష.) |
| ,, | అఙ్ + అన్=(అఙ్ + అమ్)=(గుణము). | అఙ్ + ఉ=(కోయు, నిర్వచించు) | |
| బు | మర + బు=(వాడుక) — | మర=(ప్రాచీనమగు!) | 'మరపు' (ప్రాచీన తమిళ) |
| ,, | పణ్ + బు=(గుణము-రకము) | పణ్=(ఉపయోగార్హము) | 'పణ్పు' (ప్రా. తమి.) |
| ,, | ఎన్ + బు=(ఎముక) ఎల్ + పు | ఎలుమ్ + బు=(ఎమ్ము) | ఎన్పు=ఎలుమ్పు (ప్రా. తమి). తెల్గు-ఎమ్ము). |
| మ్బు | నర + మ్బు=(నరము) | నార్ (నారతీసుప) | నరమ్బు-(ప్రా. తమి.) |
| ,, | ఇడు+మ్బు =(పొగరు అణఁచి పెట్టుట) | ఇడ్ + ఉ(ఒత్తుట=అదుముట) | ఇడుమ్బు=ప్రా. తమి. |
| ప్పు | సెవప్పు=(ఎఱ్ఱనితనము) | సె=సెవ్=(ఎఱ్ఱ) | ప్రా. తమి-'చెవ్'='చె'. |
| ,, | కఱు + ప్పు=(నల్లనితనము) | కఱ్ + ఉ=(నల్లనిది) | తెల్గు-కట్టి=(నల్లనిది) |
| ప్పై | కల + ప్పై=(నాఁగలి) — | కలమ్=(పాత్ర) | కాల్డు. కలప్పెయ్—(చూడు ౧౦ II విష.) తెల్గు. కలము=ఓడ. |
| అమ్ | పల్ + అమ్=(ఫలము=పండు | పఴు=(ప్రాఁతే-పక్వము | |
| ,, | నల్ + అమ్=(లాభము) | నల్=(మంచి) | |

తుది హల్లునకు పారుష్య ద్విత్వములు వచ్చి 'అమ్' చేరెడి ధాతువుల యుదాహృతులు.

| రూప సాధనోప యోగి ప్రత్యయ ములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కాని ధాతువులు తెలుచు. | విమర్శము |
|---|---|---|---|
| గ్=క్క్+ అమ్ | ఆక్క్+అమ్=(వృద్ధి) | ఆగ్+ఉ=(ఆగు-ధా.) | 'ఆక్+ఉ' (ప్రా. తమి.) |
| ఙ్గ్=క్క్+ అమ్ | వీక్క్+అమ్=(ఉబ్బుట) | వీఙ్గ్+ఉ=(ఉబ్బు) | వీఙ్క్ (ప్రా. తమి.) |
| ఞ్జ్=చ్చ్+ అమ్ | అచ్చ్+అమ్=(భయము) | అఞ్జ్+ఉ=(భీతిల్లు) | 'అఞ్చ్' (ప్రా. తమి.) తెల్గు. అంజు=(భయము) |
| డ్=ట్ట్+అమ్ | కూట్ట్+అమ్=(కూడిక-సముదాయము) | కూడ్+ఉ=(కూడు) | 'కూట్' (ప్రా. తమి.) తెల్గు. కూటువు=(సమూహము). |
| ణ్డ్=ట్ట్+అమ్ | తోట్ట్+అమ్=(తోఁట) (తోడ్+ఉ) | తోణ్డ్+ఉ=(త్రవ్వు) | తోణ్ట్=(ప్రా. తమి.) |
| న్ద్=త్త్+అమ్ | నీత్త్+అమ్=(ఈఁదుట) ఈఁత. | నీన్ద్+ఉ=(ఈఁదు) | 'నీన్త్' (ప్రా. తమి.) |
| మ్బ్=ప్ప్+ అమ్ | విరుప్ప్+అమ్=(కోర్కె) | విరుమ్బ్+ఉ=(కోరు) | 'విరుమ్ప్'=(ప్రా. తమి.) |
| అమ్ | కుఴ్+అమ్ ·(సముదాయము) | కుఴ్+ఉ=(కూడు) | తెల్గు. కూడు. (సంస్కృ. కూట.) |
| మై | ముఱై+మై=(క్రమము) | ముఱై=(వరుస) | |
| ,, | ఎయ్దు+మై=(సామీప్యము) | ఎయ్=(సమీపించు—పంచ సంఖ్య) | కాల్డు. ఎయ్=ఐ. ? (ai=ఐ) (చూ. ౧౦- II వి.) తెల్గు. ఎయ్దు=వెంబడించు |
| ఆయ్ | కుఴ్+ఆయ్=(కొళాయి) | "కుఴ్+ఇ=(రంధ్రము)" అనుదానితోఁ బోల్చుము | |
| ,, | పా+య్=(చాప) | పా+వు=(వ్యాపించు) | |

| రూప సాధనోపయోగి ప్రత్యయములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కాని ధాతువులు తఱచు. | విమర్శము |
|---|---|---|---|
| అర్ | సుష్ + అర్ =(కాంతి) | సుడ్ + ఉ=(వేఁడిమి) | 'చుట్' (ప్రా. తమి) తెల్గు–చూఁడు=కాల్చు |
| ,, (కా.౫౫౦.పు.) | పుద్ + అర్ =(పొద) | పుద్ + ఉ=(క్రొత్తది) | పుత్-(ప్రా. తమి) |
| ఆర్ | పుగ్ + ఆర్ = (పొగమంచు) | పుగ్ + ఉ=(ప్రవేశించు) | పుక్-(ప్రా.—తమి.) తెల్గు. పొగ=(ధూమము) |
| ఇర్ | కుళ్ + ఇర్ =(చలి) | 'కుళ్ + ఇ' = (స్నానము చేయు) పోల్చి చూడు. | తెల్గు–కులుకు = (వణఁకుట) కెళకుళి = క్రీడాసరస్సు - (ఖేలాకూలమ్ - సంస్కృ - ప్రకృతి ?) |
| ,, | ఉగ్ + ఇర్ =(గోరు) | ఉగ్ + ఉ = (తొలఁగించు) | 'ఉక్' (ప్రా. తమి.) |
| రై | కుది + రై =(గుఱ్ఱము) | కుద్ + ఇ=(దుముకుట) | కుత్ (ప్రా. తమి.) (సంస్కృ - కుదరః. దీని వికృతి-కుదిర.) (శ ర) కదము (స్కందన శబ్ద వికృతి-(శ-ర) ) |

'అల్' అనునది తుదిని గల కొన్ని కృదంతములందు వ్యాపారబోధ కల్గుచుండును. వానికిఁ బూర్వమునఁ బ్రథమాంత నామవాచకము నిల్చును. అట్టి కృదంతముల నీ క్రింది పట్టికలోఁ జేర్పలేదు. చాల ప్రాచీన నామవాచకములనో? వాని గౌణ రూపములనో? ఏ క్రియనుండి పుట్టినవో తెలియ శక్యముగాని కృద్రూపములనో యీ క్రింది పట్టికలో నుదాహరించితిని.

| రూప సాధనోప యోగి ప్రత్యయ ములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కాని ధాతువులు తెలుచు | విమర్శము |
|---|---|---|---|
| అల్ | పై + య్ + అల్ = (బాలుఁడు) (పైద్ + (అల్) | { పై = పసు (చు) = (ఆకు పచ్చని-నూతనము) | |
| ,, | ఉడ్ + అల్ = (శరీరము) | ఉడ్ + ఉ = (ధరించు) | ఉట్-(ప్రా. తమి.) తెల్గు-ఒడలు. |
| ,, | పుస్ + అల్ = (తుపాను) = (పుయల్) | పుయ్ = (పట్టుకొను) | |
| ,, | ఉర్ + అల్ = (సున్నపుగచ్చు) | ఉర్ + అమ్ = (బలము) | |
| ,, | వయ్ + అల్ = (వరిపొలము) | వై = (ఉంచు? స్థలము?) | |
| ,, | వణ్డ్ + అల్ = (వండమట్టి) (ముఱుగడ) | ? | తెలుఁగు-వండ = వండలి = (వండమట్టి) |
| అలై | సుడ్ + అలై (శ్మశానము) | సుడ్ = (కాల్చు) ('సుద్' అని తప్పు పడినది). | చుట్-(ప్రా. తమి.) |
| ,, | మట్ + అలై = (బాల్యము) | మట్ + అ = (చిన్న-పసిది) | |
| ,, | విడుద్ + అలై = విడుత్తల్ = (విడుదల) | విడ్ + ఉ = (విడుచుట) | విట్ (ప్రా. తమి.) |

'తలై = (తల = తలము)' అనునది గ్రాంధిక భాషయందు సప్తమీ విభక్తి చిహ్నముగా విరివిగా వాడఁబడుచున్నది. కాని 'అలై = అల్' అనునవి తుదియందుండునవి యితర పదములవలన నేర్పడినట్లు తోఁచును. 'విడుదలై' అనునది 'విడు + తలై' అను రీతి నేర్పడక 'విడుదల్ + ఐ' అను రీతి నేర్పడినదని తెలియును. 'విడుదల్' అను రూపము ప్రచురమగు క్రియానామవాచక మనిపించుకొను కృద్రూపము.

| రూప సాధనోపయోగి ప్రత్యయములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థ కేతర ధాతువులు తెలుచు. | విమర్శము |
|---|---|---|---|
| ఇల్ | ముగ్ + ఇల్ =(మేఘము) (సంస్కృ - ముకుళ)? | ముగ్ + ఇఱ్ = (ముడుచుకొను) (సంస్కృ. ముకుళించు)? | తెల్గు-మొగులు=(మేఘము) 'మొగిలు = మొయిలు' (లక్ష్మీనా. కో.) |
| ,, | తొట్ట్ + ఇల్ = (ఊయ్యెల) | తొట్ట్ + ఇ=(తొట్టి) | తెల్గు-తొట్టి=తొట్టిల, తొట్ల=తొట్టెల. |
| ,, | విట్టిల్ =(మిడుత) | వెట్ట్ + ఉ=(త్రుంచు? ఆకులు కోఱుకు?) | |
| ఉల్ | అల్గ్ + ఉల్ = (నితంబము) | . అల్గ్ + ఉ = (తగ్గు) మూలధాతువు. 'అల్' = (లేనట్టి) | |
| వి | కుర + వి=(చిన్న పిట్ట) | కుర్ + ఇ=(చిన్న) | |
| వు | తుర + వు =(పెద్దబావి) | 'తుఱై' = 'ఏఱు' మున్నగువానిని దాఁటు రేవు-దీనితోఁ బోల్చిచూచునది. | |
| వై | ఇడ + వై = (సందు) ("'ఇఱువాయ్' అనునది 'ఇడువై' అనియైనది = చోటు-అంతమగు" శ్రీ రెడ్డిగారు) | 'ఇడ్ + అమ్' =(ఎడము) అనుదానితోఁ బోల్చి చూడు. | (ఐ =ఎయ్-ei కాల్డు.) (చూడు ౧౯ II విష.) |
| ,, (౫౫౧. కాల్డు.) | పఱ + వై =(పెద్దపిట్ట) | పఱ్ + అ =(ఎగురు) | |
| అఱ్ | ఇద్ + అఱ్ =(పూఁతొకు) | ? | |
| ,, | అగ్ + అఱ్ =(అగడ్త) | అగఱ్ =(త్రవ్వు) | తెల్గు-అగడిత=అగడ్త, 'అఖాత' శబ్ద వికృతి. (వై. దీపి.) |
| అళ్ | అద్ + అళ్ =(చర్మము) | ? | |
| ఉళ్ | అర్ + ఉళ్ = (అనుగ్రహము, కృప) | అర్ + ఉ =(స్రవించు-అమూల్యమగు) | తెల్గు-అరులు =(వాత్సల్యము) |
| ,, | పొర్ + ఉళ్ =(వస్తువు, సంపద) | పొర్ + ఉ =(కూడు-కలియు) | |
| ఉళై | ఉర్ + ఉళై =(చక్రము) | (ఉర్ + ఉళ్ =(చక్రము) | |
| ఱు | కిణ + ఱు =(బావి) | కేణ్ + ఇ =(నూయి, గని) | |
| ,, | వెళి + ఱు =(వైవర్ణ్యము) | వెళ్ =(తెలుపు) | దొరగారికిఁ దమిళము బాగుగ నలవాటు పడినది గానఁ దమిళులో దాహృతులను జూపిరి. ఇట్లే యాంధ్ర కన్నడాదులందును నెఱుంగ నగునని దొరగారి యాశయము |

౧౩౯. III విష:—"IV త్రర్థక నామవాచకములు=(Nouns of agency=కర్త్రర్థక నామవాచకములు):—ద్రావిడ భాషలలోని క్రియాజన్య విశేషణ (తద్ధర్మార్థక) నామవాచకములను బ్రాయికముగా 'త్రర్థక నామవాచకములు' అని వాడుదురు. కాని యట్టి నామవాచకములు ద్రావిడ భాషలందెల్ల వేఱు విధముగా సైతము వాడఁబడును. ఆ విధము చాలఁ బ్రాచీనతరము. వ్యాపారార్థక ధాతువులపైని 'ఇ' ప్రత్యయమును జేర్చుటవలన నట్టి విశేషణము లేర్పడును. ఉదా:—తమి-కన్న-ధా:—ఉణ్=(తిను) ఉణ్+ణ్+ఇ=(తినువాఁడు). తమి-కన్న-ధా:—కొల్+ల్+ఇ=(చంపువాఁడు).

ద్రావిడ భాషలలోనికి సంస్కృత స్త్రీ లింగ శబ్దములను దెచ్చునపు డద్దాని తుది దీర్ఘము హ్రస్వ మగును. ఉదా:-సుంద+రీ=(అందకత్తె)=ద్రావి. తత్స-సుందరి, పైని వ్రాసిన 'ఇ' ప్రత్యయమునకును నీ సంస్కృత స్త్రీ లింగ ప్రత్యయ సంబంధి 'ఇ' ప్రత్యయమునకును సంబంధ మేమియు లేదు. ఇట్లే-'కవిస్=(కవిః)=తత్సమ-కవి.' ("కవి-పుం-కు-శబ్దే+ఇ......" శబ్దస్తో) 'కవతే చాతుర్యేణేతి కవిః' (లింగాభ). 'కౌతీతి కవిః-కు-ధాతు-అచ ఇః'.) (శబ్దార్థ చింతా) 'కారిన్-తత్స-కారి'=(చేయువాఁడు) మున్నగు శబ్దముల తుది 'ఇ' ప్రత్యయమునకును బైని వ్రాసిన ద్రావిడ త్రర్థక ('తృ' ప్రత్యయార్థక) మగు 'ఇ' ప్రత్యయమునకును నేవిధమగు సంబంధమును లేదు" (కాల్డు. ౫౫౨ పుట.)

"పైని వ్రాసిన సంస్కృత 'ఇ' ప్రత్యయమునకును ద్రావిడ 'ఇ' ప్రత్యయమునకును మూలమగునది యేదేనొకటియైనఁ గావచ్చును. కాని సంస్కృతము నుండి ద్రావిడ ప్రత్యయ మెంత మాత్రమును రాలేదు. దాని యనుకరణమును గాదు" (కాల్డు. ౫౫౨ పుట).

"I ద్రావిడ త్రర్థకమగు 'ఇ' ప్రత్యయమునకు లింగవివక్షు లేదు. సందర్భమునుబట్టియే దాని లింగము వాడఁబడును. ఉదా:—పనై=(తాటిచెట్టు). ఏఱ్+ఉ=(ఎక్కుట). పనై+య్+ఏఱ్+ఇ=పనైయేఱి=(తాటిచెట్టెక్కువాఁడు). మణ్=(నేల) వెట్ట్+ఉ=(త్రవ్వుట). మణ్+వెట్ట్+ఇ=మణ్వెట్టి=(గునపము)" (కాల్డు. ౫౫౨, ౫౫౩ పుటలు).

"II ఇట్టి త్రర్థక ద్రావిడ నామవాచకములు వ్యాపారార్థక ధాతువుల నుండియుఁ దద్భిన్న ధాతువులనుండియు నేర్పడవచ్చును. ఉదా:—నాఱ్=(నాల్)+కాల్+ఇ=నాఱ్కాలి=(కుర్చి=నాల్గు కాళ్ళుగలది)" (కాల్డు. ౫౫౩ పుట).

"III వ్యాపారార్థ ధాతువులనుండి యేర్పడునపుడు 'ఇ' ప్రత్యయము క్రియపైనేకాక క్రియాంగముపైని (అనఁగాఁ దద్ధర్మార్థమునందును భావార్థము నందును నేర్పడు క్రియాంగముపైని) సయితము నిల్చును. ఉదా:—ఉణ్ గ్ + ఇ = ఉణ్గి = ఉణ్ణి = (తినువాఁడు)" (కాల్డు. ౫౫౩ పుట).

"IV ద్రావిడ భాషలలోని వృక్షవాచకములందును, బహువాచకము లందును, వివిధ వస్తువాచకములందును, ప్రాచీనతమ సమాసములందును, సామెతలందును, వెక్కిరింత శబ్దములందును, గ్రాంధిక వ్యావహారిక భాషలలో —(ఇందును నందును ననవేల? అంతటను) నతి విపులముగా నీ ద్రావిడ 'ఇ' ప్రత్యయము వాడఁబడుచుండుటచేత దీనికి సంస్కృత సంబంధ మేమాత్రమును లేదని దృఢముగాఁ జెప్పవచ్చును. ఇందులకుఁ గొన్ని యుదాహరణములు:—

| ధాతువు | అర్థము | సిద్ధ రూపము | అర్థము |
|---|---|---|---|
| కళ్ | కల్లు | కళ్ + ళ్ + ఇ = | ఒక యింపైన వస్తువు |
| వెళ్ | తెల్లనిది | వెళ్ + ళ్ + ఇ | వెండి |
| పుల్ | చిన్నది | పుల్ + ఇ = పులి | చిఱుత పులి |
| ఇల్ | లేనిది | ఇల్ + ఇ = ఇలి | లేనిది, దరిద్రుఁడు |
| ఆట్ + ఉ | లోతుగానుండు | ఆట్ + ఇ = ఆటి | సముద్రము |

ఈ క్రింది సమాస రూపములను బోల్చి చూచునది

| శబ్దము | అర్థము |
|---|---|
| వటి + కాట్ట్ + ఇ | దారి చూపువాఁడు |
| వానమ్ + బాడ్ + ఇ | వాన కోయిల = ఆకసమునందుఁ బాడెడి పక్షి |
| తోట్టాల్ + వాడ్ + ఇ | లజ్జావతియను తీఁగ = స్పర్శచే ముకుళించు లతా విశేషము. స్పర్శచే వాడునది." (కాల్డు. ౫౫౩). |

విమర్శము:—ఈ ద్రావిడ 'ఇ' ప్రత్యయము వ్యాపారార్థకేతర ధాతువుల పైని సయితము నిల్చుననియు సమాసాంతమున నిల్చుననియు డా. కాల్డువెల్లు గారే వ్రాయుటంబట్టి దీనిని ధాతుజ విశేషణ ప్రత్యయమనియుఁ (Participial noun) గర్త్రర్థకమనియు (Nouns of agency) వ్యవహరించుట యెట్లు పొసఁగును? 'సుందరీ' మున్నగు వానియందలి 'జీ = ఈ' ప్రత్యయముతో సరిచేసి పరిశీలిం

చుట కేవలము నసంగతము. స్త్ర్యర్థకమగు 'ఈ' ప్రత్యయమునఁ గర్త్రర్థకత్వము గాని యస్త్ర్యర్థకత్వముగాని లేవు గదా.

తెలుఁగునందును నిట్టి ప్రత్యయము కలదు:—"ఇవర్ణకం బోయారాదు లకు మతుబర్థమునం దగు" ఉదా:—ఓయారి-అక్కసి-కడలి-బండారి. బిత్తరి. బేహారి. మొ." (బాల వ్యా. తద్ధిత. ౧౮ సూ.).

"డయ్యు దయ్యు నొచ్చు పుచ్చులకు 'ఇ' వర్ణకంబగు......." (ప్రౌఢ. కృదం. ౧ సూ.) ఉదా:—డప్పి-దప్పి-నొప్పి-పుప్పి.

"చేయి = (హస్తము) దాయి = (సమీపము) వ్రాయి = (అక్షరము) కూయి = (ధ్వని) మొదలగు పెక్కు కృదంతములు గలవు".

కన్నడమందును నిట్టి ప్రత్యయము విలసిల్లు చున్నది. "ఇ రుణః కర్మణి" (కర్ణాటకశబ్దా. ౨౪౯ సూ.)=(భాషామంజరీ వృత్తి)=కర్మణి ఉపపదే 'ఉణ్' ఇత్యస్మా ద్ధాతోః 'ఇ' ప్రత్యయో భవతి. తాచ్ఛీల్యే గమ్యమానే".

"కంపు+ఉణ్+ఇ=కంపుణి=గంధలిట్=(గంధము నాఘ్రాణించు శీలము గలవాఁడు). ఎలరు+ఉణ్+ఇ=ఎలరుణి=వాయుభుక్-సర్ప ఇతి యావత్. అలరుణి=పుష్పలిట్. అరలుణి=సవ్వ. ఎరలుణి=వాయుభుగేవ. పావుణి=భుజఙ్గభుక్ = మయూర ఇతియావత్......" (మంజరీ మకరంద వ్యాఖ్య.)

"కొల ఉద్ధ్రస్వశ్చ" (కర్ణాటకశబ్దా. ౨౪౭ సూ.)=(వృత్తి)=కర్మణి ఉపపదే 'కొల్' ఇత్యస్య ధాతోః 'ఇ' ప్రత్యయో భవతి. 'కొల్' ధాతోః (ఒకారస్య) హ్రస్వ ఉకారాదేశశ్చ భవతి. ప్రయోగః-మీన్+కొల్+ఇ=మీంగులి=(చేఁపలఁ జంపువాఁడు)".

"మీంగులి=ధీవరః-పక్షి విశేషో వా. పావు=కొల్+ఇ=పావుగులి=నకులో, మయూరో వా. ఇలి+కొల్+ఇ=ఇలిగులి=ఆఖుభుక్. ఆనె+కొల్+ఇ=ఆనెగులి=సింహః" (మంజరీ మకరంద వ్యాఖ్య).

కన్నడమునందును సమాసాంత 'ఇ' ప్రత్యయమును గలదు. "ఇ శ్చాగాదిభ్యః" (కర్ణాటకశబ్దా. ౩౭౫ సూ.)=(భాషా మంజరీ వృత్తి.)=చాగాద్యన్తా ద్బహుబ్రీహి సమాసాత్ 'ఇ' ప్రత్యయో భవతి. ప్రయోగః:—కడు చాగి=(అధికమగు త్యాగము గలవాఁడు).

"ఇల్లాల్లుప్చ" (కర్ణాటకశబ్దా. 330 సూ.)=(భాషామంజరీ వృత్తి). ఇల్లశబ్దాన్తా ద్బహువ్రీహిసమాసాత్ 'ఇ' ప్రత్యయో భవతి. ఇల్ల శబ్దస్య (అన్త్య) లోపశ్చ. ప్రయోగః:—పల్లిలి బాయ్=(పండ్లు లేని నోరు) (బాయ్= తెల్గు. వాయి).

"అన్త్యలోపస్య "లుబనామహశా" (కర్ణాటకశబ్దా. 3౬ సూ.) ఇత్యేవ సిద్ధేః లుబ్‌గ్రహణ మనర్థకంసత్ ఉపాన్త్య (లకార) లోప మాదాయ అర్థవదితి విజ్ఞేయమ్" (మకరంద వ్యాఖ్య.)

౧౩౯. IV విష:—"క్రియావిశేషణములు:—(Adverbs). ద్రావిడ భాషలలోఁ గ్రియా విశేషణములే లేమింజేసి వానిని గూర్చి వ్రాయుట యనావశ్యకము. ద్రావిడ భాషలలోని క్రియా విశేషణము లెల్ల:—సుబంతములో? అవ్యయములో? క్రియాంగములో? భావార్థకములో? లాక్షణికావ్యయములో? (Gerunds) యయి యుండును. వాని వాని యుదాహృతులు తత్త ద్ద్రావిడ వ్యాకరణములందుఁ గననగును. ఎల్ల భాషలందును విచిత్రములగు ననుకరణ శబ్దములను గ్రియావిశేషణములనుగా వాడుట గలదు. అట్టి యెడల వాని తుదిని 'అను-అని-అనునట్టి' మున్నగు నర్థములు గల శబ్దములు నిల్పఁబడును. ఉదా:—తమి:—మడమడ+(వ్)+ఎన్డ్రు+ఇడి విఱున్దదు=(మడమడమని పిడుగు పడినది. ఇట్టివాని యథేచ్ఛముగాఁ గల్పింపనగును" (కాల్డు. ౫౫3, ౫౫౪ పుటలు).

౧౪౦. I విష:—"క్రియా రూపోదాహరణ పట్టిక:—ద్రావిడభాషలలోని రూపములు రెండు విధములు. I. ప్రాచీన భాష=పండిత భాష. II. వ్యావహారిక భాష=అపండిత భాష. వీనిలోని మొదటి తెగ రూపములె యీ పట్టికయం దుదాహరింపఁబడును" (కాల్డు. ౫౫౪ పుట).

("తమి-'సెయ్'. మలయా-'చెయ్'. తెల్గు-'చేయు'. కన్నడ-'గెయ్'. తుళు-'మళ్పు' (కన్నడ-'మాడు'=చేయు). కూర్గు 'కెయ్'" అనుధాతువు రూపము లిందుదాహరింపఁబడును).

"స్వార్థవృత్తి ధాతు రూపములు. (Affirmative mood).

వర్తమానకాలము. (Present tense). ౧౮౦ I విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళీ | తెలుగు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| I do | సెయ్గిన్ద్రేన్ | చెయున్నేన్ | చేయుచున్నాను | గెయ్దపెం | మళ్ప్పవె | కెయువి | డా. కాల్డువెల్లుగారు నేఁటి వాడుక ననుసరింపరాదు. ప్రాచీన తమిళమున సరళములు శషసలు లేవు. కాన 'చెయ్' అనియే తమిళమందును ధాతువు. 'న్ఱు' అనుదాని నర్వాచీనులు 'న్ద్రు' అని పల్కుదురు. కాన, 'చెయ్కిన్ఱేన్'. అనురీతినే ప్రాచీన రూపము లుండెడివని గ్రహింపనగును. చూడు ౧౭ XXII విష. ౧౭ XXIII విష. ౧౬ XVI విష. కిన్ఱు = న్ద్రు. |
| | సెయ్గిన్ద్రెన్ | | | | | కెయువళె | |
| Thou doest | సెయ్గిన్ద్రాయ్ | చెయ్యున్నాయ్ | చేయుచున్నావు | గెయ్దపయ్ | మళ్ప్పవ | కెయువి | |
| | సెయ్గిన్ద్రి ('ఇది లేదు'. శ్రీ రెడ్డిగారు) | | | | | | |
| | సెయ్గిన్ద్రనై | | | | | | |
| He does | సెయ్గిన్ద్రాన్ | చెయ్యున్నాన్ | చేయుచున్నాఁడు | గెయ్దపం | మళ్ప్పవె | కెయువ | |
| | సెయ్గిన్ద్రనన్ | | | | | కెయువళె | |
| She does | సెయ్గిన్ద్రాళ్ | చెయ్యున్నాళ్ | చేయుచున్నది | గెయ్దపళ్ | మళ్ప్పువళ్ | కెయువ | |
| | సెయ్గిన్ద్రనళ్ | | | | | కెయువళె | |
| It does | సెయ్గిన్ద్రదు | చెయ్యున్నదు | చేయుచున్నది | గెయ్దపుదు | మళ్ప్పుణ్ణు | ,, | |
| We do | సెయ్గిన్ద్రోమ్ | చెయ్యున్నోమ్ | చేయుచున్నాము | గెయ్దపెవు | మళ్ప్పవ | ,, | |

వర్తమాన కాలరూపములు.  ౧౪౦ I విషః—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళి | తెలుగు | కన్నడము | తుళు | కూర్గ | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| We do | సెయ్గిన్ద్రేన్<br>సెయ్గిన్ద్రామ్<br>సెయ్గిన్ద్రనమ్ | చెయ్యున్నేజ్ఞళ్ | చేయుచున్నాము | గెయ్దపెమ్ | | | |
| Ye do | సెయ్గిన్ద్రీర్<br>సెయ్గిన్ద్రనీర్ | చెయ్యున్నీర్ | చేయుచున్నారు | గెయ్దపిర్ | మళ్పువర్ | కెయ్యువిర | |
| Persons<br>They do<br>(కాల్డు. ౫౫౫) | సెయ్గిన్ద్రార్<br>సెయ్గిన్ద్రనర్ | చెయ్యున్నార్<br>చెయ్యున్నోర్ | చేయుచున్నారు | గెయ్దపర్ | మళ్పువెర్ | కెయ్యువ<br>కెయ్యువళ్ | |
| Things<br>They do | సెయ్గిన్ద్ర<br>సెయ్గిన్ద్రన | (చెయ్యున్నవన)<br>('ఈ రూపములు లేవు' శ్రీ రెడ్డి గారు) | చేయుచున్నవి | గెయ్దపువు | మళ్పువ | ,, | |

వర్తమానార్థక రూపములు. ౧౭౦ I విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయా | తెలుగు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| | **శత్రర్థకములు = Present verbal participles.** | | | | | | |
| Doing | సెయ - సెయ్యు. (ఇదియె భవిష్య దర్థకమును) | ... | చేయుచు. చేయుచున్న | గెయుతుమ్. గెయువుతుమ్. గెయుత్తె. గెయ్యుతె. మొ. | మళ్తొండు. | కెయుత. కెజ్జ్ణ్డ | 'సెయ్యు' తొల్కాప్పియమునఁ గానరాదు. "చెయ = సెయ" అనునది భావలక్షణార్థకము. 'చేయఁగా' నని యర్థము. కన్నడ శత్రర్థకములు. "ఉతుం - ఉత్తుం - ఉతె - ఉత్తె" అనునవె. కన్నడ మందలి 'గుమ్' ప్రత్యయము సర్వ పురుష సాధారణము కాదు. ప్రథమ పురుషమందు మాత్రమె నిల్చును. (చూడు ౧౩౦ VI విష.) |
| | **వర్తమానార్థక విశేషణములు = Present relative participles.** | | | | | | |
| That does | సెయ్గిన్ర. 'ఆనిన్ర' అనునదికూడ వర్తమానార్థమునఁ గవులు వాడుదురు. సెయ్యానిన్రేన్ = (చేయుచున్నాను). కాని 'గిన్ర' అనుదానిచోట నెల్ల 'ఆనిన్ర' అను దానిని వాడనగును. (కాల్డు. ౫౫౬ పుట) | చెయ్యున్న | చేయుచున్న | గెయ్వ. (ఇది భావ్యర్థకమును) "గుమ్" అనుదానిని (గెయ్గుమ్) నెల్ల లింగవచనకాల పురుషలందును వాడనగును. | మళ్ప | కెయువ. (ఇది భవిష్య దర్థకమును) | |

''భూతార్థక రూపములు, ౧౮౦ II విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళము | తెలుగు | కన్నడము | తుళు | | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | అనద్యతన | అద్యతన | | |
| ''I did | సెయ్దేన్ | చెయ్దేన్ | చేసితిని | గెయ్దెం | మళ్తె | మళ్త్దె | కెజ్జమ్ | ప్రాచీన తమిళమున సరళోచ్చారణమె లేదు కాన భూతార్థక ప్రాచీన ప్రత్యయము త కార రూపమె. (చూడు ౧౭ XXII విష. ౧౭ XXIII విష). |
| | సెయ్దనెన్ | చెయ్దనేన్ | | | | | | |
| Thou didst | సెయ్దాయ్ | చెయ్దాయ్ | చేసితివి | గెయ్దయ్ | మళ్తె | మళ్త్ద | కెజ్జయ | |
| | సెయ్ది. సెయ్దై | | | | | | | |
| | సెయ్దనై | | | | | | | |
| He did | సెయ్దాన్ | చెయ్దాన్ | చేసెను | గెయ్దం | మళ్తె | మళ్త్దె | కెజ్జ | |
| | సెయ్దనన్ | చెయ్దనన్ | | | | | కెజ్జన | |
| She did | సెయ్దాళ్ | చెయ్దాళ్ | చేసెను | గెయ్దళ్ | మళ్త్ళ్ | మళ్త్దళ్ | కెజ్జన | |
| | సెయ్దనళ్ | | | | | | | |
| It did | సెయ్దదు | చెయ్దదు | చేసెను | గెయ్దుదు | మళ్త్ణ్డ్ | మళ్త్ 'ద్'ణ్డు | కెజ్జత్ | |
| | | | | గెయ్దితు | | | | |
| | | | | గెయ్దత్తు | | | | |
| We did | సెయ్దోమ్ | చెయ్దోమ్ | చేసితిమి | గెయ్దెవు | మళ్తె | మళ్త్ద | కెజ్జత్ | |
| | సెయ్దేమ్ | | | గెయ్దెమ్ | | | | |
| | సెయ్దామ్ | | | | | | | |
| | సెయ్దనెమ్ | | | | | | | |
| | సెయ్దనమ్ | | | | | | | |
| Ye did | సెయ్దీర్ | చెయ్దీర్ | చేసితిరి | గెయ్దిర్ | మళ్తర్ | మళ్త్'దర్ | కెజ్జిర | |
| | సెయ్దనిర్ | | | | | | | |

## భూతకాలిక రూపములు. ౧౮౦ II విష:—

| ఇంగ్లీషు | తమిళు. | మలయా. | తెల్గు. | కన్నడ. | తుళు. అనద్యతన | తుళు. అద్యతన | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|---|
| Persons They did | సెయ్‌దార్<br>సెయ్‌దనర్ | చెయ్‌దార్<br>చెయ్‌దనర్ | చేసిరి | గెయ్‌దర్ | మళ్తెర్ | మళ్త్‌దెర్ | కెజ్జత్ | |
| Things They did | సెయ్‌దన<br>సెయ్‌ద | (చెయ్‌దన) | చేసెను | గెయ్‌దువు | మళ్త | మళ్త్‌ద | కెజ్జత్ | |
| | క్త్వార్థకము=(Past verbal participles). | | | | | | | |
| Having done<br><br><br>(కా. ౫౧౯౮ పు) | సెయ్‌దు<br>సెయ్‌బు<br>సెయ్యా<br>సెయ్యూ<br>సెయ్‌దెన | చెయ్‌దు | చేసి | గెయ్‌దు | మళ్తి | మళ్త్‌ద్<br>మళ్త్‌ది | కెజిత్ | ప్రాచీన తమిళమున సరళోచ్చారణమె లేదుగానఁ దక్కిన చోటులందువలెనె 'చెయ్‌పు' అనవలెను. 'సెయ్‌బు' కాదు. 'చెయ్యా' అనునది వ్యతిరేక క్త్వార్థకము. 'చెయ్‌దెన' అనఁగా 'చేసినదానివలన' అని యర్థము. "చెయ్‌దు . . . =" (తొల్కా. ౭౦౨ సూ.) (చూ. ౧౩౭ I విష.) ఈ యర్థమునఁ గన్నడమున 'గుమ్' లేదు" |
| | భూతార్థక సంబంధార్థక ధాతుజ విశేషణము=(Past relative participles). | | | | | | | |
| That did | సెయ్‌ద<br>దీనికి బదులుగ నేకత్వ బహుత్వము లందు వరుసగ— 'సెయ్‌దు, సెయ్‌దుమ్' (చేసినట్టి) అని కవులు వాడుదురు. | చెయ్‌ద | చేసిన | గెయ్‌ద | మళ్తి | మళ్త్‌ద్<br>మళ్త్‌ది | కెజ | |

## భావి—తద్ధర్మరూపములు. ౧౮౦ III విష:—

| ఇంగ్లీషు | తమిళు | మలయాళము | తెల్గు | కన్నడము | తుళు అనద్యతన | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| "I will do | సెయ్‌వేన్<br>సెయ్‌వెన్<br>సెయ్‌వసెన్<br>సెయ్‌వన్<br>సెయ్‌వల్ | చెయ్‌వేన్<br>చెయ్‌వన్<br>('ఇది లేదు' శ్రీ రెడ్డిగారు) | చేయుదును | గెయ్‌వెం | మళ్పె | కెయ్యువమ్ | "సెయ్‌వన్ = చెయ్‌వన్" అను రూపము భవిష్యదుత్తమైకవచనము కాదు. అది ప్రథమ పురుషైక వచనము భావిలో. ('ఉత్తమైక వచనమునందె కావ్యములలో నచ్చును' శ్రీ రెడ్డిగారు) 'చేయఁగలను' మున్నగు కలానుబంధ భవిష్యద్రూపములను డా. కాల్డ్వెల్లుగారు చూపమికిఁ గారణము మృగ్యము. "కాఁగల కార్యము గంధర్వులు చేసిరి." "కొనఁగల గెదెకుఁ బెట్టఁగల బచ్చలి" మున్నగు సామెతలందును 'కలా'నుబంధము తెల్గునఁ బ్రసిద్ధము. |
| Thou wilt do | సెయ్‌వాయ్<br>సెయ్‌వి<br>సెయ్‌వై<br>(సెవై తప్పు) | చెయ్‌వాయ్ | చేయుదువు | గెయ్‌వయ్ | మళ్పె | కెయ్యువియ | |
| He will do | సెయ్‌వాన్<br>సెయ్‌వన్<br>సెయ్‌వనన్ | చెయ్‌వన్<br>చెయ్‌వోన్ | చేయును | గెయ్‌వం | మళ్పె | కెయ్యు | |
| She will do | సెయ్‌వాళ్<br>సెయ్‌వళ్<br>సెయ్‌వనళ్ | చెయ్‌వాళ్<br>చెయ్‌వళ్ | చేయును | గెయ్‌వళ్ | మళ్పళ్ | కెయ్యు | |
| It will do | సెయ్యుమ్<br>సెయ్‌వదు | చెయ్యుమ్ | చేయును | గెయ్‌వుదు | మళ్పు | కెయ్యు | |
| We will do | సెయ్‌వోమ్<br>సెయ్‌వేమ్<br>సెయ్‌వామ్ | చెయ్‌వోమ్ | చేయుదుము | గెయ్‌వెమ్<br>గెయ్‌వెవు | మళ్పె | కెయ్యువ | |
| (కా. ౫౫౦ పుట.) | సెయ్‌వమ్ | | | | | | |
| Ye will do | సెయ్‌వీర్<br>సెయ్‌వనిర్ | ... | చేయుదురు | గెయ్‌విర్ | మళ్పర్ | కెయ్యువిర | |

## భావి—తద్ధర్మరూపములు. ౧౮౦ III విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళము | తెల్గు | కన్నడము | తుళు అనద్యతన | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| Persons They will do | సెయ్‌వార్, సెయ్‌బ ఇట్లే 'ఎన్' తోం గలసి 'ఎన్మర్, ఎన్మార్, ఎన్మనార్' అనియు నన నగును. | చెయ్‌వార్, చెయ్‌వోర్, చెయ్‌వర్ తమిళమందువలెనె 'ఎన్మర్' అనియుం గలదు | చేయుదురు | గెయ్‌వర్ | మళ్పెర్ | కెయ్యు | |
| Things They will do | సెయ్‌గుమ్, సెయ్‌వ, సెయ్‌వన | చెయ్యుమ్ | చేయును | గెయ్‌వువు | మళ్ప | కెయ్యు | |
| | భావ్యర్థక క్రియాజన్యా మహద్విశేషణము=(Future verbal participle) | | | | | | |
| About to do | సెయ్‌వాన్ | చెయ్‌వాన్ | చేయ నున్నట్టి | ... | మళ్తొణ్ణు (వర్తమానమందును) | కెయ్యుత కెజ్జ్ 'ద్' (వర్తమానమందును) | |
| | భావ్యర్థక క్రియాజన్య మహద్విశేషణము=(Future relative participle) | | | | | | |
| That will do | సెయ్యుమ్ సెయ్ | చెయ్యుమ్ చెయ్‌వ | చేయు | గెయ్‌వ (వర్తమానమందును) | మళ్ప (వర్తమాన | కెయ్యువ మందును) | 'సెయ్' అను ప్రత్యయరహిత ధాతురూపము వ్యస్తతలోఁ దమిళమున విశేషణముగా వాడఁబడుట కాన రాదు. (చూడు ౧౭౦ IV విష.) |

తమిళమునఁ బ్రత్యయసహిత భావ్యర్థకరూపమునకు బదులుగఁ గవు లుత్తమ పురుషైకవచనమున 'గు—దు' అనువానిని బహువచనమునఁ "గుమ్—దుమ్" అనువానిని వాడుదురు. (చూడు భూతకాలము). II. అట్లె ధాతువునకును కాల చిహ్నమునకును నడుమ 'గు' అనుదానిని గవులు చొన్పుదురు. ఉదా:—సెయ్‌గువెన్, సెయ్‌గువ. ఇట్లు యథాప్రయోగముగ "సెయ్‌దేన్, సెయ్‌వ" అనువానికి బదులుగా వాడవచ్చును (కాల్డు. ౫౪౯ పుట).

విధ్యాద్యర్థకరూపములు. ౧౪౦ IV విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయా. | తెల్గు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| 'Do thou | సెయ్. సెయ్యాయ్. సెయ్‌ది. సెయ్‌గు. ('సెయ్‌ది - సెయ్‌దీర్' అనునవి భూతార్థకము లనుట లెస్స). | చెయ్ | చేయుము. చేయుమో. చేయి | గెయ్ గెయ్య. గెయ్‌వుదు | మళ్ప్వల | కెయి | తెల్గున 'చేయి' అనునది వ్యావహారికము. 'చేయుమో' అను వాడుక లేదు. 'చేయండి' అనునది తెల్గున వ్యావహారికము'' |
| Do ye | సెయ్యీర్. సెయ్మిన్. సెయ్మినీర్. సెయ్‌దిర్. (సెయ్‌గు) | చెయ్‌విన్ | చేయును. చేయుఁడు | గెయ్యిమ్ గెయ్‌వుదు | మళ్ప్వలె | కెయిరి | |

''౧౪౦. V విష:—భావార్థకములు. (Infinitives).

| ఇంగ్లీషు | తమిళము | మలయా. | తెల్గు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| To do | సెయ్య - సెయ్‌గ. సెయ్‌గుబ. ('ఇది లేదు' శ్రీ రెడ్డిగారు) సెయ్యియ | చెయ్య చెయ్‌గ | చేయ. (తెల్గు 'చేయ' అని యుండదు. 'చేయన్' అని యుండును. దానికి 'చేయఁగా, చేయుట నిమిత్తము' అనియే ప్రత్యేకతయం దర్థములు. వలయ్యాది యోగమున నది భావార్థకము. | గెయ్య. గెయ్యల్. గెయ్యె | మళ్ప్వని=(చేయుట) (వర్తమానమందును). మళ్తిని = (అద్యతనభూతము). మళ్తిదిని=(సంపూర్ణ హేతుమద్భూతము. = (చేసియుండియుండుట). మళ్పెరె = చేయుట). రెండవ భావార్థకము (supine) | | తమిళ మలయా ళాంధ్ర కన్నడముల యీ భావార్థక రూపములు సరికావు. (చూడు ౧౩౭ I విష. మొ. ౧౩౭ VI విష. వఱకు.) తమి. తల్-అల్ తెల్గున - ట - కన్న - ట-మొ. భావార్థక ప్రత్యయములు. |

"వ్యతిరేకార్థక రూపములు. ౧౮౦ VI విష:—

(ఈ రూపము లన్నికాలములందును దుల్యముగనె యుండును. కాని ప్రాయికముగా భావ్యర్థము తోఁచుచుండును)

| ఇంగ్లీషు | తమిళము | మలయాళము | తెలుంగు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| I do not, I did not or will not do. (నేను చేయను. మొ.) | సెయ్యేన్ | చెయ్యేన్ | చేయను | గెయ్యెం | | | |
| Thou—డిటో | సెయ్యాయ్ | చెయ్యా (Imperso-nal=వ్యక్తిని బోధింపనిది) | చేయవు | గెయ్యాయ్ | | | |
| He—డిటో | సెయ్యాన్ | చెయ్యాన్ | చేయఁడు | గెయ్యం | | | |
| She—డిటో | సెయ్యాళ్ | చెయ్యాళ్ | చేయదు | గెయ్యాళ్ | | | |
| It—డిటో (కాల్డు. ౫౬౦ పుట.) | సెయ్యాదు, సెయ్యా | చెయ్యా (Impers.) | చేయదు | గెయ్యాదు | | | |
| We do not-did not or will not do. (మేము చేయము మొ.) | సెయ్యోమ్, సెయ్యేమ్, సెయ్యామ్ | చెయ్యా (Impers.) | చేయము | గెయ్యెమ్ గెయ్యెవ | | | |
| Ye—డిటో | సెయ్యీర్ | చెయ్యా (Impers.) | చేయరు | గెయ్యిర్ | | | |
| Persons—They—డిటో | సెయ్యార్ | చెయ్యార్ | చేయరు | గెయ్యార్ | | | |
| Things—They—డిటో | సెయ్యా, సెయ్యావన | చెయ్యా (Impers). | చేయవు | గెయ్యవు | | | |

వ్యతిరేకార్థకరూపములు. ౧౮౦ VI విభ:—

| ఇంగ్లీషు | తమిళు | మలయాళము | తెల్గు | కన్నడ | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| | వ్యతిరేక క్త్వార్థకము (Negative verbal participle). | | | | | | |
| Not doing, not having done, or Not being about to do. | సెయ్యా. సెయ్యాదు. సెయ్యాదే. సెయ్యామల్. | చెయ్యా. చెయ్యాద్. చెయ్యాదె. | చేయక. | గెయ్యదె. | మల్పన్దె | కెయతె. | |
| | వ్యతిరేకార్థక సంబంధార్థక క్రియాజన్య విశేషణము=(Negative relative participle). | | | | | | |
| That does not, did not, or will not do. | సెయ్యా సెయ్యాద | చెయ్యాద. చెయ్యాదె. చెయాత్త. | చేయని. | గెయ్యద. | మల్పన్ది | కెయత. | |
| | వ్యతిరేక విధ్యాద్యర్థకము=(Negative imperative). | | | | | | |
| Do not thou. | సెయ్యాదే. సెయ్యేల్. సెయ్యల్. సెయన్మో. సెయఱ్క. (లకారమునకు 'న్-ఱ్' అనునవి సంధిలో వచ్చును.) | చెయ్యాయ్క. (Deprecative also infinitive = (వ్యతిరేక భావార్థకము సయితము). | చేయకుము చేయకుమో చేయక. | — | — | — | తెల్గున 'చేయకుమో' అనెడి 'ఓ' కార ఘటిత విధ్యాద్యర్థకము వాడఁబడదు. 'చేయక' అనునది వ్యతిరేక క్త్వార్థకము. దీని చోట 'చేయకు' అనెడి లుప్త 'ము' వర్ణక రూప ముండనగును. |
| (కాల్డు. ౫౬౧ పుట.) Do not ye. | సెయ్యాదే. సెయ్యామిన్. సెయన్మిన్. సెయఱ్పీర్. సెయఱ్క. | చెయాయ్విన్ | చేయకుఁడు చేయకండి. | — | — | — | 'చేయకండి' అనునది తెల్గున వ్యావహారిక రూపము. |

"వ్యతిరేకార్థక వర్తమానరూపములు. ౧౮౦ VII విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళ | తెల్గు | కన్నడ | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| I do not, | సెయ్గిన్డ్రిలేన్ = (సెయ్గిన్డ్ర + ఇలేన్) (నేను జేయుచుండ లేదు ము.) | చెయ్యాయిన్ను (Impers.) | — | — | మళ్పుజి | కెయ. కెయులె. (భావ్యర్థ ముందును) | |
| Thou doest not, | | | — | — | మళ్పుజ | | |
| He does not, | డిటో | డిటో | — | — | మళ్పుజె | | |
| She does not, | డిటో | డిటో | — | — | మళ్పుజల్ | | |
| It does not. | డిటో | డిటో | — | — | మళ్పుజి | | |
| We do not | డిటో | డిటో | — | — | మళ్పుజ | | |
| Ye do not | డిటో | డిటో | — | — | మళ్పుజర్ | | |
| Persons They do not | డిటో | డిటో | — | — | మళ్పుజెర్ | | |
| Things They do not | డిటో | డిటో | — | — | మళ్పుజ. | | |
| | ఇది యొక సమాసము. ఇందలి వ్యతిరేకార్థకమగు నంగము 'ఇలేన్-(లేక) ఇలన్' అను ప్రత్యయ సహిత నామవాచకము. దీని నెల్ల పురుష వచనములందును బ్రత్యయ యోగము గల యితర నామవాచకములను వలెనె వాడుదురు. | | | | | | |

"వ్యతిరేకార్థక భూతార్థకరూపములు. ౧౪౦ VIII విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళ | తెలుగు | కన్నడ | తుళు |  | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|---|
|  |  |  |  |  | అనద్యతన | అద్యతన |  |  |
| I did not | సెయ్దిలేన్ = (సెయ్దేన్ + ఇలేన్) (నేను జేయ లేదు. మొ.) | చెయ్యాఞ్ఞు (Impersonal) = వ్యక్తిబోధ చేయనిది | — | — | మళ్తిజి | మళ్త్'దిజి | కెజ్జిలె |  |
| Thou didst not | డిటో | డిటో | — | — | మళ్తిజ | మళ్త్'దిజ | డిటో |  |
| He did not | డిటో | చెయ్యాఞ్ఞాన్ | — | — | మళ్తిజె | మళ్త్'దిజె |  |  |
| She did not | డిటో | చెయ్యాఞ్ఞాళ్ | — | — | మళ్తిజళ్ | మళ్త్'దిజళ్ |  |  |
| I did not | డిటో | చెయ్యాఞ్ఞు (Impers.) | — | — | మళ్తిజి | మళ్త్'దిజి |  |  |
| (కా. ౫౬౨ పుట.) |  |  |  |  |  |  |  |  |
| We did not | సెయ్దిలేమ్ (మేము చేయలేదు) | ,, | — | — | మళ్తిజ | మళ్త్'దిజ |  |  |
| Ye did not | డిటో | డిటో | — | — | మళ్తిజర్ | మళ్త్'దిజర్ |  |  |
| Persons They did not | డిటో | చెయ్యాఞ్ఞార్ | — | — | మళ్తిజెర్ | మళ్త్'దిజెర్ |  |  |
| Things They did not | డిటో | చెయ్యాఞ్ఞు (Impers). | — | — | మళ్తిజ | మళ్త్'దిజ |  |  |

"వ్యతిరేక భావ్యర్థకరూపములు. ౧౭౦ IX విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళము | తెల్గు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| I will not do | సెయ్యలేన్ = (నేను జేయను) | చెయ్యాయుమ్ చెయ్యాయు (Impers.) | — | — | మళ్పయె | కెయ కెయలె (వర్తమానము నిల్లె) | |
| Thou wilt not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పయ | డిట్టో | |
| He will not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పయె | డిట్టో | |
| She will not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పయాళ్ | డిట్టో | |
| It will not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పన్డ్ | డిట్టో | |
| We will not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పయర్ | డిట్టో | |
| Ye will not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పయర్ | డిట్టో | |
| Persons They will not do | డిట్టో | డిట్టో | — | — | మళ్పయెర్ | డిట్టో | |
| Things They will not do (కాల్డు. ౫౬3 పు.) | డిట్టో | డిట్టో | — | — | మళ్పయ | డిట్టో | |

"వ్యతిరేక క్త్వార్థకరూపములు. ౧౪౦ X విష:—

| ఇంగ్లీషు | తమిళము | మలయాళము | తెల్గు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| వర్త.<br>Not doing<br>భూత.<br>Not having done<br>భావి.<br>Not being about to | See Neg. Aorist<br>(చేయుచుండక)<br><br>(చేసియుండక)<br><br>(చేయనుండక) | See Neg. Aorist<br><br>చెయాఞ్ఞు<br><br>చెయ్యాయ్‌వాన్ | | | See Neg. Aorist<br>"<br>" | See Neg. Aorist<br>"<br>" | 'See Neg. Aorist' అనగా ౧౪౦ VI విషయము [illegible] |

"౧౪౦ XI విష:—వ్యతిరేకార్థక సంబంధార్థ కాలత్రయ క్రియాజన్య విశేషణములు (Negative relative participles).

| ఇంగ్లీషు | తమిళము | మలయాళము | తెల్గు | కన్నడము | తుళు | కూర్గు | విమర్శము |
|---|---|---|---|---|---|---|---|
| వర్త.<br>That does not do<br>భూత.<br>That did not do<br>భావి.<br>That will not do<br>(౫౬౮ కాల్డు.) | See Neg. Aorist<br>(చేయుచుండని)<br>"<br>(చేసియుండని)<br>"<br>(చేయనుండని) | See Neg. Aorist<br><br>"<br>చెయ్యాఞ్ఞ<br>See Neg. Aorist | | | See Neg. Aorist<br>"<br>" | See Neg. Aorist<br>"<br>" | |

VI క్రియాప్రకరణము ముగిసెను.

# ద్రావిడభాషా పరిశీలనము

## VII ప్రకరణము

శబ్దసామ్యము=(Glossarial affinities)

౧౮౧. I విష:—"శబ్దతత్వ శాస్త్రమునందు భాషాభాగముల పరస్పర సంబంధమువంటి ప్రాధాన్యము శబ్దసామ్య విమర్శమునకు (Glossarial affinities) లేదు. శబ్దములు వ్యవహార వశమున మాఱుటలో మొట్టమొదటి యాకారము నర్థమును మఱచునంతటి యవస్థ సంభవించును. అట్టి మార్పు శబ్దావయవ మందుఁ గల్గునేకాని సుప్ తిజ్ ప్రత్యయములందుఁ గల్గదు. ఇండోయూరపి యను మూల భాషతో ద్రావిడ భాషలోని వాడుకలకుఁ గొంత విదూరమగు పోలిక గలదు గాని సిథియను భాషలలోని 'ఉగ్రియను' శాఖతో ముఖ్యముగను, దక్షిణ సిథియను భాషలతో సామాన్యముగను సంబంధము మిక్కిలి సన్నిహితమై స్పష్టమై వెలయుచున్నది" (కాల్డు. ౫౬౫ పుట).

### ఇండో యూరపియను భాషలతోడి సామ్యము.

#### I భాగము.

"౧. ద్రావిడ భాషలలోనుండి సంస్కృతము తీసికొన్న శబ్దాదులు:— 'ట ఠ డ ఢ ణ ర ష' అనునవి సంస్కృతములోనికి ద్రావిడ భాషలలోనుండి వచ్చెనను విషయము ధ్వనిప్రకరణమున విమర్శించి యున్నాను" (కాల్డు. ౫౬౫ పుట). (చూడుు ౨౦ విష.)

"శబ్దసామ్యము కనఁబడునపుడు సంస్కృతమునుండి యాయా శబ్దములు ద్రావిడ భాషలలోనికి వచ్చెనని చెప్పుట యొక యలవాటై యున్నది. అది నిజమెకాని ద్రావిడ భాషలనుండి సంస్కృతములోనికి వచ్చిన శబ్దములును ననేకములు గలవు. ద్రావిడ వైయాకరణులు సంస్కృత సంబంధములేని దేశ్యమును వేఱుభాగముగా నేర్పఱిచినట్లుగ సంస్కృత శాబ్దికులు సంస్కృతేతర శబ్దములు దేశ్యము లనుచు విభాగించి యుండలేదు. "దెనరి అస్-హెూరా-లెప్తన్" మున్నగు పదములు గ్రీకు రోమను భాషలనుండి సంసకృతమునకు వచ్చినవి. (దెనరి అస్=సంస్కృ-దిన. హెూరా=సంస్కృ-జ్యౌతిషము. లెప్తన్=సంస్కృ-లిప్త). అట్లె రాశుల పేర్లు సైతము (Zodiac) గ్రీకునుండియే

సంస్కృతమునకు వచ్చెను. ఇట్లే కొన్ని శబ్దములు ద్రావిడ భాషలనుండి సంస్కృతమునకు వచ్చిన వనుటలో విప్రతిపత్తి యేమి" (కాల్డు. ౫౬౫, ౫౬౬ పుటలు).

"ద్రావిడ భాషలనుండి సంస్కృతములోనికి వచ్చిన శబ్దముల నూహించు పద్ధతులు:—

i సంస్కృతమున ధాతువుగాని తజ్జన్య శబ్దప్రపంచముగాని లేక శబ్ద మొంటరిగ నుండుటయు, ద్రావిడ భాషలలో నద్దానికి, ధాతువును దజ్జన్య శబ్ద ప్రపంచమును నుండుటయు, దాని కితర ద్రావిడ శబ్దములతోడి సంబంధమును సాదృశ్యమును నుండుటయు, నది ద్రావిడ శబ్దమని నిశ్చయించుట కుపపత్తు లనఁదగును.

ii. ఒక శబ్దమునకు సంస్కృతమున ననేక పర్యాయ శబ్దములుండుటయు ద్రావిడ భాషలలో నట్లు లేకుండుటయు నొక యుపపత్తియె.

iii. ఒక శబ్ద మితరములగు నిండో యూరపియను కుటుంబ భాషలలో నెందును లేకుండఁగా నొక్క సంస్కృతమం దుండుటయు ద్రావిడ భాషలలో నెల్ల నయ్యది యేదో యొక రూపముతో వెలసి యుండుటయు నద్దాని ద్రావిడత్వమునకు హేతు వనఁదగును.

iv. శబ్దమునకు సంస్కృతమున సరియగు వ్యుత్పత్తి లేకుండఁగా ద్రావిడ భాషలందు సరియగు నిరుక్తి చూపట్టుటయు నయ్యది ద్రావిడ శబ్దమనుటకుఁ గారణము కాఁగలదు.

v. శబ్దార్థము సంస్కృత ధాత్వర్థమునకు సరిగ నుండకుండఁగా ద్రావిడ భాషలలోని ధాత్వర్థమునకు సరియై యుండుటయు దాని ద్రావిడత్వమును నిరూపింపఁగలదు.

vi. సంస్కృత పండితులే దేశ్య శబ్దమని కొన్ని యెడల వచించుటయుఁ గలదు" (కాల్డు. ౫౬౬, ౫౬౭ పుటలు).

విమర్శము:—ఇట్టి పద్ధతులతో డా. కాల్డువెల్లుగా రిండోయూరపియను భాషలతోను నందు ముఖ్యముగా సంస్కృతముతోను సిథియను భాషలతోను నందు ముఖ్యముగా 'ఉగ్రియను' శాఖతోను ద్రావిడ భాషలకుఁ గల శబ్దసామ్యమును మిక్కిలి విస్తృతముగఁ బరిశీలించిరి.

I. భాగము (Section):—(Third edition. ౧౯౧౩ క్రీ. శ.) ౫౬౭ పుట మొదలు ౫౯౭ పుట వఱకు ద్రావిడ శబ్దములతోడ సంస్కృత శబ్దములకుఁ గల శబ్ద సామ్యము. విమర్శింపఁబడెను. అందు మొదట ముఖ్యముగ

ద్రావిడ భాషలనుండి సంస్కృత భాషలోఁ బ్రవేశించిన శబ్ద జాలము ప్రదర్శింపఁ బడెను.

౫౮౭ పుట మొదలు ౬౦౫ పుట వఱకు ద్రావిడ భాషలతోడి సంస్కృతేతరములగు నిండోయూరపియను భాషల శబ్దముల సామ్యము పరిశీలింపఁబడెను.

II. భాగము=(Section):—౬౦౫ పుట మొదలు ౬౯౯ పుట వఱకుఁ సెమెటికు భాషల శబ్దములతోడి ద్రావిడ శబ్దముల సామ్యము పరిశీలితమయ్యెను.

III. భాగము=(Section):—౬౧౦ పుట మొదలు ౬౨౪ పుట వఱకు ద్రావిడ భాషలతోడి సిథియను భాషల శబ్ద సామ్యము పరిశీలింపఁబడెను. (పిదప ౬౩౫ వఱకు 'తుద' మున్నగు ననాగరక ద్రావిడభాషల విశేషములనెడి యనుబంధము. అంతతో గ్రంథము ముగిసినది.)

౧. అందు ద్రావిడ శబ్దములనుండి సంస్కృతమునఁ జేరిన శబ్దముల విషయమున నీ క్రింది రీతి వ్రాయఁబడెను.

౧౪౧. II విషయము:—"౧. అక్కా శబ్దము:—అక్కా=(తల్లి). (చూడు సిథియను సామ్యములు.) విలియమ్ దొరగారి సంస్కృత కోశమున నిది విదేశ శబ్దముగ నిరూపింపఁబడెను.

౨. అత్తా శబ్దము:—అత్తా=(తల్లి-అక్క-పెద్ద తల్లి) (చూడు సిథియను సామ్యములు.) విలియమ్ దొరగారి సంస్కృత కోశమున నీ శబ్దము దక్కను ప్రాంతమునుండి వచ్చినదని వ్రాయఁబడెను.

౩. అటవీ శబ్దము:—"అటవీ=(అడవి). 'అట్' ధాతుజన్యమనియు, జనులు-మృగములు తిరిగెడి ప్రదేశమని యర్థమనియుఁ జెప్పుదురు. 'అడ్' అను ద్రావిడ ధాతువునకు సామీప్య మర్థము. తమి-అడర్=(గుమిగూడు, అడవి చెట్లవలె దట్టముగాఁ బెరుఁగు) దీని తుది 'వి' అను దానిని 'కేల్వి'=(వినుట) అను దానితోఁ బోల్చి చూచునది" (కాల్డు. ౫౬౭ పుట).

విమర్శము:—అటవీ శబ్దవ్యుత్పత్తి దొరగారు వ్రాసినంత బలహీనముగా లేదు. "అట న్త్యస్యాం మృగయార్థ మి త్యటవీ.=(వేఁటకై జనులు దీనియందు సంచరింతురు)" (లింగా. ౨౩౫ పుట.) "అటవి-(వీ)" అటన్తి చరమే వయసి యత్ర"=(వార్ధకమున వానప్రస్థాశ్రమమువారు మునులు దీనియందు సంచరింతురు. (శబ్దస్తో). 'అడ్' అను ధాతువును దొరగారు చూపిరే కాని ప్రాచీన తమిళమున సరళోచ్చారణమె లేదు. కాన సంస్కృతమందును దమిళమందును నొక్కటే 'అట్' అనునదే ధాతువు.

౪. "ఆణి=అణి=(బండి చీల). ఇది 'అణ్' (శబ్దించు) అను ధాతువునుండి వచ్చినదని సంస్కృత పండితులు చెప్పుదురు. తమిళమున 'ఆణి'=(చీల-మేకు-గూటము) అను శబ్దమున్నది. దీనిని సంబంధించిన యర్థ విశేషములందలి వాడుకలును గలవు. "తమి-అణ్ + ఐ=(కౌఁగిలించుకొను-తగులుకొను). అణ్+ఉ=(తాఁకు) మున్నగు పెక్కు శబ్దములు గలవు. కాన నిది ద్రావిడ శబ్దము" (కాల్డు. ౫౬౮ పుట).

విమర్శము:—పయి రీతులు సంస్కృతమందును గలవు. 'అణ్' ధాతువు సంస్కృతమందును గలదు. 'అణక-అణు' మున్నగు పెక్కు తత్సంబంధి శబ్దములును సంస్కృతమునఁ గలవు. "......అక్షాగ్ర । కీలకే తు ద్వయో రణిః" (అమరకోశము). "అణతి శబ్దాయతే ఇత్యణిః-పు-ఇ-అణ=శబ్దే=(రథగమన సమయమున బిగువుచేత 'చీల' శబ్దించునని యర్థము). పాఠా-ఆణిః-"సీమ వృక్షాగ్ర కీలేషు । ద్వయో రాణి రణి స్తథేతి రుద్రః." (అక్షాగ్రమనఁగా 'ఇరుసు', దాని చివరయందు బండి కండ్లు జాఱకుండుటకై వేయు చీల యని యర్థము) (లింగా. ౫౦౦ పుట). ఇరుసు తుది నుండున దను నర్థముచేత దీనికి "సీమ=ఎల్ల" అను గౌణార్థము గల్గెనని యరయునది.

"అణ=శబ్దే. భ్వాదిః పరస్మై-సకర్మక-సేట్-అణతి=(శబ్దించుచున్నాఁడు) ఆణీత్=(శబ్దించెను).

"అణక=అనక-త్రి. అణతి యథేచ్ఛం నదతి. (ప్రేలరి.) అధమే-నిన్ది తేచ-దన్త్య మధ్యశ్చాయమ్" (శబ్దస్తో). 'అధమా'ద్యర్థములు 'ప్రేలరి' అను దాని నుండి గౌణముగా లభించినవి. అట్లే 'అల్ప-సూక్ష్మ' అను నర్థముల ద్వారాగా, 'అణు'=(పరమాణువు) అనియు నేర్పడెను. అట్లే 'అణి' శబ్దము సూచ్యగ్రభాగమునకును వాచకమగుచున్నది.

"అణవ్య-త్రి-అణ=శబ్దే — ఉన్-అణు. యత్ ప్రత్యయః. సూక్ష్మ ధాన్యక్షేత్రే" (శబ్దస్తో).

"అణి-పుం-స్త్రీ. అణతి=శబ్దాయతే. అణ+ఇన్......రథ చక్రాగ్రస్థితే కీలకే. సూచ్యా అగ్రభాగే. స్త్రీత్వే వా జీప్. అ త్రాదే ర్దీర్ఘ తాపీష్యతే. తేన-ఆణిః-ఆణీ" (శబ్దస్తో).

ఇట్టి స్థితిలో నిది ద్రావిడశబ్దమే యనియు ద్రావిడభాషలనుండి సంస్కృతమునకు వచ్చెననియు డా. కాల్డువెల్లుగారు వ్రాయుట సాహసము.

౫. "అమ్మా-అమ్మ=(తండ్రి, తల్లి). దీని సంబోధనరూపము అమ్మె=అమ్మ. ప్రాచీనమగు శిష్ట వ్యవహారపు 'జర్మనీసన్' భాష-అమ్మ. ఐసలెండు-

అమ్మ=(అవ్వ.) జర్మనుభాష-అమ్మె=(దాది). కాని ద్రావిడభాషలం దీ మాటను సంబంధించిన శబ్దముల ప్రాచుర్యమునుబట్టి యిది ద్రావిడశబ్దమె యని నా యభిప్రాయము. (చూడు సైతోయిండియన్=సిథియన్-ఇండియన్. స్వభావముల భాగము.” (చూ. కాల్డు. ౬౧౦ పుట)” (కాల్డు. ౫౬౮ పుట).

విమర్శము:—“అమ్బ్యతే స్నేహేన ఉపగమ్యతే = అమ్బా-మాతరి” (శబ్దస్తో). ‘అమ్బగతౌ’ అను ధాతువునుండి యేర్పడినదని యెన్నవగును. “అమ్బకాది శబ్దములు పెక్కు దీనికి సంబంధి శబ్దములు గలవు. సంస్కృత మున దీనికి ‘తండ్రి’ అను నర్థము కానరాదు. దీనికిని సంస్కృతమున నతి ప్రచురమగు వాడుక గలదు. ఇండోయూరపియను భాషలందును దీని వాడుకను దొరగారె యుదాహరించిరి. ఇట్టి స్థితిలోనిది ద్రావిడశబ్దమె యనుట యెట్లు?

౬. “ఆలి=(చెలి-సఖి). తెల్గున ‘ఆలి’=(భార్య) ఆలు=(ఒక స్త్రీ ప్రత్యయము.) గోండుభాషలో ‘ఆలీ’=(భార్య)” కాల్డు. ౫౬౮ పుట).

విమర్శము:—సంస్కృతమున ననేకార్థములు గలవుగాని దీనికి భార్యా ర్థము లేదు. తెల్గున ‘ఆలి’=(భార్య) అనునది వ్యావహారిక శబ్దము. ‘ఆలు’ అననదే గ్రాంధికరూపము. ప్రాచీనము. తెల్గున దీనికి ‘స్త్రీ’ అనునర్థమును గలదు. అర్థ పరిణామక్రమమును బరిశీలించినవు డిది సంస్కృతమునుండియె ద్రావిడ భాషలకు వచ్చెనని తోఁచును. “వానియాలి=వానిచెలి. వాని యాలి=వాని స్త్రీ” అనువానినుండి ‘వాని భార్య’ అను నర్థము వచ్చెనా యని తోఁచును. ‘ఆలి’ శబ్దమునకు మొదటి యర్థము ‘చెలికత్తె’ అనునదె-“అలతి= భూషయతీ త్యాలిః. ఆలీ. ‘అల=భూషణే’ అలంకారాది శబ్దములు దీనికి సంబంధ పదములు. “ఆలి=ఆలీ. ఆ+అల+ఇన్......సేతౌ. సఖ్యామ్- పఙ్క్తౌ-ఆరామాది వృత్తిశ్రేణ్యామ్-సంతతౌచ. వా జీప్. శుద్ధాన్తఃకరణే- అత్యర్థే-త్రి-భ్రమరే. వృశ్చికేచ. పుం.” (శబ్దస్తో).

౭. “కటు=కటుక=(చుఱుకైన భయంకరమైన-కారము గల్గియుండు.) ఇది ‘కట్’=(పోవు) అను ధాతువునుండి వచ్చినదందురు. బూలరు దొరగా రిది ‘కృత్’=(కర్తనము) అను ధాతువునుండి పుట్టిన దనిరి. తమి-“కడ్+ఉ=కడు= (వాఁడిగానుండు)” అను ధాతువు గలదు. ఇదియొక ధాతు కుటుంబములోనిది. దీని కుటుంబము:—కడ్+ఉ+గు=(త్వరపడు), కడ్+ఇ=(కోయు, నిందించు), ‘కడ్+ఇ’=(కొఱుకు-కఱచు), ‘కడి=కఱి’=(కూర) ‘కడుకడు’=(అనుకరణ శబ్దము-మిక్కిలి కోపముగా నుండు) ‘కాడు = కడమ్=కడఱు’=(అడవి). కడుగు=(ఆవాలు). ‘కడు+గు’ అనురీతి నిది క్రియాంగము” (కాల్డు. ౫౬౮ పుట.)

విమర్శము:—"కటతి = ఆవృణోతి రోగ మితి కటుః. ఉ. స్త్రీ...... కళే వర్షావరణయోః=(రోగము నడఁగించునది) 'రసే కటుః క ట్వకార్యే త్రిషు మత్సర తీక్ష్ణయోః" (లింగా. ౨౮౨ పుట).

"కటతి=ఆవృణోతీతి కటుః=(కారము పేరు)" (లింగా. ౧౧౬ పుట). "తక్కినవాని నడఁచి యావరించునది" అను నర్థమునుబట్టి దాని యితర గౌణార్థము లేర్పడినవి. తమిళమందలి 'కడు-కడి' మున్నగువాని యర్థముల కింతటి యర్థము కానరాదు. ప్రాచీన తమిళమందు పరళోచ్చారణము లేమింజేసి 'కట్' అనునదే ధాతువని యంగీకరింపక తీరదు. ద్రావిడభాషలవారికిని సంస్కృతభాషవారికిని గల సంబంధాతిశయముచే నిట్లుగ నభిన్న శబ్దములు రెండిటియందును ననేకములు పొడచూపుచున్నవని యెన్ననగును. కటుకాది శబ్దములు దీనికి సంబంధిపదములైయున్నవి. 'కటుక.....రాజసర్షపే'=(మంచి యావాలు) (శబ్దస్తో).

౮. "కలా=చతుష్షష్ఠి కళలు. 'కల్=(శబ్దించు-లెక్కించు)' అను ధాతువునుండి యీ శబ్దము పుట్టినదని సంస్కృత పండితు లందురు. కాని-'కల్=(నేర్చికొను)' అను ప్రాచీన ద్రావిడ ధాతువునుండి 'కలా=కల' శబ్దము పుట్టియుండు ననుటకు సందేహము లేదు. దీనినుండి 'కల్వి=(విద్య)' అనునది యేర్పడియుండును. సంస్కృతమున నీ 'కలా' శబ్దమునకుఁ గల యితరార్థముల కును నీ విద్యాపరార్థమునకును సంబంధములేదు. అట్టి యర్థాంతరములు గల 'కళా' శబ్దము వేఱు. ధ్వనిసామ్యమున నేకశబ్దతాభ్రాంతి గల్గినది" (కాల్డు. ౫౬౮ పుట).

విమర్శము:—ప్రాచీన సంస్కృతమున లఘ్వలఘు లకారభేదములేదు. అట్టి యలఘు లకారోచ్చారణ మర్వాచీనము. ప్రాతిశాఖ్యములలో నలఘు లకారధ్వని చెప్పఁబడలేదు. కావున 'కలా=కళా' శబ్దములు భిన్నములు కావు.

పరిశీలింపఁగా 'కల్=(నేర్చికొను)' అను ద్రావిడ ధాతువు పై సంస్కృత కలధాతువునకు భిన్నము కాదని తోఁచుచున్నది. 'కల'—అను భ్వాది ధాతువునకు "కల=శబ్ద సంఖ్యానయోః" అను చోప్పున 'శబ్దే' అను నర్థమును గలదు. కావున 'కళా' శబ్దమునకుఁగల 'చతుష్షష్ఠి కళలు' అనెడి యర్థమునుబట్టి సంస్కృత ధాతువునకును 'నేర్చికొను' అను నర్థము గలదని యూహింపనగును. అభ్యాస వశముననే కదా చతుష్షష్ఠి కళలు నలవడును. ప్రాచీనకాలమున నార్యులును ద్రావిడులును గలసిమెలసి వసించువారనియు నింకను నభిన్నులెవ్వైనం గావచ్చుననియుఁ జరిత్రకారులు—విశేషించి కాల్డువెల్లుగారే—చెప్ప

చున్నారు. (చూడు ౧౮౧ V విష. 'కెయ్-చెయ్' శబ్దములు.) మఱియు దీని చంద్ర కళాద్యర్థములు కొన్ని విద్యా విశేషార్థమునుండి గౌణముగా లభింపఁ దగినవే. విద్యవల్లఁ గీర్తికిఁ గాంతి యతిశయించును గదా.

"౯. "కావేరీ=కావేర్+ఇ=(కావేరీనది-పసుపు). ("ప్రాచీన వాఙ్మయమున 'కావిరి' అనియే యున్నది. కా=ఉద్యానము" శ్రీ రెడ్డిగారు) గ్రీకు-కబేరస్. ఇది సంస్కృతమునుండి వచ్చియుండును. కాని మార్గాంతరమునను వ్యుత్పత్తి చెప్పవచ్చును. దీనికి 'కవ్=(రంగువేయు)' అను ద్రావిడ ధాతువు మూలమనవచ్చును. 'కావి+ఏరు (కావిరంగుగల నీరు గలది)'. తమి-ఏర్=నీటి వైపుల్యము. ("'కవ్' అను ధాతువే లేదు" శ్రీ రెడ్డిగారు) కా+వు=(కుంజము=పొద). త్రిచినాపల్లిలోని యీ నదియొడ్డున నొక 'గుడి' కలదు. దానిపేరు 'తిరు+ఆనై+కా-తిరువానైకా-=(ఏనుఁగును సంబంధించిన పొద).' ఇది యింకొక మార్గము" (కాల్డు. ౫౯౯ పుట).

విమర్శము:—ద్రావిడ భాషలలో 'ఏఱు=(నది)' శబ్దము 'ఱ'కార ఘటితము. కాన 'కావి+ఏర్+ఇ' అను వ్యుత్పత్తి సరికాదు. నేఁటి రేఫ ఱకారముల లఘ్వలఘుతామాత్ర భేదమున నిట్టి భ్రమ దొరగారికిఁ గల్గినది. ప్రాచీన కాలమున 'ఱ'కారము 'ట త' మధ్యస్థోచ్చారణము గల్గియుండెను. (చూడు ౧౭ XIII విష). ఇట్లగుటచే నిది ద్రావిడశబ్ద మనరాదు. "కవేర పర్వతాత్ప్రభవతీతి కావేరీ. కవేరస్య రాజ్ఞోఽపత్యం స్త్రీ-కావేరీ" (లింగా. ౧౯౭ పుట).

"కావేరీ-స్త్రీ-కస్య=జలస్య, వేరమ్=శరీరమ్. తస్యేద మిత్యణ్. సరిద్భేదే. కుత్సితమ్=అపవిత్రమ్, వేరమ్=శరీరమ్, యస్యాస్సా=కావేరీ=వేశ్యాయామ్. హరిద్రాయామ్." (శబ్దస్తో).

౧౦. "కుటి='కుటిర=కుటీర=కుటేర' అను రూపాంతరములు గలవు. 'గుడిసె=క్షుద్రగృహము' అని యర్థము. కుటుమ్బ' శబ్దము సయితము దీనిని సంబంధించినదె. 'కుట్=కుటిల=వక్ర' అను ధాతువునుండి వచ్చెనని సంస్కృత పండితులు చెప్పుదురు. 'కుట్+అమ్=కుటమ్=కుడమ్' = (కుండ) అనునది యేర్పడెననుటయు సరియె.

తమిళమున 'కుడి=(ఇల్లు)' అను శబ్దము గలదు. ఇది 'కూడ్=(కలిసి యుండు)' అనుదాని సంక్షేప రూపమగు 'కుడ్' అనుదానినుండి వచ్చె ననఁ దగును. 'కుడిల్=కుడిస్సై=(గుడిసె)' అనియుఁ దమిళమునఁ గలవు. తెలుఁగున 'గుడిసె' అని యున్నది. తెలుఁగున 'గుడి'=(దేవాలయము) అను శబ్దమును గలదు. కన్నడమున 'గుడసల్+ఉ=(గుడిసె)' అను శబ్దము గలదు. ఇది

ఫిన్నిషు భాష లన్నిటియందును గలదు. కాన నిది సంస్కృతముననుండి వచ్చె ననరాదు. ఉదా:—ఫిన్నిషు-'కొటు', చెరిమిస్-'కుడ', మార్డ్విన్-'కుడొ' ఓస్తియకు భాష 'చొట్'. ట్యుటానికు భాషలలోని 'కట్-కటే' మొదలైనవి పయి సిథియను భాషలనుండి వచ్చెనేమో?" (కాల్డు. ౫౬౯ పుట).

విమర్శము:—"కుటతి=కుటిలీ భవతీతి=కుటీ. 'కుట కౌటిల్యే'." (లింగా. ౨౨౦ పుట). 'గుడిసెలు' (చిన్న పాకలు) గుండ్రముగాను వంకరగాను నుండుట సహజము. ప్రాచీన తమిళమున సరళములే లేవు. కాన తమిళ శబ్దము సైతము 'కుటి' అనునదె. ఆర్యులెకాక యితరులగు నిండోయూరపి యనులును సిథియనులును ద్రావిడులును మొట్టమొదట నొక్కట వసించినవారే కదా! కాన వానికిఁ గొన్ని యెడల శబ్ద సామ్య ముండుటలో వింత యేమున్నది?

౧౧. "కుణి=కూణి=(ముణిఁగిన చేయి గలవాఁడు). ద్రావిడ శబ్దమగు 'కూన్'=(గూను) అనుదానితోఁ బోల్చి చూచునది. 'కున్=(వంగు)' అను ద్రావిడ ధాతువు దీనికి మూలము. దీనినుండి యేర్పడినవె సంస్కృత 'కుణి-కూణి' శబ్దములు" (కాల్డు. ౫౭౦ పుట).

విమర్శము:—"కూణ-సంకోచే—అదాది - చురాది......కూణయతి = కూణయతే.=(ముణుఁగుచున్నది.) అచుకూణత్=(ముణిఁగెను)" (శబ్దస్తో) అను ధాతువు సంస్కృతమునఁ గలదు.

"కూణి=కూణ+ఇన్=రోగాదినా సంకుచిత కరాదౌ జనే." (శబ్దస్తో). "కూణికా - స్త్రీ-శృఙ్గే-కలికాయామ్. వీణా మూలస్థ వంశ శలాకాయామ్" (శబ్దార్థ చింతామణి).

పయి యర్థములెల్ల ధాత్వర్థీభూత సంకోచార్థ మూలకములె యను టకు సందేహము లేదు. ఇట్టి స్థితిలో నిది ద్రావిడ శబ్దమె యనుట యెట్లో తెలియకున్నది.

౧౨. "కూల=(కొలను-గట్టు). 'కూల్+అ' = (కప్పుట) అనుదాని నుండి వచ్చెనని సంస్కృత పండితు లందురు. తమిళ మలయాళములలోని 'కుళ్+అమ్=(సరస్సు)' అనుదానితోను తెలుఁగులోని 'కొల్+అను=(సరస్సు)' అనుదానితోను దీనిని సరిపోల్చి చూడనగును. 'కుళ్+అమ్' అనునది శుద్ధ ద్రావిడ ధాతువగు 'కుళ్+ఉ=(చలిగా నుండు)' అను ధాతువునుండి పుట్టిన 'కుళ్+ఇ=(స్నానము చేయు)' అను శబ్దమునుండి నిష్పన్నమైనది" (కాల్డు. ౫౭౦ పుట).

విమర్శము:—'కూల' అను సంస్కృత శబ్దమునకు 'సరస్సు-నది మున్నగు వాని గట్టు' అని యర్థము. 'కొళమ్=కొలను' అను ద్రావిడ శబ్దములకు

'సరస్సు' అని యర్థము. ఇట్టివి విభిన్న శబ్దములు. కాన వీని నిందుఁ జేర్చి విమర్శించుట యప్రసక్తము. సంస్కృతమున 'కూలఙ్కషా' అనుదానికి 'నది' యని పేరు. (కూలమ్=గట్టును, కషా=ఒరయునది). ఇక్లై సరస్సులోని జల మును గట్టు నొరయు ననఁదగును. "కూలఙ్కష. పు. (కూలంకషతి......) సముద్రే. నద్యామ్-స్త్రీ" (శబ్దస్తో). 'కూల (ల్) ఆ వృతౌ' అను ధాతువు నుండి యిది యేర్పడెను. నది నావరించునదని యర్థము. "కూల. న. కూల+అచ్ =తీరే......" (శబ్దస్తో) (లింగా ౧౮౦ పుట).

౧౩. "కోట్ట=కోట=(కోట-రాజదుర్గము). 'ఇది కుట్ =(వంకరగా నుండు)' అను ధాతువునుండి సంస్కృత పండితులు సాధింతురు. ద్రావిడ భాష లలోఁ దెల్గున-'కోట'-కన్న-'కోటె'-తమి-'కోట్టై' అను రూపములతో నీ శబ్దము వాడఁబడుచున్నది. ఈ యర్థమునందుఁ బ్రాచీన తమిళమున 'అరణ్' అను శబ్దముండుటచేత నీ కోట శబ్దము సంస్కృతమునుండి వచ్చినదని తలంపవచ్చును. అట్టి సంస్కృత శబ్దము తమిళ మలయాళములలోని "కోడ్+ఉ=(గీఁత-చుట్టి యుండు రేఖ-చిత్రము)" అనుదానినుండి వచ్చినదనుట యుక్తము. మలయాళ మున దీనికి 'గోడ చుట్టియుండు పట్టణము' అని కాని, 'బురుజులుండు ప్రాకా రము' అనికాని యర్థము. మల-'కోళికోడు=కలికట్' అనుదానిలోని 'కోడు' అనునది 'కొడుందమిళ్=(వంకరయగు తమిళము)' అనుదానిలోని 'కొడు' అనుదానినుండి యేర్పడినది. 'కోడు' అనునది విశేషణ మగునపుడు 'కోట్టు' అని యగును." (కాల్డు. ౫౭౦ పుట).

విమర్శము:—కోట శబ్దము సంస్కృత శబ్దమే యనియు దానికి మూలము తమిళ 'కోడు' ధాతువనియు నట్టి 'కోడు' అనునది 'కొడుందమిళ్' అనుదాని లోని 'కొడు=(వక్రమగు)' అనుదానికభిన్నమనియు దొరగారు వ్రాయుచున్నారు. ప్రాచీన తమిళమున సరళోచ్చారణము లేమింజేసి (చూడు ౧౭ XXII, XXIII విష.) యది ప్రాచీన తమిళమున 'కోటు=కొటు' అను రూపముగలదే యనక తీరదు. కాన నయ్యది సంస్కృత 'కుట-కౌటిల్యే' అను ధాతువునకు భిన్నము కాదననగును. సంస్కృత కోశములలో 'కుట-కౌటిల్యే' అను ధాతువును దానినుండి యేర్పడిన దుర్గ వాచకములగు 'కుట-కోట' శబ్దములును గలవు. కాని ద్రావిడ భాషలలోని, తెలుఁగు 'కోఁట=కోంట' (ఇది నిర్బిందు వను తెల్గు కోశముల పరిశీలన మూలకములు) = కన్నడ-'కోంటె'-తమి- 'కోట్టై' అను శబ్దములను బరిశీలించునపు డవి (దొరగారు-తెల్గు-'కోట' కన్న- 'కోటె' అని వ్రాయుట పొరపాటు) నిర్బిందుకములగు 'కుట=కోట' అను సంస్కృత శబ్దములనుగాని 'కుటు=కుడు, కొటు=కొడు' అను తమిళ శబ్ద

ములనుగాని సంబంధించునవి కావనియు సంస్కృతములోని 'కోట్ట' శబ్దమును సంబంధించునవనియు గ్రహింపక తీరదు. (చూడుడు ౧౭ XX విష. పట్టిక). 'కో ట్టారఘట్ట హాట్టాశ్చ' (అమర-లింగాను.) అను సంస్కృత దుర్గవాచక కోట్ట శబ్దము 'కుట్ట=ప్రతాపనే' అను సంస్కృత ధాతువునుండి యేర్పడినది.

"కుట్ట ప్రతాపనే. అదాది-చురాది-ఆత్మ-సకర్మ - సేట్ - కుట్టయతే= (తపింపఁ జేయుచున్నాఁడు). అచుకుట్టత=(తపింపఁ జేసెను)" (శబ్దస్తో). ఈ ధాతువు నుండి 'శత్రువులఁ దపింపఁ జేయునది' అను వ్యుత్పత్తిచే 'కుట్ట' అను దుర్గవాచక నామ మేర్పడును. "కోట్ట-పు. కుట్ట ధాతు. ఘఞ్-ని-గుణః- దుర్గే......" (శబ్దస్తో).

౧౮. "ఖట్వా=ఖట్టా=(మంచము). 'ఖట్ = (తెరవేయు = మఱుగు పఱుచు)' అను ధాతువునుండి యేర్పడెనని సంస్కృత పండితులందురు. దీనిని తమిళ మలయాళములలోని 'కట్టు=(బంధించు)' అను ధాతువునుండి పుట్టిన 'కట్+ఇల్=(మంచము)' అనుదానితోఁ బోల్చి చూచునది. 'కట్టు' అనునది ద్రావిడ శబ్దమనుటకు సందియము లేదు. దీనిని సంబంధించిన పెక్కు శబ్దములు ద్రావిడ భాషలలోఁ గలవు." (కాల్డు. ౫౭౦ పుట).

విమర్శము:—"ఖట్యతే = కాంక్ష్యతే=ఖట్వా. ఖట-కాంక్షాయామ్" (లింగా. ౪౩౮ పుట).

"ఖట్వా-స్త్రీ-ఖట-(ధాతు) క్వన్......" (శబ్దస్తో).

"ఖట-కాంక్షాయామ్. భ్వాది. పర. సకర్మ. సేట్......" (శబ్దస్తో).

డా. కాల్డువెల్లుగారు వ్రాసిన "ఖట్ట-వృతౌ=(కప్పు-మఱుఁగుపఱుచు)" అను ధాతువు సంస్కృతమున లేకపోలేదు. కాని 'ఖట్ట' ధాతువునుండి 'ఖట్వా' శబ్ద మెవ్వరిచేతను సాధింపఁబడలేదు. మంచమున కావరించుట యను నర్థమును సందర్భ పడనేరదు. 'ఖట్టా' శబ్దము దోమతెరకు వాచకమని దాని ధాతువుయొక్క సంవరణార్థమునుబట్టి తలంపవగును. మంచమునకు దోమ తెర యుండుట సహజమగుటచేత 'ఖట్టా' శబ్దము దోమతెరగల మంచమునకు వాచకమని దొరగారు తలంచిరేమో?

౧౯. "నానా. దీనికి సంస్కృతమువారు మంచి వ్యుత్పత్తిని జెప్ప లేదు. దీనిని ద్రావిడ భాషలోని 'నాల్+ఉ' (గ్రాంధిక తమిళ-'నాన్+గు') అనుదానినుండి నిష్పన్నమని తలంప నగును. 'నాల్గు-పది' అనునవి ద్రావిడ భాషలలో ననేక త్వార్థమున వాడఁబడును. (నలుగురూ వింటే నవ్వుతారు. పదుగురాడు మాట పాటియై ధరఁజెల్లు). 'నాల్గు రెట్లు' అను నర్థముగల సంఖ్యావాచక విశేషణము ననేకత్వార్థమున వాడఁబడును. 'నాలావిదమ్'=

(నానా విధము) అనుదానిని బట్టి తమిళ పండితులు 'నాలా' శబ్దము 'నానా' శబ్దాభిన్న మని భ్రమించుచున్నారు" (కాల్డు. ౫౭౧ పుట).

విమర్శము:—నానా=న+నాఞ్ =(లేమి లేదు = అనేకమని యర్థము). 'సంస్కృత పండితులు 'నానా' శబ్దమునకు వ్యుత్పత్తి సరిగా వ్రాయలేద'ను దొరగారి వ్రాఁత యపరిశీలన మూలకము.

"వి నఞ్ భ్యాం 'నా నాఞౌ'-నసహ" (౫-౨-౨౭)=(వృత్తి) "అసహార్థే= పృథగ్భావే వర్తమానాభ్యాం స్వార్థే ప్రత్యయౌ. వినా-'నానా' (సి. కౌ. ౧౮౩౫ సూ.) అని 'నానా' శబ్ద వ్యుత్పత్తిని గుఱించి పాణినిముని సూత్రించి యుండెను.

"న స హేత్యస్య ప్రత్యయార్థత్వే తు నేత్యనేన నసహేతి గమ్యతే. ఏ వంసతి నానా=న+నసహ=(న+నా)=కింతు సహేత్యర్థః స్యాత్-'ద్వౌనఞౌ ప్రకృత మర్థం గమయతః' ఇతి న్యాయా దితి భాష్యే స్పష్టమ్" (బాల మనోరమా వ్యాఖ్య)."న+నా" 'నా' ప్రత్యయము కలియుటచే(ఆది వృద్ధి) నానా శబ్ద మేర్పడు ననియు 'నా' ప్రత్యయమునకు 'నసహ' అని యర్థమనియు నట్లగుటంజేసి 'సహ' కానిది కాదనఁగా 'సహ' అనియే యర్థమనియు భావము. 'సహ' అనఁగా ననేక మని యర్థము.

"నానా. అవ్య. న+నాఞ్. వినార్థే-అనేకార్థే-ఉభయార్థేచ" (శబ్దస్తో). ఇట్లు దీని కనేకత్వార్థమును సంస్కృత పండితులు సాధించి యుండఁగా వారు సరిగా వ్యుత్పత్తిని జెప్పలేదనియు, 'నానా' శబ్దము 'నాల్గు' శబ్దార్థకమనియు నాల్గనఁగా ననేక మర్థమనియుఁ దాము వ్రాసినది సరియనియు వ్రాయుట కేవలము నయుక్తము."

౧౬. "నీర=నీరు. దీనిని 'నీ=ప్రాపణే' అను ధాతువునుండి సంస్కృత పండితులు నిష్పన్న మందురు. దీనినిబట్టి వారి కా శబ్దము పరిచితముకాదని విశద మగుచున్నది. తమిళ మలయాళములలోని "నిర=సమతలముగ నుండు" అను శబ్దమునుండియే 'నీర' శబ్ద మేర్పడెనని తోఁచుచున్నది. నీటి పైభాగము "మట్టముగా=సమతలముగా" నుండునని భావము. ద్రావిడ భాషలలో జలార్థమున 'నీర' శబ్దము మాత్రమె తఱచుగా వాడఁబడును" (కాల్డు. ౫౭౧ పుట).

విమర్శము:—పయి రెండు పక్షములలో నేది సత్యమో? నిర్ణయింప శక్యముకాదు. సంస్కృత పండితులు చెప్పిన వ్యుత్పత్తి డా. కాల్డువెల్లుగారు చెప్పిన ట్లసంగతముగా లేదు. "నిర్గతః రా దగ్నితో నీరమ్ 'అగ్నే రాపః ఇతిశ్రుతేః." ('ఆపోవై అగ్నేరాయతనమ్' అనియు వేదము చెప్పుచున్నది.)

(శబ్దస్తో) 'ర' శబ్ద మగ్నివాచకము. 'ర' అనునది యగ్నిబీజము. రాత్=అగ్ని నుండి, నిర్గతః=బయలువెడలినదని వ్యుత్పత్త్యర్థము. అగ్నినుండి జల ముద యించెనని వేదము చెప్పుచున్నది. మార్గాంతరము:—"ని=నిమ్నమ్, ఈర్తే=నీరమ్. ఈరగతౌ (ధాతు)" (పల్లమువైపు పోవునదని యర్థము.) (లింగా. ౧౭౮ పుట). (చూడుడు ౬౦ VIII విష).

౧౭. "పట్టన=పత్తన=పట్ట=(పట్టణము=గ్రామము). ఇది 'పట్'=(చుట్టియుండు) అనుదానినుండి వచ్చినదందురు. బీమ్సు దొరగారు "పత్త్ర"=(ఆకు) అనుదానినుండి పుట్టినదనిరి. నేఁటి ద్రావిడ భాషలలోని 'పట్టణ' శబ్దము సంస్కృతమునుండియే వచ్చియుండును. కాని యా పట్టణ శబ్దము ప్రాచీన ద్రావిడ "పట్టి" శబ్దమునుండి వచ్చియుండునని నా యభిప్రాయము. (పట్టి=పశువుల దొడ్డి. చిన్నయూరు). ఈ 'పట్టి' శబ్దము దక్షిణ దేశములోని పెక్కు పట్టణములయు గ్రామములయుఁ బేరుల తుదిని గన్పట్టుచున్నది. ఉదా:- కోవిల్పట్టి=(ఒక యూరి పేరు=గుడియూరని యథాశ్రుతార్థము.) కన్నడమున-దిమ్హాట్టి=(ఒక యూరి పేరు). ఈ పట్టి శబ్దము 'పడు' ధాతుజన్యము. ("పడి యుండిపోవు=వసించు") అను నర్థమున నిది యేర్పడియుండును. ఈ 'పట్టి' శబ్దమునుండి పుట్టిన 'పట్ట-పట్టన' అను సంస్కృత శబ్దములు సుప్రసిద్ధములై యున్నవి. ప్రొఫెసరు విల్సను, ప్రొఫె.—విలియము దొరగార్లు 'పేట్టై' శబ్దమునుండి యిది వచ్చెననిరి. కాని యిది యుక్తియుక్తముగా లేదు. తమిళ గ్రామనామముల తుదిని నిల్చు 'పేడు' శబ్దము పడు ధాతుజరూపములగు "పాడు-పాడి"=(బస-చోటు) శబ్దములనుండి వచ్చియుండును. ఇవెల్ల గ్రామ నామముల తుదిని నిల్చునవె" (కాల్డు. ౫౭౨ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు నేఁటి వాడుకలోనున్న 'పట్టణ' (ట కారద్వయఘటిత) శబ్దమె ప్రాచీన సాధురూపమనుకొని యేవేవో వ్యుత్పత్తులను వెదుకసాగిరి. సంస్కృతమునఁ బురవాచకము 'పత్తన' శబ్దము దంత్య 'త' కారద్వయఘటితము (మూర్ధన్య 'ణ' కారము ప్రాచీన సమ్మతముకాదు.) ప్రాచీన సాధురూపము. కావుననే శబ్దార్థచింతామణ్యాది ప్రామాణిక కోశములలో 'పత్తన' శబ్దము మాత్రమె చూపఁబడియున్నది. మూర్ధన్య 'ట' కారద్వయఘటితరూపము చూపఁబడనేలేదు. 'పటణ' ణకారము ప్రాంసలోఁ గలదు (నిర్వ ౫ ఆ. ౭౯ వ.).

"పత్తనమ్-న-నగరే=పుటభేదనే-'పతన్తి జనా యత్ర' ('పత ౧' గతౌ). 'వి పతిభ్యాం తనన్' (ఉణాదిసూత్రము). యత్ర రాజా తత్ పరిచారికాశ్చ తిష్ఠన్తి తత్ పత్తనమ్. మహత్యాం పుర్యామ్. మృదఙ్గేచ" (శబ్దార్థ చింతామణి).

'వి-పతిభ్యాం తనన్' (ఉణాది ౪౩౦ సూ.) అను చొప్పున 'తనన్' ప్రత్యయమును విధించిరే కాని, 'టనన్' అను ప్రత్యయమును విధింపలేదు గదా. 'పత్తన' శబ్దమునె కొందఱు 'పట్టన' అని పలుకుటచేత నర్వాచీనముగా 'పట్టన' శబ్ద మవతరించె ననఁదగును. ఇట్టి మూర్ధన్యఘటిత శబ్దము లింగా భట్టీయమునఁ (గురుబాలప్రబోధిక) బాఠాంతరముగాఁ జూపఁబడినది. "ఆపతన్తి వణిజోఽస్మిన్నితి పత్తనమ్. పత్ ౧ గతౌ. పాఠాన్తరమ్-ఆపటన్తి. పటగతౌ" (లింగా. ౨౧౦ పుట) (వర్తకులు దీనినిగూర్చి వత్తురు). పయి సందర్భమునుబట్టి 'పత్తన' శబ్దమే ప్రాచీనతమమనియు 'పట్టన' శబ్ద మర్వాచీనమనియు, 'పట్టణ' అను మూర్ధన్య 'ణ' కారఘటితము ప్రాచీన సమ్మతమే కాదనియు విశద మగుచున్నది. డా. కాల్డువెల్లుగారు వారి 'పట్టి' శబ్దమూలకత్వ స్థాపనమునకై యర్వాచీన మూర్ధన్య 'ట' కారఘటిత రూపమును స్వీకరించుట యుక్తము కాదు. ఈ లింగాభట్టీయ పాఠాంతర మార్గమును దొరగారు తలంచిన ట్లగపడదు. "పట్=చుట్టియుండు" అను వీరి వ్రాఁత నరయఁగా వీరు "పటవేష్టనే" అను 'అదాది' ధాతువును మూలముగాఁ గొనిరని విశదమగుచున్నది. అట్టి వ్యుత్పత్తిని సంస్కృత పండితు లెవ్వరును జూపియుండలేదు.

౧౮. "పన్నో శబ్దము ప్రాకృతము. (బంగారమని యర్థము.) ఎల్లిసు దొరగారు దీనిని సంస్కృత స్వర్ణ శబ్దభవమనిరి. "తమి. పొన్=తెల్లు. పొన్న +ఉ" అను ద్రావిడ శబ్దమునుండి ప్రాకృత 'పన్నో' శబ్ద మేర్పడెనని యేల చెప్పరాదు" (కాల్డు. ౫౭౨ పుట).

విమర్శము:—'పన్నో' అను దీర్ఘాంతము ప్రాకృత మనవలెను. పై పక్ష ద్వయములో నిద మిత్థమ్మని నిర్ణయించుట కాధారము కానరాదు.

౧౯. "పల్లి=పట్టణము. గ్రామము - పాడిపంటలు గల యూరు. ద్రావిడ భాషలు వాడఁబడుచున్న దక్షిణ హిందూస్థానమందలి పెక్కు గ్రామ ముల పేర్ల తుది నీ 'పల్లి' శబ్దము చేరియుండుటచేత నిది ద్రావిడశబ్దమే యను టకు సందియములేదు. ఉదా:—త్రిచినాపల్లి. 'తిరిసిరాప్పళ్ళి' అనునది దాని నిజనామము=త్రిశిరుని పురమని యర్థము. ఈ 'పల్లి' శబ్దమునుండియె తమిళ దేశీయ వ్యవసాయదారుల జాతులలో నొక జాతి పేరగు 'పళ్ళ' శబ్ద మేర్పడినది" (కాల్డు. ౫౭౨ పుట).

విమర్శము:—ఆర్య ద్రావిడ ప్రాచీనతమ సంబంధము దొరగా రంగీ కరించినదే కదా. మఱియు నార్యులు దక్షిణ హిందూదేశమునకు రాక ముందే యీ పల్లి శబ్దాంత గ్రామనామములు వెలసియుండె ననుటకు నిదర్శన ములు లేవుగదా. ఇంతియ కాక త్రిశిర శ్శబ్దభవముగ "తిరిసిరా=తిరుచినా"

అను పూర్వావయవము సంగీకరించునపు డీక నా పేరిలోని యుత్తరావయము సంస్కృతభవము కాదను వాదము కేవలము దుర్బలము గదా. 'పల్లి' అను దానికి మూల మనఁదగు ద్రావిడ ధాతువుగాని తత్సంబంధి శబ్దములుగాని దొర గారిచేఁ జూపఁబడలేదు. సంస్కృతమున నట్టి ధాత్వాదికము వెలసియున్నది. "పల్ల-గతౌ భ్వాదిధాతుః-పర-సకర్మ-సేట్-పల్లతి-అపల్లీత్" (శబ్దస్తో).

"పల్ల-పుం-(పల్ల-ధాతు) (పల్ల+అచ్). స్థూలకుశూలకే-బృహతి ధాన్యాదిస్థాపనస్థానే=(పెద్ద ధాన్యపు కొట్టు=గాదె)" (శబ్దస్తో).

"పల్లి (పల్లీ) స్త్రీ (పల్ల+ఇన్). వా జీప్. క్షుద్రగ్రామే-కుట్యామ్-గేహేచ -(గృహములు ధాన్యాగారములు గల చిన్న గ్రామము). 'పల్లమ్'=గృహ మాశ్రయత్వే నాస్త్యస్యాః-అచ్ ప్రత్యయః. గృహగోధికాయామ్=(బల్లి) స్త్రీ-జీప్" (శబ్దస్తో).

పయికీతి నియ్యది సంస్కృతమున రూఢమై యుండుటచేత నిది ద్రావిడ శబ్దమనుట విశ్వసనీయము కాదు.

౨౦. "భజ్=(విభజించు) భాగ్+అ=(భాగము). ఈ రెండు శబ్దము లును దమిళమునందలి 'పగ్+ఉ'=(విభజించు) అనుదానినుండి వచ్చినవా? లేక యీ సంస్కృత తమిళ శబ్దములు తత్పూర్వ భాషాంతర శబ్దమునుండి వచ్చినవా? యని సందేహముగా నున్నది. కాని తమిళ రూపమె మూల రూపమని తోఁచుచున్నది. తమిళ మలయాళములలోని 'పగ్+ఉ' శబ్ద మితర భాషాజన్యము కాని శుద్ధద్రావిడ శబ్దము. ఈ ధాతువునుండి పుట్టిన 'పజ్గ్+ఉ' శబ్దమునకు 'భాగము' అని యర్థము. దీనికి సమానార్థకమును సమానాకారకమునునగు 'పగ్+ఇర్'=(పంచు) అను శబ్దాంతరమును గలదు. కుంటువాఁ డను నర్థము గల సంస్కృత శబ్దముతోఁ దమిళమందలి పైని వ్రాసిన 'పజ్గు'=(భాగము) శబ్దమున కేమియు సంబంధము లేదు. 'పగల్=(భాగము-పగలు)' 'పగల్=పాల్=(భాగము)' 'పాది=పగుది=(సగము)' అను రీతిగల 'పగు' ధాతుజన్య నామములును గలవు" (కాల్డు. ౫౨౩ పుట).

విమర్శము:—'భజ్-భాగ' శబ్దములనుండి 'పగు' శబ్దమేర్పడుట ద్రావిడ భాషల పరిణామపద్ధతులకు సరియైయుండును. 'పగు' శబ్దమునుండి 'భాగ' శబ్దమేర్పడుట యసంభవము. అల్పప్రాణము మహాప్రాణమగుట ద్రావిడోచ్చా రణ స్వభావ విరుద్ధము. భాషాంతర శబ్దమునుండి యీ రెంఁడు శబ్దములును వచ్చెనని కల్పింపవలసిన ప్రసక్తి లేదు. సంస్కృతమువారును ద్రావిడ భాషల వారును ప్రాచీనతమ కాలమున నేకస్థలవాసితా సంబంధము గలవారని కాల్డు వెల్లుగా రంగీకరించినదె కదా. సంస్కృతముతో ద్రావిడభాషల కాంతరంగిక

సంబంధము గలదని దొరగారీవఱకు వ్రాసియే యున్నారు (చూడుడు ౮౭ విష).

౨౧. "మీన=(చేఁప):—"మీ ధాతువు, మీనాతి" = (పీడించునది) అని సంస్కృత పండితులు చెప్పుదురు. "మిన్ =(మినుకుమినుకుమని ప్రకాశించు)" అను ధాతువునుండి ద్రావిడులు దీనిని సాధింతురు. ఎల్ల ద్రావిడ భాషలందును 'మీన' శబ్దము గలదు. అల్పద్రావిడ శబ్దకలితమగు రాజమహాల్ భాషయందును 'మీన' శబ్దము గలదు. 'మీందు' అని గోందు భాషలో నున్నది. సంస్కృతమువారు చెప్పిన 'మీన' శబ్దవ్యుత్పత్తి యెంత యసహ్యాకరముగా నున్నదో ద్రావిడ వ్యుత్పత్తి యంత యందముగా నున్నది. ఈ 'మీన్' శబ్దము ద్విరుక్తమగుచు మెఱుఁగుడు పురుగునకు వాచకమగుచున్నది. ఉదా:—తమి-మిన్ మిని=(ఖద్యోతము). 'మీన్' శబ్దము తమిఁళమున నక్షత్రవాచకము నగుచున్నది. 'వాన్ మీన్'=(నక్షత్రము) (వాన్=ఆకాశము) అఱుమీన్=(ఆఱు చుక్కలు గల నక్షత్రము=కృత్తిక). చోళమండలవాసులగు తమిళులును మలబారువాసులగు మలయాళులును దినదినమును దినెడి యాహారమగు చేఁపలకు వాచకమగు మీనశబ్దమును ఖైబరు కనుమలనుండి వచ్చిన (సముద్రమునకు మిక్కిలి దూరమున నున్నవారు గాన మీనముల నెఱుఁగఁజాలరని భావము) యార్యులనుండి తీసికొని రనుట కేవలము నసంగతము. కాన హిందూదేశములోని యాదిమాంధ్రులనుండి యార్యులీ శబ్దమును గ్రహించియుందు రనుట యుక్తము" (కాల్డు. ౫౭౩ పుట).

విమర్శము:—"పయిరెండు పక్షములలో నేది సరియో యెట్లు నిర్ణయింపనగును? ఆర్యులు ద్రావిడులును హిందూదేశమునకు వచ్చువఱకును, "మీనము-చేఁప-సముద్రము" మున్నగు ననేక శబ్దముల నెఱుఁగఁజాల రనుట సరికాదు. సముద్రములో మాత్రమె చేఁపలుండునా? నదీతటాకాదులలో నుండవా? చేఁపల నెఱుఁగుటకు సముద్రతీరవాసమే కావలయునా? సంస్కృత పండితులు 'మీన' శబ్దమునకు 'బాధగల్గించునది' అని యర్థము చెప్పుదురను కాల్డువెల్లుగారి వ్రాఁత సత్యము కాదు. జాలరులచే బాధింపఁబడునవని మీన శబ్దమునకు వ్యుత్పత్తి చెప్పిరి. "మీయతే <u>ధీవరేణేతి</u> మీనః" మీఙ్ హింసాయామ్" (గురుబాల ప్రబోధిక ౧౮౬ పుట).

౨౨. "వలక్ష=తెలుపు. 'వల=(పోవు)' అను ధాతువునుండి దీనిని సంస్కృత పండితులు సాధింతురు. తమిళమందలి 'వెళ్'=(తెల్పు) అను దానినుండి దీనిని సాధించుట యుక్తము కాదా? దీనిని సంబంధించిన ద్రావిడ శబ్దములు:—వెళి=(కాళీస్థలము. వెళ్ళి=(వెండి). వెళిచ్చమ్=(వెల్తురు).

హంగేరి యను భాషలోని 'విలాగ్' అనుదానికి వెల్తురని యర్థము. శ్లవోని యను భాషలో 'వెలి=తెలుపు' అని యున్నది. కాన నిది సిథియను భాషల నుండి గ్రహింపఁబడెనా? లేక యీ ద్రావిడ సిథియను భాషలను సంబంధించిన వేఱొక భాషనుండి వచ్చెనా? యని యాలోచింపవలసి యున్నది" (కాల్డు. ౫౭౪ పుట).

విమర్శము:—సంస్కృత పండితులు "వల=(పోవు)" అనుదానినుండి వలక్ష శబ్దమును సాధింతు రను డా. కాల్డువెల్లుగారి వ్రాఁత సత్యము కాదు. వలక్ష శబ్దమునకు 'అవ+లక్ష(ధాతు)' అని ఛేదము. "అవలక్ష=(అవ+లక్ష+ ఘఞ్)=శ్వేతవర్ణే. తద్వతి-మూర్ఖేచ. ('తెల్లమొగము మనిషి' అందురు గదా) త్రి-అవాదే రతో లోపే-వలక్షోప్య త్రైవార్థే" (శబ్దస్తో). అవలక్ష శబ్ద సంక్షేపరూపమె వలక్ష శబ్దమని భావము. "వష్టి భాగురి రల్లోప। మవాప్యో రుపసర్గయోః. ఉదా:—వగాహః అవగాహః" (సి. కౌ. ౪౫౨ సూత్రపు వివరణము). ఈ విషయమునే శబ్దస్తోమ మహానిధికర్త 'అవాదే రతో లోపే- వలక్షః' అని వ్రాసెను. "అవలక్ష్యత ఇతి వలక్షః-లక్ష-దర్శనాఙ్కనయోః." (గురుబాల ప్రబోధిక-లింగా. ౧౯౯ పుట) వస్తువులను గుర్తించుటకుఁ దెలుపు చిహ్నము వేయఁబడుట ప్రసిద్ధము.

పరిశీలింపఁగా నిట్టి వలక్ష శబ్దమె తమిళమందలి 'వెలిచ్చమ్-వెళి-వెళ్ళి- వెళ్' మున్నగు వానికిని హంగేరియను భాషాదులలోని 'విలాగ్' మున్నగు వానికిని మూలమా యని యాలోచింపవలసి యున్నది.

౨౩. వల-వలయ శబ్దములు:—"వల = చుట్టుకొను. వలయమ్= కంకణము. ద్రావిడ భాషలె యీ శబ్దమును దీసికొని యుండవచ్చును. కాని యీ శబ్ద మేధాతువునుండి పుట్టెనో యా ధాతువు ద్రావిడ శబ్దమై యుండును. దీనికి సరియగు ద్రావిడ ధాతువు 'వళ్+ఐ'=(వంగు-వంకర యగు). గౌణరీతిని దీని యర్థము 'చుట్టుకొను' అనునది. సంస్కృతమునకన్న నధికము దీనిని సంబంధించు శబ్దములు తమిళమునఁ గలవు. రూప సాధన ప్రత్యయాంతరము లేకయే యీ శబ్దమును దమిళులు 'బిలము' అను నర్థమున వాడుచున్నారు. ఉదా:—ఎలివళై=(ఎలుకకన్నము) 'వలయమ్' అనుదానినే కాక దానినుండి పుట్టిన 'వళైయల్' అనుదానిని సయితము 'కంకణము' అను నర్థమునఁ దమిళులు వాడుచున్నారు. ఈ సందర్భమునుబట్టి చూడఁగా ద్రావిడక్రియ సంస్కృతమునుండి రాలేదనియు సంస్కృతములోనికే ద్రావిడ క్రియ వచ్చినదనియుఁ దోఁచుచున్నది" (కాల్డు. ౫౭౪ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారి కేల యీ పక్షపాతము! ఈ శబ్దము సంస్కృత ద్రావిడ భాషలలో వివిధాకారములతో వెలయుచున్నది. సంస్కృతమున:—" 'వల సంవరణే - భ్వాది - ఆత్మ-సకర్మక - సేట్ - వా ఘటాది.' వలతే=(చుట్టుకొనుచున్నది) అవలిప్త=(చుట్టుకొనెను)" (శబ్దస్తో).

"వల-న. (వల్యతే అనేన-వల+క) సైన్యే, వలశబ్దార్థేచ=(ఆవరించుట-చుట్టుకొనుట)" (శబ్దస్తో).

"వలభి (భీ)- స్త్రీ-వల్యతే = ఆచ్ఛాద్యతే=వల+అభి. వాజీప్......" (శబ్దస్తో).

"వలయ-పుం-న. (వల+అయన్) హస్తపాద కటకాదౌ. ఉత్తరపదస్థః తదాకారవేష్టనే. యథా-భూవలయమ్ వేష్టనభూమౌ. గోళేచ" (శబ్దస్తో).

ఇట్లనేకవిధములగు నాకారములతో నీధాతువు సంస్కృతమున వెలయుచున్నది. తమిళమందేకాక యాంధ్రమందును "వలగొను - వలచు - వల=(వాగుర). వలను=(కుడివైపు)" మున్నగు పెక్కు శబ్దములు గలవు. ఇట్టి శబ్ద సంబంధము ద్రావిడభాషలవారు సంస్కృతభాషలవారును బ్రాచీనతమ కాలమునఁ జిరకాలము కలసియుండెడివారని విశదీకరింపఁజాలును.

౨౮. "వల్గు=(అందమగు). వల్గుక=(చందనము). వల్గుక శబ్దము తమిళ మలయాళములలో "అళగు" అని యుచ్చరింపఁబడును. 'అఴగు'=(అందము) అను శబ్దమును బోలుచున్నది" (కాల్డు. ౫౭౮ పుట).

విమర్శము:—సంస్కృతమందలి 'వల్గు-వల్గుక' శబ్దములనుండి "అఴగు" అను ద్రావిడశబ్ద మేర్పడెననుట యుక్తము.

౨౯. "శవ=(మృతకళేబరము). శావ=(శవసంబంధి). ఇది 'శవ్'=(పోవు) అను ధాతువునుండి పుట్టినదని సంస్కృత పండితులు చెప్పుదురు. కాని 'శవ' అనునది తమి-'సా'=(మృతినందు) అను ద్రావిడ ధాతువునుండి వచ్చెననుట యుక్తము. మలయా-'చా'=(మృతినందు), కన్న-'సా'=(మృతినందు), తుళు-'సై' (మృతినందు), తెల్గు-చచ్చు-భావార్థకము-చావడము. సామోయిదీ భాషలో "చవె"=(చచ్చిన) అని యున్నది. సంస్కృత భాషలోని 'సై=షో=(నశించు)' అనునవి దీనితో విదూరసంబంధము గల్గియున్నవి" (కాల్డు. ౫౭౮ పుట).

విమర్శము:—"సై=క్షయే-భ్వాది. షో=నాశనే-దివాది" (శబ్దస్తో) అను ధాతువులు సంస్కృతమునఁ గలవు. కాని వానినుండి యేర్పడు శబ్దములు "అవసాన - అవసాయ - అవసిత" మున్నగురీతిని వెలయుచుండును. అట్టి ధాతువులనుండి వకారఘటితశబ్దము లేర్పడవు.

"శవ=వికారే గతౌచ. భ్వాది. శవతి=(వికారమందుచున్నది)".

"శవ. పు-న. (శవ+అచ్) = మృతదేహే. గత ప్రాణే దేహే" (శబ్దస్తో).

"శవ త్యస్మా జ్జీవ ఇతి శవః-అ-ప్న. శవ=గతౌ."=(దీనినుండి జీవము పోవును). (లింగా. ౫౩౧).

దీనిని సంబంధించు ద్రావిడ ధాతువులందును గొన్నియెడల 'వ'కార స్థితి చూపట్టుచున్నది. తెల్గు-చావు. చావన్. కన్న - సావు - సావోణ-సావోదు. "సావోదు=Death. The act of dying......" (కన్నడాంగ్ల కోశము).

"చావవెన్నుమ్......" (తొల్కా. ౨౧౦ సూ.) = 'చావ' అను వసమాపక క్రియయందున్న 'వ' కారము లోపించుటయుఁ గలదు. ఉదా:— చావ+కుత్తినాన్=చాకుత్తినాన్=(చచ్చునట్లు గ్రుచ్చెను కత్తిని).

పయి శబ్దములు పరస్పరము పోలుచున్నవనుట యుక్తముగాని ద్రావిడ ధాతువునుండి సంస్కృతధాతు వేర్పడె నను కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదు. "శవః-శావః" మున్నగు ధాతుజరూపములు పెక్కు సంస్కృతమునఁ గలవు. ద్రావిడ భాషలలో నట్టివి కానరావు.

సంస్కృత శబ్దములు:—

"శవకామ్య-పు. శవం కామ్యతి. శవ+కామ్యచ్=కుక్కురే=(కుక్క)" (శబ్దస్తో).

"శవర (శబరః)=అరణ్యచరే మ్లేచ్ఛజాతి విశేషే......శవతి-బాహుళకాత్-అరః. శవం రాతీతివా. (రా+కః)" (శబ్దా. చిం.).

"శవపాదపః. పుం-లోధ్రే" (శబ్దా. చిం.).

"శవలః-(శబలః). పుం-(శవ+కలన్) = కర్బురవర్ణే. తద్వతి - త్రి. తద్వర్ణవత్యాం ధేనౌ-స్త్రీ" (శబ్దా. చిం).

"శావ-పుం-(శవ+ఘఞ్) శిశౌ. స్వార్థే-కన్ - తత్రైవ. శవస్యేదమ్-అణ్=శవసంబద్ధే. 'త్రిరాత్రం శావ మాశౌచ మితి.' స్మృతిః" (శబ్దస్తో).

"శావర (శాబర)-పు-శావయతి = వికారయతి (శవ+ణిచ్-అరన్)= పాపే-అపరాధే - లోధ్రద్రుమేచ. శబరేణ ప్రోక్తమ్ - అణ్ - శబరకృతే మీమాంసా భాష్యే. శవరస్యేదమ్-అణ్-శవర సంబన్ధిని-త్రి" (శబ్దస్తో).

“సాయకః. శరే. ఖడ్గే - స్యతీతి = సాయకః. (షో-ణ్వుల్-యక్)” (శబ్దా. చిం.).

“స్యతి=ప్రతిపక్షం నాశయతీతి=సాయకః.” షో-అన్తకర్మణి = (శత్రువును నశింపఁజేయునది). (లింగా) “అవసాన. న. (అవ+షో = సో-ల్యుట్) విరామే. సమాప్తౌ—సీమాయామ్-మృతౌచ” (శబ్దస్తో).

“అవసాయ-పుం. (అవ+షో=సో+భావే-ఘఞ్)=సమాప్తౌ-శేషే-నిశ్చయేచ” (శబ్దస్తో).

“అవసిత. త్రి. (అవ+షో=సో+కర్తరి-కర్మణి వా క్తః). సమాప్తే-బుద్ధే-జ్ఞాతే-పరిపక్వే-నిశ్చితే-మార్దిత ధాన్యేచ. అవ+సి+క్త=సంబద్ధేచ” (శబ్దస్తో).

పయిరీతిగల ధాతుజన్య శబ్దపరంపర ద్రావిడ ‘సా’ ధాతువునకుఁ గానరాదు.

౨౬. “సుక్తి=(వంకర). తమి-సుఱ్ఱు. కన్న-సుత్తు. తెల్గు-చుట్టు. ఉంగరము. మెలిక-చుట్టుదారి. ధాతు-సుఱ్ఱు=చుట్టుట” (కాల్డు. ౫౭౫ పుట).

విమర్శము:—‘సుక్తి’ అను సంస్కృత శబ్దము కోశములలోఁ గానరాదు. కాన ‘శుక్తి’ అని వ్రాసితిని. దీనికి సంస్కృత కోశములలో ‘వంకర’ అను నర్థము కానరాదు.

“శుక్తి-స్త్రీ-(శుచ-క్తిన్)=జలజన్తు భేదే. (జెలగ) - కపాలఖణ్డే - శఙ్ఖే-శఙ్ఖనఖే-నఖ్యామ్. (rso) అర్శో రోగే. అశ్వావర్తకే-చక్షూరోగ భేదేచ” (శబ్దస్తో).

౨౭. “సాయ=(సాయంకాలము). దీనిని ‘షో=(నాశనము చేయు)’ అను ధాతువునుండి సంస్కృత పండితులు సాధింతురు. తమిల మలయాళములలో ‘సాయ్’=(వంగు) అను శబ్దము గలదు. సాయంకాలమున సూర్యుఁడు పశ్చిమదిక్కునకు వంగును. కాన నిది శుద్ధ ద్రావిడ శబ్దము” (కాల్డు. ౫౭౫ పుట).

“ఊళ్ళపేర్లు జాతులపేర్లు మున్నగునవి సంస్కృత కోశములలో నున్నను వానిని దేశ్యములనుగాఁ బండితు లంగీకరించిరి. మలయ శబ్దవిషయమున మాత్రము పండితులు వ్యుత్పత్తిని జెప్ప యత్నించిరి. “మల్=చందనమును గల్గియుండు” అని సాధించిరి. కాని ‘మల్+ఐ’ = (కొండ-కొండప్రాంతము) అను శబ్దము ద్రావిడ శబ్దముగా నంగీకరించుట యుక్తము. మలయశబ్దము ‘మల’=(కొండ) అను ద్రావిడశబ్ద సంబంధి” (కాల్డు. ౫౭౫ పుట).

విమర్శము:—‘సాయ’ అను ‘అ’ కారాంత నపుంసకమును, ‘సాయమ్’ అను నవ్యయమును సంస్కృతమునఁ గలవు. “సాయం సాయే” (నామలిం.

అవ్య. ౧౯ శ్లో.) "సాయమ్-అవ్య-నిశాముఖే-దినాన్తే. (షో=సో+ణమ్-యుగాగమః)" (శబ్దా. చిం.).

"సాయః-పుం-కాణ్డే-శరే-బాణే-దినాన్తే. స్యతి=సమాపయతి దిన మితి సాయః. షో = సో = ణః-"శ్య ద్వ్యధేతి ణః. ఘుఙ్ వా. ఆతో యుక్" (శబ్దా. చిం.).

సంస్కృత వ్యుత్పత్తియు ద్రావిడ వ్యుత్పత్తివలెనె సమర్థముగనే యుండుటచేత నిది ద్రావిడ శబ్దమే యని నిర్ణయింపరాదు. సంస్కృతము వారు దినము నంతపుచ్చున దని 'సాయ' శబ్దమును వాడుచుండఁగా ద్రావిడులు సాయం సమయమున సూర్యుఁడు క్రుంగుటను జూచి "సాయ్=వంగు" అను దానినిగాఁ దలంచిరని యూహింపవచ్చును. "షో=సో=" (నాశనము చేయు అంతపుచ్చు) అను, ధాతువు రూపములు పైని జూపఁబడెను.

దొరగారు చెప్పినట్లు సంస్కృతమున "మల్=చందనము కల్గియుండు" అను ధాతువు లేకున్నను "మల=ధారణే" అను ధాతువు గలదు. దానినుండి 'మలయ' శబ్దమును సాధించిరి.

"మలయః-పుం-దక్షిణాచలే......మలతే=మల-ధారణే. వలి మలి తనిభ్యః కయన్" (శబ్దా. చిం.).

"వలి మలి తనిభ్యః కయన్-వలయమ్-మలయః-తనయః" (సి. కౌ. ఉణాది. ౫౩౯ సూ.).

పర్వతార్థక ద్రావిడ 'మలై' శబ్దమును, దక్షిణపర్వతార్థక సంస్కృత మలయశబ్దమూలభూత 'మల' ధాతువును నభిన్నములె యనఁదగును. "చందన వృక్షములు గల్గియుండు" అని మలయశబ్దమున కెవ్వరును నర్థమును వ్రాయ లేదు. కొండలు భూధరములు గానఁ గులపర్వతములలో నొక దానికి వాచకమగు 'మలయ' శబ్దము "భూమిని ధరించునది" అను నర్థము నీయఁదగియున్న దనుట యుక్తము. ద్రావిడ 'మలై' శబ్దమునకును బయి యర్థమె చెప్పుట యర్హము.

౧౪౧. III విష:—"౧౮౬౯ సంవత్సరపు జర్మన్ ఓరియంటలు సొసైటీ సంచికలో డా. గుండర్టు దొరగారు 'సంస్కృతములోని ద్రావిడ శబ్దములు' అను విషయమున నీ క్రింది రీతిని వ్రాసిరి. '*ఎన్నో వేల సంవత్సరములు పరస్పరము కలసి మెలసి* యున్న యార్యులును ద్రావిడులును బరస్పరము నాదాన ప్రదానములు గల్గియున్నపు డొకరి శబ్దముల నొకరు గ్రహించియుండ లేదనుట కేవలము నసంభవము (చూడు ౮ IV విష.). ప్రాచ్యపండితులు

పై విషయము నంగీకరింపరు. మలబారులోని కొందఱు పండితులు తమిళాది ద్రావిడ భాషలశబ్దములేకాక 'అరబ్బీలు-యూరపియనులు' మున్నగువారి పేరులు కూడ సంస్కృతమునుండియో వాని యపభ్రంశ భాషలనుండియో (ప్రాకృత) పుట్టిన వని వాదించుటకు సాహసింతురు. ఆర్యులు దక్షిణమునఁ జొచ్చిన కొలఁదిని ద్రావిడ నామములను వస్తువులను శబ్దములను స్వీకరించుచుఁ దమలోఁ గలిపికొనిరి." అని వ్రాయుచు డా. గుండర్టుగారు సంస్కృతమునఁ బ్రవేశించిన కొన్ని ద్రావిడ శబ్దములను జూపిరి. వానిలోఁ గొన్ని యిచటఁ బ్రదర్శింపఁ బడుచున్నవి......" (కాల్డు. ౫౭౬ పుట).

౧. "ఉరుణ్డ=ఒక రాక్షసుని పేరు. గుండ్రముగా నుండునట్టి దొర్లెడి వస్తువు. తమి-'ఉరుళ్=(దొర్లు=పొరలు).' అను ధాతువుయొక్క భూతార్థక రూపము-ఉరుణ్డు=(దొర్లి)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—రాక్షస వాచకమగు 'ఉరుణ్డ' సంస్కృతమునఁ గానరాదు. మేషార్థకమగు 'ఉరణ' శబ్దము గలదు.

౨. "ఏడ=ఏడక=(గొఱ్ఱె=మేఁక) ద్రావి-ఆడు=(మేఁక-గొఱ్ఱె). తమి-ఆడు=(ఒరసికొను). తుళు-ఏడు" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—సంస్కృతమున 'ఇల' శయనే' అను ధాతువునుండి 'ఏడ' శబ్ద మేర్పడును. మేఁకకు నిద్ర యధికము.

"ఏడ. పుం-'ఇల-(స్వప్నే)'+(అచ్ ప్రత్యయః. డస్యలః). మేషే... ..." (శబ్దస్తో).

పయిరీతి నుండుటచే నిది ద్రావిడ శబ్దమే యను గుండర్టుగారి యాశ యము సరికాదు.

3. "కరబాల=కరవాల=(కత్తి). ద్రావిడ శబ్దమగు 'కై వాళ్'=(చే కత్తి) అను దానితోఁ బోల్చిచూచునది. తమి-'వాళ్'=(కత్తి). 'వాళ్'= (వంగు) అను ధాతువునుండి వచ్చియుండును" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"కరే వలతీతి కరవాలః, 'వల' సంచలనే=(చేతియందుఁ జలించునది)" (గురుబా=లింగా. ౫౧౭ పుట). ఈ సంస్కృత వ్యుత్పత్తి సుసంగతముగానే యున్నది. ఇది ద్రావిడ శబ్దమునకు మూలమే యేమో?

౪. "కర్ణాటక=(Karṇāṭaka). ఇది ద్రావిడ శబ్దము. "కర్+నాట్+ అగమ్"—కర్=(నలుపు). నాట్=(దేశము). అగమ్=(లోపలిభాగము)= (నల్ల రేఁగటి భూమి=దక్కను పీఠభూమిలోని దేశము)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—వీరి వ్యుత్పత్తి చాల యుక్తముగా నున్నట్లు తోఁచును. కాని యీ పక్షమున 'కర్ణాటక' అను శబ్దములోని 'ణత్వ' మెట్లు పొసఁగును? కర్ణాటక భాషా సంప్రదాయము చొప్పున 'కర్నాటకము' అని 'న' కార ఘటిత రూపమే యేర్పడును. రేఫము మీఁది 'న' కారమునకు 'ణత్వము' వచ్చుట కర్ణాటక భాషా సంప్రదాయము కాదుగదా. అది సంస్కృత భాషా సంప్రదాయము. కావున డా. గుండర్టుగారి వ్యుత్పత్తి పక్షమున 'కర్ణాటక' అను ణత్వ ఘటిత శబ్ద మపశబ్దమని చెప్పవలసి వచ్చును. ప్రామాణిక కోశము లందును. 'కర్ణాట' అను 'ణ' త్వ ఘటిత రూపమె కన్పట్టుచున్నది. డా. గుండర్టు గారును డా. కాల్డువెల్లుగారును 'ణ' త్వ ఘటిత రూపమునె యుదాహరించు చున్నారు. వీరి వ్యుత్పత్తి పక్షమున 'ణత్వ' మెట్లు ఘటిల్లునని వీరు తలంచిరో తెలియకున్నది.

"కర్ణాట-పు. రామనాథం సమారభ్య । శ్రీరఙ్గాన్తం కిలేశ్వరి । కర్ణాట దేశ ఇత్యుక్త దేశే......" (శబ్దస్తోమ మహానిధి).

శా॥ "......క।ర్ణాటీ గీత కళా సరస్వతి కళింగాంతః పురీ మల్లికా।
వాటీ మంజరి......(భాస్కర. కిష్కిం ౭౨౬ ప.) (అప్పక. 3 ఆ. ౧౩౭ ప.)

శా॥ కర్ణాట క్షితిపాల, మౌక్తిక సభాగారాంత రాకల్పిత।
స్వర్ణ స్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్ సంస్తుత్య చారిత్ర, దు।
ర్ధర్ణోరాశి గభీర, ప్రాజ్ఞముఖ మధ్యా హ్నైపరాహ్ణార్చితా।
పర్ణావల్లభ, రాజశేఖరమణీ, పంటాన్వయ గ్రామణీ॥"
(కాశీఖండము ౧ ఆ.)

ఇట్టి ప్రయోగముల కనుకూలమగు......"కర్ణేషు+అటతి=గచ్ఛతీతి కర్ణాటః. తతః స్వార్థే 'క' ప్రత్యయః=కర్ణాటకః" (కర్ణాటకము=చెవుల కింపైన యుచ్చారణము గలది) అను వ్యుత్పని నిరాకరించు టెట్లు?

ఈ క్రింద నుదాహరింపఁబడు గుండర్టుగారి శబ్దములు ద్రావిడ శబ్దములె యని సాధించు యుక్తులు చూపఁబడనే లేదు. అందులోఁ గొన్ని కేవల సంస్కృతములె యని తోఁచును. ద్రావిడ భాషలలో నట్టి యాకారము గల శబ్దము లుండుటయే వాని ద్రావిడత్వమునకుఁ బ్రమాణమని వారు తలంచిన ట్లున్నది. (చూడు ౧౮౧ III. -౨౮ శృఙ్గవేర. IV తుది కాల్డువెల్లు గారి వాక్యము) (చూడు ౫౭౭, ౫౭౯ పుటలు. కాల్డు.) ఎల్ల ద్రావిడ భాషలకును

సంస్కృత సంబంధము ప్రసిద్ధమగుటచేత వానిలోఁ గొన్ని సంస్కృతాకారమున నుండుట వింతకాదు.

౫. "కుండ(ము)=(గొయ్యి). తమి-కుండు= తెల్గు-గుండ=కన్న-కుని= తమి-కుటి" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—'గొయ్యి' అను నర్థమునఁ దెల్గున 'గుండ' అను శబ్దము లేదు. "గుండము-వై. వి. నిప్పుల గుంట" అను సంస్కృత 'కుండ' శబ్ద వికృతి మాత్రమె కలదు. సంస్కృత 'కుండ' శబ్దము ద్రావిడ శబ్దమని గుండర్టుగా రెట్లు తలంచిరో తెలియకున్నది.

౬. కురుకుర=(కుకర). ద్రావి-'కుర' =(ధ్వనిచేయు) అను ద్రావిడ శబ్దము కలదు. దీని మూలధాతువు 'కు'=(కూయు-కేకవేయు) అనునది" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—'కుర్కుర' అనునదియుఁ గొన్ని కోశములలో నున్నను ప్రామాణిక సంస్కృత కోశములందు 'కుక్కుర' అనియే యున్నది. "కౌలేయక స్సారమేయో । కుక్కురో మృగదంశకః । శునకో భషక శ్శ్వా స్యాత్" (నామలిం. శూద్రవర్గము. ౨౧ శ్లో.) "కుక్కురః. పుం......కౌలేయకే-సారమేయే. కుక ఆదానే. (ధా). కోకతే-క్విప్ ప్రత్యయః-కురతి-కుర శబ్దే. (ధా). ఇగుపధేతికః. కుక్-చాసౌ కురశ్చేతి (కుక్+కుర)" (శబ్దార్థ చిం.) 'కుక్' అనఁగా నెమ్ములను గ్రహించునది. 'కుర' అనఁగా నఱచునది. దీనినిబట్టి 'కుక్కుర' అనియే శబ్ద స్వరూపమనియు నిట్టి సంస్కృత శబ్దమె మూలరూపమనియు విశదమగుచున్నది.

౭. "కేయూర=(అంగదము). ద్రావి-కై =(చేయి-భుజము). 'ఉఱు'= (వాడఁబడు)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—ఱకార ఘటితమగు 'ఉఱు' ధాతువు 'ఊర' అని యేర్పడనేరదు. ఇది సంస్కృత శబ్దమె యనఁదగును. "కేయూరమ్. న. కే=బాహు శిరసి, యాతీతి కేయూరమ్. 'యు'=మిశ్రణే. 'ఖర్జ విఞ్జాదిభ్య ఊరోలచౌ' (సి. కౌ. ఉణాది-౫౩౦ సూ.). హాలదన్తాది త్యలుక్సమాసః" (శబ్దార్థ. చిం.) "కేయూర-పు-కే=బాహు శిరసి, యాతీతి యా+ఊరక్=కేయూర. అలుక్సమాసః-బాహు భూషణే." (శబ్దస్తో).

౮. "కోకిల = (కోయిల). ద్రావి-కుయిల్=కోయిల. ఇది ధ్వన్యనుకరణ శబ్దము. కాన నిది యొక భాషనుండి వేఱొక భాషలోనికి వచ్చె ననరాదు.

కు=(కూయు). ఇల్=(చోటు). 'ఇల్' అనునది రూపసాధనోపయోగి ప్రత్యయము" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"కోకతే శ్రోతృ చిత్తమితి కోకిలః. 'కుక' ఆదానే.=(తన పలుకులు వినువారి చిత్తము నాకర్షించును)" (లింగా. ౩౩౮ పుట). దొరగారు వ్రాసినట్లు, 'కు+ఇల్' అను జంట ధ్వన్యనుకరణముగా సందర్భపడలేదు. రెండు కుటుంబముల వ్యుత్పత్తులును సహజముగనె తోఁచును.

౯. "ఘోోట=(గుఱ్ఱము). తెల్గు-గుఱ్ఱము=తమి-కుదిరై. 'కుది'=(దుముకు). (చూడు గుంటర్టుగారి పుస్తకము)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—'కుదిరై-గుఱ్ఱము' శబ్దములు 'ఘోోట' శబ్ద సంబంధులని తోఁచదు. అల్ప ప్రాణము మహా ప్రాణముగ నేర్పడుట సహజము కాదు. ద్రావిడ భాషలలో మహాప్రాణము లేదుగదా. "భూమౌ ఘుటతి=పరివర్తత ఇతి ఘోటః. ఘుట పరివర్తనే" (లింగా. ౮౯౩ పుట). (చూడు ౧౮౧ V విష. ౧౩ 'కుదిరై' శబ్దము).

౧౦. "చమ్పక=(సంపెంగ). జమ్బు=(Rose apple). ద్రావి-సెమ్బు=(చెమ్బు) ఎఱ్ఱని" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"చమ్పయతి-చమ్ప్యతే వా=చమ్పకః. చపి గత్యామ్. క్వున్ ప్రత్యయః" (శబ్దార్థ చిం.) ఇది యర్థ విషయమున నంతగా సంతుష్టిగా లేదు. డా. గుంటర్టుగారి వ్యుత్పత్తియు సంతుష్టిగా లేదు.

౧౧. "నారఙ్గ=(నారింజ) ద్రావి-నార్ ('నాఱు=పరిమళించు' శ్రీ రెడ్డిగారు)=(పరిమళించు). మలయా-నారణ్ణ. 'నారఙ్గాయ్' (కాయ్=కాయ) అనుదానిని 'నారఙ్గ' అనుదానితో సరిపోల్చి చూచునది)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"నారఙ్గ. పు-న. న+అరఙ్గః=అరఙ్గనమ్ యస్య-నారఙ్గః" (శబ్దస్తో). సంస్కృత పక్ష వ్యుత్పత్తియేకాక ద్రావిడ పక్ష వ్యుత్పత్తియు నసంతుష్టిగనే యున్నది.

౧౨. "పిట=పిటక=(బుట్ట). ద్రావి - పిడ్=(పట్టుకొను)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"పేటతీతి=పిటకః. పేటకశ్చ = (కూడుకొని యుండునది) 'పిట=సంఘాతే' (పెట్టె పేళ్ళు)" (లింగా. ౬౧౧ పుట).

"పేటతి వస్తుభి రితి=పేటా. 'పిట=సంఘాతే'=(వస్తువులతోఁ గూడునది)" (లింగా. ౬౧౨ పుట).

తక్కిన కోశములందును నిట్లే యున్నది. పై వానిని బట్టి యీ శబ్దము సంస్కృత ధాతు మూలకమె యని తోఁచుచున్నది.

౧౩. "పుత్ర=(కొడుకు). ద్రావి-పుద్=(క్రొత్త)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"పుత్రః=పున్నామ్నో నరకా ద్యస్మాత్ । పితరం త్రాయ తే సుతః । తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః । స్వయమేవ స్వయంభువా ।......పున్నరకం, తస్మా త్త్రాయతే 'త్రైఙ్=పాలనే' సుపీతి క ప్రత్యయః......" (శబ్దార్థ చిం.). ఇట్లే శబ్దస్తోమ మహానిధి ప్రభృతికోశములందు నున్నది. ఇట్లిది ద్వి 'త' కారక మని దొరగారు గ్రహింపరైరి. పై వ్యుత్పత్తి ద్రావిడ వ్యుత్పత్తి కన్న మిక్కిలి సహజముగా నున్నది. కాన నిది సంస్కృత శబ్దమె యనఁదగును.

౧౪. "పున్నాగ=(పొగడ). ద్రావి-పొన్=(బంగారము)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"శ్లో॥ పున్నాగే పురుష స్తుఙ్గః । కేసరో దేవవల్లభః ।" (నామలిం. వనౌష. ౨౫ శ్లో॥) "పున్నాగ ఇవ పున్నాగః=(పురుష శ్రేష్ఠునివలెఁ బూజ్యమైనది). పురుషవ దున్నతత్వా త్పురుషః-తుఙ్గశ్చ" (పురుషునివలె నున్నత మైనది గాన 'పురుషము-తుంగము' అనఁబడును) (లింగా. ౨౪౯ పుట). తక్కిన కోశములందును బున్నాగ శబ్ద వ్యుత్పత్తి యిట్లే చూపఁబడెను. 'పురుషము. తుంగము' అను పర్యాయములనుబట్టి పున్నాగ శబ్దమునకు సంస్కృత పండితోక్త వ్యుత్పత్తి సరియైనదని విశ్వసింపనగును. బంగారువంటి రంగుగలదను కాల్డువెల్లు గారి వ్యుత్పత్తి పక్షమున నుత్తర పదమగు 'నాగ' శబ్దము కేవలము నసమర్థము. కావున నిది సంస్కృత శబ్దమె యనఁదగును.

౧౫. "పేట=(బుట్ట). ద్రావి-పెట్టి. తెల్గు-ధాతువు—పెట్=(పెట్టు-ఉంచు). ద్రావి-పిడ్=(పట్టుకొను)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—'౧౨-పిట=పిటక' శబ్దములవలెనె యీ పేట శబ్దమును "పిట=సంఘాతే" అను సంస్కృత ధాతువునుండి యేర్పడినదనియే చెప్పనగును. పరిశీలింపఁగా నియ్యది సంస్కృత ద్రావిడ సమానశబ్దమని తోఁచును. (చూడు ౧౪౧ III విష. ౧౨ పిట=పిటక శబ్దము).

౧౬. "ఫలము=(పండు), ద్రావి-పలమ్=పళమ్=తెల్గు-పండు 'పళ్'-(ధాతువు) అను తమిళ ధాతువునకు 'ప్రాఁతవడు' అని యర్థము" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—'ఫల' 'నిష్పత్తౌ' అను సంస్కృత ధాతువె దీనికి మూల మనఁదగును. 'ఫల' శబ్దమునుండి 'పలమ్' అని యేర్పడి యుండును. అల్ప

ప్రాణ పకారము మహాప్రాణ ఫకారమునుండి యేర్పడెననుట విశ్వసనీయము. లకారము 'డ' కారద్వారమున 'ఱ' కారమగుట ప్రాచీనతమ పద్ధతి. 'ఱ' కారము 'ళ' కారమగుట యాధునిక పద్ధతి (చూడు ౧౭ IX విష, ౧౭ XI విష).

౧౭. "మరుత్త=(మందునిచ్చువాఁడు) ద్రావి - మరున్దు, మరుత్తు=(మందు)" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—మరుత్త శబ్దమునకు మందులిచ్చువాఁడను నర్థము సంస్కృత కోశములందుఁ గానరాదు. "మరుత్త-పు. చంద్రవంశ్యే నృపభేదే. తత స్సంజ్ఞాయాం కన్ (మరుత్తక). మరువకే" (శబ్దస్తో). ఇట్లగుటచేత నిట మరుత్త శబ్దోదాహరణ మప్రసక్తము.

౧౮. "మర్కట=క్రోఁతి. ద్రావి-మర=(చెట్టు)" (కాల్డు. ౫౭౭ పుట). (చెట్లమీఁద సంచరించునది క్రోఁతి యని భావము.)

విమర్శము:—వృక్షవాచక ద్రావిడ 'మర' శబ్దాంశము 'మర్కట' శబ్ద పూర్వభాగమున నున్నంతమాత్రమున వానికి సంబంధమును గల్పించుట యుక్తము కాదు. 'మర్కట' శబ్దములోని 'కట' అను నుత్తరావయవమున కేమి గతి? "మర్క-మర్కట-మర్కటక" అను సంస్కృత శబ్దములు గలవు. వాని కనేకార్థములు గలవు. అవెల్ల ద్రావిడ 'మర' శబ్దసంబంధులె యనరాదుగదా.

"మర్కటః-అ-పుం. వానరః-ఊర్ణనాభః-కాన్తిః-రతిబన్ధః, బ్రహ్మచారీ, సూకరః-స్థావర విషభేదః-గళేగణ్డపక్షీ" (సర్వశబ్ద సంబోధిని). "మర్కటః-త్రి-కుటిలః" (సర్వ-సంబో.) "మర్కటకః-అ-పుం. లూతా-సస్యభేదః-వానరః-మత్స్యభేదః-దైత్యః" (సర్వ-సంబో.) "మర్కటః-పు. వానరే. లూతాయామ్. ఊర్ణనాభే. స్త్రీకరణాన్తరే. గలే గణ్డే-(హాడగిల ఇతిభాషా). ఖగే. మర్కతీతి=మర్క:-శకాదిభ్యోఽటన్. (ఉణాది-సి. కౌ. ౫_౨౧ సూ.). స్థావరవిషభేదే" (శబ్దార్థ చిం.) "మర్క-గతౌ" (శబ్దస్తో).

"మర్కటకః-పుం. సస్యప్రభేదే-వానరే-లూతాయామ్-మత్స్యవిశేషే-దైత్యవిశేషే. సంజ్ఞాయాం కన్" (శబ్దార్థ. చిం.)

"మర్కః-పుం-దేహే=శరీరే, వానరే, వాయౌ, మర్చతి-మర్చయతి వా =మర్కః. మర్చి స్సౌత్రో ధాతు రితి బహవః. 'మర్చ=శబ్దే' చౌరాదిక ఇతి. మిదచోఽన్త్యా దిత్యాది సూత్రే కైయటః......" (శబ్దార్థ చిం.).

"ఇణ్ భీ కా పా శల్యతి మర్చిభ్యః కన్......మర్కః=శరీరవాయుః" (సి. కౌ. ఉణాది-3_23 సూ.)

"౧౯. ముక్త=(ముత్యము). ప్రాకృ-ముత్తా. తమి-ముత్తు. ఈ సంస్కృత తమిళ శబ్దములు రెండును "ముదల్"=(మొదలు) అను ద్రావిడ ధాతువునుండి వచ్చియుండును. 'ము'-లేదా 'మి' ధాతువు. 'మొదటిదై యుండు' అని ధాత్వర్థము. రత్నములలో మొదటి దనఁగా శ్రేష్ఠమైనది" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—ప్రాకృ-'ముత్తా'. తమి-'ముత్తు' అనునవి రెండును సంస్కృత 'ముక్తా' శబ్దభవములు. "సంస్కృ-మౌక్తిక=ముత్తిఅ=ముత్తియము =ముత్యము" అని తెల్గుశబ్దపు వ్యుత్పత్తి నరయునది. "ముచ్యతే శుక్తి సంపు టా దితి='ముక్తా', ముక్తైవ=మౌక్తికమ్. ముచ్=మోక్షణే" (ముత్యపు చిప్ప వలన విడువఁబడునది)......(లింగా. ౫౮౩ పుట).

"ముక్తా-స్త్రీ-మౌక్తికే, ఇన్దురత్నే, శౌక్తికే-('మోతీ' ఇతిభాషా) - రత్నే-(ముచ్యతే స్మ, ముచ్+క్తః)—వ్యపగతపాశాయామ్-పుంశ్చల్యామ్" (శబ్దార్థ చిం.).

పయి నుదాహరించిన యర్థవిశేషములు సంస్కృతమువారి వ్యుత్పత్తికి-'ముచ్' ధాతుజన్యమునకు-సరిపడునుగాని డా. గుండర్టుగారి వ్యుత్పత్తికి సరి పడవు గదా!

౨౦. "భిల్ల = (కిరాతుఁడు) ద్రావి-భిల్ల = విల్ = బిల్ = (విల్లు = ధనువు)" (కాల్డు. ౫౭౮ పుట).

విమర్శము:—బకారము భకారముగ బరిణమించినదనుట సహజము కాదు.

"భిల్ల-పుం-భిల+లక్=భిల్ల-మ్లేచ్ఛజాతిభేదే. "భిల=భేదనే" "కైవర్త మేద భిల్లాశ్చేతి స్మృతిః" (శబ్దస్తో). "బిలకళ । భేదనే బుల్క-మజ్జనే । భల భల్క-జ్ భిల్క- బాది । వత్......" (కవికల్పద్రుమ ధాతుపాఠము. లాంత వర్గము). పైవానినిబట్టియు భిల్ల శబ్దపు ప్రాచీనతనుబట్టియు ద్రావిడ 'విల్' శబ్ద మీ భిల్ల శబ్దపరిణామ మని తోఁచుచున్నది."

౨౧. "రాత్రి = (రేయి). ద్రావి-ఇరా = ఇరవు. తెల్గు-రే-ఇర్-(ధాతువు)=చీఁకటిగా నుండు. ఇర్+ఉళ్=(చీఁకటి)" (కాల్డు. ౫౭౮ పుట).

విమర్శము:—"రాతి=దదాతి సుఖ మితి=రాత్రిః, ఇ. సీ. 'రా=దానే'=(సుఖము నిచ్చునది)" (లింగా. ౯౦ పుట). తక్కిన కోశములందును పై రీతినే వ్యుత్పత్తి వ్రాయఁబడెను. రాత్రి శబ్దములోని రేఫమును బల్కఁ జాలక

ద్రావిడులు 'ఇ' కార పూర్వకముగాఁ బల్కుటలో 'ఇర్' శబ్ద మేర్పడి యుండును.

పయి యభిప్రాయ ద్వయములో నొక దాని నిర్ణయించు వినిగమక మేదియు లేదు. ఇట్టి శబ్దము లుభయ కుటుంబ సాధారణము లనుట యుక్తము.

౨౨. "విరల=(అరుదు=వదులుగా నుండు) తమి-మలయా-విరల్=(విరివి). 'విరి' ధాతువు. 'విరియు=చెదరి యుండు' అని ధాత్వర్థము" (కాల్డు. ౫౭౮.)

విమర్శము:—"విశేషేణ రాతి అన్తరమ్=విరలమ్. 'రా=ఆదానే'=(విశేషముగా నవకాశము నంగీకరించునది)" (గురుబా=లింగా. ౬౬౬ పుట).

"విరల-త్రి-(వి+రా+కలన్) అవకాశే-విచ్ఛిన్నే-అనిబిడే చ" (శబ్దస్తో).

౨౩. "హేరమ్బ=(దున్నపోతు). ద్రావి. ఎరుమ = ఎర్మ" (కాల్డు. ౫౭౮ పుట).

విమర్శము:—దీనికి మహిష పరార్థము కొన్ని కోశములలో మాత్రమె గలదు. 'రబి=శబ్దే' ధాతువు. (చూడుము సి. కౌ. ౩౭౬ ధాతువు. బాలమా. సి. కౌ. ౭౨౯ పుట). అఱచి పిలువఁదగినది=పెద్ద శబ్దముచే హెచ్చరింపఁ దగినది) దీని వికృతియె ద్రావిడ 'ఎర్మ' శబ్దమేమో?

౨౪. "శృఙ్గబేర=(అల్లము). ఇది కేవల ద్రావిడ శబ్దము. తమి-మలయా-"ఇఞ్జి=ఇఞ్చి" (అల్లము) - కన్న-సుణ్టి=(అల్లము). మూల ద్రావిడ శబ్దము 'స' కారాదికమై యుండును. (చూడుము ఇండియను ఏంటిక్వెరీ. నవంబరు ౧౮౭౨ సం॥ బర్నలు దొరగారి వ్యాసము). ప్రాచీన కాలమున గ్రీకులు మలబారునుండి 'అల్లము'ను దెచ్చుకొనువారు. మలయాళమున 'ఇఞ్చి' అను దానితో 'వేర్'=(మూలము=వేరు) అను దానిని జేర్పఁగా 'ఇఞ్చి వేర' అనునది సిద్ధించి యుండును. ('విర్'=విరియు) అను ధాతువు నుండి 'వేర్' అను నీ సంస్కృత ద్రావిడ సామాన్య శబ్ద మేర్పడి యుండును. (ఇది సకారాదిగ నాది నుండెడిదనియు నక్కారణమున "సిఞ్చివేర=శృఙ్గవేర" అని యేర్పడెననియుఁ గాల్డువెల్లుగారి యాశయము) (కాల్డు. ౫౭౮ పుట).

విమర్శము:—"శృఙ్గబేరమ్-అ-న. ఆర్ద్రకమ్.=(తెల్లు-అల్లము)" (సర్వ శబ్దసంబోధిని). "శృఙ్గ వేర. న. శృఙ్గమివ వేరమ్=అవయవో యస్య-ఆర్ద్రకే. శుణ్ఠ్యామ్......" (శబ్దస్తో). వేర. న. (అజ+రన్. వీభావః) దేహే-వార్తాకౌ, కుఙ్కుమే-చ. సఞ్జ్ఞాయామ్-కన్. కర్పూరే." (శబ్దస్తో).

డా. కాల్డువెల్లుగా రుదాహరించిన 'సిన్చి వేర' శబ్దములోని 'సిన్చి' శబ్ద మీా 'శృఙ్గ' శబ్దభవమె యని తోఁచుచున్నది. 'వేర్' శబ్దము సంస్కృత ద్రావిడ సాధారణమె కదా.

"ఇంకను నధికముగా నీ గుండర్టుగారు సంస్కృతమునఁ జొచ్చిన ద్రావిడ శబ్దము లనుచుఁ జూపిరిగాని యవి యట్లు విశ్వసింపఁదగి యుండలేదు. పైని వ్రాసిన వానిలో సైతము చాల శబ్దముల విషయమున నమ్మిక పుట్టకున్నది" (కాల్డు. ౫౭౭ పుట).

౨౫. "డా. గుండర్టు గారొక మంచి యుదాహృతి నిచ్చిరి. సంస్కృ-రూపమ్=తమి-ఉరువమ్=ఉరువు. ఇట్లివి సంస్కృత జన్యములుగఁ దోఁచు చున్నను దమిఴమున వీనికి వేఱుగ ధాతువు కన్పట్టుటచేత నివి సంస్కృత భవములు కావు. తమి-ఉరు=గట్టిగ నుండు. దీని రూపాంతరము 'ఉఱు' అనునది. దీనినుండి 'ఉఱుప్పు'=(దేహములోని యొక యవయవము. శరీరము-రూపము) అను శబ్దమేర్పడును. "ఉఱుప్పు=విభక్తి చిహ్నము-('ఉరుపు=విభక్తి ప్రత్యయము' శ్రీ రెడ్డిగారు) ఆయా విభక్తులు" అనియు నందురు, (ఉరుపు శబ్దము సంస్కృత రూప శబ్దభవ మనఁదగును.) డా. గుండర్టుగారు 'ఉఱుప్పు' శబ్దమునుండి సంస్కృత రూప శబ్దము వచ్చినదని నిశ్చయించిరి. ఇది నిజమెకాని 'ఉరువు' అను తమిఴ శబ్దము సంస్కృత రూప శబ్ద భవమనఁదగును" (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—"రోపయతి = విమోహయతీతి=రూపమ్. 'రుప్-విమోహనే'=(మోహింపఁజేయునది)". (లింగా ౧౧౫. పుట). ప్రాచీన తమ కాల మున 'రఱ' లకు మార్పు కలుగనేరదు. ఱకారము టత మధ్యస్థోచ్చారణము గలది. రేఫ మట్టిది కాదు. కాన 'ఉఱుప్పు' శబ్దమునుండి 'రూప' శబ్దము పుట్టనేరదు.

౧౪౧. IV విష:—"డా. కిట్టెలు దొరగారు ౧౮౭౨ సం॥ ఆగష్టు ఇండియను ఏంటిక్వెరీ వ్యాసమునఁ గొన్ని ద్రావిడ శబ్దములు సంస్కృతమునఁ జొచ్చిన వనుచుఁ జూపిరి. వానిలోఁ గొన్ని యిటఁ జూపఁబడుచున్నవి" (కాల్డు. ౫౭౭ పుట).

౧. "అట్ట=(అట్టాలకము=పైయంతస్తు). ద్రావి-'అడ్'=(ఒకటిపై నొకటి పేర్చు). అను ధాతువునుండి యేర్పడి యుండును."

౨. "అట్ట=(అన్నము) ద్రావి-'అడ్'=(వండు) అను ధాతువు యొక్క భూతార్థక రూపము".

౩. ‹‹అట్ట=('హట్ట' అనఁదగును. బజారు) ద్రావి-హట్ట = హట్టి= (కుగ్రామము). దీని ప్రాచీన రూపము-'పట్టి' అను శబ్దము. (చూడు కిట్టెలు-పట్టనము)›› (కాల్డు. ౫౭౭ పుట).

విమర్శము:—వీనిలో మూఁడవ దగు 'అట్ట' శబ్దము పట్టన శబ్ద సంబంధి. దాని నిటఁ జూపుట యప్రసక్తము. ప్రథమ ద్వితీయములగు 'అట్ట' శబ్దముల ద్రావిడ వ్యుత్పత్తికన్న సంస్కృత వ్యుత్పత్తియే సముచితముగా నున్నది. అట్ట శబ్దపు వివిధార్థములు ద్రావిడ వ్యుత్పత్తి విషయమున సరిపడవు.

‹‹అట్టః. పుం. హర్మ్య పృష్ఠోపరి నికేతే-క్షామే-అత్యర్థే-హట్టే-గృహోస్తరే. చతుష్కే-ప్రాకారాగ్రస్థిత రణగృహే. నపుం—ఓదనే. అట్యత ఇతి అట్టః 'అట్ట=అతిక్రమణే' (ధాతు). కర్మణి ఘఞ్. అట్టయతి వా-అచ్ ప్రత్యయః-శుష్కే›› (శబ్దార్థ చిం.).

'అట్ట' శబ్దార్థము నీ క్రింది రీతిని శబ్దస్తోమ మహానిధికర్త సమన్వయించి యున్నాఁడు.

‹‹అట్ట-అతిక్రమే-వధే-భ్వాది......›› (శబ్దస్తో).

‹‹అట్ట-అనాదరే-చురాది›› (శబ్దస్తో).

‹‹అట్ట-పుం-అట్టయతి=అనాద్రియతేఽన్యత్ర. చురాది. అట్ట-ఘఞ్.

ప్రాసాద స్యోపరిగృహే......తత్రస్థితా హి నరా అన్యాన్ హీనతయా నాద్రియన్తే. అతిశయేచ. తస్మిన్ సతిచ అన్యోత్కర్షే అనాదరః››. (శబ్దస్తో).

౪. ‹‹ఆమ్ = (అంగీకారార్థకము). ద్రావి-ఆమ్ = ఆమ = (అగును). 'ఆ+గు' ధాతువుయొక్క భావ్యర్థక తద్ధర్మార్థకమగు నమహాత్కర్త్రైకైక వచన రూపము›› (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—'ఆగు' అను తమిట ధాతువుయొక్క ప్రథమ పురుషైక వచనము 'ఆగుమ్'=(అగును) అనునది. దాని సంక్షేపరూపములు 'ఆమ-ఆమ్' అనునవి. ఇవి యాధునిక రూపములు. 'ఆగుమ్' అనునది ప్రాచీనతమ రూపము. కావున నాధునికములగు 'ఆమ్=ఆమ' అను వానితోఁ బ్రాచీన తమమగు సంస్కృతమందలి 'ఆమ్' శబ్దమునకు యాదృచ్ఛికపుఁ బోలిక యయినఁ గలదని చూపుట సరికాదు. ఇది తొల్కాప్పియమునఁ జెప్పఁబడలేదు. కానఁ బ్రాచీనము కాదని శ్రీ వేంకటరాజులు రెడ్డిగారు వ్రాసిరి. (౧—౬—౫౪ తేది జాబు) మఱియు సంస్కృతమందలి 'ఆమ్' అను నవ్యయము స్థితియు నిర్బాధము కాదు. అంగీకారార్థమున ‹‹ఆ-ఓమ్›› శబ్దములు మాత్రమె వాచస్పత్య సమ్మత ములై యున్నవి. ఈ క్రింది నామ లింగాను శాసన శ్లోకభాగ మిట్టి 'ఆమ్' శబ్ద స్థితి భ్రాంతికి మూలమగుచున్నది.

"ఆ మేవమ్" (నామలిం-అవ్య-౧౬ శ్లో). 'ఆమ్-ఏవమ్' అను రెండును నొకఁడు చెప్పిన దాని నంగీకరించుట యందు వర్తించును,......కొందఱు 'ఆమ+ఏవమ్=ఆమైవమ్' అని పఠించుచు 'ఆమ' అను నవ్యయము జ్ఞాన నిశ్చయమునందు వర్తించు ననిరి. 'ఆమ జ్ఞాన వినిశ్చయే' అని వోపాలితుఁడు" (లింగా. ౮౭౧ పుట). పరిశీలింపఁగా 'ఓ మేవం పరమం మతే' (నామలిం-అవ్య-౧౨ శ్లో) అను నామలింగానుశాసన శ్లోక భాగమునుబట్టి 'మతే'=అనఁగా సమ్మతియందనఁగా సంగీకారార్థమునందు-'ఓమ్-ఏవమ్-పరమమ్' అనునవి మాత్రమె వర్తించుననియుఁ పయి పదునాఱవ, శ్లోకభాగము, 'ఆ ఏవమ్' అనునవి జ్ఞాన నిశ్చయార్థకములని వచించు చున్నదనియుఁ జెప్పుట యుక్తమని తోఁచెడిని. ఇట్టి యభిప్రాయముతోడనె కావలయు శబ్దస్తోమ మహానిధికర్త 'ఆమ్' అను శబ్దమునె యంగీకరింపక 'ఆ' శబ్దమును మాత్ర ముదాహరించిన వాఁడయ్యెను. దానికిఁ బర్యాయముగా 'ఓమ్' శబ్దమును సయితము ప్రదర్శించెను.

"ఆ-అవ్య. (ఆప్+క్విప్-పృషోదరా దిత్వా త్పలోపః)......అనుకమ్పాయామ్-సముచ్చయే-అఙ్గీకారే......" (శబ్దస్తో).

('ఆమ్' అను నవ్యయ శబ్దమె శబ్దస్తోమ మహానిధియందు లేదు) "ఓమ్-అవ్య. ప్రణవే - ఆరమ్భే - స్వీకారే- ఓ మిత్యుక్తవతోఽథేతి మాఘః-అనుమతౌ......" (శబ్దస్తో).

౫. "ఆర-కూట = (ఇత్తడి-కొన్ని లోహముల కూడిక). ద్రావి-కూట=కలయిక. కుడ్-(ధాతువు)=(కలియు-కూడు)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—డా. కిట్టెలు దొరగారు 'ఆర' అను ద్రావిడ శబ్దము గలదని కాని దానికి 'లోహము' అను నర్థము కలదని కాని వ్రాయలేదు. 'ఆర' అను సంస్కృత శబ్దము పైనె 'కూట' అను ద్రావిడ శబ్దము నిల్చెనని తలంచిరేమో? 'ఆర' అను సంస్కృత శబ్దమునకు 'ఇత్తడి' అనియే యర్థము. 'కూట' శబ్దమును సంస్కృతమె యనుట యుక్తము కాదా? సంస్కృతమున 'కూట' శబ్దము లేదా?

"ఆరకూటః-పుం-న. పిత్తళే-రీత్యామ్. (ఇత్తడి)......ఆరం కూటయతే-కూట దాహే, పచాద్యచ్" (శబ్దార్థ చిం.).

"ఆరకూట-పుం-న. ఆరం=పిత్తలం-కూటయతి=స్థూపీకరోతి. అచ్-పిత్తలాభరణే. మారకూటాభరణేన న శ్రియ ఇతినైషధమ్" (శబ్దస్తో).

౬. "ఆట-ఆడ" ఇదొక ప్రత్యయము. దీనికి 'ఆడుకొను-ప్రేమతోఁ బెంచు' అని యర్థము. ఉదా:—వాచాట=(అధిక ప్రసంగి.) ద్రావి-ఆడు=క్రీడించు-ఉపయోగించు" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—'వాచ్+ఆట=వాచాట' అను శబ్దములోని ఆట ప్రత్యయము ద్రావిడ శబ్దమని డా. కిట్టెలు దొరగారి యాశయము. 'ఆట' అనునది 'ఆడు=క్రీడించు' అను ద్రావిడ ధాతువునుండి యేర్పడినదని తాత్పర్యము. కాని యందలి 'ఆట' శబ్దము సంస్కృత మందలి 'అట=గతౌ' అను ధాతువు సంబంధమైనదని దొరగారేల భావింపరైరో తెలియకున్నది.

"ఆల జాటచౌ బహుభాషిణి" (౫-౨-౧౨౫). 'కుత్సిత ఇతివక్తవ్యమ్ (వార్తి 3_౨_౨3) (ఈ నియమమును దర్వాతివారు పాటింపలేదు. 'వాగ్మి వాచాట వాచాలాః' ముగ్ధబోధవ్యా)=కుత్సితం బహు భాషతే=వాచాలః=వాచాటః-యస్తు సమ్యగ్బహు భాషతే స వాగ్మీత్యేవ" (సి. కౌ. ౧౯3౧ సూ). ఇట్టి యెడల నిల్చు 'ఆట' ప్రత్యయము 'అట=గతౌ' అను సంస్కృత ధాతువు మూలముగాఁగల దనుట యుక్తము గదా.

౭. "'ఆల' ఇదొక ప్రత్యయము. దీనికి 'కల్గిన' అని యర్థము. ఉదా:— ద్రావి-మలయాళ=(కొండలు గల). అశ్వవాల=గుఱ్ఱములు గల). ద్రావి-అళ్= (కల)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—"అశ్వ+ఆల=అశ్వ+వ్+ఆల" అని డా. కిట్టెలుగారు ఛేదించిరేమో? సంస్కృత శబ్దముమీఁద ద్రావిడ ప్రత్యయము నిల్చిన దననేల?

"అశ్వవాల. పుం-అశ్వస్య వాలః-కేసర ఇవ తదాకార పుష్పత్వాత్. కాశే. అశ్వస్య కేశే." (శబ్ద_).

౮. "ఆళి=(గొయ్యి). ద్రా. ఆళి=(లోఁతగు స్థలము.) ('ఆలి=(తమి)' శ్రీ వేంకటరాజులు రెడ్డిగారు) 'ఆళ్' (ధాతు)=(లోఁతుగా నుండు)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—'గొయ్యి-అగడ్త' అను నర్థములుగల 'ఆళి' శబ్దమే సంస్కృతమునలేదు.

౯. "పాలన=(జున్నుపాలు) ద్రావి-పాల్=(క్షీరము)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—'పాలన' శబ్దమునకు మూలమగు 'పాల్' శబ్దమే 'పా=పానే' అను సంస్కృత ధాతువునుండి పుట్టియుండునని డా. కాల్డువెల్లుగారు ముందు వ్రాయుచున్నారు. అట్టిది ద్రావిడ శబ్దమనియు నది సంస్కృతమునఁ బ్రవేశించెననియుఁ గిట్టెలుగారు వ్రాయుట సరికాదు. (చూడు 3౧ పాల్ శబ్దము. ౧౪౧ V విష).

౧౦. వల్లి=(తీఁగ) ద్రావి - వళ్ళి=(తీఁగ) వళ్-(ధాతు) = (నంగు-చుట్టు కొను)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—"వలతే=వేష్టతే, యష్ట్యాదిక మితివల్లీ...... 'వల-వేల్ల-సంవరణే"=(కఱ్ఱ మొదలగువానిని జుట్టుకొనునది." (లింగా ౨౮౦ పుట) "వల్ల=సంవరణే-భ్వాది" (శబ్దస్తో).

పయి యుదాహృతులనుబట్టి తమిఁట 'వళ్' ధాతువు సంస్కృత వికృతియె యనుటకు సందేహము లేదు. సంస్కృత 'ల' కారములను సైతము 'ళ' కారముగఁ బలుకుట తమిఁటమునకు వింత కాదు.

౧౧. "ముకుర=ముకుళ = (మొగ్గ). ద్రావి-మొగుళ్ ('ముకిల్-తమి • శ్రీ రెడ్డిగారు)=మొగ్=(ముకుళించు)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—"కలికా వస్థాం ముఞ్చతీతి ముకుళః. అ-న్న. 'ముచ్ ఌ మోక్షణే' (ధాతు). మొగ్గగా నుండుటను విడుచునది" (లింగా. ౨౮౫ పుట).

"ముకులః. పు-న. ఈషద్వికాసోన్ముఖ కలికాయామ్=కుట్మలే. ముఞ్చతి కలికాత్వమ్. ముచ్ ఌ మోక్షణే. బాహుళకా దులక్. ఆత్మని-శరీరే" (శబ్దార్థ. చిం.).

ఇట్టి 'ముకుళ' శబ్దమునుండియే ద్రావిడ-"మొగుళ్=మొగుడు" మున్నగు శబ్దము లేర్పడియుండును. ద్రావిడ 'మొగుళ్' (ముకిల్?) శబ్దమునకు సంస్కృ. 'ముచ్' ధాతు మూలకత్వమువంటి వ్యుత్పత్తి లేదు గదా. మఱియు 'ముకుళ కలిక'ల భేదమును దొరగారు గమనించి నట్లగపడదు. ముకుర శబ్దమునకును 'కోరక' మను నర్థము శబ్దార్థ చింతామణిలోఁ గలదు.

"ముకురః-పు-ఆదర్శే. దర్పణే. వకుళద్రుమే. కులాలదణ్డే. <u>కోరకే</u> ముఞ్చతి జ్యోతిః-'ముచ్ ఌ = మోక్షణే.' బాహుళకాత్ ఉరచ్. యద్వా మఙ్కతే-'మకి=మణ్డనే'. 'మకుర దర్దురౌ' వి త్యురచ్-నలోపశ్చ. బాహుళకాత్ పక్షే ధాతో రుపధాయా ఉకారశ్చ. (మకుర=ముకుర)" (శబ్దార్థ చిం.).

౧౨. "కుట=(మట్టిపాత్ర). కుడ్=(లోనికి గ్రహించు)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—"కుటః ...... పు-న-కలశే=ఘటే......కుటతి=కుటిలీ భవతీతి=కుటః. 'కుట-కౌటిల్యే' (ధా). ఇగుపధేతి కః." (శబ్దార్థ. చిం.). ద్రావిడ వ్యుత్పత్తికన్న సంస్కృత వ్యుత్పత్తియే విశ్వాసనీయమై యున్నది.

౧౩. "కుతార=(గొడ్డలి) ద్రావి-'కడి'=(కోయు=కొట్టు)" (కాల్డు. ౫౭౯ పుట).

విమర్శము:—"కుఠ=ఛేదనే. సౌత్రః." (శబ్దస్తో) "కుఠార. పుం. స్త్రీ. (కుఠ+కరన్) అస్త్రభేదే." (శబ్దస్తో). ద్రావిడ సంస్కృత 'కడి-కుఠ' ధాతువు లభిన్నములె యనవగును. ప్రాచీన కాలమున సరళములు ద్రావిడ భాషలలో లేవు. మహాప్రాణ ఠ కారము ట కారమగుట సహజమె కదా.

"ఇంకను ననేక శబ్దములు కిట్టెలు దొరగారిచేతఁ జూపఁబడెను. కాని యవి ద్రావిడ భాషనుండి సంస్కృతములోనికి వెళ్ళినట్లు తోఁచదు. కాని సంస్కృత ద్రావిడ భాషలలోనికి వేఱొక భాషనుండి వచ్చియుండును" (కాల్డు. ౫౭౯ పుట).

౧౪౧. V విష. '౨. సంస్కృత ద్రావిడ శబ్ద సామ్యములు:—I సంస్కృత భిన్నములగు నిండోయూరపియను భాషల శబ్దములు (గ్రీకు-లాటెను మొ.) చాలుగ ద్రావిడ శబ్దములను బోలుచున్నవి.

II సంస్కృత మాత్రముతోనె మిక్కిలిగఁ బోలియున్న ద్రావిడ శబ్దములును గలవు. వీనిని సంస్కృత పండితులు దేశ్యములందురు. (దొరగారట్టి దేశ్యము లనఁబడిన వానిని మచ్చునకేని చూపలేదు), ఇందు I మొదటి తరగతి శబ్దముల పట్టిక మిక్కిలి యధికము. రెండవదియుఁ గొంతగలదు. కావున ద్రావిడ భాషలకు సంస్కృతముకన్న సంస్కృతేతరములగు నిండోయూరపియను భాషలతోనె యధిక సంబంధము గలదని తోఁచును. (చూడు ౮ IV విష.) ఈ సంబంధాతిశయమును బరిశీలింపఁగా సంస్కృత భాష యిండోయూరపియను భాషలతో వేఱుపడక ముందటి యవస్థలోనె మూల ద్రావిడభాష శబ్దానితో సంబంధ ముండెడిదని తేలుచున్నది. (చూడు ౭ II విష).

పయిరీతి నిండోయూరపియను భాషలకును ద్రావిడ భాషలకును నత్యధిక సంబంధము కల్గియున్నను వానికి జన్యజనక భావము కల్పింపరాదు. పై వానిలోని రెండవ తెగ శబ్దములను ద్రావిడ భాషలలో నవ్యుత్పన్నములనుగా నెన్నవలెను. ఈ శబ్దములు సంస్కృత ద్రావిడ భాషలకు వేఱొక భాషనుండి వచ్చియుండును" (కాల్డు. ౫౭౯, ౫౮౦ పుటలు).

"సంస్కృత ద్రావిడ భాషలకు సమానమయియున్న శబ్దములు (కాల్డువెల్లుగారు సంస్కృత ధాతుమాత్రమును జూపినను శబ్దస్తోమ మహానిధినుండి నేను దక్కిన వివరములను జూపితిని).

౧. "తమి:—అడి"=(కొట్టు-తన్ను-చంపు)

సంస్కృ-"అడ=ఉద్యమే - భ్వాది." "అడ్డ = అభియోగే - భ్వాది" (శబ్దస్తో).

౨. తమి:—ఉద్ + ఐ=(తన్ను-మెట్టు). ఉడై=ఒడై=పగులఁగొట్టు).
సంస్కృ-"ఉర్=ఉపఘాతే- భ్వాది" (శబ్దస్తో).
3. తమి-అడై-(ప్రవేశించు. పొందు).

సంస్కృ-వైదిక సంస్కృతమగు 'అడ్' అనుదానితోఁ బోల్చి చూచునది "అడ్=వ్యాప్తౌ-స్వాది" (శబ్దస్తో).

౪. తెల్గు-అన్ + ఉ=తమి-ఎన్=(చెప్పు-పలుకు).
సంస్కృత-అణ్=(శబ్దించు). "అణ=శబ్దే. భ్వాది" (శబ్దస్తో).
౫. తమి-అర్ + ఉ=(విరళముగ నుండు) విలువగల-ప్రియమగు.
సంస్కృత-అర్హ=(యోగ్యతగల). అర్ఘ=(విలువ).
౬. తమి-ఉర్ + ఉ= (ప్రాఁకు). శిష్ట గ్రాంథిక భాషలో దీనికి ('ఊరే' అనుదానికి శ్రీ రెడ్డిగారు) 'వాహనము నధిరోహించు' అని యర్థము.
సంస్కృ-'ఉర్=(పోవు). 'ఉర-గతౌ' సౌత్రః' (శబ్దస్తో.)
౭. తమి-కడ్ + అ=(దాఁటిపోవు-తొలఁగు.)
సంస్కృ-"కట=గతౌ. భ్వాది" (శబ్దస్తో)" (కాల్డు. ౫౮౦ పుట).
౮. తమి-కడ్ + ఉ = (బాధకలిగించు - కటువుగానుండు - కారముగా నుండు-చులుకుగానుండు-భయంకరమగు).

తమి-కడ్ + ఇ=(కఱచు). ఇది వేఱొక రూపసాధక ప్రత్యయముతోఁ గూడునపుడు 'కోయు-ఖండించు-నిందించు' అను నర్థముల నిచ్చును.
తమి-కడ్ + ఉ + గు=(త్వరపడు).
తమి-కచ్ + ఇ-(కూర) ఇది 'కడి' అనుదాని కభిన్నము.
తమి-కడుకడు=కడుశబ్దామ్రేడిత రూపము.
తమి-కడు + అమ్,=కడు + అఱు=కాడ్ + ఉ,=(అడవి).

తమి-'కడు' అనుదానికి మొదట 'ఆధిక్యము-అతిశయము' అను నర్థ ముండెడిదని తోఁచును.

సంస్కృత-కట్=(పోవు). "కటు-కటుక" శబ్దము లీ ధాతువునుండియే సాధింపఁబడును" (కాల్డు. ౫౮౧ పుట).

విమర్శము:—" 'కట-గతౌ' (ధా) 'కటు-కటుక' (కట + ఉ)-దూషణే-దుష్టకార్యే-రసభేదే" (శబ్దస్తో) అని యిట్లుగ నిది 'కట' ధాతువునుండియు సాధింతురు. ఇది ద్రావిడ శబ్దమెయనియు నది సంస్కృతమునఁ జొచ్చెననియు వెనుక దొరగారు వ్రాసిరి. (౭ శబ్దము ౧౪౧ II విష.). అచట నీ విష

యము విపులముగా విమర్శిత మయ్యెను. తమిలమం దీ ధాతువునుండి పుట్టిన శబ్దముల యర్థము లెల్ల సంస్కృత-'కటు=కటుకః' శబ్దమునకుఁ గలవు. ప్రాచీన ద్రావిడ భాషలో సరళోచ్చారణమె లేదు గాన సంస్కృత కటు శబ్దాభిన్నమే యీ తమిలు కడు కటు శబ్దాదిక మని చెప్పవచ్చును.

"కటుః-పుం. రసవిశేషే.......చమ్పకవృక్షే. చీన కర్పూరే-పటోలే-కట్వీ-లతాయామ్. స్త్రీ. కటుక్యామ్-కటుకరోహిణ్యామ్. న. అకార్యే. దూషణే. త్రి-కటు రసయుక్తే. సుగన్ధౌ. తీక్ష్ణే. మత్సరే. అప్రియే. కట త్యావృణోతి తీక్ష్ణతయా ముఖమ్. "కటే=ఆవరణే" (ధా)......" (శబ్దార్థ చింతామణి).

"కటుక. పుం- పటోలే-సుగన్ధివృక్షే-అర్కవృక్షే-కుటజ వృక్షే=రాజ సర్షపే (ఆవాలు). న-వ్యోషే. త్రి. కటుని. స్వార్థే కః" (శబ్దార్థ చిం.).

"భూలరు దొరగారు తమ సంస్కృత మూర్ధన్య చరిత్ర వ్యాసమున ౩౭ పుటలో నీ 'కటు' శబ్దమును కర్తనార్థకమగు 'కృత్' ధాతువునుండి సాధించిరి. ఇది యుక్తమెయని తోఁచుచున్నది. (కృత్=కర్త్=కటు). ("కృత్-ఛేదే తుదాది" శబ్దస్తో). ఈ పక్షమున సంస్కృత ద్రావిడ ధాతువుల యర్థము కలిసిపోయెను. 'కోయు=కఱచు-ఖండించు' అను నర్థము లీ రెండిటికిని స్వీయములె యగును. ఇంక సంస్కృతములోని 'కటుక' శబ్దము (ఆవాలు) ద్రావిడ 'కడుగు' శబ్దమునుండియే వచ్చినదనఁదగును. 'గు' చేరుట తమిఁఱమున స్వాభావికము" (కాల్డు. ౫౬౧ పుట).

విమర్శము:—అర్థ మేదో యొకరీతిని సరిపెట్టుకొందు మన్నను 'కటు. శబ్దము 'కృత్=కర్త్' ధాతువునుండి యేర్పడెననుట కేవలము నసంభవము' వ్యాకరణ సంప్రదాయ విరుద్ధము. ద్రావిడ భాషలలో 'గు' శబ్దము చేరుట స్వాభావిక మయినట్లే సంస్కృతమున 'క' ప్రత్యయము చేరుట మిక్కిలి స్వాభావికము. కావున ద్రావిడ 'కడు' శబ్దము సంస్కృత 'కృత్-కర్త్' శబ్ద సంబంధి కానేరదు. అది 'కటే-వర్షావరణయోః' అను ధాతువునుండి యేర్పడినదే యనుట యుక్తము.

౯. "తమి-కలుదై=తెల్గు-గాడిద. కన్న-కత్తె ("'కత్తొ' ప్రాచీన. 'కత్తె' నేఁటిది." శ్రీ రెడ్డిగారు) సంస్కృ-ఖర=(గాడిద). పర్షియన్-చర్. కుర్దిషు-కెర్-లఘ్మనీ-కరతిర్=(ఆఁడు గాడిద)" (కాల్డు. ౫౬౧ పుట).

౧౦. కన్నడ-కిన్న. తుళు-కిని. తెల్గు-చిన్న-తమి-సిన్న. కన్నడమందలి 'కిన్న' శబ్ద కకారము సారళ్యమంది 'స' కారమైనది. ద్రావిడ పండితులు

'సిఱు' (చిఱు) శబ్దమునుండి 'సిన్న' శబ్దము పుట్టినదందురు. కాని ఱకారము నుండి 'న' కారము పుట్టెననుటకు సంకోచించుచున్నాను.

సంస్కృ-కణ-కణికా-కనీయన్"-అల్పార్థకములు" (కాల్డు. ౫౮౧ పుట).

విమర్శము—'సిఱు-సిన్న' శబ్దములు పరస్పర సంబంధము గలవనుటకు దొరగారు సంకోచింపరాదు. తమిఱు మూర్ధన్య 'స' కారము 'ఱ' కార పరుషమున కనునాసికమెకదా.

౧౧. "కూర్గుభాష-కెయ్=(చేయు)=తుద-కై. కోట-కె. గోందు-కీ. పఱగన్నడ-గెయ్. తెల్గు-చేయు. మల-చెయ్. తమి-సెయ్. 'కై=(చేయి)' అనునది ద్రావిడ సామాన్యపదము. తెల్గున - 'చేయి'=(హస్తము) అనియుగలదు. 'చెయ్-కెయ్' అనువానిలో 'కెయ్' అనునదె యెక్కువ పారుష్యము గలది గాన నదియె ప్రాచీనతరము. సంస్కృత-'కర్-కర' అనునవి వీనికభిన్నము లనుటకు సందియము లేదు. ఈ 'కర్-కర' అనువానినిబట్టి 'కృఞ్' ధాతువు కల్పిత మయినది. నామములకన్న ధాతురూపమె పరభావియని గ్రహింపవలెను. సంస్కృతమునందును 'కృఞ్' ధాతు రూపములలోని 'క' కారము 'చ' కార ముగా మాఱుట కలదు. కాని యెల్ల రూపములందును రేఫము వెలయు చున్నది. ఇతరములగు నిండో యూరపియను భాషలందు సైత మీధాతు వులో రేఫము కనఁబడుచున్నది. అయినను సంస్కృతమందలి 'కర్-కర' అను వానికిని ద్రావిడ భాషలందలి 'కెయ్-కై' అను వానికిని బరస్పర సంబంధము గలదని రూఢిగాఁ దోఁచుచున్నది. జండు భాషలో 'కర్' అను పదముండుట చేత సంస్కృతమువారు ద్రావిడుల యొద్దనుండి యెరవు గైకొనిరని చెప్పుటకు వలను పడదు. సంస్కృతమున 'కర్' శబ్దమునకును ద్రావిడ భాషలలో 'కెయ్-కై' శబ్దములకును నధికమగు వాడుక వెలయుచుండుటచేత నిది యొకటినుండి మఱొకదానిలోనికి వచ్చిన దనరాదు. ద్రావిడభాష లన్నిటియందును 'కై' శబ్ద మేదో యొక రూపమున వెలయుచున్నది. పయి రీతిని సంస్కృత ద్రావిడ భాషలు రెండిటియందును నయ్యది యుండుటనుబట్టి యా రెండును బ్రత్యేక వ్యక్తులనియు వానిని వ్యవహరించువారు చిరకాలము క్రిందట నొక్కచోఁ గలసిమెలసి యుండెడివారని కాని లేక యభిన్నులే యని కాని యంగీకరింపక తీరదనియుఁ జెప్పక తప్పదు. ఈ సందర్భమునుబట్టి ద్రావిడ భాషలెల్ల నార్యభాషలలోనివె యనరాదు. 'కర్-కై' అను నుభయవిధము లగు పదములును "తార్తారు-ఫిన్నిషు" (సిథియను) మున్నగుభాషలలో సైతము కనఁబడుచున్నవి. ఈ జంటల సామ్యము సిథియను సామ్యముల వివరణమున నింకను విమర్శింపఁబడును" (కాల్డు. ౫౮౨, ౫౮3 పుటలు) (తార్తారు ఫిన్నిషు

భాషలును నార్య కుటుంబములోనివని యెవ్వరును జెప్పఁజాలరుగదా యని భావము).

విమర్శము:—'కర్-కై' అనువానిలో 'కర్' అనుదాని యందలి రేఫ వైశిష్ట్యము వాని యభిన్నత సందిగ్ధమని తోఁపించుచున్నది.

౧౨. తమి. "కుర్+అల్ = (ధ్వని-శబ్దము) 'కుర్' = (ధ్వనిచేయు) ధాతువు. తమిళమందలి 'కోటి'=(కోడి) శబ్దమును 'కుర్' శబ్ద సంబంధి యేమో? 'కుర్' అనుదానికి 'కు'=(కూయు). అనునది మూలధాతువు. 'కు' అనునది ధ్వన్యనుకరణ శబ్దము. కూయ్+ఇల్ =(కోకిల). సంస్కృ. కర్= పిలుచు. గర్-ధ్వనించు" (కాల్డు. ౫౮౪ పుట).

విమర్శము:—'కర్' అనుదానికిఁ బ్రత్యేక స్థితిలో 'పిలుచు' అనునర్థము లేదు. ఆఙ్ పూర్వక కృధాతు ణ్యన్త రూపమున కట్టి యర్థము లభించును.

"ఆకారణ. స్త్రీ-న. (ఆ+కృ+ణిచ్+ల్యుట్) (ఆ+కృ+ణిచ్+ యుచ్)—ఆ కారణా=ఆహ్వానే......" (శబ్దస్తో).

"'గౄ = శబ్దే.' (ధా). క్ర్యాది......గృణాతి. అగారీత్" (శబ్దస్తో) "గిర్=గిరా. స్త్రీ. (గౄ+క్విప్) (వా-టాప్) వాక్యే......" (శబ్దస్తో).

౧౩. "తమి-కుదిరై =(గుఱ్ఱము). కన్నడ-కుదిరె. 'కుది' (దుముకు) అను ధాతువునుండి వచ్చియుండును. ఈ కుదిరై శబ్దము స్వతంత్ర మని తలంపఁ బడును. కాని 'ఘోట=కుదిరై' శబ్దములకుఁ బ్రాచీన సంబంధముండిన నుండవచ్చును. ఘోట శబ్దము సంస్కృత శబ్దము.

సంస్కృత-ఘోట. ఈ ఘోటశబ్దమునె తమిళు లెరవు తెచ్చికొని 'గోటమ్-గోడగమ్' అని వాడుదురు. ఘుట్=(ప్రతిక్రియ చేయు) అను సంస్కృత ధాతువునుండి ఘోట శబ్దము పుట్టినది" (కాల్డు. ౫౮౪ పుట).

విమర్శము:—'ఘోట=కుదిర' శబ్దముల కేదేని ప్రాచీన సంబంధ ముండిన నుండవచ్చుననియు 'కుదిర' శబ్దము స్వతంత్ర మనియు నిట వ్రాసిరేకాని వెనుక (చూడు ౧౮౧ III విమ. ౯ శబ్దము) డా. గుండర్టుగారు వ్రాసిరనుచు "కుదిర" శబ్దము ద్రావిడమె యనియు నయ్యది సంస్కృతమునఁ జొచ్చి ఘోట శబ్దముగ నేర్పడెననియుఁ గాల్డువెల్లుగారు వ్రాసియున్నారు.

'ఘుట=పరివర్తనే' అను ధాతువునుండి ఘోట శబ్దమును సాధించుట సంప్రదాయము. (చూడు ౧౮౧ III విమ).

కాని "ఘుట=ప్రతిఘాతే" అను తుదాది ధాతువునుండి సాధించుట సంప్రదాయముకాదు. ప్రతిఘాతమనఁగా 'దెబ్బకుఁ బ్రతిగా దెబ్బకొట్టి పగ దీర్చికొనుట' యని యర్థము. ఇట్టి యర్థమునకు 'ఘోట' శబ్ద విషయమున సందర్భము కానరాదు.

"ఘుట=పరివర్తనే" (సి. కౌ. ౭౮౬ ధాతువు) "ఘుట ప్రతిఘాతే" (సి. కౌ. ౧౩౮౫ ధాతువు).

"ప్రతిఘాతః=ప్రతిఘః...౨ ప్రతిఘాతే......(౨ పగదీర్చికొనుట)" (సర్వ శబ్ద సంబోధిని)

౧౪. "తమి-కిట్+ఇ=కిటి=(చీల్చు). సంస్కృ-'ఖుర్=(గీఱు-కోయు)" (కాల్డు. ౫౮౪ పుట).

విమర్శము:—'ఖుర్=ఛేదనే' (౧౩౪౨ ధాతు. సి. కౌ. తుదాది) ఈ పోలిక విశ్వసనీయముగ లేదు.

౧౫. తమి-"కెడ్+ఉ=(చెడఁగొట్టు-చెడఁగొట్టఁబడు) కేడు=(వినాశము). కెట్ట=(చెడ్డ). తెల్గు-చెడు.

సంస్కృ-ఖిద్=(దుఃఖించు). దీని కృదంతము-ఖేద. ఖిట్=(భయపెట్టు) ఖేట్=(చెడ్డ=నీచమైన). గ్రీకు-ఖేదన్=(దుఃఖము).

ఇట్టి సామ్యములనుబట్టి వీని కన్నిటికిని మూలభాష వేఱొకటియుండునని విశదమగుచున్నది" (కాల్డు. ౫౮౪ పుట).

విమర్శము:—"ఖిట=భయే-భ్వాది" (శబ్దస్తో) "ఖేటః. అ. త్రి. నికృష్టః......" (సర్వ-సంబో) 'ఖేట్' అను టకారాంతము సంస్కృతమునఁ గానరాదు.

౧౬. "కొడ్+ఉ=(తమి-మల)=భయంకరమైన-అతిశయమైన-కఱుకుగానుండు. దీని యథాస్తార్థము 'వంకరగానుండు'. కొడ్+ఉక్కు=(ఎండ్రకాయగోరు). కొడిల్=(గోరుగుండు) ('ఇది తమిళమున లేదు' శ్రీ రెడ్డిగారు) సంస్కృ-కుట్=వంకరైన" (కాల్డు. ౫౮౪ పుట).

విమర్శము:—"కుట=కౌటిల్యే. తుదాది......" (శబ్దస్తో).

౧౭. "సిల్+ఇర్=(తమి=(కంపించు. రోమాంచితమగు). సంస్కృ:—చేల్=(కంపించు). ('కుళిర్'=(చల్లని) అను తమిళ శబ్దమునొద్ద నున్న పట్టిక చూచునది)" (కాల్డు. ౫౮౪ పుట).

విమర్శము:—"చేల్ఱ - కేల్ఱ = చలనే" (సి. కౌ. భ్వాది. ౫౩౬ ధాతువు.)

౧౮. "తమి-'సె'=(ఎఱ్ఱగా నుండు). కన్నడ-'కెన=కెన్-చెయ్=చెన్'. ఈ 'సె' ధాతువునుండి పెక్కు నామములు విశేషణములు పుట్టును. ఉదా.—తమి-సెన్=(ఎఱ్ఱని). సంస్కృ:—శోణ=(ఎఱ్ఱని)" (కాల్డు ౫౮౪ పుట).

౧౯. "సెవి. (తమి). మల-తెలుఁగు-చెవి. కన్న-కివి. తుళు-'కెప్పి' సంస్కృ. శ్రవ-'శ్రు' ధాతువు" (కాల్డు. ౫౮౫ పుట).

౨౦. "తడ్+ఇ = (తమి) = (కఱ్ఱ=గుదియ). తడి=క్రియాంగము. తడి=(మొద్దుగానుండు-బరువుగానుండు). 'తట్ట్+ఉ'=(కొట్టు=దెబ్బవేయు). సంస్కృ. తడ్=(కొట్టు)" (కాల్డు. ౫౮౫ పుట).

విమర్శము:—"తడ=(ఆఘాతే) భ్వాది" (శబ్దస్తో).

౨౧. "తమి-'తీ'=(అగ్ని). సంస్కృ-'దీ'. దీనినుండి 'దీప్=(ప్రకాశించు)' అనునది జనించును" (కాల్డు. ౫౮౫ పుట).

విమర్శము:—సంస్కృతమున 'దీ=క్షయే' అను చొప్పున 'దీ' ధాతువునకు 'క్షయ'మని యర్థము. దీనికి దీప్తియను నర్థము లేదు. 'దీప=దీప్తౌ-దివాది' (శబ్దస్తో) అను చొప్పున 'ప'కార ఘటితమునకే 'దీప్తి' యని యర్థము.

౨౨. "తమి-తూవ్+ఉ=మెల్లగాఁజల్లు=(ధూళిని జల్లు)-(సంస్కృ-'ధూ=కమ్పనే' అను స్వాది ధాతువును బోలుచున్నదని ౨౩ శబ్దపు వివృతిలో వ్రాయఁబడును).

౨౩. తమి-తూఱ్+ఉ=(వెదచల్లు=వ్యాపింపఁజేయు) దీని సకర్మక రూపము 'తూఱ్ఱు'. దీనిని 'తూట్ట్రు' అని పల్కుదురు. 'చెరుగుట' అని యర్థము. వీని యన్నిటికిని (౨౨-౨౩ శబ్దములకు) దమిళ మూల ధాతువు 'తూ' అనునది=సంస్కృ-'ధూ=కదల్చు'-కలంచు. దీనినుండి పుట్టిన రూపములు-'ధూళి-తూస్తు'-అనునవి. 'తూస్తు' శబ్దము 'తుస్'=(చల్లు) అను ధాతువునుండి యేర్పడెను. ఇంగ్లీషు 'డస్ట్'=(Dust) అనునది దీని కభిన్నము. సంస్కృత 'ధూళి' శబ్దమునుండి 'తూళి-తూళ్-తూసి' అనునవి తమిళమునకు వచ్చినవి. 'ధూ' అను సంస్కృత ధాతువును 'తూ' అను తమిళ ధాతువును బ్రత్యేక వ్యక్తులు" (కాల్డు. ౫౮౫ పుట).

విమర్శము:—"ధూ=కమ్పనే. తుస=ధ్వానే. భ్వాది." (శబ్దస్తో). అను చొప్పున 'తుస' ధాతువునకు 'చల్లు' అను నర్థము కానరాదు.

౨౪. "తమి-నడ్+అ=(నడచు). సంస్కృ:—నృత్=(నృత్యముచేయు). దీనినుండి 'నట్' అని యేర్పడును. (సంస్కృ-'నృత్=నర్తనే-దివాది' 'నట=నృత్యే-భ్వాది' శబ్దస్తో). సంస్కృతమున గత్యర్థక ధాతువులు పెక్కు గలవు.

ద్రావిడ భాషలలో 'నడ్' ధాతువు మాత్రమె గత్యర్థము. మలయా-'నడ్+ఉ'=అను దానికి 'నడచు-కాలూను' అని యర్థములు. కుమారిల భట్టు 'నడేర్-నాడై'=(మార్గము) అనువానిని ద్రావిడ శబ్దములనుగా నుదాహరించెను. కాన సంస్కృత 'నృత్' ధాతువును ద్రావిడ 'నడ్' ధాతువును ప్రత్యేక వ్యక్తులు. వీనికి వేఱొక భాషలోని శబ్దము మూలమై యుండును.

౨౧౪. "తమి-నెయ్=(నేయు). సంస్కృ=‘నహ్’=(వడఁకుట. కూర్చుట)=(‘సంస్కృ-ణహా=బన్ధనే-దివాది’ (శబ్దస్తో). గ్రీకు-నేథో-జర్మను=నహెన్=(కుట్టు) లాటిన్=నెక్తో. తమిఱు-నూల్=(త్రాడు, వడఁకు)" (కాల్డు. ౫౮౫ పుట).

౨౧౫. "తమి-పల్=(అనేక). క్రియ యగునపుడు ‘గుణింపఁబడు=పెంచఁబడు’ అని యర్థము. సంస్కృ-పులు=పురు. ("పురు=ప్రచురే. త్రి.") (శబ్దస్తో).

౨౧౬. "తమి:—పాడు+ఉ=(పాడుట). సంస్కృ-‘పఠ్’ ధాతువు. (‘పఠ్=లిఖితవాచనే’) (శబ్దస్తో). దీనినుండి తెల్గున ‘పఠి’ ధాతు లేర్పడెను. (తెల్గున ‘పఠించు’ అని యేర్పడె ననవలయును). తమిఱమున ‘పడి’ అని యేర్పడెను. ‘పాడమ్’ అను తమిఱు శబ్దము సంస్కృత భవము. "తమి-పాడు-పాట్టు. కన్న-పాటు. గోందు-పాటా" అనునవి సంస్కృత భవములని తోఁచదు. కాని యీ ద్రావిడ శబ్దములును సంస్కృత ‘పాఠ-పఠ’ శబ్దములును ప్రాచీనతమ సంబంధము గలవియు నేదో వేఱొక భాషలోని శబ్దము మూలముగాఁ గలవియు (ఇట్టి వ్రాఁత వీరి కలవాటు) నై యుండును. ప్రాచ్యుల చదువు పద్ధతి ‘పాట’ వలెనె యుండును" (కాల్డు. ౫౮౫ పుట).

౨౧౭. "తమి-పాల్. తమిఱు మలయాళ కన్నడములలో దీనికి ‘భాగము-సగము’ అని యర్థము. సంస్కృ-‘ఫల్’=(విభజించు). ("ఫల=భేదనే-భ్వాది" శబ్దస్తో) లాటిను-‘పార్స్’=(భాగము). తమిఱు ‘పాల్’ శబ్దము ‘పగు’=(విభజించు) అను తమిఱు ధాతువునుండి పుట్టిన ‘పగల్’=(విభాగము-(లేక) పగలు) అనుదాని కభిన్నమని తోఁచుచున్నది. ‘పగుది=పాది’=(సగము) అనునవి మొదలగు చోటులం దిట్లు గకార లోపము ప్రసిద్ధమై యున్నది.

౨౧౮. తమి-‘పిఱ’=(పర=అన్య). తమి-పిఱన్=(ఇతరుఁడు). సంస్కృ-పర. ఉదా:—పరదేశ. తమిఱు ‘పిఱ’ శబ్దమును ‘ప్ర’ అను సంస్కృత ప్రాది (ఉపసర్గము) శబ్దముతోఁ బోల్పరాదు. సంస్కృత ‘పర’ శబ్దముతోఁ బోల్పనగును. తమిఱులు ‘పిఱ’ శబ్దము సంస్కృతమునుండి వచ్చినదే యనుచు దానిని దేశ్య మందురు. సంస్కృత విలక్షణమగు ‘ఱ’ కారము గలదగుట చేత నయ్యది సంస్కృత భవము కాదు. ‘పిఱ్+అ+గు’=(తరువాత-పిదప)

అను మఱొక తమిళ శబ్దమును గలదు. కాని యీ రెండర్థములును సంస్కృత 'పర' శబ్దమునకుఁ గల యర్థములోనివె. ఈ సంస్కృత ద్రావిడ 'పర-పిఱు' శబ్దముల మొదటి యర్థము 'పిదప' అనునది. కాలక్రమమున 'ఇతరుఁడు' అను నర్థము వచ్చి యుండును. పిఱు శబ్దమునకు 'పుట్టు' అను నర్థమును గలదు. అదియు 'పిదవచ్చు' అను నర్థముచేతనే లభించియుండును.

పర-పిఱు శబ్దములకు జన్యజనక భావము నంగీకరింప రాదు. ఈ రెండును వేఱొక భాషలోని మూల పదము నుండి లభించినవే.

౩౦. 'పొఱు'-(భరించు). సంస్కృ-భృ-భర్. ('భృ-భరణే-భ్వాది' శబ్దస్తో). వీనికి బలమైన సామ్యము గలదు గాని జన్యజనక భావము లేదు. (కాల్డు. ౫౮౭ పుట).

౩౧. "పాల్-(పాఁడి). ఇది యే ధాతువునుండి వచ్చెనో తెలియకున్నది. సంస్కృత 'పాయస' శబ్దముతోను 'పాయ' (నీళ్ళు) శబ్దముతోను బోల్చి చూచునది. అవెస్తా భాషలోఁ 'పేఓ'-(పాలు). ఆఫగని స్థానమున 'పోయ్'=(పాలు). ఇవెల్ల సంస్కృత 'పా' ధాతువు నుండియే పుట్టినవి. ఈ ధాతు విండో యూరపియను భాష లన్నిటియందును గలదు. ద్రావిడ 'పాల్' శబ్దము సయితము మీ ధాతువుయొక్క కృద్రూపమయి యుండునేమో? తమిళమున ననేక కృద్రూపముల తుదిని 'ల్-అల్' అనునవి కన్పట్టుచున్నవి. ఇట్టి దీని ద్రావిడ స్వభావమును నితర ద్రావిడ పదములును దీని సాక్షాత్సంస్కృత భవత్వమును వారించుచున్నవి. 'పాల్'=(పాలు) అనునది 'పాల్'-(భాగము ౨౮ శబ్దము) అనుదానితో నభిన్నమైనయెడల నది 'పగు' ధాతువునుండి గదా పుట్టవలయును. కాని 'పాఁడి-విభాగము' అను నర్థములకు సంబంధము కన్పట్టదు. తమిళమందలి 'బియ్యము' అను నర్థమున 'అముదు పడి'=(అమృత భాగము) అనుదానివలెనే క్షీరార్థకమగు 'పాల్' శబ్దమును వచ్చెనేమో?" (కాల్డు. ౫౮౭ పుట).

విమర్శనము:—అమృత శబ్దమునుండి తండులార్థకమగు 'అముదు' శబ్దమేర్పడినట్లు క్షీరార్థక 'పాల్' శబ్దమును 'పా' ధాతువునుండి యేర్పడెనేమో యని దొరగారి తాత్పర్యము నూహింపనగును. 'పాయస' శబ్దములోని 'పకారమును జూచి డా. కాల్డువెల్లుగారు భ్రమించుట వింత! పయస్సు యొక్క (క్షీరము యొక్క) సంబంధము గలది గాన క్షీరాన్న మను నర్థము గల 'పాయస' శబ్ద మేర్పడినది. అందు 'పా' ధాతు గంధమేని లేదు. నీటి పాయ శబ్దములోని పాయ శబ్దము భాగార్థకము. ఉదా:—ఏటినీరు రెండు పాయలై పాఱుచున్నది. పాయ యనఁగా నొకదానిలోఁ గొంత భాగము.

3౨. "పెసు-(తమి) ('పేసు' శ్రీ రెడ్డిగారు.)=(మాటలాడు). కన్నడ-పెళ్ ('పేల్' శ్రీ రెడ్డిగారు.)+ఉ. సంస్కృత-'భాష్' ధాతువు. "భాష.=వచనే-భ్వాది." (శబ్దస్తో)" (కాల్డు. ౫౮౭ పుట).

33. ఫూ =(ఫూవు-వికసించు). ఇది తమిళ కన్నడాంధ్రములలోఁ గలదు. సంస్కృ-'ఫుల్+అ'=(ఫుల్ల=పుష్పము) అను శబ్దమును దీనినుండి పుట్టిన మరాటీ 'ఫూల్' శబ్దమును బరిశీలింపఁగా ద్రావిడ 'ఫూ' శబ్దమును సంస్కృత భవమనియే తోఁచుచున్నది. తమిళమున 'పుష్పము' అను నర్థమున 'మలర్' అను వేఱొక శబ్దమున్నది" (కాల్డు. ౫౮౭ పుట).

విమర్శము:—సంస్కృతమున 'ఫుల్ల' శబ్దమేకాక 'పుష్ప' అను వేఱొక ధాతువును నామమును గలవు.

"'పుష్ప=వికాసే' దివాదిః" (శబ్దస్తో) "పుష్ప-న. (పుష్ప+అచ్)=కుసుమే-స్త్రీ రజసి-వికాసే-కుబేర విమానే-నేత్రరోగ భేదేచ-స్వార్థే 'కన్' ప్రత్యయః. పుష్పక-న. కుబేరస్య విమానే. నేత్రరోగ భేదేచ. రత్నమయ కఙ్కణే. రసాఞ్జనే. లోహకాంస్యే. మృదఙ్గారయో శ్శకట్యామ్. కాసీసేచ" (శబ్దస్తో).

"తయా నభః పుష్ప్యతు కోరకేణ" (నైషధ) అనునది మొదలగు కవి ప్రయోగములును పుష్ప ధాతువునకుఁ గలవు.

"ఫుల్ల=వికాసే-భ్వాదిః" (శబ్దస్తో).

"ఫుల్ల-త్రి. (ఫుల్ల+అచ్)=వికసితే పుష్పే" (శబ్దస్తో).

3౪. "వల్=(బలిష్ఠమగు) (తమి). వల్మై=(బలిమి) సంస్కృ-బల్+అ" (కాల్డు. ౫౮౭ పుట).

౧౪౨. విష:—సంస్కృత శబ్దముల సామ్యమునువలెనె సంస్కృతేతరములగు నిండోయూరపియను భాషల శబ్దముల సామ్యమును (కాల్డు. ౫౮౭ పుట మొ. ౬౦౫ పుట వ.) సెమెటికు భాషల శబ్దముల సామ్యమును (కాల్డు. ౬౦౫ మొ. ౬౦౭ పుట వ.) సిథియను భాషల శబ్దముల సామ్యమును (కాల్డు. ౬౧౦ మొ. ౬౨౪ పుట వ.) డా. కాల్డువెల్లుగారు కొంత విరివిగాఁ జూపిరి. కాని యవి యంత యావశ్యకములు కామిం జేసియు నట్టి భాషల శబ్దములు సుపరిచితములు కామిం జేసియు నిందు వివరింపఁబడలేదు. డా. కాల్డువెల్లుగారి శబ్దసామ్య ప్రదర్శన పద్ధతులు విశదపడుటకై సుపరిచిత సంస్కృత శబ్దసామ్య ప్రదర్శన మిందుఁ బూర్ణముగఁ జేర్చి విమర్శింపఁబడెను.

రూఢశబ్దముల వ్యుత్పత్తులును, వాని జన్యజనక భావమును వాని పౌర్వాపర్యమును విమర్శించుటకుఁ దగిన యాధారములు లేవు. ఆ విషయ

మునఁ బండితుల యూహలె యాధారములు. మఱియు నీ గ్రంథము ముఖ్యముగా ద్రావిడ భాషల పరస్పర సంబంధమును వాని స్వరూప స్వభావములను విశదపఱచుట కారంభింపఁబడినదగుటచేత నట్టి శబ్దసామ్యములు వాని వ్యుత్పత్తులును నిందంతగాఁ బ్రసక్తములు కానేరవు. ప్రత్యేకముగా నొక కోశమున నట్టి పరిశీలనము చేయఁబడవలసి యున్నది. యౌగికములును (పాచకుఁడు=వండువాఁడు-పచించువాఁడు మొ.) యోగరూఢములును (పంకజము=బురదయందుఁ బుట్టునది మొ.) నగు శబ్దముల వ్యుత్పత్తులు వ్యాకరణ సాధ్యములై యుండును. రూఢశబ్దములు నవ్యుత్పన్న శబ్దములు మున్నగువానికి వ్యుత్పత్తులు సరిగాఁ జెప్పుట శక్యముకాదు. 'గచ్ఛతీతి గౌః'=(నడచునది గాన 'గోవు' అనఁబడును) అను రీతిగల వ్యుత్పత్తులు సహృదయ హృద్యములు కానేరవు.

౧౭౩. విష:—ద్రావిడ భాషలలోని యనాగరకములగు తుద-కోత మున్నగు భాషల వివరణమును వెనుకఁ బీఠికలోఁ గొంత వివరింపఁబడెను. (చూడు ౧౫ X, ౧౫ XI, ౧౫ XII విష). అట్టి వివరణములనె మఱికొన్నిటిని (కాల్డు. ౬౨౫ పుట మొ. ౬౩౫ పుట వఱకు) గ్రంథాంతమున ననుబంధముగా డా. కాల్డువెల్లుగారు ప్రదర్శించిరి. అట్టి యనుబంధ విషయములును ద్రావిడభాషల పరస్పర సంబంధములను బ్రదర్శించునవి కామింజేసి యుపేక్షితము లయ్యెను. తమిళ కర్ణాటాంధ్ర భాషల పరిశీలనమె యిందలి ముఖ్య విషయము.

---

ఇట్లు శ్రీవత్స సగోత్ర పవిత్ర శ్రీమద్వేంకటాంబా ముఖలింగేశ్వరశాస్త్రి జ్యేష్ఠ
పుత్ర, శ్రీమచ్చింతామణ్యుపాఖ్య షడ్దర్శనీ పారంగత నారాయణాఖ్య పండిత
కవీంద్ర శమనిచయానంద గురుప్రకాండ పాదపద్మ మధుకర వివిధశాస్త్ర
గ్రంథవిమర్శన వీరసింహ మంజరీప్రబంధ 'వైయాకరణ పారిజా,
తాంఽధ్రవ్యాకరణసంహితాసర్వస్వ' సుమసమర్పి తాంధ్ర వాగ్దే
వత కౌత్స సమాఖ్య ఖండకావ్య పతిత్వ బంధు రాంధ్ర సార
స్వత పరిషద్బహూకృత వ్యాకరణోపాధ్యా యాంధ్ర
విశ్వకళాపరిషద్బహూకృత కళాప్రపూర్ణ బిరుద
భూషిత వజ్ఝలచిన సీతారామస్వామిశాస్త్రి విర
చిత ద్రావిడ భాషాపరిశీలన గ్రంథమునందు
రెండవ సంపుటము ప్రకరణములు నాలు
గయిదాఱు నాఱు నొకటి సంపూర్ణము
లయ్యె.

# Andhra University Publications

## I. ENGLISH

### (A) HUMANITIES AND SCIENCES

RAMALINGA REDDY SASHTYABDAPURTI COMMEMORATION VOL Part I—Sciences (Rs. 10)
Do Part II—Humanities. (Rs 15)

No. 46 CALENDAR THROUGH AGES AND COUNTRIES—by Prof M. N. Saha. (Rs. 1-8)

No. 51 TWO STUDIES—by Prof. Humayun Kabir, Educational Adviser to Government of India and Chairman, University Grants Commission (Rs 3)

### (B) ECONOMICS AND POLITICS

No 36. PRACTICE AND LAW OF BANKING—by D. S Sastry, M.A , C A I B. (Rs. 1-8)

### (C) HISTORY

No 3. BUDDHIST REMAINS IN ANDHRA AND THE HISTORY OF ANDHRA BETWEEN 225 AND 610 A D—by Dr K. R Subrahmaniam, M A., Ph D. Ex-Principal, Maharajah's College, Vizianagaram. (Rs. 2)

No. 27. ADVANCED HISTORY OF INDIA—by the late Prof P. T. Srinivasa Ayyangar, Ed. by Prof G. V. Rao, M A., LL B , Professor in History, Andhra University. (Rs. 8-8)

No 32 A FORGOTTEN CHAPTER OF ANDHRA HISTORY—by M. Somasekhara Sarma, Dept. of History, Economics & Politics, Andhra University. (Rs. 2)

No. 38. HISTORY OF THE REDDY KINGDOMS—by M. Somasekhara Sarma (Rs. 15)

No. 40 FACTORS IN INDIAN HISTORY—by Prof. K. A. Nilakanta Sastry. (Rs. 2)

No. 48. STUDIES ON KRISHNADEVARAYA OF VIZIANAGARA—by Dr. O Ramachandrayya. (Rs. 5)

### (D) PHILOSOPHY

No. 24 VIVARANAPRAMEYA SANGRAHA—(English Translation) Ed.,—by S. S. Suryanarayana Sastri, M.A., B.SC., Bar-at-Law and Prof. Saileswar Sen, M.A., D.LITT , D.PHIL. (Rs. 6-8)

### (E) SCIENCE

No. 22. AN OUTLINE OF THE MINERAL RESOURCES OF ANDHRA DESA—by Dr. C. Mahadevan, M.A., D.SC., (Madras), F.A.SC. (As. 8)

No. 23. SCATTERING OF LIGHT AND THE RAMAN EFFECT—by Prof. S. Bhagavantham, M.SC., Hon. D.SC. (Andhra), Ex-Professor of Physics, Andhra University. (Rs. 15)

No 28 INTERMEDIATE PRACTICAL PHYSICS—by V. Appa Rao, M.A., L.T. (As. 8)

No. 31. NATURAL RESOURCES OF ANDHRA AREA & ALLIED SUBJECTS—A Symposium. (Rs. 2-8)

No. 35. CHEMISTRY OF VITAMINS AND HORMONES—by Prof. Seshadri and Dr. Rangaswamy. (Rs. 12)

No. 37. THEORY OF GROUPS AND ITS APPLICATION TO PHYSICAL PROBLEMS—by S. Bhagavantam and T. Venkatrayudu. (Rs. 20)

No. 49. Memoirs in to oceanography. (Rs. 15)

## II. TELUGU

### (A) CATALOGUES

No. 11. A DESCRIPTIVE CATALOGUE OF THE TELUGU MANUSCRIPTS IN THE TANJORE PALACE LIBRARY—Edited by P. P. S. Sastri, M.A., Govt. Oriental Manuscripts Library, Madras. (Rs. 1-8)

### (B) HISTORY

No. 39. INDIAN POLITY. A.D. 1600 to 1948—by Atmakuri Govindacharyulu.
[3 Volumes—Rs. 35, Each Volume—Rs. 15]

*Continued on cover page 3*

# ANDHRA UNIVERSITY PUBLICATIONS

### (C) CRITICISM

No. 8. KAVITHWATHATHWAVICHARAMU—by Sir C. Ramalinga Reddy, M.A. (Cantab), Hon. D.Litt. (Andhra). (Rs. 3)

### (D) GRAMMAR

No 44 ANDHRA VYAKARANA SAMHITA SARVASWAMU—Part I by Kalaprapudna Vajjala China Sitaramaswamy Sastri. (Rs. 25)

No 47. ANHDRA VYAKARANA SAMHITA SARVASWAMU PART II—by Kalaprapurna Vajjala China Sitaramaswamy Sastri (Rs 25)

No 52. DRAVIDA BHASHA PARISEELANAMU—by Mr V. Ch. Sitharamaswami Sastri Vol I (Rs 16)

DRAVIDA BHASHA PARISEELANAMU—by Mr V. Ch Sitharamaswami Sastri Vol II (Rs. 16)

DRAVIDA BHASHA PARISEELANAMU—by Mr V. Ch Sitharamaswami Sastri Complete set 2 Volumes (Rs. 30)

### (E) LITERATURE

No. 2. THE UNIVERSITY LECTURES ON VEMANA—by R. Anantakrishna Sarma, Lecturer, Maharajah's College, Mysore. (Rs. 1-8)

No. 21. VYASAMANJARI OR COLLECTED ESSAYS (IN TELUGU)—by Sir C. R Reddy, M.A. (Cantab) Hon. D Litt. (Andhra). (Rs. 2-8)

No. 30. DWIPADA BHARATAM—Vol. I—Edited by P. Lakshmikantam, M.A. (Rs. 10)

No. 41. DWIPADA BHARATAM—Vol. II—Edited by P. Lakshmikantam, M.A. (Rs 12)

No. 42. DWIPADA BHARATAM—Vol. III—Edited by Vidwan G. J. Somayaji, M.A., L.T. (Rs. 15)

No. 43. DWIPADA BHARATAM—Vol. IV—Edited by Vidwan G. J. Somayaji, M.A., L.T. (Rs. 12)

Complete set of the four Volumes of DWIPADA BHARATAM. (Rs. 40)

No. 45 TRANSLATION AND COMMENTARY OF SAPTHASATHI SARAMU—by D. V. Sitharamaswamy, M.A. (Rs. 3)

No. 50. PANCHAMI-A THESIS ON RANGANATHA RAMAYANA DIKA VYASAMULU—by Dr C. R. Reddy—Edited by G S. N. Acharya. (Rs. 2)

### (G) SCIENCE

No. 33 A TEXT BOOK ON TRIGONOMETRY (in Telugu)—by K. Rangachari, M A, B.L., M.R. College, Vizianagaram. (Rs. 4)

No. 34. TEXT BOOK ON ZOOLOGY (in Telugu)—by R. V. Seshaiya, M.A., Annamalai University, Annamalainagar. (Rs. 5-8)

## III. SANSKRIT

### (A) VYAKARANA (Grammar)

No. 6. CHITRAPRABHA—A COMMENTARY ON HARIDIKSHITA'S LAGHUSABDARATNA—by B. Hari Sastri—Edited with notes by Mahamahopadhyaya Kalaprapurna Tata Subbaraya Sastri, Maharajah's Sanskrit College, Vizianagaram. (Rs 3)

No. 26. Guruprasadam and Guruprasadasesham—Edited by Mahamahopadhyaya Kalaprapurna Tata Subbaraya Sastri and Peri Venkateswara Sastri—Part I. (Rs. 7-8)

Do do. Part II. (Rs. 10)

No 51. PARIBHASHENDU TIPPANI-NAGESA GUDARTHA DIPIKA—by Mr. P. Venkateswara Sastri. (Rs. 25)

### (B) NYAYA

No 7. SANGAMESWARARRODUM—ON JAGADISA'S SIDDHANTALAKSHANAM—by G. Sangameswara Sastri. (As. 12)

### (C) VEDANTA

No. 25. VIVARANAPRAMEYA SANGRAHA (Sanskrit Text)—Edited by S. S. Suryanarayana SASTRI, M.A., B.SC., Bar-at-Law and Prof. Saileswar Sen, M.A., D LITT., D PHIL. (Rs. 7-8)

## THE FOLLOWING PUBLICATIONS ARE OUT OF STOCK

# I. ENGLISH

### (B) ECONOMICS AND POLITICS

No 1. THE BEGINNINGS OF LOCAL TAXATION IN THE MADRAS PRESIDENCY—A STUDY IN INDIAN FINANCIAL POLICY--1863-71—by Prof. M. Venkatarangayva, M.A , Ex-Professor, Andhra University. (Rs. 2-4)

No. 4. THE WORLD ECONOMIC DEPRESSION—A PLEA FOR CO-OPERATION—by Sir J. C Coyajee, B.A , LL B., Ex Professor, Andhra University. (As. 12)

No. 5. INDIA AND THE LEAGUE OF NATIONS—by Sir J C Coyajee (Rs. 2-4)

No. 12. FEDERALISM IN GOVERNMENT—by Prof M. Venkatarangayya, M A. (Rs. 2)

No 17. INDIAN POLITICS SINCE THE MUTINY—by Sir C Y Chintamani, Editor 'Leader', Allahabad. (Rs 2)

### (C) HISTORY

No. 19 MODERN CHINESE HISTORY (POLITICAL, ECONOMIC AND SOCIAL)—by Prof. Tan Yun Shan (Chief Organizer, Sino—Indian Cultural Society, Nanking). (As. 8)

### (D) PHILOSOPHY

No 16 MAN—by Dr. Rabindranath Tagore (Re 1)

# II. TELUGU

### (D) GRAMMAR

No 15 VAIYAKARANA PARIJATAMU—by Kalaprapurna V. Ch. Sitaramaswami Sastri (Rs 3)

### (E) LITERATURE

No 10. HISTORY OF SANSKRIT LITERATURE—PART I, VEDIC PERIOD (IN TELUGU)—by M Suryanarayana Sastri, formerly Pandit, University College of Arts. (Rs. 2-4)

No. 13. HISTORY OF SANSKRIT LITERATURE—PART II, LAUKIC PERIOD (IN TELUGU)—by the same author. (Rs. 2-4)

No 18 HISTORY OF TELUGU LANGUAGE—by Dr C Narayana Rao, M.A , Ph.D., L T , Retd. Lecturer, C. D. College, Anantapur (in two volumes) Each volume. (Rs. 6)

No 29. GONA BUDHAREDDY'S RANGANATHARAMAYANAM—Edited by Veturi Prabhakara Sastri. (Rs. 7-8)

### (F) PHILOSOPHY

No 9 ANDHRA MIMAMSA NYAYA MUKTAVALI—(IN TELUGU)—A TREATISE ON PURVA MIMAMSA DARSANA—by K. Gopalakrishnamma, M A., L T., formerly Lecturer in Oriental Languages, Government Arts College, Rajahmundry. (Rs 1-8)

### (G) SCIENCE

No. 14 VISWARUPAM—(dealing with the Physical Universe) written in popular Telugu—by K. Kondayya, M.SC., Chemistry Department. Benares Hindu University, Benares. (Rs. 2)

No. 20. TELUGU EQUIVALENTS OF TECHNICAL TERMS IN PHYSICS—by A. Balankeswara Rao, B SC. (Hons.), formerly Department of Physics, J. V. D College of Science and Technology. (As. 12) (Inclusive of Postage)

---

*Note—Copies of the publications in stock can be had from the Registrar, Andhra University, Waltair, on payment of the cost and Postage in advance. Book-sellers will be allowed a trade discount of 15% on the published price.*